**కాళోజి యాదిలో**

ప్రథమ ముద్రణ   డిసెంబర్, 2002

ప్రతులు   1000

వెల   రూ 150/-

ప్రచురణ   **కాళోజీ ఫౌండేషన్,**
వరంగల్ & హైదరాబాద్

ప్రతులకు   **కాళోజీ ఫౌండేషన్,**
ఫ్లాట్ నెం 268, ఎక్సైజ్ కాలనీ,
హన్మకొండ, వరంగల్   506 001

**కాళోజీ ఫౌండేషన్,**
గ్రీన్ ఛానల్, ఇం నెం 6 3-634,
నస్ర్ స్కూల్ ఎదురుగా
ఖైరతాబాద్, హైదరాబాద్ 4
ఫోన్   23307642

డి టి పి   జి వి గ్రాఫిక్స్, అశోక్‌నగర్, హైదరాబాద్

ముద్రణ   అనుపమ ప్రింటర్స్ గ్రీన్ వ్యూ 126, శాంతినగర్ హైదరాబాద్ 28 ఫోన్ 23391364, 23304194 ఫ్యాక్స్ 040 23304194

# ముందుమాట

కాళోజి బహుముఖ వ్యక్తిత్వం ఆశయాలు అనేక రంగాల్లో ఆయన చేసిన కృషి, ఇంచుమించు ఒక శతాబ్దకాలపు ఆయన అనుభవాలు సమకాలీన సమస్యలూ వాటిపై ఆయన ఉద్దేశ్యాలు ప్రతిస్పందనలూ, చారిత్ర కాంశాలు అన్నిటినీ ఆయన జీవిత కాలంలోనే సంగ్రహించి, సమగ్ర రూపంలో ప్రచురించి, ప్రాచుర్యం చేయాలనే ఉద్దేశ్యంతో ఏర్పడి ఔత్సాహికంగా ఈ కార్యాన్ని చేపట్టిన కాళోజి ఫౌండేషన్ 13 11 02న ఒక్కసారిగా ఆయన అవని విడిచి వెళ్ళిపోతే దు ఖభారంతో కర్తవ్య విముఖతకు గురయింది

కాని కాళోజి స్ఫూర్తి తిరిగి మమ్మల్ని కార్యోన్ముఖుల్ని చేసింది అసంఖ్యాకంగా చేరిన అశ్రునివాళులైతేమీ సంస్మరణ సభల్లో అనేకుల జ్ఞాపకాల అనుభూతుల, అనుభవాల ప్రసంగాల పరంపరలైతేమీ పత్రికల్లో ప్రచురణలైతేమి

ఇంకా అనేక ఆప్తుల, ఆత్మీయుల, స్నేహితుల సహచరుల, అనుయాయుల భావ ప్రకటనలూ, ఈ 'కాళోజి యాదిలో పొందుపరిచే ప్రయత్నం చేశాం

మా ఈ ప్రయత్నానికి తోడ్పడిన అందరికీ మా అభివాద సహస్రాలు కాళోజి షష్ఠ పూర్తి సందర్భంగా వెలువరించిన సంచికలోని అమూల్యమైన రచనల్ని దీనిలో తిరిగి పొందుపరిచాము

కొన్ని సందర్భాల్లో కాళోజి వ్రాసిన పీఠికలు, అంతగా వెలుగులోనికిరాని ఆయన ఇంటర్వ్యూలు, ఈ మధ్య కాలంలో ఆయన పై వచ్చిన కొన్ని వ్యాసాలు, కవితలూ వీటిలో చేర్చాము

ఈ సంచికలో ముద్రణా భారాన్ని పైన వేసుకున్న అనుపమ ప్రింటర్స్ రమణమూర్తి,

డి టి పి చేసిన కృష్ణమూర్తి

ముఖచిత్ర రచయిత డిజైనరూ చంద్ర,

మళ్ళీ ఒకసారి, 22 12 2002 నాడు జరిగే సభలో, ఈ సంచిక నావిష్కరించుటకంగీకరించిన కాళోజి చిరకాల మిత్రులు మాననీయ మాజీ భారత ప్రధాని శ్రీ పి వి నర్సింహారావు గారినీ, మా యీ కృషిలో ప్రత్యక్షంగా, పరోక్షంగా సహాయపడిన వారినీ, ఆదరాభిమానాలు దండిగా అందించిన వారందరినీ 'యాది' చేసుకుంటూ

కాళోజి ఫౌండేషన్

టి ప్రభాకర్

పి హరినాథ్,

రామశాస్త్రి

గమనిక ఈ సంచికలో ముద్రించిన రచనల వరుసక్రమం సాధ్యమయినంత వరకు నామాక్షర క్రమాన్ననుసరించాం కాని చివరి నిమిషం వరకూ అవి మా కార్యాలయాన్ని చేరుతూ ఉండడంతో ఆ పద్ధతి అన్ని విషయాలల్లో అనుసరించడం కుదరలేదు అచ్చు తప్పుల సవరణలు కూడ సమయాభావం వల్ల సంపూర్ణంగా చేయలేకపోయాం రచయితలూ పాఠకులూ మన్నించాలని మనవి

# విషయ సూచిక

# నా యాది

1987 తెలంగాణ ఇన్ఫర్‌మేషన్ ట్రస్టు ఎర్పాటుకు ముందు నుంచే మొదలయిన మన ఆత్మీయతాను బంధం ఇంత గాఢంగా పెనవేసుకు పోతుందనుకోలేదు అనుబంధాల్లో లోతులెన్నో నీ 'గొడవ' కవితలు కాగితాలు అక్కడక్కడ తిరిగి 2001లో ఖైరతాబాదు చేరినయ్ ఓ అయిదారు నెల్లు గడిచినయ్ ఏండ్ల ముందటి వాటి ప్రయాణం నాలుగేండ్లా యెనోఏమో నువ్వేన్నేండ్లు? ' అని చురకంటిస్తే నా పానం చివుక్కుమన్నది

2001లో మీ పుట్టిన్రోజు కంటె కొద్ది నెలల ముందు మీ జన్మదినల సెప్టెంబర్ 9 నాటికి పుస్తకం ముద్రించి ఇచ్చే బాధ్యత తీసుకున్నానా? 'బర్త్‌డే నేను వరంగల్లనే చేసుకుంటునని పట్టుబడితే తరువాతి ఆదివారం 16 నాడు దాని విడుదల ముహూర్తం అన్నీ జరిగిపోయినయ్ అన్నమాట ప్రకారం దోస్తుల సహాకారంతో 9 నాడు మీ పుస్తకమే అయినా మా గొడవను అన్న టైమ్‌కు మీకు వరంగల్ల అందించినందుకు నా జన్మసార్థకమైందనుకున్నా

ఆనాటి 16 పండుగ సభలో ఆత్మీయులందర్నీ కలుసుకున్నప్పటి మీ అనుభూతుల్ని అందరి అనుభూతుల్నీ చూసి మేమంతా ఎంత పులకరించి పోయామో అంత బాగుంటుందని ముందే ఊహించి ఉంటే ఓ రెండు మూడు రోజులు ఆ హాల్లోనే మకాం వేస్తె ఎంత బాగుండునో అనిపించింది

తెలంగాణ చరిత్ర ఎంతో ఉన్నా అక్షరరూపంలో ఉన్నది అరకొరే గదా తెలంగాణ రాష్ట్ర పోరాట చరిత్ర ఎంత పెద్దది విద్యార్థులు, ఉద్యోగులు యువకులు తండోపతండాలుగా స్కూళ్ళను, ఆఫీసుల్నొదిలి జైళ్ళను నింపితే రికార్డయింది ఏ ఒక్కటో రెండో చిన్న పుస్తకాలే అంతే ముందు తరాలకు మన అనుభవాలు లేనందుకు ఎంత వెలితో చరిత్రనే పక్కదారి పట్టించేందుకు కొందరికి ఎంత సులువై పోతున్నదో! ఇన్ని ఒడిదుడుకుల్లో ఉన్న ఇక్కడి చరిత్ర యావత్తూ మీ బుర్రలో చెక్కు చెదురు గాకుండా మనగలిగింది పూస గుచ్చినట్లు, పొల్లు పోకుండా, తారీకుల్తో సహా కళ్ళకు కట్టినట్లు మీరు చెపుతుంటే ఎన్ని గంటలయినా వింటుండేది మీకేదయినా టేపు తగిలిస్తే అది ఆడియో వీడియో రెండూ కలిసి ఉంటే స్క్రీను మీదికి తేగలిగితే మరుగున పడుతున్న చరిత్ర మొత్తం లేచి గంతులేసేది

ఖైరతాబాదు ముచ్చట్లెన్నో మంది ఎందరో ఎన్నిరకాలో ఎన్ని రాత్రులలో మీ చురకలెన్నో నవ్వించే మందలించే కర్తవ్యం బోధించే

మా రాత్రి చర్చలకు మీరప్పుడప్పుడు పొద్దున్నే అంటించే ఓ చురక "రాత్ గయా బాత్ గయా", తినేప్పుడు "కంది దాటినంక నంద్యైతేనేమ్ పంద్యైతేనేమ్" "హోష్ మే ఘోష్ నహీ ఖాతే"

దోస్తులుతో "హే భగవాన్ దుష్మనోంసే మై బచ్ సక్‌తాహూ, మగర్ దోస్తోంసే ఆప్ బచావో" ఇట్లా ఎన్నో

మళ్ళీ 2002 వరంగల్ల మీ జన్మదినం మీ పక్కన మేమందరం ఆ రాత్రి మేం వెళ్ళిపోతున్నమని ఎవరో అంటే ప్రభాకర్ పోతనన్నడా అన్న ఆ కళ్ళు నేను కాదు వేరే వాండ్లు పోతున్నరన్నంక శాంతి

ఆ తరువాత మళ్ళీ అక్టోబర్‌లో చివరి ట్రిప్పు ఖైరతాబాదుకు మిత్రా సూదివైద్యం భాషానిలయం వారి సన్మానం

మీరు పడ్డారని దసరా దుర్వార్త , దావత్‌కు పోయి పడ్డరా అంటే 'దావత్ తినక ముందే పడ్డ' అని చురక జ్ఞాపకాలు నిజాం ఆస్పత్రిలో ఆ కట్టుబాట్ల పై మీ చిరాకు- నైజాం రాజ్యం నజర్ బందుల యాది సంతాపసభలు, సంస్మరణ సభలు "కాళోజి యాదిలో " సంచిక ఇన్ని వత్తిళ్లలో నా "యాది" నలుగుతున్నది మీ స్ఫూర్తి వెన్ను తట్టుతున్నది ఇప్పుడైతే నెట్టుకు వస్తున్న

నిజం చెప్పాలంటే మీ నీడలో మా బాదలనీ మేం మర్చి పోతుండేది మీరెన్నడు మాకు బరువు కాలేదు!

కాని, మా బరువుల్ని మీరెన్ని బాధలతో మోసిన్రో అని నా అనుమానం మన్నించండి

**- టి. ప్రభాకర్**

21-12-2002

ఖైరతాబాద్

## నేను బ్రతికే వుంటాను

నేను బ్రతికే వుంటాను
నా పరాయితనం పోగొట్టే ఆర్ద్రత
చెలిమి చెలిమెలో
చిందు నన్నాళ్లు ॥నేను బ్రతికే॥
నా ఇరుకుల చేరి దూరి
అడ్డమైన మురికినంతా
తన్నేసే జీవన నది
జీవ నదిగా
ప్రవహించు చున్ననాళ్లు ॥నేను బ్రతికే॥
ఆతతాయి వాతావరణంలో కూడా
నా షడ్వర్గం తన శీలాన్ని
కాపాడు కున్నన్నాళ్లు ॥నేను బ్రతికే॥
తోడు వాద్యాల
తప్పుడు చప్పుళ్లకు
సమ శ్రుతిగా
నా గాత్రం
పెకల నన్నాళ్లు ॥నేను బ్రతికే॥
కంచం మంచం రెండే
సర్వమ్మను వాదానికి
నా తెలివితేటలు
తలవొగ్గ
నిరాకరించినన్నాళ్లు ॥నేను బ్రతికే॥
నా జీవనానికి
పాతాళం అడుగంట దిగజారే
చొరవ, సత్తువ, ధైర్యం
ఉవ్వెత్తున లేచి
ఆకాశావకాశాలను వ్యాపింప
ఆవిరియై పొయ్యేంతటి
తపన, తహతహ, సంసిద్ధత
సాహసం ఉన్నన్నాళ్లు ॥నేను బ్రతికే॥

# కాళోజీ యాదిలో...

నివాళులు, జోహార్లు,
స్మృతులు, జ్ఞాపకాలు, అనుభూతులు.....

# విషయసూచిక

కవితలు

## షష్టి పూర్తి - 1974

# ఒక శకం అంతరించింది

**పి వి నరసింహారావు, (మాజీ ప్రధానమంత్రి)**

ఇప్పుడేనాకు కాళోజీగారి నిర్యాణవార్త అందింది తలవని తలంపుగా ఇది జరిగిపోయింది నా కెంతో విచారంగా ఉంది ఈనాటితో అరవై సంవత్సరాల మా అన్యోన్య స్నేహం 70 సంవత్సరాల ఆయన సేవ సాహిత్య సేవ ప్రజల వెంట ఉండి చేస్తున్న కావ్యసేవ ఇవన్నీ కూడా అంతరించి ఒక శకం పూర్తయినందుకు విషాదంగా ఉంది ఇటీవల ఆయన జబ్బుగా ఉన్నారని తెలిసింది కానీ ఈ వార్త ఇవాళ హఠాత్తుగా నాకు అందింది అయన లాంటి వ్యక్తి బహుశా మనకు దొరకడేమో అనుకుంటాను ముఖ్యంగా ప్రజల జీవితంతో నూటికి నూరు పాళ్లు పెనవేసుకున్న వాణి బహుశా మళ్లీ మనకు వినిపించదేమో అటువంటి వ్యక్తిత్వం ఆయన స్వాతంత్ర్య సమర యోధుడు త్యాగమూర్తి ఆయన చేసిన త్యాగం/ఆయన పడిన ఇబ్బందులు కూడా ఆకాలం నాడు నేను కళ్లారా చూసినవాణ్ణి కాబట్టి నాకు అవన్నీ కూడా ఇప్పుడు నా మనో చిత్రంలో కనబడుతున్నాయి నేను చాలా చాలా బాధ పడుతున్నాను ఆయనాత్మకు శాంతి కలగాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను

(కాళోజి మరణ వార్త విని ఢిల్లీ నుంచి ఫోన్‌లో హైదరాబాద్ ఆల్ ఇండియా రేడియోకు అందించిన సందేశం)

❖ ❖ ❖

# కాళన్న మనసు వెన్న - కాళన్న కన్ను వాన'

**- దాశరథి రంగాచార్య**

ఒక సూర్యుడు నేల రాలాడు అంధతమస్సు ఆవరించుకుంది నిన్న, 2002 నవంబర్ 13, బుధవారం ఉదయం 9 30కు ప్రొఫెసర్ లక్ష్మణ్ ఫోను చేశాడు కాళోజీకి విషమంగా ఉంది అని 'కాళన్నకు మృత్యువు భయపడుతుంది నువ్వు భయపడకు' అన్నాను 10 00 గంటలకు ప్రభాకర్ నిమ్స్ నుంచి ఫోను చేశాడు కాళోజీ కోమాలోకి వెళ్ళిపోయారు వరంగల్లు నుంచి వాళ్ళవాళ్ళను రమ్మని ఫోను చేశాను అని! 'ప్రభాకర్! కాళన్న బతకాలను కుంటే బతుకుతడు నాఫికరేందంటే బతికి కష్టపడడేమో నని, రంగన్నా ఏరగలేకున్న, దగ్గలేకున్న అన్నడు 89 ఏండ్లు సింహమోలె బతికిండు చాలదంటావా?' అన్న 12 00 కు నిద్రలోఉన్న నన్ను కమల లేపింది కాళన్న కన్నుమూసిండని వార్తల్లో చెప్పిన్రు మొన్ననే గదనంది కమలక్కా! అని చేతులు చాపె, ఇంతలో ఆ దేవునికి ఏం పుట్టె! కన్నీరదుముకున్నది నా చుట్టు చీకట్లు కమ్ముకున్నాయి!

కాళన్న ఏమిటి? కన్ను మూయటం ఏమిటి? కొన్ని వాస్తవాలను మనసు నిరాకరిస్తుంది తరువాత ఫోనులు వార్తలు ! ఉదయం 11 20 గంటలకు కాళోజీ కన్నుమూశారు మనం [illegible] చేయలేం నిస్సహాయులం! కాళన్నను వైద్యం కట్[illegible] లేదు కదా! కాళన్న [illegible] ఆస్పత్రిలో పడ్డాడు[illegible]

బాగయింది ప్రాణం పోయింది పర్వరీ శస్త్రం బాగానే జరిగింది రోగి హరీమన్నాడు సాన్నిహిత్యం అలా అనిపిస్తుంది! డాక్టర్లు బ్రతికించనూలేరు చంపనూ లేరు ప్రయత్నించగలరు అంతే 'శాలోయం దుదలిక్రమ' సెప్టెంబరు 14న కాళోజీకి వరంగల్లులో హరి సర్వోత్తమరావుగారి అవార్డు అందించినసభ నేను ముఖ్య అతిథిని కాళన్నను కొందరు పట్టుకొని సభలో ప్రవేశిస్తున్నారు నేను కాళోజీకి జై అన్నాను సభ నినదించింది కాళోజీ ఆసీనులైనారు 'కాళన్న మనసు వెన్న కాళోజీ కన్ను వాన' అన్నాను ఇప్పుడు ఆవెన్న కరిగిపోయింది అవాన ఎండిపోయింది ఇహ కురవదు!

కాళన్నకు నా చేతులతో చివరి సన్మానం చేశాను! కాళన్న ముఖంలో జీవిత కాంతి తాండవిస్తుంది! 'రంగన్నా! కమలక్క రాలే' అడిగాడు కమల వచ్చింది ఆమె చేతులు పట్టుకున్నాడు 'ఎంత దయగలదానివి! వచ్చినావా కమలక్కా! ఉభయుల కనుకొలకుల్లో కన్నీళ్లు నిలిచాయి నేను తప్పుకున్నాను ▪ సభలోనే శతమానం భవతి అన్నాను రెండునెలలకే నూరేళ్లు నిండుతాయనుకోలేదు 2001 సెప్టెంబర్ 16న కాళన్న నాగొడవ ఆవిష్కరణ! దానికి నాతో పరిచయ వాక్యాలు రాయించుకున్నాడు ఆ సభకు నేను వెళ్లలేదు ఎవరో చదివి వినిపించారు కాళన్నను చూడడానికి ప్రభాకర్ ఇంటికివెళ్ళాను ఒక్కనివే వచ్చినావు కమలక్క రాలే అని పక్కన కూచోపెట్టుకున్నారు కమలకు ఆరోగ్యం బాగుండలేదు అన్నాను రంగన్నా! ఏడ్చింది నవ్వించే జీవితం ఇంకేమున్నది చెప్పు నీకు చినగూడురులో సన్మానమప్పటి సంతోషం చూసిన నీ కొడుకు పోయినప్పుడు ఏడ్పు చూసిన మనిషి ఇంకేం చేస్తడు చెప్పు కమల షష్టిపూర్తి కాళన్న రాలే తెల్లారి వచ్చిండు కమలక్కకు నూటపదార్లు ఇస్తనంటడు ఏంది కాళన్నా! నువ్వేంది ఇచ్చుడేంది! అని అన్న నీకిసున్ననా నీ అజ్ఞ కావాలనా అని ఇంట్లోకి పోయిండు పైకం కమల చేతిలో పెట్టిండు వచ్చిండు కాళోజన్నను ఎవరు పత్తరు!

రామేశ్వరరావుగారు వెళ్ళిపోవటమే కాళన్నమీద గుట్టకూలింది కాళన్న మా ఇంటికి వచ్చాడు ఏడుస్తూనే అన్నాడు నేను మూడు నెలల పసివాణ్ణి అని ఏడుస్తున్నాడు ఓదార్చటం కష్టమయింది ఇది ఇసుక పాతర తవ్వినకొద్దీ ఇసుకే వస్తుంది నీరు రాదు కాళన్న కరుణైండు గద! కాళోజీ జీవితమే కవిత్వం అతడు అలవోకగా జీవించాడు అంత అలవోకగా కవిత్వం రాశాడు కాళన్న మాట కవిత కాళన్నచూపు కవిత కాళన్న యెడద కవిత కాళన్న ప్రాణం కవిత కాళన్న కన్ను సహితం కవిత రాలుస్తుంది కాళన్న తనకు తెలియకనే తెలియని ఇంటికి వెళ్ళి అమ్మా! చాప ఇస్తావా పడుకుంటా అనగల నిరాడంబరత్వం అతనికి మాత్రమే సాధ్యం! అతని కవిత్వం అతని జీవితమంతటి నిరాడంబరం అతని జీవితమే అతని కవి కాళోజీ గొడవ మనిషి కాదు కాళోజీది మనిషి గొడవ కాళన్న ఇజాలు, సిద్ధాంతాలు, పార్టీలు పట్టింపులు లేవు ఎక్కడ ఉద్యమం ఉంటే అక్కడ ప్రత్యక్షం! అతడు ఎవరిమాటా వినడు తన మాట అందరితో వినిపిస్తాడు అతడు సెలయేరు ఏది అడ్డం వచ్చినా ఆగదు ఉరుకుతూ, దుముకుతూ సాగిపోతూనే ఉంటుంది ఎంత దుమికినా సముద్రంలో కలవాల్సిందే కాళోజీ నది సముద్రంలో కలిసి పోయింది! కాళన్న ఆవేదన మానవుని గురించి, అతని ఆవేశం, ఆరాటం, అంతా మానవ స్వేచ్ఛ, మానవాభ్యుదయం గురించియే అతనిది వసుధైక కుటుంబం అతడు తెలుగులో చెప్పినాడు కాబట్టి తెలుగు కవి అయినాడు యూరోపు భాషల్లో చెప్పి ఉంటే విశ్వకవి అయ్యేవాడు మనం సంకుచితులం, తిట్టదలచుకుంటే అతణ్ణి మహారాష్ట్రుడంటాం తెలంగాణాకు పరిమితం చేస్తాం కాళన్న విశ్వ తెలుగు కవి, కాళోజీ స్వరూపాన్ని

దర్శిస్తే, ఎండలో దావానలంలో, వెన్నెలలో, మంద మారుతంలో ఏరులో సెలయేరులో స్వచ్ఛంగా నిర్మలంగా కనిపిస్తుంది కాళోజీకి స్వరూపం లేదు అతనికి కవిత అంతటిదే దానికి జరా మరణాలు లేవు నాస్తి తేషాం యశ కాయే జరామరణజం భయం కాళన్నా! మల్ల మాట్లాడవుగద దోసెడు కన్నీళ్లు కొంచపో!

14, నవంబర్ 2002, వార్త

## గాండీవం పూనిన గాంధేయుడికి జోహార్లు

నమో మహద్భ్యో పెద్దలకు దండం ఏది కావాలన్నా తొలుత మనిషి కావాలి కాళోజీ మనసున్న మనిషి కవి, రచయితా కావాలంటే ఋషి కావాలి కాళోజీ కానగల ఋషి, కాళోజీ మనసు నిండా కవిత ఒకప్పుడు మనసు నిండుతుంది కాళోజీ కన్ను కవితను రాలుస్తుంది

కాళోజీ స్పందనకు కాళోజీయే సాటి

కాళోజీ కాళోజీ అంతటివాడు అంతటి సామాన్యుడు మాన్యుడు అసామాన్యుడు కాళోజీ

"గగనం గగనాకారం సాగరస్సాగరోపమ

కాళోజీ కవి నిరంకుశుడు అతనిని నిలువరించగల వరించగల అంకుశం కలుగనే కలుగదు!

అతనికి దురాశలు లేవు ఆశలు ఉచ్చులు లేవు అతడు దేనికి చిక్కడు - వేదనకు ఆవేదనకు నివేదనకు తప్ప

కాళోజీ కవిత అక్షరం కాదు నాదం - నినాదం నాదం -నినాదం పెదవులు పలుకవు, గుండెలు పలుకుతాయి గర్జిస్తాయి

కాళోజీకి కల్ల కపటం, ద్వేషం కార్పణ్యం పగ వగ తెలియవు అతడు నిర్మలమైన అద్దంలాంటివాడు అతని ప్రతి పలుకు ప్రతి పదం స్వచ్ఛంగా నిర్మలంగా, ఎండలా వెన్నెలలా అగ్గిలా, ఆరాటంలా మందహాసంతో దర్శనం ఇస్తాడు

కాళోజీ గొడవ లొల్లి అగంకు హద్దులు లేవు అది విశాలాచాపృథ్వీ అది గాలి వంటిది కాంతి వంటిది దవానలం వంటిది మందానిలం వంటిది దాన్ని దర్శించే కన్ను కావాలి! ఎడద కావాలి!

కాళోజీకి ఆడంబరాలు లేవు! కాళోజీ కవితకు అంబరాలు లేవు కాళోజీ మంచి మనిషి, కాళోజీ కవిత ప్రజల పరువం

కాళోజీ రూపాన్ని దర్శిస్తే మానవతామూర్తిగా, ఎడద స్వరూపంలా, కవితా శిల్పంలా సామాన్యతా విలక్షణంగా, కన్నీటి కన్నులా, పన్నీటి మాటలా కనిపిస్తారు

కాళోజీకి జరామరణాలు లేవు నాస్తితేషాం యశ కాయే జరా మరణజం భయం!

శతం జీవ శరదో వర్ధమాన

శతం హేమంతాన్శతమ్ వసంతాన్

నమో మహద్భ్యో

ఇది కేవలం పెద్దలకు నమస్కారం

ఓం శాంతి శాంతి శాంతి

14, నవంబర్ 2002, ఆంధ్రజ్యోతి

# ధిక్కార వారసత్వానికి ఆయన ఎత్తిపట్టిన జెండా

- వరవరరావు

నిర్మొహమాటంగా మాట్లాడుతూ, రాస్తూ, నడుచుకుంటూ అందరికీ ఆమోదయోగ్యుడుకావడం కాళోజీకే సాధ్యమైంది ఆయనకు పద్మవిభూషణ్ బిరుదు వచ్చిందని చదివి మద్రాసునుంచి మీరు తీసుకోవద్దు కాళోజీకి ప్రిఫిక్స్‌లు, సఫిక్స్‌లు లేవు ఏమైనా ఉంటే అది ప్రజా కవి మాత్రమే అని నేను రాసాను

తీసుకోడేమోననే భయంతో మహీధరరామ్మోహన్ రావు తీసుకోండని టెలిగ్రాం ఇచ్చాడు వీళ్ళేవరికోసమో నా విశ్వాసాలను నా ఆశయాలను నేనోదులుకోలేదు పద్మ విభూషణ్ "వద్దన్న వాడు నావాడే, తీసుకోమ్మన్న వీడూ నా వాడే, ఇస్తనన్న పివి నా వాడే కానీ తీసుకున్ననాడు కూడా పివితో ఏమిరో నేను జైల్ల ఉన్నననుకుంటే నువ్వే జైల్ల ఉన్నవుకదరా అని వాని భద్రత ఏర్పాట్లు చూసి అన్నాను ఆరో ఏట భుజాన ఎక్కించుకున్న అన్న రామేశ్వర రావు నా ఎనభైమూడో ఏట దాకా నాకు రొట్టెపెట్టాడు భుజం దించలేదు నచ్చనప్పుడు అయనమాటే నేను లెక్కచేయలేదు " అన్నాడు, అది కాళోజీ వ్యక్తిత్వం

అందుకే అయన వివిధ వాదాల, ధృక్పదాల మనుషులందరికీ ఆమోదయో గ్యుడయ్యాడు ప్రజల పక్షాన నిలిచిన అందరూ అయనను నాయకుడిగా గుర్తించారు

ఒక కవిగా సామాజిక ప్రవర్తగా బహుశా వేమన ఒక్కడే ఆయనకు సాటి వస్తాడు తెలంగాణగడ్డ మీద ఆయన పాల్కురికి సోమనాధుడికి, బమ్మెరపోతనకు వారసుడు ధిక్కారవారసత్వానికి అయన ఎత్తిపట్టినజెండా

## 'నిమ్స్'లో కాళోజీ నవంబర్ ఒకటి సాయంకాలం

దసరానాడు హనుమకొండ నక్కల గుట్టలోని ఇంట్లో నుంచి కాలుబయట పెడుతూ పట్టు తప్పి పడిపోయినపుడు కాళోజీ తొంటి ఎముక విరిగింది రెండు చోట్ల ఫ్రాక్చర్ అయింది అది అక్టోబర్ 15 అప్పటికి ఒక ఐదువారాల క్రితం సెప్టెంబర్ 9న ఆయన ఎనభై తొమ్మిదవ పుట్టిన రోజున ఆయన అభిమానులెందరో వెళ్లి ఆయనను అక్కడ కలిసారు కలవలేని వాళ్ల దేశవ్యాప్తంగా ఒక ప్రజల మనిషిపుట్టిన రోజుగా ఆ రోజును గుర్తుచేస్తుకున్నారు

వరంగల్‌లోని డాక్టర్లు అభిమానులు తీసుకున్న నిర్ణయం మేరకు ఆయనను తీసుకువచ్చి నిమ్స్‌లో చేర్చారు శస్త్ర చికిత్స కూడా జరిగింది మొదట్లో కొంత ఆందోళన కలిగినా కేవలం ఆయన మొండి సంకల్పంతో, బతుకు పట్ల ఆయనకు ఉన్న అవ్యాజమైన తపనతో ఆ డాక్టర్ల గౌరవాభిమానాలతో కూడిన కృషితో ఆపరేషన్ విజయవంతమైంది

కాని రెండు మూడు రోజులుగా ఊపితిత్తుల్లో ఇన్‌ఫెక్షన్ పచ్చి మళ్లీ రెస్పిరేటరీ ఇంటెన్సివ్ కేర్ యూనిట్ లో చేర్చారు అక్సిజన్‌మీద, ఒకటి రెండు రోజులు గొట్టాలతో ఇచ్చిన ఆహారంతో, ఇప్పుడు కేవలం పాలు, నీళ్లు ఎలక్ట్రాల్ వంటి ద్రవపదార్థాలతో, ఆయన కంటి చివర ఊపిరితో ఆయాసపడుతూ పోరాడుతున్నాడు

ఊపిరితిత్తుల్లో ఇన్‌ఫెక్షన్ అంటే కూడా కాళోజీకి సంబంధించినంత వరకు దానికీ ఒక చరిత్ర ఉంది ఉద్యమ జీవితంలో తొలి యవ్వనంలోనే క్షయరోగగ్రస్తుడైన కాళోజీకి అరవయ్యేళ్లకు పూర్వమే ఒక ఊపిరితిత్తి తొలగించారు ఇప్పుడు అపరేషన్ చేసిన, ఆయన ఆరోగ్య చరిత్ర తెలిసిన డాక్టర్‌ను వెతికి పట్టుకోవాలి

నిమ్స్ 9వ వార్డు ముందరే మన తెలంగాణ ప్రభాకర్ ఎదురు చూస్తూ నిలబడ్డాడు మనిషి సగమై పోయాడు మొహం నిండా ఏదో అదుర్దా రానీ కష్టాల్ నష్టాల్ అని బలాదూర్‌గా కనిపించే ప్రభాకర్ మొహం నిండా ఆందోళన

హనుమకొండలో రామశాస్త్రి ఎట్లా ఉన్నాదో అనిపించింది

'ఇంకో రెండు రోజులు గొట్టాల ద్వారా ఆహారం ఇవ్వగలిగితే బాగుండును ఏ అదరువూ లేదుగదా' అన్నాడు ప్రభాకర్ లోపలికి వెళ్ళే వరకు స్వయంగా డ్యూటీ డాక్టర్ ఆయన వీపుకు, పృష్ట భాగానికంతా మృదువుగా పౌడర్ వేసిరాస్తున్నాడు పుండ్లు కాకుండా కోడలు వాణి,

మనుమడు సంతోష్, ప్రభాకర్ ఆసుపత్రి అటెం డెంట్ అంతా ఆయనకు పరిచర్య తమకు సహజ మైన ఒక సంస్కృతిగా నిర్వహిస్తున్నారు

ఊపిరి తిత్తులనిండా కఫం ప్రయత్నించి దగ్గి అది బయటికి పంపించాలి దగ్గుతున్నాడు ప్రభాకర్, వాణి ఓపికగా ఆ తెమడనంతా తీసేసి ఆయన నోరు పెదవులు, దవడలు శుభ్రం చేస్తున్నారు

'అవస్థగా ఉందా? అని అడిగాను

ఒక అవస్థనా? చావు కూడ ఇంత కష్టమా? అన్నాడు

డాక్టరు వరీ అవుతున్నావా? అని అడుగుతున్నాడు' అని బలహీనమైన నవ్వు నవ్వి 'వరీయా జీవితంలో ఎన్నడూ లేదు చావంటే నాకేం భయం చావడానికైనా బతకడానికైనా ఇన్ని అవస్థలు ఎందుకు అన్నది నా ప్రశ్న

మేం వెళ్లేప్పటికి డాక్టర్ ఆయన వీపుమీద మర్దన చేస్తున్నాడు కఫం బయటికి రావడానికి

అది గుర్తు చేసుకుంటూ - డాక్టర్ నా వీపు మీద మద్దెల వాయిస్తున్నాడు నేను ఒక తబలిస్టును పిలిపించరాదా? అన్నాను' అని నవ్వి

'దీనిని ఫిజియోథెరపీ అంటారట' అన్నాడు ట్రీట్‌మెంట్ అంటే కైండ్‌గా ఉండనక్కర్లేదా?' అని నన్ను ప్రశ్నించాడు 'హాతం ప్రియంగా ఉండడం సాధ్యమేనా? అన్నాను అప్పుడు ప్రభాకర్ చెప్పాడు

యువర్ ట్రీట్‌మెంట్ ఈజ్ బ్రూటల్లీ కైండ్ అని అన్నాడట కాళోజీ డాక్టర్ గారి మొహం మీద

ఇంతలో లోపలికి హేమ వచ్చింది హేమ చేతులను తన చేతుల్లోకి తీసుకుంటూ నాయనకూడ ఇంత అవస్థ పడ్డాడే' అని అడిగాడు 'మిమ్ములను చూస్తుంటే బాపును చూస్తున్నట్లే ఉంది' అన్నది తాను తాను అవస్థ పడుతున్న ఆ క్షణంలో గతంలోనూ, భవిష్యత్తులోనూ ఎవరూ అటువంటి అవస్థ పడకూడదన్న తపన

జీవితమంతా పౌరహక్కుల ఉద్యమంలో గడిపి, ఎమర్జెన్సీ అంతా వరంగల్‌జైల్లో నాతో పాటు ఉన్న నల్లగొండ లాయర్ పులిజాల రాఘవరంగారావుగారు ఎనభై నాలుగో ఏట ఇట్లాగేపట్టు తప్పిపడిపోయి నాలుగు రోజుల క్రితమే మరణించారు

ఆ విషయం ప్రభాకర్‌తో పంచుకుంటున్నప్పుడు నాకు ఆసుపత్రి మంచం మీద కాళోజీ అటు అజం అలీ ఇటు రాఘవ రంగారావు మృతదేహాల మధ్య యుద్ధ రంగంలో ఒక ఉమర్ ముఖ్తార్‌లా అనిపించాడు

హేమ బయటికి వెళ్లి పవన వచ్చింది అయన జ్ఞాపకశక్తిని కష్టపెట్టడం ఎందుకన్నట్లు నేను బన్నిని' అని పూర్తి చేయకముందే రొట్టె రొట్టె ఏది? తెచ్చినవా? తిని వచ్చినవా? అని అడిగాడు నా జ్ఞాపకశక్తిని శంకిస్తావా అని సవాల్ విసిరినట్లు కాసేపు జ్ఞాపకాల్లో డెబ్బైల కుమార్‌పెల్లి రోజులు

దేవులపల్లి అమర్ వచ్చాడు తీక్షణంగా కళ్లల్లోకి చూసి కాసేపటికి 'నువ్వు అమర్‌వి కదా అన్నాడు

పద్దెనిమిదేళ్ల క్రితం జూలై 4 1984న సికిందరాబాదు కుట్ర కేసు విప్లవరచయితల మీద పెట్టిన పదేళ్లకు ఆ కేసు ఎత్తివేయాలని వందమంది రచయితలు విద్యార్థులు మొదలైన ప్రజా సంఘాల వాళ్లు పబ్లిక్‌గార్డెన్ గేటు నుంచి అసెంబ్లీ ప్రవేశ ద్వారం దాకా ఒక నిరసన ప్రదర్శన నిర్వహించారు ఆ ప్రదర్శన ముందు కాళోజీ నాలుగు అడుగులు నడిచాడు కె వి ఆర్ త్రిపురనేని మధుసూదనరావు, రత్నమాల మొదలైన వాళ్లంతా డెబ్బై మంది దాకా అరెస్టయ్యారు అప్పటికే జర్నలిస్టులు అయినందున, జరుగుతున్న అసెంబ్లీ, కౌన్సిల్‌లో ఈ విషయాలపై ప్రస్తావన తెప్పించడానికి అమర్, సలంద్రలు పక్కనున్నారు కనుక ఆ సాయంత్రం ఆంధ్ర సారస్వత పరిషత్ హాల్‌లో జరిగిన విరసం సభకు అమర్ అధ్యక్షత వహించాడు కాళోజీ ప్రారంభోపన్యాసం

'నా అధ్యక్షతన అప్పటికి నేనింకా పిల్లవాణ్ని కాళోజీ ప్రారంభోపన్యాసం నిజంగా నాకు కాళ్లు వణికాయి ఆ ఫోటో ఎంతో విలువగా దాచుకున్నాను' అని జ్ఞాపకం చేసుకున్నాడు అమర్

'స్థూపం దగ్గరికి జనం బాగా వచ్చిన్రా?' అని అడిగాడు ప్రభాకర్‌ను ఇవ్వాళ నవంబర్ ఒకటి - తెలంగాణ రాష్ట్ర సాధన కోసం 1969 72ల మధ్యన అమరులైన మూడువందల యాభైమంది స్మృతిలో నిర్మించిన స్థూపం దగ్గర ప్రతి నవంబర్ ఒకటిన సంస్మరణ సభ జరుగుతుంది తాను వచ్చిగానీ హైదరాబాదులో ఉన్నప్పుడు గానీ

కాళోజీ పాల్గొనకుండా ఉండే సందర్భాలు చాలా తక్కువ

'చాలా మంది వచ్చారు టి ఆర్ ఎస్ చంద్రశేఖర్ రావు రాలేదు' అన్నాడు ప్రభాకర్

'వాడు? ఎంపి ? అన్నాడు కాళోజీ

'ఎవరూ నరేంద్రనా? ఆయన టి ఎస్ ఎస్ కూడా ఇప్పుడు టి ఆర్ ఎస్‌లో కలిసింది కదా టి ఆర్ ఎస్ ఎవరూ రాలేదు' అన్నాడు

'పోయిన సారికూడా వాడు రాలేదు కదా' అన్నాడు కాళోజీ

▪ తర్వాత ప్రెస్ క్లబ్‌లో మీటింగు కూడ జరిగిందని చెప్పాడు ప్రభాకర్ స్థూపం దగ్గరికి బాగారెడ్డి, గోవర్ధన్ రెడ్డి వంటి కాంగ్రెస్ నాయకులు, జయశంకర్, జాదవ్, లక్ష్మణ్ మొదలైన వాళ్లు వచ్చారని చెప్పాడు 'జర్నలిస్టు రఘువీరరావు వచ్చాడా' అని అడిగి వచ్చాడ న్నట్లు ప్రభాకర్ తల ఊపాక 'ఓల్డ్ టైమర్' అని వాకు చెప్పాడు కాళోజీ ప్రశ్నలోనూ, మాటలోనూ ఎక్కడా పద్ధతి క్రమం (కొహరెన్స్) తప్పడం లేదు గానీ చాలా అవస్థ పడుతున్నాడు

' ఏమవుతున్నది' అని అడిగితే

'ఊపిరాడడం లేదు అన్నాడు కష్టంగా

ఆక్సిజన్ సరిగా అందుతున్నదా అని నవరిం చాడు ప్రభాకర్ గొంతునిండా గురగుర ఊపిరితిత్తుల నిండా కఫం దగ్గినా ప్రయత్నించి దగ్గినా కఫం వెళ్లి పోతే శరీరమంతా ఆకులా అల్లల్లాడి భయమవుతున్నది కాని తేలికవుతున్నది ఈ మనిషి కన్నీళ్లన్నీ ఇపుడు గుండెల నిండా కళకళ పెడుతున్నాయా? ఈ మనిషి భావాలు, ఆలోచనలు, స్పష్టంగానూ, సూటిగానూ, సరళంగానూ ఉంటాయిగదా -

ఈయన హృదయంతో ఆలోచిస్తాడా?

'డాక్టర్లు నా దగ్గరికి మూడు రోజులు మనుషుల్ని రానియ్యలేదు వాళ్లను కొప్పడ్డాను మనుషులు రాకపోతే నాకు రోగం నయం అయితదనుకుంటరు వీళ్లు నాకది తిరగబెడతదని వీళ్లకు తెల్వదు' అన్నాడు

స్థూపం దగ్గర పద్మనాభం (ప్రత్యేక తెలంగాణ పోరాటంలో కాళోజీ వలెనే వయోవృద్ధుడు) కలిసి కాళోజీని జ్ఞాపకం చేసాడని ప్రభాకర్ చెప్పాడు 'మీ దగ్గరికి తనను తీసుకపొమ్మన్నాడు రెండు మూడు రోజుల తర్వాత తీసుకపోతానన్ను' అన్నాడు

'జయశంకర్ రాలేదు ? అన్నాడు 'రేపటె ల్లుండి వస్తాడు అన్నాడు ప్రభాకర్

'చాలమంది వస్తే ఇన్‌ఫెక్షన్ వస్తుందని రావడం లేదు బయటనే మీ ఆరోగ్యం గురించి తెలుసుకుంటు న్నారు' అని చెప్పాడు ప్రభాకర్ ఆయనకా జవాబు తృప్తి కలిగించలేదు

ఆరో తారీకున పివి వస్తాడట' అన్నాడు

బతుకులో పోరాటంలో అపస్మారక స్థితిలో, కఫంతో ఊపిరాడక అవస్థపడుతూ, ఆక్సిజన్ మీదనే ఒంటి ఊపిరితో కళ్ల చివర ప్రాణం నిలుపుకున్న ఈ స్థితిలో ఆయన మనుషుల కోసం అర్రులు చాస్తూ అవస్థపడుతూ ఆయనకు మనుషులు కావాలి, మాటలు కావాలి

ప్రత్యేక తెంగాణ కోసం పోరాడేవాళ్లో, నక్సలైట్లో, ఐ ఎస్ ఐ ముద్రలు పడ్డవాళ్లో, దొంగలో, అమాయకులో, బందిపోట్లో ఎవరైతేనేమీ రాజ్యం, ఆస్తి శాంతంగా భద్రంగా ఉండడం కోసం మనుషుల్ని 'ఎన్‌కౌంటర్' చేసే వర్తమా నంలో ఒకవదకొండు వందల నెలలు, ముప్పై మూడు వేల రోజుల వయస్సు గలిగిన సజీవ చరిత్ర (అంతేనా, ఆ మనిషి వయసు) కొన్ని వేల, లక్షల సంవత్సరాల వయ స్సును తన పార్థివ శరీరంలో కేవలం సంవత్సరాలుగా, కాలం వలె కాకుండా చరిత్రగా-గతానికీ , భవిష్యత్తుకు వారధియైన వర్తమాన చరిత్రగా - నిలుపుకున్న మనిషి మనుషులతో ఆత్మీయమైన ఎన్‌కౌంటర్ల కోసం మనిషిలా ఎదురు చూస్తున్నాడు, ఆయన ఊపిరిని నిలుపుతున్న రహస్యం అదే

### కాళోజీ కాహళి 'నాగొడవ'గా మోగుతూనే ఉంటుంది

'మనతేం పనులున్నాయింక నవంబర్ 11 ఐపోతే మన పనులు తీరినట్లే' అన్నాడట కాళోజీ రామశాస్త్రితో నిమ్స్‌లో చేర్చినాంక నిజంగా నవంబర్ 11న ఆయన అన్న కాళోజీ రామేశ్వరరావు గారి వర్ధంతి, కాళోజీ అనుపస్థితిలో కూడా ఆయన నక్కలగుట్ట ఇంట్లో అభిమానులు చేసారన్న సంతృప్తితో కాళోజీ వెళ్లిపోయాడా

ఈ ఉదయం నవంబర్ 13 ఉదయం ఆరు గంటలకు ఆయన కోమాలోకి వెళ్లిపోయాడు ప్రభాకర్

మాటల్లో కొలాప్స్ అయ్యాడు' అంటే అక్టోబర్ 16 17 తేదీలు డెలీరియంలోకి వెళ్ళిన స్థితిని మినహాయిస్తే ఆయన మెదడు పనిచేయని స్థితి, ఆలోచించని క్షణం దాదాపు తొంభై ఏళ్ల చరిత్రకు కొత్త విషయం

ఆ డెలీరియం స్థితిలోకూడా ఆయన మాట్లాడాడు ఆయన అనుభవాలు, జ్ఞాపకాలు తెలిసినవాళ్లు కనెక్ట్‌చేసి చదువుకుంటే ఆ మాటలకు అర్థముంది జయశంకర్‌ను కూర్చోబెట్టి పద్మవిభూషణ ప్రస్తావన తెచ్చాడు ఆయన మెదడు పొరల్లో ఎక్కడో ప్రధాని అయిన తన సహచరుడు పి వి నరసింహారావు 'పద్మ విభూషణ ఇవ్వగలడే కాని తెలంగాణ రాష్ట్రం ఇవ్వగలడా అన్న ప్రశ్న ఉన్నదేమో అది పోరాడి నడుచుకోవాల్సిందేనని జయ శంకర్‌కు చెప్తున్నాడేమో

కాళోజీకి 'పద్మవిభూషణ' ఇచ్చినట్లు పత్రికలో చూసి మద్రాసునుంచి వెంటనే రాసాను తీసుకో వద్దు మీకు మీరు ఏ సఫిక్స్‌లూ ఆఫిక్స్‌లు లేని కాళోజీ కాళన్న మాత్రమే మీకేమయిన నప్పుతుందంటే అది 'ప్రజాకవి అన్నమాట ఒక్కటే' అని కాళోజీ తిక్క మనిష తీసుకోడేమో అనే భయంతో మహీధర రామ మోహనరావు తీసుకొమ్మని టెలిగ్రామ్ ఇచ్చాడట ఎన్నో మీటింగుల్లో ఈ రెండు విషయాలు చెప్తూ! తీసుకొమ్మన్న వీడూ నావాడే, వద్దన్నవాడూ నావాడే' అని చెప్పేవాడు కాళోజీ

అంత నిర్మొహమాటంగా కుండబద్దలు కొట్టి నట్లు మాట్లాడుతూ, రాస్తూ, నమ్మింది ఆచరిస్తూ ఎనభై తొమ్మిది ఏళ్లకు పైగా ఆయన అందరికీ ఇంతగా ఆమోద యోగ్యుడెట్లా అయ్యాడు బహుశా ఆయనలోని నిజా యితీ ప్రతి ఎదుటి వ్యక్తిలో ఎక్కడో దాగిన నిజాయితీని కూడా వెలికితీసేదేమో ఆయనలోని నిర్భీతత్వం ఎంతటి పిరికివానికైనా ఒక క్షణం ధైర్యాన్ని ఇచ్చి నిలబెట్టేదేమో ప్రతి ఒక్కరూ తమలోని మాలిన్యాన్ని ఆయన ముందు కడుక్కునే వారేమో లేదా సూటిగా వాళ్ల కళ్లలోకి చూస్తూ తన కన్నీళ్లతో ఆయన గడిగేసేవాడేమో ఆయన విక్టర్ హ్యూగో నవలలోని జీన్‌వ్లీ జీన్ హృదయాన్ని కూడా ప్రభావితం చేసిన ఫాదర్‌లాంటివాడు ఆయనకు ఆ నవల ఎంతో ఇష్టం బీదలపాట్లు తన గొడవగా పాడిన, రాపాడిన గళం ఆయనది గ్రామం ఆయనది జీవితం ఆయనది

పద్మవిభూషణ' తీసుకున్నాక హైదరాబాద్‌కు వచ్చినపుడు ఆయన హైదరాబాద్‌లో మా ఇంటికి వచ్చాడు ఎందుకో ఆ విషయంలో ఆయన నాముందు కొంత వివరంగా మాట్లాడాలనుకున్నట్లున్నాడు

ప్రైమ్ మినిస్టర్ నుంచి ఫోన్ వచ్చింది కాళోజీతో మాట్లాడాలని పిలిపించుకున్నారు అని కలెక్టర్ సార్ పంపాడట వెళ్తే అటు పివి ఫోన్‌లో మొదట నేనొకటి అడుగుతాను ఒప్పుకుంటావా మాట ఇవ్వు అన్నాడట చెప్పకుండా మాట ఇవ్వు అంటే ఎట్లా? ఏమడుగుతావో చెప్పు అన్నాడట కాళోజీ

నీ విశ్వాసాలు, ఆశయాలకు సంబంధించింది కాదు వ్యక్తిగతం నీకు పద్మవిభూషణ ఇవ్వాలనుకుంటు న్నాను కాదనకు అన్నాడట 'విద్యార్థి దశ నుంచి మిత్రుడ యిన పివి మాటను కాదనలేక పోయాను' అన్నాడు కాళోజీ

'అయినా దాని కొరకు నేను హక్కుల పోరాటం వదులుకున్నానా? తెలంగాణా రాష్ట్రవాదం వదులు కున్నావా? అని నన్ను అడిగాడు ఆయన

తాను కన్నుమూస్తూ మా అమ్మ నన్ను ఏడేళ్ల రామేశ్వరరావు చేతుల్లో పెట్టింది అప్పుడాయన నన్ను చంకనెక్కించుకుంటే నాకు ఎనభై మూడేళ్లు తనకు ఎనభై తొమ్మిదేళ్ల వరకు నేను దిగలేదు ఆయన దించా లని అనుకోనుకూడలేదు ఆయన పెట్టిన రొట్టెతో ఇంత వాణ్ణయ్యా ఎన్నడయినా' 'అన్న' మాట విన్నానా? నామాట ఏదో నాదే నా బాట ఏదో నాదే ఎవరి మెప్పు కోసమయో నేను నమ్మిన విశ్వాసాల్ని వదులుకోలేదు' అన్నాడు

'పద్మవిభూషణ' ఇచ్చే కార్యక్రమం ముగిసిన మర్నాడు పి వి ఇంటికి అల్పాహారానికి పిలిచాడట ప్రధానిగా ఆయన నివాసం భద్రతా ఏర్పాట్లు చూసి కాళోజీ 'ఏమిరో వరంగల్‌లో ఉండి నేను తెలంగాణలో, వరంగల్‌లో ప్రజలు కటకటాలు పడుతున్నారు, వాళ్ల తరఫున పోరాడుతున్న వాళ్లు కటకటాల వెనుక ఉన్నారను కున్నాను ఇంత దూరం వచ్చి నీకిదే చెప్దామనుకున్నాను కానీ నువ్వే పెద్ద బందిఖానాలో ఉన్నట్లున్నావు కదా' అన్నాడట

శరీరంలోని ప్రతి అంగుళమూ సంకెళ్లు పడిన స్పార్టకస్ హుంకరిస్తున్న దృశ్యాన్ని చూపుతూ కాళోజీ 'వాడు

బానిసా? ఏ పంకెల కనిఎంచని మనమా అని ఎన్నోసార్లు అడిగాడు ఇవ్వాళ ఈ ప్రశ్న మనమందరమూ వేసుకోవాలి

ఇవ్వాళ డాక్టర్ నరేంద్రనాథ్ రామశాస్త్రి గారిని అడిగాడు ఈ ప్రశ్నించే గుణం, మొండితనం కాళోజీకి ఎవరి నుంచి వచ్చిందండీ' అని 'వాళ్ల నాయన కాళోజీ రంగారావు నుంచి అని చెప్తూ 'వచ్చిన ఉద్యోగంలో అనారోగ్యం వల్ల చేరలేకపోయినా ఒక ముస్లిం మిత్రుడు పంపించే ఇరవై అయిదు రూపాయలతో కుటుంబాన్ని సాదుకున్న తండ్రి పండుగరోజు పిల్లల్ని బయటికి పోనిచ్చేవాడు కాదట తోటి వాళ్లను చూసి కొత్తబట్టలు కావాలంటారేమోనని

'ఎందుకు పోనివ్వవు అని జిద్దు చేసేవాణ్ణి అనాడు మొదలయింది నా ప్రశ్న అని చెప్పేవాడట కాళోజీ పదహారో ఏట నిజాం నవాబుతో పోరాటం ప్రారంభించిన కాళోజీ ఆయన ప్రభుత్వంలో వరంగల్ నుంచి బహిష్కరించబడ్డాడు ఫిరదౌసి మాట తప్పిన గజనీ గురించి రాసినట్లు అప్పటినుంచి ఇప్పటివరకు అది నైజాం అయితే నేమిటి హైదరాబాదు రాష్ట్రమైతేనేమిటి, ఆంధ్రప్రదేశ్ అయితేనేమిటి ఎంతమంది పాలకులు మట్టి కలిసిపోయారు వాళ్లకు నిరంతరం ప్రశ్నిస్తున్న కాళోజీ కలం మాత్రం ధిక్కార స్వరానికి ఎత్తిపెట్టిన జెండాగా రాపాడుతూనే ఉన్నది ఇవ్వాళ ఉదయం ఆయన మాట పడిపోయింది కోమాలోకి పోయాడు ఉదయం 11 20 డాక్టర్ బయటికి వచ్చి కార్డియాక్ అరెస్టు అయిందండి 'మేం డెత్ డిక్లేర్ చేస్తున్నాం అన్నారు ఒక చోట నేను కాళోజీ హృదయంతో ఆలోచిస్తాడా' అని ఆశ్చర్య పోయాను ఆయన మేధస్సుకు హృదయానికి ఎక్కడైనా తేడా ఉందా ఆ రెండూ బతుకువట్ల ఆయన అచంచలమైన ప్రేమవల్ల రసాయనికంగా తాత్వికంగా ఒకటయ్యాయి

ఇవ్వాళ 11 20కి ఆయన హృదయం స్పందించడం ఆగిపోయింది కాని ఆయనే ఒకచోట చెప్పినట్లు ఆయన చిందించిన ఒక సిరా చుక్క ఎన్ని కోట్ల హృదయాలను స్పందింపచేసింది మాకు శరీరంలో ఇంకే అవయవమూ పనిచేయకున్న ప్రధానం కాదండి మెదడు పని చేయకున్నా శ్వాస ఆగిపోగూడదు స్పందించే హృదయం ఆగిపోగూడదు' అన్నాడు డాక్టర్ ప్రజల ఆర్తిని, ఆరాటాన్ని పోరాటాన్ని శ్వాసించి, ప్రజల జీవనాడిగా స్పందించిన కాళోజీ భౌతికంగా ఈ మధ్యాహ్నం నుంచి ఇంకెవరితోనూ గొడవ పడడు

కానీ ప్రపంచంలో న్యాయాన్యాయాల మధ్యన గొడవ ఉన్నంతకాలం ఆయన 'నాగొడవ' మన గొడవగా బతికే ఉంటుంది

వ్యవస్థతో, రాజ్యంతో రాజీలేకుండా పోరాడుతూనే ఉంటుంది

❖ ❖ ❖

14 నవంబర్, 2002, వార్త

# 'ప్రజ' కాళోజి కవితాత్మ

- ఆచార్య పేర్వారం జగన్నాథం

'ప్రజాకవి' కాళోజీ నారాయణరావు కవిగా, స్వాతంత్ర్య సమరయోధునిగా, సామాజిక ఉద్యమకర్తగా, జగత్ప్రసిద్ధుడు పాలకుల దుర్నీతిని ఎప్పటికప్పుడు ఎండగట్టడంలో ఆయనకాయనే సాటి ఆయన సాహిత్య, సాంఘిక, రాజకీయాది ఉద్యమాలన్నింటిలో పాల్గొన్నాడు నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ఆవాడెత్తిన కలాన్ని ఆయన మళ్లీ కిందకి దించలేదు అవిశ్రాంతంగా తుది శ్వాస విడిచేదాకా ఆయన నిర్భీకంగా అన్యాయాన్నెదిరించాడు నిజాం ప్రభుత్వం ఆయన్ని పలుసార్లు జైల్లో బంధించింది వరంగల్లు నగర బహిష్కరణ గావించింది ఆయన ప్రముఖంగా గాంధేయవాది అయినా హింస హద్దు మీరినప్పుడు ప్రతిహింస తప్పదంటారు నిజాం కాలంలో ఆయన ఆర్యసమాజ కార్యకలాపాల్లో పాల్గొన్నాడు గణపతి నవరాత్ర్యుత్సవాల్ని ఘనంగా నిర్వహించినాడు అందుకెలాంటి అఘాయిత్యాలెదురైనా ఎదుర్కొన్నాడు తలదించలేదు ఆంధ్ర మహాసభల్లో పాల్గొన్నాడు స్టేట్

కాంగ్రెస్ ఉద్యమాలకు నడుం బిగించాడు గ్రంథాలయోద్యమాన్ని బలోపేతం చేసినాడు ఒకటేమిటి తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమాలన్నింటికాయన ఎత్తిన విజయపతాక సాంఘిక రాజకీయాది సమస్యలన్నింటిపై ఎప్పటికప్పుడు స్పందించడం కాళోజీ నైజం వర్తమాన చరిత్రకాయనిది కవితాత్మక వ్యాఖ్యానం, పోరాటమే శ్వాసగా బ్రతికినవాడు పోరాటం ఆయన రక్తంలో ఇమిడిపోయింది కాళోజి అన్న మూడక్షరాలు పోరాటానికి సంకేతంగా మిగిలినాయి కాళోజి అన్న పదానికి నిఘంటువుల్లో పోరాటం అని అర్థం ఇవ్వవలసి వుంటుంది

కాళోజీకి భారత ప్రభుత్వం 'పద్మవిభూషణ' బిరుదునిచ్చి సత్కరించింది కాకతీయ విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేట్‌నిచ్చి తన్ను తాను గౌరవించుకున్నది కాళోజి వ్యక్తిత్వం బహుముఖమైంది ఆయన కారుణ్యమూర్తి మానవతావాది అన్యాయాన్నెదరించే సమరశీలి దుర్మార్గాన్ని ఖండించే శక్తి సంపన్నుడు ప్రజావ్యతిరేకుల్ని తన కలానికి బలిచేసే కర్మవీరుడాయన పదవీవ్యామోహం లేని నిష్కామయోగి సీదాసాదాగా రైతు బిడ్డలా కనిపించే వేషమాయనిది నిరాడంబరుడు నిష్కళంకుడు పీడితుల కోసం తాడితుల కోసం కడవలకొద్ది కన్నీరు కారుస్తాడు వాళ్లకోసం తపిస్తాడు తల్లడిల్లుతాడు తల్లిలా చేరదీస్తాడు సమగ్ర సామాజిక విప్లవం రావాలంటాడు అవసరమైతే ఆగ్రహిస్తాడు ఆందోళన చెందుతాడు ప్రజల్లోకి వెళతాడు ఉద్యమం చేపడతాడు సిద్ధాంతపరంగా భిన్నించేవాళ్లతో కూడా సఖ్యంచేస్తాడు వాళ్లని సమాదరిస్తాడు

కాళోజి తన పోరాటాలన్నింటినీ, కవిత్వాన్ని మాధ్యమంగా స్వీకరించినాడు ఆయన చెప్పదలచుకున్నది సూటిగా తేటగా ప్రజలకందడమే ఆయనకు కావాలిసింది అది వ్యాకరణబద్ధంగా వున్నదా, అలంకారాలున్నవా, అందులో కవిత్వం పాలెంత అన్న ప్రశ్నలతో ఆయనకు నిమిత్తం లేదు తాను చెప్పదలచుకున్నది ఎదుటివాని గుండెకు తుపాకి తూటాగా తగలడమే ఆయన కోరుకునేది దుర్మార్గాన్ని కడతేర్చడానికే కాళోజి తన కవిత్వాన్ని ఆయుధంగా వాడుతుంటాడు ప్రజల్ని చైతన్యవంతులుగా చేయడం, వాళ్లని ఉద్యమాభిముఖంగా సిద్ధం చేయడం, వాళ్లలో మానసిక పరివర్తన తేవడం కాళోజీ కవిత్వానికున్న ముఖ్య లక్షణాలు

కాళోజి గొప్ప దేశభక్తుడు మాతృదేశాన్ని ప్రేమించడం దాన్ని గౌరవించడం ప్రతి పౌరుడి బాధ్యత అంటూ 1943 ప్రాంతంలోనే

లాఠి దెబ్బల లక్ష్యమేమీ
కఠిన శిక్షయే కాదుకాదు
చావుకైనను జంకనీయదు
మాతృదేశము మాతృదేశమే

మాతృదేశాన్ని రక్షించుకోవడం కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడాలన్నది దీని ఉద్దేశం ఇది ఆనాడు దేశంలో సాగుతుండిన స్వాతంత్ర్యోద్యమాన్ని లక్షించి రాసిన కవిత ఐనా ఇది ఎల్లకాలమూ ఎల్ల జనులూ ఆచరించవలసిన పవిత్ర ధర్మం

అట్లాగే మాతృ భాష కూడా! దాన్ని గౌరవించక, దాన్ని ఆదరించక పరభాషపై మోజు పెంచుకొని కన్నతల్లి వంటి స్వభాషను నిరాకరించడాన్ని అవహేళన చేస్తూ కాళోజి

తెలుగు బిడ్డవురోరి తెలుగుమాట్లాడుటకు
సంకోచపడియెదవు సంగతేమిటిరా?
అన్యభాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు
సకిలించు ఆంధ్రుడా! చావవేటికిరా?

అంటాడు ఇది 1942లో రాసిన కవిత ఐనా ఈనాటికీ ఇది మనకు వర్తిస్తుంది పరభాషలపై మోజు ఇంకా దిన దినం పెరుగుతున్నది కాని తరగడం లేదు ఇంగ్లీషు మీడియంలో చదువులు చెప్పే కాన్వెంటు స్కూళ్లు మన దేశీయతను మంట గలుపుతున్నాయి మనం మనంగా బ్రతుకలేకుండా చేస్తున్నాయి పరభాషను భుజలపై మోస్తూ మన భాషను మనం అణగద్రొక్కుతున్నాం ఈ వైఖరిని మనం ఖండించాలి ఏనాడో కాళోజి చెప్పిన ఈ మాటలు ఈనాటికీ అన్వయిస్తున్నాయి

సమాజంలో ఎన్నో వ్యత్యాసాలున్నాయి ఎన్నో ఎగుడుదిగుడులున్నాయి అవసరాలొకచోట వుంటాయి వనరులింకొకచోట వుంటాయి అనుభవించాల్సిన వాళ్లొకచోట వస్తు ప్రపంచం మరొకచోట వుండడంవల్ల సమాజంలో హెచ్చుతగ్గు లేర్పడుతుంటాయి సమాజం అస్తవ్యస్తంగా తయారవుతుంది దీన్ని దృష్టిలో పెట్టుకొని

అన్నపురాసులు ఒకచోట

ఆకలి మంటలు ఒకచోట
హంసతూలిక లొకచోట
అలసిన దేహా లొకచోట

అంటూ కాళోజీ పరితపిస్తాడు లోక ప్రవృత్తిని ఈ ఖండికలో చక్కగా వర్ణిస్తాడు దేశ సంపదను అందరూ సమంగా అనుభవించాలన్నది కవి ఆశయం అట్లా కాకుంటే సంఘం అస్తవ్యస్తమవుతుంది విద్వేషం చెలరేగుతుంది పేదరికంతో దేశంలో అశాంతి ప్రబలుతుంది అందుకని ప్రజల్లో సమభావం పాదుకొనాలంటాడు కవి దేశ సంపద అందరి అనుభవంలోకి రావాలంటాడు

ఒకచోట కాళోజీ మానవమన ప్రవృత్తుల్ని చక్కగా వింగడిస్తాడు మనుషులంతా రెండేరెండు రకాలంటాడు ఒకవర్గం దోపిడీ చేసేవావాళ్లైతే మరోవర్గం దోపిడీకి గురవుతున్నవాళ్లుగా మనుజుల్ని ఇట్లా విభజిస్తాడు

కుటిలమతులు దేబెమొగాలు
జగతిలో రెండే రెండురకాలు
చతురవర్గం విలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు

అంటాడాయన ఇది సమాజంలో జరుగుతున్న దుర్మార్గం ఈదౌష్ట్యాన్ని ఖండించ డానికే కాళోజీ తన జీవితాన్ని అంకితం చేసినాడు అయన ఎప్పుడూ బలహీనుల పక్షం వహిస్తాడు దేబెలను కాపాడడమన్నదే కాళోజీకున్న ఏకైక లక్ష్యం

కాళోజీ గాంధేయవాది అయినా హింసకు ప్రతిహింస తప్పదంటాడు అట్లా చేయకుంటే అధర్మం రాజ్యమేలుతుందంటాడు అన్యాయం విజృంభిస్తుం దంటాడు ప్రజలకు ధర్మంపై, న్యాయంపై విశ్వాసం సడలుతుందంటాడు ధర్మం తలకిందులు కావడాన్ని అయన సహించలేడు అందువల్ల

'సత్యయహింస'యని సంకోచపడరాదు
'దయయుధర్మం బనుచు తడుముకోపనిలేదు
'శాంతి'యని చాటినను శాంతింపగారాదు
'క్షమ'యని వేడినను క్షమింపగారాదు
'చాణక్యనీతి' ఆచరణలో పెట్టాలి
కాలంబు రాగానే కాటేసి తీరాలి

అంటాడు ఇదీ కాళోజీ మతం ఇదే ఆయన అభిమతం ఈ తత్వం ఆయన నడిపే ఉద్యమాల్లోనూ, సాహిత్యంలోనూ ప్రతిఫలిస్తూ వుంటుంది

తన అంతరంగ స్వభావాన్ని గూర్చి కూడ కాళోజ ఒకచోట చెప్పుకుంటాడు సమాజంలో ఎక్కడ అసమానతలు వున్నా, కష్టనష్టాలున్నా, దోపిడీ దౌర్జన్యాలున్నా కాళోజ కుమిలిపోతాడు కలవరపడతాడు కంగారుపడతాడు క్రుద్ధుడు కూడ అవుతాడు ఒకచోట ఇట్లా

అవనిపై జరిగేటి అవకతవకలజూచి
ఎందుకో నా హృదిని ఇన్ని అవేదనలు
పరుల కష్టము జూచి కరిగిపోవును గుండె
మాయ మోసము జూచి మండిపోవును ఒళ్లు

అంటాడు కాళోజి కారుణ్యమూర్తి ప్రజల కష్టాల్ని చూసి భరించలేడు సమాజంలో ఎత్తు పల్లాలాయనకు గిట్టవు ప్రజల కష్టాల్ని చూసి కన్నీరు కారుస్తాడు వాళ్లతో మమేకమవుతాడు దీనుల బాధల్ని తానూ పంచుకుంటాడు వాళ్ల భవితకోసం ఆరాటపడతాడు

కాళోజీలో తిరుగుబాటు తత్వమున్నది పోరాటం ఆయన స్వభావం చెప్పేదేదో ఖరాఖండిగా చెప్పడం ఆయకున్న అలవాటు ఒకచోట తానే చెప్పుకున్నట్లు

నేనంటే తిరుగుబాటుదారు
నా గొడవ మన తిరుగుబాటు

ఇది కాళోజీ వ్యక్తిత్వం ఆయన జీవితమే పోరాటల చరిత్ర, ప్రజల పక్షం అతనిది ప్రజలకోసం అతని ఆరాటం పోరాటం ప్రజాసంక్షేమ వాంఛ అతని జీవనాడి అందుకే ఆయన తన కావ్యానికి 'నా గొడవ' అని పేరు పెట్టుకున్నాడు అసలది ప్రజల గొడవ మనందరి గొడవ

కాళోజి చిరకాలం క్రితమే కథలు కూడా రాసినాడు వాటిలోనూ మనం కాళోజీ అంతరాత్మను దర్శించవచ్చు ఏ ప్రక్రియలో రాసినా కాళోజి తన అంతస్తత్వాన్ని ప్రదర్శిస్తాడు ఆయన కవితలు రచించినా కథలు రాసినా మానవతా దృష్టి, కారుణ్యమూ వాటిలో అంతర్వాహినిగా ప్రవహిస్తుంటాయి అధిక్షేపమూ, వికటకవితా లక్షణమూ తళతళా మెరుస్తూ వుంటాయి ధర్మాగ్రహమూ ప్రబలంగా వుంటుంది ఏది ఏమైనా కాళోజి ధన్యజీవి అయనొక వైతాళికుడు శాపానుగ్రహ సమర్థుడు మహా మనిషి ఆయనకు నాకైమొడ్పులు

# కన్నతల్లి కలను నిజం చేసిన తెలంగాణ ముద్దుబిడ్డ కాళోజీ

- పి యశోదారెడ్డి

'కాళోజీ లేడు అనే మాట అబద్ధం ఈ మాట అనేందుకు వినేందుకు ఎంత ధైర్యం? ఎన్ని గుండెలు? శ్రామికుని చెమటను అడగండి దీనుల ఆర్తిని చూడండి పసిపిల్లల బోసినవ్వుల వెదకండి అంతెందుకు రామశాస్త్రి గారి ఎదను ఒక్కసారి తాకండి కాళోజీ పది రూపాలతో ప్రత్యక్షమౌతాడు అవునా? నిజమే కదూ? కడుపు చల్లని తల్లి తెలంగాణపు సీమంతిని నా కొడుకెక్కడ? నా కడుపు చిచ్చుఎవరు చల్లారుస్తారు నా చెర ఎవరు విడిపిసా రంటూ' అబ్బరిచ్చి ఏడుస్తుంటే ఎండిన చెర్లన్ని పార్లిన యట నిజమేనా? ఆయన భౌతిక రూపం ప్రకృతి సిద్ధమై కాల ధర్మాన్ని అనుసరించినా ఆ చైతన్యస్ఫూర్తి సజీవమై మనను నడిపిస్తూనే వుంటుంది అందుకే కన్నీళ్ల తుడ్చు కుందాం ఈ వార్త పి వి ఎట్లా భరిస్తాడో? బెదిరిన ఎదలను నిలువరించి దిటవుకొల్పే భారం ఆయనదే అనండి ఆయన కలను నిజం చేసేందుకు నడుం కట్టండి

కాళోజీ అజాతశత్రువు పుస్తకాలెందుకు ధర్మ రాజును అజాత శత్రువు అంటూ నెత్తికి ఎత్తుకున్నాయి కానీ నిజమైన అజాతి శత్రువు మన కాళోజీ! అట్లని ఈయన మెత్తటి మైనంగా వంగులూ, గోడ మీద పిల్లి వాటంగా, అవకాశవాదిగా లేడు ఈయన ఒక వ్యక్తికాదు, ఉద్యమాల పుట్ట, కణ కణలాడే నిప్పు తునక ఒక వంద సంవత్సరాల తెలంగాణపు సాంఘిక, రాజకీయ, విప్లవాల కు విప్లవం నేర్పిన తలబిరుసు కాల పరిణామంలో చరిత్ర ఎన్ని సిద్ధాంతాల్లో కాలూనిందో? ఎన్ని పోకడలు పోయిందో? ఎన్ని తొడుగులు తొడిగిందో అన్నిటినీ జీర్ణించుకొని, అనుభవాన్ని పండించుకొని, తనదైన దారిని నడిచిన అనుభవాల దొంతి కాళన్న మాటలు నేర్వని తెలంగాణకు మాటలు నేర్పి గలగలా మాట్లాడించి కత్తిలేక నెత్తుర్లు చిందించిన నెరజోడు కాళన్న

"ఒరుల యాపదకెదరగరగని నిన్ను
మనుజుడవని పేరకొన బాడిగాదు"

అన్నాడు సాదీ కవి అట్లే కాళోజి ఇతరుల ఆర్తిని చూచినా, తన తెలంగాణభాషను పల్లెత్తు మాట ఈసడిస్తూ పలికినా ఆయన ఆర్ద్రహృదయం కరిగి కళ్లవెంట నల్లముత్యాలు వరుసలు కడ్తాయి వాటికి వెలకట్ట గలమా? సంతోషం వచ్చినా అంతే! ఆగలేని ఎదుమెత్తిన అయనది నా తల నిమురుతూ తెలంగాణపు సొగసు చూపితివి గద! అంటూ రాల్చిన ఆనంద భాష్పాల విలువ నన్ను నా పుట్టిన గడ్డకూ, ఆ భాషకు తల్లికి ఋణగ్రస్తను చేసినవి

ఈయన కరుణార్ద్ర హృదయుడు అంటూ వేరే చెప్పవలసిన పనిలేదు - "If I speak with language of men and angles but have not love, I am a noisy gong or a changing sybol" అన్నవిధంగా జీవించి ప్రజా మనిషిగా నిలువ గలిగిన చిరస్మరణీయుడు కాళోజి జీవితం వలెనే కవిత్వం కూడా ప్రజల కోసమే!

ప్రజా కవి కాళోజీ ప్రసిద్ధుడు వ్యక్తి వలెనె కవిత్వం కూడా అన్ని 'ఇజాల' సమాహార రూపంగా కనిపిస్తుంది కవితలన్నీ ఎంతో సులభమై అలవోకగా వ్రాసినట్లు కనిపించినా సూక్ష్మ దృష్టికి ఇందులో ఒక రస్సల్, ఒక ఖలీల్ జిబ్రాన్, ఒకలూయీ, ఒక వేమన్న, ఒక చౌడప్ప, ఒక చారువాకుడైన లోకాయతుడు ఒక వివేకానందుడు, ఒక నక్సలైటు, ఒక తాత్త్వికుడు దర్శనం ఇస్తూ మన పెదవులపై సన్నని నవ్వు మొలకలు మొలిపిస్తూ బొమ గంటు పెట్టిస్తూ, ఆలోచింపచేస్తాయి

కాళోజీ బక్కపలుచని శరీరంలో వజ్రతుల్యమైన ఒక దీక్ష చండవాయువు వంటి ఆవేశం దాగి ఉంటుంది ఈ రెండూ రెండు పాయలై నిజాయతీ, త్యాగం అనే మరో రెండు పాయలు కూడి నాలుగు కాళ్ల జడగా అల్లుకొని ఈయన కీర్తి కాయాన్ని సింగారించినవి

'త్యాగేనలభతే' కీర్తి అని కదా! పెద్దల మాట తాను ప్రాణ వంతుడైనప్పుడే కాదు విగత ప్రాణుడై కూడా

తన కళ్లతో ఇతరులకు కంటిచూపును ప్రసాదించేందుకు తోడ్పడుతాడు, చివరకు శరీరం కూడా ఉపయుక్తమైంది అంటే మామూలు మాటకాదు బ్రతికినంత కాలం లోకాన్ని నిశితంగా పరిశీలించి కాచి వడబోసిన అనుభవం లో నిగ్గుతేలిన నిజాలను తుది నిర్ణయాలుగా ప్రకటించే స్వభావం కలవాడు వీరి దృష్టిలో కులాలురెండె ఒకటి కుటిల మతులు రెండు దేబెమొకాలు అంటె మసి తాకిన మనస్సులు,

2 లేవలేని చేతగాని చచ్చుబత్కులు నా భాషలో ఉత్కి ఆరేసిన మొకాలు

ఈయన ఆశావాది నిరాశ కాళోజీ నిఘంటువులో లేదు చావంటే భయం లేనినిర్భీకుడు, ఐనా తానై సార్థకమైన జీవితాన్ని తుదముట్టించుకోవాలనే పిరికి పిండం కాదు అందుకే వారు ఒకచోట వ్రాసిన
"ఉదయం కానే కాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లనే వుంటుందనుకోవడం దురాశ" అనే పంక్తులు స్మృతిలో మెదులుతున్నాయి ఇప్పుడు నాకు

ఈయన స్త్రీల పట్ల ఆర్ద్రత మాత్రమే కాకుండా గౌరవభావం కలిగిన వ్యక్తి ఆ భావాలన్నీ ఉన్నవి అంటూ తనకు తృప్తి పడకుండా నిర్భయంగా "కొంగు లాగిన వ్రేళ్ల కొలిమిలో పెట్టాలె, కన్నుగీటిన కళ్ల కారాలు చల్లాలె అనీ ఇంకా కండకండగకోసి కాకులకు ఏయాలె" అంటూ ఎంతో సహజంగా సత్యాగ్రహాన్ని ప్రదర్శించే గుణం మెచ్చుకోదగ్గది కాదా? ఇక ఏవీ అంతటి అండదండలు? ఎవరంత సూటిగా ఎదుర్కొగల ధీరులిప్పుడు?

ఈయన దృష్టిలో ప్రభువు అంటే రక్షించేవాడు, కానీ భక్షించేవాడు కాదు, మరి భక్షించేందుకు అడవిలో క్రూర సత్వాలెన్నో ఉన్నాయి అంటాడు ఇది మెత్తటి మఖమల్ బట్టలో చెప్పు పెట్టి కొట్టిన వైనంగా తొంగి చూస్తుంది ఆ ధాటికి ఆగేదెవరు?

శ్రీ కృష్ణుణ్ణి గూర్చి చెప్పేటప్పుడు అందరికి అన్ని వగల ఆనందమిస్తూ చల్లవేయంగ ఇంటింట చంద్రుడై అన్నట్లుగానె మన కాళోజి కొందరికి గురువై శిక్షిస్తూ, కొందరికి నాయకుడై వారిని కనుసన్నల నడిపిస్తూ, కొందరిని తండ్రిగా ఆదరిస్తూ తప్పుడు త్రోవలు తొక్కే రాజకీయ నాయకులకు పక్కలో బల్లెమై, కవులకు ప్రజాకవిగా, తెలంగాణ స్ఫూర్తికెత్తిన జండాగా నానారూపాల్లో మెదుల్తూ అందరి ఎదలకు ఉల్లాసాన్నీ ఉద్రేకాన్నీ ఆశను శక్తినీ సమకూరుస్తూ చివరకు అందరినీ ఆనం దింపచేసే విచిత్రవ్యక్తి కాళన్న మైదుచల్లి మరిపించే మాంత్రికుడు

అన్ని పార్టీల వాళ్ల పరువం కలిమీ దొరతనాలన్నీ పక్కకు వొదుగగా తలవొంచి నమస్కరిస్తూ చివరి వీడ్కోలు పల్కిన విధానం కళ్లకు నిండు పుష్కరాలు చేసినా మా కాళన్న ఈ బక్క పలుచని మాత్రారాధకుడు ఇంతటి అజాద్ ఖౌజీయా? అంటూ ఈఎడ్డి యశోదమ్మ ఒక విధంగా అబ్బురాన్ని పొందింది ఇదంతా పూర్వజన్మ సుకృత విశేష ఫలమే కాని కావాలంటూ వేసుకున్న వేషం కానీ, నటనకానీ కాదు నూటికి నూరుపాళ్లు నేను చూచి వ్రాస్తున్న నిజం ఎంతటి మహానుభావులకు దక్కుతుంది ఈ వైభవం

పువ్వుల సాహచర్యంతో నారకుసువాసన సంక్రమించినట్లు తండ్రి వంటి కాళోజి తమ అసన్నిధానంతో కూడ నన్ను మరువక ఈ రెండు మాటలు శ్రద్ధాంజలిగా గ్రహిస్తూ నన్ను ధన్యను కావిస్తున్నారు కాళోజీ గారికి నేనంటే అభిమానం మిక్కుటం జున్నుపాలు, జుంటితేనె, మీగెడ పెరుగు, పసినవ్వు, ఎంతముద్దో? ఎంత సొంపో? ముద్దులమూట, మురిపాల దొంతి, ముచ్చెట్ల దండ తెలంగాణపు తెలుగంటే ఆయనకంత మురిపం అంత పండుగ అసొంటి కాళన్న ఆ బాసల నిండమున్గి ఈతలు గొట్టినోడే, ఆయనగని నా మీది ఆరినారంతోటి, ఎవరన్న పెద్ద పేరు వోయిన రాతగాండ్లు తెలంగాణపుమాటల రాసినం జెర జూడుండి అంట అగ్గితె, ఆ పుస్తకాన్నితెర్చి అటిటు తిప్పి సూసి 'అచ్చమైన పల్కుపడిని యాస అంటాం? మీరనే యాసల మా యశోదమ్మ ఆమెనె యశోదారెడ్డి, గురెటుకాడు, అమె వాడ్కి వొంది అంట జెప్పిండని దగ్గరి కొచ్చినమగవాళ్ల జెప్పిన్రు నిజంగా ఆ ఆప్యాయతకూ, ఆ అనురాగానికి, నిష్కల్మషమైన ఆ మనస్సుకు చేతులెత్తి నమస్కరించి శ్రద్ధాంజలి ఘటించడం కన్నా ఏముంది ఋణవిముక్తికి నమస్కార పరంపరలతో సెలవు తండ్రీ!

18 నవంబర్, 2002, ప్రజాతంత్ర

# మొక్కవోని ధైర్యం ఆయన

- కేశవరావు జాదవ్

అనుకున్నది అనుకున్నట్లుగా నిర్భయంగా చెప్పే నిజాయితీగల ముక్కుసూటి వ్యక్తి ఆయన అంటూ తెలంగాణ ఉద్యమ నాయకుడు కేశవరావుజాదవ్ అన్నాడు బుధవారం కాళోజీ మరణానంతరం ఒంటరిగా ఆలోచిస్తూ నిలుచున్న జాదవ్‌ను ప్రజాతంత్ర కదిపిన అనంతరం ఆయన అన్నమాటలివి తనకు స్ఫూర్తిదాతగా చెప్పుకున్న కాళోజీ గూర్చి ఆయన వివరిస్తూ మొక్కవోని ధైర్యం మొండితనం ఆయన లక్షణాలని అన్నారు అన్యాయాన్ని ఎదిరించడంలో ఆయనకు ఆయనే పాటి అంటూ, తప్పుదీ జరిగితే ఎంతటి వారినైనా ఎదిరించడమే ఆయన లక్షణమన్నారు రాజ్య హింసపై నిత్యం పోరాటం సాగిస్తున్న ఆయన ప్రజా ఉద్యమాలలో సైతం తప్పుల్ని సహించేవారు కాదని అన్నారు సుమారు ఇరవైఏళ్ళ క్రితం మొదటిసారిగా నక్సలైట్లు ఓటు హక్కును బహిష్కరించాలని ఎలుపునివ్వగా కాళోజి ఓటు హక్కు ప్రజాస్వామికమైనదని ప్రకటిస్తూ మెడలో బోర్డు వేళాడదీసుకుని పాతబస్తీలో తిరిగాడని చెప్పారు తెలుగు భాషలోనే గాకుండా మరాఠి భాషలోను ఆయనకు ప్రావిణ్యత ఉందన్నారు 50 ఏళ్ళ గ్యాప్ తరువాతకూడా ఆయన ఒక సందర్భంలో మరాఠిలో అద్భుతమైన ప్రసంగం చేసారని ఆయన గుర్తుతెచ్చుకున్నారు చివరిసారిగా నిమ్స్‌లో ఆయన చికిత్స పొందుతున్నప్పుడు తాను మాట్లాడినట్లు ఆయనతెలిపారు

❖ ❖ ❖

# కాలానుగుణ్యమైన 'ప్రశ్న'కు చిరునామా ఆయన!

-ఎ బి కె ప్రసాద్

జాలువా రచనల మహాకవి జాషువా 'కొత్త లోకం' కవితలో కవుల గురించి శ్వాసించిన ఆశాభావం ప్రజాకవి కాళోజీపట్ల అక్షర సత్యమై కూర్చుంది 'సుకవి జీవించు ప్రజల నాలుకలయందు?' ఆరు దశాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా,నిరంతరాయంగా తెలుగునాట ముఖ్యంగా తెలంగాణంలో ప్రజాభ్యుదయ సాధనకోసం సాగుతూ వచ్చిన సాంఘిక, రాజకీయ, సాంస్కృతికోద్యమాలన్నిటినీ తనలో ఇముడ్చుకుని, వాటిలో పాల్గొని వాటితో ఏర్పడిన అనుబంధాన్ని కవితాపరంగా, కథాకథనంగా, ఆత్మకథనంగా అందించిన కాళోజి నారాయణరావు ఇప్పుడు లేక పోవచ్చు కాని, ఆయన వదిలివెళ్లిన ప్రజా ఉద్యమాల స్ఫూర్తిని సామాజిక బాధ్యతలు గుర్తెరిగిన కవులూ, కళాకారులు, రచయితలూ భద్రపరుచుకోదగిన వారసత్వంగా భావించాలి ఎన్ని ఉద్యమాలు, ఎన్నెన్ని రాజకీయ పాయలూ ఎన్ని పక్షాలు ఎన్ని 'ఇజాలు', మరెన్ని సాంస్కృతిక శాఖలు కడచిన అరవయ్యేళ్లలో వీటన్నింటితోనూ సంబంధబాంధవ్యాలున్న కవి కాళోజి జీవితాన్ని ఆయన రచనా వ్యాసంగం నుంచి వేరుచేసి చూడలేదు అలాగే తన రచనను జీవిత పరిధులను దాటించీ నడవలేదు! ప్రజల కష్టసుఖాలు అవి ఆధారంగా సాగిన ఉద్యమాలే ఆయనకి కవితా వస్తువులయ్యాయి 'ఆర్యసమాజం' నుంచి ఆంధ్ర మహాసభదాకా, నిజాం వ్యతిరేక పోరాటాల నుంచి భూస్వామ్య వ్యతిరేక ప్రజా సంఘటన దాకా, కాంగ్రెస్ ఉద్యమాల నుంచి కమ్యూనిస్టు పోరాటాల వరకూ, స్వాతంత్ర్య సమరం నుంచి పౌరహక్కుల సాధనోద్యమాల దాకా, ప్రతిపక్ష కవి పాత్ర నుంచి మానవ హక్కుల పరిరక్షణోద్యమాల వరకూ, కాకతీయ తెలుగు వీరుల స్ఫూర్తిలోనుంచి ప్రజాస్వామ్య తెలంగాణా ఉద్య

మందాకా ఎన్నికల బరి నుంచి ఎన్నుకున్న ప్రజా ప్రతి నిధులను నిగ్గతీసి నిగ్గతేల్చే ప్రజాస్పందనవరకూ అభ్యుదయ కవితా ప్రస్థానం నుంచి విప్లవ కవితా మహాప్రస్థానం వరకూ కాళోజిది ఒకటే గొడవ, ఆ గొడవ ప్రజల గొడవగా అదే తన గొడవగా 'నా గొడవ'గా చివరికి ఆత్మకథాత్మక 'ఇదీ నా గొడవ'గా మనందరికీ ఆత్మీయ మైన మనలోని గొడవగా అవతరించింది। తెలుగు భాషా సంస్కృతుల పునర్వికాసానికి, వాటిని ప్రజాయత్తం చేయ డానికి ఈ తపన పడినవాడు మన కాళోజి ప్రజా జీవనంతో పెనవేసుకుపోయిన కవి జీవితానికి శాంతి ఉండదు విశ్రాంతీ వుండదు సామాజిక పరిణామాలపట్ల చలించి, స్పందించే కవి కళ్లల్లో కన్నీళ్లతోపాటు, వికటించిన పరిస్థితు లకు నిరసనగా ■ కళ్లే చింతనిప్పులవుతాయి అలాంటి సందర్భాలు కవి కాళోజి జీవన సమరంలో ఎన్నెన్నో స్పందన ఆయన కవితాభివ్యక్తికి కుందెన। కాళోజి కవిగా ఓ జీవనది, దరులొరసి పారే ప్రవాహం వ్యక్తిగా ఓ అవిశ్రాంత పోరాట యోధ సామాన్య ప్రజల తరపున 'వకాల్తా' వహించిన శక్తవంతుడైన పృచ్ఛకుడు ప్రశ్నకు ప్రగతికి మార్గంగా భావించి సదా ప్రజల తరపున ప్రశ్నలకు కవితా రూపం తొడిగి పాలకులనుంచి సమాధానాలు రాబట్టే కళను ఆయుధంగా మార్చుకున్న కవి। అతని కవిత కాలానికి వేసిన కళ్లెం తలపుల తలుపులు తెరిచిన గొళ్లెం

అదే కాళోజి కవితా హారతిపళ్లెరం। వకీలుగా చిన్ననాట ఏడెనిమిదేళ్ళు కోర్టులకు వెళ్లి వస్తున్నా కాళోజి శ్వాసించింది లాయర్‌ప్రాక్టీసు కన్నా న్యాయస్థానం వెలుపల ప్రజాన్యాయస్థానంలో నేనని మరవరాదు। అన్యాయం, అక్రమం, అత్యాచారం, ఎక్కడ జరిగినా కాళోజి స్పందించాడు తన గొంతు కలిపాడు ప్రజలకు గొంతునిచ్చాడు వకీలుగా తన ప్రాక్టీసుగురించి తానే వ్యంగ్యంగా ప్రస్తావించుకుని ఒక సందర్భంలో యిలా పేర్కొన్నాడు 'సాహిత్యం లోపటనేమో నేను పెద్ద వకీలునని పేరు, వకాలత్‌ల నేమో మంచి కవిననీ, వకాలత్‌ల ఇంటరెస్ట్ లేనివాడననీ పేరు వాండ్లకి సాహిత్యం తెల్వది, కవులకి వకాలత్ తెల్వది ఎరుక లేనివాండ్లు సర్టిఫికెట్ యిస్తరు। పెద్ద జోకే మరి।'

'చెత్తోని జరపలేం చెప్పుతోని కొట్టలేం ।

ఆంగ్ల కవితా ప్రపంచంలో గొప్ప ప్రసిద్ధుడైన కవి కోల్‌రెడ్జి సత్యం మాట్లాడవలసిన అవసరం గురించి ఒక చోట యిలా అన్నాడు "నిజాన్నే సత్యాన్నే అన్ని సమయాల్లోనూ చెప్పాలి అయితే ముఖ్యంగా నిజం పలకడమే ప్రమాదకరమైన సందర్భాల్లో ఆ నిజాన్ని చెప్పి తీరాలి!" తెలుగునాట సాగిన అన్ని ఉద్య మాల సందర్భంగా, సాంఘిక, రాజకీయ పరిణామాల పూర్వరంగంలో కాళోజి సత్యవాదిగానే వ్యవహరించాడు అమాత్యులకు పీడకలగానే ఉన్నాడు। ఈ వైఖరిని కాళోజి జీవితంలో ఎందుకు ఎంచుకున్నాడు? అందులో సాదృశ్యం మరారీ సామెతలనుంచి పేర్కొన్నాడు శివుని లింగం మీద ఒక తేలు పోయికూచున్నది మహాభక్తుడు లింగం ముందు కూచుని వున్నాడు వాడు తేలుని చేత్తో జరిపితే కాటేస్తది చెప్పు తీద్దమంటే లింగానికీ,శివునికీ అపచరాం కాబట్టి చేత్తోనీ జరపలేం, చెప్పుతోనీ కొట్టలేం అట్నే అధికారంల కూచుని అన్యాయాలు చేస్తున్న బద్మాషులు అందరూ లింగం మీది తేళ్లు। చెప్పుతో కొడదామంటే పోలీసుశాఖకీ, ప్రభుత్వానికీ అపచారం'। ఈ సామెత కాళోజీ కవితాత్మను సూటిదనంతోనేగాక ఘాటైన పోటు దనంతోకూడా ముందుకు నడిపించి ఉంటుంది। అతి సామాన్యమైన భాషలో ప్రజల గుండెగొంతువలో మాట్లాడించిన కవి కాళోజి తెలుగు వారి మనస్సులో మరో వేమనగా, సామాన్యుల కామనగా నిలిచిపోతాడు। అతను కుల మత, వర్ణ, వర్గరాహిత్య సంస్కృతీ ప్రియుడు, నిష్కళంక ప్రజాకవి ఆ హోదాలో కాళోజిది పాల్‌రాబ్సన్, సీగర్, మయకోవస్కీ, గద్దర్ వ్యక్తిత్వాలు మూటగట్టుకున్న మూర్తిత్వం గ్రామలకు, పల్లెవాసులకు శాంతిని సదా కోరుకున్న కాళోజీ హింసను నిరసించినవాడూ, రాజ్య హింసను ఖండించినవాడూ, ప్రజల ఆత్మరక్షణార్థం ప్రతి హింసను సమర్థించినవాడూ కవనానికీ జీవనానికీ మధ్య వైరుధ్యాన్ని దరిచేరనివ్వనివాడు నరులను పీక్కుతినే నరహంతకులున్న చోట నరసింహుల అవతారాలను ఆవాహనం చేసి ఆహ్వానించినవాడు! ఈ ప్రజాతత్వం జీర్ణించుకున్నందుననే కాళోజీ 'హింస పాపమని యెంచు దేశమున/ హిట్లరత్వమింకెన్నాళ్లు?' అని ప్రశ్నించగలిగాడు।

ప్రజా సమస్యలు తలెత్తినప్పుడల్లా ఆయన దృష్టి ఇజాల సరిహద్దులు కూడా అధిగమించి స్వతంత్రంగా వ్యక్తిత్వాన్ని మొహరు వేసుకుని ఆశ్చర్యచకితుల్ని చేస్తూ వచ్చింది। ఈ ధోరణి 'నాయిజం (1931) కవితలో మరీకొట్టవచ్చినట్టు కనిపిస్తుంది

'నాకందినది నాది
నాకందనది మనది
నానా యిజాల కడుగునచూడ
'నాయిజం దే అగుపడును జాడ'

నిజాం నిరంకుశ పాలనలో ఒకసారి వరంగల్ లోని పరిస్థితులు విచారించి పోయెందుకు నాటి ప్రధాని మీర్జా ఇస్మాయిల్ వరంగల్ వస్తున్నాడని తెలుసుకున్న కాళోజీ అంతకు ముందు తనను జిల్లా నుంచి బహిష్కరించిన ఘట్టాన్ని ఆసరా చేసుకుని ఇస్మాయిల్ 'ప్రధానికి బహిరంగ లేఖ' పేరిట ఒక ఉత్తరం రాశాడు అందులో కాళోజీ వరంగల్‌లో శాంతిని నెలకొల్పెటందుకు నువ్వుపోతున్నవ్ ఆ పరిస్థితికి నేను కారకుడినని జిల్లానుంచి నన్ను బహిష్కరించినావు నేను వరంగల్‌వాడిని నేను లేనప్పుడు అక్కడి పరిస్థితులు విచారించేటందుకు పోతన్నవ్ నన్ను కూడా నీవెంట తీస్కపో దానికి నేనెట్ల కారకుడినో నా ముందే విచారించు దాని మీద ఏ శిక్షవేసినా నేను సిద్ధం కాని నన్ను తీస్కపోకుండ నువ్వు పోయి విచారణ చేస్తే మాత్రం అది బూటకపు విచారణవుతుంది' అని రాశాడు। కాని ప్రధాని ఈయన్ని పిలవలేదు ఆ మరునాడే కాళోజీ కొన్ని ప్రశ్నలతో ఓ గేయం రాశాడు 'కోటగోడల మధ్య ఖూని జరిగిన చోట/ గుండాల గుర్తులు గోచరించినవా?/ బాజార్లో బాలకుని బల్లెంబుతో పొడుచు/ బద్మాషునేమైన పసిగట్టినావ?/ సుబాధికారులు జోహుకుం అనువారు/ చుట్టు చేరి అంత చూపెట్టినార?/ కాలానుగుణ్యమౌ కాళోజీ ప్రశ్నలకు/ కళ్లెర్రజేసి ఖామోషు అంటావా? ఈ ప్రశ్న కవితను సువరం ప్రతాపరెడ్డి 'గోల్కొండ' పత్రికలో 'సూటైన ఘాటైన ప్రశ్నలు' పేరిట పతాక శీర్షికగా ప్రచురించారట। ఈ ప్రశ్న కమ్యూనిస్టులమీద ప్రభుత్వాలు నిర్బంధ విధానం విధించి ప్రజలను ఇబ్బందుల పాల్జేస్తున్నప్పుడు కాళోజీ 'తీర్పు' గేయం (1945) రాసి 'ప్రజా సంస్థపై పగసాధించిన ఫలితము తప్పక బైటపడున్' అని నిరసన తెలిపాడు

'పద్మ విభూషణ్'గా మారిన 'ఖతర్‌నాక్ మనిషి'

అంతేగాదు 1978లో చెన్నారెడ్డి హయాంలో రాష్ట్రంలో రమీజాబీ కేసు సందర్భంగా పోలీసు కస్టడీలో నిందితుల్ని చిత్రహింసల పాలుచేయడాన్ని నిరసిస్తూ 'ఏమంటావ్ మర్రి చెన్నన్నా?' అంటూ ఓ కవిత రాశాడు కాళోజి అందులోనూ సమాధానాలు కోరుతున్న ప్రశ్నలు పరంపరే! మురా మనిష మర్రిచెన్న/ ముఖ్యమంత్రివా? నీవు/ నిరసన తెలిపిన ప్రజలనే నీతి బాహ్యులంటావా?/ సంఘద్రోహ శక్తులనుచు జనులను చంపేస్తావా?/ ఉద్రిక్తుల జేసి ప్రజల/ నుగ్రవాదులంటావా? నిరసన తెలుపక బతుకుట పౌరధర్మమా?/ కాళోజి యుక్తి కాళోజి అడుగుతాండు ఏమంటావ్ మర్రిచెన్న?

అలాగే, పి వి కుటుంబాలవారు ఆనాడు 'భూస్వామ్యపెద్దలు గా చెలమణి అవుతున్న రోజుల్లో కాళోజి ఖతర్‌నాక్ మనిషి, అతని దగ్గరకు పోవద్దని' ఎ వి ని హెచ్చరించేవారట, కాని కాళోజి మనసూ, నడతా తెలిసిన పివి ప్రధాన మంత్రిగా ఎదిగివచ్చిన తరువాత అదే ఖతర్ నాక్ మనిషి'కి 'పద్మవిభూషణ్'తో సత్కరించవలసి రావడం తెలంగాణా ప్రజాజీవితంతో, తెలుగువారి ఉద్యమ సంప్రదాయాలతో పెనవేసుకుపోయిన కాళోజి వ్యక్తిత్వానికి జరిగిన గుర్తింపు, పురస్కారంగా భావించాలి అంత మాత్రాన, 'పద్మవిభూషణ్' పురస్కారం తరవాత కూడా కాళోజి ప్రజాపక్ష కవిగానే నిర్భిద్ర నిరసనగళంగానే, పేద సాదల ప్రజాస్వామ్య జీవన గుండెల సవ్వడిగానే చివరి దాకా నిలబడిపోయాడు ఇది అందరికీ సాధ్యమయ్యే పనికాదు కుడుమిస్తే పండగగా భావించే రోజుల్లో కాళోజీ వ్యక్తిత్వం ప్రజాపక్ష రచయితలందరికీ శిరోధార్యం కావాలి ఎందుకంటే 'కాళోజీ కథల్లో 'అనుభవంలేని ఆందోళనలో' కొట్టుమిట్టాడుతున్న ఓ గుడ్లగూబలాగా సర్వత్రా 'అంధకార సామ్రాజ్యాన్ని స్థాపించవలెననే పవిత్ర కార్యసాధనలో జీవితాల్ని అర్పించుకునే' వాళ్లున్న మన సమాజంలో కాళోజి వ్యక్తిత్వ వికాసం ఓ చిరుదివ్వెగా ఉపయోగపడాలి ఎందుకని? ఒకప్పుడు ఆయన మిత్రులు కొందరు 'నలుగురితో విందులో కూర్చున్నా, వినోదంలో కూర్చున్నా నువ్ పబ్లిక్ విషయాలే మాట్లాడతావ్ ఎంతసేపూ, ఎందుకు?'

అని ప్రశ్నించినప్పుడు కాళోజీ యిచ్చిన సమాధానం
ఒక ఒరపిడి రాయిగా యువతరం భావించాలి

కాళోజీ సమాధానం యిది 'సమాజంతో సంబంధం లేదనే బతుకు మీరెట్ల బతుకుతారు? అన్నాడాయన! అందుకే పార్టీల కన్నా ఎక్కువగా 'సమాజాన్ని' గురువుగా భావించాడు కనుకనే కాళోజీ స్పందన కూడా సమాజ బద్ధమై ఉంటుంది తరచుగా బహుశా ఈ దృష్టితోనేమొ తనకు 'పార్టీత్వం' (పాతివ్రత్యంలాగా) అంటూలేదని ఓ కొత్త పదాన్ని కూడా సృష్టించాడు! ప్రజల గొడవనే తన 'గొడవ'గా భావించుకుని ఇప్పటి దాకా మన మధ్య మెసలుతూ వచ్చిన మన ప్రియమైన 'అతిథి' కాళోజీ! అందుకే జీవన సంధ్యలోని చివరి క్షణాలను కూడా వర్ణిస్తూ ఏనాడో ముందుగానే స్వగతం' పలికినవాడు కాళోజీ

అతిథివోలె వుండివుండి
అవని విడిచి వెళ్లుతాను
నే పాకని ఎత్తులేదు
నే జారని లోతులేదు
కంటకాల మధ్య నేను
కాలినడక నడిచినాను

ఈ 'స్వగతం'లో కాళోజీ మొత్తం మానవుని జీవన సరళిని నిత్యచక్రగతిలో ముప్పయి పాదాల్లో బలంగా, బరువుగా, పారంగా గుణపారంగా, అనుభవాల మూటగా తరతరాలముల్లెగా మనకి అందించాడు! అందుకే మనమూ' కలకండము పండిన నీదు మాధురి అని ప్రజాకవి కాళోజీకి మనసార నివాళులర్పిద్దాం తెలుగు వీరుల ఓరుగంటికీ రుద్రుల, వీరభద్రుల కాకతీయ శౌర్యప్రతాపానికి వారసత్వంగా కొనసాగింపుగా జరుగు తున్న ప్రజానుగుణ్యమైన ఉద్యమాలకు యిది కాళోజీ సంస్మరణ నివాళి!

❖ ❖

# నిరసనకు నిలువెత్తు ప్రతీక కాళోజి

- కోవెల సంపత్కుమారాచార్య

అన్యాయాన్నీ అధర్మాన్నీ ఎదిరించటంలో, ధిక్క రించటంలో స్వపరభేదం లేని వ్యక్తులు చాలా అరుదుగా వుంటారు వరంగల్లును గురించి భావించగానే కళ్ల ముందు కళ్లల్లో మిణుగురులతో, కన్నీళ్ళతో సాక్షాత్కరించే ఆ అరుదయిన వ్యక్తి కాళోజి వరంగలంటేనే నిరసనధ్వనికి ప్రతీక ఆ ప్రతీకకు ప్రతిరూపం కాళోజి దాదాపు నా పన్నెం డవ ఏటినుంచి, అప్పుడప్పుడే లోకం తెలియటం మొదల యినప్పటినుంచి ఇప్పటిదాకా ఆయన్ను చూస్తుంటే ఆయన విలక్షణ వ్యక్తిత్వం అనవరతం నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేస్తూనే ఉంది ఎక్కడా బీటలువారని, రాజీ పడని వ్యక్తిత్వం ఆయనది అదే అన్ని దారులవారికీ ఆయన్ను ఆత్మీయుణ్ణి చేసింది

ఆయన్ని గూర్చి అనుకొనే ప్రతిసారీ నా చిన్ననాట మనస్సులో నాటుకొన్న ఒక విలక్షణమయిన దృశ్యం కళ్ల గడుతూ ఉంటుంది ఆయన్ని నిజాం ప్రభుత్వం, వరంగల్‌లో ఉండటం మీద ఆంక్ష పెట్టి అయన్ని తరిమేసింది ఆయన వరంగల్ విడిచి వెళ్ళే రోజు టాంగాలో వరంగల్ స్టేషన్‌కు వెళ్తున్నాడు మేమందరం చిన్న పిల్లగాళ్లం ఆ టాంగా వెనుక ఉరుకుతున్నం చేతులు ముందుకు సాచి పోవద్దు పోవద్దు అంటూ ఒర్లుతున్నం ఆయన చేతులు సాచి ఆగండిరా, ఆగండిరా అని అరుస్తున్నాడు ఆయన కళ్ళలోంచి నీరుగారుతున్నది ఈ ఉరుకుడుల్లో ఈ పోరగాళ్లకు ఏ బండి టక్కరయితుందో, ఏ బండి కింద పడి చస్తరో అని ఆయన భయం అంతలో ఎవరో పెద్ద వాళ్లు మమ్మల్ని ఆపి పక్కకు గుంజుకపోయారు టాంగా వేగంగా పరుగెత్తింది కనుమరుగయింది ఆనాడు మా మనస్సులు ఎట్లా ఆలోచించాయో, ఏమనుకున్నాయో గాని, ఆ తరువాత ఆ దృశ్యాన్ని భావించినప్పుడు సీతా దేవిని అడవిలో వదిలిపెట్టి పోతున్నప్పుడు, ఆ పోతున్న రథాన్ని చూస్తూ ఏడుస్తున్న సీతమ్మ కళ్ళుగట్టేది అప్పుడు

మాకు సాగుతున్న ఉద్యమాన్ని గూర్చి రాజకీయాల గూర్చీ అవగాహన లేదు గాని, ఆయన వరంగల్ విడిచిపోతున్నాడంటే ఏదో దిగులు ఏదో ఏడుపు

ఆ రోజుల్లోనే మొగిలయ్యను రజాకార్లు క్రూరంగా హత్యచేశారు వరంగలంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది పరామర్శించటానికి అప్పటి నైజాం ముఖ్యమంత్రి మీర్జా ఇస్మాయిల్ వస్తున్నాడని వార్త వరంగల్‌కు కాళోజి రాలేదు నిషేధం వుంది అందుకని మీర్జా ఇస్మాయిల్‌కు ఒక బహిరంగ కవిత ప్రకటించాడు ఆయన వరంగల్ వచ్చి ఏం చూసినట్టు? ఏం తెలుసు కొన్నట్టు? 'కోట గోడల మధ్య ఖూని జరిగిన చోట/ గూండాల గుర్తులు గోచరించినవా?' అని అనేకంగా జరిగిన ఘోరాలను ప్రస్తావించి చివరకు కాలనుగుణ్య మగు కాళోజి ప్రశ్నలకు / కళ్లెర్రగా చేసి ఖామోషు అంటావ? అని నిగ్గదీసాడు ప్రజాపరంగా ఎత్తిన గొంతును అణిచివేయటం, నొక్కి వేయటం పరిపాలకులకు తరతరాలుగా అలవడిన విద్య 'ఖామోష్ అంటావ్? అనటం అందుకే కాళోజి ఏది ప్రశ్నించినా అది కాలాను గుణ్యంగా ఉంటుంది అందుకు కారణం ఆయన కాలానికి నిత్యం ప్రతిస్పంది అయన మాట, ఆయన కవిత్వం ఆ స్పందనకు అభివ్యక్తి రూపం అందుకే ఒక సారి, 'కాళోజీ మాట ఇదీ కల కాదూ, కత కాదూ, కాలమే పలికించెరా!' అన్నాడు అయన్ను తలుచుకొన్నప్పుడల్లా ఈ పంక్తులు చెవుల్లో మారుమోగుతూ ఉంటయి నిజానికి ఆయిన కంఠం ఆయనది కాదు అది కాలకంఠం

అయన అంధ్ర మహాసభలో పనిచేసాడు కాంగ్రెసులో పనిచేసాడు అనేక ఉద్యమాల్లో పాల్గొన్నాడు ఆయన ఎన్ని చేసినా, ఎక్కడ పని చేసినా, మౌలికంగా ఆర్య సమాజీయుడు తెలంగాణా జన జీవన చైతన్యానికి ఆర్య సమాజం పాటుపడిన తీరు, విధర్మాన్ని ఎదిరించిన తీరు, స్వధర్మాన్ని సంస్కరించుకొన్న తీరూ ప్రత్యేకంగా పరిశీలించవలసిన అంశం అది చేసిన గొప్ప కృషి ప్రచారం లోకి రాని కారణంగా మరుగున పడిపోయింది నిజాం నవాబు కారు మీద బాంబు విసిరి విఫలుడయిన నారా యణరావు ఆర్యసమాజీయుడు ఈ మొదలయిన కార్యకలాపాలన్నీ ఈనాడు వెలుగులోకి రావలసిన అవసరం, యువతరం తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది అట్లాంటి ఆర్య సమాజీయుడు కాళోజి ఆర్య సమాజం నుండి దూసుకువచ్చిన వాగాగ్ని కాళోజి ప్రజా వాణి అ నాళ్లలో దాశరథి కాళోజి మా విప్లవ వీరులు

హిందూ ముస్లింలు తన రెండు కళ్లు అంటూ నిజాం ప్రభువు ప్రవేశపెట్టిన సంస్కరణలలోని కుట్రలను కూహకాన్నీ ఎండగట్టిన కంఠం కాళోజి కంఠం ఆ సంస్కరణలలో దాగి ఉన్న నిజాం పక్షపాతాన్ని బయట పెట్టింది కాళోజి కవిత నిజానికి కాళోజి కవిత్వం రాయ లేదు తాను కవి గా సుప్రతిష్ఠతుడు కావాలన్న ఉబలా టమూ లేదు కాని చిత్రమేమిటంటే ఆయన పలికింది కవిత్వమయింది జనం గొడవ తన గొడవ అయింది ఆయన ఏ పార్టీ వాడన్నది ప్రధానంకాదు నిజానికి ఆయనే ఏ పార్టీ వాడు కాదు ప్రజాక్షేమం కోసం కృషి చేసే అన్ని పార్టీలూ ఆయనవే ప్రజా వ్యతిరేక చర్యలను చేసే ప్రతి పార్టీకీ ఆయన విరోధి రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డిల అన్నయ్యలను కమ్యూనిస్టులు హత్యచేసన ప్పుడు అ క్రౌర్యాన్ని నిరసించింది కాళోజీ కంఠమే ప్రజా ప్రతినిధులను ఎన్నుకొనే సందర్భంలో ' ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి' అంటూ ప్రజలకు ఉద్బోధించిందీ కాళోజి కంఠమే 'ఖరము పేరుతో ఒక సంవత్సరముండాలా?' అంటూ వెక్కిరించిందీ కాళోజీ కంఠమే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పాటుకావటంలో మహామహుల కుట్రలను బహిరంగపరుస్తూ శాసనసభలో గొంతు చించుకొని అరిచిందీ కాళోజీ కంఠమే ఇట్లా ఎన్నయినా సన్నివేశాలు కాళోజీ ప్రతిస్పందనకు ఉదాహరించుకో వచ్చు ఇందుకు ఆయన వయస్సుతో నిమిత్తం లేదు నక్సలైట్ల ఉద్దేశ్యాన్ని ఆయన ఎంత అభిమానిస్తాడో, వారి కార్యాచరణలోని క్రూరత్వాన్నీ అంతగానే నిరసిస్తాడాయన ఓట్లను వ్యతిరేకించి, ఓటువేసిన వాళ్ళను శిక్షిస్తామన్న నక్సలైట్లను తాను ఓటువేసి, నన్ను శిక్షించండి అంటూ ఎదురుతిరిగిన వ్యక్తిత్వం ఆయనది ఓటు హక్కును ఉపయోగించుకోవటం ప్రతి పౌరుని హక్కు అందుకే ఆయన ప్రజాస్వామికంగా పౌర హక్కుల కోసం చివరి శ్వాస పీల్చేదాకా పోరాడుతూనే ఉన్నాడు

చైనా భారతదేశం మీద దురాక్రమణ చేసిన ప్పుడు, పాకిస్తాన్ అనవసర యుద్ధం చేసినప్పుడూ అయన

'ఖామోషు' కాలేదు 'తుది విజయం మనది నిజం, కలం కుంచె కదలాడెన్' అంటూ పుంఖానుపుంఖంగా కవితలను వెలువరించాడు ఆయన కవితల్ని తొలినాళ్లనుంచి చివరి దాకా ఒక కాలక్రమంలో గుదిగుచ్చితే దేశం ఉద్యమాల నడవడికలు అవగాహనకు వస్తయి

ఆయన కేవలం మాటలతో సరిపెట్టుకొన్నవాడు కాదు ఎమర్జన్సీ రోజుల్లో ప్రహ్లాదుడి కథను తొలి తిరుగు బాటుదారు కథగా ప్రచారం చేసిన వాడు కాళోజి మరి సాహిత్య రంగంలో కథలూ పాటలూ రాయటమే కాక, అనేక సాహిత్యసంస్థలను నిర్వహించి, అనేక మంది యువ రచయితలకు ప్రోత్సాహం కలిగించిన క్రియాశీలి వానమామలై వరదాచార్యులుగారి తొలి కవితా సంకలనం 'మణిమాల'ను వెలుగులోకి తెస్తూ వరంగల్లు రామలింగేశ్వరాలయంలో ఆయన నిర్వహించిన సభలో నేను ఉండటం నాకు విలక్షణమైన అనుభవం ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు పాములపర్తి సదాశివరావుతో కలిసి తెలంగాణా ప్రత్యేక సంచిక వెలువరించాడు విశాలాంధ్ర కావాలనీ అన్నారు ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణాకు బహుముఖాలుగా జరుగుతున్న అన్యాయాలను నిరసిస్తూ ప్రత్యేక తెలంగాణా కావాలనీ అన్నారు మంచికోసం పాటు పడటం చెడును నిరసన పూర్వకంగా ఎదిరించటం కాళోజీ మూర్తిమత్వం ఆయన పరమపదించాడంటే నమ్మబుద్ధి కావటం లేదు ఎందుకంటే, భౌతికంగానే తప్ప ఆయన మండించిన జన చైతన్యానికి మరణం లేదు ఆయన అమృతుడు ఆయన ముందు పిల్లగాణ్ణి జోహార్లు అంటే 'ఎందుకురా' అంటాడేమో!

❖ ❖ ❖

# ఒరిగిన ఓరుగల్లు కోట స్తంభం

- వెల్దాల చంద్రశేఖర్

ఓరుగల్లు పేరు వినగానే మనకు వెంటనే స్ఫురించేది కాకతీయులు ఆ తరువాత గుర్తుకువచ్చేది ప్రజాకవి కాళోజి నారాయణరావే ఊహ తెలిసినప్పటి నుంచి ఆయన అస్తమించేవరకు 88వ పడిలో పడినా కూడా కాళోజి నిత్య ఉద్యమ నెలబాలుడే పండు ముదుసలి వయస్సు ఆయన దేహానికే తప్ప ఆయన ఆలోచనలకి ఎప్పుడు పదహారేళ్ళ యువకుని ఉడుకు రక్తమే అవతలివాడు ఎంతటి ఉన్నతస్థితిలో ఉన్నా సగటుమనిషి హోదాలో స్పందించడం, నిలదీయడం, ఎదిరించడం కాళోజి లక్షణం ఎప్పుడూ రాజ్యహింసను నిలదీసే గళమే కాకుండా విప్లవం ముసుగులో నక్సల్స్ చేసే హింసపై కూడా కాళోజి ఎదురుతిరిగి నిలదీసిన ఉదంతాలెన్నో కాళోజి మావాడే నని చెప్పుకునే విప్లవకారులకు కూడా అర్థంకాని కొరకరాని కొయ్యగా ఎన్నో పర్యాయాలు ఈయన ఎదురుతిరిగారు 1994 శాసనసభ ఎన్నికల సమయంలో ఓటింగ్ బహిష్కరించమని పీపుల్స్ వార్ పిలుపునిచ్చింది ఓటు వేయాలా వద్దా అనేది పౌరునికి రాజ్యాంగంనుంచి సంక్రమించిన స్వేచ్ఛాయుత హక్కు దీనిని వద్దనడానికి నక్సలైట్లు ఎవరనికాళోజి ఎదురుతిరిగారు ఓటు వేయడానికి నేను వెళ్తున్నాను, మీకు చేతనైతే నా చేయి నరకండని కాళోజి చేసిన ప్రకటన బ్రిటిష్ సైనికుల తుపాకీ తూటాలకు ఎదురెళ్ళి కాల్చండని ఎదచూపిన లాలాలజపతిరాయ్‌ని తలపింప చేస్తుంది అలాగే ప్రధానమంత్రి పి వి నర్సింహారావు హయాంలో కేంద్ర ప్రభుత్వం 1992వ సంవత్సరంలో కాళోజికి పద్మ విభూషణ్‌ను ప్రకటించింది సర్కార్ కితాబును తీసుకో వద్దు తిరస్కరించండని విప్లవకవి వరవరావుతో పాటు మరెందరో కాళోజికి సూచించారు పద్మవిభూషణ్ యిస్తా నన్నవాడు (పివి), వద్దన్నవాడు (వివి) ఇద్దరు నా వారే అందుకే తీసుకుంటున్నానని వద్దన్నవారి వాదనను సున్ని

తంగా తిరస్కరించా డాయన గత 2001 డిసెంబర్ 28వ రాత్రి హన్మకొండ పోలిస్‌స్టేషన్‌ను నక్సలైట్లు పేల్చివేయగా తెల్లారేసరికి నలుగురిని ఎన్‌కౌంటర్ పేరిట కాల్చి చంపినప్పుడు కూడా కాళోజి తీవ్రంగా స్పందించారు పోలీసులు వచ్చి నన్ను చంపేసి కూడా ఎన్‌కౌంటర్‌లో కాళోజి హతమన్నా ఆశ్చర్యం లేదని ఆయన వ్యాఖ్యానించడం అప్పట్లో పోలీసు ఉన్నతాధికారుల గొంతులో వచ్చి వెలక్కాయపడ్డట్టు చేసింది అన్యాయాన్ని ఎదురించే వాడే నాకు ఆరాధ్యుడని కాళోజి పదే పదే వ్యాఖ్యానించేవారు తెలంగాణాకు ప్రత్యేక రాష్ట్రం కావాలన్నది కాళోజి చిరకాల వాంఛ తెలంగాణా రాష్ట్ర సమితిని ఏర్పాటుచేసే ముందు కె చంద్రశేఖర్‌రావు కాళోజి నారాయణరావు ఆశీర్వాదం తీసుకున్నాకే పార్టీని ప్రకటించారు చంద్రశేఖర్‌రావు పార్టీ పెట్టడంపై పలు విమర్శలు వచ్చినప్పుడు ఆయన ఎవరన్నది నాకనవసరం, అన్యాయాన్ని ఎదురిస్తానంటున్నాడు అందుకే నా అండ ఉంటుందన్నానని కాళోజి ప్రకటించారు పీపుల్స్‌వార్‌తో ప్రభుత్వం చర్చలు జరిపి తెలంగాణా ప్రజలు స్వేచ్ఛాయుత జీవనం కొనసాగించాలని కాళోజి ముందునుంచి అభిలషించారు చర్చలు ఎలా జరపాలి ఎవరు జరపాలని మీమాంస తలెత్తినప్పుడు మధ్యవర్తిగా నక్సల్స్ వద్దకు తాను వెళ్తానని కాళోజి ముందుకు రావడంతో రాష్ట్రప్రభుత్వానికి స్ఫూర్తి కలిగి చర్చల ప్రక్రియకు శ్రీకారం చుట్టేందుకు దోహదపడింది కూడా ఈయనే 1993లో చింతపల్లి ఎమ్మెల్యే బాల్‌రాజ్‌ను నక్సలైట్లు కిడ్నాప్‌చేసి, వరంగల్ సెంట్రల్‌జైల్లో ఉన్న వార్ అగ్రనేత క్రాంతి రణదేవ్‌ను వదిలిపెట్టమని డిమాండ్ పెట్టారు అప్పుడు జైలునుంచి బయటికి రానని క్రాంతి రణదేవ్ చెప్పినట్లు రేడియోలో ప్రకటించారు సర్కార్ రేడియోపైన తనకు నమ్మకంలేదు, జైల్‌కు కాళోజిని పంపించి క్రాంతి రణదేవ్ అభిప్రాయాన్ని తీసుకోవాలని వార్ సూచించింది రాష్ట్రప్రభుత్వం చివరకు కాళోజిని జైలుకు పంపించి క్రాంతి రణదేవ్ అభిప్రాయాన్ని తెలుసుకుంది మహాకవి శ్రీశ్రీ కాళోజిని ఫ్రెంచి కవి లూయి అరగాన్‌తో1953లో మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపురం లో జరిగిన నా గొడవ పుస్తకావిష్కరణ సభలో పోల్చారు యుద్ధంలో ఫ్రాన్స్ కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయి అరగాన్ ఒక్కడే దేశంలోనిలబడి మహా ప్రజా విశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాసారు కాళోజి కూడా లూయి అరగాన్ వంటివారని శ్రీశ్రీ పేర్కొన్నారు అయితే శ్రీశ్రీ తనను పొగిడారని మొహమాటానికి కూడా వెళ్లకుండా శ్రీశ్రీని ఉద్దేశించి రష్యా ఫ్రాన్స్ యుద్ధాలపై స్పందించిన శ్రీశ్రీకి నిజాం నిరంకుశ రాక్షసత్వం కనిపించ లేదా అని కాళోజి ప్రశ్నించారు

## అన్నంటే భయమే

80వ వడిలోకి చేరిన కూడా కాళోజి నారాయణరావుకు అన్న కాళోజి రామేశ్వర్‌రావు అంటే ఎనలేని భయం కవితలు సాహితీ సదస్సులు అంటూ తిరిగే కాళోజి నారాయణరావుకు చదువుచెప్పింది పెద్దవాణ్ణి చేసింది అన్నే మా కాళన్నకు ఏమీ తెలియదు పసిపిల్లవాడు అని కాళోజి రామేశ్వర్‌రావు తనకు సాహితీ ప్రియులు 80వ సంవత్సరంలో సహస్ర చంద్రదర్శన ఉత్సవం చేసినప్పుడు వ్యాఖ్యానించారు అప్పుడు కాళోజి వయస్సు 73 సంవత్సరాలు కాళోజి పుట్టిన రెండు సంవత్సరాలకు వారి కుటుంబం మడికొండకు వెళ్ళి స్థిరపడింది అక్కడ పదిసంవత్సరాల పాటు కాళోజి నారాయణరావు విద్యాభ్యాసం చేసారు అన్న రామేశ్వర్‌రావు మడికొండలో మిడిల్‌స్కూల్ పాసై న్యాయవాద విద్య అభ్యసించేందుకు హైదరాబాద్ వెళ్లినప్పుడు ఆయనతోపాటు కాళోజి నారాయణరావు అక్కడికి వెళ్లాడు అనుక్షణం ఆయన అన్నను విడిచి ఉండేవారుకాదు హైదరాబాద్ పాతబస్తీలోని చౌమహల్ స్కూల్‌లో కాళోజి రెండోఫారంలో చేరారు అక్కడే అప్పర్ మిడిల్ స్కూల్ విద్య పూర్తిచేసారు 1938లో రామేశ్వర్‌రావు ఉర్దూమీడియంలో న్యాయవాద విద్య పూర్తిచేసి వరంగల్‌కు చేరారు వరంగల్‌కోర్టులో ఆయన న్యాయవాద వృత్తి చేపట్టారు కాళోజి ఇంటర్మీడి యట్ రెండో సంవత్సరంలో ఉన్నప్పుడు క్షయవ్యాధిగ్రస్తులైన సందర్భంలో అన్న రామేశ్వర్‌రావు పసిపిల్లవానికంటే ఎక్కువగా చూసుకున్నారు తమ్ముడి అస్వస్థత కలిగించిన దిగులుతో రామేశ్వర్‌రావు కృంగిపోయారు అన్నదమ్ముల ప్రేమాను రాగాలకు, అనుబంధానికి, ఆదర్శప్రాయ సోదరప్రేమకు కాళోజి సోదరులు పర్యాయ పదాలు చికిత్సకోసం తమ్ముడిని హైదరాబాద్‌లోని ఉస్మానియా

ఆసుపత్రిలో రామేశ్వర్‌రావు చేర్పించారు అక్కడ ఏడాది న్నర పాటు కాళోజి క్షయవ్యాధికి చికిత్స చేయించు కున్నారు మాట్లాడితే ఆరునెలల్లోనే మరణిస్తావని డాక్టర్లు అంటున్నారు అని కాళోజి రామేశ్వర్‌రావు మిత్రులతో మాట్లాడే తమ్ముడిని మందలిస్తే మాట్లాడకపోతే ఆరు రోజుల్లోనే మరణిస్తానని కాళోజి మొండి సమాధానం ఇచ్చేవారు తనకు చికిత్స జరిపించి వెన్నంటి ఉన్న అన్నంటే అప్పటినుండి కాళోజికి అపారమైన ప్రేమ అన్నతో అనుబంధం కాళోజికి జీవితంలో మరపురాని అనుభవంగా మిగిలింది తర్వాత కాళోజి ఒక ఊపిరి తిత్తితోనే మృతి చెందేవరకు పోరాడారు అన్నదమ్ములిద్దరూ సాహితీ క్షేత్రంలో మణిపూసలుగా భాసిల్లారు అన్న రామేశ్వరరావు ఉర్దూ సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తే, తమ్ముడు నారాయణరావు తెలుగు సాహిత్యానికే కొత్త ఒరవడి దిద్దాడు

## పౌరహక్కులకు బలమైన గళం

పౌరహక్కులను కాపాడే విషయంలో కాళోజి నారాయణరావు బలమైన గళంగా నిలిచేవారు ఎక్కడ ఎన్‌కౌంటర్లు జరిగినా, పౌరహక్కులకు భంగం వాటిల్లినా హక్కుల నేతలంతా కాళోజి నేతృత్వంలోనే ఉద్యమించే వారు అనేకమార్లు పౌరహక్కుల నేతలకు గుర్తుతెలియని వ్యక్తుల రూపంలో బెదిరింపులు వచ్చినప్పుడు రాష్ట్ర పౌర హక్కుల సంఘం నాయకులు కాళోజితో కలిసి పోలీసు అధికారులకు అనేకమార్లు ఫిర్యాదులు చేసారు 1998 సంవత్సరం డిసెంబర్ 29వ తేదీన వరంగల్ నగరంలో జరిగిన తెలంగాణా ఉద్యమ మహాసభలో కాళోజి కీలక భాగస్వామ్యం వహించారు మూడు దశాబ్దాల తెలంగాణ ఉద్యమాన్ని తారాస్థాయికి తెస్తూ ఆ రోజు వరంగల్‌లో భారీ ఎత్తున తెలంగాణా సదస్సు జరిగింది వరంగల్ డిక్లరేషన్ పేరిట తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం సాధనకోసం ఈ సభ ద్వారా ఉద్యమకర్తలు శ్రీకారం చుట్టారు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంగా అంత వరకు వినిపిస్తూ వచ్చిన నినాదం కాస్తా వరంగల్ డిక్లరేషన్ తో ప్రజాస్వామ్య తెలంగాణాగా మారింది ప్రజాకవి గద్దర్, విప్లవ రచయిత వరవరరావు తదితరులు ఆ సభలో పాల్గొన్నారు పోలీసుల నిర్బంధం, ఎన్నో అడ్డంకుల మధ్య కాళోజి నేతృత్వంలో జరిగిన ఆ సదస్సు చరిత్రలో నిలిచిపోతుంది వరంగల్ ఉద్యమానికి పూర్వరంగచరిత్ర ఎంతో ఉంది భూమికోసం, భుక్తికోసం, విముక్తికోసం ఓరుగల్లు గడ్డపై జరిగిన ఉద్యమాలన్నింటిలో వరంగల్ డిక్లరేషన్ సభ చిరస్థాయిగా నిలిచిపోతుంది దేశ్‌ముఖల కుట్రలతో చిందిన బందగీ రక్తంతో తెలంగాణా తడిసింది రజాకార్ల అమానుష చర్యలకు ఎదురొడ్డి పోరాడిన కాళోజి నారాయణరావు ఈ సభకు ప్రధాన పాత్రధారి అయ్యారు

❖ ❖ ❖

# ఆర్ద్రహృదయుడు కాళోజి

- అంపశయ్య నవీన్

ప్రజలందరి గొడవల్ని తన గొడవగా చేసుకొని అన్యాయాన్ని ఎదిరించిన వాడే నాకు ఆరాధ్యుడని అను క్షణం ఆలపిస్తూ ప్రజల పక్షాన నిలిచి ప్రజాకవిగా ప్రజల హృదయాల్లో స్థిరపడిపోయిన కాళోజి నారాయణరావు భౌతికంగా ఈ ప్రపంచంలోంచి వెళ్ళిపోయారు

ఇప్పటి కర్ణాటకరాష్ట్రంలోని బీజాపూర్ జిల్లాలోని రట్టిహళ్ళి అనే గ్రామంలో 19 [illegible] 1914న జన్మించిన కాళోజి అసలు పేరు రఘువీర్ నారాయణ్ లక్ష్మీకాంత్ శ్రీనివాస రావు రాం రాజాకాళోజి ఈ పేరు చాలా పొడవైపోయిందనుకున్నాడేమో, కాళోజి తన పేరును కాళోజి నారాయణ రావుగా మార్చుకున్నాడు ఆయన తల్లి రమాబాయమ్మ కన్నడిగుల ఆడపడుచు తండ్రి కాళోజి రంగారావు మహా రాష్ట్రీయుడు వీళ్ళకు ఇద్దరూ కొడుకులే కాళోజి నారాయణరావు కంటే ఆరేళ్ళు ముందుగా పుట్టిన కాళోజి రామేశ్వరరావు 'షాద్ అన్న కలం పేరుతోఉర్దూ కవిగా ప్రఖ్యాతుడు నారాయణరావు పుట్టిన ఐదారునెలలకే ఆయన తల్లి రమాబాయమ్మ చనిపోయింది అప్పట్నించి ఆయనను ఆయన అన్నగారైన రామేశ్వరరావుగారే పెంచి పెద్ద చేశారు నా ఏడవ నెలలోఅన్నగారి భుజాలమీద ఎక్కిన నేను నా 80వ ఏటకూడాఆ భుజాలమీద అట్లనే ఉన్న ఆయన అట్లనే మోస్తున్నాడు' అని 1995లో ప్రచురించబడిన "ఇదీ నా గొడవ" అన్న తన ఆత్మకథలో కాళోజి చెప్పుకున్నాడు కాళోజి పూర్వీకులు కొందరు వరంగల్ జిల్లాలోని మడికొండకు చెందిన వాళ్ళు కావడం వల్ల 1916లో కాళోజి వాళ్ళ కుటుంబీకులు తమ నివాసాన్ని మడికొండకు మార్చారు కాళోజి తల్లి మాతృభాష కన్నడం, తండ్రి మాతృభాష మరాఠీ కావడం వల్ల చాలా చిన్న తనంలోనే కాళోజికి ఈ రెండు భాషలు పట్టుబడ్డాయి వరంగల్‌కు నివాసం మార్చడం వల్ల ఆయనకు తెలుగు భాషలో బాల్యం నుండే ప్రవేశం లభించింది ఇలా ఆయనకు కన్నడం, మరాఠీ, తెలుగు, ఉర్దూ లాంటి అనేక భాషలు చాలా చిన్న వయస్సులోనే కరతలామలక మయ్యాయి

చిన్నప్పట్నించి కాళోజిది ప్రశ్నించే స్వభావం ధిక్కార మనస్తత్వం ఆయనకు చాలా చిన్నతనంలోనే ప్రహ్లాద చరిత్ర విపరీతంగా నచ్చింది ప్రహ్లాదుడి పాత్ర ఆయనకు ఆదర్శపాత్రగా మారింది తండ్రి హిరణ్యకశపుడి నిరంకుశత్వాన్ని అంత చిన్న వయసు లోనే ఎదిరించిన ప్రహ్లాదున్ని గూర్చి అనేకసార్లు చెబుతుండేవాడు ప్రహ్లాదుడు అన్యాయాన్ని ఎదిరించాడు అన్యాయాన్ని ఎద రించినవాడే నాకు ఆరాధ్యుడు అన్నమాటను కాళోజి ఎన్ని సభల్లో ఎన్నిసార్లు చెప్పాడో లెక్కలేదు

కాళోజి చాలా చిన్నతనం నుండే కవిత్వం రాయడం మొదలెట్టాడు నా చుట్టూ జరుగుతున్న సంఘటనలే నా కవిత్వానికి ప్రేరణ అంటూ కాళోజి తన మొదటి కవితా సంకలనం 'నా గొడవ'లో రాసుకున్నాడు

కవిగా కాళోజికి విశేషమైన కీర్తి ప్రతిష్ఠల్ని తెచ్చి పెట్టిన పుస్తకం నా గొడవ' ఇది 1953లో ప్రచురించబడింది ఈ పుస్తకాన్ని 1953 జనవరి 12న అలంపురంలో ఆవిష్కరిస్తూ మహాకవి శ్రీశ్రీ అన్న మాటలు చిరస్మరణీయాలు

"కాళోజి నిఖిలాంధ్ర కవి అందులో ఎట్టి సందేహం లేదు ఆయనకు తెలంగాణా అంచులు గోడలుగా అద్దు నిలువజాలవు ఆయన తన ఖండకావ్య సంపుటానికి 'నా గొడవ' అని పేరు పెట్టారు అదే కవియొక్క ప్రతిభ అదే కవి చెప్పవలసిందీను ఇది కవి గొడవగానే అనిపించినప్పటికీ చదివిన వారికి ఇది తమ గొడవగానే అర్థమవు తుంది ఇది విశాల జగత్తు ప్రజలందరిగొడవ" అన్నాడు శ్రీశ్రీ ఆనాటి నుండి కాళోజి ప్రచురించిన ప్రతి కవితా సంకలనానికి 'నా గొడవ అనే పేరే పెట్టాడు

కవిగా కాళోజిని మరొకరితోపోల్చాలంటే మనకు వెంటనే వేమన గుర్తొస్తాడు వేమనలాగే తన జీవితానుభవాన్ని కవిత్వంగా మలచినవాడు కాళోజి వేమనలాగే అత్యంత సులభశైలిలో కవితల్ని రాసి జన సామాన్యంలోకి చొచ్చుకుపోయిన వాడు కాళోజి సామాన్య ప్రజల బాధల్నీ, గాథల్నీ, కలలనూ, కన్నీళ్ళనూ, ఆనందాన్నీ, విషాదాన్నీ,

వాళ్ళకర్థమయ్యే సులభశైలిలో కవితలుగా చెప్పారు కాబట్టే అటు వేమన ఇటు కాళోజి ప్రజల గుండెల్లో పలికారు

'ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు
చూడ జూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా"

అని వేమన అంటే ఆ మాటలు వెంటనే మన గుండెల్లో ఎలా పలికాయో

"అన్నపురాశులు ఒకచోట
ఆకలి మంటలు ఒకచోట
కమ్మని చకిలాలొకచోట
గట్టి దవడలింకొకచోట" అని కాళోజి అన్నప్పుడు కూడా అలాగే మన గుండెల్లో పలికాయి

'ప్రతీ ఛాదస్తం దేవుడే/ ఏదో ఒక రూపంలో గోకుడే'

'కుటిలమతులు దేబెముఖాలు / జగతిలో రెండే రెండు రకాలు'

'కనుల గుసగుస కనులు వినగల్గినాక / పలుకుల తేనియలు చిలకకుంటేమి?'

'మనసూ మనసూ కలిసి మన గల్గినాక / దేహాల దాహాలు తీరకుంటేమి?'

'ఓటిచ్చినప్పుడే ఉండాలి బుద్ధి / ఎన్నుకొని తలబాదు కున్ననేమగును'

'చెమ్మగిల్లిన కన్నులలో / కమ్మలెన్నో చదివినాను
చాపచింపు సామ్రాజ్యం / కోడిగుడ్డు కోహినూరు
పాటిమన్ను ప్లాటినం / బస్సు సీటు బ్రహ్మరథం'
ఏదైతేం ఏదైతేం / పోటీ పడి కాటులాడ'

'ఉదయం కానేకాదనుకోవడం నిరాశ ఉదయించి అట్లానే ఉంటుందనుకోవడం దురాశ'

లాంటి కాళోజి నాగొడవ లో చెప్పిన ఎన్నో కవితా సూక్తులు అక్షర సత్యాలు అల్పాక్షరాల్లో అనంతా ర్థాన్ని నింపగల్గినవాడే మహాకవి కాళోజి కవిత్వంలో ఈ మహా కవిత్వ లక్షణం ఉంది

కాళోజి కేవలం కవి మాత్రమే కాదు అయన ఉద్యమ కారుడు స్వాతంత్ర్యానికి పూర్వం అయన నైజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా రజాకార్ల పాశవిక మతో న్మాదానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటంచేశాడు అనేక సార్లు జైలుకెళ్ళాడు అంధ్ర మహాసభ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొన్నాడు స్వాతంత్ర్యం తర్వాత పౌరహక్కుల పోరాటా ల్లోనూ ఆయన క్రియాశీల పాత్రను పోషించాడు ఎక్కడ అన్యాయం జరిగినా అక్కడ కాళోజీ గళం వినిపిం చేలా చేశాడు ఎనభయ్యోవడిలో చేరాక కూడా ఆయన తన పోరాటాన్ని విరమించలేదు తెలంగాణా అంటే ఆయనకు ఎనలేని అభిమానం అనుక్షణం ఆయన గళంలో, కలంలో తెలంగాణా ప్రజల గుండె చప్పుళ్ళు వినిపించేవి

కాళోజి అత్యంత ఆర్ద్రహృదయుడు ఏ కొంచెం బాధకల్గినా ఆయన కన్నులు కన్నీళ్ళను వర్షించేవి ఆయన అచ్చమైన ప్రజాస్వామ్యవాది ప్రజాస్వామ్య భావనను తన రక్తంలో జీర్ణించుకున్న వ్యక్తి 'నీ అభిప్రాయాలతో నేను ఏకీభవించకపోవచ్చు కానీ నీ అభిప్రాయాల్ని స్వేచ్ఛగా ప్రకటించే నీ హక్కుల కోసం అవసరమయితే నా ప్రాణాలైనా ఇచ్చి పోరాడతాను' అన్న వాల్టేర్‌ను కాళోజి ఎప్పుడూ గుర్తు చేస్తుండేవాడు అలాంటి ప్రజాస్వామ్య వాదికి ఆర్ద్ర హృదయుడికి, మానవతావాదికి, ఆ మహా మనిషికి నా జోహార్లు

# ప్రపంచం గొడవనే తన గొడవగా భావించిన మరో 'వేమన మహర్షి'

- కాలువమల్లయ్య

ప్రపంచం బాధ శ్రీశ్రీ బాధయినట్టే ప్రజల గొడవంతా తన గొడవగా భావించి కవితా ప్రస్థావం కొనసాగించిన ప్రజాకవి కాళోజీ  అతడు ప్రజాకవి మాత్రమే కాదు ప్రజలమనిషి అన్ని ప్రజా పోరాటాలతో మమేకమై జీవితాన్ని సార్థకం చేసుకున్న ధన్యజీవి ఓ మనిషి ఎంత కాలం బతికాడన్నది ముఖ్యం కాదు ఎలా బతికాడన్నదే ముఖ్యం ఎనభై తొమ్మిది సంవత్సరాలు ప్రజల మనిషిగా ప్రజల కష్టాలనే తన కష్టాలుగా భావించి ప్రజలకోసం రాయడమే కాకుండా ప్రజల కోసమే బతికి బతుకు సార్థకతను చేకూర్చుకున్న మహర్షి సృజనాత్మకత నిబద్ధత సామాజిక బాధ్యత కరువైన పండిత కవులు, రచయితలు నియమాల చాటున దాక్కున్నట్లుగా కాళోజీ ఏవేవో నియమాల బురఖాల కింద దూరలేదు తన అవేశాన్ని, ఆవేదనను ఆలోచనను, స్పందనను ప్రజా పక్షపాతం వహించి కవిత్వీకరించాడు

ఏ దేశమురా నీది ఏమి భాషయురా
ఈ భాష ఈవేషమెవరి కోసమురా
అన్య భాషలు నేర్చి ఆంధ్రమ్ము రాదంచు
సకలించు ఆంధ్రుడా చావవెందుకురా

అని 1942లోనే తనభాష, దేశాభిమానములను చాటుకున్నాడు

తెలంగాణ వేరైతే దేశానికి అపత్తా
తెలంగాణ వేరైతే తెలుగుబాస మరుస్తార?

అని 1970 ప్రాంతంలోనే ప్రశ్నించాడు అదే ఆవేశంతో, ఎన్నాళ్లకు తెలంగాణ కన్నులార చూచుకొర్కె, అని తెలంగాణ చూడకుండానే కన్నుమూసాడు ఏ ప్రలోభాలకు లొంగకుండా, నిబద్ధత సడలనీయకుండా, అదే ఆవేశంతో, హృదయ స్పందనతో ప్రజల పక్షం వహించి రాస్తూ ప్రజా పక్షపాతియై జీవిస్తూ తన దీర్ఘ జీవితాన్ని సార్థకం చేసుకున్న మహాకవి కాళోజీ

మొట్టమొదటి ప్రజాకవి వేమననే కవి గాదని, కాపు కవని ఈసడించిన ప్రబంధ కవి పండితులున్న సమాజంలో కాళోజీ లాంటి వారినీ కవి గాదన్న ప్రబుద్ధులున్నారు తన కవితకున్న ప్రజాబలంతో తెలుగు దనంతో వేమన మహాకవిగా ప్రపంచ ఖ్యాతి నార్జించినట్టే కాళోజీ తన ప్రజామోద కవిత్వంతో కవిగా ఉన్నతోన్నత శిఖరాల నందుకున్నాడు ప్రజల హృదయాల్లో శాశ్వతంగా నిలిచి పోయాడు

అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు?
పరుల కష్టము జూచి పగలిపోవును గుండె
మాయమోహము జూచి మండి పోవును ఒళ్ళు
పతిత మానవు జూచి చితికి పోవును మనసు

అని పరుల కోసం పరితపించే సున్నిత హృదయం ఉంది కాబట్టే, చివరివరకూ ప్రజాకవిగా ఉండగలిగాడు ప్రజల హృదయాల్లో తిష్టవేసు క్కూర్చున్నాడు

ప్రజాశక్తి పరీక్షా సమయం
ప్రతీక్షమనకింకెన్నాళ్ళు

మానవుని మనసు మలినమైనది అని పరితపించే హృదయమున్న కాళన్న తెలుగు సమాజంలో మరో వేమన లాంటి కవి మన పండితకవులు, పీఠాధిపతులు మహా కవిలా కితాబిచ్చినా, ఇవ్వకున్నా మనకాళోజీ మహాకవే గురజాడ రాసిన దేశభక్తి గేయమొక్కటే అతన్ని మహాకవుల సరసన కూర్చొబెట్టడానికి చాలైనట్టు కాళోజీని మహాకవి అనడానికి నా గొడవ మహా గ్రంథంలో అనేక కవితలున్నాయి

ఉల్లంబు పల్లేరులు పొరలగ
కల్లబొల్లినవ్వుల వెదజల్లకు
మనిషినన్నది మరువకన్నా
మనసు వున్నది మరువకన్నా

అని తను చెప్పదలుచుకున్నదేదో సూటిగా చెపుతూ మనిషితత్వాన్ని గుర్తెరిగి మొదలుమనే కాళోజీ మనసున్న మహాకవి

కాళోజీ రాయడం మొదలు పెట్టినప్పట్నుండే ఆరు దశాబ్దాలపై కాలంగా రాసిన ప్రతి కవితలోనూ ప్రజా పక్షపాతమే కనబడుతుంది ప్రజల గొంతే వినబడుతుంది ప్రజల భాషే దర్శనమిస్తుంది

కాళోజీకి ప్రజల భాషయైన మాండలికమంటే ఎనలేని ప్రేమాభిమానాలు ఎవరి మాండలిక భాషలో వాళ్ళు రాయాలని ప్రతి సభలోనూ చెప్పాడు మాండలిక రచనలు చదివి ఉత్తరాలు రాసాడు మాండలికంలో రాయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాడు తను రాసి చూపాడు ఆ భాషకున్న బలాన్ని గుర్తించమని గొంతెత్తి అరిచాడు ప్రజల భాష మటుమాయం కాకుండా కాపాడాలని హెచ్చరించాడు

తెలంగాణ మాండలికం గూర్చి ఏ చిన్న ప్రస్తావన వచ్చినా కళ్లవెంట పటపటా నీళ్ళు వడిచేవి కాళోజీకి నా గొడవ పుస్తకం నాకిస్తూ అందులో ఇలా రాసాడు కాళోజీ

మల్లన్నా! తెలంగాణ బ్రతుకు విషయంగా, బాస విషయం గా నీకున్న ఆరాటానికి దండాలు, ఇట్లు కాళోజీ ఈ వాక్యాలను చదువుతున్నప్పుడు నాకూ పటపటా నీళ్ళు కారాయి ఆ వాక్యాల్లో ఉన్న ఆర్ద్రత, ప్రేమ నన్ను కదిలించాయి తెలంగాణ జీవితంపై భాషపై కాళన్న కున్న ప్రేమకు నా హృదయం ద్రవించింది రచనా విషయంలో కొన్ని నిర్దిష్ట నిర్ణయాలు తీసుకోవడానికి నాకా వాక్యాలు తోడ్ప డ్డాయి కాళోజీ వాక్యాలకున్న బలం అది

కాళోజీ నిఖిలాంధ్రకవి అందులో ఎట్టి సందేహం లేదు అని శ్రీశ్రీతో ప్రశంసలు పొందాడు 'కులము లేదు, మతము లేదు, గోత్రము సూత్రమును లేదు, జగమ ంతయు నొక్క తల్లి సంతతియే కాళోజీకి' అని తుమ్మల సీతారామమూర్తి రాసినా, 'కాలాలు మూడూకలిసి కవిత్వంలో తడుస్తున్నప్పుడు, అనుకోండి అక్కడెక్కడో అక్షరత్రయముంటుందని' దానినే మన తెలంగాణం కాళోజీ అంటు ందని, అని సినారె కవిత్వానికి ప్రతిరూపంగా కాళోజీని వర్ణించినా, మరో వేమనగా గురు కుల మిత్రా పొడగినా మొదట్నుంచి చివరివరకు ప్రజల గొడవనే తన గొడవగా భావించి నిర్విరామంగా కవితా తపస్సు కొనసాగించిన నా గొడవకవి కాళోజీ

వ్యవహారశిష్టత లేకున్నా
శిష్ట వ్యావహారికం దాకా వచ్చింది
మన వ్యవహారానికి లేంది
వ్యవహరించే బాసకెందుకంటా విశిష్టత?

అని 1966 లోనే ప్రశ్నించాడు కాళోజీ

కాళోజీది ఆశు కవితా మార్గమని నా గొడవలోని కవితలు చదివితే అర్థమవుతుంది తెలంగాణలోని ప్రజా కవులు, రచయితలు, తమ రచనలు సామాన్యపాఠకులకు చేరడానికి ఆశుకవితా మార్గాన్నెన్నుకున్నట్టే కాళోజీ ఎన్ను కున్నాడు భావక్లిష్టత, అన్వయ క్లిష్టత లేకుండా సూటిగా, స్పష్టంగా కవిత్వం రాసి చూపించాడు ప్రజల భాషయైన మాండలికాన్ని వదలలేదు

ఈదరానుద్ది ఈసుద్ది చరరేసుద్ది
అకుపండుద్ది ఊగుద్ది ఊగిరాలుద్ది
బతుకుపోరుద్ది పోరుద్ది రుతువు మారుద్ది
డోలు మొగుద్ది మోగుద్ది నందణుగుద్ది, సద్దుమణుగుద్ది

కాళోజీ కవి మాత్రమే కాదు మంచి కథకుడు కూడా మొదటి తరంలో తెలంగాణ నుంచి వచ్చిన కథకుల్లో చెప్పుకోదగిన కథా రచయిత మొదటి తరం కథల్లో సంఘ సంస్కరణ నేపథ్యంగా వున్నట్టే, కాళోజి కథల్లోనూ సంఘ సంస్కరణ కనపడుతుంది ఆ కాలంలోనే అంటరానితనం గూర్చి కథలు రాసిన అభ్యుదయశీలి కాళోజి

చిన్న పంచెకట్టుతో బక్కచిక్కిన శరీరధారియై ఉండే మహాత్ముడు రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధి నేతల గుండెలో బల్లెమెలా అయ్యాడు? కోట్లాది ఆబాల గోపాల భారతీయుల్ని ఎలా కదిలించ గలిగాడు? ప్రపంచా నికి అహింసాయుధాన్నెలా అందించగలిగాడు? కారల్ మార్క్స్ ప్రపంచ ప్రజలనెలా ప్రభావితం చేయగలిగాడు? ఈ ఇద్దరు మహాత్ములు పరస్పర సిద్ధాంత కర్తలుగా అనిపించినా ప్రపంచాన్ని విపరీతంగా ప్రభావితం చేయ గలిగారు అందుక్కారణం వాళ్లకున్న నిబద్ధత తాము నమ్మిన సిద్ధాంతాల పట్ల నమ్మకం ఏ దిగజారుడుతనమూ లేనితనం గాంధీమార్క్సుల సమ్మేళనంలా కనబడుతాడు కాళోజీ బక్కచిక్కిన శరీరంతో తెల్లని గడ్డంతో మహర్షిలా కనబడే కాళోజీ మనసు వెన్న ముద్దే ఏ చిన్న సంఘటన జరిగినా, ఎవరికే అన్యాయం జరిగినా, ఏ విషయాన్ని గూర్చి కదిపినా కన్నీటి పర్యంతమవుతాడు రాజునైన ప్రశ్నించడంలో కాని, ప్రజల పక్షపాతం వహించి ఎంత అధికారహోదాలో ఉన్నవాళ్లనైనా నిలదీయడంలో కాని

ఖచ్చితంగా ప్రవర్తిస్తాడు కవి రచయితగానే కాకుండా రజాకార్ల నెదిరించిన పోరాట యోధుడుగా స్వాతంత్ర్య సమరయోధుడుగా పౌరహక్కుల ఉద్యమనాయకుడుగా భాషా పరిరక్షణోద్యమ కర్తగా తెలంగాణ వాడిగా జీవితమంతా ఏ విషయంలోనూ రాజీ లేకుండానే బతికాడు అతని బలమల్లా సాహిత్య, జీవిత నిబద్ధత సత్యవాక్కు ప్రజాపక్షపాతం అందుకే లక్షలాది అభిమానులను కలిగి వున్నాడు చివరి వరకు రాస్తూనే ప్రజా సమస్యలకు స్పందిస్తూనే తనకు తోచిన పరిష్కారాలు వెతుకుతూనే ఉన్నాడు చెప్పినట్టే బతికాడు తనను తాను దేశానికంకితం చేసుకున్నాడు ప్రజల కోసం జీవితాన్ని గడపడంలో ఎంత ఆనందముంటుందో నిరూపించాడు

కోట్ల ఆస్తిని సంపాదించినా పొందలేని సంతృప్తిని పొందాడు మనిషి పుటక బతుకు యొక్క పరమార్థమేంటో చేసి చూపాడు జీవితమంటే ఏమిటో పుట్టినందుకు జీవితాన్ని సార్థకమెలా చేసుకోవాలో, బతకడం మాత్రమే కాదు జీవించాలని నిరూ పించాడు పుట్టిన వాళ్లంతా బతుకొచ్చుకాని జీవించేవాళ్ళు మాత్రం తక్కువని జీవించి చూపాడు

తొమ్మిది పదుల సంపూర్ణ జీవితాన్ని గడిపిన కాళోజీ వయసు తెచ్చిన వృద్ధాప్యాన్ని జయించాడు ఎవరి చేయూత లేకుండా బతికాడు చేతగాదని నడిచేప్పుడు పట్టుకు ందామన్నా ఒప్పుకునే వాడు కాదు తనకు తానే నడిచేవాడు తెలంగాణ, సాహిత్య మాండలిక భాషా పదస్సులన్నిటికీ హాజరై తన గొంతు వినిపించాడు ప్రజల భాషను రక్షించుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాడు

జీవితాంతం ప్రజలను ప్రేమిస్తూనే బతికాడు ప్రజల కోసమే బతికాడు నా గొడవ మనది కాళోజి అనునది కాలమునకె కాదు మహాకాలునకును ఏనాడును జీ అననిది నఖరాలు లేనట్టిది - నాజూకుది కానట్టిది నానా భావనది నానా బావనలేనిది ఎదచించుక పారునది ఎదలందును చేరునది కను కొలుకుల చిలుకునది - కనురెప్పల తడుపునది ఎడద ఊరి పారునది ఎడదచేరి ఊరునది నా గొడవ మనది కాళోజీ అనునది అన్యాయాన్నెదిరిస్తే నా గొడవకు సంతృప్తి అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి అన్యాయన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు అన్నాడు కాళోజీ అదే చేసి చూపాడు కాళోజీ బాటలో నడవడమే అతనికి సరైన నివాళి వరంగల్ వీధుల్లో నక్కల గుట్ట నుండి కాకతీయ మెడికల్ కాలేజి వరకు వేలాది రచయితలు, కళా కారులు, రాజకీయులు సామాజిక సేవా తత్పరులు, బంధువులు మిత్రులతో రెండు గంటలు సాగిన కాళోజీ అంతిమ యాత్ర అతని ఆశయాలను ముందుకు తీసుకెళ్ళే వాళ్లెంతో మందున్నారని రుజువు చేసింది కవికెప్పుడూ మరణం లేదు అందులో ప్రజాకవి, ప్రజల మనిషి అయిన కాళోజీకి మరణమనసలేలేదు కోట్లాది మంది హృదయాల్లో అతడ జరామరంగా ఉంటాడు ప్రజల గొడవను ' నా గొడవ'గా వినిపిస్తూనే ఉంటాడు 90 ఏళ్ళ జీవితాన్ని గడిపిన పండిత కవి కాదు ప్రజాకవి అపరవేమన కాళోజి

ప్రజాతంత్ర - నవంబర్ 18, 2002

# మాటను ఈటెగా మలిచిన కాళోజీ

- జి వెంకటరామారావు

కవులకు మరణం లేదు
అందుకు నిలువెత్తు నాదర్శనం కాళోజీ

కాళోజీ వీరుడు వీరకవి అతనికి భయం అనేది ఏనాడు లేదు జీవించడానికి ఎన్నో కష్టాలుపడ్డ కాళోజీకి మరణించడానికి కూడా ఇన్ని ఇబ్బందులుంటాయా అనే అనుమానం నిజామ్సులో ఇటీవల చికిత్స పొందుతున్నప్పుడు కలిగింది ఆ విధంగా ఆయన జీవితం కూడా పోరాటంతోనే అంతమైంది స్వాతంత్ర్య సమరం నుంచి రాష్ట్రంలో జరిగిన అన్ని జాతీయ ఉద్యమాలలో పాల్గొన్నారు కాళోజీ దేశం కోసం త్యాగం చేయవలసి వచ్చినప్పుడు అరనిమిషం కూడా ఆలోచించకుండా రంగంలో దూకేవారు కల్లకపటం తెలియని నిజాయితీ పరుడు ఎన్నోసార్లు నిజాం ప్రభుత్వం కాళోజీని వరంగల్లు నుంచి బహిష్కరించింది అతడు అక్కడేవుంటే తిరుగుబాటు వస్తుందని హడలిపోయేది ప్రభుత్వం

కమ్మని చకిలా లొకచోట
గట్టి దవడ లింకొకచోట
వాసన నూనియలొకచోట
మాసిన తల లింకొకచోట

అంత సులభశైలిలో సామాజిక వ్యత్యాసాలను చెప్పడం కాళోజీ ప్రత్యేకత అతను ఏదిచెప్పినా సూటిగా చెప్పేవారు తెలుగు మాట్లాడితే అవమానంగా, అగౌరవంగా భావించి సాటి తెలుగువాడితో ఉరుదూలోనూ, ఇంగ్లీషులోనూ మాట్లాడే ఆంధ్రుడంటే కాళోజీకి మంట

అన్యభాషలు నేర్చి ఆంధ్రంబురాదంచు
సకిలించు ఆంధ్రుడా! చావ వెందుకురా

అన్నారు ఒకసారి కోపంతో నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయన వ్రాసిన గేయాలు ప్రజల నాల్కల మీద పలికాయి ప్రజల హృదయాలలో నిలిచాయి గుండెలపై ఫిరంగిమ్రోతలు కురిపించాయి

నల్లగొండలో వాజీశక్తుల
నగ్ననృత్య మింకెన్నాళ్లు,
పోలీసు అండను దౌర్జన్యాలు

పోషణ బొందే దెన్నాళ్లు? అని ప్రశ్నించారు ఆ ప్రశ్నలోనే సమాధానం ఉంది ఎన్నాళ్లో ఈ దౌర్జన్యం సాగదు త్వరలో అంతం అవుతుంది కాళోజీ ఆశాజీవి కాళోజీ నా గొడవ గ్రంథాన్ని మహాకవి శ్రీశ్రీ 1953 జనవరి 12 తేదీన అలంపురలో అవిష్కరించారు ఆ సభలోనే అన్నాడు మహాకవి నా గొడవ చదివిన వారికి ఇది గొడవగానే అర్థమవుతుంది గానీ, ఇది విశాల జగత్తు ప్రజలందరి గొడవ

కాళోజీ 1914వ సంవత్సరం సెప్టెంబరు 9వ తేదీన జన్మించారు అయన పూర్వీకులది కర్నాటక ఆయన పూర్వీకులది కర్నాటక కాని పెరిగింది, చదువుకున్నది ఆంధ్రప్రదేశ్‌లోనే, హైస్కూలు వరకు హన్మకొండలోనూ, మడికొండలోనూ చదివారు అ తరువాత హైదరాబాద్‌లో విద్య కొనసాగించారు 1940 లో లాయర్ అయ్యారు కానీ ప్రాక్టీసుపై ఆయన మనస్సు లగ్నం కాలేదు అయనకు సమాజమే ప్రేరణ, తన జీవితమే ప్రేరణ ఒక గంటసేపు వేదికమీద ఉపన్యాసం ఇవ్వడం కన్నా నాల్గు లైన్లురాస్తే దాన్ని చదివేవారి మనస్సులో శాశ్వతంగా నిలిపోవచ్చునన్నది కాళోజీ భావన

బాధ్యత లేని ప్రభుత్వ భటులు పెట్టిన బాధలు చాలింక బాధ్యతగల పరిపాలన లేక బ్రతికిన బ్రతుకులు చాలింక ఇది మనదేశ పరిస్థితి కోసం కాదు ఎక్కడ ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు దీన్ని అన్వయించుకోవచ్చు నేటి దేశ పరిస్థితికీ ఇదే జవాబు

కాళోజీ హింసావాదాన్ని బలపరిచారంటే దాని వెనుక లోతైన పరిశీలన ఉంది పిరికిపంద బ్రతుకుకన్న హింస వేయిరెట్లు మిన్న అన్నోడు మావో కాదు, మనోడు మహాత్మాగాంధీ అని ధైర్యంగా చెప్పిన గుండెదిటవు అయనకే ఉండేది అన్యాయం జరుగుతోందనిపించినప్పుడు ప్రజలు చేతులు ముడుచుకొని కూర్చోరాదు దాన్ని ప్రశ్నించడం నేర్చుకోవాలి జనకంటకు నెదిరి చంపు పంధైనను నాకు పరమాత్ముడే జనకంటకు నెదురు బెదరు మనిషైనను పిరికిపంద? అంటే ఇదేదో ఈనాడు పుట్టిన సాహిత్యంకాదు మన పురాణాలు, కావ్యాలు కూడా

ఇదేమాటను చెప్పున్నాయి భయపడి బ్రతకడం భారతీయులకు వెన్నతో పెట్టిన విద్య అని కాళోజీ బాధ

మనిషిని చంపే శక్తికనుక మాటలకే ఉంటే తెలంగాణలో ఓ ఆకు నలిగినా ఓ పువ్వు ఆరినా ఆయన గుండె కొవ్వొత్తిలా కరిగిపోయేది ఓ పాప ఏడ్చినా, ఓ పల్లె తల్లడిల్లినా ఓ వీరుడు నేల కొరిగినా ఓ పౌరుడు కటకటాల పాలైనా పొగిలి పొగిలి ఏడ్చే పౌరుడు ఎవరయ్యా? అంటే కేవలం కాళోజి ఒక్కరే కనిపిస్తారు

ప్రపంచంలో ఏ జాతికి తీసిపోని విధంగా పౌరుషంగా బతికిన తెలంగాణ ప్రజల పోరాటస్ఫూర్తి వత్తిని ఎగదోస్తూ చమురు అందిస్తూ, కళ్ళు చమరుస్తూనే ఉద్యమ జ్వాల కొడిగట్టకుండా కాపాడిన ప్రజాకవి కాళోజి నా కందినది నాది నా కందనిది మనది ఇదీ మన మనస్తత్వం కాదని ఎవరైనా అనగలరా?

నిజంచెప్పి నిష్ఠూరాలను కొనితెచ్చుకోవడం కాళోజీ నిత్యవ్యవహారం తెలంగాణా సాయుధ పోరాటాన్ని సమర్థించిన కాళోజీ పోలీసుచర్య తరువాత భారత ప్రభుత్వం చేబట్టనున్న ప్రజాస్వామ్య పరిపాలన విధానాన్ని పరీక్షించకుండానే నిజాంకు వ్యతిరేకంగా పోరాడిన పద్ధతిలోనే భారత ప్రభుత్వాన్నీ, దాని సైన్యాన్ని ఎదుర్కోవాలన్న నిర్ణయం సరిఅయినది కాదని కాళోజీతో సహా చాలామంది ఆనాడు అభిప్రాయపడ్డారు

నక్సలైట్ల పట్ల సానుభూతిపరుడని పేరు తెచ్చుకున్న కాళోజీ ఆ ఉద్యమ స్వరూపాలు తనకు తెలియవని ఒక ఇంటర్వ్యూలో చెప్పారు కాని వారిని అణచడానికి మాత్రం పోలీసులు ఆయుధాలు తెచ్చారు ఆ ఆయుధాలకు వ్యతిరేకంగా పోరాటం చేయడం తప్పుకాదన్నారు ఆయన నక్సలైట్లు అవీ - ఇవీ తగలబెడ్తున్నారు ధ్వంసం చేస్తున్నారంటే చేయరా అని ప్రశ్నించేవారు ఆయన దృష్టిలో అది చెయిన్ రియాక్షన్ ఒకదానికోపం ఒకదాని మీదకి పోతుంది చివరకు ఏ బస్సో రైలో బిల్డింగో దాన్ని ఆపలేము బి ఎస్ ఎఫ్ (బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్) ఎక్కడ ఉండాలి? బోర్డర్‌మీదే కదా? అది మరి జిల్లాలో ఉంది మన సరిహద్దులు ఇంతగా కుంచించుకు పోయాయా అన్నది కాళోజీ ప్రశ్న ఎంత వత్తిడి ఉంటుంది? అసలిది ఎంతవరకు సమంజసం? ఇలా ఎక్కడ బడితే అక్కడ బి ఎస్ ఎఫ్ ఉంటే దేశభద్రత మాటేమిటి? అంతుపట్టదు?

ఆంధ్రప్రదేశ్ శాసనమండలికి జరిగిన మొదటి ఎన్నికల్లో కాళోజీ తెలంగాణా పశ్చిమ నియోజకవర్గం నుంచి ఉపాధ్యాయ ప్రతినిధిగా ఎన్నికయ్యారు కాళోజీ జాతీయవాది ఎన్నో అవార్డులు పొందిన విశిష్టవ్యక్తి 1972లో ఇందిరాగాంధీ ద్వారా తామ్రపత్రం ఇక స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ నా గొడవకు లిటరరీ అవార్డు, ఖలీల్ జిబ్రాన్ వ్రాసిన ది ప్రాఫెట్ అనేదాన్ని జీవనగీత అని తర్జుమా చేస్తే ఉత్తమ అనువాదకుని అవార్డు, కాకతీయ యూనివర్శిటీ డాక్టరేటు భారత ప్రభుత్వ పద్మవిభూషణ్ బిరుదు, రామినేని ఫౌండేషన్ విశిష్ట పురస్కారం మొదలైన వాటితో జాతి ఆయనను గౌరవించింది సంతత సమరశీలి శక్తిశాలి కాళోజీ కాళోజీ అభ్యుదయవాది ఎక్కడ అన్యాయం జరిగిన దానిపై అక్షరయుద్ధం ప్రకటించారు 1975లో ఇందిరాగాంధీ ప్రకటించిన ఎమర్జెన్సీని ఆయన ఎదిరించారు

కాలం వ్యర్థం చేయక కళయని
వ్రాసిన కవితలు చాలింక
కలం చేత కదిలింపకున్నచో
కాళోజీ కాయమే చాలింక

ఆగుపించినవన్నీ ఎండమావులైనందుకు స్వప్న భంగంలో విహరించి తనువు చాలించారు కాళోజీ

# నేనెరిగిన కాళోజీ గారు

- దేవులపల్లి సుదర్శన్‌రావు

ఆంధ్రప్రదేశ్ ఏకైక ప్రజాకవి శ్రీ కాళోజీ నవంబరు 13, 2002 ఉదయం గంటలు 10 45 నిమిషాలకు హైదరాబాద్ నిమ్స్‌లో చనిపోయారు కాళోజీగా ప్రసిద్ధులైన స్వాతంత్ర్య సమరసేనాని పూర్తి పేరు కాళోజీ నారాయణరావు

కాళోజీ నాకు పరమ ఆప్తులు, సాహితీ బంధువు, కాళోజీ మరణంతో వరంగల్లు అన్ని విధాలా పెద్ద దిక్కును గోల్పోయింది కాళోజీ స్వాతంత్ర్య సమర యోధునిగా కవితా కన్న మనషిగా మహా మనిషి

కాళోజీ తండ్రి కీ శే శ్రీ రంగారావుగారు మహారాష్ట్రులు తల్లి రమాబాయిగారు కర్ణాటక, తండ్రి ఉద్యోగరీత్యా వరంగల్ వచ్చి ఇదే జిల్లా మడికొండలో స్థిరపడినారు

మరీడికొండలో పాఠశాల స్థాపించి పలువురిని విద్యావంతుల చేసిరి రాత్రి వేళగూడా తమ ఇంటి కిరసనాయిల్‌లా ???? పెట్టి విద్యనేరిపేవారు తల్లి, తండ్రి నుండి వచ్చిన మానవతా విలువలు కొడుకులు శ్రీ రామేశ్వరరావుగారు నారాయణరావుగార్లలో మరింత పరిణతి చెందినవి ఎవరికి ఏ మాత్రము బాధకలిగిన ఆయన కంట నీరు జాలువారేవి అన్యాయాన్ని, అక్రమాన్ని యెదుర్కొనుటలో స్వపర భేదమెరుగని మహా మనిషీయన

ఆర్య సమాజం ??? ధర్మాలకు ఆకర్షితుడై ప్రజా జీవన ప్రాంగణంలో అడుగిడిన కాళోజీ తరువాత కాంగ్రెసు మొదట అన్ని ప్రభుత్వ ఉద్యమాలల్లో త్రికరణ శుద్ధిగా పాల్గొని గూడా ఈనాడు ఎలాంటి అధికార వ్యామోహానికి లొంగిన వాడు కాదు వందేమాతరం ఉద్యమాలలో పాల్గొన్న వరంగల్ ప్రథమ సత్యాగ్రహ బృందం ప్రముఖ సభ్యుడు, కార్మిక, కర్షక, విద్యార్థి పారిశ్రామిక అనేకానేక ఉద్యమాల్లో పాల్గొనిన నిత్య సమరసేనాని

ఆయన స్పందించని, పాల్గొనని ఉద్యమం లేదంటే అతిశయోక్తి కాదు

నిజాం యేడవ నవాబు స్వతంత్రునిగా యెల్ల కాలం మనాలనేటి ఆశలో ప్రోత్సహించగా భారతదేశ స్వాతంత్ర్యానంతరం హైదరాబాదు రాష్ట్ర మత సామం ‘స్యాన్ని మంటగల్పి జనాధిక్య వాందూ ప్రజల్ని నానా హింసలు పెట్టి నాజీ జర్మనీని మరపింప చేసిన రజాకారు లను ప్రోత్సహించిన నైజాం నవాబు పాలనను ఎదిరించి జైలు శిక్షకు గురై హైదరాబాద్ రాష్ట్ర విమోచనానంతరం విడుదలైనారు

నేడు నక్సలైట్లను అణిచివేయు నెపంతో ప్రజల పౌర హక్కులని మట్టు బెట్టుతున్న ప్రభుత్వాన్ని యెదిరిస్తూ ఆర్థిక స్వాతంత్ర్యం సమానత్వం కోసం సమరం సలుపుతున్న మహాయోధుడు కాళోజీ

సుమారొక సంత్సరం క్రితం తమ కథా సంపుటి ఆవిష్కరణ పుస్తక పరిచయ బాధ్యత నాకు అప్పగించి నందుకు కృతజ్ఞుణ్ని

ఉద్యమమేే ఆయన ఊపిరి నిరంతరం పోరాటమే ఆయన జీవన విధానం

యేనాడో1938లో క్షయ వ్యాధి సోకి ఒక ఊపిరి తిత్తి గోల్పోయిన కాళోజీ ఇంతకాలం ఒక ఊపరితిత్తితో జీవన సంగ్రామం సాగించటమే కాక మిగిలిన ఒక్క ఊపిరి తిత్తికి గూడా నిమోనియా వ్యాధి సోకగా సుమారు నెల రోజులపాటు మృత్యువుతో గూడా పోరాడి నవంబర్ 13, 2002న ఉదయం పదకొండు గంటల ఇరవై అయిదు నిమిషాలకు తుది శ్వాస వదిలారు కాళోజీ ‘నా గొడవ’ ఆయన జీవిత చరిత్ర మాత్రమే కాదు తెలంగాణ ప్రజా జీవన చరిత్ర

ఆయనను కొందరు నేటి ‘వేమన’ అంటారు నేను మాత్రం మండేలా అంగసాన్ సూకి, నేరుగా ఇత్యాది ప్రపంచప్రజా ఉద్యమాల మహాసేనానుల్లో అగ్రగణ్యు డంటాను

నాకు కుటుంబ జీవనంలోను సాహితి జీవనం లోను ఆప్త బంధువు నాకన్న 13 సంవత్సరాలు వయస్సులో పెద్ద

ఈనా ఆంధ్రప్రదేశం మరో కాళోజీని యెన్ని శతాబ్దాలకు చూడనున్నదో మనిషి నిగర్వి, కరుణామూర్తి, నిష్కల్మష నిర్భయుడు

సుభాష్‌చంద్రబోస్ అస్తమించిన వార్తవెలువడి న్నాడు
ఆయన వ్రాసిన స్మృతిగీతి ఇవ్వాల్టికి చదువుతూ నేను
కన్నీరు కారుస్తాను
గడియ గడియకూ మారు ప్రపంచం
గవ్వ గవ్వకూ కొరగాని ప్రపంచం
ఆశపెట్టి ఆడించు ప్రపంచం
మోసపుచ్చి మురిపిచ్చు ప్రపంచం
దయా దర్మాల దండ ప్రపంచం
తడి గుడ్డల మెడగోయు ప్రపంచం
మనుజుని చేతనే మనేడి ప్రపంచం
మానవునే మననీదు ప్రపంచం
వీలైన ప్రతి చోట విర్రవీగుచు
అపర హిట్లరౌతాను నేను
వాట్లరౌతాను నేను
తలదన్నువాని కడ
తలవంచి దయ అనుచు
గాంధీ నౌతాను నేను
గాంధీ నౌతాను
మంది తప్పుల యెవ్వరి
మన ఖాతా నింపి
వడ్డీ వడ్డీ కట్టి వల్లించుతాను
నా తప్పులను దాచి
నా మీద వీలైన ధర్మ సూత్రాలతో దడి కట్టుతాను
ఆయనలో నిజమైన
నిజాయితీగల మనిషిని చూస్తాను

యేనాడు ఎవరికి ఎలాంటి హాని తలపెట్టని సహృదయుడు కాళోజీ కాళోజీ సాదరులు ప్రోత్సహించి నిర్వహించిన సాహితీ సంస్థ మిత్రమండలి రాజకీయాలు ఎన్ని కలు, అధ్యక్ష కార్యదర్శులు మొదలైన పదవుల కోసం ప్రాకులాటలు సభ్యత్వం నభ్యత్వ రుసుము లాంటి గొడవలేని సాహితీ సంస్థ మిత్రమండలి

'ఈ సంస్థ ఇలాగే కలకాలం కొనసాగేట్టు నువ్వు మాత్రమే చూడగలవనే నమ్మకము' అనేవారు కాళన్న

శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు చాలా మంచి ఉర్దూ కవి వారి ఉర్దూ రచనలు కొన్ని నేను తెలుగులో చేసాను వారు సంవత్సరన్నర క్రితం మరణించినారు

కాళోజీని వరంగల్‌కు అందించిన వారు వారి అన్న శ్రీ రామేశ్వరరావుగారు మహర్షి

కాళోజీ సాదరులతో పరిచయము నా మహద్భాగ్యము

నవంబర్ 18, 2002

❖ ❖ ❖

# కాళోజీ నారాయణరావు

**- దేవులపల్లి ప్రభాకరరావు**

ప్రజల కోసం కలం పట్టి, ప్రజా ఉద్యమాలకు నేతృత్వం వహించి ప్రజలలో ఒకడుగా జీవించిన ప్రజాకవి కాళోజీ నారాయణరావు సమాజంలో అన్యాయాలను అక్రమాలను ప్రతిఘటించడానికి, పాలకవర్గం నిరంకుశత్వాన్ని ఖండించిప్రజల హక్కులను, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి దాదాపు తొంబయి సంవత్సరాలు కదన రంగంలో నిలిచి కలాన్ని ఖడ్గంగా ప్రయోగించిన మహనీయుడు కాళోజీ

ఆయన విశిష్ట వ్యక్తిత్వం ఆకాశమంత విశాలమ యినది, అంబరమంత మహోన్నతమయినది ఎనభయి ఎనిమిది సంవత్సరాలు నిండిన పిదప వండు వృద్ధాప్యం లో సైతం ఊపిరితిత్తులు దెబ్బతిని అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికి కాళోజీ ప్రజా ఉద్యమాలకు దూరం కాలేదు చివరి శ్వాస వరకు ప్రజా ఉద్యమాలకు, పోరాటా లకు ఊపిరిగా ఉపకరించిన మహోన్నతుడు, అమూల్య జీవితాన్ని ప్రజా సేవకు హారతి వలె వెలిగించిన త్యాగ ధనుడు కాళోజీ కాళోజీ సమున్నత, సమరశీల వ్యక్తిత్వంతో ఉపమానం కాగలిగిన వ్యక్తిత్వాలు గతంలో లేవంటే, భవిష్యత్తులో ఉండబోవంటే అతిశయోక్తి కాదు అసంఖ్యాక ఆత్మీయులకు, అభిమానులకు, సహచరు

లకు 'కాళన్న'గా ప్రసిద్ధుడయిన కాళోజీ నిరంకుశ పాలకులకు ప్రజాస్వామ్య వ్యతిరేకులకు ప్రళయ రుద్రుడుగా కన్పించారు కాళోజీ కవీశ్వరుడు, రచయిత, మానవతావాది ప్రపంచపౌరుడు ఆయనకు ఆరోప్రాణం తెలంగాణం తెలంగాణ రాష్ట్రం కోసం ఆయన అహర్ని శలు తపించారు

సమకాలిన జీవిత సంఘటనలకు, సామాజిక సమస్యలకు, ప్రజల బాధలకు స్పందించిన ఆయన హృదయంలో కవితా ఝరి పొంగివచ్చింది కాళోజీ కవితలో ఆవేశం అవధులు దాటుతుంది పోతన్న మహాకవి భక్తావేశం, పాల్కురికిసోమన్న కవి మతావేశం మిళితమయి కాళోజీ వ్యక్తిత్వాన్ని ఆవహించాయి కాళోజీ మహాకవి తన కవితా సంకలనానికి 'పెట్టినా 'పేరు' నా గొడవ కాని, నిజానికది సకల మానవాళి గొడవ అల్ప అనల్ప తారతమ్యం లేకుండా ఆయన హృదయాన్ని కదిలించిన ఆయన మనో నేత్రానికి అన్ని సంఘటనలు, అన్ని అంశాలు ఆయన కవితా వస్తువలయినాయి సమకాలిక సామాజిక చిరత్రకు దర్పణం కాళోజీ కవిత్వం, కాళోజీ ఆత్మకథ గడచిన ఎనిమిది దశాబ్దాల కాలంలో కాళోజీ పాల్గొనని ఆయన ప్రభావం ప్రసరించిన సామాజిక, రాజకీయ, సాహిత్య ఉద్యమం లేదు ఉద్యమానికి పర్యాయపదం కాళోజీ, ఉద్యమానికి ఆలంబనం కాళోజీ నిన్నటి, ఇవాళటీ రేపటి ప్రజా ఉద్యమాలకు అమ్లజని కాళోజీ కవితా ఖని తన తెలంగాణ ప్రజల సరళ తరళ తెలుగుభాషలో అనర్గళంగా, ఉత్తేజకరంగా ప్రసంగించగల వ్యంగ్యోక్తులతో, సునిశిత హాస్యోక్తులతో సంభాషించగల గొప్ప వక్త అన్నగారు రామేశ్వరరావు వారిద్దరు రామలక్ష్మణులవంటి అన్నదమ్ములు ఒకరిపట్ల మరొకరికి అమితమయిన ప్రేమ తమ్ముడికి ఎటువంటి ఇబ్బంది భారం లేకుండా అన్నగారు రామేశ్వరరావు అన్ని బాధ్యతలు వహించారు రామేశ్వరరావు గూడ ఉర్దూ, ఫారసీ భాషలలో పండితుడు, కవి ఆయన హనుమకొండలో న్యాయవాదిగా ప్రసిద్ధి పొందారు డెబ్బయి సంవత్సరాల కిందట హనుమకొండలో ఇంటర్‌మీడియట్ చదువుతున్న రోజుల్లో కాళోజీ క్షయ వ్యాధికి గురి అయినారు అ రోజుల్లో క్షయ రోగం వచ్చినవాడు చచ్చిన వాడికింద లెక్క' అని చికిత్స కోసం చేర్చారు సంత్సరంన్నర కాలం చికిత్స కొనసాగింది మాట్లాడవద్దు మాట్లాడితే ఆరు నెలలోచనిపోతావు' అని డాక్టర్లు హెచ్చరించారు మాట్లాడకపోతే ఆరు రోజుల్లోనే మరణిస్తానని కాళోజీ సమాధానం ఇచ్చారు నాడు క్షయ వ్యాధితో పోరాడి మృత్యువును ధిక్కరించి కాళోజీ ఎనభయి ఎనిమిది సంవత్సరాలు ప్రజల కోసం, ప్రజా ఉద్యమాలకోసం దృఢసంకల్పంతో జీవించారు చిన్నప్పటి నుంచేకాళోజీ అతి సాహసవంతుడు, అత్యంత ధైర్యవం తుడు కాళోజీ నిండు మనస్సు నవ్య నవనీతసమానం, ప్రజల హక్కులను, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడంలో కాళోజీ పలుకు దారుణ ఖండం శస్త్ర తుల్యం తన అభి ప్రాయాలను, విశ్వాసాలను వ్యక్త పరచడంలో కాళోజీ ఎన్నడూ ఎవరికీ భయపడలేదు ఎక్కడా ఎవరితోను రాజీ పడలేదు అది కాళోజీ కవి ప్రత్యేకత కాళోజి తన స్వభావాన్ని వివరిస్తూ తన ఆత్మ కథలో ఈ విధంగా అన్నారు ఏదన్నా ఆలోచించి ఇట్లు మాట్లాడుదామని అనుకునే టోన్ని కాదు గిట్ల మాట్లాడితె గట్లవుతది అనే ఆలోచననా కుండది 'రవీంద్రనాథ్ టాగూర్ వలె కాళోజీ జాతీయ వాది, అంతర్జాతీయవాది మానవతావాది 'నేను ప్రపంచ పౌరుడిని' అని కాళోజీ ఒక ఇంగ్లీషు కవితలోవివరించారు అవనిపై జరిగేటి అవకతవకలు కాళోజీ హృదయంలో కలిగించిన ఆవేదనలు కావ్యరూపం పొందాయి కాళోజీ 'నా గొడవ ప్రథమ ముద్రణను యాభయి సంవత్సరాల కిందట 1953 జనవరి 12 నాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు అలంపురం మహాసభలో ఆవిష్కరిస్తూ మహాకవిశ్రీశ్రీ "కాళోజీ నిఖిలాంధ్రకవి ఇది కవి గొడవగానె అనిపించి నప్పటికి చదివిన వారికి ఇది తమ గొడవగానే అర్థమవుతుంది ఇది విశాల జగత్తు ప్రజలందరి గొడవ కాళోజీ లూయీ అరగాన్ వంటివారు " అని ప్రస్తుతించారు కాళోజీ 'నా గొడవ' అన్న రామేశ్వరరావుకు అంకితమయింది 'నా గొడవ' మూడవ ప్రచురణ కాళోజీ సాహిత్య గురువు గార్లపాటి రాఘవరెడ్డి స్మృతికి చిహ్నంగా సమర్పితమయింది కాళోజీని "త్రికాలజ్ఞుడయిన మహర్షి'గా మహాకవి దాశరథి నుతించారు మొదటి ప్రచురణ అనంతరం యాభయి సంవత్సరాలకు 2002 సెప్టెంబర్‌లో 'నా గొడవ' అన్ని భాగాలు సమగ్రస్వరూపంతో ఒక సంకలనంగా వెలువడి ఆవిష్కృతమయినాయి ఖలీల్ జిబ్రాన్

ప్రాఫెట్ కుకాళోజీ తెలుగు అనువాదం 'జీవనగీత సమగ్రసంకలనంలోచోటు చేసుకున్నది నా గొడవ మొదటి సంపుటం పరాభవ వసంతం పరాభవ గ్రీష్మం పరాభవ వర్షం పరాభవ శరత్తు పరాభవ హేమంతం పరాభవ శశిరం తుది విజయం మనది నిజం ఎమర్జెన్సీ లో నా గొడవ బంగ్లాదేశ్ కవితలు ఇతరములు తెలం గాణ ఉద్యమ గేయాలు 1937 నుంచి కాళోజీ రచించిన కథలు సురవరం ప్రతాపరెడ్డి సంపాదకత్వంలోని గోల్కొండ పత్రికలో దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వం కథలు శోభమాసపత్రికలో ప్రచురితమయి నాయి కొన్ని మరాఠీ కథలను కాళోజీ తెలుగులోకి అనువదించినారు కాళోజీ కథలు సంపుటి ఇటీవల 2000 సంత్సరంలో ప్రచురితమయింది మరాఠీ బాష నుంచి ఎన్ జి ఫడ్కే నవలను (అంజలి), సానే గురూజీ రచనలను (భారతీయ సంస్కృతి) కాళోజీ సరళమయిన తెలుగులోనికి అనువదించారు తెలంగాణ సామాజిక రాజకీయ సాహిత్య ఉద్యమాలకు, చరిత్రకు దర్పణంగా కాళోజీ అచ్చయిన తెలంగాణ తెలుగులో రచించి ఆత్మకథ అద్భుత రచన అయితే, అది అసంపూర్ణం అది మన దురదృష్టం

కాళోజి జీవిత ప్రస్థావం ఎనిమిది దశాబ్ధాల కిందట కన్నడ ప్రాంతంలో ప్రారంభమయింది 1914 సంవత్సరం సెప్టెంబర్ 9వ తేదీన కాళోజీ బీజాపూర్ జిల్లాలోని రట్టిహాళి గ్రామంలో జన్మించారు కాళోజీ తండ్రి రంగారావు, తాతశ్రీనివాసరావు కాళోజీ జననం అనంత రం రెండుసంవత్సరాలకు వారి కుటుంబం హనుమకొండ ఖాజీపేట సమీపంలోని మడికొండకు వచ్చిస్థిర పడింది 'మేం మడికొండలో ఉన్న పదేండ్లు చాలా మంచిగ అయిందనె చెప్పాలె అక్కడ నేనుచదువు మొదలుపెట్టిన సావాసగాండ్లతో తిరిగిన, ఆడిన, పాడిన " అంటూ కాళోజీ బాల్యాన్ని జ్ఞాపకం చేసుకున్నారు అన్నతోపాటు హైదరాబాద్ వెళ్లి కాళోజీ హైదరాబాద్ పాతబస్తీలోని చౌమహాల్ స్కూలులో రెండోఫారమ్‌లో చేరారు అప్పుడు బోధనా భాష ఉర్దూ సుల్తాన్ బజార్‌లోని రెసిడెన్సీ అప్పర్ మిడిల్‌స్కూలులో, సిటీ కాలేజీ హైస్కూలులో కొంత కాలం చదివిన తరువాత తిరిగి వరంగల్ వెళ్లి కాళోజి హనుమకొండలోని కాలేజియేట్ హైస్కూలులో చేరారు దేవులపల్లి రామానుజరావు పి వి నరసింహారావు తది తరులు ఆ స్కూలులో ఆయన సమకాలీకులు ఇంటర్ మీడియెట్ రెండవ సంవత్సరంలో ఉన్నప్పుడు క్షయ వ్యాధికి గురిఅయి, అప్పటి నుంచి కాళోజీ ఒక ఊపిరి తిత్తితోనే జీవితపోరాటం కొసాగించారు హైదరాబాద్‌లో హైకోర్టు అనుబంధంగా ఉన్న సాయంకాల న్యాయ కళాశాలలో చేరి కాళోజీ 1939లోన్యాయ శాస్త్రం డిగ్రీ పొందారు 1940లోఆయన న్యాయవాద వృత్తి ప్రారంభిం చారు ఆరేడు సంవత్సరాలలోనె ఆయన న్యాయవాద వృత్తి ముగిసింది కాని ప్రజలపక్షాన ఆయన జీవితం చివరి క్షణం వరకు న్యాయవాదిగా కొనసాగారు ప్రజాస్వా మ్యం పౌరహక్కులు మానవహక్కులు కాళోజీకి అత్యంత ప్రియమయినవి వరంగల్లు సమీపంలోని గనిచెర్ల గ్రామపు వేలూరి మాణిక్యరావు గారి కూతురు రుక్మిణిబాయితో 1940 లోకాళోజీ వివాహం జరిగింది వారిసంతానం ఒక కుమారుడు హైదరాబాద్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు గణేశ్ ఉత్సవాలతో, అర్యసమాజం తో సంబంధం ఏర్పడిన కాళోజీ 1930 నుంచే గ్రంథాలయోద్యమంలో ప్రముఖంగా పాల్గొన్నారు క్రమంగా కాళోజీ సామాజిక రాజకీయ ఉద్యమాలతో, నిజామ్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటంలో కాళోజీ ప్రముఖ పాత్ర నిర్వహించారు 1939 లో వందేమాతరం ఉద్యమంలో, సత్యాగ్రహసమరాలలో ఆయన ముందు నిలిచారు 1939లోఆయన మొదటిసారి జైలుశిక్ష అనుభవించారు తెలంగాణా ఆంధ్ర మహాసభలో, స్టేట్ కాంగ్రెస్ పార్టీలోఆయన ప్రముఖుడయినాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపకులలో ఆయన ఒకరు 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తరువాత నిజామ్ వ్యతిరేక పోరాటంలో కాళోజీ అగ్రగామి నిజామ్ ప్రభుత్వం 1946 నవంబర్ నుంచి 1947 ఫిబ్రవరి వరకు ఆయనను వరంగల్‌నుంచి బహిష్కరించింది మూడు పర్యాయాలు కాళోజీ జైలు శిక్ష అనుభవించారు 1952లో మొదటి సాధారణ ఎన్నికలలో కాళోజీ కాంగ్రెస్ అభ్యర్థిగా వరంగల్లు నుంచి లోకసభకు పోటీ చేసారు పార్టీ ప్రత్యానికంటే ప్రజాస్వామ్యానికి హెచ్చు ప్రాధాన్యంఇచ్చిన కాళోజీ పార్టీ రాజకీయాలకు దూరమయినారు 198 60

సంవత్సరాలలో కాళోజీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి సభ్యులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలోఆయన సభ్యులు వరంగల్లులో కాకతీయ విశ్వవిద్యాలయం పదవ స్నాతకోత్సవం సందర్భాన కాళోజీకి గౌరవ డాక్టరేట్ ప్రదాంతోసన్మానం జరిగింది 1992 లో భారత ప్రభుత్వం కాళోజీని పద్మవిభూషణ్ బిరుదంతో గౌరవించింది 2002 నవంబర్ 13వ తేదీ ఉదయం హైదరాబాద్ నగరంలో అస్తమించిన కాళోజి ప్రజల మనిషి ప్రజాకవి ప్రజల హృదయంలో ఆయనకు శాశ్వత స్థానం లభించింది

18 నవంబర్ 2002 ప్రజాతంత్ర

❖ ❖ ❖

# "అవామి షాయెర్ కాళోజి హమ్ సెజుదా నహోనాకభీ"

- దేవులపల్లి మదన్‌మోహన్ రావు

"అవామి షాయర్ కాళోజి
హమ్‌సె జుదా న హోనా కభీ'

సాహిత్యానికి, కవిత్వానికి ప్రజా ఉద్యమాలకు, ఉన్నది ఉన్నట్టు ముఖం మీద అని వేయటానికి, నిష్కల్మషానికి, ఉత్సాహానికి, ధైర్యానికి ధీశక్తికి మారు పేరు తెలంగాణ ప్రాంతానికి చెందిన ప్రజా కవి కాళోజి

ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందు తెలంగాణ ప్రాంతంలో ఏర్పడ్డ తెలంగాణ రచయితల సంఘం స్థాపకుడు మూల పురుషుడు కాళోజీ తెలంగాణ ప్రజలే ప్రాణంగా, తెలంగాణ ప్రజల హక్కులే, ఉచ్ఛ్వాస, నిశ్వాసా లుగా జీవిస్తున్న కాళోజీ, తిరిగి ఆరోగ్యవంతులయి ప్రత్యేక తెలంగాణలో స్వేచ్ఛా వాయువు పీల్చుకో గలగాలన్నది నా ప్రగాఢవాంఛ ప్రజాకవి కాళోజి జీవితం ఒక ఉద్యమం ఒక ఉద్యమ చరిత్ర తన కవితల ద్వారా రాజకీయాలను బాగా ప్రభావితం చేసి, అన్ని ప్రజా ఉద్యమాలలో పాల్గొని వాటిని సమర్థించి, ప్రజల మనిషిగా పేరు పొందినాడు ప్రజా కవి కాళోజి

కాళోజి తన కవితలను 'నా గొడవ 'పేరు తో ప్రచురించినా యధార్థానికి అది ప్రజల గొడవ సామ్రాజ్య వాద దోపిడీ విధానాన్ని చీల్చి చెండాడినట్లే, రాజకీయాల లోని, రాజకీయ నాయకులలోని అవినీతిని, నిశితంగా విమర్శించి బట్టబయలు చేసినవాడు కాళోజి తన కవిత లలో నేను ముందు చెప్పినట్టుగానే అతనొక మహా ఉద్యమం అన్యాయాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు అతని జీవితచరిత్ర

ఒక పార్టీ అని గాదు, ఒక వ్యక్తి అని గాదు ఎక్కడ అన్యాయముంటే అక్కడ తిట్టిపోసి, ఛీ కొట్టినాడు కాళోజి

అది 1994 అనుకుంటా రజాకార్ల దురాగతాలు హైదరాబాదు సంస్థానంలో, ప్రజల జీవితాలను దుర్భరం చేసిన రోజులు అన్ని జిల్లాలలో రజాకార్లు ప్రజలపై చేసే దౌర్జన్యాలు మితిమీరి పోయినవి వీరి నాయకుడు ఖాసిం రజ్వీ నిజాం రాజును ధిక్కరించసాగినాడు

ఈ కాలంలో వరంగల్‌లో ఆర్య సమాజం, కాంగ్రెస్ వారు నిజాంకు వ్యతిరేకంగా, సామ్రాజ్యవాదు లకు వ్యతిరేకంగా సభలను నిర్వహించేవారు కాళోజి పాల్గొనని సభ అంటూ ఉండేది గాదు ఆయన ప్రసం గాలు నిజాం రాజు గుండెలలో బాకులుగా పని చేసినవి కాళోజిపై నిషేధం విధించి, ఆయనను వరంగల్ జిల్లా వదిలి వెళ్లవలసిందిగా నిజాం రాజు ఆజ్ఞలు వచ్చినవి కాళోజి అజ్ఞాతంలోకి వెళ్లినాడు

ఈ పరిస్థితులలో నిజాం రాజు, పరిస్థితులు చేయిజారగూడదని గ్రహించి, మైసూరు సంస్థానంలో ప్రధాన మంత్రిగా పని చేసిన మిర్జా ఇస్మాయిల్‌ను నిజాం రాష్ట్రానికి ప్రధానిగా నియమించుకున్నాడు రజాకార్ల ఆగడాలు ఆయన హయాంలోను తగ్గలేదు 1946

జూన్‌లో వరంగల్ పట్టణంలోని వరంగల్ కోటలో మొగలయ్యను రజాకార్లు పట్టపగలు పొడిచి చంపి కోటంతా ఊరేగినారు వరంగల్ పట్టణం అట్టుడికి పోయింది వరంగల్‌లో నిరసనలు ఉధృతమైనవి ఇది జరిగిన కొంత కాలానికి ప్రధాని మిర్జా ఇస్మాయిల్ వరంగల్ కోటను దర్శించదలచినప్పుడు, కాళోజీ హృదయం ద్రవించిపోయింది ఆగ్రహావేశాలతో సతమత మయ్యాడు అజ్ఞాతంలో ఉన్న కాళోజీ ఒక సుదీర్ఘ గీతం రాసి, దానిని పోస్టులో ఒక మిత్రునికి పంపించినాడు దానితో బాటు అవి కరపత్రాలుగా ముద్రించి మిర్జాఇస్మాయిల్ వచ్చే నాడు వరంగల్ అంతా పంచిపెట్టేలా చేయగలిగారు

ఆ గీతం ఇట్లా మొదలౌతుంది

ఇదిగో , అదిగో అనుచు
ఈనాటికైననూ దిగివచ్చితివా!
కోట గోడల నడుమ ఖూని జరిగిన చోట,
గుండా గుర్తులు, గోచరించితివా,
మొగలయ్య భార్యను, మొగలయ్య మాతను,
మొగమాట పడకుండ ముచ్చటించితివా'

అని రాస్తూ, చివరకు, కాలానుగుణ్యమైన కాళోజీ ప్రశ్నలకు, కన్నులెర్రగ జేసి, ఖామోష్ అంటావా! అన్న గీతంలో, కాళోజీ పడిన ఆవేదనను అంచనా వేయ లేము ఆయన సున్నిత మనస్కుడు అత్యాచారాలను భరించలేడు

నేతాజీ సుభాష్ చంద్రబోస్ చనిపోయాడన్న వార్త తెలిసిన తరువాత, కవి హృదయం ద్రవించింది

'చావు లేదని, చావ లేదని
చచ్చు మాటలు నమ్మమంటావా!
బోసు బాబూ! వచ్చి దర్శన మీయకంటావా! అంటూ
వాపోయాడు కాళోజి

కాంగ్రెస్ నాయకుల దుశ్చర్యలను విమర్శించుతు,

'రఘుపతి రాఘవ రాజారాం
చస్తే తోవకు రానే రాం,
రానే రాం, రానే రాం'

అంటు ఒక సుదీర్ఘమైన విమర్శగా గీతం రాసినారు ఈ విధంగా కాళోజీ గొడవ అంతా ప్రజల గొడవ మాత్రమే

ఇంగ్లాండ్ దేశస్థుడు ఇంగ్లీష్ రచయిత జాన్సన్ పేరు తెలియని వారుండరు అతనికి సన్నిహితంగా ఉన్న బాస్‌వెల్ ఐర్లాండ్ వాడు జాన్సన్, ఐర్ లాండ్ వారిని అసహ్యించుకునేవాడు తీవ్రంగా దూషించేవాడు అయినా బాస్‌వెల్, జాన్సన్ సాన్నిహిత్యం వదలలేదు చివరకు జాన్సన్ జీవిత చరిత్రను బాస్‌వెల్ ఎంతో సమర్థవంతంగా రాసినాడు ఆ జీవితచరిత్ర అన్ని భాషలకు ఆదర్శ ప్రాయంగా నిలువగలిగినది అంటే అతిశయోక్తి కాదు అందులో బాస్‌వెల్ ఒక చోట

'I know not where thy couagle lies
in the Heart or mind,
or in soul in kind
let they courage shine on the world,
and cross the glorious world'

ఈ వాక్యాలు కాళోజీకి వర్తించితే అది అక్షరాల నిజం

ఇదంతా కాళోజీ జీవిత పోరాటాన్ని చెప్పగలిగే ఒక రెండు పుటలు మాత్రమే

కుట్రలు, కూహకాలు, దోపిడీ, దౌర్జన్యాలు, అన్యాయం, అక్రమాలు లేని ఒక ప్రశాంతమైన స్వచ్ఛమైన, మానవతా సౌధాన్ని నిర్మించదలచిన కాళోజీ 'హమ్ సె జుదా న హోనా కభీ'

❖ ❖ ❖

# ఇక 'గొడవ' చేసే వారెవరు?

- కోవెల సంతోష్‌కుమార్

అన్యాయాన్నెదిరిస్తే నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తిప్రాప్తి
అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు

కాళోజీ కవిత ప్రజల కవిత కాళోజీ జనం మనిషి ఆయనకు భయమంటే ఏమిటో తెలియదు తనకు తన సమాజానికి అన్యాయం అనిపించిన దాన్ని నిస్సంకోచంగా నిర్భీతిగా ఎలుగెత్తి లొల్లి చేసినవాడు ఒర్రి మాటలు చెప్పడం ఆయనకు చేతకాదు పెత్తనాలకు ఎన్నడూ దేవులాడలేదు తానేది అనుకున్నాడో, ఎవరి మనసునొచ్చినా, ఎవరి మనసు మెచ్చినా కుండ బద్దలు కొట్టినట్లు చెప్పినవాడు ఆయనకు ఎవరిపైనా ద్వేషం లేదు ఎవరినీ అతిగా ప్రేమించిన వాడు కాదు పద్మ విభూషణ బిరుదును అందించిన పివి నరసింహారావు తనవాడే దాన్ని తీసుకోవద్దని అడ్డుకున్న వరవరరావూ తనవాడే ఆయనకు ఆడంబరాలు తెలియవు కపటమెరుగని వాడు ఆయన ప్రతి మాటా ఒక నినాదం ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రజాకవిగా వేమనతో పోల్చదగిన ఏకైక కవివర్యుడు పదిహేనేళ్ల నాటి నుంచే ప్రజాజీవితం లోకి అడుగుపెట్టిన వాడు అనేక ఉద్యమాలను ముందు నిలుచుండి నడిపించినవాడు ఆర్య సమాజ్ నుంచీ, పౌర హక్కుల సంఘాల దాకా అందరి కార్యక్రమాల్లోనూ చురుకుగా పాల్గొన్నవాడు కానీ ఏ సంఘంలోనూ, ఏ నిర్మాణంలోనూ ఆయన సభ్యుడు కాదు మొట్టమొదటి సార్వత్రిక తెలంగాణరాష్ట్ర సమితి ఓటేయమనేదాకా ఇంత క్రియాశీలకంగా రాజకీయాల్లో పాల్గొన్న వ్యక్తి మరొకరు కనపడరు అలా అని ఆయనకు పదవులపై ఆశలు కానీ, అధికారంపై మమకారం కానీ లేవు ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి ఎన్నుకుని తల బాదుకున్న నేమగును? తర్వాత ఏడ్చినను తప్పదను భవము అన్నమాట చెప్పడానికే ఇంతకాలం ప్రతి ఎన్నికల్లో ఆయన ఓటర్లను చైతన్యపరిచాడు

కళ్లముందు జరుగుతున్నది చూస్తూ తనకేమీ పట్టనట్లుండటం కాళోజీకి చేతకాదు తన ముందు జరుగు తున్న అవకతవకలను సాధ్యమైనంతగా చక్కదిద్దడానికే ఆయన ప్రయత్నించారు ఎన్నికల్లో ప్రతినిధులను ఎన్నుకోవడంపై ప్రజలకు హితబోధచేసినట్లే, అటు ఎన్నికలను బహిష్కరించమని పిలుపునిచ్చిన నక్సలైట్లనూ మందలించారు బ్యాలెట్ పేపర్‌పై ఓటు ముద్ర వేసి వచ్చిన వారిని శిక్షిస్తామనే వార్ హెచ్చరికను ముందుగా ఉల్లఘించి శిక్షించడానికి ముందుకు రమ్మని సవాలు చేసినవాడు కాళోజి తన మనసుకు నచ్చింది చేయడమే కానీ ఇతరుల హితోక్తులనెన్నడూ పట్టించుకున్నవాడు కాదు పరుల కష్టాన్ని చూస్తే ఆయన గుండె కరిగి పోయింది మాయమోసములను చూసిన అదే గుండె మండి పోయింది ఈ పరిస్థితులపైనే కాళోజి ఆజన్మాంతం గొడవ చేశాడు

ప్రజలంతా శాంతిగా ఉండటం మంచిదే కానీ దేశంలో శాంతి పరిస్థితి లేనప్పుడు ప్రతిహింస తప్పుకాదని సిద్ధాంతీకరించినవాడు కాశ్మీరం నుంచి కన్యాకుమారి దాకా టెర్రరిస్టుల పట్ల శాంతి పన్నాలు పలుకుతున్న మన పాలకులకు కాళన్న మాటలు చెంపపెట్టు మన కొంపలార్చి మన స్త్రీల చెరచిన, మన పిల్లలను చంపి మనల బంధించిన మానవాధములను, మండలాధీశు లను మరిచిపోకుండా గురుతుంచు కోవాలి, కసి ఆరిపోకుండా బుసకొట్టుచుండాలి కాలంబు రాగానే కాటేసి తీరాలె ఇంత తీవ్రంగా ప్రతిస్పందించడం ఒక్క కాళోజీకే చెల్లింది కొత్త సమస్య తలెత్తిన ప్రతిసారీ మొదట స్పందించేది కాళోజీయే ఆయనకు ఇంట్లో కుటుంబం సంసార బాధ్యతలేవీ లేవు అన్నీ అన్నగారే తలకెత్తుకోవ డంతో క్రియా శీలకంగా ఉద్యమాలకు సారథ్యం వహించడానికి వీలు కలిగింది నైజాం పోరాటం నుంచి మరణోన్ముఖుడయ్యేంత వరకూ కూడా ఆయన చురుకుగా తన సంఘజీవనాన్ని కొనసాగించాడు తెలం గాణా ప్రజల సమస్యలపై లొల్లి చేసే ఏకైక గొంతు మూగ వోయింది ఇప్పుడు ఆ లోటు పూడ్చేద్వెరు? గొడవ చేసే వారేరి? అతిథివోలె వుండి వుండి అవని విడిచి వెళ్లుతాను అని అన్నట్లుగానే అందర్నీ విడిచి అందని లోకాలకు వెళ్లిపోయాడు కాళోజి రూపాన్ని చూస్తే మూర్తీభవించిన మానవతామూర్తి, కల్మషం లేని మనస్సు, కన్నీరు, పన్నీరు కలగలిసిన సామాన్య జీవిత వైలక్షణ్యం కన్పిస్తాయి నిలువెత్తు తెలంగాణా సంతకం ఆయన జీవితం

# మూసీకినారే

- హైదర్

ప్రజాకవి కాళోజీ ఒకసారి చూసిన మనిషిని ఎన్ని సంవత్సరాల తరువాత అయినా పేరు పెట్టి పలకరిస్తారు మరుపు అనేది ఆయన డిక్షనరీలో లేదు మనుషులే కాదుసంఘటనలు కూడా అన్యాయాన్ని ఎదిరించడంలో ఆయన ఎంత ఉగ్రనరసింహుడో అంత చమత్కారంగా కూడా మాట్లాడి అందరినీ ఉల్లాసర పరచగలరు

చాలా సంవత్సరాల క్రితం ఆయన ఒకసారి మీసాలు పెద్దగా పెంచారట హైదరాబాద్ వీధుల్లో ఆయన నడుచుకుంటూ వెళుతుంటే ఓ అభిమాని కనిపించాడు కాళోజీ మీసాలు చూసి ఆ అభిమాని అంత పెద్ద 'మీసాలు పెంచారేమిటి? అని అడిగాడట కాళోజీ వెంటనే మీసాలు పెంచడమేమిటి అవి ఏమన్నా చెట్లా ఎరువులు వేసి పెంచడానికి వాటంతట అవే పెరిగాయి మీసాలు తీసేస్తే ఎందుకు తీసారని అడగాలి ఎందుకంటే మనం వాటిని తీయాలి కాబట్టి' అని నవ్వేసి ఊరు కున్నారట

కాళోజీ అన్నగారు రామేశ్వరరావు అయన గొప్ప ఉర్దూ షాయెర్ వరంగల్‌లో ఎక్కడ కవి సమ్మేళనం అనుకున్నా అన్నదమ్ములిద్దరూ అందరి కంటే ముందే అది జరిగే చోటికి చేరుకుని ఆలస్యంగా వొచ్చే వారిని పట్టుకుని ఇంకా ఎప్పుడు నేర్చుకుంటారురా! కవిత్వం చెప్పేవారే ఆలస్యంగా వస్తే, వినేవాడెప్పుడు రావాలె అని కోప్పడే వారట

ఒకసారి కాళోజీకి అరోగ్యం బాగా లేక ఇంట్లో పడుకుని ఉన్నారు అదే గదిలో రామేశ్వరరావుగారు దూరంగా కూర్చుని ఏదో చదువుకుంటున్నారు మిత్రులు, అభిమానులు కొందరు కాళోజీని పరామర్శించడానికి వెళ్లారు వాళ్లను చూడగానే రామేశ్వరరావుగారు "ఊళ్లో సభ ఏదైనా జరుగుతున్నదా కాళోజీని తీసుకుపోండి ఉపన్యాసం ఇస్తే ఆరోగ్యం అదే బాగుపడుంది" అని చమత్కరించారట మాట్లాడటం అంటే కాళోజీకి అంత ఇష్టం మాట్లాడక పోతే ఆయన మనిషికి మృతదేహానికి తేడా లేదనుకునేవారు

చివర్లో క్షణాల్లో కూడా ఆయన మాట్లాడకుండా ఊరుకోలేదు ఊపిరితిత్తుల ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన ఆయాసంతో అతికష్టంగా మాట్లాడుతూ కూడా ఆయన మనుషులను మరిచిపోలేదు విషయాలను మరిచిపోలేదు తన సహజమైన చమత్కార ధోరణీ వీడలేదు

ఆస్పత్రిలో ఆయనను కనిపెట్టుకుని ఉన్న తెలంగాణ ప్రభాకర్‌కు సెల్‌లో ఓ ఫోన్ వచ్చింది మాట్లాడేసి కాళోజీ దగ్గరికి ఫలానా మాజీమంత్రి మిమ్మల్ని చూడటానికి వస్తానంటున్నాడు ఇప్పుడే ఫోన్ చేశాడు అని చెప్పాడు

అంత ఆయాసంలో కూడా కాళోజీ వెంటనే 'వాడెందుకు వొస్తున్నాడురా! ఈ దవాఖానాకు వాడు బోలెడు బిల్లులు బాకీ పడ్డాడట కదా! పట్టుకుంటారేమో' అన్నారట

కాళోజీ చివర్లో చికిత్స కోసం చేరిన 'నిమ్స్' ఆస్పత్రిలో సదరు మాజీ మంత్రి కొంత కాలం క్రితం చేరి నెలల తరబడి ఉండి లక్షల రూపాయల బిల్లు కట్టకుండా వెళ్లిపోయాడని పత్రికల్లో అప్పుడెప్పుడో వొచ్చిన వార్త కాళోజీకి గుర్తున్నదన్నమాట

ఆయన ఏంచేసినా ప్రత్యేకంగానే ఉండేది ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో వరంగల్‌లోదానికి వ్యతిరేకంగా ఒక ప్రదర్శన చెయ్యాలనుకున్నారు ఎప్పటి వలెనే కాళోజీ సరిగ్గా సమయానికి అక్కడికి చేరుకున్నారు ఎవరూ రాలేదు కాళోజీ నిరాశపడి తిరిగి వెళ్లిపోలేదు ఒక్కడే మూతికి బట్టకట్టుకుని పట్టణ వీధుల్లో తిరిగి తన నిరసన తెలియచేసాడు

ప్రహ్లాద చరిత్ర పట్టుకుని ఎమర్జెన్సీ కాలమంతా అందరికీ చదివి వినిపిస్తూ తిరిగాడు తనది ప్రహ్లాదుడి మార్గమే అయినా ఆ మార్గం నిరాటంకం కావాలంటే ఉగ్రనరసింహుడి అవతారం తప్పదని నమ్మే వ్యక్తి కాళోజీ

హింస అహింసల నడుమ ఏది కావాలో తేల్చుకోవాల్సి వస్తే తాను అహింసనే కోరుకుంటానని

అయితే పిరికితనానికీ హింసకూ మధ్య ఏదో ఒకదానిని ఎంచుకోవాల్సి వస్తే మాత్రం హింసనే ఎంచుకుంటాననీ మహాత్మాగాంధీ చెప్పిన మాటను అక్షరాలా నమ్మినవాడు కాళోజీ

కాకతీయ వైద్య కళాశాల ఆవరణలో జరి గిన సభలో శుక్రవారం నాడు వరవరావు చెప్పినట్టు కాళోజీ వరంగల్‌కు ఓ పద్మాక్షమ్మగుట్ట ఓ వేయిస్థంభాల గుడి, ఓ భద్రకాళి చెరువు

అయనకు హైదర్ సలామ్

ప్రజాతంత్ర నవంబర్ 18 2002

❖ ❖ ❖

# మానవీయ ప్రేమ పరిమళం....

- కుప్పిలి పద్మ

మనుషులని అచ్చంగా ప్రేమించడం చిన్న విషయం కాదు సులభమైన విషయమూ కాదు అందరూ చేయగలిగే పనే కాదు హృదయ మంతా మనుషులని నింపుకొని ప్రతి వొక్కరిని మనుషులు కాబట్టి యిష్ట పడటం, ఆ మనుషుల గురించి ఆరాటపడటం హృదయ మంతా మనుషులని జీవితాంతం ప్రేమగా నింపుకోవటం అందరికీ చేతనయిన జీవన రచన కాదు ఆ రచన పరిపూ ర్ణంగా తెలిసి సాగించిన ప్రయాన మంతటిలోనూ చివరి వరకూ ఆ మాటల నిండా చూపుల నిండా ప్రవహించే ఆ ప్రేమ మనుషుల హృదయాలని మానవీయంగా వెలిగి స్తోంది ఏ సభ జరిగినా ఏ వుద్యమం మొదలయినా కాలమేదైనా సమయమెంతైనా ఎండైనా వానైనా చలైనా ప్రజలకి సంబంధించిన విషయమైతే చాలు వో నిలువెత్తు మనిషి వూపిరి ఆ ప్రాంగణాన్నో మైదానాన్నో ఉత్తేజపరిచేది వుత్సాహాన్నిచ్చేది వూరట కలిగించేది ధైర్యాన్నిచ్చేది నిశ్చితంనిచ్చేది ఏ అనంద విషాదాలకైనా ఆ చూపుల నిండుగా తడి పెద్దవాళ్ల రచనల నుంచో జీవితాల నుండో మనం స్ఫూర్తిని పొందుతుంటాం అది వుత్తేజాన్ని స్తుంటాయి వొక్కోసారి ఆశ్చర్యపోతుంటాం వాళ్లలోని నిర్భయాన్నో, నిజాయితీనో, ప్రేమనో చూసి ఆ పరిమళాన్ని గుండెల్లో భద్రంగా అపురూపంగా దాచుకుంటాం ఆయన నుంచి బోల్డంత పరిమళాన్ని దాచుకున్న ఎందరో ఎక్కడె క్కడి వాళ్లో అనేక రంగాల వాళ్లు ఆయన సజల నేత్రాలని తలచుకుని దు ఖిస్తున్న మనషులని యింతగా ప్రేమించ డం ఆయనకే సాధ్యమని పదే పదే అనుకోవటం, తలచు కోవటం

నిజంగా మనుషులని యింతలా ప్రేమించటం తన ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయకుండా మాట్లాడాలను కోవటం మనుషులతోనే జీవితం అని పదే పదే చెప్పడం ఆయనకి మాత్రమే తెలిసిన జీవ రచన

వికసించిన పువ్వుల తోటల్లోంచి దర్జంగా చిగి ర్చిన కారడవుల నుంచి చుక్కనీటి కోసం అనంతంగా ప్రయాణించే ఎడారుల నుంచి శిథిల గ్రామాల నుంచి అమానవీయ సాగరాల నుంచి రాత్రనకగా పగలనకా మాన వీయ స్పర్శతో ప్రయాణించేవారు ఆ స్పర్శ జీవధారగా అన్నింటా యింకుతునే వుంది మనుషులని అమితంగా ప్రేమించే కాళోజీగారిని చూడగలిగినందుకు, మాట్లాడ గలిగినందుకు, ఆయన ప్రయాణిస్తున్న కాలంలో సాగు తున్నందుకు, వాత్సల్యంతో నిండిన ఆయన మాటలు విన్నందుకు, అనుకున్న విషయాన్ని నిర్భయంగా చెప్ప గలిగే ఆ సాహసిని చూసినందుకు, వుద్వేగంతో వుత్సాహం తో అనందంతో నిండిన హృదయంలోనే ఆయన యిక భౌతికంగా కనిపించరనే విషాదం నిండుకొంటోంది .

వార్త, 16, నవంబర్ 2002

# కాళోజీకి కన్నీళ్ళ భాష గొప్పవరం

- పి హరినాథ్

అది 1966 సిద్దిపేట కళాశాలకి ఇంగ్లీషు లెక్చరర్ నర్సింహరావు కాళోజీని తీసుకొచ్చారు ఆయన ఉపన్యాసం ఉపన్యాసంలాగ లేదు అందరినీ వ్యక్తిగతంగా సంబోధిస్తూ సంభాషించినట్లుంది ఉపన్యాసం కూడా ఇట్లు ఇవ్వవచ్చునా అని నాకూ మా తోటి మిత్రులకు అనిపించింది ఉపన్యాసం మధ్యలో కొందరి 'గొప్ప వ్యక్తుల ప్రస్తావన వచ్చినపుడూ మరి మా అధ్యాపకులు కొందర్ని ఉద్దేశించి మాట్లాడినపుడు 'ఏమిరా', 'వాడు' అని తరచుగా ఆయన అంటూ ఉంటే కుర్ర వాళ్ళమైన మాకు "ఏందీయన మా సార్లను గూడ వాడు వీడు అంటున్నడు, గర్వమా ఇంత అనాగరికమా' అని ఓ రకంగా కోపం వచ్చింది

తర్వాతికాలంలో మేం తెలుసుకున్నదేమంటే కాళోజీ తన పరిచయస్తుల్నీ, స్నేహితుల్నీ, ఆప్తుల్నీ, ఆత్మీయుల్నీ ప్రేమతో అలాగే పిలుస్తారని, ఆ పిలుపులో ఆయనకున్న సామీప్యతే వ్యక్తమవుతుందని, ఆయన అట్లా పిలువకపోతే వెలితిగా ఉంటుందనీ, అట్లా పిలిపించుకుంటేనే స్నేహవారధి కట్టినట్లువుతుందని, అట్లా పిలువకపోతే ఇంకా సాన్నిహిత్యం ఏర్పడలేదని అనుకోవాలని, ఆయనక్కాస్త చిరాగ్గా ఉన్నప్పుడే 'మిస్టర్'లోకి మారతారని

కాళోజీ ఏ సందర్భంలో, ఎంత సీరియస్ విషయం గురించి మాట్లాడినా, ఉపన్యసించినా నవ్వు పుట్టించే ఉపమానాలతో, ఉదాహరణలతో విపులీకరించి మాట్లాడ్డం అలవాటు అట్లా అని ఆయనెపుడు విషయాన్ని ఎక్కువ చేయలేదు దానికున్న ప్రాముఖ్యతని తగ్గించలేదు ఆయన హాస్యం, వ్యంగ్యం అంతాగా వచ్చే ఆదర్శవంతమైన మాటల ధార వాటి గుణం ఆయన ఉర్దూలో ఉపన్యసించినా అంతే మరాఠీలోనూ అలాగే మాట్లాడతారని కేశవరావ్ జాదవ్ అంటుండగా విన్నాను ఆయన ఇంగ్లీషులో ఉపన్యసించారని, ఉపన్యసిస్తారని ఎప్పుడూ వినలేదు కాని కబుర్లలో ఇంగ్లీషు మాట్లాడేవారితో తడుముకోకుండా ఉల్లేఖించదగిన పదజాలంలో సమాధానాలివ్వడం నేను విన్నాను ఎప్పుడో దశాబ్దాలకింద చదివిన షేక్స్పియర్, లిన్‌యుటాంగ్ రచనల్లోంచి పంక్తుల్ని వినిపించడం కూడా ఒక అబ్బురపరచే అనుభూతి అలాగే సమకాలీన రచయితలయిన జా పా సర్త్రే సాల్‌బెల్ల రాతల్లోంచి గూడ 72 ఏళ్ళ అంతరం ఉన్న సీతతో పెర్రిమాసన్ క్రైమ్ నవలలు వివరాలు వివరణలు పంచుకోవడం ఒక వినోదంతో కూడిన ఎక్సర్‌సైజ్ తనకు తెలియని విషయాలు ఇతరుల్నించి అడిగి తెలుసుకోవడానికి ఎప్పుడూ వెనుకాడేవారు కారు కాళోజీ నేను రోజా లక్సెంబర్గ్ గురించి ప్రస్తావించినపుడు, కలిసిన పది నిమిషాల్లో నేనూహించని ప్రశ్నలడిగి ఎన్నో విషయాలు చెప్పించుకుని ఆమె ఏ ఇస్సు అయితేనేమిటి, తెలుసుకోవలసిన విషయాలు అంత గొప్పవయినపుడు' అనే ఆయనకున్న ప్రత్యేకలక్షణాల్లో ఒకటి రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మనీలో నాజిజం గురించి కవితా రూపంలో కామెంటరీ రాసిన కాళోజీ గురించి దీక్ష సిద్ధాంతీకరణలపై నేను మాట్లాడితే, శ్రద్ధగా విని అవగాహన చేసుకున్న విధానం ఆయన అన్వయించిన విషయాలు ఒక మరుపురాని అనుభవం

కాళోజీ ఎంత ఆవేశంలో మాట్లాడినా తప్పు మాటలు దొర్లేవికావు అయినా 'పూనకంవచ్చి మాట్లాడిన మంచిగ ఎడిట్ చేసి రాయి అని 'మా తెలంగాణ ప్రారంభ సంచిక కోసం నాకిచ్చిన ఇంటర్వ్యూ తర్వాత ఆయన అన్న మాటలు హ్యూమిలిటీనే సూచిస్తాయి

కాళోజీ పదచాతుర్యం అనూహ్య రూపాల్లో బయటపడేది నిలువుగా కోసిన నాలుగు కోడిగుడ్డు ముక్కలు 'పాపోసు'ల మాదిరిగా ఉన్నాయని చూపిస్తూ, ఒక ముక్క నోట్లో పెట్టుకుని, 'జూతే ఖారంయ్'' అని అందర్నీ నవ్వించిన ఉదంతం లాంటివి వేలల్లోనే ఉంటయ్

సందర్భమూ, విషయమూ, పిలిచిన వ్యక్తులు ముఖ్యమనుకున్నపుడు దూరమని, ప్రయాస అని ఆలోచించపక సమయానికి చేరుకునేవారు కాళోజీ మానవహక్కుల మీద సెమినార్‌కి ముగింపు ఉపన్యాసా

నికి రావాలని వర్తమానం పంపితే, "మొన్ననే గదా హైదరాబాదు నించి వస్తి అయినా వాడు హరినాథ్ పిలిచిండు నేను పోవాలె" అని వరంగల్‌నుంచి 87 ఏళ్ళ వయసులో వచ్చి 60 ఏళ్ళ మానవహక్కుల ఉద్యమాను భవాల స్వానుభవపు రంగరింపును సదస్సు ముందుంచిన కాళోజీ కానాడు ధన్యవాదాలు చెప్పలేక తడబడ్డాను

కాళోజీకి కన్నీళ్ళుభాష ఒక గొప్ప వరం ఆర్ద్రత, ఆప్యాయత ఆక్రోశం, సెన్సిటివిటీ, సెన్సిబిలిటీ అప్రయత్నంగా కన్నీటిరూపంలో వెలువడేయి పాత జ్ఞాపకాలు నెమరువేసుకున్నప్పుడయితేనేమి, మిత్రులు కలిసినప్పుడయితేనేమి, తన అన్నగారిని తలచుకున్నప్పుడయితేనేమి, ఆప్తుల సంస్మరణ సభల్లో మాటలు కరువైనపుడయితేనేమి, మతకల్లోలాల్లో, ఉద్యమాల్లో, ఇంకా వేర్వేరు సందర్భాల్లో ప్రాణాలు పోయిన వారి గురించిగాని, వారి తాశియగాల పరంపరలయితేనేమి, చిన్నారుల ప్రేమానురాగాలు వ్యక్తమయినపుడయితేనేమి థాంక్స్ చెప్పలేకపోయినపుడయితేనేమి కాళోజీ కళ్ళు నీలాలై ఎన్నో విషయాలు ప్రకటించేవి

అనారోగ్యంతో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు నిద్రపోతున్నప్పుడు తప్ప కాళోజి ఎప్పుడూ సమయాన్ని వృథాగా పోనిచ్చేవారుకాదు అంతగా ఏమీ చేయలేని పరిస్థితి వస్తే, తానొక్కడే మంచంమీద పేకముక్కలు పరచుకొని, తనదైన ఒక ఆట ఆడుతూ ఉండేవారు ఆటకు ప్రేషన్స్ అని ఆయన పెట్టిన పేరు కాకతాళీయం అనుకోలేము రాతకంటే మాటలు మాటకంటే చేతలు ముఖ్యమని భావించి ఆచరించే తత్వమున్న కాళోజీని ఐ సి యులో మా నుంచి 'నజర్ బంద్' చేయడానికి ముందు ఆయన్ని చివరిసారిగా (అదే చివరిసారవుతుందనుకోలేదు) కలిసి మౌనంగా పక్కన నిల్చుంటే 'మాట్లాడవేందిరా' అన్న మందలింపు ఈ రోజు ఈ మాటల్ని రాతల్లోనే లేకపోయిన బాధ తొలుస్తూనే ఉంటుంది

24 నవంబర్ 2002, వార్తా మ్యాగజైన్

❖ ❖ ❖

# మరువలేని మహావ్యక్తి కాళోజీ

- నందిని సిధారెడ్డి

అవుటానికి మూడక్షరాలే, కాళోజీ మూడక్షరాలే మూడు కాలాలను ఉడుకెత్తించినయి నాలుగు తరాలను వెలుగు వైపు నడిపించినయి

కాళోజీ చరిత్రలో అరుదైన వ్యక్తి తెలుగు ప్రపంచంలో భారత ప్రపంచంలో ప్రత్యేకమైన తెలంగాణ వ్యక్తిత్వం కాళోజీ కాళోజీ అంటే జీవితం కాళోజీ అంటే కవిత్వం చరిత్రాత్మక జీవితం రసాత్మక కవిత్వం కాళోజీ అంటే సగటు మానవుని సంఘర్షణ సమస్త దు ఖం అతను హక్కులు, వాక్కులు బుక్కులు ముప్పిరిగా పెనవేసిన మూర్తిమత్వం కాళోజీ జరుగుబాటు కోసం గిలగిలలాడుతున్న లోకంలో తిరుగుబాటుకు పర్యాయపదంగా జీవించిన మహావ్యక్తి కాళోజీ

ఎనిమిది దశాబ్దాలకు పైగా ఈ గడ్డ మీద సంచరించినందుకు ఇక్కడి మట్టిని అమితంగా ప్రేమించిండు అధములైన మనుజేశ్వరులను ధిక్కరించిన పోతన వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నడు వెట్టి కింద, హింస కింద, వెనుకబాటుతనం కింద మనుషులను ఇనుప పాదంతోతొక్కివేస్తున్న అన్ని పాలనలను ధిక్కరించిండు పాలకురికి సోమన పలికిన జాను తెలుగు కాళోజి అందుకున్నడు నిరంతరం తెలంగాణ భాషకోసం కలవరించిండు అవుటానికి మాతృ భాష మరాఠీయే కావొచ్చు లోకం తెలిసినప్పట్నుంచి లోకాన్ని కలిస్తందుకు తెలంగాణ భాషనే రక్తంలో నింపుకున్నడు ఇక్కడి భాష మాట్లాడెతందుకు ఇక్కడి వాళ్ళే విముఖులవుతున్నపుడు నిరంతరం తెలంగాణ భాషకోసం తపించిండు కోపించిండు రెండున్నర జిల్లాలదె దండి భాష అయినప్పుడు తక్కినోళ్లనోళ్ల యాస తొక్కి నొక్కబడ్డప్పుడు ప్రత్యేకంగా రాజ్యంపాలు అడుగక తప్పదుమరి

భాషకోసం సమైక్య రాష్ట్రాన్ని ఆహ్వానించవచ్చు గాక అదే భాష పేరున జరుగుతున్న మోసాన్ని ఘోరాన్ని గుర్తించిండు అవమానాల పాలవుతున్న ఆ భాష కోసమే మళ్లా తెలంగాణ రాష్ట్రం అడుగడానికి వెనుకాడ లేదు అసోంటి విచక్షణ, స్ఫూర్తి చాలా మంది మన కవులకు లోపించింది కాళోజీ ప్రత్యేకత అదే

నేను పీజీ చదివే సమయంలో ఉద్యమాల్లో తిరిగిన ఒక ప్రముఖ కోస్తా కవిని కలిసిన ఒకసారి కాళోజీ గురించి మాట్లాడుతూ 'తెలుగువాడు కాదు తెలుగే చక్కగ రాదు కవిత్వమెలా రాస్తాడు? ప్రజాకవి ఎలా అవుతాడు? అన్నడు అప్పటికి నాకు కాళోజీ తెలుగువాడు కాదని తెలియదు అయినా తెలుగువాడే తెలంగాణ వాడే' అని వాదించిన తెలంగాణను ప్రేమించిండు తెలంగాణనమై జీవిస్తున్నడు గనుక తెలంగాణ వాడే ప్రజలను ప్రేమించిండు ప్రజలతోని తిన్నడు, పన్నడు ప్రజల కోసమే రాస్తుండు గనుక ప్రజాకవి అయిండు అని నేను మొండిగా వాదించిన అప్పుడు అర్థం కాలేదు, కానీ పదహేనిరవై యేండ్ల తర్వాత కోస్తావాండ్లు అట్లెందుకు అర్థంగ మాట్లడ్తరో లోతుగా అర్థమైంది కాళోజీ ఊపిరి, ఉచ్ఛ్వాస నిశ్వాసలు తెలంగాణ, తెలుగువాడే అయి తెలంగాణ అంటే పడనప్పుడు ప్రజల కష్టాల్ని పంచుకొని, కన్నీళ్లు పంచుకొని కాగా జీవితమంతా తెలంగాణై బతికిన కాళోజీని తెలంగాణ అన్ని చేతుల్తో అలుముకున్నది అవాహన చేసుకున్నది స్వంతం చేసుకున్నది అనేక ఆకాంక్షలతోపాటు కాళోజీ అంటే తెలంగాణ

పరుల కష్టము చూసి పగిలిపోవును గుండె
అవనిపై జరిగేటి అవకతవకలు చూసి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు?

1978 ఎమర్జెన్సీ తర్వాత ఎన్నికలు కాళోజీ అప్పటి నియంత జలగం వెంగళరావుకు వ్యతిరేకంగా సత్తుపల్లి నుంచి ధైర్యంగా పోటీ చేసిండు ఉస్మానియా యూనివర్సిటీ నుంచి క్లాసులు వదిలిపెట్టి అనేక మందిమి ప్రచారానికి వెళ్ళినం కాళోజీ మీద అభిమానం, వెంగళ రావు గుండాలు వెంటాడుతున్నా మారుమూల పల్లెల్లో గిరిజన గూడాలల్ల మాకు తిండి దొరికిందంటే అది కాళోజీ మీది అభిమానమే కాళోజీకి ఉద్యమానికి ఉన్న సన్నిహిత సంబంధమే చాలా మంది ప్రముఖులు కాళోజీ ప్రచారానికి వచ్చిండ్రు మహాకవి శ్రీశ్రీ కూడా వచ్చిండు శ్రీశ్రీ వెంగళరావు మీద పాట పాడిండు కాళోజీ గెలుపు కోసం విద్యార్థులు, మేధావులు, రచయితలు, కళాకారులు, ప్రజాస్వామిక వాదులు ఎందరో తిప్పలు పడుకుంట తిరిగిండ్రు గెలుపోటములు సమస్యకాదు డబ్బు బలం ముందు, గూండా బలం ముందు అధికారం బలం ముందు ప్రజాస్వామికవాణి వినిపించాలని పట్టుదలగా నిలబడి వెంగళరావు మనుషుల్ని నిద్రపోనివ్వలేదు కాళోజీ ప్రజాస్వామిక మనస్తత్వ తీవ్రత అంత బలమైంది

ఓటేసెటప్పుడే ఉండాలి బుద్ధి
ఓటుబోయిన కుండ నెంచుకోవద్దు

1986లో మిత్రుడు జర్నలిస్టు రామలింగారెడ్డి సభా వివాహానికి కాళోజీ వచ్చిండు వేముగంటినీ కాపు రాజయ్యనూ జ్ఞాపకం చేసి కలిసిండు అప్పటికప్పుడు రాజయ్యగారు కాళోజీ చిత్రం గీసిండు పెళ్లి అయిపోయిన తర్వాత అందరం భోజనానికి నడుస్తున్నం నడుస్తున్న వాండ్లల్లో సిద్ధిపేట ఎంపి కూడా వాడుమొయ్యడా వాడేం జేస్తడు" అని ఎంపికి సంచి ఇచ్చిండు పాపం ఎంపికి కూడా కాళోజీ అంటే గౌరవం సంచి పట్టుకున్నడు అట్లా ఆదేశించగలిగినస్థాయి ఆయనది కాళోజీ అట్ల బతికిండు అది మరెవ్వరికీ సాధ్యం కాదు నిరంతర స్పందన, సతతం సంభాషణ తరుచుగా గర్జన కాళోజీకి తప్ప ఎవరికి సాధ్యం? అక్షేపించుతూనే తాను చంద్రబాబు నాయుడి లాంటి వాళ్ళ అంజలి పొందగలిగిండు చివరి వరకు ఘర్షణ పడుతూనే నళిన్‌ప్రభాత్‌వందనం పొందిండు అభిమానించిన వాళ్లతోపాటు అక్షేపించిన వాళ్ల గౌరవం పొందటం కాళోజీకి తప్పఎవరికి సాధ్యం?

తెలంగాణ రచయితల వేదిక గౌరవాధ్యక్షుడు కాళోజీ వరంగల్ ప్రథమ మహాసభలో ఆయన అధ్యక్షోపన్యాసం చిరస్మరణీయమైంది కాళోజీని చూతామని అనిశెట్టి రజిత, పొట్లపల్లి శ్రీనివాసరావు, నేనూ నిమ్స్‌కు వెళ్ళినం నన్ను గుర్తుపట్టలేదు శ్రీనివాసరావు గుర్తు చేసిండు ప్రభాకర్ పక్కనే ఉన్నడు నా చెయ్యిపట్టుకొని "తెలంగాణను ఆగంజెయ్యకుండ్రి" అన్నడు దు ఖమొచ్చింది తెలంగాణ మీద ఎంత ప్రేమా? మృత్యుశయ్య మీద పండుకొని తెలంగాణ కోసమే పలకరించిండు

కలవరించిండు

తెలంగాణంటే కాళోజీకి అంత ఆరాటం కాళోజీ అంటే తెలంగాణకు అంత ఆరాటం అన్ని జిల్లాల నుంచి ఆయన అంతిమ యాత్రకు కదలి వచ్చిండ్రు కాళోజిని తెలంగాణ ప్రజలు ఎప్పుడూ మరువరు మనిషి కోసం తండ్లాండిండు కనుక మనుషులున్నంత కాలం కాళోజీ ఉంటడు కాళోజీ మాటలుంటాయి

"నేపాకని ఎత్తులేదు
నేజారని లోతులేదు
మూల జేరి మునులవోలే
మూగనోము పట్టినాను '

18 నవంబర్ 2002, ప్రజాతంత్ర

❖ ❖ ❖

# తెలంగాణా స్పార్టకస్ కాళోజీ

- పుష్పం నరసింహం

బానిసభావం పెంచి పోషించబడిన చోట, బానిసలున్న చోట ఓ స్పార్టకస్ ఉంటాడు ఆ స్పార్టకస్ కండబలం గలవాడే కానక్కర్లేదు కత్తితో యుద్ధం చేయనక్కర్లేదు గుండెబలం ఉన్నా చాలు అతను స్పార్టకస్ అవుతాడు అదోఅలాంటి గుండెబలం గల తెలంగాణా స్పార్టకస్ కాళోజీ నారాయణరావు అయ్యా నీ కాల్మొక్త బాంచన్ అన్న భావం తెలంగాణ గ్రామీణ ప్రాంతమంతటా బలంగా నాటుకుపోయిన రోజుల్లో కాళోజీ నారాయణ రావు తన కలాన్ని గళాన్ని విప్పి పోరాడిన వీరుడు భానిస భావంతో నిరంతరం తల్లడిల్లుతున్న తెలంగాణ ప్రజల గుండెల్లో ధైర్యం నూరిపోసి హక్కులను కాపాడుకోవాలని,అందుకు కాలుదువ్వాలని బోధ జేసిన మహర్షి ఆయన కాకతీయ సామ్రాజ్యం పతనమైనాక తెలంగాణ ప్రాంతం అనే కుల ఆధిపత్యాల కింద పడి నలిగిన అంశం గుర్తించి, కాకతీయ సామ్రాజ్యానికి రాజధానిగా వెలసిన ఓరుగల్లునే కేంద్రంగా చేసుకుని కాళోజి సల్పిన పోరాటం బహుముఖమైనది ఆయన తెలంగాణ వైతాళికుడు తెలంగాణ ప్రాంత ప్రజలు తెలివిపరులు కావాలని, వారి హక్కులనువారు దక్కించునేందుకు ఉద్యమించాలని, ప్రజలు సమున్నతంగా తలెత్తుకుని తిరగాలని, భాష, యాస, సాహిత్యం, సంస్కృతి కాపాడుకోవాలని వెన్నుతట్టిన వృద్ధమూర్తి ఆయన

సంపద పోగేయడం గొప్పకాదు బండ్లకొద్ది పుస్తకాలు అచ్చువేయడం కూడాగొప్పకాదు తన జాతిని, తనవారిని కాపాడేందుకు నిరంతరం అప్రమత్తులై పొంచిఉన్న ప్రమాదం గుర్తించి హెచ్చరిస్తూ జాతి జనుల హక్కుల కావరిగా జీవనంగడిపిన యోధుడే గొప్పవాడు తెలంగాణా ప్రజలకు నీడగా మెదలి, ప్రతి కదలికలో మార్గనిర్దేశనం చేసి ఎందరికో స్ఫూర్తిగా నిలిచిన అగ్ని శిఖరం ఆయన

తెలంగాణలో ఓ ఆకు నలిగినా, ఓ పువు ఆరినా ఆయన గుండె కొవ్వొత్తిలా కరిగిపోయేది ఓ పాప ఏడ్చినా, ఓపల్లె తల్లడిల్లినా, ఓ వీరుడు నేల కొరిగినా, ఓ పౌరుడు కటకటాల పాలైన పొగిలి పొగిలి ఏడ్చే పౌరుడు ఎవరయ్యా? అంటే కేవలం కాళోజిఒక్కరే కనిపిస్తారు

ప్రపంచంలో ఏ జాతికి తీసిపోని విధంగా పౌరుషంగా బతికినతెలంగాణ ప్రజల పోరాట స్ఫూర్తి పత్తిని ఎదోగన్నూ, చమురు అందిన్నూ, కళ్ళు చమరున్నూనే ఉద్యమ జ్వాల ఒడిగట్టకుండా కాపాడిన ప్రజాకవి కాళోజి గొడవను నిజంగా అర్థం చేసుకున్న వారెంతమంది?

ఆయన హైదరాబాద్‌లో హనుమాన్ టేకిడిలోని మాడపాటి హనుమంతరావు ఇంట్లో మకాం చేసినా, హనుమకొండలోని నక్కలగుట్ట దగ్గరి ఇంట్లో ఉన్నా ఎక్కడ ఉన్నా ఆయన చుట్టూ చిన్నపిల్లల దగ్గరనుంచి తన వయసువాళ్ళ వరకు రెండు మూడు తరాల మనుషులు ఆయన చిరునవ్వులోని చైతన్యాన్ని అందుకోవడానికి ఆరాటపడేవారు ఆయన రాల్చిన కన్నీటి బొట్టులోని అగ్నికణాన్ని ఆరిపోకుండా పొదిమిపట్టుకునేవారు అ

వారసత్వాన్ని ముందు తరానికి అందించాలనే ఆత్రంతో తమకుచాతనైన రీతిలో ప్రయత్నించే వారు అందరిని ఆకర్షించి వారిని కర్తవ్యోన్ముఖులను చేసే వాడు ఆయన నిజంగా ఓ నిశ్శబ్ద విప్లవనాయకుడు ఆ వృద్ధ సింహానికి ఎందరెందరో అజ్ఞాత అభిమానులో ఆయనకే తెలియదు ఆయన పలికిన పదాన్ని పట్టుకుని జీవితంలోదాన్ని అన్వయించుకోవాలని తపన పడేవారెం దరో? ఆయన రాసి పెట్టిన పద్యాల పదనుతో తమలోని జడత్వాన్ని ముక్కలు ముక్కలుగా నరికేసుకుంటున్న వాళ్ళు ఎంతమందో? కాలికి బలపం కట్టుకుని, భుజానికి జోలె గట్టుకుని ఊరూరా తిరిగి తెలంగాణ ప్రజలను మేల్కొల్పిన అరుదైన వ్యక్తి, ఆదర్శమూర్తి ఆత్మబలం అన్నింటికన్నా మిన్నది అని నిరూపించిన ఆధునిక స్పార్టకస్ కాళోజీ ఆయన ఆర్యసమాజీవాదిగా ఎదిగినా, కాంగ్రెస్ పార్టీలో కనిపించినా, పౌరహక్కుల నేతగా పనిచేసినా, తెలంగాణ ఉద్యమాన్ని బలోపేతం చేయడానికి మార్గ నిర్దేశకులుగా ఉన్నా ఆయనది అసలు సిసలైన ప్రజాగళం ఏ ఒక్కపార్టీ ఒరలో ఒదిగిపోవడానికి ఇష్టపడని అపూరూప మైన వ్యక్తిత్వం ఆయనది ప్రజల పక్షాన నిజంగా నిలిచి జీవితాంతం పనిచేసిన నిజాయితీవీరుడు నిక్కమైన ముత్యం, పగుడం లాంటి వాడాయన ఆయన మాట తీరు నడక, వస్త్రధారణ, చూపును తలచుకుంటే ఎక్కడా కల్తీలేని ఓ కల్లోల మూర్తి కళ్ళముందు రూపుకడు తుంది ఆయన భౌతికంగా మరణించి ఉండవచ్చు ఆయన పంచేంద్రియాలు పనిచేయక దీర్ఘనిద్రలోకి వెళ్ళి పోయి ఉండొచ్చు కాని ఆయన కాలంతో పాటునడిచిన నడుస్తున్న నడక నేర్పుతున్న భావజాలం ఆయనకు మరణం లేదు మహా మనుషులకు మరణమెక్కడిది? మీ యందు నా యందు నిలువెత్తు జ్వాలలా ఎగిసి పడుతున్న భావజాలం ఆరిపోదు స్పార్టకస్‌కు మరణం తాత్కాలికమే! తెలంగాణ స్పార్టకస్ కాళోజీ మరణించ లేదని తెలంగాణ ప్రజలే రుజువుచేయాలి!

17 నవంబర్, 2002, ఆంధ్రప్రభ

❖ ❖ ❖

# మన కోసం కన్నీరు కార్చినవాడు...

ఆత్మీయుడు అస్తమించినపుడు కంఠం గద్గద మవుతుంది, హృదయం విలపిస్తుంది మస్తిష్కం మంద గిస్తుంది, అపాదమస్తకం చైతన్యరహితమవుతుంది, కలంకదలదు, అక్షరాలు ఆగిపోతాయి గళం నిలిచి పోతుంది ప్రజాకవి కాళోజీ నారాయణరావు అందరికీ ఆత్మీయుడు ఆయన అజాతశత్రువు, సైద్ధాంతిక ప్రత్యర్థుల సైతం ఆయన ప్రేమాస్పదుడు ఎనభై ఎనిమిది సంవత్సరాలు నిండిన కాళోజీ హైదరాబాద్ నగరంలోని ఒక ఆసుపత్రిలో కొద్దిరోజులనుంచి చికిత్స పొందుతూ నవంబర్ 13 ఉదయం అస్తమించారన్న విషాదవార్త ఆయన అభిమాన కోటికి, ఆప్తులకు, సన్నిహితులకు, సహచరులకు, అనుచరులకు అపారదుఃఖం కలిగించింది దిగ్భ్రాంతిపాలు చేసింది, అనేకులు ఆవార్త నిజం కాదను కున్నారు కాళోజీ కవికి మరణం లేదనుకున్నారు అనేక యుద్ధాలలో ఆరితేరిన వృద్ధమూర్తి తమ కాళన్న కాలునితో పోరాటంలో తలవంచబోడని ఆయన అభిమానులు అత్యంత గాఢంగా ఆశించారు, ఆకాంక్షించారు కానీ, వారికి ఆశాభంగం తప్పలేదు ఎనిమిదిన్నర దశాబ్దాలకు మించిన జీవితంలో నిరంతర పోరాటాలతో అలసట ఎరుగని అవిశ్రాంత వీరుడు కాళోజీ శాశ్వతంగా కన్ను మూసారు తెలుగు ప్రజల చరిత్రలో, విశేషించి, తెలుగు, భారత సాహిత్యరంగాలలో కాళోజీ అస్తమయం కడువిషాద సంఘటన కాళోజీ వ్యక్తితం బహుముఖమై నది ఆయన బహుముఖ ప్రజ్ఞావంతుడు ఆయన వ్యక్తిత్వం సమున్నతమైనది, అన్ని విధాల విశిష్టమైనది అందువల్ల, కాళోజీలేని లోటును తీర్చడం అసాధ్యం ఆయన స్థానాన్ని మరొకరు ఆక్రమించడం సాధ్యం కాదు తెలుగు సాహిత్య రంగంలో కవులు, రచయితలు, మేధావులు, మనీషులు, సాహిత్యవేత్తలకు కొదువలేదు కానీ, కాళోజీ కవికిగల సామాజిక స్పృహ, సామాజిక

బాధ్యత, ప్రజల బాధలపట్ల, ప్రజల సమస్యలపట్ల, వారి కష్ట సుఖాలపట్ల ఆ మహాకవికిగల అవగాహన, స్పందన అనితర సాధ్యమైనవంటే అతిశయోక్తి కాదు మానవతా విలువలను మణిదీపాలుగా భావించి ఆరాధించిన మహనీయుడు కాళోజీ నిరుపమానుడు ఎదుటివారి బాధను చూడలేక బోరున ఏడ్చే కాళోజీ కపటం లేని మహానుభావుడు మకుటం లేని మహాపురుషుడు కాళోజీ అస్తమయంతో తెలుగు సాహిత్య రంగంలో, ప్రజా ఉద్యమాల చరిత్రలో ఒక అధ్యాయం ముగిసింది

ఎనభై ఎనిమిది సంవత్సరాల కిందట 1914 సంవత్సరం సెప్టెంబర్ 9వ తేదీన జన్మించిన కాళోజీకి వరంగల్లులో విద్యార్థిగా ఉన్నప్పటినుంచే ఉద్యమాలతో సంబంధం ఏర్పడింది విద్యార్థి సంఘం నాయకత్వంలో కాళోజీ రాజకీయ, ప్రజా ఉద్యమ జీవితానికి అంకురార్పణ జరిగింది అప్పుడే ఆయన బహుముఖ ప్రతిభ వికసించసాగింది కాళోజీకి ఆయన సాహిత్య గురువు గార్లపాటితో పరిచయం కలగడం ఒక గణనీయ సంఘటన స్వయంగా వందేమాతరం ఉద్యమంలో, సత్యాగ్రహ సమరాలలో పాల్గొనడంతోపాటు కాళోజీ విద్యార్థులను, యువకులను సంఘటిత పరిచారు అనంతరం హైదరాబాద్‌లో గణేష్ ఉత్సవాలతో, ఆర్యసమాజ్ ఉద్యమంతో ఆయనకు సంబంధం ఏర్పడింది భారత జాతీయ, స్వాతంత్ర్య ఉద్యమాల ప్రభావం కాళోజీపై గాఢంగా ప్రసరించింది నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా బాల్యంలోనే ధ్వజం ఎత్తిన, గళం విప్పిన, కలంపట్టిన దేశభక్తుడు, స్వాతంత్ర్య సమరయోధుడు కాళోజీ, సామాజిక, రాజకీయ ఉద్యమాలతోపాటు గ్రంథాలయ ఉద్యమంలో, సాహిత్య ఉద్యమంలో ఆయన ప్రముఖ పాత్ర నిర్వహించారు పాతిక సంవత్సరాల వయసులో కాళోజీ మొదటిసారి కారాగారశిక్ష అనుభవించారు వందేమాతరం, క్విట్ ఇండియా ఉద్యమాలలోకూడా ఆయనకు కారాగారవాస శిక్ష తప్పలేదు శిక్షలకు, దండనలకు కాళోజీ ఎన్నడు తలవంచలేదు నిజాం ప్రభుత్వం ఆయన వరంగల్లులో అడుగుపెట్టరాదని ఆంక్షవిధించింది ఒక వంక నిజాం నిరంకుశ పాలన కర్కశత్వాన్ని, మరోవంక మతోన్మాద రజాకార్ల ముష్కరత్వాన్ని ధైర్య సాహసాలతో ఎదుర్కొన్న స్వేచ్ఛాప్రియుడు కాళోజీ తెలంగాణా ప్రాంతంలో కాళోజీ తెలంగాణా ప్రాంతంలో కాళోజీ ప్రభావం ప్రసరించని, వ్యక్తిత్వ ముద్ర పడని సామాజిక, రాజకీయ, సాహిత్య ఉద్యమం లేదని చెప్పక తప్పదు తెలంగాణా ఆంధ్ర మహాసభలో, హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెసులో కాళోజీ ప్రముఖపాత్ర నిర్వహించారు ఆనాటి నాయకులందరు కాళోజీ కవితావేశంతో ఉత్తేజితులైనవారే మొదట సాధారణ ఎన్నికలలో కాళోజీ వరంగల్లు నియోజకవర్గం నుంచి లోకసభకు పోటీ చేసారు కాళోజీ పార్టీప్రత్యాన్నికంటే ప్రజాస్వామ్యానికి, ప్రజాభిప్రాయానికి, నైతికవిలువలకు ఉన్నత ప్రమాణాలకు ప్రాధాన్యం ఇచ్చిన సిసలైన ప్రజాతంత్రవాది కనుక ఆయన పార్టీల కుళ్ళు రాజకీయాలకు దూరం కాక తప్పలేదు ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యుడుగా ఆయన ప్రజాఉద్యమాలకు బాసట అయినారు

ప్రజాకవి కాళోజీ నిష్కామయోగి ఆయన తాత్విక చింతనా పరుడు అన్యాయాలను, అక్రమాలను ఎంత మాత్రం సహించలేనివాడు కాళోజీ అవనిపై జరిగేటి అన్యాయాలు, అక్రమాలు ఆయన హృదయానికి అమితమైన ఆవేదన కలిగించాయి ఆవేదన ఫలితంగా కాళోజీకవి లేఖిని నుంచి 'నాగొడవ' గీతాలు, ఇతర గీతాలు, అనేక రచనలు పుంఖానుపుంఖంగా వెలువడినాయి కాళోజీ జీవితం, ఆయన ఆత్మ కథ గత శతాబ్ది తెలంగాణ రాజకీయ, సామాజిక, సాహిత్య ఉద్యమాలకు దర్పణం అనడంలో సందేహం లేదు కట్టుబాట్లకు, కబంధ బంధనాలకు, విద్వేషాలకు, వైషమ్యాలకు అతీతుడైన మానవతావాది కాళోజీ ఎక్కడ ప్రజలుంటే అక్కడ కాళోజీ నిటారుగా కనిపించారు, గంభీరంగా నినదించారు ఎక్కడ ఉద్యమంఉంటే అక్కడ కాళోజీ ప్రేరణ ఊపిరిగా జీవించారు, భాసించారు ఆయన మన మధ్య లేరంటే నమ్మడం కష్టం తరతరాలకు స్ఫూర్తిదాయకం కాళోజీ జీవితం ఆయనే ఒక సజీవఉద్యమం విశాలాంధ్రవాదిగా వరంగల్లు వీధులలో ప్రజల ఆగ్రహాన్ని గమనించిన కాళోజీ చివరి శ్వాసవరకు తెలంగాణాకు న్యాయం జరగాలని తపించారు ప్రజలహక్కుల కోసం, ప్రజాస్వామ్య సూత్రాల పరిరక్షణ నిమిత్తం ఎక్కడ, ఎవరితోనూ రాజీపడని మహోన్నత వ్యక్తిత్వం కాళోజీది పద్మవిభూషణ్‌కంటే ప్రజాభిమానమే మిన్న అని ఆయన విశ్వసించారు ప్రజల మనిషిగా, ప్రజాకవిగా తన ప్రజల హృదయాలలో శాశ్వత స్థానం పొందిన కాళోజీ చిరస్మరణీయుడు

- 14 నవంబర్, 2002, వార్త

# ఆనాటి ప్రజాకవి వేమన్నే నేటి కాళన్న (లేదా) ఏడు దశాబ్దాల ప్రజాస్వామ్య సంస్కృతికి ప్రతినిధి కాళోజి

జయప్రకాశ్ నారాయణ్ మరణించినప్పుడు కాళోజి "పుట్టుక నీది/ చావు నీది బతుకంతా దేశానిది" అనే కవిత రాశాడు ఇందులోని చివరిపదం "దేశానిది' తీసి వేసి "ప్రజలది" అని మారిస్తే ఆ కవిత కాళోజీకి అక్షరాలా వర్తిస్తుంది కాళోజీపై అంతకన్నా చక్కని ఎలిజి సంక్షిప్తంగా ఎవరూ రాయలేరు

హైదరాబాద్‌లో ఆయన భౌతికకాయం ఊరేగింపులో అదే కవిత్వ చరణాల్ని బేనర్ చేశారు అభిమానులు నిజానికి జె పి తో కాళోజీని పోల్చవచ్చు కాని జె పి కవి కాదు అందుకే కాళోజీ కాళోజీయే కాళోజీకి సాటిరాగల మరో వ్యక్తిత్వం గతంలోనూ ఆగతంలోను కనిపించదు కాళోజి మరణించేనాటికి వయస్సు ఎనభై తొమ్మిదేళ్ళు సుమారు డెబ్బై ఏళ్ళ క్రిందట రచన ప్రారంభించాడు రచనతో పాటే క్రియాశీల కార్యక్రమాలలో కార్యకర్త అయ్యాడు నిజానికి ప్రజా ఉద్యమాల్లో ఉపన్యాసాలు చేయలేని పని కవిత్వపంక్తులు, కథలు చేస్తాయని భావించాడు అందుకే రచనలు చేశానని తన జీవిత కథలో చెప్పుకున్నాడు ఈ కారణం వల్లే కాళోజి తన రచనల మీద మమకారం ఏర్పరుచుకోలేదు వాటి కారణంగా కీర్తి సంపాదించు కోవాలను కోలేదు తనకై తానుగా వాటిని ఎన్నడూ పత్రికలకి కూడా పంపలేదు దాశరథి కృష్ణమాచార్యలాంటి వారు కాళోజి కవితలు సేకరించి గ్రంథ రూపంలో తీసుకురావడం వల్ల ఎవరో ఒకరు ఆ తరువాత పునర్ముద్రిస్తూ వచ్చారు

ప్రజల కోసం రాసిన కవితలకు వెలపెట్టి అమ్మడానికి కూడా ఒప్పుకోలేదు అందుకే ఆయన చాలా కవితల పుస్తకాలు అమూల్యాలే వేలాది ప్రతులు ఉచితంగా పంచి పెట్టిన ఘనత కూడా కాళోజీదే

కాళోజి తన కవిత్వాన్ని సంభాషణల్లో, ఉపన్యాసాల్లో వినిపించే వాడు రాత విధానంలో కాకుండా నోటి విధానంలో కవిత్వాన్ని రూపొందించాడు ఈ మౌఖిక లక్షణం దృష్ట్యానే ఆయన కవితని చూడాలి సంఘటన, సందర్భం ఆయన కవిత్వానికి రెండు కళ్ళు వీటిని విడదీయకపోతేనే ఆయన కవిత్వం గొప్పదనం అర్థం అవుతుంది

విద్యార్థి దశలోనే వయసుకిమించిన నాయకుడిగా ఎదిగాడు ఆర్యసమాజ కార్యక్రమాలు, ఆంధ్రమహాసభ, విద్యార్థి ఉద్యమాలతో ఉపన్యాసకుడిగా మారాడు ఇతర నాయకులకన్నా భిన్నంగా ప్రజలను కదిలించే ఉపన్యాసం చేయాలంటే 'కవిత్వం' అవసరం అని గుర్తించాడు స్వరాన్ని సైరనుగా, కలాన్ని కాహళిగా మార్చాడు

అనుభవాలను, పిట్టకథలు జోడించి తాను చెప్పదలుచుకునే విషయాన్ని విస్పష్టం చేసేవాడు నలుగురు కలిసి ముచ్చటించుకునే వేళలో కూడా పిట్టకథలతో చేసే సంభాషణ అనితరసాధ్యం ఏ విషయానికైనా చరిత్రలోంచి ఉదాహరణగా ఓ కథని చెప్పేవాడు ఆ రకంగా ఆయనతో ఎంతసేపు కూర్చున్నా ఎన్నో విషయాల్ని తెలుసుకున్న తృప్తి ఉండేది

దర్పం అధికారం, ఆధిపత్యం వీటిని అధికంగా నిరసించేవాడు ఇవి ఉన్న రాజాధిరాజులు నియంతాలు చరిత్రలో నామరూపాలు లేకుండాపోయిన విషయాలను వివరించేవాడు అతి సామాన్య మానవులు రాజుల్ని ఎదిరించిన వైనం చెప్పేవాడు గర్వం అహంభావం గల పాదుషా తన రాజ్యంలో ఒక సాధువు శిష్యులతో కలిసి సుఖంగా ఉన్నాడని, ఎవరినీ ఏదీ అడగడని చెప్పారు పాదుషాగారు తన అతిథిగా రావలసిందిగా చాలా సార్లు కబురుపెట్టారు రాలేదు చూసీ చూసీ పాదుషాగారే ఆయన వద్దకు వెళ్ళారు వెళ్ళిన సమయానికి ధ్యానంలో ఉన్నారు పాదుషాగారు తిరిగి వెళ్ళిపోయారు ఎంతో పట్టుదలతో మరోసారి వచ్చి తన అతిథిగా తీసికెళ్ళాడు చక్కని వసతులతో గొప్ప భోజనం ఏర్పాట్లు చేశాడు ప్రతిరోజు రాత్రి వేళ వచ్చి ఎలా ఉన్నారని అడిగేవాడు అంత సుఖంగా లేనని చెప్పేవాడు సాధువు మరింత మంది సిబ్బందిని ఏర్పాటుచేసి దేశవిదేశాల రుచులు ఏర్పాటు చేశాడు మరుసటి రోజు మళ్ళీ అడిగాడు ఎలా ఉన్నారని అంత సుఖంగా లేనని అన్నాడు వారం రోజులు

గడిచాయి సాధువు బలవంతంగా తన గ్రామానికి పయనమయ్యాడు అసలు సాధువు ఏయే వసతులతో, ఎంత చక్కని భోజనం చేస్తాడో చూద్దామని మారు వేషంలో సాధువు కుటీరానికి వచ్చాడు వస్తున్నప్పుడు పెద్ద వర్షం పడింది నాలుగ్గంటలు వేచి చూడవలసి వచ్చింది చుట్టూరా తిరిగి ప్రయాణించడం వల్ల చాలా అలసిపోయాడు సాధువు కుటీరం చేరేవరికి బాగా పొద్దు పోయింది కడుపులో ఆకలి నకనకలాడుతోంది వర్షంలో వచ్చిన ప్రయాణికుణ్ణి చూసి తనతో పాటుగా భోజనానికి లేపాడు ఓ రొట్టె, ఇంత అన్నం, వేడివేడి పప్పు వడ్డించాడు పాదుషాగారు అవురావురుమంటూ తిని సంతృప్తిగా త్రేన్చాడు కళ్ళమీదకు నిద్ర తన్నుకొస్తుంటే సాధువు అల్లిన కొత్త చాపలో పడుకున్నాడు పొద్దుపొడిచి లేచేసరికి ఎంతో హాయిగా అనిపించింది కట్టుబాట్లు కాపలాల మధ్య కలత నిద్రే తప్ప నిజమైన నిద్ర పట్టని పాదుషాగారు పదే పదే కృతజ్ఞతలు చెప్పాడు అందుకు సాధువు జవాబిస్తూ అయ్యా ఆకలి కావడం ముఖ్యం అన్నం ఏమిటనేది కాదు కంటికి నిద్రరావడం ముఖ్యం పడకేమిటన్నది కాదు నిన్న రాత్రి మీకు ఆకలయింది నిద్ర ముంచు కువచ్చింది నాకెందుకు కృతజ్ఞతలు అన్నాడు నిన్న రాత్రి మీరుకూడా చక్కని భోజనం చేసి కంటినిండా పడుకున్నారా? అడిగాడు రాజు ఆకలిగొన్న వాడికి నా భోజనం పెట్టగలిగాననే సంతృప్తి వల్ల కడుపునిండింది హాయిగా కన్ను మలిగింది అన్నాడు సాధువు

పాదుషా వారికి అప్పుడు తెలిసివచ్చింది సాధువు సంతృప్తి ఏమిటో ఆ మహానుభావుడి ముందు తానెంతో పేదవాడో అర్థమైంది కాళోజీ ఈ కథ చెప్పాక నాకు మాత్రం ఇవ్వాళటికి ఆకలికీ నిద్రకు ధోకా లేదురా అనేవాడు

నిజానికి కాళోజి ప్రజల కష్టాలను చూసి కన్నీళ్ళు పెట్టుకున్నాకేకాని తనకు కష్టాలు కొనితెచ్చుకోలేదు కవి కావాలని ఆశించలేదు కథకుణ్ని కాలేకపోయానని చింతించలేదు రాజకీయాలను ఈనడించాడే కాని అందులో రాణించలేకపోయానని ఏనాడూ అనుకోలేదు పార్టీలను దూరంగా ఉంచాడు నిర్మాణాల ఆధిపత్యాన్ని నిరసించాడు వాటివల్ల లబ్ధిపొందాలని భావించలేదు ఉన్ననాడు ఎంత ఆనందించాడో లేనివాడూ అంతే సంతోషంగా ఉన్నాడు

అనాడు వయస్సుని మించి ఆర్యసమాజంలో నాయకుడిగా చెలామణి అయ్యాడు గాడిచర్ల హరి సర్వోత్తమ రావు సహచరుడిగా గ్రంథాల యోద్యమంలో దూసుకు వెళ్ళాడు నాలుగు కాలాల వకీలు వృత్తిలో కొన సాగినా నాలుగు డబ్బులు వెనకేసుకునేవాడు ఉపాధ్యాయుల నియోజకవర్గం నుండి 1958లో కౌన్సిల్‌కు పోటీలో గెలుపొంది ఎం ఎల్ సి అయ్యారు అప్పుడూ చేతి చమురు వొదుల్చుకున్నారు 1978లో "సత్తుపల్లి ఓటర్ల సత్తువెంతో తేలాలి/ జలగం సత్తామత్తు వదలగొట్టాలి" అనే లక్ష్యంతో జలగం వెంగళరావుకు వ్యతిరేకంగా పోటీ చేశాడు కాంగ్రెస్‌వాదిగా ఉంటూ పార్టీలోనే ప్రతిపక్షంగా ఉన్నాడు ఏ ముఖ్యమంత్రినైనా పేరుపెట్టి సంబోధిస్తూ కవితల్ని రాశాడు

1939లో 25వ ఏట సత్యాగ్రహం చేసి జైలు కెళ్ళాడు 1943లో రెండోసారి వరంగల్ నగర బహిష్కరణ శిక్షని అనుభవించాడు వరంగల్ కోటలో రజాకార్లు మొగిలయ్యని పట్టపగలు కాల్చి చంపారు సురవరం ప్రతాపరెడ్డి నడుపుతున్న గోలకొండ పత్రికలో ఆ దారుణాన్ని నిరసిస్తూ కవితాత్మక బహిరంగలేఖ రాశాడు అలాగే 1946లో భారతీయ నావికాదళ సిబ్బంది జరిపిన తిరుగుబాటు సందర్భంగా 'పార్థివ వ్యయం' కవిత రాసి కరపత్రంగా పంచాడు ఎక్కడైతే ఉపన్యాసంలో తన భావాలను చెప్పలేని చోట కవితారూపంలో ప్రచారం చేశాడు

'చిట్టి సంసారాలు' (1934) అనే కథతో ప్రారంభమైన సాహిత్యజీవితంలో ఇప్పటిదాకా 21 పుస్తకాలు అచ్చయ్యాయి ఇందులో "నా గొడవ" పేరుతో పది సంపుటాలు "ఇదీ నా గొడవ" (1995) ఆత్మకథ, "కాళోజి కథలు" (2000), నా గొడవ సమగ్ర కవితా సంకలనం (2001) అచ్చయ్యాయి

కాళోజీకి చిన్నతనంలోనే మరాఠీ, ఉరుదూ, తెలుగు భాషలతో పరిచయం వుంది పాఠశాలలో ఆంగ్లం నేర్చుకున్నాడు అందుకే కాళోజి అనువాదాలు కూడా చేశాడు బ్రెయిల్ ఫోర్డ్ రాసిన 'రెబల్ ఇండియా' పుస్తకాన్ని 'నా భారత దేశ యాత్ర' పేరుతో 1941లో అనువదించాడు ఎన్ సి ఫడ్కే రచనని తెలుగులో అనువదించాడు ఖలీల్ జిబ్రాన్ కవితలకు కూడా అనువదించాడు సానే గురూజి రచించిన మరాఠీ గ్రంథాన్ని 'భారతీయ సంస్కృతి' పేరుతో అనువదించారు ఖలీల్ జిబ్రాన్ కవిత్వానువాదం

'జీవనగీత' కు 1968లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తమ అనువాద రచన అవార్డుని బహూకరించింది

నిర్భీతి, వ్యంగ్యం, విమర్శ, సునిశిత పరిశీలన, నిరసన, ధిక్కారం ఇవీ కాళోజీ కవిత్వంలో కనిపించే లక్షణాలు చూసిందీ తోచిందీ రాసాడు అంతేకాని ఊహలు భ్రమలు కలికానికి కూడా కానరావు వ్యక్తిగతంగా ఎంత కరుణార్ద్ర స్వభావో జనజీవనరంగంలో అంత కఠినాత్ముడు ఓ చెంప కన్నీరొలికిస్తూనే మరో చెంప లావా కురిపిస్తాడు గాఢకంగా మారినా అంతలోనే కాలకంఠుని అవతారమెత్తుతాడు బాధలకు బ్లాటింగు పేపర్ లాంటి వాడు కావాలని బాధించిన వాడిని మాత్రం బహిరంగంగా ఎండగట్టే శక్తివంతుడు మొగమాటం, నంగితనం, హిపోక్రసీలకు బహుదూరం అతని వ్యక్తిత్వమే అతని కవిత్వం ఎంత వెదికినా నగిషీలు కనిపించవు పైపై మెరుపుల పూతలు, ధగధగలు లేని కవిత్వం విమర్శకులకి రుచించలేదు ఆ రకంగా కాళోజి కవిత్వానికి కొంత అన్యాయం జరిగింది

"జరిగిందంతా చూస్తూ ఎరగనట్లు పడి ఉండగ సాక్షీభూతుణ్ణి గాను / సాక్షాత్తు మానవుణ్ణి" అనే కాళోజి ఈ సమాజంలో ఒక బాధ్యతాయుత పౌరుడు ఆ పౌరుడు కవి అయితే ఏం చేస్తాడో సరిగ్గా అదే చేశాడు ఇంకా గొప్పలకు పోయి ఏవేవో సిద్ధాంతాలను వల్లెవేస్తూ కల్లబొల్లి మాటలు పలకలేదు దేశంలో ఎమర్జెన్సీ విధించినప్పుడు కాళోజి తన కలం కాహళికి పనిచెప్పాడు "Democracy is dead/ long live emergency" /రాష్ట్రపతీ కాస్త చెప్పు" అని ప్రశ్నించాడు ఎమర్జెన్సీ ప్రకటించిన రెండో రోజే ఈ కవితని రాసాడు తత్కాలంలో ఎమర్జెన్సీని ధిక్కరిస్తూ తెలుగులో ఇన్ని కవితలు రాసినవాడు ఒక్క కాళోజియే అంటే అతిశయోక్తి కాదు

కాళోజీ కవిత్వంలో మూడు ముఖ్యమైన లక్షణాలున్నాయి అందులో 'బ్రివిటీ' ముఖ్యలక్షణం 'సరళమైన భాష' ఆయన సొంతం మరో ముఖ్యమైన అంశం ధిక్కారం

"నాది పలుకుబడుల భాష, బడి పలుకుల భాష కాదు" అని సగర్వంగా చాటుకున్న కాళోజి "ఏ ప్రాంతం వారు ఆ ప్రాంతం వాడుక భాషలోనే రాయాలి" అని బల్లగుద్ది మరీచెప్పాడు రెండున్నర జిల్లాలదే దండి భాష అయినప్పుడు / తక్కినోళ్ళ నోళ్ళ యాస/ తొక్కి నొక్క బడ్డప్పుడు ప్రత్యేకంగా రాజ్యంపాలు/ కోరడం తప్పదు అని భావించాడు

తెలుగుభాషలో కనిపించే ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణ కళింగ ప్రాంతాల భాషలు, మాండలికాలు కలిస్తేనే తెలుగుభాష అలాంటి తెలుగు భాషలో ఒక ప్రాంతం భాష ఆధిపత్యం వహించి మిగతా ప్రాంతాల ప్రజలను తక్కువగా చూడ్డం, న్యూనతకి గురిచేయడం ఎంతమాత్రం అంగీకరించలేదు

'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' నినాదంతో ప్రభావితుడైన కాళోజి వరంగల్‌లో దాశరధి, శ్రీశ్రీలతో పాటుగా విశాలాంధ్ర తీర్మానం చేశాడు అందుకు వ్యతిరేకంగా ప్రజలు రాళ్ళు విసిరినా అణుమాత్రం చెక్కు చెదరకుండా ఎదురొడ్డి నిలిచాడు జనం వెనక్కు తగ్గారు

కాని కాలం గడిచాక జరిగిన తీరు కాళోజిలో మార్పు తెచ్చింది అన్ని రంగాల్లో వెనకబాటుతనం యదాస్థితి కొనసాగడం వల్ల "దోపిడి చేసే ప్రాంతేతరులను / దూరం దాకా తన్ని తరుముతం/ ప్రాంతం వారే దోపిడి చేస్తే / ప్రాణంతోనే పాతర వేస్తం" అని తన "ప్రజల తెలంగాణా" భావాన్ని కుండబద్దలు కొట్టినట్లు ప్రకటించాడు తెలంగాణా ప్రజా సంస్కృతికి విఘాతం కలిగినప్పుడల్లా తన స్వరాన్ని వినిపించాడు ఆ రకంగా రాజకీయాలు చేయని పనిని కవి కాళోజి చేసి చూపాడు ఐతే ఎన్నడూ తనకు నాయకత్వం కావాలని ముందుకు రాలేదు అణగారిన ప్రజలలో ఒకడిగా తనని తాను భావించుకుని ఆ స్థాయిలో తన గళమెత్తాడు అశేష తెలుగు ప్రజల పౌరహక్కుల కోసం అహర్నిశలు శ్రమించాడు ప్రభుత్వాలు ప్రజల సంక్షేమం మరిచినప్పుడల్లా అతివాద మితవాద పార్టీలనే బేధం లేకుండా ఖండించాడు వారి విద్యుక్త ధర్మాన్ని గుర్తుచేశాడు

అలా చివరి క్షణం దాకా ఆలోచిస్తూ, రాస్తూ, మాట్లాడిన కవి కాళోజి అందుకే "నేను బతికే ఉంటాను / నా పరాయితనం పొగొట్టే ఆర్ద్రత/ చెలిమి చెలిమలో / చిందునన్నాళ్ళు / నా ఇరుకుల చేరి దూరి / అర్థమైన మురికినంతా / తన్నేసే జీవననది/ జీవనదిగా ప్రవహించునన్నాళ్ళు" అని చెప్పుకున్నాడు

వేమన్న ఆధునిక కాలంలో పుడితే కాళన్న అయ్యాడనిపిస్తుంది కాళోజిని స్మరించుకోవడం అంటే మరోసారి తెలుగునేల మీది ఏడు దశాబ్దాలను స్మరించడమే అలా జీవించిన కాళోజిని స్మరించుకోవడమే ఒక బాధ్యత

# ప్రజాతంత్ర చేసుకున్న అదృష్టం

- దేవులపల్లి అమర్

వరవరరావు ఫోన్ చేసారు నిమ్స్‌లో కాళోజీని చూడాలె అక్కడి నుండి జూబ్లీ హిల్స్‌కు పోయి మలోనను కూడా చూసిరావాలె నువ్వే తీసుకపోవాలె ఎప్పుడు వీలైతది అని

ఆ రోజు నవంబర్ ఒకటి ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం తెలంగాణ వాదులకు విద్రోహదినం ఆ సాయంత్రమే వరవరరావుగారిని చిన్నమ్మను, బన్నిని నిమ్స్‌కు వావ్యాన్‌లో తీసుకుపోయిన నేను దగ్గరికిపోతే ఆయాన పడుతూ 'అమర్‌గాదా' అన్నాడు కాళోజీ తలఊపిన ఆయన గొంతు వినడం అఖరుసారి అవుతుం దని అప్పుడుకోలేదు

మొట్టమొదటిసారి నేను కాళోజీని చూసింది 1969లో అప్పుడూ వరవరరావు ఉన్నారు నేను అఖరు సారి ఆయనను కలిసిన్పుడూ వరవరరావు ఉన్నారు ఇదెందుకు చెబుతున్నానో తెలియదుకాని జరిగిందిట్లా 1969లో ప్రత్యేక తెలంగాణోద్యమం మహోధృతంగా సాగుతున్నప్పుడు స్కూళ్ళు బంద్ అయినయ్, దాదాపు సంవత్సరం పాటు చదువులేదు మేంతాత్కాలికంగా వరంగల్‌కు మకాం మార్చినం గాంధీహాస్పిటల్ ఎదురుగా ఇస్లామియా జూనియర్ కాలేజి పక్కనే ఇల్లు కిరాయికి తీసుకుని ఉండేవాళ్లం అప్పుడు నాకు 13ఏళ్లు మా బావ ఎన్ కె రామారావు అప్పటికే కవిత్వం రాసేవాడు ఆయనంటే ఇష్టం కారణంగా వెంట తిరిగేవాడిని

సరిగ్గా గుర్తు లేదు కానీ వారానికి ఒకసారో పదిహేను రోజులకు ఒకసారో హనుమ కొండలో 'మిత్ర మండలి' సమావేశం అయ్యేది అందరూ కలుసుకుని తాము రాసినవి చదివి వినిపించేవారు ఇతరులు తమ అభిప్రాయాలు చెప్పేవారు చర్చ జరిగేది

అటువంటి ఒక సమావేశానికి ఎన్ కె నన్ను తన సైకిల్ మీద ఎక్కించుకుని తీసుకు పోయాడు (ఇప్పటికీ నిన్ను సైకిల్ మీద ఎక్కించుకొని తిప్పలేదా అని వేధిస్తుంటాడు) ఆ మిత్ర మండలి సమావేశం కాళోజీ ఇంట్లో జరిగింది మొట్టమొదటిసారి నేను కాళోజీని చూసింది అప్పుడే అక్కడ చాలా మంది ఉన్నారు, వాళ్లలో వరవరరావు కూడా ఉన్నారు అయన మాత్రమే గుర్తుంది పోవడానికి కారణం ఏమిటంటే ఆసమయంలో అందరి కంటే చిన్నవాడినైన నేను తెలిసీ తెలియని వొచ్చీరాని భాషలో తెలంగాణ ఉద్యమాన్ని సమర్థిస్తూ అప్పటి ముఖ్యమంత్రి కాసుబ్రహ్మానందారెడ్డిని విమర్శిస్తూ కవిత్వం రాసుకుపోయి చదివాను

చిన్నవాడిని కాడట్టి చిన్నబుచ్చకూడదనుకున్నా రేమో కాళోజీ బాగుందని మెచ్చుకున్నారు వరవరరావు అప్పటి తాజా సృజన సంచిక మీద 'అభినందనలతో అమర్‌కు' అని రాసిఇచ్చారు

అప్పటి నుంచి ఈ 33 ఏళ్ల కాలంలో నాకు వీలు దొరికినప్పుడల్లా కాళోజీని కలుస్తూనే ఉన్నాను ఆయన సమావేశాలు జరిగితే మాట్లాడేది వింటూనే ఉన్నాను

వరంగల్‌లో కాళోజీ అంతిమ యాత్ర ముగిసిన తరువాత జరిగిన సభలో మాట్టాడుతూ వరవరరావు చెప్పినట్టు ఆయన పద్మాక్షమ్మ గుట్ట, వేయిస్థంభాల గుడి అంతటివాడు ప్రభుధిక్కారంలో పాల్కురికి సోమనాథుడు, బమ్మెరపోతన అంతటివాడు జీన్‌పాల్ సార్త్ర్ అంతటివాడు అయినా ఈ 33 ఏళ్లకాలంలో నావంటి వాళ్లతో ఆయన స్నేహంగా, ఆప్యాయంగా ప్రేమగా మెలగడం నాకు చిత్రంగా అనిపించేది

1969 తెలంగాణ ఉద్యమానికి, జరిగిన విద్రోహం అనంతరం జైతెలంగాణ పత్రిక వచ్చింది నారాయణగూడలో సాహితీ ప్రింటర్స్‌లో ప్రింట్ అయేది ఆ పత్రికకు నేను ప్రూఫ్‌లు చూసే వాడిని అక్కడి నుండే నాకుజర్నలిజం మీద ఆసక్తి పుట్టింది జై తెలంగాణ పత్రికలో కాళోజీ కవిత లెన్నిటికో ప్రూఫ్‌లు నేనే చదివాను 1974లో కోఠిలోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం లో కాళోజీ షష్టిపూర్తి సభ జరిగింది భాషా నిలయం భవనంపై అంతస్థులో ఆరుబయట ఈ కార్యక్రమం ఏర్పాటు చేసారు పి వి నరసింహారావు ఆ సభకు ముఖ్య

అతిథి ఆసభలో జరిగిన రెండు విషయాలు నాకు బాగా గుర్తు షష్టిపూర్తి కదా అందరూ పూల దండలు వేసి ఆయనను సత్కరిస్తూ పోయారు అవన్నీ తీసి ఆయన తన పక్కన పెట్టుకుంటూ పోయారు అవన్నీ పెద్ద గుట్టగా తయారయ్యాయి చివరకు సన్మానానికి జవాబుగా ప్రసంగిస్తూ ఆ గుట్టను చూసి 'ఇవన్నీ ఏందిరా ఇక్కడ నా సమాధి మీద పెట్టినట్టు' అని చమత్కరించారు

రెండవది ఎ వి నరసింహారావు గారు రాష్ట్రానికి ఏమీ చెయ్యడం లేదని తిట్టడం బహుశా అప్పుడు పి వి కేంద్రమంత్రిగా ఉన్నారేమో, నిర్మొహమాటంగా ఆయనను కాళోజీ వేదిక మీదనే పట్టుకుని తూర్పారబట్టి వదిలారు

ఆ తరువాత సరిగ్గా పదేళ్ళకునేను ఎన్నడూ ఊహించని, ఆశించడానికి కూడా వీలులేని అవకాశం ఒకటి వచ్చింది సికిందరాబాద్ కుట్ర కేసు పెట్టి పది సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా విప్లవ రచయితల సంఘం హైదరాబాద్‌లో పెద్ద ఊరేగింపు నిర్వహించింది అసెంబ్లీ వైపు బయలుదేరిన అ ఊరేగింపు అగ్రభాగాన కాళోజీ అందులో పాల్గొన్న వందమందిని పోలీసులు అరెస్టు చేసి గోషామహాల్ స్టేడియంలో పడేసి నానా బాధలు పెట్టారు ఆ సందర్భంలోనే సాయంత్రం ఆంధ్ర సారస్వత పరిషత్‌లో జరగాల్సిన సభలో ప్రధానవక్త కాళోజీ, అధ్యక్షత వహించాల్సిన వాళ్లంతా స్టేడియమ్‌లో పోలీస్ కస్టడీలో ఉన్నారు ఎవరో నన్ను ఆ సభకు అధ్యక్షత వహించమన్నారు కాళోజీతో కలిసి వేదిక మీద నా అమ్మో అని కాళ్ళు చేతులు చల్లబడ్డాయి, వొణికినై అయినా తప్ప లేదు అనాడు ఎవరో తీసినఫోటో జాగ్రత్తగా దాచుకున్న

తరువాత చాలా సార్లు రాంభట్ల కృష్ణమూర్తి ఇంట్లో అబ్బూరి వరదరాజేశ్వరరావు, కాళోజీ ఇంకొంత మంది కలిసినప్పుడు, హైదరాబాద్ విముక్తి దినం సందర్భంగా జవాద్ రజ్వీతో బాటు కాళోజీని ప్రెస్‌క్లబ్‌లో సన్మానించినప్పుడు 2001 సెప్టెంబర్‌లో ఆయన 88వ పుట్టిన రోజు సందర్భంగా సాయంత్రం తెలంగాణా ప్రభాకర్ ఇంట్లో కలిసి నప్పుడు ఇట్లా సందర్భం ఏదైనా కాళోజీని కలిసినప్పుడల్లా అయన మాటలు విన్నప్పుడల్లా ఛాతీ గర్వంగా ఉప్పొంగేది కారణం తెలియదు

1998 జనవరిలో 'ప్రజాతంత్ర వార పత్రిక ప్రారంభించాలనుకున్నప్పుడు 1997 చివరి రోజులల్లో నేను సలహా కోసం చాలామందిని కలిసాను ఎందరో నిరుత్సాహపరిచారు కొందరే ఉత్సాహ పరిచారు

అందులో ఇద్దరు అలనాడు వరంగల్‌లో పాములపర్తి సదాశివరావు సంపాదకత్వంలో నడిచిన కాకతీయ అనుభవాన్ని గురుతు చేసారు

'ఆర్ యూ సీరియస్ నడపగలవా' అని పి వి నరసింహారావుగారు అంటే 'బాగా నడుపు' అని కాకతీయ పత్రికను గుర్తు చేసుకున్నవాడు కాళోజీ పత్రిక మేం ప్రారంభించిన మొదటి నెలలోనే 1350 రూపాయలు తన వంతు విరాళంగా, పత్రిక చందా పంపించారు ఆనాటి నుంచి అయన ప్రజాతంత్ర చదవని, చదివించుకోని వారం లేదు

నిన్న కాకతీయ వైద్య కళాశాల ఆవరణలో అంతా అయిపోయాక నాగిళ్ళ రామశాస్త్రి గారి దగ్గరికి పోయి వీడ్కోలు తీసుకుంటుంటే ఆయన నన్ను గట్టిగా కావలించుకొని పత్రిక పంపడం ఆపొద్దు కాక (కాళోజీ) అడ్రస్‌ను కంటిన్యూ చెయ్యండి, చందా నేను కడతా'న న్నారు ఇద్దరమూ ఏడ్చాము

కాళోజీ వంటి మహానుభావుడికి ఇష్టం కావడం 'ప్రజాతంత్ర' వంటి చిన్న పత్రిక చేసుకున్న అదృష్టం

❖ ❖ ❖

# తెలంగాణ ఆత్మగా జ్వలించిన కవి

- అమరనాథ్ కె మీనన్

ఆయన సాటి స్వాతంత్ర్య యోధుల్లో కూడా ప్రత్యేకంగా నిలచిన ఏకవీరుడు రాజ్య వ్యవస్థను సవాలు చేసి జ్వాలాముఖి కడపటివరకు తన బాటే తనదిగా సాగిన ధీరుడు ప్రజా సమస్యలపై నిర్విరామంగా గళమెత్తిన కాళోజీ నారాయణరావు ఒక్క ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు విషయంలో తప్ప, తన మిగతా లక్ష్యాల సాధన లో గణనీయ పురోగతి సాధించగలిగారు సామాన్య ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై ఆయన దృష్టి కేంద్రీకరించి, వాటి పరిష్కారం కోసం ఉద్యమించేవారు సామాన్య ప్రజానీకానికి సంబంధించి ఏ చిన్న సమస్య తన కళ్ళబడినా వెంటనే దానిని నిరసిస్తూ నడుం బిగించేవారు ప్రజల కోసమే నా జీవితం' అని నమ్మి వారి కడగండ్లపై సభల్లో ప్రసంగించేవారు వ్యంగ్య కవనాలు వెలువరించేవారు అందుకే ఆయన 'ప్రజాకవి' అయ్యారు ఆయన ఇరవైకి పైగా రచనలు చేశారు అందులో నా గొడవ చాలా ప్రముఖమైంది స్వతహాగా ఎంతో సున్నితమనస్కుడు కావడంతో కాళోజీ నారాయణ రావు ఆనందమొచ్చినా విషాదం వచ్చినా పట్టలేక అదేపనిగా కన్నీళ్ళు పెట్టుకునేవారు

అభిమానులు 'కాళన్న' అని ఎంతో ఆప్యాయం గా పిలుచుకునే కాళోజీ నారాయణరావు 1914 సెప్టెంబర్ 9వ తేదీన వరంగల్ దగ్గరలోని మడికొండ గ్రామంలో జన్మించారు తల్లి రమాబాయి కర్నాటకకు, తండ్రి కాళోజీ రంగారావు మహారాష్ట్రకు చెందినవారు ఆయన మడికొండ, వరంగల్, హైదరాబాద్‌లలో విద్యనభ్యసించారు మొదటి నుంచీ ప్రజలతోనే మమేకమయ్యారు 1930లలో ఆర్య సమాజ్, వందేమాతరం ఉద్యమాలలో, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్, ఆంధ్ర మహాసభ కార్యకలాపాలలో ముమ్మరంగా పాల్గొన్నారు 1940లలో నైజాం ప్రభుత్వానికీ, రజాకార్ల అకృత్యాలకూ వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటంలోనూ పాలు పంచుకున్నారు 1970లలో అత్యవసర పరిస్థితి కాలంలో జరిగిన నక్సలైట్ల బోగస్ ఎన్‌కౌంటర్లను నిరసిస్తూ గళమెత్తారు ప్రత్యేక తెలంగాణ కోసం ఆయన చివరి ఊపిరి వరకు పలవరిస్తూనే ఉన్నారు ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయనది పోరాట పంథా ప్రజా సమస్యలపై ఉద్యమిస్తూనే కవిగా, రచయితగా కూడా ప్రకాశించారు తన ప్రసంగాలలో, రచనల్లో ప్రాచీన ఇతిహాసాల నుంచి అనేక ఉపమానాలను అలవోకగా ప్రయోగించేవారు 1995 సంవత్సరంలో వచ్చిన ఆయన ఆత్మకథ ఇదీ నా గొడవలోనూ, గత ఏడాది కాళోజీ 88వ జన్మదిన సందర్భంగా వెలువడిన 600పేజీల కవితా సంకలనం నా గొడవలోనూ ఈ అంశం ప్రస్ఫుటమైంది

ఆయన కవిత్వంలో భావోద్వేగం సూటిగా, సరళంగా, అదేసమయంలో శక్తిమంతంగా కూడా వ్యక్తమవుతుంది తెలుగులో ప్రముఖ రచయితగా ఖ్యాతి పొందిన కాళోజీ మరాఠీ, హిందూ, ఉర్దూలలో కూడా రచనలు చేశారు కాళోజీ కథలు, బాపు, బాపు, బాపు, జీవన గీత (ఖలీల్ జిబ్రాన్ రచనకు తెలుగు అనువాదం), పరాభవ హేమంతం తదితర రచనలు ఆయన ఆలోచనా రీతినీ, ప్రజాస్వామ్య విలువలు, ప్రాథమిక హక్కుల సంరక్షణ పట్ల నిబద్ధతనూ ప్రతిబింబిస్తాయి అత్యవసర పరిస్థితి విధింపునకు వ్యతిరేకంగా కవులనూ, రచయితలనూ ఒక్క తాటి మీదకు తెచ్చి, ఉద్యమించడంలో కాళోజీ అలుపెరగని కృషి జరిపారు ఆయన అనేక పౌరహక్కుల ఉద్యమాల్లోనూ, రాజకీయ పోరాటాల్లోనూ పాల్గొన్నారు

అయనది కొద్దికాలం ఎన్నికల రాజకీయాల్లో కూడా ఉన్నారు 1958 నుంచి 1960 వరకు ఆయన ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యుడు తరువాత, అంటే 1977లో ఆయన సత్తుపల్లిలో అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు పై పోటీ చేసినా ఆ ఎన్నికల్లో విజయం సాధించలేకపోయారు 1972లో భారత ప్రభుత్వం నుంచి స్వాతంత్ర్య సమర యోధునిగా సన్మానాన్ని అందుకున్నారు 78 ఏళ్ల వయసులో-1992 లో భారత ప్రభుత్వం ఆయనను పద్మవిభూషణ్ పురస్కారంతో సత్కరించింది అదే ఏడాది కాకతీయ విశ్వవిద్యాలయం కాళోజీకి గౌరవ డాక్టరేట్‌ను ప్రదానం చేసింది ఆయన ప్రతిష్ఠాత్మక

బూర్గుల రామకృష్ణారావు స్మారక అవార్డును కూడా అందుకున్నారు అయితే, ఆయన అవార్డులు వచ్చినందుకు పెద్దగా పొంగిపోనూ లేదు రాని అవార్డులకు కుంగిపోనూ లేదు 1968లో ఆయన రచించిన జీవన గీతకు రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఉత్తమ అనువాద పురస్కారం లభించింది ప్రభుత్వానికీ, పీపుల్స్‌వార్ నక్సలైట్లకూ మధ్య చర్చల కోసం ఏర్పాటైన శాంతి సంఘానికి ఆయన నాయకత్వం వహించారు

కాళోజీ వ్యక్తిత్వంలో అత్యంత విలక్షణ అంశం నిర్భయత్వమే ఆయనలోని అసమాన స్థైర్యం యువ పౌరహక్కుల ఉద్యమకారులకు సైతం విస్మయం కలిగించేది ఆదర్శంగా నిలిచేది 1980లలో ప్రసిద్ధ పౌరహక్కుల ఉద్యమకర్త డాక్టర్ రామనాథంను ఆయన క్లినిక్‌లోనే పోలీసులు హతమార్చారని ఆరోపణలు వచ్చినప్పుడు, చాలా మంది పౌరహక్కుల ఉద్యమకారులు ప్రాణ భయంతో వరంగల్‌ను విడిచివెళ్ళడానికి ఉపక్రమించగా, బెదిరిపోవద్దనీ, ఓర్పు పట్టమనీ కాళోజీ వారికి సలహా ఇచ్చారు అప్పటికీ జడుపు వదలని కొందరు కార్యకర్తలను, మరునటి రోజు రామనాథం అంత్యక్రియలు ముగియగానే స్వయంగా వెంటబెట్టుకుని హైదరాబాద్ తీసుకెళ్ళారు

1990 నిషిద్ధ పీపుల్స్‌వార్ గ్రూప్‌ను ఎదిరించడంలో కూడా ఇదే నిర్భయాన్ని ఆయన ప్రదర్శించారు అప్పట్లో పి డబ్ల్యు జి శాసనసభ ఎన్నికల బహిష్కరణకు పిలుపు ఇచ్చింది ప్రాథమిక హక్కుల సంరక్షణకు కట్టుబడి, బోగస్ ఎన్‌కౌంటర్లను నిరసించడంలో మొదట ఉండే కాళోజీ పౌరులు తమ వోటు హక్కు వినియోగించుకోకుండా ఎవరూ ఆపలేరని ఉద్ఘాటించారు తానే వోటర్లను పోలింగ్ కేంద్రాలకు తీసుకెళ్ళి వోట్లు వేయించారు మనసులోని మాట నిక్కచ్చిగా చెప్పడం కాళోజీ లక్షణం ఎవరి తప్పులైనా బహిరంగంలో ఎండ గట్టవలసి వస్తే అందుకు ఏ మాత్రం సంకోచించని నైజం ఆయనది ఈ విషయంలో తన మాటలు ఇతరులను నొప్పించినా లెక్క చేయకుండా కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడే తత్త్వం కాళోజీది ఆయన నిర్మొహమాటంగా చేసే విమర్శలకు ఎందరో ప్రముఖుల ముఖాలు ఎర్రబారాయి నిర్భయస్థుడు, సాహసికుడూ అయిన కాళోజీ, లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్‌ను ఆదర్శనీయుడుగా పరిగణించేవారు మాజీ ప్రధానమంత్రి పి వి నరసింహారావు ఆయనకు ఆప్తమిత్రుడు కాళోజీకి భార్య, కుమారుడు ఉన్నారు దసరా రోజున జారిపడిన కాళోజీకి ఎడమ తుంటిలో, ఎడమ భుజంలో ఎముకలు విరిగాయి నిమ్స్‌లో శస్త్ర చికిత్స చేశారు దాని నుంచి ఆయన కోలు కున్నారు ఆ తరువాత ఆయనకు న్యుమోనియా వచ్చింది

నిస్వార్థ హృదయం త్యాగబుద్ధి సొంతమైన కాళోజీ తన మరణానంతరం ఎల్ వి ప్రసాద్ నేత్ర పరిశోధన సంస్థకు తన కళ్ళను, వరంగల్ కాకతీయ వైద్య కళాశాలకు తన భౌతికకాయాన్నీ విరాళమివ్వాలని కుటుంబ సభ్యులకు ముందుగానే సూచించారు బతికి ఉన్నప్పుడే కాక మరణించిన తరువాత కూడా తన వల్ల ప్రజలకు ఉపకారం జరగాలని ఆకాంక్షించిన ప్రజల మనిషి కాళోజీ

❖ ❖ ❖

# అశ్రునివాళులతో కాళోజి పార్థివ దేహం

## హైదరాబాదు నుంచి హన్మకొండ వరకు

కాళోజి అభిమానుల అశ్రుతర్పణలతో హైదరాబాద్ నుంచి హన్మకొండ నక్కలగుట్టలోని కాళోజి స్వగృహం వరకు ప్రజాకవి, పద్మవిభూషణ్ కాళోజీ నారాయణ రావు 'అంతిమయాత్ర' గురువారం కొనసాగింది దారి పొడుగునా, గ్రామగ్రామాన వేలాది మంది ప్రజలు ఆయన పార్థివ శరీరానికి అశ్రునివాళులు అర్పించి, చివరి వీడ్కోలు పలికారు 'కాళోజీ అమర్ రహేహై', 'పుట్టుకనీది చావు నీది బ్రతుకంతా దేశానిది' లాంటి నినాదాల మధ్య ఆయన అంతిమ యాత్ర సాగింది దారి పొడవునా సభలు, సమావేశాలను ఏర్పాటుచేసి కాళోజి పట్ల తమకున్న ఆత్మీయతను ఈ సందర్భంగా వెల్లడించుకున్నారు ఖైరతాబాద్‌లోని తెలంగాణా ప్రభాకర్‌రావు ఇంటి నుంచి ఉదయం 8 గంటలకు కాళోజి 'అంతిమయాత్ర' ప్రారంభమైంది డప్పుచప్పుళ్లతో, గద్దర్ బృందం పాటలతో అసెంబ్లీ దగ్గరలోని 'గన్ ఫౌండ్రి వరకు ఈ యాత్ర సాగింది వరవర రావు, జ్వాలాముఖి, జయప్రభ, రమా మేల్కొటే, జాదవ్, ఎం టిఖాన్, రత్నమాల, రామకృష్ణ, వేణుసంకోజు, నందిని సిధారెడ్డి, రామశాస్త్రి, వి ఆర్ విద్యార్థి, హరనాథ్, లక్ష్మణ్ తదితరులు హైదరాబాద్‌లో జరిగిన ఈ అంతిమ యాత్రలో పాల్గొన్నారు అంతిమయాత్ర జరుగుతున్నప్పుడు అనేక చోట్ల ట్రాఫిక్ స్తంభించింది గన్‌పార్క్‌లో తెలంగాణా అమరవీరుల స్థూపం దగ్గర జరిగిన సమావేశంలో ఎం ఎస్ రెడ్డి అసెంబ్లీ స్పీకర్ ప్రతిభా భారతి, నాయిని నర్సింహారెడ్డి, సి వి కృష్ణారావు తదితరులు పాల్గొని కాళోజీకి నివాళులు అర్పించారు సమావేశం అయిన వెంటనే మళ్లీ అంతిమయాత్ర ప్రారంభమైంది కాళోజీ భౌతికకాయం పాడవకుండా ఉస్మానియా వైద్య నిపుణులు ఎంబామింగ్ చేసి పెట్టిన పెట్టెతో నిమ్స్ వ్యాన్ బయలుదేరింది ఘట్‌కేసర్‌లో వందమందికి పైగా ప్రజలు భౌతికకాయంపై పూలమాలలు వేసి నివాళులు అర్పించారు భువనగిరిలో తూర్పుమల్లారెడ్డి, జైను మల్లయ్య గుప్త అధ్వర్యంలో విద్యార్థులు, పౌరులు నినాదాలతో కాళోజీకి నివాళులు అందజేశారు జనగామ దాటిన తరువాత రాఘునాపూర్, ఘనపూర్‌లలో సయితం కాళోజి భౌతిక కాయం వ్యాన్ ఆగి, అక్కడి ప్రజల నివాళులను స్వీకరించింది మధ్యాహ్నం 2 45 గంటలకు నక్కలగుట్టలోని కాళోజి స్వగృహానికి అంతిమయాత్ర చేరుకుంది వరవర రావు, వి ఆర్ విద్యార్థి, పొట్లపల్లి శ్రీనివాసరావు, రామశాస్త్రి, రత్నమాల కాళోజి కుటుంబ సభ్యులు కాళోజి భౌతిక కాయం వెంటవచ్చారు

❖ ❖ ❖

# అవార్డుల మ్యూజియం ఆ ఇల్లు

ప్రజాకవి, పద్మవిభూషణ్ కాళోజీ నారాయణ రావు ఇల్లు ఒక అవార్డుల మ్యూజియం హన్మకొండ నక్కల గుట్టలోని ఆయన ఇల్లును సందర్శించిన ప్రతివారు ఆ మ్యూజియమును చూసి మంత్రముగ్ధులైన వారే ప్రజాకవిగా ఆయన గొంతు విప్పిన నాటి నుంచి నేటి వరకు ఆయనకు అందించిన బహుమతులు, సన్మాన పత్రాలను ఆయన గౌరవ వస్తువులుగా భావించి ఆయన ఉండే ముందు గదిలో భద్రంగా ఉంచారు కాళోజీని కలవడానికి వెళ్ళిన వారిని ఆ అవార్డులు, బహు మతులు, సన్మాన పత్రాలు నేస్తాలుగా పలకరిస్తాయి ఆయన ఇంటికి వెళ్ళిన వారు ఎవరూ అవార్డుల గురించి తెలుసుకోకుండా ఉండలేరు మొదటి గదిలో ఏ గోడ ఖాళీగా కనిపించదు ప్రభుత్వాలు, ప్రజాసంఘాలు, సాహితీసంస్థలు, సేవా సంఘాలు, వివిధ సంస్థలు ఇచ్చిన అవార్డులు, బహుమతులు ఆ గదిలో చక్కగా ఏర్పాటు చేశారు సన్మాన పత్రాలను ఫ్రేమ్ చేసి గోడలకు వేలాడదీశారు కాళోజి ముందు రూమ్‌లో కూర్చోగానే అవార్డులు, బహుమతులు గత స్మృతులను ఆయనకు గుర్తు చేసి బాధ్యతను గుర్తు చేసేవి ఇవన్ని చూసిన వారికి కాళోజి ప్రాముఖ్యత మరింతగా అర్థమై ఆయన కాళ్లకు పాదాభివందనం చేసి వెళ్లారు రాష్ట్రపతులు ప్రధానులు, ముఖ్యమంత్రులు మంత్రులు అధికారులు, అందించిన అవార్డుల చిత్ర పటాలు, గోడలపై ఉంటాయి కుటుంబ సభ్యుల చిత్రాలు కూడ అందులో ఉన్నాయి కాళోజిని అన్ని రకాలుగా చిత్రీకరించిన ఫొటోలు కూడ ఉన్నాయి ఆయన జీవిత విశేషాలను ఆ బహుమతులు, చిత్రాలు అవార్డులు తెలియజేస్తాయి అన్ని రకాల అనుభూతులు వీటి ద్వారా పొందవచ్చనడం అతిశయోక్తి కాదు

❖ ❖ ❖

# అదే చివరి సభ... ప్రసంగం

కర్నూలుకు చెందిన గాడిచర్ల ఫౌండేషన్ సంస్థ సెప్టెంబర్ 14న తెలుగు యూనివర్శిటీ వరంగల్ బ్రాంచి కొత్త భవనంలో కాళోజీని 'గాడిచర్ల' అవార్డుతో ఘనంగా సత్కరించింది అక్షర వాచస్పతి దాశరథి రంగాచార్య, జిల్లా కలెక్టరు ప్రభాకర్‌రెడ్డి అతిథులుగా పాల్గొన్న ఈ కార్యక్రమమే కాళోజి చివరి సమావేశం చివరి సన్మానం అయింది 88వ పుట్టిన రోజుకు ముందు కొద్ది రోజుల నుంచి అనారోగ్య కారణాల వల్ల సభలకు మానేశారు ఎంత చిన్న సభ అయినా వ్యక్తుల మీద ఉన్న గౌరవంతో వెళ్లి తనకు తోచిన ఒకటి రెండు మాటలు చెప్పేవారు కొద్దికాలం అనారోగ్యం కారణంగా, తీసుకువచ్చే వారు అందుబాటులో లేక సమావేశాలకు పూర్తిగా దూరమయ్యారు 89వ జన్మదినాన్ని ఇంట్లో నిర్వహిస్తున్నప్పటికీ పది, పదిహేను నిమిషాలు మాత్రమే వేదికమీద కూర్చొని, ఆ తరువాత ఓపిక లేకపోవటంతో వెళ్లిపోయారు 'గాడిచర్ల' అవార్డు సమావేశమందిరంలోకి అడుగుపెట్టగానే దాశరథి రంగాచార్య 'కాళోజీ నారాయణరావుకు జై ' అంటూ నినదించారు గాడిచర్ల హరిసర్వోత్తమరావు గొప్పతనాన్ని సభికులకు సన్నగా సాగి వస్తున్న గొంతుతో చెప్పారు ప్రసంగం చివరలో ఆబాలగోపాలానికి నమస్కారం చెపుతున్నా అంటూ చేతులు పైకెత్తి ముకుళించి నమస్కరించారు కాళోజి చివరి సభ, చివరి ప్రసంగం, సభికులకు చెప్పిన చివరి వీడ్కోలు అదే అయింది ఆ చివరి ప్రసంగం ఆ రోజు ఇలా కొనసాగింది "గాడిచర్ల ఫౌండేషన్ వారు ఈ సంవత్సరం నాకు ఆ మహానుభావుడి పేరు మీద ఉన్న సంస్థ ఆ ఫౌండేషన్ సన్మానిస్తున్నారు హరిసర్వోత్తమరావు దాదాపు అరవై యేండ్ల పరిచయం నాకు అంతేకాదు ఆయన షష్ఠిపూర్తప్పుడు రకరకాల

సభలు జరిగినయ్ ఎన్నో సభల్లో ఆయనను అక్కడ చూసిన నేను 'షష్ఠిపూర్తి ఉత్సవమట సంగతేం బాబయ్యా, 60 యేండ్లా నీకు' హరిసర్వోత్తమరాయ పదేళ్లు నడిచినయి అవి అయితే ఒక పల్లెటూరు తెల్లవారి గట్ల కల ఆ పల్లెటూరు లోపట షష్ఠిపూర్తి ఉత్సవం జరిగితే 62 ఎడ్లుగట్టి, రథం పెట్టి ఊరేగింపు జేసినం ఆయనను రథం ఎక్కిస్తే చూసి నేను పక్కనే ఉన్న అక్కడ ఇదేమిటి? గ్రంథాలయ సంస్థకు అధ్యక్షుడిని నేను నా ఉత్సవం జరుగుతుంది షష్ఠిపూర్తి, నా అస్థాన కవి అయిన కాళోజి వచ్చి అక్కడ కూర్చోవాలె అని జెప్పి నన్నక్కడ కూర్చోబెట్టు కున్నడు ఆయన ఏదన్న సభలకు వస్తే కొసకొన వరకు ఆయనకు చిన్న పక్క చుట్ట చేతిలో ఒక కర్రపట్టుకొని ఆయన వచ్చేది ఎవరన్నా మెట్లు ఎక్కేటప్పుడు గనుక చేయివేసి పట్టుకోబోతే ఛాత్ అని విదిలించేది ఛీదరించు కునేవాడు జీవితసాంతం గ్రంథాలయాల విషయంలో గొప్ప మహానుభావుడు విదేశీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాసిన ఎడిటోరియల్ వల్ల ఆయన మీద రాజద్రోహం కేసు పెట్టిండ్రు అయితే ఆ పుణ్యం గౌరవం, అనురాగం, ఆ వాత్సల్యం ఆయనకే సాధ్యమైనవి జీవిత సాంతం కూడా కృషి చేశాడు అటువంటి మహానుభావుడు అయితే ఆయన పేరు మీద జరిగే సన్మానం గొప్పది మడికొండలో కూడా సన్మానం చేసిండ్రు అది చాలా విలువైంది అట్లనే గాడిచర్ల ఫౌండేషన్ వారు ఈ సభ పెట్టి నాకు సన్మానం చేయటం అంతకంటే కూడా గొప్పది అందరికీ ఆబాల గోపాలానికి నేను నమస్కారం చేస్తున్నా"

❖ ❖ ❖

# ఈ కాలపు వేమన్న... మనకాళన్న

కైతచేత మేల్కొలవకున్న కాళోజి కాయం చాలిక' అని తాను ప్రజలను మేల్కొలపవలసి ఉందన్న సామాజిక వాస్తవాన్ని గ్రహించిన కవి కాళోజి నారాయణరావు

సామాన్య జీవుల వాస్తవిక దృశ్యాలు, కష్టాలు, కన్నీళ్లు, కడగండ్లు, బాధాసర్పదష్టుల చీకటి జీవితాలకు కారణమైన వ్యవస్థలో లోపాలను సునిశితమైన వ్యంగ్యం తో చురకలంటించటంలో అందెవేసిన కలం కాళోజి నారాయణరావుది తెలంగాణాతో జీవితాన్ని ముడిపెట్టు కుని తెలంగాణాకే కీర్తి తోరణంగా ఎదిగిన కాళోజి భౌతికంగా మన మధ్య లేకపోయినా ఆయన ఆశ యాలు, ఆయన స్ఫూర్తి నిరంతరం తెలంగాణా ప్రజల గుండెల్లో చైతన్య జ్వాలల్ని రగిలిస్తూనే ఉంటుంది ఆయన ఏడు పుటాలుగా వెలువరించిన 'నా గొడవ' లో మొదటి నుంచి చివరి దాకా ఆయా కాలాల్లో స్థానిక, జాతీయ, అంతర్జాతీయ అంశాలను పొందుపరిచారు నైజాం నిరంకుశత్వం నుంచి నాజీల దురాగతాల దాకా ఆయన స్పృశించని అంశం లేదు అలుపెరుగని ఆయన కలం నుంచి జాలువారిన కవితా ప్రస్థానంలోఆయనలో ఒక వేమన కనిపిస్తాడు మరో శ్రీశ్రీ స్ఫురిస్తాడు విపణివీధి తపోవనం చాకిరేవు శాసనసభ సానికొంప సాధు మఠం మూత్రశాల యాత్రాస్థలి ఎచ్చటైతేనేం ఎచ్చటైతేనేం పోటీపడి కాటులాడ ఎచ్చటైతేనేం అంటూ ప్రస్తుత ప్రపంచ పోకడపై వ్యంగ్య బాణాలను సంధించారు

కాళోజి జీవిత గమనాన్ని తరచిచూస్తే నాలుగు దశలుగా గడిచిందేమో అంటారు అనుచరగణం యువకుడిగా నైజాంపాలనకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడపటంలో స్వాతంత్ర్యోద్యమ పథాన ఓరుగల్లు ప్రజలను ఉత్తేజపర్చటంలో కలాన్ని కంఠరాన్ని రెంటినీ ఉపయో గించిన నైజాం పాలనకు వ్యతిరేకంగా మేధావుల అభి ప్రాయాలను కూడగట్టే నేపథ్యంలో వివిధ పత్రికలకు వ్యాసాలు, సామాన్య ప్రజానీకం కోసం కవితలను రాసి జర్నలిజంలోనూ అంతర్భాగమయ్యారు ప్రజల కష్టాలు, కన్నీళ్లను తనవిగా చేసుకొని సామాన్య జనావళి పక్షాన నిలిచి తెలుగు సాహితీ క్షేత్రంలో అభ్యుదయ, విప్లవ కవిత్వ భావాలను పండించటం రెండో దశగా విశ్లేషిస్తారు ఇదే

కాలంలో ఆయన తెలంగాణ ఉద్యమంలో పోషించిన పాత్ర అనన్యసామాన్యం జీవితంలో ఎత్తుపల్లాలు, ఒడుదుడుకులు వ్యవస్థలోని వైషమ్యాలు, వైరుధ్యాలు సాకల్యంగా పరిశీలించిన అనుభవంతో తాత్విక పంథాను అనుసరించటం మూడో దశగా చెప్పవచ్చు ఖలీల్ జిబ్రాన్ రాసిన ప్రాఫెట్ (ప్రవక్త) అనే తాత్విక గ్రంథాన్ని జీవనగీతం' పేరుతో తెలుగు ప్రజలకు పరిచయం చేసిన ఘనత ఆయనిదే మనిషికి ప్రకృతికి, మనిషికి మానవాతీత శక్తికి, భగవంతునికి భక్తుడికి, గురుశిష్య పరంపరకు మధ్య ఉండే సంబంధానుబంధాలు, అన్యోన్యతలు, మానవతా విలువలు, తాత్విక నేపథ్యాలు తేటతెల్లంగా జీవనగీతంలో వెలువరించారు ఎన్నో కలలతో సాధించిన స్వాతంత్ర్యం సామాన్య జనాల కన్నీళ్లను తుడవటంలో విఫలమవుతున్న దశలో ప్రస్తుత రాజకీయాలపై, ప్రజాస్వామ్య వ్యవస్థలోని అవస్థలపై విశ్లేషకుడిగా, విమర్శకుడిగా ఉండటం అంత్య దశ ఈ దశలోనే ఆయన తెలంగాణా సభ వంటి ప్రజా ఉద్యమాలకు మార్గదర్శిగా, సలహాదారునిగా వ్యవహరించారు సారాపై సమర శంఖం పూరించారు సామాజిక దురవస్థలకు కారణమైన సారాయిపై ఎల్లెడల ప్రజా ఉద్యమాలు వెల్లువెత్తిన సమయంలో దానికి పద నిర్దేశకత్వం వహించారు

'నేను ప్రస్తుతాన్ని గతానికి శిఖరాన్ని
వర్తమానాన్ని భావికి ఆధారాన్ని
నేను కవనాన్ని నేను ప్రస్తుతాన్ని
నేను అక్షరాన్ని నేను సాగేదాన్ని

అని ఘంటాపథంగా గర్జించి చాటిన కాళోజీ నిజంగానే స్థలకాలాలకు అతీతంగా తెలంగాణా ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోతారు

❖ ❖ ❖

# కాళోజీకి నివాళి

'గొడవ' పరిష్కారం కాకుండానే సెలవంటూ కాళోజి వెళ్ళిపోయాడు అన్యాయంపై అలుపెరగని పోరాటం చేసిన ప్రజాకవి, స్వాతంత్ర్య సమరయోధుడు కాళోజి నారాయణరావు కన్నుమూశారన్న వార్త అసంఖ్యాకంగా అన్న ఆయన అభిమానుల్లో విషాదాన్ని నింపింది స్వేచ్ఛకీ, స్వచ్ఛతకీ, నిర్భీతికి, నిష్కాపట్యానికి, మానవత్వానికీ ప్రతీకగా నిలిచిన కాళోజి తెలుగు సాహితీరంగంలో తన దంటూ ఒక స్థానాన్ని ఏర్పరుచుకున్నాడు ఎక్కడ అన్యాయం జరిగినా వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యే ఆయ నెవరికీ తలవంచలేదు ఏళ్ళు ముదిరినా, కీళ్ళు కదలినా ఆయనలో పోరాట పటిమ ఏ మాత్రం తగ్గలేదు తన కవిత్వాన్ని పాలకుల మెప్పు కోసమో, పాండిత్య ప్రదర్శన కోసమో కాకుండా ప్రజల కోసం, ప్రజల భాషలో రాసిన ప్రజాకవి కాళోజి పీడనను ద్వేషించడం, జీవితాన్ని ప్రేమించడం ఆయన తత్వం విద్యార్థి దశలో మహ్మద్ ఇక్బాల్ కవితలతో ప్రభావితుడైన కాళోజి అప్పటి నుంచే హేతువాద భావాలను అలవర్చుకున్నాడు కుల, మత తత్వాలను ద్వేషించాడు పరుల కోసం పాటుపడని జీవితం వ్యర్థమని భావించాడు బ్రిటిష్ ప్రభుత్వంపైన, నైజాం నిరంకుశ పాలనపైన రాజీలేని పోరాటం సాగించాడు రెండున్నరేళ్లపాటు కటకటాల వెనుక మగ్గాడు అయినా అన్యాయానికి ఆయన ఎన్నడూ తలవంచలేదు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీష్, మరాఠీ, హిందీ భాషల్లో ప్రావీణ్యమున్న కాళోజి 1947లో రజాకార్లు సాగించిన రాక్షసకృత్యాలపై నిప్పులు చెరిగాడు స్వాతంత్ర్య సమర యోధుడు బత్తిన మొగిలయ్యను రజాకార్లు పొట్టనబెట్టుకున్నప్పుడు తీవ్రంగా స్పందిస్తూ ఆనాటి నైజాం ప్రధాని మీర్జా ఇస్మాయిల్‌కు గేయ రూపంలో ఆయన రాసిన బహిరంగలేఖ అప్పట్లో సంచలనం సృష్టించింది ఇందుకుగాను నైజాం ప్రభుత్వం ఆయన్ని వరంగల్‌లో ప్రవేశించకుండా నిషేధం విధించినా, జైలులో పెట్టినా ఆయన అదరలేదు, బెదరలేదు సరికదా

"అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి
అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు"

అని గొంతెత్తి నినదించాడు

"మాకొద్దీ తెల్లదొరలతనము దేవా! మా కొద్దీ తెల్లదొరల తనం" అని గరిమెళ్ళ నినదించగా, "పరాయి వాడు దోపిడీ చేస్తే బార్డర్ దాక తన్ని తరుముతాం, మనవాడే దోపిడీ చేస్తే మన కాళ్ళ కిందే పాతరేస్తాం" అని గర్జించాడు కాళోజి అన్యాయం అంతమొందేదాకా తనకు విశ్రాంతి లేదు, తన 'గొడవ'కు విముక్తి లేదని చాటి చెప్ప డాన్ని బట్టే సామాజిక న్యాయం కోసం ఆయన ఎంతగా పరితపించారో అర్థమవుతోంది బాధ్యతా రహిత ప్రభు త్వాలు, ప్రజాకంటకులైన పాలకులు అయనకు ఎన్నడూ శత్రువులే, అది నాటి నైజాం నిరంకుశపాలన కావచ్చు నేటి నారా, వాజ్‌పేయి ప్రభుత్వాలు కావచ్చు నైజాం వ్యతి రేక పోరాటంలో దాశరథి రంగాచార్యతో కలిసి తెలంగాణా విముక్తి గీతాలు రాస్తూ ప్రజలను ఉత్తేజపరిచారు మొన్నటికి మొన్న గుజరాత్‌లో నరేంద్రమోడి ప్రభుత్వం దన్నుతో మైనార్టీలపై సాగిన నరమేథం ఆయన్ని తీవ్రంగా కలచివేసింది ఆరోగ్యం అంతంతమాత్రంగానే వున్నాలెక్క చేయకుండా 'గుజరాత్ గాయం పుస్తకావిష్కరణ సభకు హాజరయ్యారు తాను మరణించి కూడా జాతికి ఉపయోగపడాలని అభిలషించాడు ఆయన కోరిక మేరకే తుది శ్వాస విడిచిన అనంతరం శరీరాన్ని కాకతీయ మెడికల్ కాలేజీకి అప్పగించారు

పదవులు,సత్కారాలకోసం ఆయన ఎన్నడూ ప్రాకులాడలేదు అందుకోసం ఎవరికీ వంగి వంగి దణ్ణాలు పెట్టలేదు అయనకు 1982లో లభించిన పద్మవిభూషణ్ కానీ, 1992లో కాకతీయ యూనివర్శిటీ వారు ప్రదానం చేసిన గౌరవ డాక్టరేట్‌గానీ ఆయన ప్రజాసేవకు లభించిన పురస్కారాలుగానే భావించాలి 1952లో కాంగ్రెస్ టికెట్‌పై వరంగల్ నుంచి లోక్‌సభకు పోటీచేసి ఓడిపోయిన కాళోజి ఆ తరువాత ఎన్నికల్లో కమ్యూనిస్టుపార్టీ తరపున ప్రచారం చేశారు 1958లో ఉపాధ్యాయ రంగం నుంచి ఎం ఎల్‌సి గా ఎన్నికయ్యారు 1978లో సత్తుపల్లి స్థానానికి ప్రజా ఉద్యమాల తరపున జలగం వెంగళరావుపై పోటీచేశారు ఇక ఆ తరువాత ఎన్నికల రాజకీయాలకు దూరంగా వుంటూ వచ్చారు సాహిత్య అకాడమీలో పలు బాధ్యతలు నిర్వహించారు ఎమర్జన్సీ కాలంలో నక్సల్స్ అణచివేత పేరుతో సాగిన హత్యాకాండపై న్యాయవిచారణ జరిపించా లని కోరుతూ సాగిన హక్కుల ఉద్యమంలో సుందరయ్య గారితో కలిసి ఆయన సల్పిన కృషి మరువరానిది ప్రతి వ్యక్తిని పౌరుడిగా గుర్తించాలని గౌరవించాలని, హోదావల్ల కలిగిన ప్రతిపత్తులు రద్దు కావాలన్నదే ఆయన సిద్ధాంతం ఒకవైపు ప్రజా ఉద్యమాల్లో చురుగ్గా పాల్గొంటూనే మరోవైపు సమాజంలోని కుళ్ళును కడిగేసేందుకు కలాన్ని ఆయుధంగా చేపట్టారు కవిత్వం వేరు జీవితం వేరు అని కాకుండా తాను దేనినైతే నమ్మారో దానినే రాతల లోను, చేతలలోను చూపించారు తెలుగు, ఉర్దూ భాషల్లో 3 వేలకు పైగా కవితలు రాసినప్పటికీ అందులో 'నా గొడవ'ది ప్రత్యేక స్థానమని చెప్పవచ్చు ఆయన కవితలు ప్రజాకంటక పాలకుల గుండెల్లో దడ పుట్టిస్తాయి కృష్ణశాస్త్రి తన బాధను ప్రపంచబాధలా భావిస్తే, ప్రపంచ బాధే తన బాధలా భావించిన అతికొద్దిమంది కవివరేణ్యులలో కాళోజి ఒకరు స్వాతంత్ర్యం సమరయోధుడిగా, సాహితీ కృషీవలుడిగా కాళోజి చిరస్మరణీయుడు అన్యాయంపై ఆయన సాగించిన రాజీలేని పోరాటం ఆయనతో అంతం కాదు ప్రజాకంటక పాలకులు వున్నంతకాలం ఆ పోరా టాల వారసత్వం కొనసాగుతూనే వుంటుంది ఇదే ఆయనకు నిజమైన నివాళి

❖ ❖ ❖

# చావు వార్తను నమ్మమంటావా కాళోజీ వచ్చి దర్శన మివ్వనంటావా కాళోజీ!...

- ప్రజాతంత్ర

"అన్యాయాన్నెదిరిస్తే నా గొడవకు సంతృప్తి, అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి, అన్యాయాన్నెదిరించినవాడే నాకారాధ్యుడు" అని గర్జిస్తూ పర్జన్య శంఖారావం విన్పించిన ప్రజా కవి కాళోజీ మరణం లేని మహనీయుడు తాడిత పీడిత ప్రజల శ్రేయస్సు కోసం అహర్నిశలు ఆరాటపడిన, మానవతా విలువల పరిరక్షణ నిమిత్తం అమూల్య జీవితాన్ని అంకితం చేసి నిరంతరం ఆవేదన పడిన మహాయోధుడు కాళోజీ 'అవనిపై జరిగేటి అవకతవకలు జూచీ ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు, పరుల కష్టము జూచీ కరిగిపోవును గుండె మాయ మోసము జూచి మండిపోవును ఒళ్లు, పతిత మానవు జూచి చితికి పోవును మనసు " అని మథన పడుతూ అక్షర గాండీవం ఎత్తి, సామాజిక సమస్యలకు, ప్రజల బాధలకు, కష్టాలకు, దు ఖాలకు, పోరాటాలకు తన హృదయ స్పందనగా 'నా గొడవ' గీతాలు విరచించిన విప్లవశీలి కాళోజీ కాళోజీ ఇక లేదన్న వార్త విశ్వసించలేనిది కాలునితో సమరంలో కాళోజీ అస్త్ర సన్యాసం చేసి అంపశయ్యపై విశ్రమించాడన్నది కోట్లాది అభిమానుల హృదయాలకు అశనిపాతమైస్తంభింప జేసే దుర్వార్త 'సూక్తులు శాపములును పునరుక్తి దోషమందకుండ జగత్తునభిశంసించుచు శత వత్సరములు దాటుము!" అని గాఢంగా ఆకాంక్షించిన అనుచరులకు సహచరులకు సన్నిహితులకు అభిమానులకు సహయోధులకు కాళోజీ అస్తమయం కృంగదీసే విషాద సంఘటన ఎనభయి ఎనిమిది సంవత్సరాలు నిండిన వృద్ధ మూర్తి కాళోజీ తెలంగాణ ప్రాంతంలో అనేక ప్రజా ఉద్యమాల భాగస్వామి, స్వయంగా ప్రజా పోరాటాల సారథి దాదాపు తొంబయి సంవత్సరాల నిండు జీవితంలో కాళోజీ విప్లవ గళంతో, కాళోజీ కవి కాహళితో ఆశీస్సులు పొందని, అనంత స్ఫూర్తి పొందని, ఆయన పలుకుల అఖండ ప్రభావంతో ప్రచండ శక్తిని సంతరించుకొని ప్రజా ఉద్యమం, సామాజిక సమరం లేదు కాళోజీ కవి సూర్యుని సమున్నత వ్యక్తిత్వం ఒకమహోద్యమం అది అలుపు లేని,ఆగని, నిరంతర, నిర్విరామ ఉద్యమం కోట్లాది ప్రజలకు ఆ మహోద్యమం ఆయన అందించిన వారసత్వం

ప్రజా కవి కాళోజీకి ఇది 'ప్రజాతంత్ర' అక్షర అశ్రుతర్పణం

❖ ❖ ❖

# కాళోజీకి సజీవ స్మృతి చిహ్నం తెలంగాణ రాష్ట్రం

*ప్రజాతంత్ర*

ప్రజాకవి, సామాన్య జనకోటికి సన్నిహితుడు, అత్యంత ఆత్మీయుడు, మహనీయుడు కాళోజీ భౌతికంగా ఇక మన మధ్య లేరు ఎనభయి ఎనిమిది సంవత్సరాల జీవన సమరం అనంతరం కాళన్న దేహయాత్ర చాలించి - బహుశ, జీవిత కాలంలో ఎన్నడూ ఎరుగని విశ్రాంతి కోసం కాలుని కౌగిట్లో కన్నుముసారు అయన లేకున్నా ఆయన జీవితాంతం, చివరి శ్వాస వరకు గాఢంగా విశ్వసించిన సిద్ధాంతాలు, సూత్రాలు, ఆయన తన అమూల్య జీవితాన్ని అంకింత చేసిన ఆశయాలు, ఆదర్శాలు, లక్ష్యాలు మనకు, భవిష్యత్ తరాలకు ఒక సవాలుగా మిగిలి ఉన్నాయి నిజామ్ నిరంకుశ పాలన మొదలుకొని ఈనాటి నిర్ధాక్షిణ్య,అక్రమ పాలన వరకు ఏనాడు, ఎన్నడూ ఎవరిముందు తలవంచకుండా, అధికార బలాన్ని సాహసవంతంగా ధిక్కరిస్తూ, విశ్వాసాల విషయంలో ఎవరితోను ఎంతమాత్రం రాజీ పడకుండా అపార ఆత్మాభిమానంతో ప్రజా ఉద్యమాలకు పట్టు కొమ్మగా నిలచినకాళోజీ కలలు ఇంకా ఫలించలేదు కాళోజీ ఆశయాలు, లక్ష్యాలు నెరవేరినప్పుడే, ఆయన స్వప్నాలు ఫలించినప్పుడే ఆయనకు ఆత్మశాంతి గాంధేయవాదిగా జీవితాన్ని ప్రారంభించిన స్వాతంత్ర్య సమరయోధుడు కాళోజీ అన్యాయాలను, అక్రమాలను ఎంత మాత్రం సహించలేక ఆవేదన పొందిన సున్నిత హృదయుడు, స్వతంత్రుడు, ప్రజాభి ప్రాయమే పవిత్ర వేదమని, ప్రజల హక్కులు ప్రయోజనాల పరిరక్షణే పరమ లక్ష్యమని దృఢంగా విశ్వసించిన కాళోజీ అక్షరాల ప్రజాస్వామ్య వాది ప్రజాస్వామ్య పరిరక్షణ పోరాటాలలో కాళోజీ అగ్రగామిగా నిలచినారు, ప్రజల వాంఛలను, అభీష్టాలను నెరవేర్చడానికి ఉద్దేశించిన ఉద్యమాలకు కాళోజీ మార్గదర్శకులయినారు

యాభయి సంవత్సరాల కిందట, మొదటి విశాలాంధ్ర ఉద్యమంలో పాల్గొన్న కాళోజీ తరువాత తెలంగాణ ప్రజాభిప్రాయాన్ని గుర్తించి, గౌరవించి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికి కొండంత అండగా నిలిచారు 1969 71 సంవత్సరాల చరిత్రాత్మక తెలంగాణరాష్ట్ర ఉద్యమంలో పాల్గొని కాళోజీ అనాటి నిజామ్‌పాలనలో వలెనె ఈనాటి ఆంధ్ర పాలనలోగూడ కారాగారవాస క్లేశం అనుభవించారు గత యాభయిసంవత్సరాల నుంచి కాళోజీ నిరంతరంగా, నిర్విరామంగా తెలంగాణ రాష్ట్ర నిర్మాణం కోసం పోరాడుతున్నారు తెలంగాణ ప్రజలకు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, అవమానాలను అంతం చేసి, తెలంగాణలో కొనసాగుతున్న దోపిడీని, భాషాపరంగా సాంస్కృతికంగా తెలంగాణలో సంభవిస్తున్న కాలుష్యాన్ని నిరోధించి స్వరాష్ట్రంలో సురాష్ట్రంలో తెలంగాణ ప్రజలకు న్యాయం కల్గించడానికి కాళోజీ అహోరాత్రాలు ఆరాట పడ్డాడు తెలంగాణ రాష్ట్ర ఉద్యమంపై, తెలంగాణ ప్రజలకు జరుగుతున్న అన్యాయాలపై, తెలంగాణ ప్రజల సమస్యలకై కాళోజీ రాసినన్ని గేయాలు ఇంకెవరూ రాయలేదు కాళోజీ కవితల సంపూర్ణ సంకలనంలోఒక భాగం తెలంగాణ ఉద్యమ గేయాలు

అవి ఎనభయి ఏడు తెలంగాణ ఉద్యమంలో భాగస్వామిగా కాళోజీ కావించిన మహత్తర ప్రసంగాలు అసంఖ్యాకం అవి సాటిలేనివి

గడచిన యాభయి సంవత్సరాల కాళోజీ అమూల్యజీవితం ప్రధానంగా తెలంగాణ ఉద్యమానికి, ప్రజా స్వామ్యం, మానవహక్కుల పరిరక్షణకు అంకితమయినాయి ఆయన కలం, గళం, హృదయం, మస్తిష్కం ఈ ఉద్యమాలలో దివ్యాస్త్రాలుగా ఉపకరించినాయి విగ్రహాలు, స్తూపాలు, కట్టడాలు కాళోజీకి సముచిత స్మారక చిహ్నాలు కాలేవు ప్రజాభిప్రాయాలకి అనుగుణంగా ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం అవతరిస్తే కాళోజీ ఆత్మకు శాంతి కలుగుతుంది తెలంగాణ రాష్ట్రం ఒక్కటే కాళోజీకి శాశ్వత, సజీవ స్మృతి చిహ్నం కాగలుగుతుంది కాళోజీ లేరని కన్నీరు కార్చే వారందరు తెలంగాణ రాష్ట్ర సాధన కోసం విభేదాలను విస్మరించి సంఘటితమయి వినూత్న శక్తితో కాళోజీ స్ఫూర్తితో - ఉద్యమించవలసిన తరుణం ఇది కాళోజీ ఆశయాల సాఫల్యానికి పునరంకితమయి కంకణధారణ చేయవలసిన సమయం ఇది

సోమవారం 18 నవంబర్ 2002

# కాళోజీని విస్మరించిన శాసనసభ

మైక్రోసాఫ్ట్ అధినేత బిల్‌గేట్స్ దర్శనం కోసం తహ తహలాడుతూ, ఆయనరాక కోసం నిరీక్షిస్తూ బిల్‌గేట్స్ బేగంపేటవిమానాశ్రయంలో అడుగుపెట్టినప్పటినుంచి తిరిగి వెళ్లే వరకు ఆయనముందు చేతులుకట్టుకుని, తల వంచుకుని 'బాంచెను, బాంచెను అంటూ తిరిగిన పాలకులకు ఆ కొన్ని గంటలు ఇంకేది కన్పించలేదు ప్రజాకవి కాళోజీ ఒక మహోన్నత వ్యక్తి, ఒక వినూత్న శక కర్త,యుగ పురుషుడు వృద్ధమూర్తి అయినప్పటికి ఆయన మృతి అత్యంతవిషాద సంఘటన, కొన్నిలక్షల హృదయాలను ఆయన మరణం విలపింప జేసింది అయితే, ఈ రాష్ట్ర పాలకులు అమహనీయుని, వైతాళికుని శిఖరసమాన ఔన్నత్యాన్ని గుర్తించలేదు కాళోజీ తెలంగాణ ఉపాధ్యాయ నియోజకవర్గంనుచి ఎన్నికయికొన్ని సంవత్సరాలు రాష్ట్ర శాసన మండలి సభ్యులుగా ఉన్నారు ఆయన స్వతంత్ర భారత ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రప్రథమ సాధారణ ఎన్నికలలో వరంగల్లు నుంచి లోకసభకు పోటి చే సినారు కాళోజీకి ప్రభుత్వ సత్కారాలలో ఇష్టంలేనప్పటికి భారత ప్రభుత్వం 1992 లో ఆయనను పద్మవిభూషణ్ బిరుదంతో గౌరవించింది అన్నిటికి మించి ఆయన మృతి సమయాన రాష్ట్ర శాసనసభ సమావేశం జరుగుతున్నది అయినా, రాష్ట్ర శాసనసభ కాళోజీ మృతి పట్ల సంతాపం ప్రకటించలేదు , కొది క్షణాలు మౌనం పాటించలేదు, శ్రద్ధాంజలి ఘటించ లేదు! ఇది ఎంత వరకు సముచితం? కనీసం మాజీ శాసన మండలి మాజీ సభ్యుడుగానయినా ఆయన రాష్ట్రశాసన సభ సంతప తీర్మానానికి, శ్రద్ధాంజలికి అర్హుడు కాడా? ప్రజల హక్కుల కోసం, తెలంగాణ రాష్ట్రం కోసం, ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం పోరాడినందు కాళోజీని పాలకులు, విశేషించి ఆంధ్రపాలకులు క్షమించలేదను కోవాలి!

❖ ❖ ❖

# "కాళోజీ గొడవ" మా అందరి గొడవ

- పి.వి. ప్రసంగం

'జగతికి శాపములు ఇచ్చుచు శత సంవత్సరములు 'బ్రతుకుము' అని ఇరవై ఎనిమిది సంవత్సరాల క్రితం కాళోజీ షష్టిపూర్తి సందర్భంగా అన్న మాటలనే తిరిగి చెబుతున్నానని మాజీ ప్రధానమంత్రి పి వి నరసింహారావు అన్నారు కాళోజీ మాట్లాడితే వినాలని, తిడితేపడాలని అనుకోనివారు ఉండరు అని పి వి అన్నారు తనకంటే ఐదేండ్లు పెద్దవాడైన కాళోజీతో తన పరిచయాన్ని, ఆ తరువాత తమ మధ్య పెనేసుకుపోయిన అనుబంధాన్ని పి వి గుర్తు చేసుకున్నారు కాళోజీ ప్రభావం తన మీద ఎంత గాఢంగా పడిందంటే ఏదైనా నిర్ణయం తీసుకున్న ప్రతిసారి కాళోజీ వంటి విమర్శకుడు దీనికి ఏమంటాడోనని ఆలోచిస్తూ ఉంటానని చెప్పారు కాళోజీ తన ఆత్మగా మారి కూర్చున్నాడని కూడా పి వి చెప్పారు

వయస్సులో చిన్న వాడనైన తనకు, తనకంటే పెద్దయిన కాళోజీ నారాయణ రావును ఆశీర్వదించలననీ, అందుకే ఆయన్ను ఇంకా ఇలాగే పదికాలాలపాటు నడుపు, నీ అవసరం ఎంతోవుంది అని అడుగుతున్నాననీ 'నువ్వు మాట్లాడితే వినాలనీ తిడితే పడాలనీ' ఆశగా వుందనీ అన్నారు మాజీ ప్రధామంత్రి పి వి నరసింహారావు, అరగంట పాటు, ఏకధాటిగా ప్రసంగిస్తూ 'రెండు యుద్ధాల మధ్య సాగిన తమ జీవనయానం' గురించి ఆసక్తికరమైన పలువిషయాలను చెప్పారు ఆయన సుదీర్ఘ ఉపన్యాసంలో ఆయన చెప్పిన పలువిషయాలు ఆయన మాటల్లోనే

"కాళోజీ గారు కాదు సార్ గౌరవవాచకం తీసేస్తాను కాళోజీ అనే సంబోధిస్తాను

ఇంత అమూల్య సన్నివేశం నా జీవితంలో వస్తుందని నేనేనాడూ ఊహించలేదు ఇది అపూర్వం కాదు అమూల్యం దృష్టి సారించాను, ఒక్కసారి గతంలోకి ఎప్పుడు కలిసాము ఇంతకుముందు ఒకే వేదికపై అని జ్ఞాపకం చేసుకున్నాను అది ఆయన షష్ఠిపూర్తి సంబరం వరంగల్‌లో జరిగింది ఒకే వేదికపై కలిసాం

అదో లొల్లి బృందం' 'ఆయనకప్పుడు అభినందనలు చెప్తూ ఏం చెప్పానో గుర్తులేదు గురునదల్లా 'జగతికి శాపములు ఇచ్చుచు శత సంవత్సరములు బ్రతుకుము అన్నమాట'

'కాళోజీ కోప్పడతాడు ఏడుస్తాడు ఇదంతా ఆయన గొడవకు సంధించినవయినా మా అందరి గొడవే అలనాటి మా ఇద్దరి స్మృతులు అందరికీ అవి రుచించక పోయినా నాకు తోచినంత వరకు గుర్తున్నంతవరకు, మా జంట జీవితంలోని కొన్ని ఘట్టాలను చెప్తాను'

'కబీర్, దాదూదయాళ్, వేమనల పరంపరలో కాళోజీ చివరి వాడేనేమో! అయితే ఆ పరంపర తప్పక కొనసాగుతూ కూడా ఉంటుంది లోప భూయిష్టమైన ఈ ప్రపంచంలో, తప్పులు సరిదిద్దేవారు ఎప్పుడూ వుంటూనే ఉంటారు ఇదే జరుగనినాడు జగత్తే అంతమవుతుంది జీవితం లోపాల పుట్ట పాతచెప్పు తెగిపోతే బాగుచేయాలి అది తెగుతూనే ఉంటుంది బాగుచేస్తూనే ఉండాలి'

'కాళోజీకి వేమనకు, కాళోజీకి దాదూదయాళ్‌కు, కాళోజీకి కబీర్‌కు వ్యత్యాసం కూడా ఉంది వాళ్ల సాక్షులు ఈయన సాక్షి భాగస్వామి తాను పొల్గొంటూ, పొరపాట్లను సరిదిద్దుకుంటూ, ఇతరుల పొరపాట్లను బయటపెడ్తూ, జంకూ గొంకు లేకుండా చెప్తాడు '

'వరంగల్ లో నేను కాళోజీకి జూనియర్‌ను నేను ఎనిమిదవ తరగతి చదువుతున్నప్పుడు ఆయన సీనియర్ ఇంటర్ అంటే వరంగల్‌లో ఏదైనా ఇంటరే ఆయన 'టాప్' మధ్యలో నేను ఆయన క్లాస్‌మేట్ను తర్వాత నాకూ క్లాస్‌మేట్లే నా చదువు పూర్తయ్యే నాటికి కాళోజీ వకీలు ఘట్టం ప్రారంభయింది నేనప్పుడే చదువు వదిలేసి వచ్చాను రెండేళ్లు ఏమీ చెయొద్దని నిర్ణయం

తీసుకున్నాను కాళోజీని గమనిస్తే ఈయన వృత్తికి, ప్రవృత్తికీ కలిసినట్లు లేదవిపించేది అదో సంధికాలం ఈనాటి యువకులు ఆనాటి సంగతులు తెలుకోవాల్సిన కాలం '

'ఆరోజుల్లో ఓ నమ్మకం అంతటా ఉండేది బ్రిటిషువాళ్లతో ఎంతోకాలం పోరాడాలి ప్రపంచ యుద్ధ కాలంలో గాంధీజీకి బ్రిటీషర్లను తిరిగి నమ్మేది లేదన్న భావన వారే కలిగించారు, వారి నడవడితో దాం తర్వాత దీర్ఘకాలం సాగుతున్నదనుకున్న ఉద్యమం దగ్గరికొచ్చి, స్వతంత్ర భారతం చేరువలోకి వస్తున్నా మనిపించే రోజులొచ్చాయి 1942 1945 మధ్యకాలంలో'

ప్లీజ్ లీవ్ ఇండియా టు గాడ్ అండ్ ఖెయాస్ మమ్మల్ని మా మానాన వదిలి మీరు వెళ్లండి అని బ్రిటీష్, వారిని గాంధీగారు కోరారు వీళ్లను తుపాకులతో ఎట్లా అదుపులో పెట్టాలో అర్థంకాని బ్రిటిషు వారు ఇక్కడి నుండి నిష్క్రమించాలని మానసికంగా ఓ నిర్ణయాని కొచ్చారు

'ఆ రోజుల్లో పరిస్థితి మేము 20 30 సంవత్స రాల వెనుకయినా పుట్టలేదే! పోనీ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనన్నా పుట్టి ఉండాల్సిందేనని అదోసంధికాలం పరీక్షా సమయం తల్లితండ్రులేమో మేము ఉద్యోగంలో స్థిరపడితే మంచిదని అభిప్రాయంతో వున్నారు మేము కాంగ్రెసు, కాంగ్రెస్ అని తిరిగేది హన్మకొండ చౌరస్తాలో కనిపించిన కాంగ్రెసు వాడిని సార్ అంటుంటే పి వి కి పిచ్చిపట్టిందన్నారు '

'జీవితంలో ఏం చేయాలన్న నిర్ణయం తీసుకునే ప్రయత్నంలో నేనున్నాను అయితే అప్పటికే కాళోజీ నిర్ణయం చేసుకున్నాడనుకుంటాను సరే నేను వకీలు వృత్తిలో బూర్గుల దగ్గర జూనియర్గా చేరాను '

పరిగ్గా అప్పుడే 'సాహిత్య జగత్తు' అనే మార్గయిన్ ఉదయించింది 'కాళోజీ గారి కవితా గురువు గార్లపాటి రాఘవరెడ్డిగారి ప్రోత్సాహం ప్రోద్బలం ఉంది ఆయన రససిద్ధి చాలా తక్కువ మందికి ఉంది అనేక విభావ, అనుభవాల 'వేణు గోపాలశతకం' ఆయన రమ్యం గా వ్రాశారు కాళోజీ నవీనత్వాన్నీ ప్రబంధ కావ్యాల పురాతత్వాన్నీ అన్నింటినీ ఆకళింపు చేసుకున్న ఆత్మ గతం - మా గురువు ఆయన ఆ రోజుల్లో వరంగల్లో ఎక్క డుండేదో ఎక్కడ తిరిగేదో, ఎక్కడ తినేదో అంతా ఏదో విధంగా జరిగిపోయేది కాళోజీ కంటే ఆయన అన్నగారి ఇల్లుండేది వేమూ ఆయన అన్నగారు రామేశ్వరరావు గారింట్లోనే మధ్య మధ్య తినేది మరి మేమోమో 'ఆవారా లు కదా!

'సదాశివరావు మావాడు' కాకతీయ పత్రికకు ఎడిటర్ పత్రిక మొదలెట్టాం ఎవడు అమ్మాలి దాన్ని? నేను అమ్మేవాడని స్నేహంగా ఎవర్నయినా అడిగితే ఓ పది రూపాయలు చందావచ్చేది ఈ లోపల సదాశివ రావు భూస్వాములను తిట్టూ వ్యాసాలు వ్రాసేవాడు వాళ్లు కొనరు చదవరు, నిరక్షరాస్యులు కనుక పత్రిక అమ్మటా నికి పటుకు ఇది అర్థంకయింది ఓ నిర్ణయానికొచ్చాం కారణం కాళోజీ!'

'నీ కెందుకీ ఆవేదన నీ కెవరన్నా ఫీజు ఇస్తు న్నారా? కేస్ ఇచ్చారా? నీ వాణి ఎవరికోసం రాసిందిరా? ఎవరికోరకూ కాదు ఇది మనసునిండి ఒలకపోసిన ధార ఎవరండీ ఆపేది?, అన్నాడు కాళోజీ, ఆ అనటంలోనే అనేక అర్థాలు గోచరించాయి

'కాళోజీ ఆదర్శప్రాయుడు, మా మార్గాలు వేరయ్యాయి అయినా 'కాళోజీ భూతం ఈనాటికీ నన్ను వెన్నాడుతుంటుంది ఏపనిచేసినా, చేస్తున్నా, చేయబో యినా - ఏమంటాడోనన్న భయం అందుకే అనుకు న్నాను, నేను నా జీవితచరిత్ర వ్రాయకూడదని వ్రాస్తే అబద్ధాలు వ్రాయాల్సి వస్తుందేమోనని!'

ఆ సంధికాలంలోనే రెండు - మూడేళ్ళు సాన్నిహిత్యం సాహసం ఆయననను నాకు క్రిటిక్ను చేసింది కాళోజీ ఒక 'ఫినామినన్' దీనర్థం తెలుగులో ఎవన్నా చెప్పగలరా? నా జీవితంలోనూ కాళోజీ ఫినామ్మినన్ వ్యక్తి నిజంగా కాళోజీనా అనుభూతి నాలోచొరబడ్డాడు

1942లో ఈయన వ్రాసిన ఆవేదన, కొన్నాళ్ల క్రితం, 1999లో ఓ మీటింగ్లో చెప్పారు అదో పెద్ద పారిశ్రామిక వేత్తల సమావేశం ఈ సందర్భంలో మా ప్రజాకవి చెప్పింది వినండన్నాను చిన్నవాటి నుండి నన్ను

వెంటాడి వేధిస్తున్న విషయం గ్రామీణ భారతదేశం దాని విషయమే కాళోజీ చెప్పింది ఆంగ్లంలో చదివి వినిపించాను'

'ఇన్నేళ్లుగా కాళోజీ నాలో కుదించుకొని కూర్చొన్నాడు ఈయనకు 'ఇజం లేదా? ఈయన కాంగ్రెసు పార్టీ వాడు కాదా? 1952 లోకసభ ఎన్నికల్లో మేమిద్దరం 'జంట' అభ్యర్థులు కాంగ్రెసు పార్టీ తరఫున కరీంనగర్ నుండి పోటీ చేసి 'జంట'గా ఓడాము కాళోజీ 1400 ఓట్లతో ఓడితే నేను 80,000 ఓట్ల తేడాతో ఓడాను ఆయనప్పుడు 'నా మడికొండ ఓట్లతో ఓడాను' అన్నారు ఎందు కంటే అది ఆయన ఊరు అక్కడున్న ఓట్లు 1400 ఆ తర్వాత కాళోజీ ఎమ్ ఎల్ సిగా కాంగ్రెస్ అభ్యర్థిగా గెల్చి, ఆ ప్రభుత్వాన్ని దుయ్యబట్టాడు తనకు తోచింది తాను చేస్తాననేవాడే తప్ప, ఎవరి మాట వినడు'

'తర్వాత పార్టీ రహితుడయ్యాడు అతీతుడయ్యాడు అప్పటికీ ఇప్పటికీ ఇజం లేదంటాడు అయితే 'ప్రవేశద్వారం' ఉంటుంది కదా! రావినారాయణరెడ్డి, కాళోజీ నారాయణరావులు కాంగ్రెస్ సత్యాగ్రహులు అంత మాత్రాన ఓ పార్టీని అంటిపెట్టుకుని ఎందుకుండాలి? ఈ ప్రపంచంలో జరిగేది, శాశ్వతమైనదీ 'మార్పు' మాత్రమే కాళోజీలాంటి 'పినామినన్' ఎప్పుడో యుగ - యుగాలకో మారు పుడ్తారు 88 ఏళ్ల అంటున్నారు ఆయనకు ఇంకా పది పదిహేనేళ్లయినా ఒగతికి శాపాలిస్తూనే వుంటారాయన ఇలాంటి అద్వితీయుడు ఎక్కడా కనిపించడు లోకంలో మంచివాళ్లు ఉన్నారు చెడ్డవాళ్లు వున్నారు కాని 'వెల్ రౌండెడ్ పర్సనాలిటీ' అన్న అంశాలున్న పూర్ణత్వం, బహుశా ఎవరూ లేరనే అనాలి'

'ఇది మా అనుబంధం దారులు వేరైనా, మా దృక్పథం, దృక్కోణం మారలేదు కాళోజీ కూర్చొన్నచోట బాధపడ్తుంటే, నేను కీకారణ్యంలోకి పోతూ బాధపడ్తున్నాను అంగి చినిగినా, దేహం రక్తసిక్తమయినా, స్పిరిట్ పోని కాళోజీ ఆదర్శప్రాయుడు వేదాంతి కూచోన్నచోట ఆలోచిస్తే శాస్త్రజ్ఞుడు పరిశోధనాలలో పనిచేసి ఫలితాలను అందిస్తాడు'

'ఇవే మా ఇద్దరి 'కామన్' 'అన్‌కామన్' క్షణాలు' 'ఈయనకు వందల కొద్ది సన్మానాలు జరిగాయి ఈసారి నేనే ఎందుకు జ్ఞాపకం వచ్చానో! కేవలం మా బంధం మరోసారి విప్పి చెప్పుకునే అవకాశం కొరకేనేమో!' అని ముగించారు

(తెలంగాణ యుగపురుషుడు కాళోజి 88 వ పుట్టినరోజు సందర్భంగా మాజీ ప్రధానమంత్రి పి వి నరసింహారావు చేసిన ప్రసంగం)

రిపోర్టు జ్వాలా నర్సింహారావు
నవంబర్ 18, 2002

❖ ❖ ❖

# కన్నీటి కాపరి

- జ్వాలాముఖి

కరువులో
కంచెదాటిన గొర్రెపిల్లలు
మేరదాటిన మేకపిల్లలు
తోడేళ్ల బారిన పడకుండా
బతుకంతా జాగారం చేసిన
మూగజీవుల జాతి కాపరి
కొత్త కాకతీయుల
పాత కబేళా ముందు
గుండె చెరువు చేసుకొని
మంటికి మింటికి ఏకధాటిగా గొడవ

భాషచూసీ యాసచూసీ
నుడికారం నాడి చూసీ
నవ్విన నాటు నాయకులు
పూటకోయాట కాజేసిన
పూటకూళ్ల ఝూటా మనుషులు
కాపరిని మచ్చిక చేసుకోజూశారు
మా వాడంటే మావాడని లొల్లి జేశారు
దండం పెట్టీ దండ వేశారు
శమ్లు జుట్టీ శానాశానా పొగిడారు
కాపరన్నా అంటూ కాళ్ల మీద పడ్డరు
జమానా చూసిన జమదగ్ని కాపరి
బలిపశువు కారాదని భగ్గుమన్నడు -

'నేనెవడివాణ్ణీ కాను
కారు కూతలు కట్టిపెట్టీ
ఎత్తుకొచ్చిన గొర్రెపిల్లలు
మోసుకొచ్చిన మేకపిల్లలు
ఇచ్చేదాకా ఊరుకోను "
అంటూ సలసలకాగే సవాలులా
నింగీనేలా ఒకటి చేశాడు
శివాలెత్తి అన్యాయాన్ని ఎదిరించాడు

గాంధీ సాకిన మేకపిల్లల సంతతిని
కాపాడుకుందామనుకున్న కన్నీటి కాపరి
కంచెలోని బలికి కంచె బయటి చావుకూ
గీత భేదం చెప్పాడు కృష్ణపరమాత్మునిలా
ఖాదీ జోర్నా కింద ఆర్తిని సాకాడు -

గాంధీని సాగనంపిన ధూర్తదేశభక్తులు
అరిచే మేకల్ని నమ్మే గొర్రెల్ని వదుల్తారా?
విషయం తెలియక కాదు
విముక్తి చింత ఎక్కువ మక్కువ

గొర్రెలకు తెగే మెడలే కాదు
మేకలకు గాటుపడే కుత్తుకలే కాదు
నూటిపోటు కొమ్ములున్నాయని
నెత్తీనోరూ మొత్తుకొని బతుకునీతి చెప్పాడు
కొమ్ములన్నీ కలిసి కలియబడితే
వీర మరణం మహోదయం అవుతుందని
చరిత్రగతికి పదునుపెట్టాడు
కొమ్ములు తిరిగిన గొర్రెలు
తెగిపడడానికే అలవాటు పడ్డాయి
గడ్డాలు పెంచిన మేకలన్నీ
కుత్తుకలు దాచప్రయత్నించాయి
అజాగళస్తనాలు జోరు వేరుగా వుంది
మూగజీవాల మొనగాడి గొడవ
చివరకు చేసేదిలేక మూగబోయింది

గ్లోబల్ కబేళాలో మూగజీవాలన్నీ
వంతుల వారి బలికోసం పడిగాపులు

కాలానికి
లోబడకుండా
జీవితమంతా గొడవపడిన కాపరి
అరుస్తూ అరుస్తూ కాలాన్ని కరుస్తూ
తరాల్ని తీరుస్తూ తీరుస్తూ
యుగకర్తవ్యం పూరిస్తూ
సూర్యునితో పోటీపడి అస్తమించాడు
బావురుమన్న భూమికి
భయపడవద్దని ఆకాశం
చుక్కల వెలుగులు ధారపోసింది

❖ ❖ ❖

# సంపూర్ణ హృదయం - కాళోజీ

- ఎన్ వేణుగోపాల్

ఇంటర్నెట్ మీద ప్రచారంలో ఉన్న గ్రీటింగ్ కార్డులలో "సంపూర్ణమైన హృదయం" అని ఒక కార్డు ఉంది ఒక యువకుడు తన హృదయాన్ని బైటికి తీసి చూపుతూ 'చూడండి, చూడండి నా హృదయం ఎంత అందంగా ఉన్నదో ఎంత సంపూర్ణంగా ఉన్నదో' అంటు న్నాడట నిజంగానే అతని హృదయం చెక్కినట్టుగా, సరైన ఆకారంతో ఉన్నదట నున్నగా మెరిసిపోతున్నదట అందం అంటే సంపూర్ణత్వం అంటే లోకంలో ఇచ్చుకునే నిర్వచనా లకు సరిగ్గా సరిపోయేటట్టు ఉన్నదట అతని హృదయం

కాసేపటికి అక్కడికి ఒక వృద్ధుడు వచ్చి 'నీదేమి అందమైన హృదయం? అందమైన,సంపూర్ణమైన హృదయ మంటే నాదే అన్నాడట ఆయన తన హృదయం తీసి అందరికీ చూపెట్టాడట ఎగుడు దిగుళ్ళతో, మచ్చలతో, అక్కడక్కడ గుంటలతో ఉందట ఆ హృదయం "అది సంపూర్ణ హృదయమా? అది అందమైన హృదయమా?" అని ప్రశ్నించాడట యువకుడు

"నా జీవితంలో లెక్కలేనంత మందిని కలుసు కున్నాను ప్రతి ఒక్కరినీ ప్రేమించాను ప్రతి ఒక్కరి గుర్తుగా ఆ మచ్చలు నిలిచిపోయాయి కొందరు మిత్రు లను ఎంత ప్రేమించానంటే, వాళ్ళకు నా హృదయం లోంచి ముక్కలు తుంచి ఇచ్చాను వాళ్ళలో కొందరు నా ప్రేమకు ప్రతిస్పందించారు వాళ్ళ హృదయంలోంచి ఒక్కొక్క ముక్క తుంచి ఇచ్చారు నేనువాళ్ళకు ఇచ్చింది, వాళ్ళు నాకు ఇచ్చిందీ సరిగ్గా సమానం కాదు గనుక ఆ ఎగుడుదిగుళ్ళు వచ్చాయి కొన్ని సార్లు నా ప్రేమ ప్రతిస్పందన పొందలేక పోయింది నేను వాళ్ళకు నా హృదయంలోంచి ముక్క తుంచి ఇచ్చాను గాని వాళ్ళు ఏమీ ఇవ్వకపోవడంతో ఆ గుంటలు అట్లాగే ఉండి పోయాయి " చెపుతుంటే ఆ వృద్ధుడి కళ్ళు చెమ్మ గిల్లాయి విన్న వాళ్ళందరూ కంట తడి పెట్టారు ఆ యువకుడు ఔను తాతా నీదే అందమైన, సంపూర్ణమైన హృదయం' అంటూ తన నున్నటి, గుండ్రటి హృదయం లోంచి ఒక ముక్క తుంచి వృద్ధుడికి అందజేశాడు

ఈ కథ చదివిన మూడు నాలుగు సంవత్సరాల నుంచీ నాకు ■ వృద్ధుడు కాళోజి రూపంలోనే కనబడు తున్నాడు నిజంగా కాళోజి హృదయం ఎంత అందంగా, ఎంత సంపూర్ణంగా ఎంత అద్భుతంగా ఉండి ఉంటుంది! సహస్ర మాసోపజీవి అయిన కాళోజీ హృదయంలో ఎన్ని వేల మందికి స్థానం ఉండి ఉంటుంది! ఆయన ఎన్ని లక్షల మంది కోసం ఎన్ని లక్షలసార్లు కన్నీరు కార్చి ఉంటాడు! చెమ్మగిలిన కన్నులలో కమ్మలెన్నొ చదివినాను అని రాస్తున్నప్పుడు కమ్మకమ్మకూ ఆయన ఎన్నిసార్లు కంట తడి పెట్టి ఉంటాడు!

ఎనభైతొమ్మిది సంవత్సరాల నిండు జీవితంలో కాళోజీ ఆత్మబంధువులు ఎందరెందరో చెప్పడం బహుశ అసాధ్యం అన్ని రంగాలకూ, అన్ని జీవన స్థితులకూ, అన్ని

తరాలకూ, అన్ని ప్రాంతాలకూ అన్ని కులమతాలకూ విస్తరించిన ఆయన స్నేహబృందం ఎంత వైవిధ్య భరితమైనదో చూస్తే, ఆయనలో చివరి దాకా కొనసాగిన ప్రతి విషయానికీ కన్నీళ్ళు పెట్టుకునే ఆర్ద్ర స్వభావాన్ని చూస్తే ఆయనకు అతి సన్నిహిత ఆత్మబంధువులు కూడ వేలాది మంది ఉంటారనిపిస్తుంది అసలు కాళోజీయే చెప్పుకున్నట్టు ఆయనకు అపరిచితులూ సన్నిహితులూ తప్ప ఉట్టి పరిచయస్తులు లేరు ఉండే అవకాశం లేదు అందువల్లనే ఆయన బతికినన్నాడూ ప్రతి ఒక్కరూ ఆయనను తమకు అప్పుడిగానే చూసేవారు మరణించిన తర్వాత కూడ ప్రతి ఒక్కరూ తమకే ప్రత్యేకమైన వ్యక్తిగత అనుభవాలను తలచుకుంటున్నారు నిజానికి అటువంటి వ్యక్తిగత అనుభవాలన్నిటినీ ఒక్క చోట సమీకరించగలిగితే ఇరవయోశతాబ్ది చివరి ఏడు దశాబ్దాల సామాజిక చరిత్రలో అత్యధిక భాగం తయారవుతుంది

కాళోజీ ఆత్మబంధువులను పేరుపేరుగా గుర్తించి లేకపోయినా పెద కాళోజీ గార్లపాటి రాఘవరెడ్డిల నుంచి రామశాస్త్రు ప్రభాకర్‌లదాకా ఎందరో చెప్పుకోవల సిన ఆత్మబంధువులున్నా కాళోజీ హృదయాన్ని సంపూర్ణం గా, అందంగా మార్చిన నాలుగైదు ప్రధానాంశాలు మాత్రం చెప్పుకోవాలి

కాళోజీ హృదయాన్ని అత్యంత సుందరంగా మార్చిన అంశం ఆయన గుండెనిండా ప్రజల కోసం పొంగి పొరలిన ప్రేమ అది పౌరహక్కుల సమస్య కావచ్చు, భాషా సమస్య కావచ్చు, సంస్కృతి సమస్య కావచ్చు, ఉద్యమాల సమస్య కావచ్చు తెలంగాణకు జరిగిన అన్యాయం సమస్య కావచ్చు ఎక్కడ ప్రజలున్నారో, ఎక్కడ ప్రజలకి అన్యాయం జరుగుతున్నదో అక్కడల్లా కాళోజీ ఉన్నాడు కొంతకాలం ప్రజలతో ఉండడం, తమకు నచ్చిన సమస్యలో/ఉద్యమంలో పాల్గొనడం చాలమందికి తెలుసు కాని 2002 జులై 20న ప్రభాకర్ ఇంట్లో పత్రికా సమావేశంలో కాళోజీయే చెప్పినట్టు "నా పదహారో ఏట ఏం చెప్పిన్నో, ఈ ఎనభైతొమ్మిదో ఏట అదే చెప్తున్న" అనగలిగిన నిరంతర ప్రజాసాన్నిహిత్యం కాళోజీ విశిష్టత

"పౌరహక్కుల సంఘాలలో నాకు సభ్యత్వం లేదు కాంగ్రెస్‌లో మాత్రం సభ్యత్వం ఉన్నదా ఆ నాడు? పోచమ్మ కాడ నేనే గణపతి దగ్గర నేనే ఆర్యసమాజంలో నేనే, హిందూ మహాసభలో నేనే పౌరహక్కుల కోసం పౌరునిగ బతకడం కోసం చేసే పోరాటంలో నేనే యాదగిరి లక్ష్మీనరసింహస్వామి బ్రహ్మోత్సవం జరిగినప్పుడు అక్కడకు పోయి చెప్పింది కూడ ఇదే హిరణ్యకశిపుడు మొదటి ఫాసిస్టు ప్రహ్లాదుడు మొదటి సత్యాగ్రహి నరసింహమూర్తి మొదటి నక్సలైటు హింస తప్పగాని ప్రతిహింస తప్పగాదు " ఇదీ కాళోజీ జీవితాం తం నమ్మిన విశ్వాసం అందువల్లనే ఆయనకు ప్రజలను మించిన ఆత్మబంధువులు లేరు ఆ ప్రజల హక్కుల కోసం తన కలాన్నీగళాన్నీ వినియోగించాడు

అయితే ప్రజల కోసం హృదయం ఇచ్చేటప్పుడు కూడ కాళోజీని మదర్ థెరిసా లాంటి మానవతావాదుల లాంటి శుష్కమైన, నిర్విచక్షణాపూరితమైన ప్రేమ కాదు కచ్చితంగా ఆయన ప్రేమ ఉద్యమ ప్రజల మీదనే అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు అన్నట్టు గానే ఆయన హృదయంలోని చాల ముక్కలు అన్యాయా న్నెదిరించిన సమూహాలకు, సంఘటిత నిర్మాణాలకు ఇచ్చాడు పార్టీవ్రత్యాన్ని నిర్మాణాన్ని వ్యతిరేకిస్తానని చెప్పుకున్నప్పటికీ సంఘటిత కృషి పట్ల ఆయనకు ఎన్నడూ చిన్నచూపు లేదు నిజానికి సంఘటితం కాని, పోరాటాలకు దిగని ప్రజలనే ఆయన ఏదో ఒక దశలోనయినా "గొర్రెలు"గా సంబోధించి చిన్నచూపు చూశాడు స్టూడెంట్స్ యూనియన్ జనరల్ సెక్రెటరీగా 1930లో గణేశ్ ఉత్సవా లలో పాల్గొనడం కోసం విద్యార్థులందరికీ సెలవు చీటీలు రాసి ఇచ్చిన రోజుల నుంచి తెలంగాణ రచయితల వేదికకూ, పీస్ ఇనిషియేటివ్ కమిటీకీ గౌరవాధ్యక్షుడిగా తుదిశ్వాస పీల్చే దాకా ఆయన ఎన్నెన్ని సంఘటిత నిర్మాణాలకు తన హృదయం తుంచి ఇచ్చాడో వివరంగా పరిశీలించవలసిందే అసలు నిర్మాణాలనూ, క్రమశిక్షణ నూ వ్యతిరేకించే మనిషి ఇంత నిర్మాణ బద్ధమైన సంఘ టిత ఆచరణను గౌరవించి, ప్రేమించి, పాల్గొన్నాడా అని ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తుంది

కాళోజీ హృదయంలో చాల ఎక్కువ భాగాన్ని ఆక్రమించినది తెలంగాణ ప్రజా ఆకాంక్షలు అనే విషయం కొత్తగా చెప్పనక్కర లేదు నిజంగా చెప్పాలంటే ఆయన తన గుండెలోంచి ఎంత భాగం తెలంగాణ కోసం తుంచి ఇచ్చాడో, తెలంగాణ ఉద్యమం ఆయనకు అంత

ఇచ్చిందా అనేది అనుమానమే 'ఎవరనుకొన్నారు ఇట్లవునని ఎవరనుకొన్నారు' అని ఆయన స్వాతంత్ర్యానంతర భారతం గురించీ రాశాడు తెలంగాణ గురించీ ఆయన అట్లాగే అనుకుని ఉంటాడు ఆ మేరకు ఆయన హృదయం మీద మచ్చలూ, గుంటలూ అట్లాగే నిలిచి పోయాయి

కాళోజీ హృదయంలోని ఒక ముక్కను మాత్రమే కాదు, మొత్తం హృదయాన్నే ఇచ్చినది ప్రహ్లాదుడికీ, నరసింహస్వామికీ ప్రహ్లాద చరిత్ర విశ్లేషణలో ఆయన సునిశితత్వం అశ్చర్యం గొలుపుతుంది ప్రహ్లాదుడిది సత్యాగ్రహం అనడంలోనే ఆయన హిరణ్యకశిపుడి ఎదుట సత్యాగ్రహపు పరిమితులను అన్యాపదేశంగా చెప్పాడు (అన్యాపదేశం అనే మాట తెలియకుండా రాయప్రోలు సుబ్బారావు మీద "అన్యాపదేశంగా" అయన రాసిన కవిత గురించి 'ఇదీ నా గొడవ'లో చదివి తీరవలసిందే) పైగా అయనకు హిరణ్యకశిపుడంటే పౌరాణిక పాత్ర కన్న ఎక్కువగా సమకాలీన మీర్ ఉస్మానలీఖాన్, బ్రిటిష్ ప్రభుత్వమో, నల్లదొరల ప్రభుత్వాలో కనబడ్డాయి నరసింహస్వామిని గురించి రాసేటప్పుడు కూడ ఆయన సమర్థించినది భీరువైన సొరికె నరసింహస్వామినో, సంప న్నుడైన లక్ష్మీనరసింహస్వామినో కాదు స్తంభం పగల గొట్టుకుని వచ్చి హిరణ్యకశిపుడి కడుపు చీల్చి పేగులు మెడలో వేసుకున్న ఉగ్ర నరసింహుణ్ణి అ నరసింహావ తారపు వేరు వేరు వ్యక్తీకరణలకు ఆయన ఆరు దశాబ్దాలకు పైగా తన హృదయపుముక్కలు తుంచి పంచి పెడుతూ వచ్చాడు ఆ ఉద్యమాలు ఆయనకు తిరిగి ఎంత ఇచ్చాయో, అయన హృదయం మీద ఏ మచ్చల్ని ఏ ఎగుడుదిగుళ్లని వదిలాయో ఇంకా అంచనా కట్టాల్సే ఉంది

వ్యక్తులుగా చెప్పాలంటే అయన హృదయంలో ఎంతో ముఖ్యమైన భాగాల్ని ఆక్రమించిన వాళ్లు గాంధీ నుంచి, సేనాపతి బాపట్‌నుంచి, పెదకాళోజీ నుంచి ఇవాల్టి సాహిత్య, సామాజిక నాయకుల దాకా ఎవరూ కూడ ఆయన నుంచి విమర్శలను ఎదుర్కోకుండా లేరు అయితే ప్రేమే, లేకపోతే ద్వేషమే అనే విలువలు రాజ్య మేలే రోజుల్లో కాళోజీ హృదయంలో కలగలిసిన ఈ ప్రేమ విమర్శ అశ్చర్యం కలిగిస్తాయి

కాళోజీ వ్యక్తిత్వంలోను, మేధలోను, హృదయం లోను మరొక ముఖ్యమైన అంశం గొప్ప రిపార్టీ ఏ మాత్రమూ వాక్చతురత లేని వాళ్ళ హాస్యం గురించి, వ్యంగ్యం గురించి, రిపార్టీ గురించి పుస్తకాలకు పుస్తకాలే వెలువడుతున్న ఈ రోజుల్లో వ్యంగ్యానికీ, రిపార్టీకి మూర్తీభవ రూపంలా ఉండిన కాళోజీ గురించి ఆ రంగంలో ఎవరూ రాయకపోవడం మళ్ళీ ఆయన ఇచ్చిన హృదయానికీ, పొందిన హృదయానికీ మధ్య అంతరాన్ని చూపుతుంది

మొత్తంగా కాళోజీ జీవితాన్ని, కృషిని సింహావ లోకనం చేసినప్పుడు కొట్టవచ్చినట్టు కనిపించే అంశం ఆయన తెలుగు భాషా, సంస్కృతులకు, సమాజానికి ఎంత చేశాడో, తెలుగు సమాజం అయనను అంచనా కట్టే పని, అదర్శంగా నిలుపుకునే పని అంతగా చేయలేద నేది తెలుగు సమాజం ఆయనను ప్రేమించిన మాట నిజమే, గౌరవించిన మాట నిజమే, కాని ఆ ప్రేమనూ, గౌరవాన్నీ శాశ్వతం చేసేందుకు, స్థిరీకరించేందుకు అవసరమైన పనులు చేయడంలో వెనుకబడే ఉంది కవిగా ఆయన ప్రతిభ గురించి, కథకుడుగా, అనువాద కుడిగా ఆయన శక్తి గురించి, ఆయన ఆత్మకథలో వ్యక్తమైన సామాజిక చరిత్ర గురించి, ఆయన జీవిత పర్యంతం సాగించిన కృషిలో అనుసరించదగిన అదర్శం గురించి అంచనా కట్టవలసింది ఇంకా ఎంతో ఉంది ఆ పని చేయడమే అయనకు తగిన నివాళి

❖ ❖ ❖

# ఒక జీవిత చరిత్ర ఎదవాద చేతనాకేతనం కాళోజి

- యం రత్నమాల

అందరివాడు, అయినా ఏ ఒక్కరి స్వంతం కాని వాడు కదిపితే చాలు ప్రజల కష్టాలు కరిగి కన్నీరై కురిసి ఆగ్రహంతో ఎల్లెడలా ఆవిరై వ్యాపించినవాడు అధిపత్యం మీద అధికార దౌర్జన్యాల మీద అణగారిన ప్రజల ధిక్కార స్వరమైనవాడు పాలకుల పీడక వర్తనం మీద ప్రజల దిక్కార సంతకమైనవాడు పౌరత్వానికి ప్రజాస్వామిక తత్వానికి తప్ప మరేతత్వానికి కట్టుబడనివాడు తెలంగాణ జనజీవన చారిత్రక గమనంలో ప్రజల అడ్డైనవాడు అప్రమత్తత అయినాడు కార్యాచరణే కవిత్వమై జీవితాన్నే కవిత్వీకరించకున్నవాడు తన గొడవ పదుగురి గొడవ కావాలనుకొని 'ప్రజల గొడవ ను ప్రతిధ్వనించి నా గొడవ అని గర్జించినవాడు ఖలీల్ జిబ్రాన్ కవిత్వంలా తిరుగు బాటే జీవన బావుటా అయినవాడు నడుస్తున్న చరిత్ర ఎదమీద ప్రజాస్వామిక చేతనా కేతనాలని ఎగరేసి భవిష్య త్తుకి స్ఫూర్తి కీర్తియై మహాభినిష్క్రమణం చేశాడు

❖ ❖ ❖

# కాళోజీ కన్నుమూత

అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి
అన్యాయకం అంతరిస్తే
నా గొడవకు ముక్తిప్రాప్తి
అన్యాయాన్నెదిరించినోడు
నాకు ఆరాధ్యుడు

అంటూ తన రచనల ద్వారా అన్యాయాన్ని దునుమాడిన ప్రజాకవి కాళోజీ నారాయణరావు మనకిక లేరు గత కొంతకాలంగా అస్వస్థతతో బాధపడుతూ హైదరాబాద్‌లోని నిజాం వైద్యవిజ్ఞాన సంస్థ (నిమ్స్)లో చికిత్స పొందుతున్న కాళోజీ బుధవారం ఉదయం 11 20 గంటలకు తుదిశ్వాస విడిచారు దసరాపండుగ నాడు ఇంట్లో కాలుజారిపడ్డ కాళోజీకి ఎడమకాలి తుంటి ఎముక, కుడి భుజం ప్రాక్చరయ్యాయి దాంతో నిమ్స్‌లో చేర్పించారు తుంటి ఎముకకు చేసిన ఆపరేషన్ సక్సెసయింది అప్పటినుంచి ఆయన క్రమేపికోలుకుంటున్నారు ఈలోగా ఆయనకు నిమోనియా సోకింది దాంతో ఆరోగ్యం క్షీణించ డం మొదలైందని నిమ్స్ వైద్యులు తెలిపారు కాళోజీ వయస్సు 89 సంవత్సరాలు ఆయనకు భార్య రుక్మిణీదేవి, కుమారుడు రవికుమార్ ఉన్నారు ముఖ్య మంత్రి చంద్ర బాబు, హోంమంత్రి దేవేందర్‌గౌడ్, నీటిపారుదల మంత్రి కడియం శ్రీహరి, వైద్య ఆరోగ్య మంత్రి కోడెల శివప్రసాద రావు, టీఆర్ఎస్ నేత చంద్రశేఖర్‌రావు, ఎమ్మెల్యేలు గోవర్ధన్ రెడ్డి, ఇంద్రకిరణ్ రెడ్డి, సారయ్య, ఎర్రబెల్లి దయా కర్, ధర్మారావు, పొన్నాం లక్ష్మయ్య తదితర నాయకులు నిమ్స్‌కు వెళ్లి కాళోజీకి నివాళులర్పించారు మరణానంత రం తన భౌతికకాయాన్ని వరంగల్‌లోని కాకతీయ మెడికల్ కాలేజీకి అప్పగించాలని కాళోజీ ముందుగానే కుటుంబ సభ్యులకు సూచించారు గురువారం ఆయన భౌతిక కాయాన్ని ప్రజల సందర్శనార్థం వరంగల్‌లో ఉంచి శుక్రవారం కాకతీయ మెడికల్ కాలేజీకి అప్పగిస్తామని కాళోజీ ఫౌండేషన్ ప్రతినిధులు చెప్పారు కాళోజీ తన నేత్రాలను కూడా దానం చేశారు ఆయన మరణవార్త తెలుసుకున్న అనంతరం ఎల్వీ ప్రసాద్ నేత్ర విజ్ఞాన సంస్థ వైద్యులు నిమ్స్‌కు వచ్చి ఆయన కళ్లు తీసుకెళ్లారు 1914 సెప్టెంబర్ 9న కాళోజీ నారాయణరావు వరంగల్ సమీపం

లోని మడికొండ గ్రామంలో జన్మించారు ఆయన తల్లి రమాబాయి కర్నాటక రాష్ట్రానికి చెందినవారు కాగా తండ్రి కాళోజీ రంగారావు మహారాష్ట్రకు చెందినవారు కాళోజీ మడికొండలో ప్రాథమిక విద్యను, వరంగల్, హైదరాబాద్‌లలో ఉన్నత విద్యను అభ్యసించారు ఆయన కలం నుంచి 21 రచనలు జాలువారాయి 'నా గొడవ' ఆయనకు ఎంతో కీర్తినార్జించి పెట్టింది మూడు అనువాద గ్రంథాలు అముద్రిత రచనలుగా మిగిలాయి మాజీ ప్రధాని పి వి నరసింహారావుకు సన్నిహితుడైన కాళోజీ ఆయనతోపాటు తెలంగాణా సాయుధ పోరాటంలో పాల్గొన్నారు సత్యాగ్రహ ఉద్యమం, ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు సాగించిన వందేమాతర ఉద్యమం, ఆర్య సమాజ్, స్టేట్ కాంగ్రెస్, ఆంధ్ర మహాసభ (తెలంగాణా), రజాకార్ల వ్యతిరేకత ఉద్యమాల్లో ఆయన పాల్గొన్నారు కాళోజి 1972లో భారత ప్రభుత్వం నుంచి స్వాతంత్ర్య సమరయోధుడిగా సన్మానం, తామ్రపత్రం అందుకున్నారు పౌరహక్కులు, రాజకీయ, సామాజిక ఉద్యమాలెన్నింటిలోనో ఆయన పాల్గొన్నారు సుదీర్ఘకాలంపాటు విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా కొనసాగారు రాష్ట్ర ప్రభుత్వం పీపుల్స్‌వార్ నక్సలైట్ల మధ్య చర్చల కోసం ఏర్పాటైన పీస్ ఇనిషియేటివ్ కమిటీకి ఆయన నేతృత్వంవహించారు 1938 ప్రాంతంలో కాళోజీకి క్షయ వ్యాధి సోకింది అప్పుడు ఒక ఒక ఊపిరితిత్తిని బ్లాక్ చేశారు అప్పటి నుంచి ఆయన ఒకే ఊపిరితిత్తితో బతుకుతున్నారు దానికి కూడా నిమోనియా సోకడంలో ఆయన మరణించారు 1968లో ఆయన రచించిన 'జీవనగీత'కు రాష్ట్ర ప్రభుత్వం ఉత్తమ అనువాద రచన అవార్డును బహూకరించింది బూర్గుల రామకృష్ణారావు మొదటి స్మారక అవార్డును ఆయన అందుకున్నారు మొదటి తెలుగు మహాసభల్లో రాష్ట్ర ప్రభుత్వం ఆయనను సన్మానించింది 1992లో భారత ప్రభుత్వం ఆయనను పద్మవిభూషణ పురస్కారంతో సత్కరించింది అదే ఏడాది వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాయలం ఆయనకు గౌరవ డాక్టరేట్‌ను ప్రదానం చేసింది 1996లో మద్రాస్ కళాసాగర్ విశిష్ఠ పురస్కారం, 2000 సంవత్సరంలో రామినేని ఫౌండేషన్ అవార్డును అందుకున్నారు 1958 నుండి 1960 వరకు కాళోజీ ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యుడిగా కొనసాగారు 1977లో అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావుపై పోటీచేసి ఓడిపోయారు ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీల సభ్యుడిగా కొనసాగారు తెలంగాణా రచయితల సంఘం అధ్యక్షుడిగా పనిచేశారు విరసం సభ్యుడు వరవరరావు, ఎ పి సి ఎల్ సి అధ్యక్షురాలు రత్నమాల, సినిమా డైరెక్టర్ బి నరశింగరావు, గద్దర్, ప్రొఫెసర్ కేశవరావు జాదవ్, ప్రొఫెసర్ రమా మెల్కోటే, వసంత కన్నాభిరాన్ తదితరులు కాళోజీకి ఘనంగా నివాళులర్పించారు కాళోజి భౌతిక కాయాన్ని సాయంత్రం 5గంటలకు ఖైరతాబాద్‌లోని కాళోజీ ఫౌండేషన్ కార్యాలయానికి తీసుకొచ్చారు గురువారం ఉదయం వరంగల్ తీసుకెళ్లారు "ఈ ఏడాది సెప్టెంబర్ తొమ్మిదో తేదీన కాళోజీ 89వ సంవత్సరంలోకి అడుగు పెట్టారు అ సందర్భంగా 'ఒంటిరి నే గాను కంటతడి పెట్టుకునేజంట నాకున్నది' అన్నారు అంతలోనే మమ్మల్ని వదలి వెళ్లిపోతారని కలలో కూడా ఊహించలేదు" అని కాళోజీ ఫౌండేషన్ సభ్యుడు, ఎస్ వి కాలేజి లెక్చరర్ హరినాథ్ ఆవేదన వ్యక్తం చేశారు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగంచేస్తున్న కాళోజీ కుమారుడు రవికుమార్ ఇటీవలే స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు

❖ ❖ ❖

గురువారం నిమ్స్‌లో కన్నుమూసిన ప్రజాకవి కాళోజీకి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడి నివాళి
చిత్రంలో మంత్రులు దేవేందర్‌గౌడ్, కడియం శ్రీహరి, కోడెల తదితరులు

నిమ్స్‌లో కాళోజీ మృతదేహానికి నివాళులర్పిస్తున్న రాష్ట్ర డి జి పి రాములు

కాళోజి భౌతికకాయం వద్ద హోంమంత్రి దేవేందర్‌గౌడ్, వరవరరావు, రామశాస్త్రి తదితరలు

లాల్‌సలాం అంటున్న గద్దర్

నిమ్స్ నుంచి ఖైరతాబాద్‌లోని అభిమాని ప్రభాకర్ ఇంటికి కాళోజీ మృతదేహాన్ని తరలిస్తున్న దృశ్యం. బుధవారం ఉదయం నిమ్స్‌లో మరణించిన కాళోజీ నారాయణరావుకి శ్రద్ధాంజలి ఘటిస్తున్న రాష్ట్ర మంత్రులు

కాళోజీకి నివాళులర్పిస్తున్న డీజీపీ గౌతం సవాంగ్

కాళోజీ నారాయణరావు సతీమణిని ఓదారుస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబు

# ఉద్యమ చరిత్రలో నేలకూలిన మహాశిఖరం

హైదరాబాద్ నవంబరు 13 (ఆన్‌లైన్) ప్రజాకవి కాళోజీ నారాయణరావు మృతిపై అనేకమంది తమ సంతాపం వ్యక్తం చేశారు. తెలుగు సాహిత్యం ప్రజా ఉద్యమాలకు ఆయన మరణం తీరని లోటని సంతాపసందేశాల్లో పేర్కొన్నారు.

## స్పృహతప్పిన యాదమ్మ

నిమ్స్ ఆసుపత్రిలో కాళోజీ నారాయణరావు మరణవార్త విన్నగానే ఆయన సతీమణి యాదమ్మ స్పృహ కోల్పోయారు. వెంటనే నిమ్స్ వైద్యబృందం ఆమెకు సేవలు చేసి సాధారణస్థితికి తీసుకువచ్చారు.

## పోరాట యోధుడు కాళోజీ గవర్నర్ రంగరాజన్

తెలుగు, ఉర్దూ, హిందీ, మరాఠీ భాషల్లో రచనలుచేసిన సుప్రసిద్ధ కవి పద్మభూషణ్ కాళోజీ నారాయణరావు ఆకస్మిక మరణం పట్ల గవర్నర్ సి రంగరాజన్ సంతాపం వ్యక్తం చేశారు. అణగారిన వర్గాల కోసం కవితలు రాసి ఎన్నో పోరాటాలలో పాల్గొన్న కాళోజీ మరణం రాష్ట్రానికి లోటుగా పేర్కొన్నారు. స్వాతంత్ర్యసమరంలోను హైదరాబాద్ హక్కుల పోరాటంలోను ఆయన పాత్ర మరవలేనిదన్నారు. నిర్భయ కవిగా ఆయన చేసిన రచనలు సామాజిక అన్యాయాలపై ప్రజల్లో తీవ్ర ప్రభావం చూపాయన్నారు. కాళోజీ కుటుంబానికి గవర్నర్ సంతాపం వ్యక్తం చేశారు.

## విగ్రహం ఏర్పాటు చేయాలి కె సి ఆర్

సామాన్యుల జీవన పోరాటాలే ఇతివృత్తంగా రచనలు చేసి ప్రజాకవి పద్మవిభూషణ్ కాళోజీ నారాయణరావు మరణం పట్ల తెలంగాణా రాష్ట్ర సమితి అధ్యక్షులు కె చంద్రశేఖరరావు సంతాపం వ్యక్తం చేశారు. సాహిత్యంలో అచ్చమైన తెలంగాణ మాండలికాన్ని వాడిన ఘనత కాళోజీకే దక్కుతుందన్నారు. తెలుగు సాహిత్యంలో తనదైన ముద్రవేసిన కాళోజీ విగ్రహాన్ని నగరంలోని ఏదైనా కూడలిలో ఏర్పాటుచేయాలని అంత్యక్రియలను ప్రభుత్వ లాంఛనాలతో నిర్వహించాలని హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీకి ఆయన పేరు పెట్టాలని కె సి ఆర్ ముఖ్యమంత్రికి పంపిన లేఖలో విజ్ఞప్తి చేశారు.

కాళోజీ మరణం తెలంగాణా ఉద్యమానికి తీరని లోటని టి ఆర్ ఎస్ రాజకీయ విభాగం ఎడిగె విడుదల చేసిన మరో ప్రకటనలో పేర్కొంది. చివరి క్షణం వరకు పోరాడిన ఆయన స్వప్నం తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు జరిగే వరకు పోరాడుతామని సంతాపతీర్మానంలో తెలిపారు. కాళోజీ గౌరవార్థం ఆయన పేరిట లైబ్రరీని ఏర్పాటు చేయాలని టి ఆర్ ఎస్ లీగల్ సెల్ రాష్ట్ర అధ్యక్షులు ఎ దామోదర్‌రెడ్డి మరో ప్రకటనలో కాళోజీ మరణం పట్ల సంతాపం తెలిపారు. పేద దళిత అణగారిన వర్గాల హక్కులకై పోరాడిన కాళోజీ చిరస్మరణీయమని టి ఆర్ ఎస్ మహిళా విభాగం అధ్యక్షురాలు ఎం కోమరాణి ఇంకో సంతాపసందేశం విడుదల చేశారు.

## కోదాటి సంతాపం

ప్రజాకవి కాళోజీ మరణంపై ఆయన సన్నిహితుడు, స్వాతంత్ర్య సమరయోధుడు కోదాటి నారాయణరావు తీవ్ర దిగ్భ్రాంతి వ్యక్తం చేశారు. అనారోగ్యంతో ప్రైవేటు ఆసుపత్రిలో చికిత్స చేయించుకుంటున్న కారణంగా ఆయనకు కుటుంబసభ్యులు ఈ విషయం తెలుపలేదు. బుధవారం సాయంత్రం ఆన్‌లైన్ ఆయనను సంప్రదించగా మరణవార్త వినగానే భోరున విలపించారు. 15 రోజుల క్రితం నిమ్స్‌లో చికిత్స పొందుతున్న కాళోజీని పరామర్శించానని ఆయనన్నారు. ఆ నిద్దరం అష్టమిత్రులమని అనేక ఉద్యమాల్లో కలిసి పనిచేశామని ఆయన గుర్తు చేసుకున్నారు. కాళోజీ మృతిని ఆయన జీర్ణించుకోలేకపోతున్నారు. ప్రస్తుతం కోదాటి ఆరోగ్యం కూడా ఆందోళనకరంగానే వుంది.

## తీరనిలోటు సినారె

ప్రజాహిత రంగానికి సాహిత్యరంగానికి కాళోజీ చేసిన సేవలు విశేషమని రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు రాజ్యసభ సభ్యులు డాక్టర్ సి నారాయణ రెడ్డి పేర్కొన్నారు. కాళోజీ మరణం తనకు ఆత్మబంధువును కోల్పోయిన బాధ కలిగించిందన్నారు. కాళోజీ కుటుంబానికి ప్రగాఢ సానుభూతిని తెలిపారు.

## ప్రజాపక్షపాతి సి.పి.ఐ

బాధితులు, పీడితుల పక్షంగా ఆధిపత్య దౌర్జన్యాలపై గర్జించిన కాళోజీ గళం శాశ్వతంగా మూగవోవడం పట్ల ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి వర్గం ఒక ప్రకటనలో సంతాపం వ్యక్తం చేసింది. నిజాం నవాబు నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా కలాన్ని, గళాన్ని శక్తివంతంగా వినియోగించి ప్రజాచైతన్యానికి అహరహం అభేద్యమైన దీక్షాసంకల్పాలతో శ్రమించిన విశిష్ట వ్యక్తిత్వం కాళోజీదని ఆ పార్టీ పేర్కొంది. తాను ప్రేమించిన మందినుంచి సెలవు తీసుకుని నిష్క్రమించారని కార్యదర్శివర్గ సభ్యులు అజీజ్ పాషా, కార్యవర్గ సభ్యులు రాధ నరసింహారావులు పేర్కొన్నారు.

## నిర్బంధాలపై పోరాటం బి వి రాఘవులు

ప్రజా ఉద్యమాలపై నిర్బంధకాండ జరిగిన అన్ని సందర్భాల్లోనూ పౌర హక్కుల కోసం కాళోజీ అనేక విధాలుగా కృషిచేశారని సి పి ఎం రాష్ట్ర కార్యదర్శి బి వి రాఘవులు అన్నారు. ఆయన మృతి పౌరహక్కుల ఉద్యమానికి సాహిత్య రంగానికి తీరని లోటుగా పేర్కొంటూ ఆ పార్టీ సంతాపం వ్యక్తం చేసింది.

## ఉద్యమాలకు ఆద్యుడు జి వి సుబ్రహ్మణ్యం

గ్రంథాలయోద్యమం తెలంగాణా విమోచనోద్యమం తెలంగాణా సాహిత్యోద్యమాలలో ఆయన గొంతు అందరి కంటే విలక్షణంగా వినపడేదని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం అన్నారు.

## జయధీర్ సంతాపం

తెలుగు సాహిత్యలోకం ఒక ప్రజాకవిని రాజకీయరంగం ఒక ప్రతిపక్షాన్ని కోల్పోయిందని తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం డైరెక్టర్ జయధీర్ తిరుమలరావు సంతాపం వ్యక్తం చేశారు.

## మహాశిఖరం కూలింది ఆచార్య ఎన్ గోపి

అచ్చమైన స్వాతంత్ర్య సమరయోధుడు అవిశ్రాంత ప్రజా ఉద్యమనాయకుడు కాళోజీ అస్తమయంతో ఉద్యమ చరిత్రలో ఒక మహాశిఖరం కూలిందని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వి సి ఆచార్య ఎన్ గోపి అన్నారు. ప్రజా ఉద్యమాలకు ఆయన మృతి తీరని లోటుగా పేర్కొంటూ ఆయన కుటుంబానికి తన సంతాపాన్ని వ్యక్తం చేశారు.

## సాహితీయోధుణ్ని కోల్పోయిన తెలంగాణ ఎ పి టి ఎఫ్

కాళోజీ మరణంతో తెలంగాణ ఒక సాహితీ యోధుణ్ని కోల్పోయిందని ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సమాఖ్య అధ్యక్షులు ఎ నర్సింహారెడ్డి ప్రధాన కార్యదర్శి ఎస్ వెంకటేశ్వర్‌రావులు ఒకాడ ప్రకటనలో [illegible] పారు.

## డి జి పి పేర్వారం నివాళి

ప్రజాకవి కాళోజీ నారాయణ రావు మరణం రాష్ట్రానికిలోటుగా డి జి పి పేర్వారం రాములు అన్నారు. కాళోజీ నివాసానికి వెళ్లిన పేర్వారం కాళోజీ పార్థివదేహంపై పుష్పగుచ్ఛం ఉంచి నివాళులర్పించారు.

## ఐజెయు, ఎపియుడబ్ల్యుజే సంతాపం

పద్మవిభూషణ్ కాళోజీ మరణం సాహితీలోకానికి తీరని లోటుగా ఇండియన్ జర్నలిస్టుల యూనియన్ సెక్రెటరీ జనరల్ కె శ్రీనివాసరెడ్డి రాష్ట్ర జర్నలిస్టుల యూనియన్ అధ్యక్ష కార్యదర్శులు డి అమర్ ఎ ఆంజనేయులు ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

## తెలంగాణా రచయితల వేదిక సంతాపం

ప్రజాకవి తెలంగాణా ఆత్మగౌరవ ఉద్యమానికి సాహిత్య సాంస్కృతిక ప్రతీక, రాజీపడని రాజకీయ యోధుడు కాళోజీ నారాయణ రావు మరణం తెలంగాణా సాహిత్యోద్యమానికి తీరనిలోటు అని తెలంగాణా రచయితల వేదిక అధ్యక్షులు నందిని [illegible]ధారెడ్డి, ప్రధాన కార్యదర్శి వేణు సంకోజు ఒక ప్రకటనలో నివాళులర్పించారు. రచయితల వేదిక కార్యదర్శి వి ఆర్ విద్యార్థి, ఉపాధ్యక్షులు పొట్లపల్లి శ్రీనివాసరావు, కార్యవర్గ సభ్యులు అన్నవరం దేవేందర్, నమిలికొండ బాలకిషన్‌రావు, సిరాజుద్దీన్ తదితరులు ఆ బోజ భౌతికకాయాన్ని దర్శించి నివాళులర్పించారు.

ప్రజాకవి కాళోజీ మృతిపై సాహితీ సమితి తరుపున టి జితేందర్‌రావు, కొండపల్లి రాజేందర్‌రావు, శేషభట్టర్ వెంకటరమణ, ఒడ్డిరాజు, ప్రవీణ్‌కుమార్, అన్వర్ తదితరులు సంతాపం వ్యక్తం చేశారు. మాజీ ఎంపి జి వెంకటస్వామి కాళోజీ మృతిపై తన ప్రగాఢ సంతాపం తెలిపారు.

నివాళి

# అందరి హృదయాలూ గెల్చిన అక్షర యోధుడు

- భండారి అంకయ్య

కాళోజి తెలుగుజాతి వైతాళికుడు।

కాలానికి ఎదురీదిన వాడు పాలకులను ఎదిరించినవాడు

ప్రజలకోసం బ్రతికినవాడు ప్రజాకవిగా నిలిచినవాడు॥

నా గొడవ ఆయన ఆవేదనకు అక్షర రూపం

నాలుగు తరాల సంఘటనల సజీవ సాక్షాత్కారం।

"పుటుకనీది దావు నీది

బతుకంతా దేశానిది" అంటూ లోక్‌నాయక్ జయప్రకాష్ మరణానంతరం స్పందించిన తీరు ఆయన జీవితానికే వర్తిస్తుంది కాళోజి తన కోసం బతికిన క్షణాలు వెతుక్కోవల్సి వస్తుంది ప్రజల మీదే ఆయన ధ్యాస। ప్రజల కోసమే ఆయన శ్వాస॥ జనం ఆయన ఆక్సిజన్ అందుకే ఇన్నాళ్ళూ ఒంటి ఊపిరితోనైనా బతికాడు' అంటూ ఓ ఆత్మీయుని అంతరంగం ఘోషించింది

క్షయ వ్యాధితో ఒక ఊపిరితిత్తిని తొలగించినా, అలుపెరుగని పోరాటాన్ని జీవితాంతం కొనసాగించాడు చివరకు శ్వాస కోశాల ఇన్‌ఫెక్షన్‌తోనే శ్వాస నిలిచిపోయింది నవంబరు 13 దుర్దినం।

కాళోజి యేది చేసినా, ఎపుడు చేసినా, ఎక్కడ చేసినా అది ప్రజా జీవితంతో పెనవేసుకొని సంర్భం వుండదంటే అతిశయోక్తి కాదు।

నిజాం పాలనలో వరంగల్ నగర్ బహిష్కరణకు గురిఅయినా చలించకుండా నవాబు నెదిరించి సంచలనం సృష్టించడం కాళోజికి సాధ్యమైంది

మనిషి స్వేఛ్ఛకు భంగం కల్గిన ప్రతి సందర్భంలోనూ పాలకులపైనా ఉద్యమకారులపైనా తీవ్రంగా స్పందించడం కాళోజికే చెల్లింది

యే యుజానికీ లొంగని నైజాం - నిజాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పే నైనం కాళోజి వైవిధ్య భరితజీవన విధానం। అన్ని వర్గాలకు ఆయన అభిమాన పాత్రుడయ్యాడు అందరికీ ఆయన ఆరాధ్యుడైనాడు అందరితోనూ ఆప్యాయంగా మెలిగే అపూర్వ స్నేహశీలి

వ్యక్తిగత సమస్యలు పట్టించుకోనట్లు కనబడినా ఎదుటివారి కష్టసుఖాల్లో అంతర్భాగమైన విశిష్ట వ్యక్తిత్వం అయనది శ్రీకాకుళం నుండి ఆదిలాబాదు దాకా ఎవరింట్లోనైనా తనక్కావల్సింది అడిగి పెట్టించుకుని తినే స్వేఛ్ఛ, అందించే ఆత్మీయత అపూర్వమైంది ఆరు దశాబ్దాలూ సాగిన అనేక ఉద్యమాల్లో మమేకమైన చైతన్య శీలి ఆయన మృత్యుంజయుడు కాకపోయినా కాళోజి చిరంజీవి। మరణానంతరం కాళోజి లోగిలి ఒక కోవెల వలె విరాజిల్లుతున్నది

'అతిథి వోలె వుండి వుండి

అవని విడిచి వెళ్ళుతాను" అన్న ప్రజాకవి అట్లానే వెళ్ళిపోయహాడు కాదు। పోలేదు!। ఇక్కడే వుండిపోయాడు!!!

కాకతీయ వైద్యకళాశాలకు పార్థివ దేహం అంకితం చేసుకున్నాడు తన కళ్ళతో ఇద్దరికి చూపు ప్రసాదించిన కాళోజి అంతా చూస్తూనే వున్నాడు।

ఆయన జ్ఞాపకాలు ఆత్మీయుల గుండెల్నెపుడూ తడిచేస్తూనే వుంటాయి

* * *

1989లో వరంగల్లులో మూడు రోజులు పోతన ఉత్సవం జరిగింది ఒక నాటి కార్యక్రమానికి అధికార సాహితీ వేత్తలు బాపురెడ్డి, సువర్ణారాణి అప్పటి కలెక్టర్ చెంగప్ప గార్లతో బాటు కాళోజి అతిథులు సమావేశ సమయం సాయంకాలం 6 గంటలు, సమయానికి కాళోజి తప్ప అతిథులు ఎవ్వరూ రాలేదు నిర్వాహకులు హైరానావడుతున్నారు కాళోజి తత్వం అందరికీ తెలిసిందే! ఆయన ఒక్కడే వేదిక మీదికి పోయి మైకందుకున్నాడు నిర్వాహకులు బిక్కమొగం వేశారు అరగంట తర్వాతగాని అతిథులు రాలేదు వారు హాల్లోకి రాగానే అంతా హడావిడి। ముగ్గురూ ఐఎఎస్‌లే గదా కాలోజి ఒక్క క్షణం ఆగిపోయాడు వాళ్ళు వేదిక మీదకు రాగానే 6 గంటలకు సభ అంటే నేను వచ్చిన వినే

వాళ్ళు మన కోసం కూచున్నారు అందువల్ల నేను మాట్లాడవల్సింది మాట్లాడుతున్న నా వంతు అయిపోతది గదా మీకేమన్నా అభ్యంతరమా?' అన్నారు ఆస్వానికి క్షమించమంటూ మెల్లగా సర్దుకున్నారు వాళ్ళు "భక్త ప్రహ్లాదుని జీవితం నుంచి ధిక్కార గుణంనేను నేర్చుకున్న'' అనగానే సభ కరతాళధ్వనులతో మారుమ్రోగిపోయింది బమ్మెర పోతనామాత్యుని స్మృతికి తనదైన శైలిలో కాళోజీ ప్రసంగం కొనసాగింది ఓ అరగంట సేపు ఆయన వాక్ ప్రవాహం ఆగకుండా పరవళ్ళు తొక్కింది ఆ దృశ్యం నా కళ్లముందు ఇంకా కదులుతూనే వుంది! మెదులుతూనే వుంది

ఇటీవల కాలంలో ఎక్కడ కల్పినా జనబలం మేమంటున్నది అని అడగకుండా వుండలేదు కాళోజీ! ఢా జయప్రకాష్ నారాయణ్ హన్మకొండలోని నక్కగుట్ట నివాసంలో కాళోజీని కల్పుక్కు సంఘటన నాకు మరుపురానిది ఆయన్తో మనసు విప్పి మాట్లాడినప్పుడు మనమెవరం మనమెవరం

ప్రజాస్వామ్య రాజ్యాంగం
పరిపాలనలో గల పోరులమా?
లేక మనం ఆకతాయి ఆగడాల
దైనందిన చర్యలకు జడిసి జడిసి
దేబలవలె బ్రతుకుచున్న పురుగులమా?" అని తన గొడవ ప్రస్తావించి ప్రజల్ని ప్రశ్నించే స్థాయికి తీసుకురావడానికి లోక్‌సత్తా చేబట్టిన ఉద్యమానికి ఆయన మద్దతు ప్రకటించినారు "అన్యాయాన్నెదిరించే వాడు నాకు ఆరాధ్యుడు' అన్నప్పుడు ఆయన జీవిత లక్ష్యం ధ్వనించింది ఎన్నో కార్యక్రమాల్లో పాల్గొని ఉత్తేజాన్ని కల్గించారు

* * *

ఆరేడు మాసాల క్రితం జనబలం కోసం కాళోజీని మిత్రుడు రామశాస్త్రి సాయంతో ఇంటర్వ్యూ చేయడం జరిగింది పత్రిక వచ్చిన వారం పది రోజులకు ఆయన్ని కలువడానికి పోయాను

"యేంది? పత్రికల చాన తప్పులు పడ్డాయి? సరిగ్గా చూడకపోతే ఎట్లా? ఆ! అర్థం తల్లకిందులు అయిపోతది గద!! అంటూ మంచం మీంచి లేచి కూచున్నారు నాకు చీవాట్లు తప్పలేదు

సన్నిహితులైనా తప్పు చేస్తే కాళోజీ సహించలేదు నేను ఏదో చెప్పబోయాను ఇంకేం చెప్పొద్దు అన్నట్టుగా చేత్తో వారించారు కాసేపు మౌనం

'లోక్‌సత్తా యేం జేస్తున్నది?' మెల్లిగా అడిగారు కాసేపటికి

'జనచైతన్యం కోసం ' నన్ను అడ్డుకున్నారు

'అందరూ జనం జనం అంటారు కాని మనం చేస్తున్నదేమిటి?

ప్రజలు ప్రజలు మేటి ప్రజలు
ప్రజాస్వామ్య మందు ప్రజలు
మౌనంగా ఉన్నారేం? మరణానంతర స్థితి మాదిరి
ప్రజాస్వామ్య జీవనాడి పట్టుతప్పలేదు గదా?
అనవరతము జాగరణము అనివార్యము ప్రజలకును ప్రజాస్వామ్య మూల మంత్రపారమేల మరిచెను ప్రజలు?

పోరులంత పోరులుగ బ్రతుకు గడుపుచున్నారేం? అంటూ ప్రశ్నించారు 'నా గొడవ'లో ప్రస్తావించిన అంశాలే ఈనాడు మీరూ చెబుతున్నారు గదా! అన్నారు ఆయనకు ఆవేశం వస్తే పూనకం వస్తుంది ఎంత సేపైనా మాట్లాడుతారు శాంతించి చివరకన్నారు "తప్పు చేసిన వాన్ని నిలదియ్యండి, మెడలు వంచండ్రి, జనం సొమ్ము తినేటోళ్ళకు అన్నీ తెలుస్తయి జనానికి తెల్వదు మనమే చెప్పాలి "జన శిక్షణతో లోక్‌సత్తా అదే పని చేస్తున్నదని' ' చెప్పాను ఆయన కళ్ళు మిలమిల మెరిసినాయి

* * *

కాళోజీతో గల సాన్నిహిత్యానికి నేను ఉక్కిరిబిక్కిరి అయినాను ఆయన్తో రెండు దశాబ్దాల జ్ఞాపకాలు నాకు ఎంతో స్ఫూర్తిదాయకంగా వుంటాయి హన్మకొండలో జరిగిన ఎన్నో సభల్లో కాళోజీతో కల్సి పాల్గొన్నా 'నా గొడవ' అన్యయ్యకు అంకితమిచ్చిన సమావేశానికి నేను అధ్యక్షత వహించడం, రామేశ్వరరావుగారి 'సహస్ర చంద్ర దర్శన' కార్యక్రమంలో సన్మానపత్రం సమర్పించడం నాకు మరుపురాని సంఘటనలు ఇది నా అదృష్టంగా భావించాను అలాంటిదే ఇంకో అభినందన సభ ఆత్మీయులం అందరం కల్సి నిర్వహించడం అది పద్మవిభూషణ ప్రకటనకు ముందు ఈ వార్త నేనే చేర వేయడం తర్వాతి కార్యక్రమానికి అధ్యక్షత వహించడం ఓ తీపి గుర్తుగా మిగిలిపోయింది కాళోజీ లోపెల నాలోని 'మనిషిని మేల్కొల్పింది మిత్రమండలి తక్కువేసార్లు పోయినా నా జీవిత గమ్యాన్ని మార్చింది అవిశ్రాంత పోరాట యోధునికి అక్షరాంజలి ఘటిస్తున్నా

# న్యాయం, ప్రేమల నిలువెత్తు రూపం - కాళోజీ

- ఓల్గా

కవిగా కాళోజీ నాకు ఎన్నో సంవత్సరాల నుంచీ తెలిసినా వ్యక్తిగా ఆయన పరిచయం 1987 లో జరిగింది ఆయనతో పరిచయమయ్యాక కవిగా కూడా మరింత బాగా అర్థమయ్యాడు కవిగానూ వ్యక్తిగానూ కూడా కాళోజి ప్రత్యేకమైన వ్యక్తి ప్రేమ, అధికారం, నిర్మొహమాటం, సున్నితత్వం, ఆత్మీయత, అబ్జెక్టివిటీ ఇలా ఆయన విరుద్ధ భావాలను చక్కగా బాలెన్స్ చేసే ప్రత్యేక వ్యక్తిత్వం ఆయనది

1987 వ సంవత్సరంలో ఒక రోజు రాత్రి మా ఇంటికి హఠాత్తుగా చెప్పా పెట్టకుండా ఆయన వచ్చేసరికి చాలా ఆశ్చర్యపోయాను అంత పెద్దాయన మా ఇంటికి ఎందుకు వచ్చినట్టు పైగా మమ్మల్నీ మా ఇంటినే వెలివేయమనే పిలుపొకటి బైట గాలిలో తిరుగుతున్నపుడు సరిగ్గా కాళోజీ అందుకే వచ్చాడు నేను నీ పక్కన ఉన్నానని స్వయంగా చెప్పి పోయేందుకు వచ్చాడు రాత్రి పొద్దుబోయే వరకూ ఏవేవో కబుర్లూ, తన అనుభవాలూ చెప్పి వెళ్ళాడు ఎంత మంచి గెశ్చర్ మనుషుల పట్ల ఆయన కెంత శ్రద్ధ అన్యాయం పట్ల ఎంత నిరసన అదిఎంత సాదాసీదాగా ప్రేమగా ప్రకటించాడు అనవసరమైన అర్భాటం లేదు గర్జనలు లేవు ప్రకటనలు లేవు కానీ అవసరమైనపుడు ఆయన చేయూత ఉంటుందనే విశ్వాసం మనకు కలుగుతుంది అది కాళోజీ పద్ధతి ఆయన కవిత్వం కూడా అంతే నిరాడంబరంగా సూటిగా పదునుగా తాకవలసిన చోట తాకే గురితో అచ్చు ఆయనలాగే ఉంటుంది

1992 నుంచీ అస్మితకూ కాళోజీకి ఒక ప్రత్యేక అనుబంధం మొదలయింది '92 లో అస్మిత 'మహిళలపై హింస మానవ హక్కుల ఉల్లంఘనే' అనే నినాదంతో ఒక పెద్ద సెమినార్ రెండు రోజుల పాటు నిర్వహించింది ఆ సభకు కాళోజీని వక్తగా గానీ అతిథిగాగానీ మేము ప్రత్యేకంగా పిలవలేదు కానీ ఆయన ఆ రెండు రోజులూ సభలకు వచ్చి రెండు వేల మంది గ్రామీణ స్త్రీలతో వాళ్ళ పక్కనే చాపల మీద కూర్చుని ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నాడు అంత కవీ ప్రజల మనిషి ఎలా కాగలిగాడొ ఆ మూడు రోజులూ మేం ప్రత్యక్షంగా చూశాం ఆ తర్వాత అస్మిత లో జరిగిన అనేక ర్యాక్రములో కాళోజీ భాగమయ్యాడు '92 అక్టోబర్ లో రచయిత్రులపై జరిగిన దాడిని ఖండిస్తూ అస్మిత నిర్వహించిన సభకు కాళోజీ అధ్యక్షత వహించారు 94 లో సరిహద్దులు లేని సంధ్యలు పుస్తకాన్ని ఆవిష్కరించారు 99 లో కవయిత్రులను అస్మిత వేదిక మీద నుంచి సత్కరించాలనుకున్నపుడు ఆ సత్కారం వారికిచేయగల అర్హత ఎవరికుందని ఆలోచించినపుడు కాళోజీ తప్ప మరెవరూ లేరని అనుకున్నాం ఆ రోజు సభలో ఆయన చేత సత్కారం పొందిన కవయిత్రులు ఎంతో సంతోషించారు అది అస్మిత కార్యక్రమాలలో మరపురానిదయింది, ఎన్నో సందర్భాలలో ఎన్నో విషయాల గురించి ఆయన సలహాలు అస్మిత కెంతో ఉపకరించాయి కాళోజీ మరణం అస్మితకు ఎంతో లోటు మరెంతో వెలితి

ఆయన మాటలూ కవితలూ ఒకోసారి ఎంత సరదాగా ఉంటాయో అంత షాకింగ్ గానూ ఉంటాయి ఆయన కోపం ఎంత తీవ్రమైందో అంత న్యాయమైంది సామాజిక అన్యాయాల పట్ల న్యాయమైన కోపానికి మానవుల పట్ల అవ్యాజమైన ప్రేమకూ నిలువెత్తు రూపం కాళోజి

# కాళోజి జ్ఞాపకాలు కొన్ని

- కృష్ణాబాయి

"అహా ఏమి న్యాయమమ్మా, నవతనినెత్తికెత్తుకుని మమతని పాదాల దగ్గర ఉంచినవ్!'

చిన్నపాప నవత ఒళ్ళో ఉంటే, చంటిపాప మమత నేలమీద పాకుతూండడం గమనించిన కాళోజి లోకరివాజుని ఎద్దేవా చేస్తూ మానవత్వాన్నీ మమతని కాళ్ళకింద తొక్కేసి, నవ్యత్వాన్నీ కొత్తదనాన్ని నెత్తికెక్కించుకుంటారని చురక వేయడం!

కాళోజీకి తెలుగు, ఇంగ్లీషు కూడా బాగారావని ఒక విమర్శకుడు గేలి చేసిన విషయం గుర్తుకొచ్చింది భాషా పండితుడు కాకపోవచ్చు కాని ఆయనలో వూటలూరే మాటలెన్ని ఉన్నాయో ఎన్ని వుదహరిస్తే సరిపోతుంది?

'తెలంగాణలో 'బాగు అనడానికి మంచి' అంటారేం?'

'మీరు బాగునీళ్ళు అనకుండా మంచినీళ్ళు అంటారేం? అని ఎదురు ప్రశ్న

'చాయంట చాయ వీళ్ళుటీని చాయఅంటారు అని ఎగతాళిగా మాట్లాడే వాళ్ళని

'టీ పీడిమాటా? అదీ ఎరువు తెచ్చుకున్నదేగా?' అని ఈసడించేవారు భాషలోని యాస గురించి కాళోజి ఎంత ఎక్కువగా పట్టించుకునేవారో అందరికీ తెలుసు

'ఇదీ నాగొడవ'ని మేం ఎడిట్ చేసిన తీరుపట్ల కాళోజీకి అసంతృప్తి వుంది కాని ఆయాన మాదికాదు ఆ పరిమితిని మేమూ గుర్తించాం 'ఇదీ నాగొడవ'రెండో భాగం ఆయనకి పూర్తి సంతృప్తిని కలిగించేలా తీసుకురావాలని మాదృఢనిశ్చయం, కాని ఆయన వుండగా అది చేయలేకపోయిన అపరాధభావం జీవితాంతం వెంటాడుతుంది

నీది బడిపలుకుల భాష
మాది పలుకుబడుల భాష
నోటిమాటకి వ్యాకరణం అక్కర్లా
నాట్యానికి శిక్షణ కావాలి
నడకకి శిక్షణ అక్కర్లా, ఉండదు అనే వారెప్పుడూ

"విక్టర్ హ్యూగో, 'లేమిజరబుల్స్', రోమారోలా 'జాన్‌క్రిస్టఫర్' చదివి తీరాలి అందరూ" అని ఆ పుస్తకాల్లోని భాగాలు వినిపించేవారు కాళోజి ఆ రచయితల రచనా చాతుర్యం కన్నా, వాళ్ళు గుది గుచ్చిన మానవతా విలువల్ని హత్తుకునేలా చెప్పేవారు

"ఇదిగో ఈ ఒక్కపనీ పూర్తిచేసి మీరుచెప్పింది చదువుతా" నంటె

'వీణ సవరించడమే సరిపోయె, ఇక వాయించే దెప్పుడు?" అనేవారు

'పని మనిషి వచ్చిందా?' అని వాకబు చేస్తుంటే "ఏం ఆమె మాత్రమే పనిమనిషా? మరి మీరందరూ పనికిరాని వాళ్ళా?'' అని వెక్కిరింత, ఇలా కోకొల్లలు ఎన్ననిరాయగలం? మాటల గని కాళోజి

పునరుక్తి దోషం లేదు కాళోజికి, నలభై ఏళ్ళ సాన్నిహిత్యంలో చెప్పిన కథని మళ్ళీ చెప్పకుండా ఎన్నో చెప్పారు ఆ సంగతి తల్చుకున్నకొద్దీ ఆశ్చర్యమేస్తుంది

ఓ విషాద సన్నివేశంలో మాతో కొన్నివారాలు వున్నారు కాళోజి, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారితో పాటు అప్పుడు కాళోజి చెప్పిన కథ ఎప్పటికీ మరపురాదు యుద్ధకాలంలో ఓ బ్రిటిష్ సైనికుడు, ఓ అమెరికన్ సైనికుడు కలిసి విధి నిర్వహణలో పాల్గొంటారు బ్రిటిషర్ తన తల్లీ, తండ్రీ, అక్కల ప్రేమానురాగాల్ని మరీ మరీ గుర్తుచేసుకుని చెప్తూండేవాడు కుటుంబ సంబంధాల తీపి ఎరుగని అమెరికన్‌కి స్నేహితుని మాటలు అతిశయోక్తులుగా తోచేవి ఓ సారి సెలవలకి బ్రిటిషర్

తన ఇంటికి అమెరికన్‌ని ఆహ్వానిస్తాడు ప్రయాణమవుతూండగా బ్రిటిషర్‌కి డ్యూటీ పడుతుంది ఇద్దరం ఒస్తామని ఇంటికి రాశాననీ ఎదురుచూస్తూంటారనీ నువ్వయినా వెళ్ళమని నచ్చచెప్తాడు అయిష్టంగానే అమెరికన్ బ్రిటన్ వెళతాడు స్టేషన్‌కి వాళ్ళుక్క ఒస్తుంది ఇంట్లో తల్లీ తండ్రీ ఆప్యాయంగా ఆతిధ్యమిస్తారు కాని సీరియస్‌గా, ముభావంగా వుండే ఆకుటుంబాన్ని చూసి 'ఈ బ్రిటిషర్స్ ఇంతే అనవసరంగా నాసెలవంతా వృధా చేసుకున్నాను ఛీ అనుకుని తిరిగి వెళతాడు అమెరికన్ తీరా వెళ్ళే సరికి తెల్సిన కబురు అతను లండన్ ప్రయాణంలో ఉండగానే మిత్రుడు బాంబుదాడికి గురయ్యాడని ఇతను లండన్ చేరకముందే ఈ కబురు తెల్సినా అతని కుటుంబ సభ్యులు కొడుకునేస్తానికి తమ విషాదం పంచకుండా తమలోనే అదిమి పెట్టుకుని అతనికి సకల మర్యాదలూ చేశారన్న మాట వారి నిబ్బరానికీ, ఔదార్యానికీ ప్రేమానురాగాలకి ఆశ్చర్యపోవడం అమెరికన్ వంతు అయింది

దు ఖ వివశులైన వాళ్ళని మర్చిపోవాలమ్మా కలకాలం అదే తల్చుకుంటూ బాధపడితే ఎలాగ? కష్టాలు మనుషులకిరాక " లాంటి ఎందు వేదాంతపు మాటలతో ఓదార్చేవారు కాదు కాళోజి ఈ కథ చెప్పడంతో విషాదాన్ని ఎలా అధిగమించాలో చెప్పారన్నమాట

ఎవరైనా పెద్దవాళ్ళు ఏదైనా తప్పు చేసినా అది ఒప్పే అయివుంటుందని నమ్మేవాళ్ళుంటారనీ, ప్రశ్నించరని చెప్పేందుకు ఓ సామెత చెప్పారు

"శాస్త్రుల వారి కోడలు దాకలాడితో లేచిపోతే అదేమి నోమో, అదేమివ్రతమో అనుకున్నారట!"

అప్పుల్ని కోల్పోయిన వాళ్ళకి తాను అసరాగా నిలవడమే కాదు, మిగిలిన వాళ్ళుకూడా ఆ అవసరాన్ని గుర్తించేలా చేసేవారు

ఎమర్జన్సీలో అరెస్టయిన వాళ్ళవూళ్ళకి కూడా వెళ్ళి వాళ్ళ తల్లిదండ్రులు, భార్యాబిడ్డలకీ "మా పెద్దదిక్కు కాళోజి మాకు కొండంత అండ" అని భావించేలా కొన్నేసి రోజులు వాళ్ళ ఇళ్ళల్లో వుండేవారు అ ఇళ్ళక్కూడా రావడానికి భయపడేవాళ్ళ వెన్నుతట్టి ఎమర్జన్సీ నిజస్వరూపాన్ని బయటపెట్టేవారు ఊరూరా సమావేశాలేర్పాటు చేసి ప్రజాస్వామ్యం ఎలా ఖూనీ చేయబడుతోందో వివరించేవారు

'మచ్చికయిన ఎద్దు తనకి తానే నాగలి కాడిదగ్గరకి పోయి నిల్చుంటుంది కాని ఆలోచించగల మనిష మెదడుని తాకట్టుపెట్టి తనస్వేచ్ఛా స్వాతంత్ర్యాలని పళ్ళెంలో పెట్టి యజమానికి బహూకరిస్తున్నాడు లేకపోతే ఎమర్జెన్సీలో 'తలఒంచి నడవండి' అని ఆజ్ఞాపిస్తే నేలమీద పాకేటంత పిరికితనం దేశాన్ని ఎలా ఆవహిస్తుంది? పత్రికలు ప్రజావాక్కుని కాదని ప్రభువుల వార్తల్నే ఎలా ప్రచురిస్తాయి? ఇదీ ఒక బతుకేనా?' అని ఎంతో ఆవేదన చెందారు కాళోజి

అంతేకాదు తనతో పాటు నడిచేవాళ్ళందరూ జైల్లో వుంటే తనొక్కరూ బయట వున్నందుకు కూడా బాధపడ్డారాయన

మరి నేను ఒలకబోసిన
సిరా సీసాల కొద్దిగాదు
పీపాల కొద్ది
ఏ ఒక్క మెదడు కదిలినట్టు లేదు
మొదట నా మెదడులో ఉంటేగా
కదలిక
మరొడ్ని కదిలించ

కాళోజి అలవాట్లు పద్ధతులు ఆయన వ్యక్తిత్వంలాగే విలక్షణమైనవి

ఉదయం నాస్తా తయారయిందంటేనే పక్క మీద నుంచి లేచి మొగం కడిగేవారు ఎంతో క్రమశిక్షణతో ఉదయ కార్యక్రమాలన్నీ ముగించుకునే గొర్రెపాటి వెంటకసుబ్బయ్యగారు "కాళన్నా, పరాయి యింటికి ఒచ్చినా నీ అవాటు మానవా?" అని సరసమాడితే "పరాయి యింటికి మనమెందుకుపోతం సుబ్బయ్యన్నా?' ' అన్నారు తన, పర అనే తేడాలేదుగా కాళోజికి?

ఆయనకి నచ్చేలా చాయ్ పెట్టడం ప్రత్యేకంగా ఆయన దగ్గరే నేర్చుకోవాలి అఖరికి అఖరి రోజుకి చాతనయిందని సర్టిఫికేట్ ఇచ్చేవారు కాని మళ్ళీ వచ్చేనాటికి మళ్ళీకొత్తగా నేర్చుకోవడమే! 'కిందటి వేసవిలో

నేనొచ్చినప్పుడు తెప్పించిన చాయ్‌పత్తనా ఇది?' అంటే టీపొడి తాజాగా లేదని!

పప్పుకూరలకి పోపు పెట్టేటప్పుడు మినప్పప్పు ఎక్కువేయనక్కర్లేదనీ, ఉల్లిపాయ ముక్కలు ఏరకం కూరకి ఏ సైజులో కొయ్యాలో తెల్సుకోవాలని చిట్కాలు చెప్పేవారు

'రుక్మిణి చిన్నమ్మ మీతో ఎలావేగుతుందో! అంటే ఎలాచేసినా నేను తిననన్నానా? నారుచికి కుదిరేలా ఇంత పప్పో, పెరుగో పక్కన పెట్టుకుంటే అయిపాయె' అన్నారు ఆపెరుగు మాత్రం తియ్యగా వుండాలె

"పెరుగు ఇంత పుల్లగా ఎలా తోడుపెట్టగలరో!' అదో విద్య అన్నట్లు

వట్టికోట ఆళ్వారుస్వామిగారి భార్య 'వేవిళ్ళన్నయ్య' ' అనే బిరుదు ఉత్తినే ఇవ్వలేదు

వచ్చి ఓ వారమయ్యాక "ఇంకా ఎన్నాళ్ళు గడ్డి పెడతవ్?'' అని గుర్తుచేసేవారు శాకం మార్పుకి

ఆయన 'పానీయం' కలుపుకోవడం కూడా ఒక కళే

ఆహారంలోనైనా, అవార్డుల్లోనైనా ఎప్పుడూ మత్తుకి లోబడలేదాయన

'ఆరోఏటినుంచీ నన్నుమోస్తున్న అన్నగారు చెప్పిందే వినలేదునేను కొత్తగా ఇప్పుడొచ్చిన సర్కారు సత్కారాలకి లొంగుతానా? ఎన్నడైన మాట మార్చినానా?'

ఆఖరిదశలో ఆఖరిసారి కల్సినప్పుడు 'ఎవ్వరికీ ఎప్పుడూ లొంగని మీరు రోగానికి దొరికిపోయారా చిన్నాన్నా?' అంటే

"అవును, రోగానికే దొరికిన ', అన్నారు రొప్పుతూ, దగ్గుతూ

ఎందరెందరివో ఎన్నెన్ని అనుభవాలో వున్నాయి కాళోజితో అవన్నీ అందరూ రాయగలిగితే కాళోజి సంపూర్ణ జీవితం వెలుగు చూస్తుంది

తెలంగాణాలో, ముఖ్యంగా వరంగల్లులో ఆనాటికీ ఈనాటికీ అమలవుతూన్న నిర్బంధకాండ గురించి ఆయన ఎప్పుడూ నిరసిస్తూనే వుండేవారు

కుట్రకేసులో జైలు పాలయిన వరవరరావు కుటుంబానికి నైతికంగా దన్నుగా నిలబడిన కాళోజీ తన మొదటి పెన్షన్ రాగానే కొంతసొమ్ము ఇవ్వబోతే వద్దని వారించిన 'హేమతో 'దీనితో నీ నమస్యలు తీరతాయనికాదమ్మా' అని చేతిలో పెట్టారట

బాలగోపాల్‌ని కండెమ్డ్ సెల్‌లో నిర్బంధిస్తే విడుదల చేయించేవరకు ఎంత ఆరాటపడ్డారో! ఒంటరి ఖైదీ బాధ మరింత నికృష్టమని ఆయనకి అనుభవపూర్వకంగా కూడా తెలుసు ఇలా ఎందరెందరికో కాళోజి ఆప్తుడు

ఈ పనులేవీ కూడా ఆయన ప్రయత్న పూర్వకంగా చేయరు అది తన ధర్మంగా, తన విధిగా భావించేవారు

అన్యాయాన్ని ఎదిరించేవాళ్ళు రాజ్యహింసకి ఎదురు నిలబడి పోరాడేవాళ్ళు, కొన్ని పొరపాట్లు చేసినా సరే, తనకి ఆరాధ్యులనేవారు

ఆకలికి అన్నం అందరికి దొరకాలె

అమ్మపెట్టినా, అత్త పెట్టినా! అనేది ఆయన కోరిక

'సామాన్యుని జీవితాన్ని<br>వర్ణించిన విస్తరి'గా చూచు<br>మొక్కెను వున్నవాడు' శ్రీశ్రీ అన్నారు

'శ్రీశ్రీ ఫలానా అవార్డు తీసుకోకపోతే బావుండేది' అంటే

'శ్రీశ్రీకి ఒక రామేశ్వర్రావు లేడుగద' అన్నారు హోచిమిన్, మావోలని ఎక్కువగా కోట్ చేసేవారు కాళోజి హోచిమిన్ జైలు డైరీని మరీను

ఎన్ని పెళ్ళిళ్ళకి సారధ్యం వహించారో, ఎన్ని కుటుంబాల్ని నిలబెట్టారో అంతులేదు మరెన్ని చావులకి సాక్షీభూతమయారో కాళోజి!

కాన్సర్ సంతోష్ చితికి అందరితో పాటునిప్పుపెట్టాక 'నాకు పెట్టవలసిన వానికి నేను పెట్టడం' అని బావురుమన్నారు

ఆయన ఏ సంఘంలోనూ ఏ పార్టీలోను సభ్యుడు కాదు దేనికీ కట్టుబడని వాడు అలా అని అరాచకవాదీ కాదు

వయసు మీరింది కదా నడక తొట్రుపడుతుందేమోనని చెయ్యి పూత మివ్వబోతే తోసిరాజని, తానే మమ్మల్ని నడిపించారు నడకలోనూ, మాటలోనూ తొట్రుబాటే లేదు నిబ్బరమూ, నిస్సంకోచమూ, నిష్కాపట్యమూ ఆయన లక్షణాలు ఎదటి మనిషిలో కపటత్వమూ, పెత్తందారీతనమూ కనిపిస్తే మొగం మీదే అనేసేవారు అందుకే తనకి ఆత్మీయులూ ఆప్తులు కోస్తా ప్రాంతాల్లో ఎందరోవున్నా అక్కడి ఆధిపత్యభావ జాలాన్ని మాత్రం సహించలేదాయన ప్రహ్లాదుడు, నరసింహస్వామి పాత్రల్ని సింబాలిక్‌గా తీసుకుని నేటి పరిస్థితులకి అన్వయించి చెప్పారాయన ప్రహ్లాదుడు హింసని సంస్కరణతో ఎదుర్కోవాలని మూనుకుని విఫలమయ్యాడు నరసింహుడు ప్రతిహింస ద్వారా విజయం సాధించాడు అందుకనే నక్సల్స్‌ది ప్రతిహింస అని ఎలుగెత్తి చాటారు కాళోజి

మానవ సమాజం మనుగడలా
కాళోజి కన్ను నిత్యం సత్యం, తథ్యం
మనిషికి పర్యాయపదం కాళోజి

మనిషిలో ధైర్యాన్ని పెంపొందించేందుకూ మానవతా విలువలు కాపాడ్డానికీ నిరంతరం అన్యాయాన్ని ఎదిరించేందుకు కాళోజి ఎప్పుడూ మనతోనే మనలోనే వుంటాడు మనం చైతన్యాన్ని రగిలించుకుంటూ కాళోజిని కాపాడుకుందాం

★★★★

# కాళోజీ మళ్ళీ జన్మించాలి

బి ఆర్ బిద్వేళ్లి

కాళోజీ భౌతికంగా లేకపోయినా కాళోజీ ఉంటాడు ప్రజా హృదయ వేదికపై స్థిరపడి, కాలం నాలుకపై నిలబడి కాళోజీ జనంగా ప్రజల చరిత్రగా, పౌరహక్కుగా, ధిక్కారగళంగా, తలవంచని వీరుడిగా, సామాన్యుడి పాలిటి పెన్నిధిగా ఉంటారు మనిషిమనుగడ ఉన్నంత వరకు ఉంటాడు ఎందుకంటే మనిషి నిర్వచనం కాళోజీ జీవనం కాళోజీ

కాళోజి జిడ్డు క్రిష్ణమూర్తిలాగే విల్లురాయలేదు ఎందుకంటే తనకంటూ ప్రైవేటు ఆస్థి కాళోజీకి ఏమీలేదు ప్రజలే తన ఆస్థి తానేప్రజల ఆస్థి కాళోజీ తనకంటూ ఒక ఇల్లు కట్టుకోలేదు ఎందుకంటే ప్రపంచమే తన ఇల్లు ఐనప్పుడు కాళోజీకి వేరే ఇల్లెందుకు? కాళోజీ తెలంగాణా గురించి మాట్లాడితే కాళోజీ ప్రాంతీయ తత్వమున్నట్లుకాదు తెలంగాణా దగా పడ్డది గమక తెలంగాణా గురించి మాట్లాడినారు కాళోజీ ఎప్పుడూ దగాపడ్డ వారిని వెంటేసుకు ఉద్యమించేవారేగదా! మాలాంటి ఎందరో అర్భకులు కాళోజీ అనే మహోజ్వలతవల్లి ప్రపంచానికి కనిపించినారు, ప్రకాశించినారు గడ్డిపోచను తలదాల్చిన హిమాలయం కాళోజి కంటతడి పెట్టేవాడైనా కంటకాలుగాకుచ్చుకునే వాడైనా కాళోజీ ఒక్కడే సాహిత్యంలోకానికి, కాళోజీ లాంటి మరో వ్యక్తి ప్రపంచంలో తారసపడరు కాళోజీలాంటి వ్యక్తి కావాలంటే కాళోజీ మళ్ళీ జన్మించాలి కాళోజీ చివరిక్షణాల్లో వారి దాపున ఉండే అదృష్టం, వరం నాకిచ్చిన కాళోజీకి ఎట్లా కృతజ్ఞతలు చెప్పినా సరిపోతుందా? యీ జన్మకీవరం సరిపోదానాకు? వారి ఆత్మ శాంతిలో ఉండాలని కోరుకుంటూ, ఇదే నా నివాళులు

# అనంతం

-సిబి కృష్ణారావు

అందరికీ ఆత్మీయుడు అంద, ఆదర్శం అనదగిన కాళోజీ మరణానంతరం ఏర్పడ్డ శూన్యం కొన్ని శతాబ్దల దాకా తీరదు

ఈ 88 సంవత్సరాల వయోపరిధిలో తన కలం ద్వారా "నిరసన సాగించాడు కాళోజీ కవితా రచన ప్రజా కవిత అయింది "నా గొడవ" అయింది అందరి గొడవ అయింది విచ్ఛిన్నమైన ఆశల ఎగశ్వాస అయింది ఆయన జీవిత వ్యాసంగం ప్రతి క్షణం తెరపిలేనిదే ఈ సుదీర్ఘకాలంలో ఆయన పాటించిన విలువలు మనందరికి ఆదర్శాలు

తమ పనుల మీద హనుమకొండ వచ్చిన వారూ కాళోజీ సోదరులను కలవడానికే వచ్చిన వారూ వున్నారు కాళోజీ రామేశ్వరరావుగారూ - "షాద్" ప్రఖ్యాత ఉర్దూ కవి నారాయణరావుగారూ పేరెన్నికగన్న అన్నదమ్ములు - ప్రవృత్తులు వేరు అయినా వయోతారతమ్యమున్న కవలలు కాళోజీలను కలిసి వెళ్లిన తరువాత ఒక పరిపూర్ణ అనుభవం పొందితిమనే తృప్తి కలిగేది మీదు మిక్కిలి ఆగంతకుణ్ణి గొప్పవాణ్ణి చేసి పంపేవారు

అభయం, సత్యం రెండూ ఒక దానికొకటి పెనవేసుకుని, ఒక దానికి ఒకటి ఆధారభూతమైనవి ఆ సత్యవాక్కుకు కట్టుబడి తన ప్రతి అడుగూ పవిత్ర ప్రబోధంగా నడిచాడు No compromise, highly ethical నిండుగా నీతినియమానికి కట్టుబడి వుండేవాడు ఆయన మూర్తి మానవత్వం ఆర్తి ప్రేమల సహకారం

న్యాయం అనేది సృతం అనృతం అన్యాయం అసత్యమాడకపోవడం అన్యాయాన్ని ఉపేక్షించకపోవడం 'అన్యాయాన్ని ఎదిరించినోడు నాకు ఆరాధ్యుడు" అనేవాడు నేను ఉద్యోగరీత్యా 1965లో వరంగల్లు వెళ్ళి ఎనిమిది సంవత్సరాలు అక్కడే వెలగబెట్టాను ఉండటం కాళోజీల ఇంటి ఎదురుగా మహా మనీషి అవంచ వెంకట్రావుగారి ఇంట్లో ఈ ఎనిమిది సంవత్సరాలు నెలకొక్కటి చొప్పున వంద 'మిత్రమండలి" సమావేశాల్లో అక్షర పరిచయం, ఉదాత్త సాహితి మనోజ్ఞుల సాన్నిహిత్యం, ఒనగూడింది మిత్రమండలి సమావేశాల తీరు చాలా ప్రత్యేకమైనది ప్రతి ప్రక్రియకూ అందులో గౌరవం, ప్రతి సిద్ధాంతానికీ ఆదరణ వుండేది చిన్న పెద్ద స్త్రీ పురుష గురులఘువర్ణ తార తమ్యాలులేవు సభ్యుల మధ్య సమానత ఆదరణ మిత్రమండలి సమావేశాల్లో ప్రాణం పోసుకున్నవి

తరువాత అదే ఒరవడిలో "నెల నెలా వెన్నెల" సమావేశాలు హైదరాబాదులో ప్రవర్ధమాన మౌతున్నవి

ఇవిగాక ప్రతి సంక్రాంతికి విస్తృత పరిధిలో "సంక్రాంతి సమావేశాలు" జరిగేవి ఆంధ్రదేశంలో పలుమూలల నుండి 15 20 మంది సాహితీ వేత్తలు జనవరిలో ఏదో ఒక పట్నంలో కలుసుకొని 4, 5 రోజులు చర్చలు జరుపుకొనేవారు అదొక అనుభవం। అలాంటి సంక్రాంతి కలయికల్లో రెండు సార్లు నేనూ అనుభవం పంచుకున్నాను మిత్రులు కలిసినప్పుడూ, సమావేశాల సందర్భాల్లోనూ కాళోజీ మాటలో ఎల్లప్పుడూ ఒక ప్రత్యేకత మన జ్ఞాపకాల్లోంచి జారిపోకముందే ఈ విశిష్ట ప్రత్యేక సందర్భాలు గ్రంథస్తంకావాలి

అతి సామాన్య విషయాన్ని కాళోజీ మార్గదర్శకం చేసేవాడు మనం నిర్లక్ష్యం చేసిన దాన్ని లక్ష్యంగా నిలువరించేవాడు

కీ శే ధనకుధరం వెంకటాచార్యులు గారు గుంటూరులో వుండేవారు ఆయన గొప్పకవి అనువాదకుడు ఖలిసి, జిబ్రాన్ "ది ప్రాఫెట్" ధనకుధరం గారు కూడా తెనుగులోకి అనువదించాడు కాళోజీ అనువదించారు కదా కాళోజీ గుంటూరు ప్రయాణంల్లో ధనకుధరంగార్ని కలిసి, సాహితీ చర్చచేసి వస్తూవస్తూ ఆయన చేతిలో కొంతనగదు పారితోషికం వుంచాడు ధనకుధరం గారికది "పెద్దల ప్రసాదం"

తెలంగాణా అమాయకత్వం కాళోజీలో పర్సానిఫైడ్ తరచూ పిల్లవాడిగా అన్నగా తమ్ముడిగా కౌగిలించుకోటం గోల్డ్‌స్మిత్ విలేజీ ప్రీచర్ మాదిరిగా ఎవరన్నా సంకటంలో వుండే కంట తడి పెట్టేవాడు ఒకరు సన్మానించబడితే ఉప్పొంగి పోయేవాడు ఈ అనురాగం నేనూ పొందాను నేను ఉద్యోగం చేస్తున్నప్పుడు నా మీద నేరం మోపుతూ ఒక దరఖాస్తు వచ్చింది అది విచారణ జరిగి నా మీది నల్లమేఘం తొలిగిందాకా అన్నదమ్ములు శ్రీ రామేశ్వరరావుగారూ శ్రీ కాళోజీ నా కంటే ఎక్కువ బాధపడ్డారు ఆ సందర్భంలో నేను తలబిరుసుగా నాకేం తెమ్మనేవాణ్ణి!

నా కిల్లారి ' కావ్యం నగర కేంద్ర గ్రంథాలయంలో ఆవిష్కరణం జరుగుతున్న క్షణాన శ్రీయుతులు కాళోజీ ఎఆర్ కృష్ణ విఆర్ విద్యార్థి వరంగల్లు నుండి వస్తుంటే ఆ సంగతి విని స్టేషన్ నుండి సభా స్థలికే వచ్చారు

ఒకనాడు గాంధీ జ్ఞాన మందిర్‌లో ఇతర కార్యక్రమాలతోపాటు కవిసమ్మేళనం కార్యక్రమం కూడా వుండెను తెలుగు ఉర్దూలో కూడా ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య గారూ వచ్చారు ఇతరత్రా కొన్ని కారణాల వల్ల స్వల్పమైన గలాభా జరిగితే ముఖ్యమంత్రి వెళ్లిపోయినారు ముచ్చటగా ముగ్గురం మిగిలాం కాళోజీ కెవి సుబ్బారావు నేనూ మాతోనే 'కవి సమ్మేళనం" జరిపి సభ ను జయప్రదం చేశారు

శ్రీ దేవులపల్లి రాసినట్లు ప్రజాకవి, నిఖిలాంధ్ర కవి, సాహసవంతుడు స్వతంత్రుడు, దృఢ సంకల్పుడు అయిన 'కాళోజీ జీవన శైలి స్ఫూర్తి దాయకం కొన్ని తరాల్ని ప్రభావితం చేసే శక్తి కలది'

# తెలుగు జాతి గర్వించదగ్గ మనిషి 'కాళోజీ'

- డాక్టర్ గురుకుల మిత్రి

దాదాపు ముప్పయ్యేళ్ల నుండి కాళోజీ నాకు బాగా తెలుసు తర్వాత ఆయనకు వైద్యుణ్ణి కూడానేనే అవటం చేత, తరచూ కాళోజీ నా దగ్గర కొచ్చేవారు అప్పుడప్పుడు అయన దగ్గరగా వుండే ప్రభాకర్ ఇంట్లో మాకు మర్యాద జరిగేది ఉండి ఉండి 'నా గొడవ' లాంటి పదాల్ని కొన్ని వదిలేవాడు ఒక భాషకాదు ఉర్దూ, హిందీ, తెలుగులో మాట్లాడేవాడు అయితే అందరం తెలుగు వాళ్లమే కాబట్టి తెలుగును దీక్షగా ప్రభుత్వ రంగంలోకి తీసుకొని రావాలని ప్రయత్నం చేసేవారం కాబట్టి తెలుగులోనే మా సంభాషణ నడిచేది మొన్న మొన్నటి విషయం ఆయనకు కాలు చేయి విరిగి ఇక్కడికే వచ్చారు మిత్రులు అతన్ని నిమ్స్‌లో చేర్చారు తర్వాత తెల్సింది వారు నిమ్స్‌లో వుండి నన్ను తప్పక రావల్సిందని అన్నారని అన్ని తెలిసి కూడా ఆయనెందుకు నన్ను రమ్మన్నారో నాకర్థం కాలేదు నిమ్స్‌కు వెళ్లాక డాక్టర్లను నేను ప్రశ్నించటమో, వాళ్ల వల్ల మాలిన తనాన్ని కాదని చెప్పటమో జరుగుతుంది కాబట్టి, నేను వెళ్లలేదు ఆ విషయం కాళోజీకి కూడా తెలుసు అయినా ఆయన ఇంటెన్సివ్ కేర్‌లో వున్నారని నాకు తెలిసేప్పటికి అయనక్కడే ఉన్నారు తర్వాత కొద్ది రోజులుకే వార్త వచ్చింది కాళోజీ ఇకలేరని నేనుగా ఉంటే అలా జరిగేది కాదని ఆయానకూ నమ్మకం నాకూ నమ్మకమే

అలా కాళోజీ నమ్మడానికి మొదట కణ్ణాభిన్‌గారితో కలిసి నా దగ్గరకు వచ్చారు చూస్తుండగానే వారి జబ్బును నయం చేయడం అప్పటి నుండి కాళోజీ నాదగ్గరే వైద్యం చేయించుకుంటూ వచ్చారు కాళోజీ ఎముకలు పగలగొట్టి నక్షిపూసలు లామినోక్టమీ చేస్తారని విన్నాక, ఆ రోజే అక్షణం తర్వాత అయన్ని కూర్చోటమే గాదు, గుంజీలు తీయించాను బాగానే ఉందనుకున్నారు ఇదంతా 'అక్యుపంక్చర్' వైద్యంతోనే జరుగుతుందని

చెప్పాను ఆయనకింకెన్నో హోమియోపతి మందులు వాడినప్పటికీ ముఖ్యంగా వారికున్నది సర్వయికల్ స్పాండిలైటిస్ అని తర్వాత అర్థమయింది మొదట లంబార్ స్పాండిలైటిస్‌నయమయ్యాక మళ్లా ఈ జబ్బేమిటని మీరడగవచ్చు అది వారి వయసును బట్టి కూడా ఆయనకప్పటికి 88 సంవత్సరాలుంటాయి

ఆయన్నొకసారి 'తెలుగుసీమలో తెలుగునేవాడటం' కోసం సభకు పిలిచాను రోడ్డు కాదు సడక్ అనే వాణ్ణి మీరేం చేస్తారు అని ఎదురు ప్రశ్న వేశారు కాళోజీ అదే విషయం సభలో మాట్లాడారు వావిలాల కొంతసేపు అనర్గళంగా మాట్లాడినా కాళోజీ నవాల్ని కాదనలేకపోయారు

'తెలంగాణా విధిగా ఏర్పడాలని ఆయనా నేను తెలుగుస్తాన్' ప్రత్యేక దేశంగా ఏర్పడాలని అన్నాం తెలంగాణా ఇండియాలో భాగంగా ఉండాలని ఆయన కోరిక ఒకప్పుడు పుచ్చలపల్లి సుందరయ్యగారన్నారు తెలుగు ప్రాంతాన్ని తెలుగుదేశం మారనవచ్చు మేం స్వతంత్రమైన స్వేచ్ఛా యుతమైన తెలుగుజాతిని కోరుతున్నాం అయితే ఇండియా జాతుల స్వేచ్ఛగా ఒకటిగా ఉంటుందని ఆయన ఊహించినట్టు కాళోజ ఒప్పుకోలేదు భారత్‌లో ఉంటున్న తెలంగాణే వారి ఉద్దేశ్యం అయినా 'తెలుగుస్తాన్'ను ప్రచారం చేయడానికి కాదు వరంగల్‌లో ఒక సభను కూడా ఏర్పాటు చేస్తామన్న వారు ఇప్పుడులేరు

# కాళోజీ జ్ఞాపకాలు

- ఎస్ గోపి

కాళోజీ 'నాగొడవ' తో పరిచయం నా బాల్యం లోనిదే ఎనిమిదో తరగతి చదువుతున్నప్పుడే ఆ పుస్తకం నాచేతికందింది స్నేహితుల మధ్య ఆయన కవితలను కోట్ చేస్తూ తిరిగే వాడిని 'అన్నపురాసులు ఒక చోట ఆకలి మంటలు ఒక చోట', కోలంబు రాగానే కాటేసి తీరాలె' ఇట్లా

కాళోజీని అప్పటి వరకు చూడలేదు ఎందుకో మాకు వరంగల్లుతో ఎక్కువ సంబంధాలుండేవికాదు మాది భువనగిరి మాకు నల్లగొండకు, హైదరాబాద్‌కు ఎక్కువగా రాకపోకలుండేవి నేను పి హెచ్ డి చేస్తున్నప్పటి దాకా కాళోజీ తో వ్యక్తిగత పరిచయం కలగలేదు (1976)

ఆ రోజుల్లో సీనియర్ పాత్రికేయుడు స్వర్గీయ జి కృష్ణగారు పరిచయమయ్యారు తొందరగానే ఆత్మీయులయ్యాం ఆయన మా ఇంటి పక్కనే రాంనగర్ లో ఉండేవారు నేను వేమన మీద థీసిస్ రాసి దానిలో వేమన వంటి వారి గురించి ఓ చాప్టర్ రాశాను దాంట్లో కాళోజీని వేమనతో పోలుస్తూ ఆయనను ఆధునిక వేమనగా అభివర్ణించాను దాంట్లో ఓ చోట ఏమన్నానంటే

"వేమన్నలాగే కాళోజీ నాడి పట్టుకొని చూసి వెంటనే కొన్ని నిర్ణయాలకు రాలేము అయితే వేమన్నకూ, కాళోజీకి ఒక మౌలికమైన సామ్యముంది అదే వారి ప్రతి స్పందన విధానం (Mode of Reaction) అన్యాయాలకు దుర్మార్గాలకూ వారిద్దరూ ఒకే రకంగా స్పందిస్తారు యీటెల్లాంటి మాటలు విసురుతారు

వేమన్న - (మైనస్) మతం = కాళోజీ అని చెప్పవచ్చు అయితే మతానికి బదులుగా కాళోజీ కవిత లో రాజకీయాలు చోటు చేసుకున్నాయి దానికి కాలపరిస్థితులు కారణం"

జి కృష్ణ గారు కాళోజీ అత్యంత సన్నిహితులని నాకప్పటికి తెలియదు కాళోజీ బాల్యమిత్రుడు వెంకటయ్య గారిని రిటైర్డ్ ఇంజనీరు రామ్‌నగర్‌లో

ఉండేవాడు ఈ మధ్యనే ఆయన చనిపోయారు కాళోజి ఎప్పుడొచ్చినా ఆయనింట్లో దిగేవాడు అట్లా కాళోజీ వచ్చినప్పుడు జి కృష్ణగారు నన్నుతీసికెళ్లి వెంకటయ్య గారింట్లో పరిచయం చేశారు కాళోజీని మొదటి సారి చూడగానే అదో అనుభూతికి గురయ్యాను నాగొడవలోని అక్షరాలన్ని నాచుట్టూ తిరుగుతున్నట్టనిపించింది అసలు మొదటి సారి కలిసినట్టుగాలేదు చాలాకాలం తర్వాత మళ్లీ కలుసుకున్నట్టని పించింది

నేను థీసిస్ లో రాసింది చదివి కాళోజీ మురిసిపోయాడు పేరాలు పేరాలు కలిసిన వారందరికి వినిపించేవాడు నాడీ బాగ పట్టుకున్నవురా అన్నాడు 'రా' అనే అధికారం ఆయనకు సహజంగా సిద్ధించినట్టుంది నాకు కూడా అది ఆత్మీయంగా ఇష్టయ్యింది కాళోజీ పెద్ద పెద్దోళ్లనే 'రా' గొడుతడు మనదేం లెక్క! కాళోజీ త్వరలోనే కాళన్నగా మారిపోయాడు

కాళన్న ఓ రెండేళ్ల పాటు హైదరాబాద్ లోనే కాపురం మున్నాడు రాంనగర్ లో మా ఇంటికి దగ్గరలోనే ఓ ఇల్లు తీసుకున్నాడు ఇగ చూడలె కాళన్నను కలవని రోజు లేదు జికె వెంకటయ్య, లేదా మాయింటోనో ఎక్కడో ఓ చోట దొరికే వాడు కాళన్న అన్నిండ్లూ ఆయనవే ఎంతో చనువు, ప్రేమతో కూడిన దాదాగిరి ఇష్టమైన వంటలు అడిగి చేయించుకునేవాడు అప్పుడప్పుడు సురమౌళి వచ్చి కలిసేవాడు ఒకటి రెండు సార్లు నీలా జంగయ్య కూడా గోష్ఠుల్లో వ్యక్తిగత విషయాలేముంటాయ్ అంతా లోకం గురించే, బాధల గురించే, బరువుల గురించీ అన్యాయల గురించీ, దుర్మార్గాల గురించీ, ప్రభుత్వాల అధీకృత హింస గురించీ కాళన్న శరీరంలో రక్తానికి బదులు కన్నీళ్లున్నాయా అనిపిస్తుంది మాట్లాడుతూ మాట్లాడుతూ పొలమారితే చాలు కన్నీళ్లొస్తాయి వ్యక్తిగతం కాని కన్నీళ్లు నేను కాళోజీ లోనే చూశాను ఆర్తి లోంచి ఉబికిన కన్నీళ్లవి మహాధైర్యవంతుడు కాళన్న భయమెరుగడు స్వార్థం లేని వాడని సాహసం వరిస్తుంది

కాళన్న పోతన గురించి మాట్లాడుతుంటే బాగుంటుంది రాముకు సీతకోసం అడవి లో వెతికే ఘట్టాన్ని చెప్పి ఆర్ద్రమై పోయేవాడు రాముడురా! వాడెంత కుమిలిపోయిండో అనే వాడు తెలంగాణతనం అనేది కాళన్న లో నిసర్గంగా ఉండేది తెలంగాణా భాష అయన నోటిలో మట్టి ధ్వనులు చేసేది ఆయన భాషలో ప్రత్యేకం అయన వ్యక్తిత్వ శైలి ఉండేది

ఏముడిది అనేవాడు అయన తరచూ వాడే ఊతమాట 76 ప్రాంతంలో నేను పూర్తి తెలంగాణా భాషలో రాసిన కవితల్ని మెచ్చుకునేవాడు గిట్ల రాయాల్రా' అనేవాడు కారణాలేవైతేనేం తెలంగాణా స్పృహ రావడానికి మన రచయితలకు కవులకు 50 యేళ్లు పట్టింది రాజకీయాభిప్రాయాలెలా వున్నా తెలంగాణాలో సాహిత్యపరంగా ఒక బలమైన సాంస్కృతిక పునాది ఏర్పడింది జీవితవాస్తవాల కోసం యావదాంధ్రదేశం తెలంగాణా వైపు చూసే సమయం ఆసన్నమైంది దీనికి కాళోజీ అకాంక్ష అనవరత ప్రచారం ఎంతో దోహదం చేసింది చివరిరోజుల్లో దీనిని చూసి ఆయన సంతృప్తి పడ్డాడని నాకనిపించింది

హనుమాన్ టేక్డీలా వున్న మాదపాటి హనుమంతరావు గారింటికి మారక ముందు దాకా ఏడు నెలల పాటు కాళన్న రామ్‌నగర్ లోనే ఉన్నాడు జీవితమంతా వరుచుకునేంత మంచి క్షణాలు మూటగట్టుకున్నాను నేను కాకతీయ యూనివర్సిటీకి ఓ ఐదునెలల పాటు ఇన్‌చార్జ్ వైస్ ఛాన్సలర్ గా వున్నాను ఆ సందర్భంగా వరంగల్లు లో కాళన్న నక్కలగుట్ట ఇంటికి చూడ్డానికి వెళ్లాను నా శ్రీమతి అరుణ కూడా నాతో వుంది ఎంత సంతోష పడ్డాడో మమ్మల్ని చూసి ఏమిరా విసీ కష్టాలల్లా పడ్డావా?అన్నాడు హైదరాబాద్ లో అయనతో మేం దిగిన ఫోటోలన్ని పెట్టెలోంచి బయటికి తీసి చూపించాడు అదే అఖరి సారి మాట్లాడ్డం కాళన్నతో, నిమ్స్‌లో ఉన్నప్పుడు వెళ్లాను కాని చూడ్డం పడలేదు

కాళన్న మరణంతో ఒక శూన్యం ఆవరించింది కాని ఆయన మాటల్నీ జీవితాన్నీ తలచుకుంటే శూన్యం లేదని ఆయన వేలాది మందితో నిండిపోయి ఉన్నాడని అనిపించింది కాళన్న జ్ఞాపకాలు ఎంతరాసినా తరిగేవి కావు ప్రస్తుతానికి ఇరవై రెండేళ్ళ క్రితం కాళన్న పైన

నేను రాసిన ఓ కవితను ఉదాహరించకుండా ఉండలేక పోతున్నాను

కాళోజీ
కన్నీళ్లు ఏడుంటే
కాళన్న ఆడుంటడు
కాళన్న ఏడుంటే
'కలేజాగాండ్లు ఆడుంటరు
గోడు అడుగును తాకినప్పుడల్లా
గొంతు అడ్డం పడ్తది కాళన్నకు
ఎంతో చిక్కు సంగతులను
'గింతే అని తేల్చేస్తకు కాళన్న
మూడు అంతరాలు చూసి
లావు లావు ఎగుర్తాండు
దమ్ముకున్న పోరగాల్లను
రమ్మని సవాలు జేస్తాండు
కాళన్న ముంగల
నువ్వన్న మాటలే నీమీదికి తిరగబడతై
కాళన్న వెనకాల
ఆయనన్న మాటలే వినబడతై

కాళన్న కవిత్వానికి
అక్షరాలు దాసై
కాళన్న గర్జిస్తే
కాయితాలు వొనుకుతై
కాళన్న మాటలు
పునాదులల్ల అడుకునే పసిపిల్లలు
లొసుగుల్లేవు
ముసుగుల్లేవు
సిసలైన వ్యవహారం కాళన్నది
కాళన్న అడుగు పెట్టిన ఇల్లు
కాళన్న మెట్టిన ఇల్లే
కాదంటే ఆ ఇల్లాలు
కాళన్న ఒడిలో పిల్లే
కాళోజీ అడుగులు పడ్తే చాలు
'కాళోజీ తాత' అంటూ
వీధులు వెంట పడతై
నువ్వాయన కోసం పోయినప్పుడు
నీ కోసం ఆయన
మీ యింట్లుంటడు
కవిత్వాలు కాయితాలు
సదువుకున్నోన్ని అటుబెట్టు
కష్టనిష్టురాలు తెలిసిన ప్రతోడు
కాళన్న ముందు కరిగి పోతడు
కష్టనిఘరాలురెండూ
కాళన్న ముందు కరిగిపోతయి
కాళన్న ఒకమెత్తని వజ్రం
కాళన్న కాళన్నే

## రచనల కంటే వ్యక్తిత్వం గొప్పది

# కాళోజీ వ్యక్తిత్వం ఆయన రచనల కంటే ఎత్తయినది

- జూలూరు గౌరీశంకర్

ఎవరైనా రచనలు చేయటం వల్లనే గొప్పోలయిపోతారన్నది నిజం కాదు తాను చేసినరచనలలో మొదట రచయిత ప్రభావితం చెందాలి అంటే జీవితం రచన ఒక్కటే కావాలి అందుకే ఆచరణ ప్రధానం అలా తాను చేసిన రచనలకు సంబంధించి సంబంధిత కవికి నిమగ్నత నిబద్ధతలేకపోతే జనం విశ్వసించరు నిబద్ధత నిమగ్నత గల కవులు రచయితలు ఏ సాహిత్య ప్రక్రియలోనైనా తక్కువ మంది కనిపిస్తారు కమిట్‌మెంట్ గల కవులలో జనం తరుపున నిలబడి రాసిన వ్యక్తిగా ప్రజాకవి కాళోజీ నారాయణావు తెలుగు సాహిత్యంలో అగ్రభాగాన నిలబడతాడు

తాను చేసిన రచనలకంటే తాను ఆచరించిన జీవితమే ప్రజలను ఎక్కువగా ప్రభావితంచేస్తుందన్న విషయం ప్రజాకవి కాళోజీ విషయంలో అక్షరాల నిజం కాళోజీ నారాయణరావు పేరుకు ముందు భారత ప్రభుత్వం ప్రకటించిన పద్మవిభూషణ్ అన్న బిరుదు కాళోజీకి ఇచ్చారని తెలియని జనం కూడా ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ మందే ఉండవచ్చును కానీ జనం హక్కుల కోసం మా వాడలకు వచ్చి,మారుమూలగ్రామాలకు వచ్చి, రాజ్యానికి వ్యతిరేకంగా పాలికేక పెట్టిన పౌరహక్కుల ఉద్యమనాయకునిగా కాళోజీని ఎరిగిన వారు రాష్ట్రంలో, ప్రధానంగా తెలంగాణా జిల్లాల్లో లక్షల సంఖ్యలో ఉంటారు

"పుట్టకనీది

చావునీది

బతుకంతా దేశానిది' అని కాళోజీ జీవితం యొక్క అర్థాన్ని పరమార్థాన్ని వేమనలా అందరికీ అర్థమయ్యేలా విప్పి చెప్పాడు ఆయన తుది శ్వాస విడిచే వరకు తుది శ్వాస విడిచిన తర్వాత కూడా తన దేహాన్ని దేశానికి అంకితం చేశాడు ఇలా చేసిన వారు అన్నదమ్ములు ఆ ఇద్దరే కావచ్చు

బుల్లెట్‌కు ఎటువైపు నెత్తురంటినా కన్నీళ్లు పెట్టిన కళ్లు ఆయనవి అందుకే ఆయన జీవమున్న రచనలు చేశాడు రాజ్యంపై పోతనలా కలబడి నిజాయితీగా బతికాడు వేమనలా కవిత్వం రాసి జనం కవి అయ్యాడు

కాళోజీ విలక్షణమైన వ్యక్తి ఆయన తెలంగాణ కోసం గళమెత్తాడు తన తనువుంతా తెలంగాణా కోసం తపించాడు తెలంగాణా వస్తున్న కరువులకు నివారణగా ఒతుకమ్మ పాటలకు కాళోజీ గొంతు కలిపాడు తెలంగాణాకు ఒక పర్యాయపదంగా కాళోజీ మారాడు పి వి నరసింహారావు అన్నట్లు 'కాళోజీ'కి నిఘంటువు అర్థాలు యాడ వెతికినా కనిపించవు కానీ కాళోజీ అంటే ఎవరు ఏ దృష్టితో చూసినా ఆ దృష్టితో కన్పిస్తాడు కాళోజీ మనిషితత్వానికి సరిపడా ఇమిడే గొప్ప మానవతావాది విరామంలేని తెలంగాణా వాది ఆయన మనిషితనాన్ని కోస్తాంధ్రా కూడా కౌగిలించుకుంది

విషయాన్ని మౌఖికంగానే ఆసువుగానే ముఖం మీద కొట్టినట్లు చెప్పిన కాళోజీ వ్యక్తిత్వం ఎంతో గొప్పది ఒక కవిగా, కథారచయిగా కంటే ఒక సామాజిక శాస్త్రవేత్తగా ఆయన వేసిన అడుగులు ఆయన నడక ఎంతో ఉన్నతమైనవి

కాళోజీతో నేను మాట్లాంది ఒక్కసారే, ఆయన కన్నీళ్లతో మాట్లాడిండి మాత్రం అనేకసార్లు నేను 2002లో తెలంగాణా కవుల సంకలనం 'పొక్కిలి'ని తీసుకువచ్చాను 'పొక్కిలి'ని మే 2002లో హైదరాబాద్ ప్రెస్‌క్లబ్‌లో సురవరం ప్రతాపరెడ్డి హాలులోనే ఆవిష్కరణ ఘనంగా జరిగింది

ఆ సభకు 60 ఏళ్లుగా తెలంగాణా గురించి తపిస్తున్న పెద్దాయన కాళోజీ మాత్రం రాలేదు అందుకు ఆయన అనారోగ్యం కారణం (ఈ మాటంటే కాళోజీ ఒప్పుకోడు)

ఎట్లాగైన తిరిగి కాళోజీ చేత పొక్కిలిని ఆవిష్కరింపచేయాలన్నది నా తలంపు ఇందుకోసం నా మిత్రుడు గింజలర్యాం (గింజల రమణారెడ్డి) నేనూ కలిసి వరంగల్ వెళ్లి కాళోజీ నివాసంలో స్థానిక సాహితీ మిత్రమండలి సహకారంతో ఆవిష్కరణ జరిగింది ఇదే కాళోజీ సుదీర్ఘ సాహిత్య జీవన యానంలో ఆవిష్కరించిన అఖరి పుస్తకం పొక్కిలి' ఆయన మంచం మీద అంపశయ్య మీద భీష్మునిలా ఉన్నాడు రామశాస్త్రి కాళోజీని అతికష్టంమీద మంచం మీంచిలేపి, దుస్తులు వేశాడు ఆయన్ను మంచం మీంచి లేపేంత వరకు నాకు కొంచెం భయమేసింది కానీ లేచాక వరండాలోకి ఎవ్వరిసాయం లేకుండా స్వతంత్రంగా వచ్చాడు పుస్తకాన్ని ఆవిష్కరించాడు నేను కాళోజీ కవితను కాళోజీకే విన్పించాను రామశాస్త్రి చెప్పినా వినకుండా రెండుసార్లు మాట్లాడాడు 'పొక్కిలి'కి అర్థాలు చెప్పి ఈ పుస్తకం తెలంగాణా ఆత్మగౌరవ సంకలనం అనటం మేము పడుతున్న తపనకు, ఆరాటానికి కాళోజీ ఇచ్చిన వెలకట్టలేని అవార్డుగా భావిస్తున్నాం కాకతీయ యూనివర్సిటీలో తెలంగాణా సాహిత్యమంటే ఒక్క బన్న అయిలయ్య ఒక్కడే మాట్లాడుతున్నాడని కాళోజీ వ్యాఖ్యానించాడు తెలంగాణ రచనలపై సమగ్రంగా పరిశోధనలుచేసేందుకు యూనివర్సిటీ పీఠాలు ఇకనైనా కళ్లు తెరవాలని కోరారు

కాళోజీలా అతిసాదారణగా జీవించటం కానీ, నరహంతక ప్రభుత్వాలకు వ్యతిరేకంగా కలేజాతో మాట్లాడటం కానీ చాలా కష్టమైన పనులు అదీగాక ఒకే తెలంగాణా అంశంపై అరవయేళ్లుగా పోరాటకవిత్వం రాయటం తెలుగు సాహిత్య చరిత్రలో ఒక అరుదైన అపురూపమైన సంఘటన కాళోజీలాగా ఆయన మార్గంలో కవిత్వం రాయటానికి ప్రయత్నం చేస్తే సాధ్యంకావచ్చునేమోగానీ కాళోజీ మార్గంలో జీవితాంతం నడవటమంటే అతికష్టమైనది ఇతరులకు అది అసాధ్యం ఇక్కడే కాళోజీ ఇతరులకు అందనంత ఎత్తు ఎదిగాడు తెలంగాణాకు తిరుగుబాటుతత్వానికి నిజంగా జీవ నదే అది ఎవ్వరూ తొలుచుకుపోలేని సాహిత్యనిధే ఆయన పోరాటాల పొలికేక సత్యాన్ని అన్వేషించుకుంటూ పోతున్న రహాదారి

కాళోజీ ఆశయ సాధన కోసం చిత్తశుద్ధితో పనిచేయవలసి అవసరం ఉంది నేతలుకు చేసిన వాగ్ధానాలను అమలు జరిపించేందుకు వాళ్లను నిద్రపోన్వికుండా చూడాల్సిన అవసరం ఉంది

కాళోజీ అందరి వాడు కాబట్టి కాళోజీని ఎవరో కొందరు ప్రత్యేకమైన వ్యక్తులు, సంస్థలు హైజాక్ చేసి తీసుకుపోయేందుకు ప్రయత్నిస్తే అది సాధ్యం కాదు అన్ని వాదాలలోనున్న మంచిని ప్రేమించిన మహాప్రేమికుడు కాళోజీ కాళోజీ అనుభూతుల్ని, ఆయనలోనున్న సంబంధాలను పదిలపరచటం కూడా కష్టమే అందరి అనుభూతుల్ని, మందిలో వున్న అనుభవాల్ని మర్చిపోకుండా చెప్పటంకాని, దాచిపెట్టుకోవడం కానీ ఒక్క కాళోజీకే సాధ్యం ఆయన మన గురించి తడుముకోకుండా చెప్పగలిగేవాడు కానీ కాళోజి గురించి మనం చెప్పటం కష్టమైన పని

ఇంకా కాళోజీని ఊతారానికి పరిచయం చేసేందుకు ఆయన సాహిత్య ప్రస్థానంలోని కొన్ని లక్షల మజిలీలను రికార్డు చేసేందుకు కృషిచేసేందుకు అనేక సంఘాలు, సంస్థలు, పార్టీలూ ఉన్నాయి సాహిత్యరంగంలో ఎప్పుడూ ఉండే ముఠాలు, వాదాలు, వాదనలను కాళోజీకి పూయకుండా, ఆయన విషయంలోనైనా మనలోపలి భిన్నాభిప్రాయాలను పక్కనబెట్టి కాళోజీ మార్గంలో కదిలిపోవలసిన అవసరం ఉంది

# మానవతా విలువల కాలేజీ - "కాళోజీ"

చొప్పకట్ల చంద్రమౌళి

కాళోజీ గురించి పత్రికలన్నీ ప్రశంసనీయంగా స్పందించాయి తమ బాధ్యతకు న్యాయం చేశాయి కాళోజీ జీవితంలోని ప్రతిక్షణం నుండి కూడా ప్రతివాడూ గమనించి గ్రహించవలసింది ఎంతో ఉంటుంది ప్రజాకవి"అన్నమాటకు కాళోజీ మాత్రమే మొదటి స్థానంలో నిలుస్తాడు విభిన్న దక్పథాలుగల వారందరికీ సమాన స్థాయిలో ఆమోదయోగ్యుడైన వాడు కాళోజీ ఒక్కడే అతని సహచర్యంలోని ప్రతి సంఘటన ఒక చిరస్థాయి జ్ఞాపికగా నిలిచిపోతుంది అలాంటికొన్ని సందర్భాలను పాఠకులకు అందజేయాలనే ప్రయత్నమే ఈ నా రచన

ఆయన రాజకీయాలలో ఇముడలేక బయటపడ్డాడు రాజకీయాలంటేనే భగ్గున మండేవాడు అందుకే రాజకీయాలను "ఎవరికి చేవని ఎండిని చన్నులు, రసవిహీనములు రాజకీయములు' అన్నాడు 71లో నా 'సమతా దీపాలు' ఆవిష్కరణ కోసం అడగడానికి వారి దగ్గరికి వెళ్లాను అడిగాను పుస్తకం చూసి "అరేయ్! ఎవణ్ణయినా మినిష్టర్‌గాణ్ణి పిలుస్తున్నావా? వాడు వస్తే నేను రాను" అన్నాడు పిలువడంలేదన్నాను సరేనన్నాడు

ఆ సభలో సురమౌళి అధ్యక్షుడు కాళోజీ కావ్యాన్ని ఆవిష్కరిస్తూ 'శ్రీశ్రీ నుండి ఈ నాటి వరకూ పీఠిక, ముందు మాటా ఏమీ లేకుండా కవి కూడా ఏమీ చెప్పకోకుండా వెలువడిన మొదటి కవితా సంకలనం' అంటూ నేనే ఊహించని విషయాన్ని చెప్పాడు కార్యక్రమం తర్వాత అందరూ మా ఇంట్లోనే భోజనాలకు కూర్చున్నారు కాళోజీ మొదటనే కూర్చున్నాడు వడ్డన చివరి భాగంలో ఇంకా పూర్తికాలేదు ఆయనకు ఆకలి వేస్తోంది ఆగలేకపోయాడు" అరే చొప్పకట్లు నేనైతే "ఆవిష్కరిస్తున్నాను" అంటూ గబగబా భోంచేయడం ప్రారంభించాడు

మరోసారి సిరిసిల్లలో ఓ సాహిత్య కార్యక్రమానికి ఆయనను ఆహ్వానించి వారికి ఆర్‌అండ్‌బి డాక్ బంగళాలో బస ఏర్పాటు చేశాం కార్యక్రమం తర్వాత సాయంత్రం కనపర్తి ఇంట్లో విందు ఆ కిరాయి ఇంట్లో డాబా మీద చాపలు పరచుకుని అందరం కూర్చున్నాం కాళోజీ అందరినీ పేరు పేరునా పరిచయం చేసుకుని కండ్లనీల్లు తీసుకుంటూ అరేయ్! మీరు ఇంతమంది నా వాళ్ళుండగా, నన్ను ఓ గతిలేనోని తీరుగ ఆ సర్కారు కొంపంలో ఎందుకుంచిర్రా?" అంటూ బాధపడ్డాడు ఆయన ఆత్మీయతకు మా అందరి హృదయాలూ ద్రవించాయి

ఇక ఆ రాత్రి గెస్ట్ హౌస్‌కు వెళ్ళక అక్కడే పడుకున్నాడు ముఖ్య అతిథులుగా వచ్చే చాలా మంది హై పై కవుల లాగా ఆయనకు ఆతిథ్యానికి సంబంధించిన ఆడంబరాలు ఏమీ అక్కర్లేదు వేములవాడలో మాంట్లో ఉన్నప్పుడు మంచం వద్దంటాడు పరుపూ బట్టలూ ఏవీ అక్కర్లేదంటాడు చింకి చాపైనా, కుచేల భోజనమైనా ప్రేమతో ఆస్వాదించే నిరాడంబరుడు

బహుశా '77లో అనుకుంటాను గవర్నర్ శారదా ముఖర్జీ వేములవాడకు వచ్చిన సందర్భంలో పిడిఎస్‌యు విద్యార్థులు రెచ్చిపోయి పోలీసుల నెదిరించారు పోలీసులు కూడా రెచ్చిపోయి కనిపించిన విద్యార్థినల్లా చితకబాదినారు ఇండ్లలో నుండి ఈడ్చుకువచ్చి కొట్టినారు ఈ సంఘటన జరిగిన రెండు రోజులకు వరంగల్ నుండి కాళోజీ ఆధ్వర్యంలో ఒక నిజ నిర్ధారణ కమిటీ వచ్చింది ఆ ఎనమందు గురితో ఆయన సరాసరి మా ఇంటికి వచ్చాడు వాళ్లను ముందు హాల్లో కూర్చోబెట్టి చకచకా పెరట్లోకి వచ్చి నన్ను చూసి " అరే! చొప్పకట్లు నేను వచ్చిన నా బిడ్డేదిర?" అన్నాడు "తల్లి గారింటికి వెళ్ళింది నేనొక్కణ్ణే ఉన్నానన్నాను"

'అయితే మరివ్వాడెట్లర? వేం ఎనమండుగురం వున్న మాకిప్పుడేమైనా తిండికి కావాలె ' అన్నాడు మీకు అన్నీ వస్తాయి మొదటకూర్చొని విశ్రాంతి తీసుకోండి ఓ పది నిమిషాల్లో మీకు అన్నీ అందుతాయని కూర్చోబెట్టి, గుడికి వెళ్లి ఓ 30పులిహోర పొట్లాలు కొని దారిలో వచ్చి మోతుకాకుల విస్తార్లు తీసుకొని వచ్చి అందరినీ కూర్చోబెట్టి వడ్డించాను ఆవకాయతో పులిహోర తిని ఎవరి విస్తార్ల వారు ఎత్తబోతున్నారు ఎవరూ విస్తార్లు ఎత్తవద్దన్నాను 'నా బిడ్డలేదు గద మరెవరు తీస్తర్రా?" అన్నాడు

"మనిషి ఉన్నది వచ్చి తీస్తది మీరు తీయకండి" అన్నాను

కాళోజీ వెంటనే కళ్ళు పెద్దవి చేసి నా వైపు చూస్తూ "నీవుర కవివంటే, పని చేసే వాళ్ళనే 'మనిషి'గా గుర్తించావుగద! పని చేయని వాడు 'మనిషి' కాదన్నట్లే గద అయితే మేమంతా మనుషులం పని చేస్తాం అటూ కాళోజీవిస్తరి ఎత్తే సరికి మిగతా వాళ్ళంతా అలాగే చేశారు సాధారణ సన్నివేశాల నుండి అసాధారణమైన ఆలోచనలను రేకెత్తించే వ్యాఖ్యలు చేయడం ఆయనకు వెన్నతో బెట్టిన విద్య హైదరాబాద్‌లో డాక్టర్ ఆర్ లక్ష్మణమూర్తి కుమారుని పెండ్లిలో కాళోజీ వరవరరావులు కలిసినపుడు, మాటల సందర్భంలో ఈ విషయం నేను ప్రస్తావనకు తెచ్చాను 'అయ్యో! ఈ విషయాన్ని మాకెప్పుడు చెప్పలేదు కాకా" అన్నాడు వరవరరావు, కాళోజీతో

"సందర్భాన్ని బట్టి తోచింది వెంటనే అంటాను వెంటనే మరచిపోతాను అన్నాడు కాళోజీ అలాగే ఆయన చిన్న చిన్న కాయితం ముక్కలమీద కవిత్వం రాసి, ఎక్కడో పారేసి పోగుట్టుకున్న కవితలెన్నో ఉన్నాయట

'72లో శ్రీశ్రీ అధ్యక్షత వహించిన ఒక పౌర హక్కుల సమావేశంలో కాళోజి మాట్లాడుతూ "పౌర హక్కుల కోసం పోరాడే ముందు మనం పౌరులమా లేక పోరలమా ఆలోచించుకోవాలి ' అన్నాడు

కాళోజీగారు తప్పకుండా కలుస్తారని హన్మకొండలో డాక్టర్ లక్ష్మణమూర్తి అమ్మాయి పెండ్లికి వెళ్ళిన భోజనాల దగ్గర జనం రద్దీ భరించలేక ఓ మూలకు చేరుకున్నాను సరిగ్గా అక్కడే ఆ మూలకే పూల చెట్లకు కట్టలుగా కట్టిన ఓ కట్టపై కూర్చుని ప్లేట్లో ఏదో స్వీటూ ఖారా పెట్టుకుని కాళోజీ తింటూ కూర్చున్నాడు నన్ను దూరం నుండే చూసి గుర్తించి అప్యాయంగా అరే చొప్పకట్లూ రారా!' అంటూ పిలిచాడు నమస్కారం చేసి వెళ్ళి నేను పక్కనే కూర్చున్నాను "మీరు బాగున్నారా? ఆరోగ్యం బాగుందా? 'అని అడిగిన

"ఏం ఆరోగ్యమోరా ' దుకాణాలన్నీ బంద్ అయిపోతున్నాయి" అన్నాడు మనుషులు కనిపించడం లేదు మాటలు వినిపించడంలేదు అని చెప్పడానికి చెప్పిన కవితాత్మక భావాన్ని నేను గ్రహిచి మనసు లోనే అయ్యో! పాపం' అనుకుంటూ మాటలు రాక కొంతసేపు మౌనంగా వున్నాను మా ముందు నుండి జనం రద్దీగా వచ్చి పోతున్నారు వారిలో ఎందరినో దూరం నుండే ఆత్మీయంగా పేరుతో పిలుస్తూ యోగ క్షేమాలడుగుతూ పలకరిస్తున్నాడు వారి ప్రశ్నలకు జవాబిస్తున్నాడు ఈ దృశ్యం చూసి "మీరు నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నారా? అంత దూరం నుండే వ్యక్తులను గుర్తించి పలకరిస్తున్నారు వారి ప్రశ్నలకు జవాబిస్తున్నారు నాతో నేమో 'దుకాణాలన్నీ బంద్లై పోతున్నాయంటున్నారు?" అని అడిగాను

"నేనేం జెయ్యాల్రా? ఎవని 'ప్రవర' వాడే చెప్పుకోవట్టె' అంటూ చమత్కరించారు ఇంతలో ఓ అభిమాని వచ్చి ఆయన ప్లేట్లో మరో రెండు గులాబ్‌జామూన్లూ ఓ పక్క ఇంత ఖారా వేసిపోయాడు ఆయన చేసిన అనారోగ్య ప్రస్తావనా ఆయన తింటున్నతిండీ చూసి ఉండబట్టలేక "మీరుఏదిబడితే అదే తింటున్నారు ఆహారంలో కొంత జాగ్రత్త పాటిస్తే మంచిది గదా" అని ఇటు అన్నానో లేదో వెంటనే గుడ్లు పెద్దవి చేసి నా వైపు చూసి,

"ఈ వయసులో నన్ను పత్యం జేయ్యమంటావురా?" అన్నాడు నాకు తెలుసు అది కోపంగాదు తన చర్యను సమర్థించుకునే చమత్కారం,

ఆయనతో గడిపిన క్షణాలు మాటలతో గడిచిపోవు పది కాలాలపాటు మనస్సును గిలిగింతలు పెట్టే కవితలు బాటలలో నడిచిపోతాయి

మరోసారి ఆయన ఇంటికి దగ్గర్లోనే ఒక పెండ్లికి వెళ్ళాం ఆ పెండ్లిలో మిత్రుడు రామశాస్త్రి కలిశాడు పలకరించాను కాకను కలువరా? ఇక్కడికి దగ్గర్లోనే ఇల్లు అన్నాడు భోజనాలు చేసి కాళోజీ అంటే అభిమానించే మా బావ నమిలకొండ చంద్రమౌళి నేనూ రామశాస్త్రితో కాళోజీ ఇంటికి వెళ్ళాం అప్పుడాయన వయస్సు 84 పట్టపగలు నుండుటెండలు శాస్త్రి వెళ్ళి కాళోజీతో చెవిలో నారాకను చెప్పినాడు చాందినీ మంచంలో ధ్యానముద్రలో ఉన్నట్లు పడుకున్న వాడల్లా హఠాత్తుగా లేచి కూర్చుని "అరే! చొప్పకట్లు! రారా' అంటూ మంచం మీద తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు 'బాగున్నారా"? అని అడిగి "మీరు నిద్రపోతున్నారో ఏమో ఎందుకు డిస్టర్బ్ చేయాలని అనుకున్నాం అన్నాను నమాధానంగా ఆయన 'పగలు నిద్రపోతే రాత్రి నిద్రపోలేదిరా అందుకే పడుకోను అన్నారు ఎదుట కూర్చోమంటే కుర్చీమీద కూర్చున్నాను అంతదూరంలో ఉండి నేను మాట్లాడుతుంటే ఆయనకు ఒక్కమాట వినిపించడంలేదు

'అయ్యో! మాటలేమీ వినిపించనట్లున్నాయి" అని రామశాస్త్రిని అడిగాను

'అయ్యో! వినిపించకేం బ్రహ్మాండంగా వినిపిస్తాయి, చెవులో మిషన్ పెట్టుకుంటే కానిపెట్టుకోమ్మంటే పెట్టుకోడు' అన్నాడు 'అలాగా! ' అని నేను ఎందుకిలా చేస్తున్నాడని అడుగుదామని ఆయన దగ్గరకు వెళ్ళి ఆయన చెవిలో మూతిబెట్టి "మమ్మల్ని ఒర్రించుకుంటూ ఎందుకు సతాయిస్తున్నారు చెవిలో మిషన్ పెట్టుకుంటే గాదా?" అని అడిగాను ఆ మాట విని విశ్రాంతి భంగిమలో ఉన్నవాడల్లా, ఒక్క ఊపులో లేచి కూర్చుని నా కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తూ

అరేయ్! మనం ఒకరు చెప్పే వినేరకం కాదు గదా' అన్నాడు ఆ కవితాత్మక చమత్కార వాక్యం ఆ నాటి పెండ్లి భోజనం కంటే ఎన్నో రెట్లు తృప్తి పరిచింది ఆ మాటను ఎన్నిసార్లు ఎందరిముందు చెప్పినా మళ్ళీ మళ్ళీ చెప్పాలనిపిస్తుంది నేను ఆ కవితా వ్యాఖ్య షాకు నుండి తేరుకునేలోగానే ఆయన రామశాస్త్రితో 'శాస్త్రీ! గాంధీ కవితల సంకలనాల ప్రతులు రెండు తీసుకురా! అన్నాడు శాస్త్రి తెచ్చిచ్చాడు

ఒక పత్రిని మా బావ పేరడిగి రాసి సంతకం శేదీ వేసి మా బావకిచ్చాడు రెండో ప్రతి తీసుకుని పెన్ చేతిలో పెట్టుకుని ఆలోచనలో పడ్డాడు

' నీ కోసం ఏమైనా రాయాలి కదరా! ఏం రాయాలె అంటూ ఆలోచించి ఓ మెరుపు మెరిసిన వాడిలా

"ఆ! దొరికిందిరా! అని

"పచ్చి మొక్కకు పోషణ కావాలి గాని చొప్పకట్టె కెందుకురా పోషణ అంటూ నవ్వుకుంటూ ఆ మాటలనే రాసి నాకు పుస్తకం ఇచ్చాడు

ఇలా ఆయన కవిత్వం కేవలం ఒక్క "నా గొడవలోనే గాదు ఆయన జీవితమంతా కవిత్వమే కవితలోనే ఆయన జీవితం జ్ఞాన పీఠాలపై ఎక్కకున్నా హృదయ పీఠాలపై ఆయన కవిత ఎప్పుడో చేరుకుంది మహా కవుల కవితలకన్నా మహానందాన్ని కలిగిస్తాయి ఆయన కవితలు మా అమ్మా నాన్నలు పోయినపడు ఏడుపు అనుభూతి ఎలా ఉంటుందో నాకు తెలియదు ఏ మహోన్నతులు మరణం గూడా నన్ను అంతగా కదిలించలేదు కాని పత్రికలో సూర్యోదయానికి ముందే అస్తమించిన " కాళోజీ కన్నుమూత" వార్త చూసీ చూడగానే ఇంకా ఒక్క అక్షరం ముక్కగూడా చదువలేక, మూత బడిన కన్నుల నుండి ఏకధారగా నా కండ్ల నుండి అశ్రుధార ప్రవహించింది ఆ ధారనే నన్నీ మాటలు రాయించింది మా ఊరి సిటీ కేబుల్‌లో అరగంట దాకా నన్ను ఏడిపించింది

# మేరు పర్వతం-చిరు జ్ఞాపకం

- డాక్టర్ దేవరాజు మహారాజు

చిన్నప్పుడు కాజీపేట హనుమకొండ, ఖిలావరంగల్ ప్రాంతాల్లో బంధువుల ఇండ్లకు వెళ్ళినపుడు మాటల్లో ఓసారి కాళోజీగారి పేరు వినిపించింది పేరేమిటి అలా ఉంది అనుకున్నాను అది ఇంటి పేరని ఎవరో చెప్పారు కాలేజీలో చేరి సమకాలీన తెలుగు సాహిత్యం విరివిగా చదువుతున్న రోజుల్లో (1970-73) ఆ పేరు మరింత బలపడింది ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి బలైపోయి నేను భువనగిరిలో తిరుగుతున్న రోజుల్లో ఎవరో చెప్పారు కాళోజీ గారొచ్చారని! ప్రత్యేక తెలంగాణా సాధించుకోక తప్పదని ఆయన మామూలు మాటల్లోనే కవిత్వం చెబుతున్నారని!! కొంత మందిమి కలిసి అయన్ని చూద్దామని వెళ్ళాం తీరా వెళ్ళాక ఆయన అప్పటికే వెళ్ళిపోయారని తెలిసింది చూడలేకపోయాం

'నా గొడవ లోని విశేషాలు మా డిఎల్ఎన్ రాజు అన్నయ్య అప్పుడప్పుడు చెబుతుండేవారు మళ్ళీ రెండేళ్ళ తర్వాత 1973లో వరంగల్ పి జి సెంటర్లో చదువుకోవడానికి వెళ్ళాల్సి వచ్చింది నక్కలగుట్ట, పెట్రోల్‌బంక్, హనమకొండ చౌరస్తా, కోహినూర్ హోటల్ అన్నీ స్వంతమై పొయ్యాయి ఆ రోజుల్లోనే వాళ్ళింటికి వెళ్ళి కాళోజీ సోదరుల్ని చూశాను నారాయణరావుగారి అన్నగారు కాళోజీ రామేశ్వరరావుగారు ఉరుదూలో మంచి పేరున్న కవి 'షాద్ పేరుతో రాసేవారు అంతపేరున్న వాళ్ళు ఇంత సామాన్యంగా జీవిస్తున్నారేమని ఆశ్చర్యపోయాను కాళోజీగారు కవిత్వం లోంచి బయటపడి కార్యకర్తగా నడుం బిగించడం వామపక్ష సిద్ధాంతాలు జీర్ణించుకుని మానవ హక్కుల పరిరక్షణ కోసం తిరుగుతూ ఉండడం పత్రికల ద్వారా తెలుసుకుంటూనే ఉన్నాను నా చదువు, పరిశోధన, ఉద్యోగాన్వేషణ వగైరాల్లో పడి నేను కాళోజీగారిని ఓ ఐదేళ్ళపాటు కలుసుకోలేకపోయాను

1980 ప్రాంతంలో ఓ రోజు సుల్తాన్ బజార్ శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయంలో పెద్ద సమావేశం ఏర్పాటయ్యింది వేదిక నుండి దాశరథి మాట్లాడుతున్నారు వెనక కుర్చీల్లో కుర్రకారు అయన్ని విమర్శిస్తున్నారు సినిమాల్లో చెత్తపాటలు రాయడం కాంగ్రెస్ నాయకులపై కవితలు రాయడం, ఆస్థాన కవి కావడం, వగైరా గిట్టనివాళ్ళు! కాళోజీ విన్నారు కాబోలు వారిని బయటికి పిలిచి, గద్గద స్వరంతో మందలించారు "ఓరేయ్! దాశరథిని ఏమీ అనకండ్రా ఆ రోజుల్లో దాశరథి ఎంతటి వాడంటే తలచుకుంటే ప్రజలు ఈ సుల్తాన్ బజార్‌లో సగం ఆయనకు రాసిచ్చేవారు ఇప్పుడు చూడండి మందుల మీద బతుకుతున్నాడు మందులకి నెలకు వెయ్యి రూపాయలు కావాలి ఎవరిస్తరు?" అంటూ చాలా సేపు చెప్పడం నేను విన్నాను తనకన్నా దాశరథి చాలా చిన్నవారు అయినా కూడా ఆయన గొప్పతనాన్ని మనస్ఫూర్తిగా మెచ్చుకోవడం కాళోజీగారి మానసిక పరిపక్వతకు, ఔన్నత్యానికి నిదర్శనం అది ఏ కొద్ది మందిలో మాత్రమే ఉంటుంది

పొట్లపల్లి రామారావుగారితో నాకు పరిచయం, చనువూ పెరిగాక తరచూ మా మాటల్లో కాళోజీ సోదరుల ప్రసక్తి ఉంటూనే ఉండేది ఒకానొకప్పుడు ఎప్పుడో హనుమకొండలో కాళోజీ గారింట్లో పొట్లపల్లిగారు అద్దెకున్నారట అందువల్ల వారి గురించి అనేక విషయాలు చెబుతుండేవారు తమాషా ఏమిటంటే ఒక సంవత్సరం క్రితం సెప్టెంబర్ 2001లో నేనూ కాళోజీగారు శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయంలో మళ్ళీ కలుసుకున్నాం అప్పుడు పొట్లపల్లిగారు లేరు ఎందుకంటే అది ఆయన సంతాప సభే సభలో బి ఎన్ శాస్త్రి, బి రామరాజు సి వి కృష్ణారావు వంటి చాలా మంది ప్రముఖులున్నారు మిత్రుడు తెలంగాణా ప్రభాకర్ చలవవల్ల ఆ సభలో మేం కాళోజీగారిని కలుసుకోగలిగాం, సన్నిహితంగా మాట్లాడుకోగలిగాం సభలో నేను పొట్లపల్లిగారి గురించి చెప్పిన అనేక విషయాలలో ఆయన

ఏకీభవించారు పొట్లపల్లి గారికి నాటి హైదరాబాద్ కోత్వాల్ రాజబహాద్దూర్ వెంకట్రామారెడ్డిగారికీ మధ్య జరిగిన సంభాషణ నేనొక పత్రికలో నమోదు చేశాను అదే సభలో వినిపించాను కాళోజీ గారెంతో సంతోషించి చిన్న పిల్లాడిలా దాని జిరాక్స్ కాపీ తీసివ్వమన్నారు వెంటనే తీయించి ఇచ్చాను మిత్రుడు ప్రభాకర్ భక్తితో గౌరవంతో కాళోజీగారి సంరక్షణకు ఎంతో సమయం కేటాయించడం నాకు తెలుసు అతని అండదండలుండడంవల్లనే కాళోజీగారు అనేక మందిని కలిసేవారు అనేక కార్యక్రమాలకు హాజరయ్యే వారు కాళోజీ కవిగా ప్రసిద్ధులయినా, కథలు కూడా రాశారు

ఈ సందర్భంలో కాళోజీగారి ఓ కథ గురించి నాలుగు మాటలు చెప్పాలనుకుంటున్నాను కాళోజీ మానవహక్కుల పరిరక్షకుడిగా మారడానికి బీజాలు 1940 దశకంలోనే పడ్డాయి ఆ విషయం ఆణాగ్రంథమాల వారు ఏప్రిల్ 1943లో ప్రచురించిన కాళోజీ కథల్లో ముఖ్యంగా తెలియక ప్రేమ తెలిసి ద్వేషము' అనే కథలో చాలా స్పష్టంగా గమనించొచ్చు శైలిపరంగా కూడా మంచి పరిణతి సాధించిన కథ అది కథలోని ఇతివృత్తం ఈ విధంగా ఉంది యమభటులు తమ పాశాల్లోని జీవాల్ని స్వేచ్ఛగా వైతరిణీ తీరాన వదిలి గంధర్వుల గానం వినడానికి వెళతారు అనూహ్యంగా లభించిన స్వేచ్ఛవల్ల జీవాలు రెండు స్నేహపూర్వకంగా కలుసుకుంటాయి ఆ రెండూ తెలుగువారి ఆత్మలే దేవాలయ ప్రవేశం గురించి అస్పృశ్యులకు సవర్ణులకు జరిగిన కొట్లాటలో వాళ్ళిద్దరూ ప్రాణాలు కోల్పోయిన వారే! మనకు ముందు ఈ విషయాలేవీ తెలియవు రచయిత ఎంతో చమత్కారంగా సంభాషణల్ని నడిపిస్తారు ఆ ఇరువురిలో ఒకడు సవర్ణుడు, మరొకడు అస్పృశ్యుడు వాళ్ళు తెలియక ముందు ప్రేమలు ఒలకబోసుకుని, తెలుసుకున్నాక ద్వేషించుకుంటారు జుట్లు పట్టుకుని నీచంగా కొట్లాడుకుంటారు ఈ విషయాన్నే రచయిత ఎంతో వ్యంగ్యంగా చిత్రించారు చివరకు యమధర్మరాజు వారిరువురికి తగిన శిక్షలు విధించడంతో కథ ముగుస్తుంది రచయితగా కాళోజీ వ్యంగ్య వైభవం చదివి ఆనందించాల్సిందే!

ఈ దశాబ్దంలో దళిత స్పృహ ఉధృతంగా ఉరకలు వేస్తోంది దీనికి కాళోజీ అరవై ఏళ్ళ క్రితమే పాదులు తవ్వారని చెప్పడానికి ఈ చిన్న కథని ఉదాహరణగా చూపిస్తున్నాను పాపం, పుణ్యం నరకం స్వర్గం వంటి హిందూ మత సంప్రదాయాల ప్రకారమే కథ నడిపిస్తూ జనంలో ఇంతగా చైతన్యం లేని ఆ రోజుల్లో ధైర్యంగా అస్పృశ్యుల పక్షాన నిలబడడం కాళోజీ గొప్పతనం అయన ప్రముఖంగా కవి కార్యకర్త ప్రభుత్వంవారిచ్చిన పద్మవిభూషణ్ స్వీకరించినా ఆయన ప్రజల మనిషిగానే మిగిలారు ప్రభుత్వాన్ని ఎదిరినవ్వా తిరుగుబాటుదారునిగానే వ్యవహరించారు సైద్ధాంతిక విభేదాలు తలెత్తినప్పుడు ఆయన నక్సలైట్లను కూడా లెక్క చేయలేదు అతినమ్రత, మననమ్కుడు కవిగా అరివీరభయంకరుడు తీవ్రమైన వ్యంగ్యాస్త్రాలు విసిరేవారు మనిషిగా మెత్తబడి కన్నీళ్ళు పెట్టేవారు సమకాలీన సాహితీరంగంలో చాలా మంది కవులుగా పేరు తెచ్చుకున్నారు కాని వారిలో చాలా మంది మనుషులుగా మిగలరు కాళోజీగారి విషయం వేరు ఏడు దశాబ్దాల సుదీర్ఘ సాహితీ యాత్రలో ఆయన ఎల్లప్పుడూ మనిషిగానే స్పందించారు ఇది చాలా విశిష్టమైన లక్షణం! జీవితంలోనూ కవిత్వంలోనూ ఎవరూ సాధించని సరళత్వాన్ని ఆయన సాధించారు

ఆయనకివే జోహార్లు

# కాళోజీలు మళ్ళీ మళ్ళీ ఒక పట్టాన పుట్టరు

- సి ధర్మారావు

అప్తులైన వాళ్లని మొదటిసారిగా ఎప్పుడు ఎట్లా కలిశామో గుర్తు తెచ్చుకోవడం మనకు ఎంతకష్టమో, అంత ఇష్టం కూడా దీన్నే 'రావిశాస్త్రి తనదైన బాణీలో మనస్సుకు హత్తుకునేట్టు చెప్పారు మా అమ్మనీ నాన్ననీ మొదటిసారిగా ఎప్పుడు చూశానో గుర్తు చెప్పలేను గదా' ' అని

కాని కాళోజీని ఎక్కడో ఏ మీటింగులోనో మొదటిసారి చూడటం కాదు సుమారు పాతికేళ్ల కింద హన్మకొండలో నేరుగా వారింటికి వెళ్లాం నేనూ, కాశీ మరో మిత్రుడూ ఈ కాశీ అన్నవాడొక విలక్షణ సృష్టి ఎక్కడ ఇంత సిసలైన పాండిత్యం, ఒకింత అచ్చమైన కవిత్వం కంటబడ్డా, అక్కడ వాలేవాడు దారిలో చెప్పాడు మనం వెళ్తున్నది పెద్ద కాళోజీ కోసం, ఆయన ఉర్దూ పారసీకాల్లో ఉద్దండుడై కవీ పండితుడూ అని సరే నేను చిన్న కాళోజీ కూడా దొరికితే మా బాగే అనుకుంటూ వెళ్లాం తలుపుతీసింది పెద్దాయనే ఆయన మమ్మల్ని ఎగాదిగా చూశారు పరిచయమైన మొహాలు కావు మావాడు ఎటో పొయాడు, ఎప్పటి కొస్తాడో అని సన్నగా సణిగారు లోపలికి రండి, కూచోండి అన్నారు మేం వచ్చింది మీ కోసమే అన్నాడు కాశీ ఆయన సంబరపడ్డట్టే కనుపించారు సరే ఆపైన ఏ మూడు గంటలో ప్రణయ పారావారంలో సూఫీ సాగర జలాల్లో మునకలు వేశాం

చివర్లో వచ్చాడు చిన్న కాళోజీ విని ఉన్నానుగదా నాకు తగని ఉత్సుకత వాళ్లు నా కోసం వచ్చారోయ్ అని మేలమాడారు పెద్దాయన నబబే, సీనియారిటీ పాటించాలి గదా అన్నాడు చిన్నాయన అందరం నవ్వుకున్నాం మరో అరగంట కూర్చుని సెలవు తీసుకున్నాం

ఇక కాళోజీని దగ్గరగా అనేకసార్లు కలిసింది చిక్కడపల్లిలో ఏ ఆర్ కృష్ణ ఇంట్లో సాయంత్రమయ్యే సరికి అక్కడ కవి, గాయక్, నట విదూషకులెవరెవరో వచ్చి చేరేవారు ఆదర్బారుకి కృష్ణరాయబాక్ అని ఒక సార్థక నామముండేది రాత్రి పది గంటల వరకు వచ్చేపోయేవారూ జోకులూ చర్చలూ - పెద్ద కోలాహలం కాళోజీ ఊళ్లో కొస్తే కృష్ణని చూడకుండా పోడు ఆయన దర్బారుకు వస్తున్న సంగతి కృష్ణ నలుగురికే టాంటాం వేసేవాడు ఇక దర్బారులో పచ్చటి బక్కపల్చటి శరీరంలో కాళోజీమెరిసేకళ్లూ వెలిగే నవ్వులూ మాకు పెద్ద ఆకర్షణ

అక్కడే నేను మొదటిసారి 'ధర్మన్నా అన్న పిలుపువిన్నది కాళోజీ నుండి అక్కడ చేరే సామూ సిద్ధప్ప చేరా, కృష్ణశాస్త్రి ఇత్యాదులు అప్పటి నుండి అలాగే పిలుస్తారునన్ను

కృష్ణ కాళోజీలు ఎంతగా అతుక్కుపోతారో ఆప్యాయతంటే ఏమిటో మేము ప్రత్యక్ష సాక్ష్యం నిజానికి అట్లా కాకపోతేనే ఆశ్చర్యం ఇద్దరూ ఒక గూటి పక్షులు ఎప్పుడూ వీళ్ల చుట్టూ జనం, వాళ్ల కష్ట సుఖాలు వీళ్ల సొంతం కాళోజీఫక్కీలోనే, కృష్ణ కూడా తన వాళ్లని ఒరే ఏరా అని పిలిచేవాడు, పలకరించేవాడు ఒకసారి విశాఖ నుండి వచ్చిన చెట్టంత శె వి గోపాలస్వామిని పట్టుకుని 'ఏరా గోపాల్, కాదటావా?' అన్నాడు మేం అవాక్కయ్యాం వెంటనే అందరం తెప్పరిల్లి కడుపారా నవ్వుకున్నాం

ఇప్పుడు బాగా ప్రచారంలో కొచ్చిన కాళోజీ జోకొకటి అక్కడే నేను ఆయన ముఖతః విన్నది అన్ని రంగాల్లోలాగే, ప్రతికారచయితల్లో కూడా 'కాకా' గిరి ఎక్కువైంది సర్కారు విదిల్చే బిస్కట్ల కోసం బాగా ఎగబడుతున్నారు దీన్ని కాళోజీ చెప్పిన తీరు జన్మలో మరువలేం "వెనక ఖాసా, సురవరం వాళ్ల రోజుల్లో

జర్నలిస్టులు ప్రజల తరవున వాచ్‌డాగ్స్ గా వుండేవారు ఇప్పటి వాళ్లు సర్కారోళ్లకి పెట్‌డాగ్స్ అయ్యారు!! కాస్త గొంతుతగ్గించి చిలిపిగా 'కొందరైతే లాప్‌డాగ్స్ కూడా!!

అన్నట్టు మొన్న కృష్ణ 76వ జయంతినాడే నవంబరు 13న కాళోజీ కాలం చేసింది ఆ ఆత్మీయుల సభలో వీరిద్దరి అనుబంధం గురించి పోలికల గురించి నేను గుర్తు చెయ్యగా డాక్టర్ ఎ నా రె తమ ప్రసంగంలో వివరించారు

అప్పట్లో ఒకసారి సుల్తాన్ బజారు శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషానిలయంలో ఏదో సమావేశం జరిగింది కాళోజీ వచ్చి మాట్లాడాడు తన పని ముగించుకుని మధ్యలో వెళ్లిపోయేరకం కాదాయన ఆయనతోపాటే చివరిదాకా నేనూ వున్నాను ఎందుకో ఆ రోజు సభ ఆలస్యమై, రాత్రి పదిదాకా సాగింది మామూలుగా ఎప్పుడూ ఆయన వెంట ఒకరో ఇద్దరో అంతరంగికులు వుంటూనే వుంటారు మలక్‌పేట ప్రభుత్వ కాలనీలో మా పొరుగులో వుండే రాఘవేంద్రరావు అయన కేదో బంధువు ఆరాధ్రయితే కాళోజీతో అయనాలేడు, మరెవ్వరూ లేరు సభ అయిపోయి బయటికొచ్చి అందరి వీడ్కోలు అయ్యాక కాళోజీ, మీ రిప్పుడెక్కడికి వెళ్లాలి అనడిగాను, అక్కడికి పంపటంలో సాయంచేద్దామని

'నేనెక్కడకి పోతా, నీతోనే వుంటా' అన్నాడు

సంభ్రమంతో నాకు కళ్లలో నీళ్లు తిరిగాయి ఆలవోకగా ఆయన అన్నమాటకి, కనవరిచిన ఆప్యాయతకి కానిలోపలదుడుకు అప్పటికే నేను కళత్రహీనుడిని మా పెద్ద పిల్ల పెళ్లయి వెళ్లిపోయింది చిన్నమ్మాయి ఏదో ఇంత ఉడకేసి నా వరకు బల్లమీద పెట్టి ఆపాటికి నిద్రపోయిఉంటుంది ఆ పిల్ల అన్నలూ పడుకుని వుంటారు దారిలో పండూ ఫలమూ దొరికే సమయం కాదది సరే రిక్షాలో ఇద్దరం ఇంటికి పోయాం భయపడ్డట్టే ఒకిరికి సరిపడ అన్నమూ, కూరా పచ్చళ్లూ, ఇంత మజ్జిగా వున్నాయి పిల్లల్ని లేవి వంటచేయించడానికి ఆయన ససేమిరా ఒప్పుకోలేదు నాకు వంట ఓనమాలు రావు ఇద్దరం అర్ధాన్నంతిని లేచాం ఒకమడత మంచం మీద ఆయనకు పక్క వేసికరుగ ఒక బైరాగి వొన్నరు హాయిగా నిద్రపోయాడు

పంపేముందు సైదాబాదులో ఒక మిత్రుడున్నాడు అక్కడికి పొద్దున్నే పోతా అన్నాడు మా పిల్లగాడి బండి వుంది నిన్నక్కడ దింపుతాడు చెప్పకుండా నన్ను లేపకుండా పోవద్దు అని మళ్లీ మళ్లీ చెప్పా ఒక యోగిలా ఊకొట్టాడు పొద్దున్న చెప్పా పెట్టకుండా వెళ్లిపోయాడు జీవితానికి నాకా మాత్రం అదృష్టం చాలన్నట్టుగా!

ఎందుకు మనకీ కాళోజీస్మరణ? ఇంత మందిమి ఇట్లా ఎడతెగకుండా ఆయన ముచ్చట్లు ఆడుకుంటున్నాం ఇంకా ఇంకా ఆడుకోబోతున్నాం? ఎందుకంటే

పుటకతనది చావు తనది

బతుకంతా మనది!

గనుక అయన్ని ప్రజాకవి కాళోజీ అనటం బాగా వాడుకైంది తాను కవి కావాలని బయలుదేరాడా? చలామణి కోసం ఏడాదికో పుస్తకంవేశాడా? అందుకే మన శిష్యులూ సాహిత్యావశిష్టులెవ్వరూ ఆయన్ని కవి అనరు గురజాడని ఒప్పుకున్నారా, వేమన్నని మన్నించారా? వీళ్ల అలంకార శాస్త్రానికి అందని ఎత్తు వాళ్లది కాళోజీది బొత్తిగా వేమన్న బాణీ జనహితం కోరి జలగా ఉబికొచ్చిన ఆశుకవిత వారిది జనం నాలుకల మీద నర్తించే కవిత అందుకే వారు ప్రవక్త కవులు కవి ప్రవక్తలు - ఒకరు మధ్యయుగానికి, మరొకరు అధునిక యుగానికి

అసలాయన్ని ఏ స్థాయి కవిగా వర్ణించ పూనుకున్నా ఒక పక్క మననుపీకుతూనే వుంటుంది కాళోజీ కుంచిస్తున్నామని ఆయన కలగనే, కోరే లోకంలో 'అధికారం' అన్న దినుసు వుండదు ఎవరి మీద, ఎందుకు అధికారం? ఎవడు, ఎందుకు ఎక్కువ? ఎవడు, ఎందుకు తక్కువ? అధికార కారణంగా ఎక్కడ ఇంత అన్యాయం కంటపడ్డా క్షణం ఆగకుండా, క్షణం ఆపకుండా క్షణం ధిక్కారం, తిరుగుబాటు ఈ ఆగ్రహామూలాలు అంతరంగ

కరుణలో, మానవాళి ప్రేమలో వున్నాయి అంతిమంగా చేరదలచిన గమ్యం శాంతి సుభిక్షాలు ఆ దారిలో చలివేంద్రాలు ఆయన హాస్యం వ్యంగ్యం, చతురతలు, ఇట్లా ముప్పేటగా అల్లుకుపోయిన సంపూర్ణమూర్తిమత్వం కాళోజీ

విశ్వ మానవ భావానికి ప్రాంతీయాభిమానానికి ఆవగింజంత వైరుధ్యంలేదని నిరూపించింది కాళోజీ జీవనం తండ్రి మరాఠా, తల్లి కన్నడిగ ఏమిటి ఆయన శ్వాస తెలంగాణా తెలుగు భాష ఏమిటి? ఎవరైనా అయినవాడిని, పొరుగువాడిని ప్రేమించకుండా లోకాన్ని నెత్తిన పెట్టుకోగలడా? అవి వట్టి గప్పాలు మహాత్ముడు దేశం మొత్తాన్నే తన కావ్య క్షేత్రం చేసుకుంటే, మన యోగి తెలంగాణాన్ని దట్టంగా కమ్ముకున్నాడు తెలంగాణావు సంస్కారానికి జెండా అయినిలిచాడు అతాదాత్మ్యం ఎంత గాఢమంటే ఆయన జీవనమే బతకమ్మ పండగ బతకమ్మ పండగే కాళోజి!

మనిషి విమోచనం ఆయన ఏకైక ఎజెండా, దైన్యం నుండి, దౌర్జన్యం నుండి భయం నుండి బాధ నుండి మనిషి విమోచనం ఆనాడు నైజాంను ఎదురించినా, తెల్లవాడిని ధిక్కరించినా, ఈనాడు నల్లదొరలపై హూంకరించినా తీవ్రవాదులను మందలించినా, జన విమోచనం ఆయన ధ్యేయం తెలంగాణా రాష్ట్ర సాధనే కాళోజీ ఆత్మకు శాంతి అనటం అత్యుక్తో అర్ధ సత్యమో అవుతుంది రేపు తెలంగాణా దొరలొచ్చి అదే ప్రజా పీడనసాగిస్తే బతికున్న కాళోజీ అయితే మౌనం పాటిస్తాడా గళం మళ్లీ సారించడా? వట్టిమాట

కాళోజీలు మళ్లీ మళ్లీ ఒక పట్టాన పుట్టరు పరిణామ ప్రకృతి చాలా చాలా సమయం తీసుకుంటుంది అయితే తెలంగాణాకు ఆయన కారణజన్ముడైతే, ఆంధ్ర దేశానికి, లోకానికే సార్థక జన్ముడు

# కాళన్నకు నివాళి

డా॥ సి నారాయణరెడ్డి

1950లో హైదరాబాద్ నగరంలో నేను ఇంటర్మీడియట్ విద్యార్థిగా ఉన్నప్పుడు ఇద్దరు తెలంగాణా తెలుగన్నలను సంపాదించుకున్నాను ఒకరు కాళోజీ, రెండవవారు దాశరథి అన్నలులేని నేను అప్పటి నుంచి కాళోజీని 'కాళన్నా' అని సంబోధించాను దాశరథిని అగ్రజుడుగా సంభావించాను

సామాన్యంగా కన్నీరనగానే కాళోజీ గుర్తొస్తాడు అయితే కాళన్న కన్నీరు సంకల్పాన్ని నీరు గారించేదికాదు దుర్వ్యవస్థకు వ్యతిరేకంగా ఆగ్రహాన్ని ప్రజ్వలింపజేసేది "నా గొడవ"లో ఉన్నది కాళన్న సొంతగొడవ కాదు "అవనిలో జరిగేటి అవకతవకలపైన' అతడెత్తిన నిజాయితీ పడగ

కాళన్న మౌలికంగా గాంధీయవాది కానీ నమ్ముకున్న ప్రజాస్వామ్యం తన గుండెలో కుమ్మినప్పుడు విప్లవవాదుల వీరకంఠాలతో శ్రుతికలిపాడు ఉద్యమ శక్తులకు ఒక ఉత్తేజమూర్తిగా రూపొందాడు

వాలుతున్న వయసును విసిరిపారేసి నిత్యం నిటారుగా పొడుచుకొచ్చిన బాలభానుడు ఈ కాళుడు

కాలగమనం అనివార్యం ఏం చేస్తాం? కాళన్న ఇకలేడు మన గేయపేమన్న మరిరాడు కానీ కాళన్న కన్నీటి సెగలున్నాయి కవితల రూపంలో అవి చల్లారే చైతన్యకోశాలను నిరంతరం ఉద్దీపింపజేస్తాయి

కాళన్నా! అందుకో ఈ తమ్ముడు అందిస్తున్న కన్నీటి నివాళి

# కాల్మొక్కని కాళోజీ

నగ్నముని'

నవంబరు 13 మధ్యాహ్నం ఓ కార్యక్రమంలో పాల్గొనడానికి చెన్నయ్‌లో వున్నాను రిమోట్‌తో స్పృశించగానే టి వి తెరమీద హఠాత్తుగా విస్ఫోటనంలా ప్రసారమైన వార్త మన కాళోజీ భౌతికంగా మనను వీడి వెళిపోయారనే వార్త అయన వయసెంతో తెలుసు ఆయన అస్వస్థత గురించి తెలుసు ఆసుపత్రిలో వున్నారని తెలుసు త్వరలోనే యింటికి వస్తారని అనుకుంటుండగా, ఆయన మరోలా అనుకుని యీ జీవితం తలుపులు బార్లా తీసుకుని వెళిపోయారనేది మాత్రం నమ్మలేని నిజం నమ్మడానికి యిష్టం లేని నిజం చాలాసేపు చుట్టే ఆవరించిన శూన్యం లోపల శూన్యం, ఘనీభవించిన మహాశూన్యం అనుభవించాను బహుశా యిది నా ఒక్కడి అనుభవమే కాదు కాళోజీని తెలిసిన తెలుగుజాతి అనుభవం

సూర్యుడు ఒక్కడే, ఒక్కొక్కరికీ ఒక్కొక్కడుగా భాసించినట్లు కాళోజీ కూడా ఒక్కడే ఒక్కొక్కరికి ఒక్కొక్కనిగా, కాలంతో సమానంగా నడుస్తూ, కార్యశీలిగా గమిస్తూ అనేక ఉద్యమాలలో మమేకమై, తన మాటతో, చేతతో కవితతో కరుకుగా కనికరంగా అందరి హృదయఫాల్లో గాఢంగా చోటుచేసుకున్నవాడు మానవత్వాన్ని నిండా నింపుకున్నవాడు మానవ విలువల్ని సర్వత్రా వెదజల్లినవాడు

అయన చేసిన ప్రయాణం సుదీర్ఘమైంది ఎక్కడా ఆగిపోలేదు అలసిపోలేదు మాసిపోలేదు మడం తిప్పలేదు నాటి నైజాం నిరంకుశ రాచరికం దురాగతాల నుండి, నేటి హై హైటెక్ స్లో పాయిజన్ ఆధిపత్య అన్యాయాల వరకు దేనికీ కాల్మొక్కనివాడు ప్రజల్ని బానిసలుగా మార్చి కాలికింద తొక్కిపట్టిన రాజరిక, భూస్వామ్య వ్యవస్థల్నీ వాటి విలువలనే సరికొత్త రూపంలో కొనసాగిస్తూ పౌరహక్కుల్ని కాలరాచే సర్కార్ సంస్కృతికి ప్రభుత్వ సంస్కృతికి కాల్మొక్కనివాడు అంతేకాదు యీ అమానవీయ విలువలకి కాల్మొక్కవద్దని, ఎదురించమని ప్రబోధించినవాడు వివక్షను ఎండగట్టినవాడు ప్రజాస్వామ్యానికీ ప్రశాంతికీ, స్వేచ్ఛకీ సమత్వానికీ సహృదయతకీ సామాజిక న్యాయానికీ తప్ప దేనికీ కాల్మొక్కవద్దని కోరినవాడు శాసించినవాడు శ్వాసించినవాడు కాళోజీ సామాన్యుల కోసం అసామాన్యంగా నిలబడినవాడు కాళోజీ అందుకే అతనంటే అంత గౌవం ప్రేమ అభిమానం

అతని వూహాల్లో వ్యూహాలు లేవు వ్యామోహాలు లేవు అతని మాటల మీద ముసుగులు లేవు ఎలుకుల మధ్య పరదాలు లేవు నడకలో నడతలో తారట్లాడే నీడల్లేవు క్రీనిడల్లేవు చేతల్లో రాతల్లో పదవులకై, పురస్కారాలకై మెట్లెక్కడానికై నేడు పదుగురు చేసే చిత్ర విచిత్ర విన్యాసాలు లేవు ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టుకునే లక్షణాలు లేవు అతని నిజాయితీకి వెలలేదు అట్టడుగు జనం కోసం వారికి చెందవలసిన న్యాయం కోసం తుదికంటా నిలకడగా నిలిచనవాడు నూటిగా మాట్లాడినవాడు అతనిది అక్రమాలపై గురిపెట్టిన ధిక్కారస్వరం అధిక్షేపణా రచనతో యీ విలోమ విలువల లోకంలో అనులోమక్రమం కోసం అవిశ్రాంతంగా సమరం సాగించినవాడు మన కాళోజీ

ఒక్కసారిగా కళ్లముందు గతం నిలబడింది

కాళోజీతో నా సాన్నిహిత్యం నాలుగు దశాబ్దాలపై మాటే చిన్నప్పట్నుంచీ నాకు పత్రికలు చదివే అలవాటుంది అట్లా కాళోజీ పేరుతో పరిచయముంది

1956 నవంబరు ఒకటిన, భాషాప్రాతిపదికపై విశాలాంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది అదేనెల 2వ తేదీన నేను బందరు నుండి హైదరాబాద్‌కు వొచ్చాను, తెలుగు అన్నదమ్ముల ఏకీకరణ సంఘటనలో ఉద్భవించే కాంతులు గమనించడానికి, ఢిల్లీకి వచ్చి వుద్యోగంలో చేరమని' పిలుపు అప్పటికే నాకు వచ్చి వుంది తెలుగువారి కలయిక పులకరింతతో చూసి పోదామని హైదరాబాద్‌కు వచ్చాను నా ప్రయత్నం లేకుండానే, చిత్రంగా నవంబరు నెలలోనే, 26వ తేదీన శాసనసభలో తాత్కాలిక వుద్యోగిగా నియమించబడ్డాను తర్వాత పబ్లిక్ సర్వీస్ కమిషన్ వారు ప్రకటన ద్వారా నిర్వహించిన ప్రత్యేక పరీక్షలో ఎంపిక చేసి నన్ను శాశ్వత ప్రాతిపదికపై శాసనసభలో వెర్బాటిమ్ రిపోర్టరుగా నియమించడం జరిగింది దీనికీ, పత్రికా విలేఖరి ఉద్యోగానికీ సంబంధం లేదు ఆ విధంగా తెలుగు ప్రేమతో, తెలుగు రాజధానిలో స్థిరపడ్డాను

1958లో శాసన మండలి (లెజిస్లేటివ్ కౌన్సిల్) ఏర్పడింది అటు శాసనసభకు స్పీకర్‌గా అయ్యదేవర కాళేశ్వరరావు గారు వున్నారు ఇటు శాసనమండలికి ఛైర్మన్‌గా మాడపాటి హనుమంతరావు గారు వున్నారు ఇద్దరూ స్వాతంత్ర్య సమరయోధులే అదే సంవత్సరం ఉపాధ్యాయుల నియోజకవర్గం నుండి కాళోజీ ఎన్నికై ఎం ఎల్ సి అయినారు? 1960 వరకూ కొనసాగారు ఆనాటి, రాష్ట్రారంభ ప్రారంభ సంవత్సరాలు మేరుపులతో నిండిన సభల సన్నివేశాల సమావేశాలు చూసి తీరవలె

> నాటి నైజాం నిరంకుశ రాచరికం దురాగతాల నుండి, నేటి హై హైటెక్ గ్లో పాయజన్ ఆధిపత్య అన్యాయాల వరకు దేనికీ కాళ్ళొక్కనివాడు ప్రజల్ని బానిసలుగా మార్చి కాలికింద తొక్కిపట్టిన రాచరిక, భూస్వామ్య వ్యవస్థల్ని, వాటి విలువలనే సరికొత్త రూపంలో కొనసాగిస్తూ పౌరహక్కుల్ని కాలరాచే 'సర్కార్ సంస్కృతి'కి - ప్రభుత్వ సంస్కృతికి కాళ్ళొక్కనివాడు అంతేకాదు, ఆ అమానవీయ విలువలకి కాళ్ళొక్కవద్దని, ఎదిరించమని ప్రబోధించినవాడు, విపక్షను ఎండగట్టినవాడు ప్రజాస్వామ్యానికి, ప్రశాంతికి, స్వేచ్ఛకి, సమత్వానికి, సహృదయతకి, సామాజిక న్యాయానికి తప్ప దేనికీ కాళ్ళొక్కవద్దని కోరినవాడు, శాసించినవాడు, శ్వాసించినవాడు కాళోజీ, సామాన్యుల కోసం అసామాన్యంగా నిలబడినవాడు కాళోజీ. అందుకే అతనంటే అంత గౌరవం, ప్రేమ, అభిమానం.

ఆ అదృష్టం నాకు కలిగింది బయట నుండి చూడడం కాదు, అంతర్భాగంగా వుండి వీక్షించే అవకాశం కలగడం మామూలు విషయం కాదు

శాసనసభ శాసనమండలి సమావేశాలు జరుగుతున్నప్పుడు వెర్బాటిమ్ రిపోర్టర్లు హాజరై, సభల కార్యక్రమంలో భాగంగా సభ్యుల ఉపన్యాసాలు యథాతథంగా కవర్ చేస్తారు అంతకుముందు పత్రికల ద్వారా కాళోజి గురించి విని వున్నాను శాసనమండలి ప్రాంగణంలో సన్నిహితం కావడం జరిగింది ఆయన వుపన్యాసాలు వినడం, యథాతథంగా రికార్డు చెయ్యడం జరిగింది అప్పుడు నా వయసు 19 సంవత్సరాలు వయసులో మా మధ్య చాలా తేడా వుంది మేం కలిసినప్పుడు అది ఎన్నడూ అడ్డురాలేదు దానికి ఆయనే కారణం ఆయనలోని సహృదయ సాదర దృక్పథమే యిందుకు కారణం

ఆయన స్థల, కాల, ప్రాంతీయ విభేదాల్లేకుండా నిత్యం వర్తమానంలో జీవించే వ్యక్తి ఆయన కళ్లవెనక కన్నీటి జలపాతాలున్నాయి దురాగతాలపై కన్నీటి కాండవజ్వాలలున్నయి అన్నింటినీ తనలోనే యిముడ్చుకుని 'నాగొడవ' గా చెప్పుకున్నారు ఎన్నిసార్లు, ఎంతగా చెప్పినా అది 'అతని గొడవ' కాదని 'లోకం గొడవ' ని అందరికీ తెలుసు అదే ఆయన సృష్టించిన సరికొత్త కవితా సమయం

కొన్నేళ్ల తర్వాత, ఉద్యోగక్రమంలో నేను జాయింట్ సెక్రటరీ అయ్యాను అప్పటికి కొంతకాలం క్రితం ప్రభుత్వం వారు మాజీ శాసనసభ్యులకు పెన్షన్ పద్ధతి ప్రవేశపెట్టారు నా విధుల్లో భాగంగా, మాజీ సభ్యుడిగా కాళోజీకి నా సంతకంతో పెన్షన్ చెక్కులు పంపేవాడిని

ఆయన వున్నది రెండేళ్లే కావడం వల్ల పంపేది పెద్దమొత్తమేమి కాదు అయినా ఆ మాత్రమైనా నా సంతకంతో వెంట వెంటనే పంపుతున్నందుకు సంతోషించేవాణ్ణి కాళోజీ నేనూ ఎక్కడ కలుసుకున్నా మా కుశలప్రశ్నల్లో భాగంగా అడిగేవాన్ని పెన్షన్ చెక్ సక్రమంగా అందుతున్నదా? అని అందుతున్నది నగ్నమునీ అనే వాడాయన నవ్వుతూ

1957 నవంబరు నెలలో నా మొదటి కవిత గోరాశాస్త్రి గారి సంపాదకత్వాన వెలువడిన తెలుగు స్వతంత్ర వారపత్రికలో అచ్చయింది తర్వాత గోలకొండ పత్రిక భారతి కృష్ణాపత్రిక, అంధ్రప్రభ మొదలైన పత్రికలలో అచ్చయ్యాయి దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ప్రొడ్యూసర్‌గా వుండగా అకాశవాణి లో ప్రసారమయ్యాయి ఏ కవికయినా ఇవి సంతోషం కలిగించేవే అయితే, అంతకంటే ముఖ్యమైన విషయం మరొకటి వుంది అ రోజుల్లో హైదరాబాద్‌లో కవి సమ్మేళనాలు ముమ్మరంగా జరిగేవి ప్రతిష్ఠాత్మకంగా జరిగేవి వచనకవిత్వ ప్రాచుర్యం కోసం, శ్రోతకు నా ప్రయోగ పరిచయం కోసం రెండు వుద్దేశాలూ మనసులో పెట్టుకుని నేను యీ కవి సమ్మేళనాల్లో విరివిగా పాల్గొనేవాడిని

ఇందులోనూ రెండు విధాలైన కవి సమ్మేళనాలు జరిగేవి మొదటిది పద్యం గేయం, యివిగాక, అప్పుడప్పుడే పూతకిస్తున్న అధునిక వచనకవిత్వం ఈ ప్రక్రియలన్నింటిలోనూ రాసే కవులు పాల్గొనేవారు రెండవది, అరుదైనది ద్విభాషా కవి సమ్మేళనాలు ఇవి తెలుగు, ఉర్దు రెండు భాషలకు చెందిన కవులు పాల్గొనే సమ్మేళనాలు అంటే, ఏ భాషకు చెందిన కవులు, ఆ భాషలో తమ కవితలు చదివి వెళ్లి పోవడం కాదు ఇందులోని విశిష్టత ఏమిటంటే యీ రెండు భాషలూ, వాటి సంప్రదాయాలు, సాహితీ చరిత్రలూ క్షుణ్ణంగా తెలిసినవారు దీనికి అధ్యక్షులుగా వుంటారు తెలుగుకవి తన కవిత చదవగానే లేక వినిపించగానే, అధ్యక్షులవారు అప్పటికప్పుడు దీనిని ఉర్దులోకి, మూలానికి అతి దగ్గరగా వుండేట్లు, అనువదిస్తారు అలాగే ఉర్దూకవి తన కవిత వినిపించగానే లేక గానం చెయ్యగానే దీని వెనువెంటనే తెలుగులోకి అనువదిస్తారు అధ్యక్షులవారు ఈ విధంగా తక్షణం అనువాదం చెయ్యడం అంత సులభమైన పనికాదు ఈ పద్ధతి వల్ల కవి సమ్మేళనానికి హాజరైన వారంతా ప్రతి కవితనూ ఆస్వాదిస్తారు అంతకంటే ముఖ్యంగా రెండు భాషల కవులూ నేరుగా పరిచయమవుతారు ఏ భాషలో కవితాప్రయాణం ఏ విధంగా కొనసాగుతున్నదో అర్థం చేసుకోవడానికి అవకాశమేర్పడుతుంది దీనివల్ల ఆయా భాషల మధ్య వుండే అడ్డుగోడ ఆ కాసేపయినా అదృశ్యమవుతుంది అధ్యక్షులవారు భాషల మధ్య వంతెన వేస్తారు ప్రజలను సన్నిహితం చేసే సాంస్కృతిక రాయబారి అవుతారు ఇది అతిక్లిష్టమైనపని ఇటువంటి ఒక ద్విభాషా కవిసమ్మేళనంలో నేను పాల్గొన్నాను దీనికి కాళోజీ అధ్యక్షుడు ఆయన అత్యంత జయప్రదంగా నిర్వహించాడు అదొక ఉత్సాహభరితమైన కవుల పండగ, అద్యంతం అలింగనల హేల కారణం కాళోజీ నిర్వహణ

ఎమర్జెన్సీకి ముందురోజుల్లో నేనింకా ప్రభుత్వ సర్వీసు నుండి డిస్మిస్ కాకముందు రోజుల్లో మేం హైదరాబాదులోని మలక్‌పేట కాలనీలోని ప్రభుత్వ క్వార్టరు ఎం ఎస్ 88 లో వుండేవాళ్లం అది మేడమీది భాగం మా పక్క క్వార్టరు పై భాగంలో - ఎం ఎస్ 90లో రాఘవేంద్రరావు కుటుంబం వుండేది మా కుటుంబానికి సన్నిహితులు కాళోజీకి దగ్గరి బంధువులు మా క్వార్టర్ల కిటికీలు ఎదురుబొదురుగా వుండేవి అంతకు క్రితం రోజు రాత్రి కాలోజీ వాళ్లింట్లో దిగింఉంటే, తెల్లవారకముందే, కోడికూకముందే నగ్నమునీ' అని గట్టిగా ఎలుపు వినిపించేది 'ఎవరబ్బా, యింత పొద్దున్నే' అని లేచి చూస్తే ఎదురుగా కిటికీ దగ్గర కాళోజ కాసేపు కిటికీల దగ్గరే వుండి సాహిత్యం రాజకీయాలు అనేకం ముచ్చట్లు చెప్పుకునే వాళ్లం ముఖాలు కడుక్కున్నాక అక్కడనో, యిక్కడనో టీ చప్పరిస్తూ సంభాషణ కొనసాగించేటోళ్లం అయనక్కడికొచ్చినప్పుడల్లా ఆ పిలుపు వినబడుతూనే వుండేది ఇందులో ఏముంది గుర్తుపెట్టుకోడానికి అని ఎవరికైనా అనిపించవచ్చు ఇదింత ముఖ్యంగా చెప్పుకోవాల్నా అని కూడా మరికొంత మందికి అనిపించవచ్చు ఆయన పిలుపులోని

ఆత్మీయత, స్నేహంలోని స్వచ్ఛత చవిచూసిన వారికి యివి అపురూపాలే

అటు ఆంధ్రలోగాని ఇటు తెలంగాణాలో గాని మొత్తం దేశంలోనే స్వాతంత్ర్యం కోసం పోరాడిన యోధులనేకమంది వున్నారు వారు త్యాగమూర్తులు ధన మాన ప్రాణాలను తృణప్రాయంగా చూసినవారు తమకోసం తమ కుటుంబాల కోసం, పదవుల కోసం, సంపద కోసం భద్ర జీవనం కోసం కలలో కూడా ఆలోచించనివారు అది దేశప్రజల కోసం పరితపించిన త్యాగమయ సంస్కృతితో విలసిల్లిన కాలం ఈ మహోజ్వల కాలానికి చెందినవాడే కాళోజీ

ఒకవైపు నైజాం రాచరిక నిరంకుశత్వానికి వ్యతిరేకంగాను, స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహం వందేమాతరం, ఆర్యసామాజ్, స్టేట్ కాంగ్రెస్ (తెలంగాణా) ఉద్యమాలు ఒక ఎత్తు మరొక ముఖ్యమైనది రాజాకార్ల ఊచకోతకు వ్యతిరేకంగా నడిపిన ఉద్యమం, వీటిలో పాల్గొనడం ఎంత కష్టమో యివాళ ఊహకు అందని విషయాలు అయన అంతటితో అగలేదు తదనంతర కాలాన వీటిని పెట్టుబడిగా పెట్టుకుని రాజకీయ పదవుల కోసం వెంపర్లాడలేదు పైనున్నవారంతా తనకు దగ్గరగా తెలిసిన వారయినప్పటికీ ఎవరినీ 'యిది నాకు యిప్పించమని యాచించలేదు పైగా పౌర హక్కుల కోసం రాజకీయ, సామాజిక న్యాయం కోసం, శాంతి కోసం కృషి చేస్తూ ప్రయాణం సాగించిన ఘనుడు మన కాళోజీ

స్వాతంత్ర్యానంతరం మొదటితరం పాలకుల వరకు ప్రభుత్వం యంత్రాంగంతో పట్టాల మీద సక్రమంగానే నడిచింది ఆ తర్వాతి తరం నుండే పట్టాలు తప్పింది అవినీతి యిసుకలో కూరుకుపోవడం ప్రారంభమైంది ఇది కూడా పట్టాల మీద ప్రయాణమేనని నమ్మించడానికి అనేక సంక్షేమ జేబు స్కీములు ప్రవేశపెట్టారు పెడుతున్నారు సహజంగానే అవి స్కాములుగా బయటపడుతున్నాయి తమ కోసం, తమ పిల్లల, మనవల, మునిమనవల కోసం దేశసంపదను దోచెయ్యడం కోసం అధికార పదవుల్లో కుదురుకుని ప్రభుత్వాన్ని అన్ని వ్యవస్థల్నీ తమ సొంత ఆస్తులుగా మలుచుకోడంలో ప్రావీణ్యత సంపాదించారు పెద్దలు సాధించి అప్పగించిన స్వాతంత్ర్యాన్ని పణంగా పెట్టి అందమైన లేబుల్స్ అతికించి అప్పుల కోసం పాశ్చాత్య దేశాల చుట్టూ తిరుగుతూ ఆత్మగౌరవాన్ని మంటగలిపి సామాన్యుడి నుండి మేధావుల వరకు అందర్నీ తరిమేసి, వలసలు పోయే స్థితి తీసుకురావడం ఒరిగింది పాలనలో దేనినైనా ప్రజలవైపు నుండి గాక అధికారం ఎన్నికలువైపు నుండి చూసే ఒక ఆధిపత్య 'సర్కారు సంస్కృతి' తీసుకువచ్చి

ఈ నేలలో నాటి అవినీతినీళ్ళు పోసి పెంచడం జరుగుతోంది అధికారంతో ప్రచారంతో యీ భూవిలో దేనినైనా సాధించవచ్చు, తిమ్మిని బమ్మిని చెయ్యవచ్చుననే గోబెల్స్ మంత్రం పఠిస్తూ పుట్టించినదే యీ 'సర్కారు సంస్కృతి దీనికీ ప్రజలకీ ఏమి సంబంధం లేదు దీనికీ దేశం పునరుజ్జీవనానికీ ఏమీ సంబంధం లేదు ఇదొక అక్టోపస్ ముందుగా మూలకాల్ని కొడుతుంది దేశ దేహంలోని సున్నితమైన భాగాల్ని ఆక్రమిస్తుంది తన అధీనంలో వుంచుకుంటుంది సాహిత్యం నుండి మానవత్వం వరకు అన్ని రంగాల్నీ చెనక్కుండా పట్టుకుని మొత్తం సమాజ జీవితాన్ని ఆవహించింది యీ ఆధిపత్య విషసంస్కృతి ప్రస్తుతం చాలా మంది యీ పడగనీడలో వున్నారు ఈ ప్రజా వ్యతిరేక 'సర్కారు సంస్కృతి' కి కాళోజీ లొంగలేదు అక్కడే వుంది అతని బలం ఈ నల్ల ప్రభుత్వ నల్ల సంస్కృతి అతన్ని కాటువెయ్యలేకపోయింది అక్కడే వుంది అతని నిబద్ధత నిజాయితీ పోరాటపటిమ

కొందరికి ఆయన వరంగల్లువాడు మరికొందరికి తెలంగాణా ప్రాంతీయవాది నాకు మాత్రం వాడిగల తెలుగువాడు మమతల పూసే మనసున్న మానవుడు

నిజాయితీని కాలవేపథం కాసేపు దాయగలదేమోగాని ఎన్నటికీ జయించలేదు

కాళోజీకి జేజేలు

# ఆర్ద్రతకి, ఆవేశానికి మారుపేరు కాళోజీ

- పి. నాగభూషణం

కాళోజీ పేరుతో నాకు పరిచయం 1958లో అనుకుంటాను అభ్యుదయలో ఆంధ్ర పరదేశ అగాధమి అనే వ్యంగ్య గేయం నన్ను ఆకట్టుకుంది అది సాహిత్య అకాడమీని ఉద్దేశించి రాసింది అకాడమీని దానిలోని ప్రముఖుల్ని ఆగేయం ఎంతో శక్తి వంతంగా హేళన చేసింది తర్వాత అప్పుడప్పుడు పత్రికల్లో వచ్చే నాగొడవ కూడా ఆయన మీద నా గౌరవాన్ని పెంచింది నాకు ఆయనలో నచ్చిన అంశం ఏవిధమైన మొహమాటం లేకుండా చెప్పదల్చుకున్న విషయాన్ని కుండ బద్దలుకొట్టినట్లు చెప్పటం ఆ విషయంలో పరిచయాలు స్నేహాలు ఏవీ కూడా పరిగణనలోకి రావు కాళోజీ ఏమీదాపరికంలేని మనిషి

ఆయనని మొదటిసారి విశాఖపట్నంలో 1970లో శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంలో చూశాననుకుంటాను ఏదో కొద్దిగా మాట్లాడినట్లు గుర్తు తర్వాత 1971లో నేను వరంగల్ ఆఫీసు పని మీద వెళ్ళాను ఆ ఆఫీసులో ఆయన ఇల్లు ఎక్కడో ఎంక్వైరీ చేశాను ఆ ఆఫీసులో పని చేసే ఒకతను నన్ను ఆయన ఇంటికి తీసుకువెళ్ళాడు తమాషా ఏమిటంటే కాళోజీకి అతనికి పరిచయంలేదు అయినా అతనికి ఆయన ఇల్లు తెలుసు బహుశా వరంగల్ హన్మకొండల్లో ఎవర్ని అడిగినా ఆయన ఇల్లు చూపించగలరేమో కాళోజీకి నన్ను నేను పరిచయం చేసుకున్నాను అప్పటికప్పుడు ఆయననన్ను తన కుటుంబ సభ్యుడిలా ట్రీట్ చేయ్యటం మొదలుపెట్టారు ఆరాత్రికి అక్కడే భోజనం నేను మాటల్లో వరవరరావు ఇల్లు ఎక్కడ అని ఆయన్ని అడిగితే నన్ను ఆక్కడికి తీసికొనివెళ్ళారు అలాగే ఇంకో మిత్రుడు రైల్వే క్వార్టర్స్‌లో ఉంటే అక్కడికి తీసుకువెళ్ళారు ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, ఆయన మనసు ఎంత నిష్కల్మషమో ఎంత స్నేహపాత్రమో చెప్పటానికి ఆయనలో అహం' ఎక్కడాకన్పించదు ప్రధానమంత్రి పి.వి.తో నైనా, ఒక మామూలు మనిషితోనైనా ఆయన ఒకే రకంగా మాట్లాడే వాడు.

తర్వాత హైద్రాబాద్ వచ్చినప్పుడు అప్పుడప్పుడు మా ఇంటికి వచ్చేవాడు ఇంట్లో అందరిలోనూ కలిసిపోయి ఇంట్లో వ్యక్తిలా మెలిగేవాడు ఇలా కొన్ని వందలకుటుంబాలతో అయనకి పరిచయాలుంటాయని నాకు తెలుసు ఎప్పుడైనా కాళోజీ మా ఇంటికి రండి అంటే తీసుకపో వస్తా అనేవాడు

నాకు అయనలో కొట్టవచ్చినట్లు కన్పించినగుణం ఆయన నిజాయితీ Hypocrisy కి ఆయన అమడదూరం మానవ విలువలు ఆయనకి ప్రాణం మానవహక్కులు దారిద్ర్యం సమాజంలోని దౌర్భాగ్య పరిస్థితులు వీటిని గురించి మాట్లాడేటప్పుడు ఆయన ఎంతో ఆవేశపరుడయ్యేవాడు అనుకోకుండా ఆయన గొంతు గద్గదపోయేది కళ్ళంట నీళ్ళు వర్షించేవి అన్యాయం ఏరూపంలో ఉన్నా దానికి కారణం ఎవరైనాదాన్ని ఎండగట్టకుండా ఊరుకొనే వాడుకాదు అన్యాయమని తెలిసి కూడా నిశ్శబ్దంగా ఉండటమంటే దానిని బలపర్చినట్లేనని ఆయన నమ్మినట్లు కన్పిస్తుంది అందుకే ఆయన చనిపోయేవరకు కూడా, ఆరోగ్యం బాగులేక పోయినా సభల్లో మాట్లాడుతూ వచ్చాడు అయన ఉపన్యాసాల్లో Oratary ఉండదు సభలో ప్రతిఒక్కరితోనూ ప్రత్యేకంగా వాళ్ళతో మాట్లాడుతున్నట్లుగా ఒకచోట కూర్చుని కబుర్లు చెప్పుతున్నట్లుగా చెప్పేవాడు ప్రజల్లో చైతన్యం తేవటానికి అయన వంతు కృషి చెయ్యటానికి అయన ఎప్పుడూ సిద్ధంగానే ఉండేవాడు

తెలంగాణా వ్యక్తిత్వానికి అద్భుతమైన చిహ్నం కాళోజీ తెలంగాణా సుసంపన్నం కావాలని, తెలంగాణా సంస్కృతికి గుర్తింపు రావాలనే, అయన ఎంతగానో కోరుకున్నాడు అందుకే, అభిప్రాయభేదాలకి అతీతంగా తెలంగాణా ప్రజలు అందరూ ఆయన మరణానికి పొగిలి పోయారు ఇలాంటి నిరాడంబరుడు, నిజాయితీపరుడు ప్రజల్ని, ప్రేమించేవాడు, అన్యాయాన్ని నిశితంగా ఖండించేవాడు, ప్రజల బాధలు ఆయన దృష్టికి వచ్చినప్పుడు, కళ్ళంటనీళ్ళు పెట్టేవాడు ఇలాంటి అపూర్వ వ్యక్తి మనకి మళ్ళీ ఇప్పట్లో కనిపించకపోవచ్చు

# కాళోజీతో....

నిర్మలానంద

అవి నేను హిందీలో విస్తృతంగా అనువాదాలు చేస్తున్న రోజులు (1960 75)

డా॥ భీమ్‌సేన్ నిర్మల్ (భండారం భీమ్‌సేన్ జోస్యులు)తో నాకు పరిచయం ఏర్పడింది అయన హిందీలో రచయిత తెలుగునించి కొత్తగా హిందీలోకి అనువాదాలు చేసే యువకుల్ని ప్రోత్సహించేవారు వరంగల్‌లో హిందీ లెక్చరర్ నేను హైదరాబాద్ వెళ్లినపుడల్లా వరంగల్‌లో దిగి ఒకటి, రెండు రోజులు భీంసేన్‌గారితో గడిపేవాణ్ని, అయన ఒకసారి నన్ను నక్కలగుట్ట తీసుకెళ్లి, కాళోజీ నారాయణరావుగారితోనూ, వారి సోదరులు, ఉర్దూ కవి రామేశ్వరరావు 'షాద్' గారితోనూ పరిచయం చేశారు

కాళోజి సోదరులు నా ప్రయత్నాన్ని మెచ్చుకున్నారు కాళోజీ తన 'నా గొడవ' రెండు సంకలనాలు నాకిచ్చారు

ఇదీ కాళోజీతో నా తొలి పరిచయం

కాళోజి కవిత ఒకటి హిందీలోకి తర్జుమా చేశాను అది అచ్చయింది దాని ఆధారంగా నా సింధీ కవి మిత్రుడు చేసిన అనువాదం సింధీ పత్రికలో అచ్చయింది ఆ రెండూ కాళోజీకి పంపించాను

✤ ✤ ✤

అది తెలంగాణా ఉద్యమం చెలరేగిన రెండో రోజు అలవాటు ప్రకారం నేను వరంగల్ వెళ్ళాను భీంసేన్ కాలేజీకి వెళ్లిపోయాక, నేను నక్కలగుట్ట వెళ్ళాను కాళన్నయ్యని కలిశాను

'చూడరా తమ్ముడూ! కృష్ణాజిల్లానించి వచ్చిన భూస్వాములు మా రైతులనించిం కారుచవకగా భూములు కొనేసి, అమ్మినవారినే ఆ భూముల్లో పాలేర్లుగా పెట్టుకొని, అయిన దానికీ కానిదానికీ వార్ని నానాబూతులు తిడ్తారురా! ఇదేమయినా బావుందా? అన్నారు కాళోజీ అలా చెబుతున్నపుడు అయన మొహంలో ఆక్రోశం, కళ్లలో గిర్రున తిరుగుతున్న కన్నీళ్లు చూశాను

పాతికేళ్ల కుర్రవాణ్ని ఏం జవాబు చెప్పాలో తెలీక మౌనం వహించాను

ఉద్యమం క్రమంగా సద్దు మణిగింది

✤ ✤ ✤

1970 సంవత్సరం విశాఖలో పెద్ద ఎత్తున మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సభలు జరుగుతున్నాయనీ ఆహ్వానసంఘంలో నా పేరూ వేశామని రావిశాస్త్రిగారి నించి లేఖ

మా 'తెలుగు సాహిత్య ప్రచార సమితి' తరపున ఓ సంకలనం హిందీలో ప్రచురించి, శ్రీశ్రీకి సమర్పించాలని నిర్ణయించాం డా॥ భీమ్‌సేన్ నిర్మల్ 2 కవితలు, నేను 3 కవితలు అనువాదం చేసేట్టు మూలకవితలు కూడా హిందీ లిపిలో ఒకవేపున, అనువాదం రెండోవేపున వేసేటట్టు అనుకున్నాం 'ముందుమాట' డా॥ నిర్మల్ రాశారు మేటరు రఘూర్సీ గూడా! (నేను రైల్వే ఉద్యోగంచేస్తూండిన చోటు)లో, ముఖచిత్రం శీలా వీర్రాజువేసి దానిని హైదరాబాద్‌లో అచ్చువేయించేటట్టు అనుకున్నాం షష్టిపూర్తి రోజుకి హిందీ అనువాధం సంపుటి "అగ్ ఉగల్‌తా హువా" ని విశాఖ తీసుకెళ్లాను విషయం రావిశాస్త్రితో చెప్పి కార్యక్రమంలో హిందీ అనువాద పుస్తకాన్ని శ్రీశ్రీకి సమర్పించే అంశాన్ని చేర్పించాను

అన్నీ భాగాను వున్నాయి పుస్తకాన్ని ఎవరు పరిచయం చేయాలి? సమస్య ఎదురయింది విశాఖ సభకి కాళన్నయ్య హాజరవడం చూసి మనసు తేలిక

పడింది కాళన్నయ్యని ఒప్పించాను అయన సరే నన్నారు

వాడు (శ్రీశ్రీ) ఎన్ని సీసాలు ఖాళీచేసేడన్నది కాదు తెలుగుసాహిత్యాన్ని ఏ మార్గం పట్టించాడన్నది ముఖ్యం అని మొదలెట్టి 'అగ్ ఉగల్‌తా హువా' పుస్తకాన్ని వివరంగా పరిచయంచేసి ఆవిష్కరించారు కాళన్నయ్య తర్వాత ఆ పుస్తకాన్ని శ్రీశ్రీకి నేను సమర్పించాను

* * *

డా॥ భీమ్‌సేన్ నిర్మల్ ప్రమోషను మీద హైదరాబాదు వెళ్లారు తర్వాత యువకవి వే నరసింహారెడ్డితో నాకు పరిచయం అయింది అది స్నేహంగా మారింది వేనరెడ్డి యిల్లునా వరంగల్ మకాం అయింది

ఒకరోజున వేనరెడ్డి నన్ను వరంగల్ రచయితల, కవుల యిళ్లకి తీసుకెళ్లారు ఉదయం 8 గం లనించి రాత్రి 12 గం ల దాకా తిరిగాము మొదట కాళోజీ సోదరుల్ని కలిశాం చివర్న సి వి కృష్ణరావుని కలివాం మధ్యాహ్నం భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటూండగా 18 ఏళ్ల యువకవి టంకశాల అశోక్ వచ్చి వెళ్లాడు వేనరెడ్డి యింటికి అందరూ తమతమ కవితల్ని చదివి వినిపించారు విషయం నాకు బోధపడలేదు నేను కొత్తవాణ్ణి అయినా అందరూ తమ తమ రచనలు చదివి వినిపిస్తున్నారు

వేనరెడ్డిగారూ? నేను వారికి కొత్తవాణ్ణయినా అందరూ తమతమ రచనలు నాకు వినిపిస్తున్నారు ఏమిటి విశేషం! అని అడిగాను

చిరునవ్వులు చిందిన్నూ ఆయన యిచ్చిన సమాధానం

'ఇది వరంగల్ సాహిత్యవేత్తలకు కాళోజీ సోదరులు దిద్దిన ఒరవడి! బయటినించి ఏ సాహిత్యవేత్త వరంగల్ వచ్చినా తమ యిళ్లకి వస్తే ఆ రచయితలు విధిగా తమ తాజా రచనని చదివి వినిపించాలి తాజా రచన చెయ్యకపోతే పాత రచన అయినా ఫర్వాలేదు!

వరంగల్ కాళోజీ సోదరులు పెట్టిన ఈ విలక్షణమయిన ఒరవడికి నేను పులకించి పోయాను

* * *

ప్రజల గొడవ తన (నా) గొడవగా చేసుకొని కలం వ్యవసాయం చేసిన ప్రజాకవి కాళోజీ మృతి (13 11 2002) తెలుగు సాహిత్యానికేకాదు, పౌరహక్కుల ఉద్యమానికీ పూరించలేనిలోటు

* * * *

# నేనెరిగిన కాళన్న

భీమసేన్ నిర్మల్

కాళోజీ నారాయణరావు గారిని కొద్దో గొప్పో విని ఉన్నా 1960 అక్టోబరులో హనుమకొండలోని ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజికి హిందీ లెక్చరర్‌గా వెళ్ళిన నాటి నుండి వ్యక్తిగత పరిచయం ఆత్మీయానుబంధాలు ఏర్పడ్డాయి అదృష్టవశాత్తు వారి ఇంటికి (నక్కల గుట్టలో) 100 గజాల దూరంలో మాకు ఇల్లు దొరకడంతో ఇంకా ఆత్మీయత పెరిగింది రామలక్ష్మణుల వంటి ఆ అన్నదమ్ములు నన్ను పుత్రవాత్సల్యంతో అభిమానించడం జరిగింది కీ శే రామేశ్వరరావు గారి శ్రీమతి గారు తెల్లవారగానే 'కొడకా' , 'కొడకా' అంటూ మా ఇంటికి రావడం వాళ్ళ ఇంట్లో వండినది తెచ్చి మాకు పెట్టడం వారి ఆప్యాయతను మరువలేము ఇంట్లో వారి మాటకు ఎదురు చెప్పని అమ్మ రుక్మిణమ్మ పిన్ని

ప్రారంభంలో 1, 2 సంవత్సరాలు విద్వద్ గోష్ఠులలో పాల్గొంటూ ఉండేవాణ్ణి తెలుగు కవులు, రచయితలు ఎవరు వరంగల్లు హనుమకొండ వచ్చినా కాళోజీ గారింట్లోనే మకాం ఆ విధంగా నాకు శ్రీశ్రీ, ఆరుద్ర, మునిమాణిక్యం నరసింహారావు, పుట్టపర్తి

నారాయణాచార్యులు, దేవరకొండ బాలగంగాధర తిలక్ మొదలైన వారితో వ్యక్తిగత పరిచయాలు ఏర్పడ్డాయి

వారి ఇల్లు అన్నపూర్ణా మందిరమే ఎవరు ఎప్పుడు వచ్చినాసరే వారింట్లో భోజనం చేయవలసిందే అన్నదమ్ములిద్దరికీ (ముఖ్యంగా రామేశ్వరరావు గారికి) కడుపునిండా భోజనం చేసిన తరువాత రెండు పెద్ద కప్పుల టీ త్రాగే అలవాటుండేది

రామేశ్వరరావుగారు పుస్తకాల పురుగు మితభాషి నారాయణరావు అమితభాషి కరుణార్ద్ర హృదయులు పరుల కష్టం చూచి కరగని హృదయం హృదయమా? కన్నీళ్ళతో నిండని కళ్ళు కళ్ళా? అనే భావం వారి కవిత్వంతో కాదు వ్యక్తిత్వంలో కూడా కనిపించేది మా పిల్లలు పెద్ద పెద్ద బ్యాగులతో స్కూళ్ళకు వెళుతుంటే చూచి అరే సపివాళ్ళ వెన్నెముకలు వంగిపోతాయని బాధపడేవారు వీళ్ళకు ఉద్యోగాలు దొరక్కపోయినా మంచి హమాల్ళు (కూలీలు) అవుతారని జోక్ చేసేవారు వారి చేత 'రా అనిపించుకోగలగడమే నా అదృష్టం

ఎంత స్నిగ్ధ కోమల స్వభావులో అంత కోపశీలి కూడా అయితే వారి కోపం కవలం చిటుకుల మంటలాంటిది అదీ వ్యక్తి మీద కాదు సమాజం మీద

నైజాం కాలంలో (కఠోర నియంతృత్వంలో) నైజాంను దుమ్మెత్తి పోసిన వారిలో దాశరధి కాళోజీయే చెప్పుకోదగ్గవారు సమాజంలోని కుళ్ళుని ఎండగట్టడంలో కాళోజీ మరో వేమన్నయే అందుకనే ఆయన్ను తెలంగాణా వేమన్న అంటారు

ఆ రోజుల్లో ఆయన ఆధ్వర్యంలో నడిచే మిత్రమండలి ఎంతమందో కవులను రచయితలను వెన్నుదట్టి సాహిత్య క్షేత్రంలో ముందడుగు వేయటానికి ప్రోత్సాహం కలిగించింది

నారాయణరావు గారు నేను వకీళ్ళలో కవిని కవులలల వకీలును కనుక హాళ్లికి హాళ్లీ సున్నకు సున్న అంటుండేవారు వారి నా గొడవ లోని ఎన్నో కవితలను నేను హిందీలో అనువదించాను అవి హిందీ పాఠకులను ఆకట్టుకున్నాయి

సరళ స్వభావం ముక్కుకు సూటిగాపోయే లక్షణం ఇవి కాళన్నలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి ఎదుటివాడు ఎంత గొప్పవాడయినా సరే తను అనుకున్నది నిర్మొహమాటంగా చెప్పగలిగిన ధీశాలి కాళన్న

ఇంటివాళ్ళ కోసం కాక పరుల కోసం దేశం కోసం తన జీవితాన్ని తన గళాన్ని ధారపోసిన అమరవీరుడు కాళన్న

# కాళోజీ

చలసాని ప్రసాద్

కాళోజీ పోతే ఎంత స్పందన! ఎన్ని సభలు! ఎన్ని సమావేశాలు! ఎన్ని ఉపన్యాసాలు! ఎన్ని వ్యాసాలు! ఎన్ని కవితలు! ఎన్ని కథలు!

ఆయనకి ఎందుకింత ఆర్భాటం? కాళోజీ కవో పండితుడో? రచయితో? విమర్శకుడా? ప్రజానాయకుడా? విప్లవ కారుడా? అంటూ ఒకరిద్దరయినా ఇటు ఉత్తరాంధ్రనించి అటు ఉత్తర తెలంగాణా వరకు పెదవి విరిచారు వీటిల్లో ఆయన ఏ ఒకటీ మాత్రమే కాదు ఆమాటకొస్తే ఆయన అన్నీను

వీటన్నిటినీ మించి కాళోజీ మనిషి మంది మనిషి మంచి మనిషి కన్నీటి కాలువ కాళోజీ కన్నీరు అమృతమయితే కాళోజీ కన్నీటి తోనే మానవ జాతి మరణాన్ని జయించగలిగేది ఆయన అంతటి మహోన్నతవ్యక్తి ఆయన కిలేవుగాని లేవు కాళోజీ ఏ 'ఇష్టు' కాదు ఆయన దీ ఏ 'ఇజమూ' కాదు ఏ సిద్ధాంత చట్రం లోనూ ఆయన ఇమడడు ఏ నిర్మాణం లోనూ ఆయన ఒదిగుండలేదు సంకెళ్ళు లేని నేలమీద సంతోష చంద్రశాలలు వెల్లివిరవాలని కలల కన్నవాడు కాళోజీ

ఆ రోజు (1 2 1970) విశాఖలో శ్రీశ్రీ సన్మానం. నేను ఇంటకి చాల లేటుగా వెళ్ళాను ఎక్కడా చోటు లేకపోతే కాళోజీ ఎక్కనే పడుకుని పొద్దున్నె లేచి వెళ్ళిపోయా నిద్రలోనే నన్ను హత్తుకున్నడాయన తాను ఆలస్యంగా లేచి ప్రసాద్ ఎడే? రాత్రి రాలేదా? అని అడిగాడు అదేంటి కాళోజీ? నీ పక్కలోనే పడుకున్నడుగా అన్నది మా మామ్మ కలలోనయినా ఇలలోనయినా అందరి గొడవే కాళోజీ గొడవ నాగొడవ అయినా అంతే ఇదీ నా గొడవ అయినా అంతే తను ఎవరింటికి వెళ్ళాలన్నా తన ఇంటికి ఎవరు వచ్చినా ఎలాంటి తేడాలు ఆయనకి లేవున ఆస్తి పాస్తులులేవు ఆరాటాలు లేవు భార్యా కొడుకు కోడలు మనవడు అన్న ఆయన కుటుంబం అంతా కలిసే వుండేవారు ఉమ్మడి కుటుంబంలో ఇమడలేనివాడు కమ్యూనిస్టులెలా అయితారు? అనేవారు కాళోజీ తాను ఎందరి దగ్గరనించీ ఎన్ని నేర్చుకున్నడో ఎవేవి అలవర్చుకున్నాడో అరమరికలు లేకుండా చెప్పేవాడు తన గర్వభంగాలని గురించి కూడా సగర్వంగా చెప్పేవాడు నిజానికి అవి ఆయన చెబితేనే గాని లోకానికి తెలిసివుండేవికావు అయినా దాపరికాలు లేకుండా తనని తక్కువ చేసుకుంటూ ఎదటివారిని సాటివారిని ఎక్కువ చేస్తూ ఎన్నెన్నో చెప్పేవాడు లోకంలో మామూలుగా ఉమ్మడి కుటుంబాలలో అన్నగారి దగ్గర తమ్ముడు అణిగిమణిగి వుండడం వినయ విధేయతల తో నుండడం పరిపాటి అన్నకి తమ్ముడు సేవ చేయడం కూడా కద్దు కాని కాళోజీ మాత్రం అన్న చేత సేవలందుకునేవాడు అలాగే గురువులకి శిష్యులు సేవ చేయడం గురువుల రచనలు శిష్యులు పదిలపరచడం రివాజ కాని కాళోజీ రచనలని పదిల పరిచింది ఆయన గురువుగారు గార్లపాటి రాఘవరెడ్డిగారు కాళోజీ మూస మనిషి కాదు మూక మనిష

పాత కొత్త తెలుగు సాహిత్యము, ఇతర భాషా సాహిత్యం, విదేశి సాహిత్యం కాళోజీ విశేషంగా చదివాడు అయితే పాండిత్యం ఒలకబోసుకునే అలవాటు కాళోజీ కి లేదు కాని దేన్నయినా సరే ఆయా సందర్భాలకి అన్వయించి చెప్పడం కాళోజీకి అలవాటు ఈ విషయంలో ఈయనతో సరిపోల్చదగ్గ వారు చాలా కొద్ది మందే అది కాళోజీ విశిష్టత

కాళోజీ కవిత్వం రాయలేదు చెప్పాడు ఈ విషయంలో ఈయనకి వేమనతో పోలికవుంది కనక కాళోజీ కవిత్వానికి కొలమానాలు వేరు ఈ సంగతి మనం మర్చిపోగూడదు కాళోజీ ఎన్నడూ నేలనిడిచ్చిసాముచేయలేదు జీవిత సారాన్నేతన కవితల్లో నిలిపేవాడూ కాళోజీ పరిశుద్ధ కళాకరుడు కాదు కళకి సత్యానికి పోటీ వస్తే నా ఓటు సత్యానికే అనేవాడు కాళోజీ జీవితాన్ని కళ వెలిగించాలని కాళోజీ ఉద్దేశం జీవితానించి కళ పారిపోగూడదనే వాడు ఇతర కవులపట్లా రచయితల పట్లా ఈర్ష్య అనేవి కాళోజీలో మచ్చుక కూడా కనిపించేవికావు ఏరకమైన కాంపెక్సుకి కూడా కాళోజీ అతీతంగానే వ్యవహరించేవాడు కొంతమంది కవులకు లాగా కాళోజీకి రాజకీయాలు అంటరానివి కావు రాజకీయ వ్యవస్థలో కాళోజీ సజీవ సంబంధం పెట్టుకునేవాడు అలా పెట్టుకొని వారిని పూరు సాహిత్య జీవులు అనేవాడు కూడా మంచిమాటలకీ మంచి చేతలకీ మురిసిపోయే వాడు ఎక్కడ ఎవరిలో ఏ మేలు గుణం కనిపించినా ఆహ్వానించేవాడు దానిని పెంచేవాడు

కాళోజీ లో కోపతాపాలున్నాయి వాద వివాదాలలో తలదూర్చేవాడు వెనుకాడేవాడుకాదు అయితే కాళోజీ కక్షమనిషి కాదు ఆయనకి వ్యక్తిగతమైన పగలు లేవు వాటికి ఒక రకంగా ఆయన అతీతుడు కూడా private wrong can be drowned in a cup of wine but for a public wrong it requires rivers of blood అనిQuote చేస్తుండేవడు అయితే కాళోజీ చెడుని ద్వేషిచినంతగా చెడ్డవారిని ద్వేషించేవాడు కాదు ఆయనలో క్షమాగుణం పాలు జాస్తే శ్రీశ్రీ నైజాం నవాబు కొలువులో పని చేసినందకు కాళోజీ కారాలు మిరియాలు నూరలేదు రామేశ్వరరావు లాటి అన్నవాడికి లేడుగా? ... శ్రీశ్రీ పసిపిల్ల వాడు, ఆసుపత్రి ... ల్లాని ఖైదీలనీ గుడిసెల్లోని దర్భిద్రులని ... తాకవుని చంద్రుడిని అడుగుతూవుంటోవాడు శ్రీశ్రీ 'శరచ్చంద్రిక' కాళోజీకి చాలా ఇష్టం శ్రీశ్రీ ... కాళోజీ నాలుగేళ్ళు చిన్న కాని కాళోజీ

దగ్గర శ్రీశ్రీ తండ్రి దగ్గర కొడుకులా కూర్చునేవాడు నేరుగా మద్రాసు నించి వరంగల్ స్టేషన్‌లో దిగి సీదా కాళోజీ ఇంటికి వచ్చేశాడు శ్రీశ్రీ (1962) శ్రీశ్రీ ని రిసీవ్ చేసుకోవడానికి కాజీపేట స్టేషన్ కెళ్ళి తిరిగొచ్చినవాళ్ళు కాళోజీ ఇంట్లో పసిపిల్లడిలా షికారాడుతున్న శ్రీశ్రీని చూసి విస్తుపోయారు అందరికీ తమవాడేననిపిస్తాడు కాళోజీ అందకే కాళోజికి జేజేలు

చేతిరాత వచ్చి నోటమాటకి కొంత అన్యాయం చేసిందేమో అనిపిస్తుంది కాళోజీ సమగ్ర స్వరూపం గ్రంథస్తలి కావాలంటే ఒక్కటే మార్గం ఇదీ అరకొరదే అవుతుంది అయినా గుడ్డిలో మెల్ల కాళోజీ పరిచయాలలో ఆయనతో అతి దగ్గర గా మసలిన మంది ఎందరో! పోయిన వారు పోగా మిగిలిన వారిలో కొందరి పేర్లు చెప్పుకుందాం

పి వి నరసింహరావు, సి నారె, వరవరరావు, హేము, ఎమ్ టి ఖాన్, బాలగోపాల్, వసంత, హరగోపాల్, వనమాల, కన్నబిరాన్, వసంత ఓల్గా, రత్నమాల, విమల, సదాశివ చంద్రశేకరరావు, జయశంకర్, రామశాస్త్రి, జీవన్, ఓరుగల్లు, హనుమకొండ మిత్రమండలి, పేర్వారం జగన్నాథం రాములు, బిరుదురాజు రామ రాజు, తుమ్మల వేణుగోపాల రామకృష్ణ, వేగుంట మోహన్ ప్రాసాద్ మొదలైన వారందరం ఒక చోట కలిసి కూర్చుని మన యాది లోని ముచ్చట్లు రికార్డు చేస్తే మంచిగుంటుంది ఈ పని అంత సులువైంది కాదనీ చాలా కష్టసాధ్యమనీ నాకెరికే అయినా ఇది అవసరం మన సామాజిక చరిత్రలో కాళోజీ నిలువెత్తు సంతకం అవుతుందది అయితే ఈ పట్టికలో నేను ఇంకెదరినో పేర్కొనలేక పోయి వుండవచ్చు నిజానికి ఈ పనిలో వారిదోహదమే ఎక్కువ కావచ్చు కూడా వారిని పేర్కొన లేక పోవడం కేవలం నా పరిమితి అని మాత్రం ఒప్పుకుంటున్నా తప్పుకుంటున్నాను

చంద్ర రాజేశ్వరరావు (1914 94) గారు 1990 లో ఒక మాటన్నారు 'వయసు మళ్ళాక చాలా మందిమి నాతోసహా నీరసించిపోయాం మానసికంగా కూడా దిగజారిపోయాం దీనికి కాళోజీ మాత్రం గొప్ప మినహాయింపు వయసు పెరిగిన కొద్ది ఇంకా ఎక్కువ చురుగ్గా క్రియాశీలకంగా, విప్లవాత్మకంగా సామాజిక ఆచరణలో ముందువరసలోనిలబడ్డాడు " ఇది ఎలా సాధ్యమైంది? కాళోజీకి

మచ్చలేనీ మనసు
డబ్బులేని జేబు
జబ్బు లేనీ ఒళ్ళు

# కాళోజీతో నా అనుభవము

కె ప్రతాపరెడ్డి

కాళోజీతో నాకు పరిచయము నేను హన్మకొండలో హైస్కూల్లో చదివే రోజుల్లో అంటే 1945 46 సంవత్సరములో అయినది అప్పటి నుండి, వారు చనిపోయే అంత వరకు చాల సన్నిహితంగా ఉన్నాను కాళోజీ గారి స్వగ్రామము మడికొండ అదే మా అమ్మపుట్టిల్లు కూడా నేను కూడా అదే గ్రామములో పుట్టినానని మా అమ్మ చెప్పేది మా అమ్మ మరియు పెద్ద కాళోజిగారు (రామేశ్వరరావుగారు) చిన్నప్పుడు ఒకే ప్రాథమిక పాఠశాలలో చదువుకున్నారని మా అమ్మ చెప్పేది మా మేనమామలు మరియు కాళోజీ సోదరులు ఒకరిని ఒకరు అన్నదమ్ములమని పిల్చుకునేవారు అందుచేత కాళోజీ గారు అప్పుడప్పుడు తాను కూడా నాకు మేనమామనే అని చెప్పేవారు అంతే ప్రేమ ఆప్యాయత, చనువు చూపే వారు

కాళోజీ గురించి చెప్పాలన్నా, వ్రాయాలన్నా, ఎక్కడ మొదలు పెట్టాలే, లేక ఏ విషయాన్ని ప్రాధాన్యమివ్వాలెననే సంకోచము ముందుకు వస్తుంది ఎందుకంటే భారతదేశములో, మరియు, పాత హైదరాబాద్ స్టేటులో, ప్రత్యేకంగా తెలంగాణా ప్రాంతమున జర్గినవి నాకు తెలియవు అందుకే వారి గురించి వ్రాయమని మిత్రులు ప్రభాకరరావుగారు

కోరినప్పుడు నేను చాలా సతమతమై ఆలోచించుచుండగా నాకు పోతన వ్రాసిన పద్యము

ఇందు గలడందులేడని సందేహము వలదు

జ్ఞాపకము వచ్చి ఈ రెండు మాటలు వ్రాయటాన్కి ధైర్యముచేసితిని

కాళోజి ఒక్క గొప్ప అసాధారణ వ్యక్తిగా అందరు పెద్దలు చిన్నలు అంటుంటారు కాని కాళోజి గారి దృష్టిలో కవి అంటే తనకున్న సామర్థ్యాన్నంత ఏవో రోమాంటిక్ కథలో లేక దేవతలను రాజులను ఇతర అధికారులను ఆకాశమెత్తుగా పొగడడము కాదు కాళోజీగారు వారి కవితా సామర్థ్యాన్నంత సామాన్య ప్రజలు మరియు వారి పోషిత పీడిత జీవనాన్ని గురించి హృదయాన్ని కరిగింప జేసే పద్ధతిలో వ్రాయడానికి ధారపోసినారు అందుకే వారు "ప్రజాకవి"గా పేరుపొంది సామాన్య మానవుల మనస్సులో ఎల్లప్పటికి ఉండిపోయేలా చోటు చేసుకున్నారు ప్రజల కష్టాలనన్నింటినీ తన కష్టాలుగా తీసుకొని మనందరికి కూడా అనుభవస్ఫూర్తి కలిగేలా చిత్రీకరించిన వాటిని "నా గొడవ" అనే శీర్షికలో ప్రచురించినారు

మానవ హక్కుల పరిరక్షణ పోరాటములో కాళోజి దక్షిణ భారతములోనే మరెవ్వరు సాటిలేరని చెప్పటము ఎంతమాత్రము అతిశయోక్తి కాదని మనవి చేస్తున్నాను బ్రిటిషు మరియు నిజాం వారి నిరంకుశ పరిపాలన కానియ్యండి లేదా ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ కాలము నాటి అధికార దుర్వినియోగాన్ని కాళోజి ప్రతిఘటించి పోరాడిన తీరు మనందిరికి ఇంకా జ్ఞాపకమున్నాయి కాని వారు ప్రతిఘటించే తీరు పోరాడే తీరు మాత్రమే వేరు ఇతర గొప్ప నాయకులు, గాంధీ, జయప్రకాశ్ మొదలగు వారందరి పోరాటము వారిస్వంత స్ఫూర్తితో వచ్చినట్లు అగువడేది కాళోజీ తన పోరాటాన్ని ప్రజల పోరాటానిగామార్చి అది ప్రజల నుండి సమూహంగా వచ్చినట్లు ప్రసతిబింబింపచేసే వారు తన ఆవేదనను ప్రజల ఆవేదనగా మార్చి ఆ ఆవేదనను ప్రజలందరు అది తమ ఆవేదనే అనుకునేటట్లు చేసేవారు ఆ ప్రతిభ నాకు తెల్సినంత వరకూ వారిక్కొరికే ఉండేది అందుకే ప్రజాస్వామ్యావాదులు, అధికారధిక్కారము సహించని వారు, లౌకికవాదులు, హేతువాదులు, సమాజ సంస్కర్తలు అందరు తమ తమ ప్రతిరూపాన్ని కాళోజీలో చూసుకొని కాళోజీ వ్యక్తిత్వంలో లీనమైపోయేవారు

అన్యాయము అధికార దుర్వినియోగము హింసాకాండ ఏ కోనల నుండి వచ్చినా కాళోజి సహించేవారు కాదు ఒక ప్రక్క నక్సలైట్లను పోలిసువారు చంపేవిధానాన్ని ప్రతిఘటించుతూనే నక్సలైట్లుచేసే హింసాకాండను కూడా వారు సహించేవారు కారు మన సమాజములో ముఖ్యంగా మన హిందు సమాజములో జరిగే దైనందిక అక్రమాల్ని మరీ ముఖ్యంగా కులమతముల పేరుతో క్రింది వర్గాల మీద స్త్రీలపైన జరిగే అత్యాచారాన్ని అన్యాయాన్ని ఒక గురజాడ తప్ప మరెవ్వరు కూడా పోరాడనంతగా పోరాడిన వారు నా దృష్టిలో కాళోజీ ఒక్కరే

ఎన్ని ఉద్యమాలు నడిచినా ఎంత పెద్ద అధికారాన్ని ఎదురించి పోరాడిన ఎంత పెద్ద అధికారులకైనా గుండెల్లో దడదడపుట్టించి కంపింపచేయకల్గిన కాళోజి మాత్రమే నిజముగా ఒక్క చిన్న పిల్లవానికి మెత్తని హృదయము కలవాడు అయనకు అయనతో పరిచయమున్న ప్రతి వ్యక్తి పైన అపారమైన ప్రేమ కల్గి యుండేవారు ఆయనకు శత్రువులు లేరు ఆయన వ్యతిరేకించిన అధికారులపైన కూడా అయనకు ఎటువంటి వ్యక్తిగత ద్వేషము కాని కోపము కాని ఉండేది కాదు మరియు వారు ఎన్నడు ఏ చెడు కల్గించాలని కాని చెడు కల్గాలని కాని భావించేవారు కాదు అందుకే ఆయన ఒక మహా మనిషి మహారిషి అని కూడా చెప్పవచ్చు

కాళోజీ గురించి ఇలా ఎంత చెప్పినా తక్కువే కాని ముగించే ముందు నా దృష్టిలో కాళోజి గురించి ఈ చివరి మాటలు చెప్పక తప్పదనిపించుతుంది తెలంగాణాలో, మరియు ప్రత్యేకంగా ప్రజా ఉద్యమాలలో ఏ కొద్దిపాటి అనుభవమున్న కుటుంబాలు అన్నింటిలోను కాళోజి ఒక కుటుంబ సభ్యునిగా ఉన్నాడనే మాట ఎంత మాత్రము కూడా అతిశయోక్తి కాదని నా మనవి అదే కారణముగా వారిమరణము ప్రతి కుటుంబములో ఒక లోటు కల్పించినది ఆ లోటును నింపుకోవాలంటే కాళోజి చెప్పిన మాటల్లో ఏ ఒక్క దానినైనా వారు చేసిన ఏ ఒక్కపనినైనా, వారు జీవించినవి ధానములో ఏ కొద్ది పాటినైనా మనము అవలంబించవలసి యున్నది అదే వారికి, వారి స్మృతికి మనము ఇవ్వకల్గే నిజమైన నివాళి

# కాళోజీ ఒక కథ, ఒకగాథ

వి. వెంకటేష్ ప్రసాద్

చీరాల ఓడరేవు చేరాం సముద్రానికి వెళ్ళే తారురోడ్డు రోడ్ పైన గూడులేని రిక్షా మమతకి అపుడు ఐదు ఏళ్ళు, ఆరిక్షా మీద కూచుంటానని గొడవ ఆరిక్షా నన్ను తొక్కమని అల్లరి నా ప్రయత్నం విఫలం బాలెన్స్ కుదరక అలాకాదు ఇలా అని కాళోజీ రిక్షా ఎక్కి తొక్కటం! మమత సంతోషం

ఓ తుండుగుడ్డ అడ్డంగా గోచీలా కట్టుకొని సముద్రంలోకి కాళోజీ దూకుడు ఓ గంట తర్వాత మత్స్యకారులతో ఆయన చేసిన స్నేహానికి ప్రతిఫలం ఓ పెద్ద చేప!

❖ ❖ ❖

అవి ఎనుర్జెన్సీ రోజులు అప్పట్లో నేను గుంటూరులోని ఒక కళాశాలలో ట్యూటర్‌గా ఉంటూండేవాడిని కళాశాలకు కవుల్ని కళాకారుల్నీ, పండితుల్నీ మేధవుల్నీ పిల్చుకొనే వాళ్ళం అలాగే కాళోజీని కూడ అప్రిన్సిపాల్‌గారు ఏ సీ కాలేజిలో మాకు గురువుగారు కూడ! ఇంటి నుండి కాలేజికి తీసుకొచ్చాను కాళోజీని సాయంకాలం 5 గంటలు, నాతోబాటు స్టాఫ్‌రూంకి వచ్చారు కాళోజీ అమరేంద్ర డా అనంతం గార్లకి పరిచయాలయినయ్ అక్కడే మొదలయిపోయింది ఉపన్యాసం సమయం మించిపోతూంది నేనువెళ్ళి ప్రన్సిపాల్‌గారికి చెప్పాను కాళోజీగారు వచ్చారని "మరేం! వారిని తీసుకొనిరా అన్నారు నేనెళ్ళి చెప్పాను

అరే! నువ్వు పిలిస్తే వచ్చాను నీ ఇంటికి ఆయన పిలిస్తే వచ్చాను కాలేజ్‌కి ఆయనే నన్ను రిసీవ్ చేసుకోవాలి రమ్మను ఇక్కడికేరమ్మను లేదా పద, ఇంటికి పోదాం!!

కవులు కళాకారులు పండితులు, మేధావులు చాలామందినే నేను పనిచేసిన మరొక కళాశాలలో ఓ పాతికేళ్ళపాటు చూచాను ఎవరూ ఆ ఆత్మ గౌరవాన్ని ఈ నాటికీ చూపించలేకపోయారు ఒక్క సభ ఒక్క సాయంకాలం తప్పితే యాజమాన్యాలకూ వారికీ ఏ సంబంధమూ ఉండదు కాని భయం, మన చెయ్యి కిందయినపుడు ఆత్మగౌరవం ఎక్కడ్నించి వస్తుంది!

కళాశాలలో ఆల్టర్నేటివ్ కల్చర్‌ని చూపించాలనే ప్రయత్నంలో గద్దర్‌నీ సంజీవదేవ్‌నీ కా రా ని, ఇస్మాయిల్ (చెట్టు)నీ పిల్చుకొనే వాళ్ళం శ్రీశ్రీ నీ అలాగే పిలిస్తే ఆయనని సభకి తీసుకురావటానికి ఒక అరగంట ఆలస్యమైతే పెద్దలకి కోపతాపాలొచ్చినయ్ మహా కవులకోసం సమాజం ఒక్కోసారి దశాబ్దాలూ శతాబ్దాలూ వేచి ఉండాల్సిందేనని తెలీక!

❖ ❖ ❖

దువ్వపట్లా చాపలూ పండిచి కూచున్నాం ఉయ్యూరులో ■ రాత్రి భోజనాలకి, మధ్యలో భోజనలూ కబుర్లూ మధ్యలో ఓ చిన్నపాప పాక్కుంటూ వచ్చేసింది ఆ పాపతల్లి ఎంతగా నొచ్చుకొందో, ఎంతగా చిన్నబోయిందో!

ఏవుందిందులో ఎందుకంతబాధ! విస్తట్లో ఉన్న బీరకాయపచ్చడి అదీ ఒక రంగులోనే ఉందికదా!' అని కాళోజీ నవ్వు! ఓ అఘోరి నవ్వు!! ఆ పాప ఇప్పుడొక పాపనో బాబునో కనబోతూంది

1996 అప్పుడు రామప్పదేవాలయంలో ప్రథమంగా చూచిన కాళోజీని ఇన్నాళ్ళుగా గుర్తు పెట్టుకోవాల్సి వస్తుందని అనుకోలేదు ఆయనొక్కడ్నే గాదు ఆయన

సంక్రాంతి మిత్ర బృందాన్ని కూడా ఎన్ని ఊళ్ళల్లోనో ఆయన చుట్టూ మిత్రులు 'ఒక్కొక్క వ్యక్తి సమష్ఠశక్తి' అన్నట్లు అయనకి స్థలకాల పరిమితులు లేవు ఉంటే పచ్చి ప్రాంతీయవాది పచ్చి తెలంగాణా వాదికి ఆంధ్ర దేశంలో అందరు మిత్రులేమిటి?

✤ ✤ ✤

ప్రత్యేక ఆంధ్ర బీభత్సం బెజవాడలో ఆరోజు సాయంత్రం పండిత గౌరైపాటి వెంకట సుబ్బయ్య గారి వారి ఇంట్లో కాళోజీ మర్యాదకి పలకరించి నేను రేడియో పెట్టుకొని వేరే గదిలో

రా! దమ్ముంటే రా! ఆ అజంతా హోటల్ సెంటర్లో నేనూ మాట్లాడు తాను నువ్వు మాట్లాడు పెళ్ళంతో కూచుని కబుర్లు చెప్పుకోటం కాద'ని కాలోజీ కేక సవాల్, ఆక్రందన

'కొత్తగా పెళ్ళయిన వాళ్ల వాళ్ళని వొదిలిపెట్టెయ్!' అని ఆయన అన్నగారు వెంకట సుబ్బయన్న' ముసి ముసి నవ్వులు!

✤ ✤ ✤

వెళ్తూవెళ్తూ ఏదోసభలో తనికివేసిన కొత్త జరీ ఉత్తరీయాన్ని తీసి ఇస్తూ 'దర్జీ కిచ్చి, జరీ ముందు వేపు వచ్చేట్లుగా మంచి గౌను కుటించు మమతకి' అని కాళోజీ మరొక సందర్భంలో

✤ ✤ ✤

సి వి ఎన్ ధన్, బీనాదేవి, నరసింగరావుగారు డా బి సి, డా కృష్ణమూర్తి డా వెంకటరత్నం, ఆ మెడికల్ గాంగ్ బాంబుల్ని పిడకలుగా కుటీర పరిశ్రమ చేస్తూండే కొందరు నవయువ వైద్య విద్యార్థులు ఎప్పుడూ సందడే కాళోజీ వచ్చారన్నా వస్తున్నారన్నా కోళ్ళు తెగాల్సిందే కబుర్లయిపోయేప్పటికి కోళ్ళు కూయాల్సిందే!

✤ ✤ ✤

"నరసింహారావ్,

నేనిక్కడ బాగానే ఉన్నాను గానీ నువ్వక్కడ బాగానే ఉంటావ్‌గానీ ఈ ఉత్తరం ఎందుకు రాస్తున్నానంటే చూడు ఈ పాప ఫోటో నాట్యం చేస్తుంది వాలీ బాల్‌లో ఫస్టు చదువులో బెస్ట్ కాబోయే ఇంజనీర్ లారీ కిందపడి ఒకకాలు మొత్తం ఆపరేషన్ చేసి తీసేయాల్సివచ్చింది మెడికల్ రిపోర్టులన్నీ పంపిస్తున్నారు ఇంకా చెయ్యాల్సింది చాలా ఉంది ఈ చిరంజీవికి నీ ప్రైమ్ మినిష్టరు ఫండేదో ఉంటుంది కదా దాన్లోంచి ఏం పంపాలో పంపు నీ కాళోజి

ఇదీ ఉత్తరం రాసింది మనుమడి స్కూలు నోటు పుస్తకంలోంచి ఒక కాగితం చించి లెటర్ హెడ్ లేదు పద్మవిభూషణ్ బిరుదులేదు రానంది తెలుగులో రాసి ఇచ్చేసింది నాకూ మరొక కుంటుంబ మిత్రుడైన ఆపాప తండ్రికి డబ్బాలో వేసాం ఉత్తరాన్ని మెడికల్ రిపోర్టుల్తో బాటు చూసాం చూసాం వారమయింది నాలుగు వారాలయినయ్ రెండు మూడు నెలలయినయ్ ప్రధానమంత్రికి అలాంటి అణాకాణీ ఉత్తరం చేర్తుందా మా ఎచ్చిగాని!

సరే వాందూలో ఓ రోజు మొదటి పేజీలో ఓవార్త ప్రధాని వరంగల్ వస్తున్నారనీ రాజకీయులెవర్నీ కలుసుకోరనీ స్నేహితుల్నేననీ, మళ్ళీ ఆశతో నేనూ మిత్రడూ హనుమకొండ వెళ్ళాం మధ్యాహ్నానికి

పెద్దమంచంమీద కాళోజీ ఒక్కరే కూచుని పేషన్స్ ఆడుకుంటూ అన్నగారు రామేశ్వరరావుగారు చిరునవ్వుతో మరొకమంచం మీద అప్పటికీ కాళోజీ ఇట్లా పరిసరాలూ పోలీసులు పరిశీలించి తగు జాగ్రత్తలు తీసుకొని వెళ్ళారు

చెప్పాం వ్యక్తిగతంగా కలిస్తారు కదా గుర్తు చేస్తారా అని "నేను గుర్తు చేయటి మేమిటి? వానికి గుర్తుండ వద్దా?' అని కాళోజీ కోపం

ఆ ఉత్తరం అసలు అందితేకదూ! కాళోజీ ఇంట్లో విషయం తెలుసుకొని ప్రధాని తన పి యే కి ప్రత్యేక ఉత్తర్వులు ఇచ్చేసారు అక్కడికక్కడే కాళోజీ సమక్షంలో పదిహేనో రోజుకల్లా ప్రధాని సహాయం ప్రత్యేకంగా క్షమార్పణలు చెప్పుకొంటూ మధ్యలో పూజారులు!

సహాయం ఏం గొప్ప? ఆ సహాయాన్ని ఎవరు ఏవిధంగా ఉపయోగించుకొంటున్నాం అనే అసలు ప్రశ్న!

అపాప మనోస్థైర్యానికి డాక్టర్లతో బాటు ఆంధ్ర దేశమంతా అందరు తల్లిదండ్రులలా నివ్వెరపోయారు కాళోజీ ఆశీస్సులతో అపాప ఇపుడు అమెరికాలో రెండు ఉన్నత పట్టాలుపొంది గొప్పదీక్షగా తల్లిదండ్రుల కన్నీళ్ళను తనే తుడుస్తూ ధైర్యంగా జీవిస్తోంది మహామనో ధర్మంతో

అసలు విషయం ఇది వట్లూరులో వేగుంట కనక రామబ్రహ్మంగారిని చూడాలని కాళోజీ ఆకాంక్ష ఈ బస్సుల్లో ఎందుకులే ముసలాయన్ని అని ఓ టాక్సీ మాట్లాడాను మధ్యాహ్నం బయల్దేరి రాత్రి 8 గంటలకు విజయవాడలోని ఇంటికి వచ్చేసాం

టాక్సీ కిరాయి నాలుగొందలు మిత్రుడికి తెలిసిన టాక్సీ, అందుకని తక్కువకి వచ్చింది మిత్రుడు టాక్సీకి కిరాయి ఇవ్వటం కాళోజీ గనమించారు

ఊహించలేదు అనుకోలేదు అందులో తప్పేమి నాకు కనపడలేదు, ఎందుకంటే మిత్రుడు కూడా మాతో వచ్చాడుకదా వట్లూరు!

ఇంతెత్తున లేచాడు కాళోజీ!

' ఏమనుకున్నావ్ నన్ను? ఖైరవీలు చేసే వాడిననుకొన్నావా? కట్టు సగం నీవు కట్టు ఇదుగో ఈ సగం నాది కట్టుముందు "

అయిపోయాం అందరం నేనూ, సుజాత, శ్రీనివాసనే, ఆ తండ్రీను

"అలాగే అలాగే, రేపు మీరు ఊరెళ్ళటానికేం లేదుకదా నేనుమినించి తర్వాత తీసుకొంటాలే " అని నేను నసుగుడు

"ఈ కాళోజీకి రేపు డబ్బులెందుకు? నాకు రైలు ప్రయాణం ఫ్రీ, రైలు దిగి సరాసరి నడిచెళ్ళి పోతానింటికి! ఈ నీరెండొందలూ తియ్ "

అలా కాళోజీ చేత డబ్బులు కట్టించాం మిత్రుడూ నేనూ

✤ ✤ ✤

ఒక కంట కన్నీరు ఒక కంట పన్నీరు ▪ హాస్యమే లేకపోతే కాళోజీని కాళోజీ ఆగ్రహాన్ని భరించటం కష్టం కాళోజీకి అన్నీ కావాల అందరూ కావాలి ఆయన త్యాగి కాడు అవసరమయినపుడు తప్ప ఆయన భోగి, మంచి గ్లాస్కో ధోవతులు సిల్కులాల్చీలు ఇష్టమైన పద్ధతిలో భోజనం చుట్టూ మనుషులు ఉండాలి భోజనమూ మాట్లాడటమూ రెండూ వేరు వేరుకావు తొందరగా భోజనం చేయండని మనం సైగలు చేసామా మనం అయిపోయామే చేతులెండి పోతున్నా ఇంకా ఏదో తింటూన్నట్టు నటించాల్సిందే జొన్నరొట్టైనా ఒకటే ప్లమ్‌కేకయినా ఒకటే

✤ ✤ ✤

మా ఇంటి ముందున్న వరండాలో ఉయ్యాలపైనా, పక్కనున్న అరుగుపైనా నుంచునీ కూర్చునీ గుండ్రంగా ఓ 25 మంది పట్టారు ఓ చిన్న ఫొటోలో ఫోకల్ పాయింట్ కాళోజీ, ప్రక్కనే ఆయన మనమడు ఇన్నాళ్ళుగా కాళోజి లొంగి పోయింది ఆమనుమడొక్కడికే, వేణు కూడ గమనించాడిది ఇంకేం, కాళోజీని ఆట పట్టించాడు

సభ అయిపోయిన ఆరాత్రి మా డాబా మీద విందు భోజనం ఓ పదిమందిమి మిగిలాం చంకలో సీసాపెట్టుకొని స్టైల్ రానేవచ్చాడు కదా ఎంతరాత్రియినా కబుర్లయిపోవాలి కదా, యగళ్ళంచు కృష్ణ అన్నీ వింటాడు నాకంటే

"బాబూ కాసేపు విను 'అంటే వినడు రామమోహనరాయ్, వేళ్ళు విదిలిస్తూ కొటేషన్ల మీద కొటేషన్లు అక్కడికి కాళోజీ నాఒక్కడి ప్రాపర్టీ అయినట్లు నేనో పోజు తగాదా సర్దటానికి రామకృష్ణ

మనమడు ఒచ్చేసాడు కిందనించి డాబామీదికి నిద్రకొచ్చేసాడు కదా అలా కాళోజీని జయించింది మనుమడొక్కడే "ఇఫ్ యు లైక్ యువర్ డాటర్, డ్రింక్ ఓన్లీ వాటర్" కదా!

✤ ✤ ✤

వావిలాల గోపాలకృష్ణయ్య గారినీ కాళోజీని ఒకే వేదికమీద చూడటం ఒక అనుభవం ఎన్ని సామ్యాలున్నా

ఒక అసామాన్యత కాళోజీది ప్రజలు, మనుషులు లేని రాజకీయ సిద్ధాంతాలు అవి మౌలికంగా ధర్మబద్ధమే అయినా ఆదర్శపూర్వకమైన విప్లవ సిద్ధాంతాలయినా ఆ నైతికతలో ఆ ఆదర్శంలో మానవత్వం లేకుంటే ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు' అని కంఎంచి పోయే వాడుకాడు కరుణా కాతరుడు కాళోజీ

ఇదీ నా గొడవ కాళోజీ అసంపూర్ణ ఆత్మ కథ గ్రంథాన్ని ప్రచురించే విషయంలో ఎందరో ఎన్నిరకాలగానో శ్రమించారు 'నా గొడవ'లుగా కాళోజీ కవితా గ్రంథాలు అచ్చాయి అభిమానులందరికీ ఉచితంగా పంచబడ్డాయి 'ఇదీ నా గొడవ' పుస్తక ప్రచురణ సమయంలో నా శ్రమఅల్లా 'ఇదీ" అనే పదాన్ని అయన అనుమతీ ఎవరి అనుమతీ లేకుండానే అచ్చులో చేర్చటం

కాళోజీని ఎక్కడ ఫిక్స్ చేయాలన్నా ఇమడడు ఓ వేపున జిబ్రాన్ మరో సమయంలో రూసో ఒక్కోసారి మ్యాగో హృదయంనిండా గాంధీ తనువంతా మావో జయప్రకాష్ పై అరాధన అదే మొదటి సారి చదువుతున్నట్లు పుస్తకాల అరల్లోంచి షేక్స్పియర్‌ని లాగి యాంటనీ ఆరేషన్‌ని పైకి చదవటం ఎంత ప్రముఖుడైనా సరే సమకాలీన కవిపై ఖడ్గధార బెర్నార్డ్ షానీ బెట్రండ్ రసెల్‌నీ చదివావా లేదా అని నిలదీయటం మాండలికాల మీద ప్రేమ యాస మీద మమకారం కెలైడో స్కోప్‌లో క్రిస్టల్స్‌ని నింపి చూస్తే రకరకాల కిరణాలు వజ్ర కాంతులీనుతూ అందరికీ ఇష్టం కాని ఒక్కొక్కరికి ఒక్కొక్క కాళోజీ ఇష్టం

కొద్ది కాలమే అతిథిలాగా వచ్చాననీ అలాగే అతిదిలానే వెళ్ళి పోతాననీ అన్న కాళోజీ ఎన్నెన్నో ఇళ్ళలోంచి ఏదో ఒక వస్తువు కాజేసే వెళ్ళిపోయాడు మనం చూస్తూండగానే మనం మన వస్తువుల్ని జాగ్రత్త చేసుకొంటూండగానే కాకపోతే మన చిన్న చిన్న వస్తువులకు బదులుగా ఒకగొప్ప మానవత్వాన్నిస్తూ! శరీరాన్ని కూడ మిగిల్చిపోయి!!

---

కాళోజీతో మాట్లాడటం ఇంట్లో ఓ పెద్దవాళ్లతో మాట్లాడినట్టుగా వుండేది

చివరి చూపు

ఇదో సెంటిమెంట్ అనేవాళ్ళు వుండవచ్చు

కానీ

ఆఖరి చూపు చూడటం అనేది

మనిషి పుట్టినప్పుడు చూసినట్టే

కాలోజి గారిని చివరి చూపు చూడటం నా అదృష్టం

**- జింబో (కవి)**

**సీనియర్ సివిల్ జడ్జి**

**కొత్తగూడెం**

# అసంఖ్యాకులకు ప్రేరణ కాళోజీ సముద్రం

-రహమతుల్లా

సముద్రం ముందు కూర్చోవటమంటే

వేల అనుభవాల సమరగీతాల

పంక్తుల్లో కూర్చున్నట్లే

చిరుపాప ధవళహాస స్వప్నాల

వాకిట్లో కూర్చున్నట్లే

కాళోజీ గురించి సముద్రం ముందు కవితలోని దర్భశయనం వాక్యాలవి

ఆ మహాసముద్రంతో నాకున్న కొద్ది పరిచయం నుంచి రెండు మూడు సంఘటనలు

కారులో సిద్ధిపేట్ పోతున్నాం మంజీర రచయితల సభకు దర్భశయనం కాళోజీని తీసుకెళుతున్నాడు నేను కూడా వారితో ఉన్నాను దర్భశయనం 'మళ్లీ పిల్లాణ్ణై కవితలో జరపదిలం కొడుకా' అనే ఒకటి రెండు పదాలు మాత్రమే తెలంగాణా భాషలో ఉన్నాయి కవితంతా ఆంధ్రప్రాంత భాషలో ఉన్నది నువ్వు తెలంగాణా వాడివి మొత్తం కవితంతా తెలంగాణా భాషలోనే రాయొచ్చుకదా అని కాళోజి గారు తన ఆవేదనను ఆక్రోశాన్ని వెలిబుచ్చుతున్నారు నేను బ్రాహ్మణుడను పైగా పోస్టు గ్రాడ్యుయేషన్ దాకా చదువుకున్న తెలంగాణా వాడిని కనుక నాకు తెలంగాణా భాష కన్నా సంస్కృత పదాలు పుస్తకాల భాషతోనే పరిచయమెక్కువ, ఆ పరిచయం భాషా ప్రభావం నుంచి బయటపడలేకపోతున్నాను అని దర్భశయనం చెప్పున్నారు వారి మధ్యలో నేనేదో అసందర్భంగా - భాష గురించి ప్రస్తావించాను అంతే నా మీద నిప్పులు చెరిగారు"ఎవడ్రా నువ్వు? ఎక్కడోనివిరా నువ్వు?" అని నేను బిత్తర పోయాను ఆశయాల పట్ల, విలువల పట్ల మనుషులు అంత సీరియస్‌గా ఉంటారని అప్పటి వరకూ నాకు అనుభవం కాలేదు 'కాల్లో ముల్లు గుచ్చుకుంటే 'అమ్మ' అంటాం గానీ మమ్మీ అనం మన భాష మనకు సహజంగా వస్తుంది - కానీ మనమే అంటే రచయితలు, కళకారులే అసహజంగా కృతకంగా మన జీవితాల్లో కళల్లో ఉంటున్నాం మనల్ని మనమే కాక పాఠకుల్ని కూడా మోసం చేస్తున్నాం 'అని నా మీద నిప్పులు చెరిగిన మనిషే కన్నీళ్లు కార్చాడు అలవి కాని కోపం అలవి కాని ఆత్మీయత అతి సహజగుణాలు

సుమారు 50 సంవత్సరాల నుంచి ప్రతి రెండవ శనివారం మిత్రమండలి సమావేశం తప్పక జరుగుతుంది ఓ ఐదుసంవత్సరాలు (96 00) దానికి హాజరయ్యే అదృష్టం లభించింది ఒక మిత్రమండలి సమావేశానికి నేను అలస్యంగా ఏడున్నర ఎనిమిది గంటలకు పోయాను పెద్ద గాలివాన పెద్ద తుపాను ఎవ్వరూ రాలేకపోయారు రామశాస్త్రి కూడా దవాఖానకు పోయారు ఏదో పనిమీద కాళోజీ గారు ఎప్పటి మాదిరే మా కొరకు ఎదురు చూస్తున్నారు మిత్రమండలి సమావేశపు రోజె వారికి పండగ రోజులా ఉంటుదనుకుంటాను కొత్త బట్టలు వేసుకుంటారు ముఖంలో రోజు మాదిరి కన్నా ఇంకాస్త ఎక్కువ వెలుగు కనిపిస్తుంటుంది

నేను ఒక్కడ్నే గద ఇంకేం సమావేశంలే అనుకున్నాను ఓ రెండు గంటలు అనర్గళంగా అతని కవితలు ముఖ్యంగా ప్రేమకవితలు చూడకుండా విన్పించారు అది తలచుకుంటే ఇప్పటికీ ఆశ్చర్యపోతుంటాను మా ఇద్దరితో ఆ రోజు సమావేశం అలా జరిగింది ఇద్దరుండి ఓ చాప ఉంటే చాలు మిత్రమండలి జరుగుతుంది కాళోజి గారు కన్పించరు, కనీ ఎంతో సమర్థులైన ఆర్గనైజర్ వారు మా లాంటి వారిని మిత్రమండలిని అలా తయారు చేసి వదుల్తారు అప్పుడప్పుడు కాళోజి లోగిల్లోనే ప్రత్యేకమైన సభలు జరిగేవి షాద్‌గారి సంస్మరణ లాంటిది టీలు, స్వీట్లు అందరూ తీసుకున్నదీ లేనిదీ, కుర్చీలు అందరికీ ఉన్నవి లేనిదీ కూర్చునే డైరక్షన్లు స్థలాలు అన్నీ చూసుకుంటున్నప్పటికీ దర్భశయనం, పొట్లపల్లి శ్రీనివాసరావు, రాజేందర్‌రాజు, రమణ, అన్వర్, జితేందర్, విద్యార్థి, రామశాస్త్రి తప్పక మిత్రమండలి రోజున కలుస్తాం మిగిలిన రోజుల్లో ఎవరికి వీలు దొరికినప్పుడల్లా వాళ్లు వెళ్తుంటారు రామశాస్త్రి రోజూ సముద్రం నుంచి నీళ్లు తెచ్చుకున్నట్లే ఏదో ఒక విషయం తేలేస్తుంది, ప్రేరణ పొందుతాం అంతేగాక వారికిష్టమైన మేమూ మా

మాటలు వారి ఆరోగ్యాన్ని పెంచుతాయని కూడా లోపల్లోపల అనుకునే వాళ్లం తరచుగా ఆయన చెప్పే విషయాలు

జీవితంలో ఏదీ పర్ఫెక్ట్ కాదు ప్రతీది ప్రయోగదశలోనే ఉంటుంది కాళోజి పదే పదే చెప్పే సారాంశాల్లో అదొకటి నన్ను చాలా వరకు ఆత్మన్యూనత నుంచి బయటపడేసిన వాక్యం

మతాలు శాస్త్రాలు పార్టీలు ఏవైనా సరే అంత ప్రధానమైనవి కావు బతుకు అన్నింటికన్నా బలీయమైంది

1 నేరం చేసే అవకాశం ఉండరాదు

2 నేరం చేయాల్సిన అవసరమూ రాకూడదు

హింసకు ప్రతిహింస పుణ్య కార్యక్రమమని తరచుగా చెప్పేవారు ఉదాహరణకు ప్రహ్లాదుడు హిరణ్యకశివుడు కథని ఎంతో వివరంగా ఆధునిక సమాజంతో జోడించి చెప్పేవారు నరసింహుడు దేవుడైప్పుడు నక్సలైట్లు ఎట్లా కాకుండా పోతాడు? అని మాలో ప్రశ్నను లేపేవారు

నోరు తెరిస్తే చాలు అసంఖ్యాకంగా అమూల్యమైన విషయాలు ఎన్నో జారిపడుతుండేవి ఏరి భద్రపరచుకోలేక నానా తంటాలు పడేవాళ్లం

ఖలీల్ జిబ్రాన్, రోమరోలాలను బాగా ఉదహరించేవారు మోటు భాషలో సైతం ఎన్నోవిని నవ్వలేక చచ్చేవాళ్లం

నిరంతరం మనిషి మనస్సును ప్రక్షాళన చేసుకుంటూ ఉండాలి దంతాలను నిత్యం శుభ్రపరచుకున్నట్లు దొడ్డికిపోయినప్పుడల్లా ముడ్డీకడుక్కునట్లు, రోజూ ఇల్లూ వాకిలీ ఊడ్చుకున్నట్లు

రమణమహర్షి, జెకె రజనీష్ లాంటి వారిని చదివి అయోమయంతో కాళోజీని కలసినప్పుడు ఇట్లే అన్నీ స్పష్టం అయిపోయేవి

నా కవితకు అటా బహుమతి వస్తే పిలిపించుకుని స్వయంగా మిఠాయి తినిపించాడు నాకొడుకు తన ఫొటో చూసి బుడ్డా దోస్త్ అన్నందుకు సంబరపడిపోయి పెన్ ఫ్రెండ్‌షిప్ చేస్తున్న అల్ప సంతోషి, బచ్చాదోస్తే కాళోజి ఇసంటి చిన్న చిన్న పర్సనల్ విషయాలను శ్రద్ధగా పట్టించుకునే ప్రేమమూర్తి ఇటీవలి కాలంలో అతనికి బాగా నచ్చిన కథ ఖదీర్ బాబు రాసిన దూద్ బఖష్

నా దగ్గరే నాలుగైదు సార్లన్నా ఆ అమ్మను తలచుకుని కాళోజికండ్లు జలజల వర్షించాయి

మతాంతర వివాహం చేసుకున్న కొడుకు తల్లిని బురఖా తీసి ఇంటికి రమ్మనమనే సన్నివేశం నాకథ అమ్మీజాన్‌లో ఉంది అది తలచుకున్నప్పుడు కూడా ఆయన అంతే

ఎప్పుడు కలిసినా తను చదివిన కథలో మంచి విషయాలు దిండుకింద నుంచి తీసి చూపించేవారు విశ్లేషించేవారు

ఏ సమయంలో పోయినా ఒక్కడే పత్తాలాడుకుటూనో, క్రికెట్టు చూసుకుంటూనో పుస్తకాలు చదువుకుంటూనో ఉండేవారు పగలు పడుకుంటే రాత్రి నిద్రరాదని పడుకునేవారు కాదు పోగానే తలెత్తి ఒక్క క్షణం చూసి నవ్వుతూ చేయి చాపి రహమత్ అనే వారు

మీ దోస్త్ పొట్లపల్లిరామారావు ఊరు తాటికాయలకు పోయి వస్తున్నాను అంటే చాలు చేయి దగ్గరకు తీసుకుని అన్ని విషయాలు అడిగి మరీ చెప్పించుకునే వారు నేను పుస్తకం తీస్తే తాటికాయల విషయాలన్నీ ఎక్కడో ఒక చోట రాయమనేవారు ప్రతి మనిషీ 'నా' నుంచి 'మా' కు మా నుంచి 'మనకు' త్వరత్వరగా చేరాలని పదే పదే చెప్పుండేవారు

ఒక్క సారి నాతో ఇలా అన్నారు

పెద్దవాళ్ల గొప్పతనమంతా వాళ్ల ప్రవర్తన లోనే ఉంటుంది వాళ్లు మనుషుల్తో ఎట్లాంటి సంబంధాలను కల్గి ఉన్నారు ఏ ఏ సమయాల్లో ఎట్లెట్లా ప్రవర్తించారనేదే ముఖ్యం ఏమీ చెప్పారనేది గొప్పతనాన్ని తీసుకురాదు

రెండు విషయాలు మనిషికోల్పోకూడదు అనేవాడు
వ్యక్తిత్వాన్ని స్వేచ్ఛగా అలోచించటాన్ని
ఇటీవల కలసినప్పుడు ఒక మాటన్నారు
మనస్సు చెప్పేది శరీరం చేయలేకపోతున్నది
శరీర స్థితిననుసరించి మనస్సు ఉండటం లేదు
శరీరానికి మనస్సుకు సమన్వయం కుదరకపోవటం
ప్రస్తుతం నా స్థితి

13 11 02న ఆ స్థితి నుంచి విముక్తి పొందిన మహామనిషి కాళోజికి ఇదే నా నివాళి

★

# బతుకు వందనాలు

- తెల్లపల్లి రాంబాబు

క్రిస్మస్ తాత ఉన్నాడో లేదో నిజంగా కానీ కవిత్వానికి స్ఫూర్తికి ఏ రంగు పులమక, ఏ హద్దూ పెట్టక కబుర్ల ఖజానా నుండి అలవోకగా మన మనసుకు బహుమతులుగా ఇచ్చే అసామాన్య సామన్య మనీషని కాళోజి తాతయ్యను చూస్తే అనిపిస్తుంది సామెతల్ని, మాండాలికాల్ని మనసారా ప్రేమించిన వ్యక్తి ఆయన

దాదాపు డెబ్బై(70) ఏళ్ల తన సాహిత్య జీవన పయనంలో మనం గొప్ప గొప్ప వ్యక్తులుగా చెప్పుకొని గర్వపడుతున్న ప్రతి సాహితీకారుని ఎదిగినతీరు, వ్యక్తిత్వాన్ని, అనుభవాల్ని, అనుబంధాల్ని ఎలాంటి వారి కైనా ఇంతకుమించిన ఇన్ఫర్మేషన్ బహుశా ఎందరి ఎన్ని జీవిత చరిత్రలు తిరిగేసినా దొరకవేమో!

వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడం, ఎదుగుతున్న కొలది ఒదిగి ఉండటం, మనిషి మనసు నాడి తెలిసిన మానసిక వైద్యుడు కాళోజి తాతయ్య ఉద్యమాల్ని, ముల్లదారుల్ని ఎన్నో అమానవీయ ప్రకృతి వైపరిత్య సంఘటనల్ని చూసినపుడు కొంతకాలం తరువాత మనిషికి జనరల్‌గా గుండెమొద్దుబారడం అంటే కాంప్రమైజ్ కావడం చూస్తునదే కానీ ఇంకా ఇంకా చిన్న సంఘటనలకే చలించి కన్నీరు కార్చి ప్రజలకోసం ఏడ్వడం అంటే ఏమిటో, ఆ కన్నుల్లోని కన్నీళ్లు ఎంత హుందాగా ఉంటాయో, ఎదుటి వ్యక్తినేవిధంగా ప్రభావితం చేస్తాయో ప్రత్యక్షంగా చూడవలసిందే

కాళోజి తాతయ్యను పరిచయం చేసి ఆయనకు దగ్గరయ్యే భాగ్యం కలిగించిన మిత్రమండలి ఆయనకు అత్యంత ఇష్టమైన సందర్భం మేమంతా ఆయనలోకి లోలోకి తొంగిచూసే ప్రతి ముచ్చటా అచ్చటా ▪ సందర్భమే ఏ బెరుకూ లేకుండా నిర్భయంగా ఆయన్ని కూడా విమర్శించగల ధైర్యం ఇక్కడెవ్వరైనా ఒక్కటే అన్న స్వేచ్ఛ అహాన్ని తగ్గించి, తప్పొప్పుల్ని నిర్భయంగా ఒప్పించి, ఒప్పుకునే పాఠాలు ఇక్కడ తప్ప మరెక్కడా నేర్చుకోలేం మరెప్పుడూ అందుకు అంగీకరించడేమో!

ఇప్పుడా ధైర్యం ఇవ్వగల వ్యక్తులెవ్వరు? తాను లేకున్నా ఆ స్ఫూర్తిని, ఆ లక్షణాల్ని మాలో నింపి ▪ మిత్రమండలి సందర్భంలోనైనా అందరమొక్కటై స్పందించుకునే కాలాన్ని మాకు ఆయన జ్ఞాపకంగా ఇచ్చాడని సముదాయించుకొనే సందర్భం వచ్చినందుకు భాధగా ఉన్నా, ఆయన ఆశయాన్ని నడవడానికి మరింత సన్నద్ధం కావాల్సిన తరుణమిది

చివరగా

అందరూ పట్టు పరుపుల మీద, మిద్దె మేడల్లో బతకాలని కోరుకుంటే కాళోజి మనుషులమధ్య, మాటల మధ్య నైతేనే బతకగలనని చివరి వరకూ మొత్తుకొని, చేసేది లేక మొరాయించి ఆయన హృదయం కె యం సిలో ఆయనున్న గదిలో కూడా నాపక్క నిన్ని శవాలైనా ఉంచండి వాటిని నిద్రలేపి ఎలా మాట్లాడాలో నాకు తెలుసనే మొండి మనిషాయన మనసున్న మానవీయ స్పందనగల మహనీయుడాయన

తాతయ్య నీకు బతుకు వందనాలు

# అన్యాయాన్ని ఎల్లవేళలా ప్రశ్నించినవాడు

నాగిళ్ళ రామశాస్త్రి

Every Nation patronises a lie and calls it as its ideal It swu and then on wards it be comes its phylosophy and every thing Only a few people not all that too in the moments of their free thought will wise above that and speak truth సరిగ్గా ఇవ్వే పంక్తులు కావేమో (కాళోజీ లేని స్థితిలో ఏదీ మనసులోకి రావటంలేదు) ప్రతి జాతీ దేశమూ ఒక అసత్యాన్ని అవాస్తవాన్ని పాట్రనైజ్ చేసి దీన్నే తన ఆదర్శంగా ప్రకటిస్తుంది అది మాగి మాగి ఆ తర్వాత ఆదేశపు తత్త్వం ఆదర్శము మరెన్నోగా మారుతుంది కొంత మంది అందరూ కాదు కొన్ని క్షణాల్లో అదీ అన్ని సమయాల్లోకాదు తాము స్వతంత్రంగా ఆలోచించగలిగే కొన్ని క్షణాల్లో ఆ అవాస్తవ స్థితి నుంచి పైకెదిగి, మాట్లాడి ప్రశ్నించకలుగుతారు

ఈ వాక్యాన్ని తరచూ కాళోజీ quote చేసేవాడు అట్లాఅని, కనీసం రచయితలు, కవులు కళాకారులనబడే వాండ్లైనా ఆ విధంగా మాట్లాడలేక పోతున్న దౌర్భాగ్య స్థితిని గరించి ఆవేదన పడేవారు కాని కాళోజీ కొన్ని క్షణాలు కాదు, తన జీవితమంతా అట్లాగే పాలకవర్గాల కుహనా ఆదర్శాలను, దౌర్లతనాన్ని బయటపెట్టి ప్రశ్నించాడు ఏనాడు రాజీ పడలేదు

అసమ్మతి, నిరసన ధిక్కారం, తన తత్త్వం అని చెప్పేవాడు తన రచనలు తన జీవితం వేరు వేరుకాదని నిరూపించినవాడు జీవితమంతా, మనిషి తత్త్వంకోసం పరితపించి ఆరాటపడ్డవారు మానవుడు మానవుని మానవుని మాదిరగ మన్నించలేనంత మలినమైనాదిజగతి' అని విచారించేవాడు

నేనింకా 'నానుంచి మావరకే రాలేదు, మన అన్నపుడు గదా చింత' అని మనిషి 'నా'ను వదిలి మన వైపు ప్రయాణించాలని అనేవాడు అట్లాగే జీవించినవాడు అనవరతా మానవత్వంకై తపించినవాడు

అన్యాయాన్ని ఎల్లలేళలా ప్రశ్నించినవాడు

90 ఏండ్ల జీవితంలో బాల్యం విడిస్తే ప్రజల్ని విడిచి ఎన్నడూ ఆయన ఉన్నదిలేదు ఇంత దీర్ఘకాలం పోరాట యోధుడిగా కొనసాగడం ఎవ్వరికీ కాళోజీకి తప్ప సాధ్యంకాదు కాలోజీ కాళోజీయే కాళోజి లేని స్థితిని ఊహించుకోవడం కష్టంగా ఉన్నది కొన్నాళ్ళ క్రిందట పెద్ద కాళోజీ సంస్మరణ సభగురించి మాట్లాడుతూ 11 నవంబరు అన్న గారి సంస్మరణ సభ జరిగినాకా మనకింకేం పనిలేదు అంటే దాని పర్యవసానం ఇది అని ఊహించలేదు

కాళోజీ అనేవారు బతుకు తప్పదు, బతక్క తప్పదు న్యాయం తప్పుతుంది, ధర్మంతప్పంది కాని బతుకు తప్పదు అని కవిత్వమంతా బతుకు పోరాటం, ప్రశ్నలు మానవత్వం గురించే, నిలువెత్తు మానవతామూర్తి కాళోజి

కాళోజీ తోడునీడ రామశాస్త్రి అని కొందరనేవాండ్లు, కాళోజి లేడు ఇక నీడ ఎక్కన్నుంచి వుంటుంది నా స్థితి అది

ఏది ఏమైనా, కాళోజీ వంటి మనిషి ఇది వరకుండే వారోఏమోకాని ఇకముందైతే వుండరని నిస్సందేహంగా చెప్పవచ్చు

జరిగిందంతా చూస్తూ, ఎరగనట్టు పడివుండగ సాక్షీభూతున్ని కాదు సాక్షాత్తూ మానవున్ని అని చెప్పిన కాళోజీ సాక్షాత్తూ మానవుడు మనిషి ఆయనలేని నన్ను ఊహించుకోలేను వరంగల్లును తెలంగాణను, ఊహించలేను

ఎన్ని మాటలు చెప్పినా కాళోజీని రూపుకట్టించలేవు మాకాకకు, కాళోజీకి కన్నీళ్ళ జోహార్లు

# సుబ్బన్న : కాళన్న

రాధాకృష్ణ కోమన్న

9 9 1914న 13 11 2002 ఏమి జరుగుతుందో తెలియదు

కాని రెండు యాదృచ్ఛికాల మధ్య సాగిన జీవనది ఓ తేజో రాశి ఓ కర్మయోగి ఏమయ్యిందీ తెలుసు

ఏం కావాలో నిర్దేశించారు అచ్చం అలాగే జరిగింది

చూపు నిలిచింది కాయం పరిశోధనాలయంలో పదిలం

నోరు లేని వాళ్ళకు నోరై, దారిలేని వాళ్ళకు దారై సాగావు కాళన్నా!

ఈ రెండూ కొంచెం తెలుసుననుకుని విఱ్ఱవీగే వాళ్లను వెఱ్ఱివాళ్ళనే చేసావు

అన్న' బాటనే నడిచావు

ఎప్పుడూ అంటుంటే వాడివి

Victor s Victory is complete when the chained hugs the chains by which he is bound

రంకెవేసిన గిత్త, మచ్చికై తనంత తాను కాడివేసుకుని బరువుమోసే దృశ్యమే గుర్తుకొస్తుంది ఇది తలపుకొచ్చినప్పుడు

మోయడం తప్పదు కానీ నువ్వు స్ఫూర్తినిచ్చావు నియంత్రించి తెలివితో బతకమన్నావు

రామప్ప దేవాలయం చూపించావు చేరువలో గెస్ట్‌హౌస్ ఎదురుగా ఓ పెద్ద సరోవరం

కొత్త మిత్రులు కొత్త ప్రదేశం రామేశం గారు, ఫోటోగ్రాఫర్‌ను గురించి 'కవిత' చదువుతుంటే కడుపుబ్బ నవ్వడం సంక్రాంతి మిత్రులు మరిచిపోరు

మంచం చుట్టూ బట్టలు, వాటి మీద అరగా ఆరగా నీళ్ళు, గ్రీష్మతాపాన్ని కొంచెం

తాళలేని నువ్వు ఎంతమందికి సేదతీర్చావు ఎంతమందికి తట్టుకోలేని తాపాన్ని సృష్టించావు

తెల్లవారుతూనే సత్రంపాడు ఇంటి తలుపు తట్టి ఎలా వున్నారని పరామర్శించావు

అంతకు ముందు రాత్రి పట్నూరు రామబ్రహ్మం గారింటికి రావడం అప్పుడు గాని తెలిసింది కాదు

ఏలూరు వస్తే మిత్రులందర్నీ కోరి, చూసి, పలకరించి కుటుంబ సభ్యులందర్నీ అడిగి వెళ్ళేవాడివి నీవెప్పటికీ ఈడు రాని పసివాడివే నువ్వు లోకానికి అన్నవు కాని, అసలు అన్నచాటు బిడ్డవు

సంక్రాంతి మిత్రుల సమావేశాలు

రెండురోజులు అన్నీ మరచి ఆత్మీయంగా అందరం కలిసి పండగచేసుకోవడం స్మృతి శకలాలైపోయాయి

కాలం విసిరేస్తుంది మన వెంకటసుబ్బయ్యగారిని, సంజీవదేవ్ గారిని, కనక రామబ్రహ్మం గారిని

పెడసనగల్లు చౌదరి గారిని, కొవ్వలి మిత్రులను ఏలూరు డాక్టర్ స్వామి గారిని

అన్నింటినీ మించి బీవిని, పల్ల సుబ్బారావు గారిని పరామర్శించు

మొదట పల్లా వారింట్లోనే ఏలూరు వాళ్ళం 'గొఱ్ఱె' బ్రతుకు గ్రహించింది

'బాపు'ను గురించి తలచుకోవడం నేర్చింది నీ కంట తడి ఆరేది కాదు

రామశాస్త్రి పంపిన పుస్తకం 'నా గొడవ' నాకందేవరకు ఆరా తీస్తూనే వున్నావు

ఆ పుస్తకం బట్వాడా ఓ నెల ఆలస్యమయ్యే సరికి పదేపదే
గుర్తు చేసావు

చేరే వరకు నిద్రపోలేదు 31 7 02 తేదీ పుస్తకం నెల
తర్వాత నీపుట్టిన రోజుకు కొద్ది రోజుల ముందు వచ్చింది

వచ్చిన రోజే విజయవాడ వెళ్ళి మిత్రులకు చూపి
చూసస్తామంటే ఇచ్చాను కాదు

గుంటూరు లంకా సూర్యనారాయణగారితో కలిస
నీ జన్మదినం రోజున నిన్ను చూద్దామని

నువ్వనుకుంటే చేసేవరకు నిద్రపోవు నిద్రపోనివ్వవు

మేము ఇదిగో అంటే ఆర్నెల్లు సంవత్సరాలు

నా గొడవ 75లో ఆరంభించి ఎమెర్జన్సీ పుణ్యమా
అని 77లో విడుదల చేసింది మేమే కదా

ఓ చిన్న పుస్తకం రెండేళ్ళ తర్వాత

అందులోనే మనతరం వేమన్న మన కాళన్న అన్నది
చెప్పుకున్నాం

మిత్రుల అష్టావధానం జరుగుతుంటే అవధాని గారి
వెంట వచ్చిన నేను ఆగస్టు 2001లో

మిత్రుడు ప్రొఫెసర్ పులిరాజుతో కొన్ని క్షణాలు
హనుమకొండలో మీ దగ్గర

వయో భారంతో స్మృతులు పోరాటంలో మీరు

మిమ్మల్ని చూస్తూ మేము ఇపుడు మమ్మల్ని చూస్తూ
మీరు

కనిపెట్టి చూడండి కనికరించండి

'కదలిక లో చైతన్యాన్నంతా ప్రసాదించండి

అన్నా! ఇప్పుడూ ఎప్పుడూ మీది విశ్వదృష్టే కదా!

❖❖❖

# ఓ 'మొగ్గ' జ్ఞాపకాల్లో కాళోజీ తాత!

మొగ్గకు!

'మొగ్గ'లో కాళోజీ తాతయ్య వ్యాసం చదివాను, పోయిన సంవత్సరం కావచ్చు (నేను 'మొగ్గ' గా ఉన్నప్పుడు అనే శీర్షికలో) అప్పుడు ఫొటొ కూడా వేశారు అది చూసి మీ 'బుడ్డాదోస్త్ ఫొటో వచ్చింది అని మా నాన్నకు చెప్పాను మా నాన్నకూడా కథలు రాస్తాడు బుడ్డాదోస్త్ అన్నదుకు కాళోజీ తాతయ్య చాలా సంబరపడ్డాడట అది విని నాకు ఉత్తరం రాయాలనిపించింది కానీ అప్పుడు రాయలేదు ఈ మధ్య ఆగస్టు నెలలో రాశాను వెంటనే నాకు రిప్లయ్ వచ్చింది నాకు ఎంతో ఆశ్చర్యం, ఆనందం, గర్వం కలిగాయి అంత గొప్ప కాళోజీ ఎంతమంచి మనిషో కదా, అతని మరణ వార్త విని నాకు రాసిన రిప్లయ్ మీకు చూపించాలనిపించింది అందుకే అతను రాసిన 13 8 2002 ఉత్తరం జత చేస్తున్నాను

-మేరాజ్, 10వ తరగతి,
హైదరాబాద్

కాళోజీ,
బచ్చాదోస్త్
నేస్తం మిరాజ్‌కు

కాళోజీతాతయ్య,

నీ ఉత్తరం అందింది చాలా సంతోషం మీ నాన్న అమ్మ పెద్దవారు వాండ్లతో మనకేం పని మనం మనం మాట్లాడుకోవచ్చు మీ నాన్న ఇక్కడున్నప్పుడు చెప్పినా పిల్లలను చూపించుకు మళ్లీ తీసుకును రానేలేదు నీకునట్లునైతే నన్ను చూడాలని ఉన్నదో, నాకూ నిన్న చూడాలని ఉన్నది వీలయినప్పుడు వచ్చి ఈ బుడ్డాదోస్తును చూసి పో బాగా చదువుకుంటున్నావు గదా

అమ్మను నాన్నను, మిగిలిన కుటుంబ సభ్యులను నందరిని అడిగినాని చెప్పు, తప్పని సరిగా వచ్చి చూచిపోవాలెను మరి

నీ

# మానవతావాది మా కాళోజీ

డా॥ జి లక్ష్మణ్

కాళోజితో నాకు పరిచయము ఏర్పడ్డది 1987లో 1983 మరియు 1985లలో జరిగిన శాసనసభ ఎన్నికలు ఆ పిదప జరిగిన స్థానిక సంస్థల ఎన్నికలను నిశితంగా పరిశీలించిన మేము ఒకింత ఆశ్చర్యపోయాము ఎందుకంటే ఆ ఎన్నికల్లో చాలామంది స్థానికేతరులు తెలంగాణాలోని వివిధ నియోజకవర్గాల్లో ఎన్నికల బరిలోకి దిగడం మా అందరిని కలవర పరిచింది తెలంగాణాలోని వనరులన్నింటిని కొల్లగొట్టి ఇక్కడి ఉద్యోగాలను కాజేసి అంతిమంగా ఈ ప్రాంతాన్ని ఒక కాలనీగా మార్చిన కోస్తా ఆంధ్రులు చివరకు ఇచ్చటి నుండే చట్టసభలకు ఎగబాకాలనుకోవటం చూసి మేమెంతో కలత చెందాము ఈ స్థానికేతరులకు తెలంగాణాకు ఉన్న సంబంధము ఏమిటి? దోపిడీని నిరంతరంగా అన్ని రంగాలలో కొనసాగించాలనే కుట్రలో భాగంగానే వారు ఈ ఎన్నికల బరిలోకి దిగారు లేకుంటే హిమాయత్ నగర్ ఉపేంద్రకు, సనత్ నగర్ కాట్రగడ్డ ప్రసూనకు, రేణుకా చౌదరికి బంజారహిల్స్‌కు ఉన్న సంబంధము ఏమిటి? వీరెప్పుడైన ఈ ప్రాంతప్రజలతో మమేకమైనారా? ఈ ప్రాంత సమస్యలపై స్పందించారా? లేక తెలంగాణాలో ఏమన్న అభ్యర్థుల కొదువనా? సరిగ్గా ఈ ఆలోచనా ధోరణియె మమ్ములందరిని 1987లో కాళోజితో కలిపింది 1987లో మొదటిసారి మిత్రుడు ప్రభాకర్ ఇంటిలో కాళోజిని కలిసిన వాల్లం నేను, డా॥ హరనాథ్, డా॥ వినాయక్, ప్రొ॥ మధుసూదన రెడ్డి, ప్రొ॥ జాదవ్ ప్రొ॥ తిప్పారెడ్డి, ప్రొ॥ ఆనందరావు తోట మొదలగు వారం అందరు కలిసి దాదాపు ఐదు గంటల పాటు తెలంగాణా ప్రాంతము వివిధ రంగాలలో ఏవిధంగా ఉమ్మడి రాష్ట్రంలో వివక్షకు గురవుతుందో చర్చించకున్నాము ఆరోజు ప్రారంభమయిన మా చర్చలు దాదాపు పదిరోజుల పాటు నిరంతరంగా కొనసాగినయి అంతిమంగా ఆ చర్చల పిదప అందరం ఒక ఏకాభిప్రాయానికి వచ్చి "తెలంగాణా ఇన్‌ఫర్‌మేషన్ ట్రస్టును' నెలకొల్పి ఆ ట్రస్టు ద్వారా తెలంగాణా వివిధ రంగాలలో ఏవిధంగా వివక్షకు గురవుతుందో తెలిపేందుకు 'మా తెలంగాణ అనే పత్రిక ద్వారా ట్రస్టు కార్యకలాపాలను కొనసాగించాలని నిర్ణయించడము జరిగింది ట్రస్టు కార్యక్రమాలలో భాగంగానే "మా తెలంగాణ" పత్రికావిష్కరణ ఉస్మానియా యునివర్సిటి ఫోరం ఫర్ తెలంగాణ తెలంగాణ స్టుడెంట్స్ ఫ్రంట్‌లను నెలకొల్పి తెలంగాణ రాష్ట్ర సాధన భావవ్యాప్తికై సెమినార్లు సదస్సులను ఉస్మానియా యూనివర్సిటిలోనే గాక తెలంగాణ వివిధ జిల్లాల్లో నిర్వహిస్తూ వస్తున్నాము 1969 70 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం పిదప 1987లో తెలంగాణ నినాదాన్ని మేము మళ్ళీ తెరపైకి తీసుకరావడం జరిగింది అనాటి నుండి మేమందరము తెలంగాణ నినాదాన్ని ప్రజల మధ్యకు తీసుక పోవటంలో మా వంతు కృషని మేము చేస్తు వస్తున్నాము నేనిప్పటికి మరువలేని విషయం కాళోజి గారు ఒకరోజు ప్రభాకర్ ఇంట్లో దాదాపుగా పదిగంటల పాటు ఏకధాటిగా "తెలంగాణ' విషయంపై మాట్లాడిన తీరు ఒక వేళ మేము అరోజుల్లో కాళోజితో మాట్లాడిన విషయాలన్నింటిని టేపు చేసి ఉంటే ఎంత బాగుండేది! కాళోజితో చర్చించిన విషయాలన్నింటిని రికార్డు చేసి ప్రచురించి ఉంటే అది ఒక "తెలంగాణ దర్శనం" అయ్యేటిది కదా!

1987లో కాళోజితో ఏర్పడ్డ పరిచయంతో ప్రభావితుడనైన నేను వారి రచనలను ముఖ్యంగా కాళోజి ఆత్మకథ, నా గొడవ, కథలను చదవడం జరిగింది దీంతో కాళోజి గొడవ ఏమిటో నాకు కొంతవరకు అర్థమయింది కాళోజికి మానవత్వం పరమావధి అని నాకు అర్థమయింది దార్శనిక చరిత్రలో మొదటిసారిగా మానవున్ని కేంద్రంగా చేసి నిర్మించే దర్శనానికి పునాదులు వేసిన మేధావి ప్రొటాగరస్ ప్రొటాగరస్‌తో

ప్రారంభమయిన మానవతావాదం క్రమంగా అభివృద్ధి చెంది వివిధ రకాల మానవతావాదాలుగా పరిణామం చెందింది అయితే కాళోజీ మాత్రం అన్ని రకాల మానవతావాదాలను తనలో విలీనం చేసుకున్న వ్యక్తి మానవుడే అన్నింటికి కొలామానం అనే ప్రొటాగరస్ తాత్విక చింతనను నుండి ప్రశ్నించే స్వభావం ఉన్నవాడె మనిషి అనే ఎం ఎన్ రాయ్ ధోరణిని నుండి ఈ విధంగా వివిధ దార్శనికుల విషయాలన్నింటిని తనలో జీర్ణం చేసుకున్న వ్యక్తి కాళోజి ప్రహ్లాద చరిత్రకు కాళోజి ఇచ్చిన భాష్యంలో ప్రశ్నించె స్వభావము స్పష్టంగా మనకు గోచరిస్తుంది కాళోజి ఉపన్యాసాలలో మరియు రచనలలో ప్రొటాగరస్ కాంట్‌ల దార్శనిక విలువలు గోచరిస్తాయి అందుకె మన కాళోజిది ఒక విశిష్టమైన మానవతా వాదం అందులో వివిధ దార్శనికుల మానవతావాదం ఉంది వారి రచనలన్నింటిలో మొదటి నుండి చివర వరకు మానవతావాదానికి సంబంధించిన కోణం ఆవిష్కరింప బడ్డది అందుకే మానవుని మూర్తిత్వ వికాసానికి దోహద పడని ఏ యిజాన్ని అయినా సరే ఆయన ఈసడించుకొనేవాడు ప్రజాస్వామ్య విలువలకు భంగము కలిగినా పౌరహక్కులకు భంగం వాటిల్లినా ఆతడు సహించె వాడు కాదు ప్రజాస్వామ్యాన్ని ఆదరించినవాడు కావటంవల్లె అతను పార్టీ పాతివ్రత్యంను నిరసించినాడు తెలంగాణా రాష్ట్ర సాధన కోసం తెలంగాణావాదులు చేస్తున్న పోరు తమ బతుకుదెరువు కోసం చేస్తున్న పోరుగా కాళోజి భాష్యం ఇవ్వడంలో మానవతాకోణమే ఇమిడి ఉంది కాళోజికి పిడివాదం అంటె గిట్టదు విశాలాంధ్రలోనె తెలంగాణ అభివృద్ధి సాధ్యమనె వామపక్ష పిడివాద వైఖరిని కాళోజి ఈసడించుకున్నారు ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమముపై వామపక్షాలు అవలంభించిన పిడివాద వైఖరిని ఎండగట్టుతూ కాళోజి రాసిన పాట దీనికి ఒక చక్కని ఉదాహరణ తెలంగాణ వేరైతె కొడవలాడనంటున్నదా? సుత్తె మొత్తనంటుందా? మార్పు మార్కు మారుద్దా? అని ప్రశ్నించిన విధానం వామపక్షీయులను సహితం ఆలోచింపజేసె విధంగా ఉంది ప్రపంచ బాధంతా శ్రీశ్రీ బాధ అయితె కాళోజి గొడవంతా సగటు మనిషి గొడవ కాళోజికి మానవత్వం పరమావధి కాళోజి తమ భాషలో, కవిత్వంలో సరళమైన శైలిని ఎంచుకున్నారు ఒకవేళ కాళోజి సరళమైన శైలిని ఎంచుకోకపోతె నా గొడవ' నాగొడవగానె ఉండిపోయెటిది అది మనగొడవగా గాని, మనిషి గొడవగా గాని మారేది కాదు ఒక దార్శనికుడు మరణించినంత మాత్రాన అతని దర్శనం అంతరించిపోదు కాళోజి ఈనాడు భౌతికంగా మన మధ్యలేకున్నా అతని దర్శనం మాత్రం "మనిషి గొడవగా ' సగటు మనిషి ఉన్నంత కాలం ఉంటుంది

# అక్షర నివాళి

శిరీష్ కౌండిన్య

కాళోజీ మృతి తెలంగాణ జీవితానికి బతుక్కు, సాహిత్యానికి, ఉద్యమానికి చరిత్రకు తీరని లోటు తెలంగాణ ఇంటింటా కాళోజీ బతుకమ్మ వలె తెల్పు బతుకును ఆరాధించే వాళ్ళందరికీ స్ఫటికంలా తెల్పు కాళోజీ అన్యాయాల్ని అడుగడుగునా ఎదిరించినోడు అన్యాయాన్ని ప్రశ్నించినోడు సామాన్య ప్రజల కోసం ప్రతిక్షణం కొట్లాడినోడు అటువంటి మహామనీషికి మూగవోయిన ఒక ధిక్కార స్వరానికి, నిలిచిపోయిన ఒక జీవననది ప్రవాహానికి, ఆగిపోయిన నిరంతర అక్షర వర్షానికి, ముగిసిపోయిన ఒక మహోజ్వల చరిత్రకు ఇదే నా అక్షర నివాళి

# పెద్ద దిక్కును కోల్పోయిన తెలంగాణ

- పరవస్తు లోకేశ్వర్

"కాళోజీ నువ్వు చూడలేని తెలంగాణాను

మేమైనా చూస్తాం!

వరంగల్ కాకతీయ మెడికల్ కాలేజీ గేటు మీద కట్టిన బానర్‌ను చూసేసరికి దు ఖం పొంగుకొచ్చింది

భగభగలాడే మాటలు చూడు

కాళోజీ రచనలు చూడు"

అంటూ దు ఖావేశంతో నినాదాలు చేస్తున్న ఎల్ బి కాలేజీ విద్యార్థుల కళ్లల్లో కాళోజీ వారసత్వాన్ని వెతుక్కున్నాను హన్మకొండ చౌరస్తా సమీపంలోని మర్కజీ స్కూలు చిన్న పిల్లలు వరుసగా నిలబడి 'కాళోజీ అమర్ హై" అంటూ చిన్న చిన్న చేతులూపుతూ వీడ్కోలు చెబుతుంటే భవిష్యత్తు మీద భరోసా కలిగింది

కాళోజీ ఒక యోధుడు యోధుడు మరణించినపుడు కంట తడిపెట్టకూడదు కంట తడిపెడితే అది యోధుడిపట్ల అపచారమే

అందుకే పాటలు పాటల పల్లకీలో కాళన్నను ఊరేగించారు ఊరేగింపు ఆద్యంతాలు పాటల ప్రవాహమే "వందనాలు వందనాలన్నో అంటూ అగ్రభాగాన గద్దర్ కదులుతుంటే, "పల్లె కన్నీరు పెడుతుందో కనిపించని కుట్రల' అంటూ సంధ్యక్క రజితక్కలు ఆలాపిస్తుంటే, "బొమ్మాచక్కన, నిమ్మచక్కన, నీవూ నడిపిన పాటా చక్కన' అంటూ వల్లంపట్ల జానపద బాణీలో కీర్తిస్తుంటే, శ్రీనివాస్ బృందం చిందులు తొక్కుతూ గలం కలుపుతూ డప్పులు కొట్టుకుంటూ, నాట్యం చేస్తుంటే "ఒక వీరుడి అంతిమ యాత్ర అఖరి యాత్ర ఇంత గొప్పగుంటుందా అని చూస్తున్న వరంగల్లు ప్రజలు విస్తుబోయారు ప్రజల ఎక్కం జీవితాంతం నిలిచిన వాడికి ప్రజల నివాళి ఇట్లనే ఉంటుందనిపించింది

కాళోజీ "మహాభినిష్క్రమణం' హన్మకొండ వీధుల గుండా కదులుతుంటే ఎనెన్నో చారిత్రక స్మృతులు, పురాజ్ఞాపకాలు రాజులను కాదని కష్టాలను కోరి వరించిన పోతన, కులాల మీద దండెత్తిన పాల్కురికి సోమన, వీరశైవం ఆత్మార్పణలు, జైనం విశిష్టత, ఆ తర్వాత ఆంధ్ర మహాసభలు ఆర్య సమాజం, గాంధీ ప్రభావం, తెలంగాణా సాయుధ పోరాటం, నక్సల్ బరి వసంతకాల మేఘ ఘర్జనలు, పౌరహక్కుల ఉద్యమాలు వీటన్నింటి మేలు కలయికలే కాళోజీ మూర్తిమత్వం' అనిపించింది

'చరిత్ర ఎంతో మంది మహాపురుషుల్ని సృష్టిస్తుంది కాని మరికొంత మంది మహానుభావులు చరిత్రనే సృష్టిస్తారు ఈ రెండో కోవకుచెందిన వాడే కాళోజీ అతడికి సమకాలీనుల మైనందునే మనం గర్వించాలి మన కాలం వీరుడతను, మన కాలం యోధుడతను మళ్లీ మన జీవిత కాలంలో అటువంటి 'మేరు పర్వతాన్ని" చూడలేం

'పుటుక నీది చావు నీది బ్రతుకంతా దేశానిది అన్న మాట కూడా పొరపాటే, తను చనిపోయిన తర్వాత కూడా దేశానికి ఉపయెగపడాలన్న కోరికతో తన కండ్లనే కాదు చివరికి దేహాన్ని కూడా దేశానికి దానం చేశాడు రంతిదేవుడిని మించిపోయాడు తన అన్నబాటను అనుసరించాడు తన గేహము, తన దేహము, తన కాలమూ, తన ధనమునూ జగజ్జనులకే దానం చేశాడు చివరికి తాను నగ్న పాదాల తో నడుచుకుంటూ కాకతీయ మెడికల్ కాలేజీలోకి మాయమయ్యాడు

అంతవరకూ అతని వెంట నడిచి వచ్చిన పాటల ప్రవాహం, జోహారు జన సముద్రం నిశ్శబ్దంతో గడ్డకట్టుక బోయింది రెండు నిమిసాలు మౌన సంతాపం సుదీర్ఘమైన రెండు యుగాలుగా గాలి కూడా నడిచేయని ఆ నిశ్శబ్దంతో దేవతలు దిగివచ్చి కాళోజీకి నివాళులు అర్పిస్తున్నట్లు భ్రాంతి కలిగింది అంతలో పోలీసుబ్యాండు విషాద సంగీతం అది ముగియగానే గౌరవసూచకంగా గాలిలోకి పన్నెండు తుపాకుల కాల్పుల చప్పుడు

"అల్విదా కాళోజీ అల్విదా'

"అన్యాయాన్ని ఎదిరించే వాడే నాకు ఆరాధ్యుడు" అన్న, కాళోజీ పోరాట వారసత్వాన్ని కొనసాగించడమే మనం ఆయన పట్ల చూపించే గౌరవం ఆయనకు అర్పించే నివాళి

"తెలంగాణా వేగుచుక్క

కాళోజీ వెలుగు చుక్క"

# మనసు పుటల లోంచి...

- లోచన్

కాళోజీ తో నాకు 45 ఏళ్ళ అనుబంధం ఈ 45 ఏళ్ళలో మననం చేసుకోవలసిన సందర్భాలెన్నెన్నో

కన్నీటి లో ఎన్నెన్నో కలవు కన్నీటిని గన కన్నులు గలవు యివి కాళోజీ మాటలు కరుణ సానుభూతి ఆప్యాయత అనురాగం స్నేహం అదరణ మనసును చుట్టేసే మమకారం యివీ కాళోజీ అనే మనిషి జీవ పదార్థాలు

'మనిషి' అంటే డిక్షనరీ ఏ మర్థం చెపుతుందో కాని కాళోజీ జీవితం మనిషికి నిండైన నిర్వచనం

ఆ రోజు నవంబర్ 14 కాళోజీ భౌతిక కాయాన్ని హైదరాబాద్ నుండి హనుమకొండ నక్కలగుట్టలోని ఆయన ఇంటికి తీసుకొస్తున్నారని తెలిసి అక్కడికి బయలు దేరుతుండగా మా యింట్లో ఏదో కర్రపని చేయడానికనివడ్రంగి బ్రహ్మయ్య వచ్చాడు 'ఇవ్వాళ పని వద్దు బ్రహ్మయ్యా! కాళోజీ చనిపోయారు కదా అయనింటికి వెళ్ళుతున్నా అయనకు నేను చాలా దగ్గరి వాణ్ణి" అన్నాను ' కాళోజీకి దగ్గరి వారు కానిదెవ్వరు సార్! పదండి నేను గూడా వస్తున్న" అన్నాడు బ్రహ్మయ్య మేము కాళోజీ యింటికి వెళ్ళుతుండగా దార్లో రాఘవ స్వామి అనే రిటైర్డ్ టీచర్ కనిపించి" లోచన్ గారు! కాళోజీ పోయారు మన ఊరి పెద్ద దిక్కు పోయింది మన బాధల్ని యింకెవ్వరికి చెప్పుకుందాం? ' అన్నాడు గద్గద కంఠం తో ఇలా కాళోజీకి ఎందరెందరితో ఎంత అనుబంధమో! ప్రజలతో యింతగా పెనవేసుకొన్న జీవితం యిప్పుడు మనికి ఎక్కడ కనబడుతుంది?

కాళోజీ యింటికి చేరుకున్నాం అప్పటికే కాళోజీ భౌతిక కాయాన్ని మిత్రుల దర్శనార్థం ఆయన యింటి ముందుంచారు జనం తండోప తండాలుగా వచ్చి నివాళు లర్పిస్తున్నారు కంటతడి పెట్టని మనిషి లేడు కొందరు భోరున ఏడుస్తున్నారు

ఇంత మందిని యిన్ని విధాల ఆకట్టుకొన్న కాళోజీ a great soul బతికి నన్నాళ్ళూ చచ్చికూడా ప్రజల మధ్యే కాళోజీ

అక్కడ కాళోజీ తాను చెప్పుకొన్న తన గొడవ కాసెట్లు వేశారు చుట్టూ చేరిన వారందరితో మాట్లాడుతున్నట్టే అనిపించింది ఆ కంఠంలో ఎంత స్పష్టత ఎంత సూటిదనం - తడబాటు లేని తికమకలు లేని కంచుకంఠం ఆ మనసు ఎంత నిర్మలమో! అందుకే ఆ కంఠంలో అంత సహజత్వం, సూటిదనం Face is the Index of mind అంటారు అలాగే Tone is the index of soul అనాలనిపిస్తుంది

కాళోజీ కదలాడే జన జీవితం అల్లుకునే స్నేహం అవరించే బాంధవ్యం ఆయనొక జిబ్రాన్ శ్రీశ్రీ అన్నట్టు లూయీ అరగాన్ పౌరహక్కుల కోసం గౌరవంగా బతకడం కోసం పోరాడిన ఆంధ్రా అబ్రహం లింకన్ డార్లింగ్ ఆఫ్ ద పీపుల్ శ్రీశ్రీ రాసిన వ్యక్తికి బహువచనం శక్తి అనే భావనని జీవితాంతం నిర్వచించిన మహానుభావుడు అతడెప్పుడూ బహువచనమే "మనసున మనసై బ్రతుకున బ్రతుకై" అని శ్రీశ్రీ జీవిత సహచారిణిని గురించి రాసినా ఆ చరణాలు కాళోజీకి అన్వయిస్తే అతడు "మన మనసున మనసై, బతుకున బతుకై' జీవించాడు 'మనకోసమే కన్నీరు కార్చడు

కాళోజీ నిత్యసంచారి తాను శారీకంగా బాగా బలహీన పడక ముందు తరచూ మిత్రుల యిళ్ళకి చిన్నా, పెద్దా, పేరు ప్రతిష్ఠా వయసులతో నిమిత్తం లేకుండా వెళ్ళి పలకరించేవాడు అతడు అందరికీ ఆత్మబంధువు సంతోష సమయాల్లో కన్నా బాధల్లో ఉన్న ప్రతి మిత్రుని యింటికి వెళ్ళి పరామర్శించిన అర్ద్ర హృదయం ఆయనది హైద్రాబాద్ లో క్షయ వ్యాధి తో మంచాన పడ్డ అంకయ్య అయినా అట్లా ఎవ్వరు బాధల్లో ఉన్నా దూరభారం అనకుండా వెళ్ళి చూపే వారు తోటి మానవుల మీద ఒక concern కష్టాల్లో ఉన్నవారిని పలకరించాలనే తపన, ఆపుకోలేని మనసు ఆయనది

ఎమర్జెన్సీ కాలంలో నేను అరెస్ట్ అయి జైల్లో ఉన్నప్పుడు నిండు చూలాలైన నాభార్య మా అమ్మా, చెల్లెలూ ముగ్గురే యింట్లో బిక్కు బిక్కు మంటూ ఉండేవారు మిత్రులెవ్వరూ ఆఖరుకు మా తమ్ముడు కూడా భయపడి పలకరించడానికని వెళ్ళలేదు ఒక్క కాళోజీ హేమా (వరవరరావు సతీమణి) తప్ప కాళోజీ తరచూ మా యింటికి వెళ్ళి మావాళ్ళని పలకరించి ధైర్యం చెప్పేవారు అందుకే అన్నాను ఆయన అందరికీ ఆత్మబంధువు - ఆప్తబంధువు

'మన వంటి వాడు/ మన ఊరికి, కాదు కాదు తన ఊరికి వచ్చినవాడు' అని శ్రీశ్రీ వరంగల్ వచ్చినప్పుడు రాశారు కాళోజీ ఈ మాటలు కాళోజీకి కూడా వర్తిస్తాయి ఆంధ్ర దేశంలో ఎక్కడికి వెళ్ళినా బహుశా అందరూ ఆయన గురించి అలాగే అనుకునే వారు తన యిల్లు అందరి యిల్లూ అయినట్లే అన్ని ఊళ్ళూ, అందరూ తనవే తనవారే

కాళోజీ యిల్లు ప్రతిరోజూ ఒక మిత్రమండలే ఆ యిల్లు ఒక మాట్లాడే లైబ్రరీ ఇద్దరు కాళోజీలు యింట్లో ఉంటే చర్చలకి కొదవే లేకుండేది కాళోజీ సోదరులకి మిత్రులతో మాటలే పండగ ఆహారం, విహారం అన్నీ మిత్రులే అలా చర్చలతో ఆ యిల్లు కళకళలాడుతూ నిత్య చైతన్య సదస్సులా కనిపించేది అనేక విషయాల మీద సంభాషణలు సాగి పోయేవి సాహిత్యం కళలు కథలు, వెతలు హాస్యం వ్యంగ్యం, గరంగరం బహెస్‌లు, సమాజం దేశం ప్రపంచం అలా ఆ రెండు ద వరల్డ్ ఇన్ వన్‌డే' అన్నట్టుండేది ఆయనింటికి వెళ్ళితే లోకం చుట్టి వచ్చినట్లని పించేది

అప్పుడప్పుడు సంభాషణా క్రమంలో నిజాం నవాబు తో సహా తెలంగాణా జమీందార్ల జాగీర్దార్లా, ఫ్యూడల్ దొరల జీవితాల గురించిన ప్రస్తావనలు కూడా వచ్చేవి ఎప్పుడో ఒకప్పుడు ఆ ఫ్యూడల్ దొరలు ప్రజాహిత చర్యలు ఏవైనా చేసి ఉంటే కాళోజీ సోదరులు వాటిని బాగా హైలైట్ చేసి పొగడేవారు ఆ ఫ్యూడల్ దొరలు ప్రజలకోసం ఏవైనా మంచిపనులు చేశారంటే ప్రజాగ్రహానికి గురికాకుండా, తిరుగుబాట్లు రాకుండా చూసుకోవడానికి యుక్తియుక్తంగా చేసినవే కాని, ప్రజలమీద కనికరంతో కాదు కాని కాళోజీ సోదరులు మనిషిలో అతడు ఏ వర్గానికి చెందిన వాడైనా, ఏ కాస్త సహృదయత కనిపించినా చలించి పోయే సున్నిత హృదయులు ఉదారవాదులు అంతే కాని Behind every affluence there is a crime అని వారికి తెలియక కాదు అందుకే 'దొరతనాల దోపిడీని దోస్తీ అనకు నరకాసురుని ఏలుబడిని నాకమనకు' అన్నారు చిన్న కాళోజీ

అవి డెబ్బై దశకాల్లో నేను విరసం వరంగల్ జిల్లా యూనిట్ కన్వీనర్గా ఉన్నరోజులు యూనిట్ పక్షాన హనుమకొండ రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయం లో 'లెనిన్ జయంతి ఉత్సవం జరపాలనుకొని అందులో కాళోజీని మాట్లాడమని కోరాను అప్పుడు కాళోజీ "నాకు లెనిన్ గురించి ఏమీ తెలియదు నువ్వేదైనా అతనికి సంబంధించి పుస్తకం తెచ్చిస్తే చదివి మాట్లాడుతా' అన్నారు కాళోజీకి Lenin camrade and Man అనే పుస్తకం యిచ్చా ఆ సాయంత్రం సభలో కాళోజీ లెనిన్ గురించి అద్భుతంగా మాట్లాడారు ఎంతో గౌరవ భావం తో లెనిన్ ని మళ్ళీ మళ్ళీ పొగిడారు అప్పుడు నాకు చాలా ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమిటంటే కాళోజీ ప్రపంచ చరిత్ర సాహిత్యం, చాలా విస్తృతంగా చదివారు మరి లెనిన్ గురించి ఎందుకు చదవలేదు? కావాలని avoid చేశారా? అనిపించింది నా కనిపించింది బహుశా దీనికి కారణం స్వేచ్ఛాప్రియుడైన కాళోజీ మార్క్సిజం లేదా కమ్యూనిజం అంటే, అదొక అణచివేత సిద్ధాంతం, అక్కడ స్వేచ్ఛకి తావుండదని భావించడమే కాళోజీ లాగా మనుషుల్ని అమితంగా ప్రేమించిన ఎందరో మహానుభావులు 'ప్రజాస్వామ్యం 'స్వేచ్ఛ' అనే భ్రమలో మార్క్సిజం కమ్యూనిజం అనగానే కుంచించుకుపోతారు అదేదో అంటరాని దైనట్టు మనిషి స్వేచ్ఛకి విరుద్ధమైనట్టు ఆ పదాలు వినడానికే యిష్టపడరు నిజానికి మార్క్సిజం మహోన్నతమైన మానవతా వాదం

ఏదో ఒక పార్టీకి కట్టుబడి ఉన్న ఏదో యిజానికి నిబద్ధుడైనా రచయిత స్వేచ్ఛని కోల్పోతాడని కాళోజీ అనేవారు అయితే దేనికి నిబద్ధత అనేదే ప్రశ్న అశేష పీడిత ప్రజల విముక్తికి నిబద్ధుడైతే అది నిజమైన స్వేచ్ఛని

కోరుకోవడమే అవుతుంది క్రిస్టఫర్ కాడ్వెల్ తన లిబర్టీ' వ్యాసంలో చెప్పినట్టు ప్రజాస్వామ్య పండితులు పేర్కొనే స్వేఛ్ఛ ఒక భ్రమ మాత్రమే నిజానికి స్వేఛ్ఛ ఎంతో మహనీయమైంది కాళోజీ అంతరాంతరాల్లోని స్వేఛ్ఛ కూడా ఎంతో మననీయమైంది కాళోజీ ప్రొటెస్ట్ ఒకడుగు ముందుకు వేస్తే పోరాటం పోరాటం ఒక స్నేహరూపం పోరాటం ప్రేమకు పర్యాయపదం

'అసమ సమాజంలో అర్థనయే దౌర్జన్యం ' అన్న కాళోజీ అన్ని విధాల అణచివేతలకి వ్యతిరేకి కుహనా ప్రజాస్వామ్య విధానాలని తాను ఎన్నో కవితల్లో ఎండగట్టారు అన్యాయాలకి అక్రమాలకి వ్యతిరేకంగా నిరసనలను, తిరుగుబాట్లను సమర్థించారు ప్రహ్లాదుడు సత్యాగ్రహుడు / పరిహాసం పాలైనప్పుడు / నచ్చజెప్ప తే హిరణ్యకశిపుడు / నొచ్చుకుంటున్నప్పుడు / అధికృత హింసాకాండే పరిపాలన అయినప్పుడు / ప్రతి హింస తప్పదు / నరసింహుడు ఏదో ఓ రూపు దాల్చి / హిరణ్య కశిపు రాజ్యాన్ని / అంతమొనర్చక తప్పదు " అని కూడా అన్నారు మనిషి పోరాట సంస్కృతి సృష్టించిన సైనికుడు కాళోజీ

మనదేశం నుండి వలసవాదులు పోయినా ఆర్థిక కళా సాంస్కృతిక రంగాలలో అంతర్జాతీయ ప్రాంతీయ ప్రత్యక్ష పరోక్ష వలసవాద దోపిడీ సజావుగా సాగిపోతూనె ఉన్నది వీటన్నింటికీ కాళోజీ వ్యతిరేకి

తనని ఒక కవిగా మేధావిగా మలచిన యీ సమాజానికి జీవితాంతం సేవలనందించి తన కృతజ్ఞతలను చాటుకొన్నారు కాళోజీ సమాజం నుండి తను పొందిన అపారమైన ప్రేమను, ఆదరణను జ్ఞాన సంపదను వ్యష్టికి గాక సమిష్ఠికి సమర్పించిన ధన్యజీవి కాళోజీ

కాళోజీ వొక సంచారి అన్నాను కదా 35 ఏళ్ళ క్రితం అనుకుంటా కాళోజీ, మిత్రుడు సురమౌళీ, నేనూ పొట్లపల్లి రామారావుగారి ఊరు తాటికాయలకు వెళ్లాము రామారావు గారి ఆదరణ ఆత్మీయత అంతా ఇంతా కాదు మంచి భోజనం పెట్టారు అంతకన్నా మనసు నిండా 'మా ఊరు' వినిపించారు (మా ఊరు రామారావు గారి గొప్ప కావ్యం) ఆ సందర్భం లొనే అనుకుంటా కాళోజీ ఒక మాట అన్నారు మంచి భోజనం కోరుకునేవాడు మంచి జీవితం కూడా కొరుకుంటాడు ఇవ్వాళ్ళ ఈ రెండూ అసంఖ్యాకులైన ప్రజలకు కరవే అయినాయి కదా అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నారు

నేను కాళోజీ యింటికి ఎప్పుడు వెళ్ళినా మా యింటి వారందరిని గురించి అడిగి తెలిసకొని ఎప్పుడైనా ఆర్థిక యిబ్బందుల్లో ఉన్నట్టు పసగడితే బ్యాంకులో కొంత డబ్బుంది కావలిస్తే తీసుకో అనేవారు అయాచితంగానే కాళోజీ ధనవంతుడు కాదు అయినా మిత్రుల బాధలు పంచుకొవడానికి ఆయన లాగా ఆరాటపడే మనసు ఎందరి కుంది?

కాళోజీ మంచి శ్రోత అందుకే ఆయన మంచి వ్యాఖ్యాత కూడా శ్రీశ్రీని ఎంత శ్రద్ధగా వినేవారో అప్పుడే రాయడం మొదలుపెట్టిన యువ రచయితల్ని కూడా అంతే శ్రద్ధగా వినేవాడు

1968 లో (తేదీ జ్ఞాపకం లేదు) ఖలీల్ జిబ్రాన్ ద ప్రొఫెట్ కి కాళోజీ అనువాదం 'జీవన గీత' అవిష్కరణ సభను హైదరాబాద్ కోఠీ ఉమెన్స్ కాలేజీ దర్బార్ హాల్లో ఏర్పాటు చేశారు ఆవిష్కర్త ఏల్చూరి సుబ్రహ్మణ్యం (ఏసు) గారు మద్రాసునుండి తాను రాగలనో లేదో వచ్చినా బాగా ఆలస్యమౌతుందేమో అని కబురు పంపించారు అప్పుడు కాళోజీ 'లోచన్ అవిష్కరిస్తాడు అని ప్రకటించారు నేను అవాక్తై పోయను నేను చాలా చిన్నవాణ్ణి అసలు నేను ఆవిష్కరించడమేమిటి? హైదరాబాదులో ఎందరు ఉద్దండులు లేరు? బహుశా నేను 'జీవన గీత' నూ దాని మూలం 'ద ప్రొఫెట్' నూ చదివి ఉండడం వల్లా నామీద వాత్సల్యం కొద్దీ ఆయన ఆ నిర్ణయం తీసుకొని ఉంటారు అయితే నన్ను సేవ్ చేయడానికా అన్నట్టు సమయానికి సుబ్రహ్మణ్యం గారు వచ్చారు ఆవిష్కరణ సభ చక్కగా సాగిపోయింది

కాళోజీ భేషజాలు, తరతమ భేదాలు లేని అతి సామాన్య, నిరాడంబర స్వభావాన్ని తెలపడానికే నేను యిక్కడ యీ ప్రాస్తవన తెచ్చాను

కేంద్ర ప్రభుత్వం యివ్వజూపిన 'పద్మవిభూషణ్' ని తీసుకోవద్దని వరవరరావు వంటి మిత్రులు సలహా యిచ్చినా కాళోజీ దాని స్వీకరించారు 'ఎవరి నుండి ఏది తేసుకున్నా నేను నేనే కాళోజీ ఎవరికీ అమ్ముడు పోడు ' అన్నారు కాళోజీ అయితే నాకనిపిస్తుంది ప్రజా పోరాటాల మీద రోజూ కొనసాగుతున్న ప్రభుత్వ దమన నీతికి నిరసనగా కాళోజీ పద్మవిభూషణ్ ని ప్రభుత్వానికి వాపస్ యిచ్చేస్తే ఎంత బాగుండునో!

కాళోజీ విస్తృతంగా చదివారు పుస్తకాల కన్నా మనుషుల్ని విక్టర్‌హ్యూగో రోమా రోలా ఖలీల్ జిబ్రాన్ లని తరచూ కోట్ చేసే వారు అయననను కదిలిస్తే సాహిత్యమూ జీవితమూ కలగలపి ఎన్నెన్ని చెప్పేవారో మానవ చరిత్ర మన ముందు పరచుకున్నట్లని పించేది ఆయనొక సజీవ గ్రంథం నిశిత పరిశీలకుడు గొప్ప సైకాలజిస్ట్

ఎక్కడెక్కడి సాహిత్యం చదివినా ఎన్ని భాషలు వచ్చినా తన యాస మార్చుకోని స్ట్రాంగ్ పర్సనాలిటి కాళోజీది

"నీతో నేను ఏకీభవించక పోయినా నాతో విభేదించే నీ హక్కును నేను సమర్థిస్తాను" అనే అచ్చమైన ప్రజాస్వామ్యవాది కాళోజీ

"ఉల్లంబుల పల్లేరులు పారలగ / కల్లబొల్లి నవ్వుల వెదజల్లుచు / తల్లడిల్లు ప్రాణాలకు / గొల్లున యేడ్చే స్వాతంత్ర్యంబెపుడో? ' అని ఏ విధమైన ప్రతిబంధకాలు లేని సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పరితపించారు కాళోజీ

కాళోజీ నిశిత దృష్టి నిఘాకళ్ళు మనకి నిరంతర జాగరూకతని యివ్వాలి అసంఖ్యాక పీడిత ప్రజల కన్నీళ్ళ వేనక దాగిన విషాదాన్ని తెలుసుకొనే సానుభూతినీ, కరుణనూ యివ్వాలి

60 ఏళ్ళ సుదీర్ఘ కాలం ఒక తరాన్ని, కాళోజీ లాగా ప్రభావితం చేయగలిగిన కవులు చాలా అరుదు తన సమవయస్కుల కన్నా యువకులకే ఎక్కువ స్ఫూర్తి నివ్వగలిగిన నిత్యయౌవనుడు కాళోజీ

కాళోజీ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తుంటే నిలువెత్తు నిజాయితీ కాగడా నడచిపోతున్నట్టు జనజీవనం మధ్య ఒక రన్నింగ్ కామెంటరీ దూసుకు పోతున్నట్టు మనందరినీ నిటారుగా నడవమని పురమాయిస్తున్నట్టు అనిపించేది

కాళోజీకి స్త్రీలన్నా పిల్లలన్నా అమితమైన ప్రేమ అయితే ఆయన ఒకమారు తన జీవిత సహచారిణి రుక్మిణీ బాయమ్మ గురించి 'మా యిద్దరి మధ్య ఇంట లెక్చ్యువల్ గ్యాప్ కారణంగా నావల్ల ఆమే ఆమె వల్ల నేనూ చాలా యిబ్బందులు పడ్డాం అన్నారు బాధగా

మొన్న నేను కాళోజీ యింటికి వెళ్ళినప్పుడు రుక్మిణమ్మ 'ఇంకా ఆయన కుర్చీలో కూర్చున్నట్టు, పిలుస్తున్నట్టు అనిపిస్తున్నది హైద్రాబాద్‌లో ప్రభాకర్ యింట్లో ఉన్నారు, వస్తారు అనిపిస్తున్నది" అన్నారు దు ఖపడుతూ నాకళ్ళలో నీళ్ళు తిరిగినై అవును కాళోజి మనందరి మధ్య మసలుతున్నట్టే ఉంది ఆ కంఠం ఆ భాష, ఆయన శ్వాస వినిపిస్తున్నట్టే అనిపిస్తున్నది

ఏ ఆర్థిక లావాదేవీలూ, నిబంధనలూ లేని 'మిత్రమండలి' యిన్నేళ్ళు నిరాఘాటంగా కొనసాగడానికిమిత్రులందరూ కారకులైనా అక్కడ కాళోజి సోదరులే ప్రధాన ఆకర్షక కేంద్రం

కాళోజీ అంతిమ యాత్ర సాగినంత సేపూ అందరిలో ఆయనే ఆవేశించినట్టు, నగర శరీరంలోంచి ఆత్మకదలి పోతున్నట్టు అనిపించింది రోడ్లన్నీ కాకతీయ మెడికల్ కాలేజి వైపే నడుస్తున్నట్టు అనిపించింది లష్కర్ బజార్ పాఠశాలల ముందు బారులు తీరిన బడి పిల్లలు "కాళోజీ తాతయ్య అమర్ హై" అంటూంటే అందరి కళ్ళలో నీళ్ళు తిరిగినై

జన జీవితమే తన జీవితంగా జీవించిన కాళోజీ మన ముందు ఒక విశాలమానవ సంస్కృతిని, ఒక పోరాటస్ఫూర్తిని వదిలి వెళ్ళారు ఆయన అందరి నుండి చెలిమిని కోరుకున్నారు ఆ చెలిమి చెలిమె యింకి పోకుండా ఉన్నన్నాళ్ళు ఆయనే అన్నట్టు ఆయన బతికే ఉంటారు ఆయనను బతికించుకునే బాధ్యత మనది

★

# కాకతీయ గడ్డ మణిమకుటం కాళోజీ

వరదరాజులు

కాకతీయ గడ్డపై వెలసిన మణిమకుటం కాళోజి కేవలము వరంగల్లు ప్రజలు మాత్రమే గర్వించదగ్గ వ్యక్తి కాదు అఖిలాంధ్రదేశం ప్రాంతీయ భేదాలు లేకుండా గర్వించదగ్గ ఆరాధించదగ్గ సమున్నత వ్యక్తిత్వం గల ధీశాలి ఆయన అన్యాయం ఎక్కడ జరిగినా నిర్భయంగాను నిస్సంకోచంగాను ఎదిరించడం ఆయనలోని విశిష్ట లక్షణం ఆయన నూటికి నూరుపాళ్ళు ప్రజాస్వామ్యవాది మానవీయతలకు ప్రతీకయైన మానవోత్తముడు కాళోజి తెలంగాణా మాండలిక పలుకుబడులతో నా "గొడవ" ను తనగొడవగా చెప్పి పీడిత ప్రజల గొడవను చాటిచెప్పి వేమన తర్వాత వేమనలా ప్రజాభావజాలముతో కవిత్వంచెప్పి అచ్చమైన ప్రజాకవిగా తెలుగు సాహిత్య జగత్తులో అస్తమయములేని అవర సూర్యుడుగా వెలిగినవాడు కాళోజీ ఉద్యమస్ఫూర్తిని, ధిక్కారాన్ని, ప్రతిఘటనని భావితరాలకు తనదైన శైలిలో జీవితాంతం వరకు అందించిన నిత్య చైతన్య శీలి నవయుగ వైతాళికుడు మన కాళోజీ మనమధ్య అయన భౌతికంగా లేకున్నా అయన ఆశయాలు సర్వదా సజీవాలే, అనుసరణీయాలే

■ మహనీయునితోను ఆయన అదర్శ సొదరుడు ఉర్దూ భాష యొాషకు కవిగా రచనా వ్యాసాంగం చేసి 'షాద్ బిరుదాంకితుడైన రామేశ్వరరావుగారితోను నాకు పరిచయ భాగ్యము అనాటి ఏకైక సాహితీ వేదికయైన మిత్రమండలితో ఏర్పడినది అది బహుశా పందొమ్మిదివందల అరవైరెండు అని నాజ్ఞాపకము కాళోజి సొదరుల మానసపుత్రికయైన మిత్రమండలిలో సాహిత్యాభిమానిగా నేను మిత్రమండలి సమావేశాలలో చురుకుగా పాల్గొనడం మూలంగా కాళోజి సోదరులతో సాన్నిహిత్యం ఏర్పడినది వరవరరావు, నవీన్ తిరుపతయ్యల తరువాత నేను నాలుగవ మిత్రమండలి కన్వీనర్ కావడము పై మిగతావారికన్నా ఎక్కువ కాలము కన్వీనర్‌గా ఉండటం మూలంగా తరచుగా కాళోజి సోదర ద్వయంతో కలిసే అవకాశము కలుగడం మూలంగా నాకు వారితో సాన్నిహిత్యం పెరగడానికి దోహదపడినది ఇది నా భాగ్యంగా భావిస్తున్నాను

యాదృచ్ఛికమో లేక అదృష్టమో గాని నేనే నిర్వాహకునిగా ఉన్న రొజులలోనే మిత్రమండలి సాహితీ ఉత్సవాలు ఒరుగడము అందులో 'స్వాతంత్ర్యానంతర సాహిత్య రంగంలోని మార్పులపై సమాలోచన" అనే అంశమును ప్రధానంగా తీసుకోవడము జరిగినది ఆ ఉత్సవాలు అనూహ్యరీతిలో జయప్రదం కావడము కాళోజి సోదరులకు ఎంతగానో సంతృప్తిని కలిగించినది ఆ ఉత్సవాలు జయప్రదం కావడము కాళోజి వ్యక్తిగత ప్రతిష్ఠ మిత్రులు వరవరరావు వే నర్సింహారెడ్డి నవీన్, తిరుపతయ్య, రామశాస్త్రి లోచన్, గంటా రామిరెడ్డి బాసిరి సాంబశివరావు కె ఎస్ ఆర్ జి ప్రసాద్, గంగుల బుచ్చిరెడ్డి, పింగిల్ రంగారావు, సంధ్యా రంగారావు, సురమౌళి ఇంకా జ్ఞాపకమురాని మిత్రుల సహకారంతోను ముఖ్యంగా కాళోజిగారి ప్రోత్సహము మార్గదర్శకత్వము ఎంతగానో తొడ్పడినది మిత్రమండలి ఏలాంటి ఆర్థిక వనరులు లేని సాహిత్యసంస్థ సభ్యత్వ రుసుము కూడా వసూలు చేయని నిబంధనను పాటించడము దాని విశిష్టత మిత్రమండలి ఆశయాలు 1 రాజకీయాలకతీతం 2 సభ్యత్వరుసుము లేదు 3 వర్ధమాన, ప్రవర్ధమాన కవులను, రచయితలను ప్రోత్సహించడము 4 సలహా పూర్వక సహృదయ సద్విమర్శ 5 ప్రతి పదిహేనురోజులకు సమావేశము కావాలి 6 నిర్వాహకులు అందరి అభీష్టాలమేరకు నియమించబడాలి 7 భావ వ్యక్తీకరణలో స్వేచ్ఛ ఎవరి భావాలు వారివే నియంత్రణ లేదు

"నివాళి" పేరుతో వ్రాతపత్రిక ద్వారా మిత్రమండలి కవుల రచయితల రచనలనలను ఆ రచనలకు తగిన

రీతిలో మిత్రమండలి కళాకారులు చిత్రాలు వేసి ఆ వ్రాత సంకలనాన్ని అమూల్యమైన మిత్రమండలి సాహిత్య భారతిగా జిల్లా గ్రంథాలయములో చదువరులకు అందుబాటులో ఉంచడము జరుగుచుండేది తద్వారా వర్ధమాన కవులు, రచయితలు సాహిత్యాభిమానులు స్ఫూర్తిని పొందుటకు అవకాశము కలగాలనేదే ముఖ్యోద్దేశం

మిత్రమండలి సాహిత్య ఉత్సవాలలో ఆంధ్రదేశములోని లబ్ధప్రతిష్ఠులైన కవులు, రచయితలు విభిన్న ప్రక్రియల్లో నిష్ణాతులైన ఎందరో మహానుభావులు ఆ రెండు రోజుల కార్యక్రమములో పబ్లిక్‌గార్డెన్ టౌన్ హాలులో పాల్గొనడము మిత్రమండలి ప్రతిష్ఠను ఎంతగానో పెంచుటకు దోహదపడినది దీనికి ఆంధ్రదేశములో కవులుగా రచయితలుగా, ఖ్యాతిగాంచిన కాళోజి వరవరరావు, నవీన్ లాంటి వారి ఆహ్వానం మేరకు కాదనకుండా ఆహ్వానించిన కవులు, రచయితలు అందరునూ పాల్గొని సమావేశాలకు వన్నె తెచ్చారు అట్టి వారిలో నాకు జ్ఞాపకమున్నంతవరకు వారిపేర్లు తెలుపడము అప్రస్తుతము కాదనుకుంటాను వారిలో బాలగంగాధర్ తిలక్ దంపతులు ఆవంత్స సోమసుందర్, కుందుర్తి అంజనేయులు, దండమూరి మహీంధర్, శ్రీమతి కృష్ణబాయి, అనుముల కృష్ణమూర్తి మొదలైనవారే కాకుండా సాహితీ విమర్శకులు, స్థానిక కవులు రచయితలు ఉత్సాహంగా పాల్గొని ఉత్సవాలను సుసంపన్నం చేశారు దీనివెనుక బతుకంతా ప్రజల పక్షమే నిలబడి ప్రజలకోసమే తపనపడి పోరాటం చేసిన కవన యోధుడు కాళోజీ ప్రోత్సాహమే

ఆయన ఏ పార్టీకో లేక ఏ ఈజానికి మాత్రమే పరిమితము కాకుండా పుట్టుకనాది, చావునాది బ్రతుకంతా దేశానిది', అనే ఆయన నిబద్ధతను ఎవరు శంకింపని నిత్య సత్యము

పుట్టినది అదిగా, ప్రజల సేవయే దాది" గా తన సుదీర్ఘ జీవనయాత్ర 89 సం॥లు సాగించి నిజాం నిరంకుశాధికారాన్ని ఎదురించన్నా ప్రారంభించి పరమపదించేవరకు కూడా ప్రజలకొసము దేశానికోసం అవిశ్రాంతంగా పోరాడిన హిమవన్నగ, సమున్నత మహనీయుడు ప్రజాకవిగా ప్రఖ్యాతి గాంచిన వీరి కలం నుండి 21 రచనలు ఆయా సంఘటనలకు స్పందించి వెలువడినవే ముఖ్యంగా 'నాగొడవ ఆయన కీర్తికిరీటంలో కలికితురాయి తెలుగు భాషామతల్లికి తెలుగువారికి ఆయన అర్పించిన అమూల్య కానుకగా అభివర్ణించడము అతిశయొక్తి కాదు

ధిక్కారంతో ప్రతిఘటనతో ఎక్కడైనా ఎవరైనా అన్యాయము చేస్తే నిర్భయంగా నిర్మోహమాటంగా పోరాడిన సమరశీలి అది పౌరహక్కుల ఉద్యమమైనా కావచ్చు రాజకీయ, సామాజిక ఉద్యమాలైనా కావచ్చు అన్యాయము జరుగుతుందనుకున్నప్పుడు ఆరోగ్య పరిస్థితులు కూడా లెక్క చేయకుండా ఉద్యమములో పాల్గొని ప్రధాన భూమికలను సమరసేనానిగా నిర్వహించడములో వెనుకాడేవాడుకాదు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము ఏర్పడిన తరువాత తెలంగాణకు జరిగిన జరుగుతున్న వివక్షతను దోపిడీని పీడనని చూచి సహించలేక ప్రత్యేక తెలంగాణా సాధన కృషిలో అకుంఠిత దీక్షతో ప్రజోద్యమానికి నాయకత్వము వహించి తెలంగాణా ప్రజలను చైతన్యపరచిన యోధాగ్రేసరుడు మన కాళోజి సాహితీ సమరాంగణములో కాలిడి గురువుగారైన గార్లపాటి రాఘవరెడ్డి గారి శిశ్యుతతో కవిగా మాత్రా ఛందస్సులో తనదైన బాణిలో ప్రజల సమస్యను వెలిగెట్టి చాటిచెప్పడమే విధిగాను హృదయముతో కన్నీరుగార్చే దయార్ద్ర మనస్కుడు ఆయనది నవనీత హృదయము ఆపుకోలేక కన్నీళ్లతో తన ఆవేదనను తెలుపడము ఆయనలోని ఆర్ద్రతకు నిదర్శనము ఆయన మాటలలోనే చెప్పాలంటే ఈ క్రింది వాక్యాలు సందర్భోచితంగా వుంటాయి

అవనిపై జరిగేటి అవకతవకల చూచి
ఎందుకో నాహృది అన్ని ఆవేదనలు
పరుల కష్టము చూచి కరిగిపోవును గుండె
మాయ మోసము చూచి మండిపోవును ఒళ్లు'

అట్టి మహనీయుని గన్న ఈ ఓరుగల్లు సీమ ఎంతో పుణ్యముచేసి ఉండాలి తెలంగాణా వాసులమైన మనమందరము గర్వించదగ్గ ఆ మహా మనిషికి సజల నయనాలతో భక్తి పూర్వకంగా శ్రద్ధాంజలి ఘటించుచూ వారి ఆశయ సిద్ధికి అంకితం కావడమే నిజమైన నివాళులు అర్పించినవాళ్లమౌతాం ★

# తనుండిన కాలమునకు తానె ఉషస్సై నవాడు

VR విద్యార్థి

13 నవంబర్ 2002 ఉదయం 11 20 కి కాళోజీ గారు ఇంకా భౌతికంగా బ్రతుకీడ్వడం తన వల్ల కాదంటూ ('నిమ్స్ ఆసుపత్రిలో) యీ ప్రపంచం నుండి నిష్క్రమించినారు చివరి క్షణాల్లో మాట్లాడ లేక మౌనంగా, మన స్మృతోనే సెలవని చెప్పి వెళ్ళి పోయినారు ఆక్షణాన సైదులూ నేనూ తెలంగాణ ప్రభాకర్‌రావు వరవరరావు హేమలత గారు సుధాకర్ కాళోజీ దాపున ఉన్నాము నలభై నిమిషాల తర్వాత వరంగల్ నుండి నాగిళ్ళ రామశాస్త్రి, కాళోజీ సతీమణి రుక్మిణి గారూ, కొడుకు రవికుమార్ కోడలు వాణి మనుమడు సంతోష్ నా భార్యరత్నమాల చేరు కున్నారు తర్వాత పొట్లపల్లి శ్రీనివాసరావు టి జితేందర్ రావు చేరుకున్నారు

డా॥నరేంద్రనాథ్, డా॥శ్రీనివాసన్ కాళోజీని పరీక్షించి మా దగ్గర కొచ్చి "రెరీ సారీ కాళోజీ ఇక లేరు" అనగానే అందరమూ నిశ్చేష్టులమైనాం అప్పటి దాకా ఉన్న ఆకొంచెం ఆశాదీపం ఆరిపోయింది వెంటనే మాలో వరవరరావు గారు తేరుకొని మీడియాకు కాళోజీ ఇకలేరన్న విషయం తెలియజేసినారు 'ఇకమనం కాళోజీ లేనా ప్రపంచంలో బ్రతకాలా' అని నేనూ వరవరరావు ప్రభాకర్ సుధాకర్ బావురుమన్నారు

కాళోజీ చివరి రోజుల్లో హైదరాబాద్‌లో తెలంగాణా ప్రభాకర్ రావు వారి సతీమణి సరస్వతిగారూ, వారి పిల్లలూ, సైదులూ, వరంగల్‌లో రామశాస్త్రీ, కాళోజీ కోడలు వాణీ, మరునాడు సంతోష్ చేసిన సేవలు ఏనాటి కీ మరువలేనివి ముఖ్యంగా మందులు వేసుకోవడానికి, ఆహారం తీసుకోవడానికి కాళోజీని అనునయించే చతురతా కోప్పడే ధర్యం, రామ శాస్త్రీ, కీ, వాణికీ ప్రభాకరరావుకు మాత్రమే సాధ్యమైనవి మాలో ఎవ్వరి నుంచీ కాలేదు కాళోజీ దగ్గర రామశాస్త్రి ఉంటే చాలు మా అందరికీ ఒక ధైర్యం, ఒక భరోసా ఆ ధర్యం లోనే, ఆ భరుసా లోనే గత సంవత్సరం మూన్నెళ్ళ పాటు దూర ప్రాంతాలకు వెళ్ళి రావడం జరిగింది నేను కాళోజీఅని చూస్తున్నప్పుడు ఖలీల్ జిబ్రాన్ ప్రాఫెట్ నుండి కాళోజీ గారే తెనిగించిన చరణాలు తానుండిన కాలమునకు తానె ఉషస్సైన వాడు గుర్తొచ్చేవి కాళోజీ ఏ సభలో ఉన్నా, ఏ గెట్ టు గెదర్ లో ఉన్న వారే సెంట్రల్ ఫగర్ వారు చెప్పకు పోతుంటే అంతా ముగ్ధులై వినాల్సిందే ముఖ్యంగా గెట్ టు గెదర్స్‌లో ఎస్ సదాశివ ప్రొఫెసర్ జయశంకర్ లాంటి స్కాలర్స్ గూడా వారిని వినడమే తప్ప మాట్లాడే వారు కారు మనం మాట్లాడితే కాళోజీని వినే అవకాశం పోగొట్టుకుంటాం అని అనేవారు

జర్మనీకి, ఫ్రాన్సుకు మధ్య జరిగిన యుద్ధంలో ప్యారిస్ నుండి బుద్ధి జీవులంతా పారిపోతే లూయీ అరగాన్ అనే కవి మాత్రం నేను ఎక్కడికీ వెళ్లను నన్ను వాళ్ళు చంపితే చంపనీ అని భీష్మించుకు కూర్చుని ఉద్యమం సాగించినారట అందుకే శ్రీ శ్రీ కాళోజీని లూయీ అరగాన్ తో పోల్చినారు ఆలంపురం సభల్లో కాళోజీ 'నాగొడవ ను ఆవిష్కరిస్తూ (1953) అనేక సంధర్భాల్లో, ఉద్యమాల్లో కాళోజీ లూయీ అరగాన్నను తలపింప చేసేవారు

'అసమాన సమాజంలో అర్జనమే దౌర్జన్యం అన్న కాళోజీ జీవితంలో ఏమీ సంపాయించలేదు ప్రపంచ యేతన యిల్లు గా భావించన కాళోజీ తనకంటూ ఒక ఇల్లు కట్టుకోలేదు జిడ్డు కృష్ణమూర్తి సత్యాన్వేషణ లో 'ఆర్డర్ ఆఫ దిస్టార్' సారవ భౌమత్వాన్ని వదలుకొని కోట్లాది రూపాయల విలువ చేసే ఆస్థుల్ని త్యజించి ఒంటరిగా ఏమీ లేని వాడుగా ప్రస్థానం చేసినట్లే, నిజాయితీ గా బ్రతకడం కోసం, ప్రజల వెంటనడవడం కోసం గొప్ప లౌకిక ప్రగతిని వదలుకొని చివరిదాకా అతిసామాన్యజీవితం గడిపిన వారు కాళోజీ వీలునామా రాయలేదు రాసేందుకు ప్రైవేటు ఆస్థి ఏముంది గనుక? ప్రజవేతన అస్థితియినప్పుడు తానే ప్రజల ఆస్థి అయినప్పుడు ఇక ప్రత్యేకంగా వీలునామా రాసే అవసరమెక్కడ?

భూగోళం లో ఏమూల ఏ దారుణం జరిగినా వెంటనే స్పందించి కవితా రూపంలో దర్శనమిచ్చిన కాళోజీ నిజమైన ప్రజాకవి ప్రపంచకవి జగన్మానవుడు కాళోజీ ఫిలాసఫీ అంతా ప్రజలు ప్రజాక్షేమం కాళోజీ కి మనిషే దేవుడు! అన్యాయమెన్నెదిరించినవాడే నాకారాధ్యుడు' అని చివరి దాకా చెప్పి అట్లాంటి వాడిని ఆరాధివచంన వాడు కాళోజీ వెనుక బడిన తెలంగాణ గురించి మాట్లాడితే అది ప్రాంతీయుడు అభిమానం అనుకోవద్దు తెలంగాణా వాదాన్ని సమర్థించినాడు తెలంగాణా వాదులకు పెద్ద దిక్కుగా నిలిచినాడు కాళోజీ ఏ దేశంలో పుట్టినా ఆ దేశంలోని పీడితుల పక్షం వహించేవాడే దగా పడ్డ వారిని వెంటేసుకుని ఉద్యమించడమే గదా కాళోజీ ఊసులు!

కాళోజీ ఏ నాడూ ఎవడికీ తల వంచలేదు ఏ విషయంలో నూ 'కాంప్రమైస్' కాలేదు ప్రలోభపడలేదు భారత ప్రభుత్వం తనకు పద్మవిభూషన్' బిరుదు నిచ్చినా తన పంథా మార్చుకోలేదు మొదటి నుండి ఏ మార్గంలో నడిచినడో చివరి వరకూ అదే మార్గం లో నడిచినాడు పొరపాటున గూడా ఏనాడూ బాట తప్పలేదు అణుక్షణం రాజ్యహింసను వ్యతిరేకించిన కాళోజీ 'ఓటువేసినవాడి చేతులు నరుకుతాం' అని ఒక విప్లవ వర్గం అన్నప్పుడు మొట్ట మొదట తానే ఓటు వేసి నాచేతులు నరకండి అని సవాల్ చేస పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో తన ప్రగాఢ విశ్వాసాన్ని చాటుకున్నాడు నిజానికి కాళోజీOne man Army ఏ రాజకీయ పార్టీలోగాని, సంస్థలో గాని సభ్యత్వం తీసుకోలేదు ఎక్కడ అన్యాయం జరిగినా యీ One Man Army అక్కడ తన కలంతో గళం లో మొహరించి యుద్ధం చేసేది

'గడ్డి పోచను తలదాల్చిన హిమాలయం' కాళోజీ మాలాంటి అనామకులెందరికో, కాళోజీ అనే ఒక మహాజ్వల కాంతిపుంజం దరిదాపుల్లో ఉండే భాగ్యం కలగటం వల్ల తటిల్లి ప్రపంచానికి కన్పిస్తున్నాము ప్రకాశిస్తున్నాము ఇక్కడొక మాట చెప్పాలె నేను కాళోజీ వద్దకు గత 47 ఏళ్ళు గా వెళ్ళుతున్నాను కాళోజీ సతీమణి రుక్మిణి గారిదీ నాదీ ఒక ఊరే (వరంగల్ జిల్లాలోని గవిచర్ల గ్రామం) గనుక సాన్నిహిత్యం ఏర్పడ్డది 1966లో నన్ను కవిగా కనుగొని అప్పటినుండి చివరిదాకా ప్రోత్సహించినారు నేను కవిత్వం రాయకుంటే కోప్పడేవారు తిట్టేవారు నిజానికి నేను వారి శిష్యుడ్ని కాని కాళోజీ కి గురువుగా ఎలిపించుకోవడం శిష్యుడని చెప్పకోవడం ఇష్టముండదు అందరూ నాకు తమ్ముళ్ళే అందరి కీ నేను అన్ననే అనేవారు

కాళోజీ సోదరుల మానసపు తానె మిత్రమండలి కవుల రచయితల సమావేశస్థలి ఇది గత 40 ఏళ్ళు గా నిర్విఘ్నంగా సాగుతున్నది యీ మిత్ర మండలి నుండి రూపుదిద్దుకున్నవారే వరవరరావు వేమరెడ్డి నవీన్ లోచన్ యన్ కె సంధ్యారంగారావు జయ్యారం మురళీధరరావు, బాసిరి సాంబశివరావు వి ఆర్ విద్యార్థి జీ డి దర్భశయనం శ్రీనివాసాచార్య పొట్లపల్లి శ్రీనివాసరావు టి జితేందర్ రావు విజయ కుమార్ అన్వర్ రారాజు, రమణ రాంబాబు ఇత్యాదులు పేర్వారం జగన్నాథం మాదిరాజురంగారావు, తనుమాల క్రిష్ణ మూర్తి సి వి క్రిష్ణారావు సుప్రసన్న, సంపత్కుమార్, సురమౌళి కె యస్ ఆర్ జి కె ప్రసాద్, లక్ష్మణమూర్తి మొదలగు ఎందరో అతిరథులు మిత్రమండలి కి క్రమం తప్పకుండా వొచ్చి తమరచనలు చదివి తమను తాము సంస్కరించుకునేవారు అతిథులెందరో తెలుగుదేశం నలుమూలల్నుండీ వొచ్చి పాల్గొనేవారు మిత్రమండలి సమావేశాలకు చివరి శ్వాస వరకూ హాజరవుతూనే వచ్చినారు కాళోసోదరులు

అందుకే కాళోజీ పార్థివ శరీరాన్ని వారి అభిమానాలు దర్శించడం కోసం తెలంగాణా ప్రభాకర్ రావు ఇంటికి (గ్రీన్ ఛానల్) తరలిస్తున్నప్పుడు వెంట వరవరరావు మిత్రమండలి మొదటి కన్వీనర్), రామశాస్త్రి మిత్రమండలి ప్రస్తు కన్వీనర్) నేను, పొట్లపల్లి శ్రీనివాసరావు, టి జితేందర్ రావు ఉన్నాము అప్పుడు గద్గద స్వరంతో "మిత్రమండలి అంతా కాళోజీ వెంట ఉన్నట్లే గదా అని వరవరరావు అన్నప్పుడు అందరం బావురుమన్నాము

ప్రజా హృదయ వేదికపై స్థిర పడ్డ కాళోజీ ఇక కాలం నాలుకపై నిలబడి మాట్లాతాడు

# ఆయన వలె జీవిద్దాం

వసంత కన్నభిరన్

భావజాలం భావాలను ముసుగులుగా మారుస్తుంది అవి తమను ధరించిన వ్యక్తిని దాచిపెడతాయి అదే సమయంలో ఆ వ్యక్తి సత్యాన్ని చూడకుండా చేస్తాయి

అక్టేవియో పాజ్ రాసిన ఈ వాక్యాలు చదువుతున్నపుడు సరిగ్గా ఈ మాటలనే కాళోజీ ఎన్నో సంవత్సరాల నుండీ ఎన్నో సార్లు చెప్పాడని అనిపించింది

అక్టేవియో పాజ్ లాగా తార్కిక శక్తితో రాసేవారు ప్రస్తుతం చాలా అరుదుగా ఉన్నారు ఒకదానితో ఒకటి సంఘర్షించే భావజాలాల పెను తుఫానుల్లో ఆయన దొక ప్రత్యేకమైన గొంతు ఆయన ఏ సులువైన రాజీలను ప్రచారం చేయని ప్రజాస్వామ్యవాది వీటన్నిటి కంటే ముందు ఆయన కవి తన విశ్వాసాలకు దారి చూపి, తన వాదనలలో నిండిన రోజువారీ జీవిత వాస్తవాలకు అనుగుణంగా నిబద్ధ రాజకీయాల మంచు తెరలను చీల్చగలిగిన శక్తి ఆయనకుంది ఆయన ఆలోచనల అడుగున ఆచరణాత్మకత ఉంటుంది ఆయన ప్రయాణీకుడిగా ఈ ఉపాధ్యాయుడిగా ఈ ప్రపంచాన్ని చూశాడు ఆయన ఎంతో స్పష్టతతో వివాదాలలోకి ప్రవేశించే వాడు తన లోపలి అనుభవ స్థితి నుండి విడివడి ఉద్రేక పురితంగా రాయటం పాజ్ లోని అరుదైన ప్రత్యేకత'

అక్టేవియో పాజ్ గురించిన ఈ వాక్యాలు కాళోజీకి సరిగ్గా సరిపోతాయనిపించి వాటినిక్కడ మీతో పంచుకోవాలనుకున్నాను కాళోజి స్నేహం నాకెన్నో విషయాలను నేర్పింది ఆయన మరణం చాలా ప్రశ్నలు లేపింది. ఆయన మరణించాడనే విషాదం నాకు లేదు మృత్యువు నా భుజాల మీద నుంచి తొంగి చూస్తున్నదని పసిగట్టగలిగిన వయసు నాకుంది కానీ వ్యక్తి గౌరవం హుందాతనం గురించీ స్వయం నిర్ణయ శక్తి గురించి వాటిని రకరకాల మనుషుల ఎలా నిర్వచిస్తారనే దాని గురించీ నాకెన్నో ప్రశ్నలున్నాయి

కాళోజీకి ప్రయాణాలంటే కొత్త స్నేహితులంటే కొత్త రుచులంటే కొత్త మాటలూ, ఆలోచనలంటే ఎంతో ప్రేమ చాలా సార్లు అనేవాడు వరసగా మూడు రాత్రులు ఒకే దిండు మీద నిద్రపోలేననీ వాళ్ళ అన్న ఆ దిండు వేసే దిక్కు కూడా ఎన్నడూ మార్చాడనీ, సహనం స్నేహం ఆయన స్వభావంలో భాగం ఆయన ప్రవేశించిన ప్రతి ఇంటినీ జీవంతో నింపేవాడు ఆయన నియంత కూడా మనుషులను తన చుట్టూ రప్పించుకుని తన మాటలతో మంత్రముగ్ధుల్ని చేసేవాడు క్రికెట్ అంటే పిచ్చి అధిక ఎండనీ చలిని భరించగలిగేవాడు కాదు సున్నితంగా మానవీయంగా ఉండేవాడు మనతో ఉండి ఏ పుస్తకంలోనో తలదూర్చి, ఏ క్రికెట్ ఆటలోనో లీనమయ్యి భోజన సమయం వరకూ ఆయన అక్కడ వున్నాడనే స్పృహ మనకు లేకుండా చేస్తాడు తింటూ తాగుతూ, మాట్లాడుతూ, ఈ మూడు పనులనూ బాలెన్స్ చేయజూసే కాళోజీని చూడటం చాలా బాగుంటుంది

ఆయన 80 ల నుంచీ ఏ మీటింగ్ లో మాట్లాడినా, మాట్లాడిన తర్వాత నేను సరిగా మాట్లాడానా, విషయాన్ని స్పష్టంగా చెప్ప గలిగానా? ఎటో కొట్టుకుపోయి అయోమయంలో పడేశానా? అని అడిగే వాడు తను సరిగా స్పష్టంగా సమస్య మీద కేంద్రీకరించి మాట్లాడాలనే తపన ఉండేది 'మీరు అలాగే మాట్లడారు మాట్లాడగలుగుతున్నారు మీరు అయోమయంలో పడిన

రోజు నేను చెప్తాను  అంత వరకూ మీరు మాట్లడటం అపనవసరం లేదు ' అనేదాన్ని ఉపన్యాసాలు వినటానికి వచ్చే శ్రోతల మీద గౌరవం శ్రద్ధా కరువైపోతున్న రోజుల్లో కాళోజీకి వారి మీద ఉన్న గౌరవాన్ని తల్చుకోవటం అవసరమనిపిస్తుంది

వెరసి అతనొక మానవుడు  అయన గురించి వర్ణించడానికి ఈ హామ్లెట్ వాక్యం సరిగ్గా సరిపోతుంది తక్కిన వారంతా మరుగుజ్జులు కాబట్టి ఆయనొక మేరునగధీరురుడయ్యాడు  కాళోజి ఇకలేరు  అతన్ని సన్నిహితంగా ఎరిగిన వారిది అంత తేలిగ్గా నమ్మలేరు చాలా సాధారణంగా కనిపించే ఈ మనిషిలోని మానవుడు  కాళోజి చూపంచే మానవీయ హృదయం స్పందన ఆయనను అద్భుతవ్యక్తిగా అవిష్కరిస్తాయి ఆయనేమీ రుషి కాదు  నాయకుడు కూడా కాదు ఆయన గొప్పతనమంతా విలువలు లుప్తమవుతున్న రోజుల్లో కూడా తాను సాధించిన నిరాడంబర జీవితంలోనూ కట్టుబడిన విశ్వాసంతోనూ ప్రదర్శించిన నిజాయితీలోనూ నిండి ఉంది  అయనని వేలెత్తి చూపడానికేమీ లేదు  రాజకీయ వైఖరి గురించి ప్రకటించుకోవాల్సిన అగత్యమూ అయనకు పట్టలేదు తానెక్కడ నిలబడి ఉన్నాడో అయనకు తెలుసు  దానిపై అయనకు చెక్కుచెదరని విశ్వాసమూ ఉంది  అందకే తనపై అరాచక జీవి అనే ముద్రపడినా చలించలేదు పట్టించుకోలేదు హోదాపైనా పలుకుబడి మీద ఆయనకు మోజులేదు  అది ఎటు వంటి నైతికత అయినా సరే ఆమోదించాడు  ప్రేమగా పలకరించే చిరునవ్వు, హాస్యప్రియత్వం  ప్రతి అంశాన్నీ సామాన్యమానవుని దృష్టికోణం  నుంచే చూడగలిగే ప్రత్యేక సామర్థ్యం ఆయన్నొక విశేషవ్యక్తిగా నిలువుతాయి  తనకు తారసపడినవారందరి లోనూ అచంచల నిబద్ధతనూ అంకితభావాన్ని, ప్రేమనూ అంకురింపజేశాడు  అదే ఆయన ప్రత్యేకత తనని అభిమానించే వారందరి నుంచి సేవలను, ఆరాధనను దబాయించి మరీ రాబట్టుకుంటారు  అనేక సంవత్సరాలలో నేను జూసిన అత్యంత ప్రెమాస్పదుడైన మానవుడు ఆయన  తనని తానే అందరికీ ఒక పెద్దదిక్కుగా భావించుకుంటారు అ దర్పాన్ని జూపస్తారు  అయన నా విమర్శలన్నీ పట్టించుకునే వారు  వాటిని అర్థం చేసుకొడానికి ప్రయత్నించేవారు  నాకాయన మూడు దశాబ్దాలుగా పరిచయం  ఈ ముప్పమ్మేళ్ళ కాలంలో ఆయన నా జీవితనాన్ని మరింత సుసంపన్నం చేశారు  అది ఆయన మరణంతో పోయేది కాదు  కాళోజీ స్త్రీవాది కానప్పటికీ ఆయనను నన్ను దగ్గర చేసిన అంశం  ఒకటే అది వ్యక్తిగత అభిప్రాయమూ రాజకీయ అభిప్రమయూ వేరు వేరు కాదనే దృక్పధమే  పౌరహక్కులకూ ప్రజాస్వామిక విలువలకూ తన వ్యక్తిగత జీవితానికీ మధ్య ఆయన విభజన రేఖ గీసుకోలేదు  ఆయన ప్రజాస్వామ్య పోరాటాలన్నిటి వెనుకా నిలిచారు  ప్రతిసందర్భానికీ కాదనకుండా వచ్చి మాట్లాడారు  వేదిక మీద ప్రజలకు సంబంధించి ఏదో లోటు ఉందని అనుకుంటే అయనొక్కరిని జతచేరిస్తే చాలు  ఆ వేదిక ప్రజావక్షమయ్యేది  మనందరిని భయంకరమైన శూన్యంలో ఉంచేసి ఆయన మరణించారు  ఆయన స్థానాన్ని ఎవరూ భర్తిచేయలేరు  విలువలతో కూడిన దృక్పథాన్ని అందించలేరు  కానీ ఆయన మరణం మనందరి భూజాలమీద ఒక బాధ్యతను నిలిపింది మనం చేయడానికి బద్ధకించిన, భయపడిన మన శక్తిసామర్థ్యాలూ చేంఢ నరిపోవని భావించిన సందర్భాలన్నిటిలో మనం కాళోజీని ముందు నిలిపాము ఇప్పుడు మనం చేయాల్సిందంతా ఆయన్ని హృదయంలో నింపుకుని అయనలా జీవించడం  కాళోజి అమర్ హై అనేది ఒక ఖాళీ నినాదం  కానీ నేనే కాళోజి అని ప్రకటించగలగడం  ఉన్నతుడైన ప్రజాకవికీ ప్రజలమనిషికీ మనం అర్పించే నివాళి  మన పిల్లలూ ఆ పిల్లల పిల్లలూ ఆయన వలే జీవించేందుకు సాయపడటమే ఆ నివాళి  ఆయన ఆదర్శాలతో జీవితాన్ని మెరుగుదిద్దడం ఇప్పటి అవసరం  ★

# ఆ మూడు రోజులు

- పొట్లపల్లి శ్రీనివాసరావు

ఆ రోజు ఉదయం 8 గంటలకు శ్రీనాగిళ్ళ రామశాస్త్రి ఫోన్ చేసిండు కాళోజీకి బ్రీతింగ్ సమస్య వుందని తాను చిన్నమ్మ (కాళోజీ భార్య రుక్మిణి బాయి)ను తీసుకుని శాతవాహనకు హైదరాబాద్ పోతున్న మళ్లీ ఫోన్ చేస్తనన్నాడు అంతక్రితమే రెండు రోజుల ముందే మిత్రుడు వి ఆర్ విద్యార్థి వెళ్ళి నిమ్స్‌లో కాళోజీని చూస్తున్నాడు ఓ పది రోజులుంటవని చెప్పిండు మధ్యాహ్నం రైలుకు హైద్రాబాద్ పోదామనుకున్న కాని ఎందుకో మనసంగీకరించలేదు మిత్రుడు టి జితేంద్రరావుకు ఫోన్ చేసిన గోల్కొండ ట్రైన్‌లో హైద్రాబాద్‌కు పోదామనుకున్నం మేం హైద్రాబాద్ చేరే సరికి ఒంటి గంటైంది ఇంకేముంది అక్కడికి చేరేసరికి పిడుగులాంటి వార్త ఇప్పుడే ముఖ్యమంత్రి వచ్చిపోయుండు కాళోజీకి పూలదండేసి పోయిండని నిమ్స్ మిలీనియం బ్లాకు వద్ద వాచ్‌మెన్ చెప్పిండు అదుపుతప్పుతున్న మనసులన కంట్రోలు చేసుకుంటూ మార్చురీ వద్దకు చేరే సర్కి ఒక నిశ్చల మానవత్వం, మాటాపలుకూ లేకుండా నిద్రపోతున్నట్లుగా వుంది కాళ్ళలో వణుకు గొంతులో బాధ, గుండె పగిలి బోరున కురుస్తున్న వర్షమైపోయినం ఆ రోజు నవంబర్ 13 2002 కాళోజీ ఇక లేడన్న వార్త దేశమంతా పాకింది అప్పటికే వందలుగా, వేలుగా, జనం జనం తమ గొడవ వినిపించిన ప్రజాకవిని చివరి సారిగానైన చూడాలని

కాళోజీ పార్థివ శరీరం కాకతీయ మెడికల్ కళాశాల విద్యార్థులకు చదువైంది ఆయన కండ్లు మరో మనిషికి చూపైంది ఆయన్ను ప్రేమించే ప్రజల కోసం ఆయన కోరుకున్న ప్రజల సందర్శన కోసం ఖైరతాబాద్‌లోని శ్రీ టి ప్రభాకర్‌రావు ఇంటికి ఆకాయం చేరింది ఆ సందర్భంగా ఆయన అమితంగా అభిమానించిన అన్న కాళోజీ రామేశ్వర్రావు మానస పుత్రిక మిత్రమండలి ఆయన వెంట ప్రభాకర్ ఇంటికి వచ్చింది అచేతనగా అంబులెన్స్‌లో ఆశరీరం ముందు వరవరరావు (మిత్రమండలి మొదటి కన్వీనర్) రామశాస్త్రి (ప్రస్తుత కన్వీనర్) విద్యార్థి పొట్లపల్లి జితేంద్రరావు (మిత్రమండలి కుటుంబసభ్యుల) కూర్చున్నం 'మిత్రమండలి అంతా వున్నట్లే కద దీన్ని కొనసాగించాలి' అని వరవరరావు అన్నప్పుడు అందరి హృదయాల్లో ఏదో ఆవేదన, తపన తండ్లాట, పొర్లొచ్చిన దు ఖానికి మాటలు కరువైనై ముగ్గురం ఆ శరీరాన్ని చూస్కుంట ఆ రాత్రంత జాగరణ చేసినం తప్పదు ఏం చేస్తం అంటూ ప్రభాకర్ గడిగడికి నిద్రపట్టక వచ్చి పోవుడు మిత్ర మండలి మిత్రులు రాజు, రమణ, ఒద్దిరాజు ప్రవీణా చాలా రాత్రిదాక వుండి పోయింద్రు

తెల్లారింది వదునాల్గవ తారీఖు మొదలైంది మళ్ళీజనం గొగ్గోలు ఏడుపులు, నినాదాలుతో ఉదయం 8 గంటలకు ఖైరతాబాద్‌లో మొదలైన జులుస్ గన్‌పార్క్ చేరేసరికి పదైంది రాష్ట్రం నలుమూలల నుండి అభిమానులు సాహితీపరులు, కలం పట్టినోళ్ళు గళం పట్టినోళ్లు అన్ని భావజాలాల వారు ఆ అక్షరయోధుడికి నివాళి ఘటించడానికొచ్చింద్రు గద్దర్ పాటలు పాడి మరింత ఏడ్పించిండు అంతటా విషాదచ్ఛాయలే కలం వీరుల పెద్దదిక్కు పోయిండని మనిషితనపు దిక్సూచి ఆగిపోయిందని గన్‌పార్క్ అమర వీరుల స్థూపం వద్ద తలా కొన్ని మాటలు మాట్లాడిన తర్వాత వరంగల్ బయల్దేరినం తోవ పొడుగున ఆ మహాకవికి నీరాజనాలు పలకని వారు అరుదుగానూ, అవకాశంలేనివారు బాధతోనూ ఘటకేసర్, భువనగిరి, ఘనాపూర్, మడికొండ

దారంతా అశ్రుతర్పణ మడికొండ ప్రభుత్వ లాంచనాలు మొదలైనయి కాళోజీ పార్థివ శరీరం వున్న అంబులెన్స్‌లో రామశాస్త్రి, విద్యార్థి, పొట్లపల్లి చివరి నిమిషంలో సానుకూల పరిస్థితులు లేకున్నా మనసుగ్గ బటుకోలేక మాతోనే వచ్చిన వరవరరావు ఆ కనుక వ్యానులో ఆయన కుటుంబ సభ్యులు ఆవెనక కార్లో ప్రతాపరెడ్డి

వరంగల్ వచ్చేసరికి బోరున ఏడుస్తున్న జన సంద్రం మధ్య ఆచార్య జయశంకర్ డా॥వి యస్ రెడ్డి బ్యానర్లతో కుస్తీ పడుతున్న అన్వర్ శిరీష్ కౌండిన్య అరెంజ్‌మెంట్లలో తల మునకలైవున్నారు వచ్చిపోయే ప్రజలు, అధికారులు అనధికారులు ఎవరి గురించి వ్రాసిన ఎవర్ని మర్చిపోతనో 'వాన్నెట్లా మర్చిపోతవ్' అని కాళోజి అడుగుతున్నట్లుగా వుంది భయంగా వుంది కాళోజి మాటల క్యాసెట్లు ఆ రాత్రంతా భగవద్గీతైంది కాంగ్రెస్ బద్రయ్య కాళోజీ తలాపు దగ్గర ఆ రాత్రంతా ఏదో చదువుకుంట కూసున్నాడు

పదిహేనో తారీఖు మొదలైంది టేప్ రికార్డులోంచి కాలోజీ మాటలు మొదలైనై బతుకు తప్పదు బతక్కతప్పదని ఎల్లలు పెద్దలు, వృద్ధులు స్త్రీలు సంస్థలు, పాఠశాలలు కళాశాలలు వారూ వీరు అని లేదు ఒకటే కిట కిట పది గంటలకు మొదలైన అంతిమయాత్ర జులుసైంది ఆ శరీరాన్ని మెడికల్ కాలేజికియ్యాల ఆయన కోరుకున్నట్లు కొన్ని వేల మంది జనం కాళోజీ పార్థివ శరీరం వున్న శకటం ముందూ వెనక నిజంగా అందరికీ ఏదో స్వతంత్ర్యం వచ్చినట్లు కలిసి మాట్లాడుకుంట అధికార అనధికార యం ఎల్ ఏ లు యం పీలు మంత్రి శ్రీ కడియం శ్రీహరి, టి ఆర్ ఎస్ శ్రీ చంద్రశేఖర్ రావు గద్దర్, కేశవరావ్ జాదవ్, రత్నమాల, క్రిష్ణాబాయి, నందినే సిధారెడ్డి, వేడలసలరోజు దర్భశయనం, లోకేశ్వర్, డాక్టర్లూ, లాయర్లూ, ప్రొఫెసర్లు, ఉద్యోగులు, వగరం నగరమంతా, పల్లె పల్లెలన్ని కదలి వచ్చిన కడలి తరంగాల్లా దారి పొడుగునా అశ్రుతర్పణ రోడ్డుమీద రక్తం ముగ్గుల హారతిచ్చిన అభిమానులు బాలకిషన్ రావు నపాలికొండ కళ్ళు తిరిగి పడిపోయుండు మర్కజీ పాఠశాల ముందు చిన్న ఎల్లలు ములుగు రోడ్డు మీద ఎల్ బి కళాశాల విద్యార్థులు పోలీసులూ పత్రికలూ, మీడియా కవరేజ్ ప్రతినిధులు అరుణోదయ కళాకారులు సాహితీ సమితి జయమిత్ర తెలంగాణ రచయితల వేదిక తెలంగాణ గ్రాడ్యూయేట్స్ సంఘాలు లయన్స్‌క్లబ్ మిత్రులు పౌర సంస్పదన మానవ హక్కులూ సమస్త సాహితీలోకం ఇంకా నేను రాయకపోతే నాకు తెలవక పోవడమే కాని ఇంకేమికాదు అలా భిన్న వైరుధ్యాలు విభిన్న మనస్వత్వాలు ఒక్కుమ్మడిగా కలిసిరావడం ఒక చారిత్రక సన్నివేశం నిన్నటి దాకా చైతన్య నింపన సజీవ రూపం ఇవ్వాల్టి నిర్జీవ శరీరం అచేతనం కాదని మరింత స్ఫూర్తితో అందరూ ఇలా కలిసి మాట్లాడాలనే చైతన్యమై ఒక ఉద్విగ్న హక్కుల పోరాటమై బాధ్యతా సందేశమై కర్తవ్యతా ప్రభోదమై కవిత్వమై కార్యోన్ముఖులు గావాలని పౌరులమై వీరులమై, శాంతి కాముకులమై, సామ్యవాదులమై కలకాలం జీవించాలని చెప్తున్నట్లుగా వుంది

'రక్త మాంసాలతో తిరుగుతూ ప్రజల మధ్య ఇట్లా తిరిగే మనిషి వున్నాడా' గాంధీజీ గురించి ఐన్‌స్టీన్ అన్న మాటలు కాళోజీకి కూడా వర్తిస్తాయి నిజంగా ఇట్లాంటి మనిషి వున్నాడా? అన్నంత సంభ్రమం వచ్చే తరమేకాదు ఈ తరంలోనూ కొందరనుకుంటున్నారు అన్ని రకాల దోపిడీల్లోనూ కన్విన్స్ కావడం, కాంప్రమైజ్ కావడం ఇవ్వాల్టి లక్ష్యంగా మారింది దీని బద్దలు కొట్టాలి మనుషులమై మెలగాలి కాళోజి గురించి మాట లాడు కోవడం ఒక ఎడ్యుకేషన్ అయ్యనొక సాంస్కృతిక కేంద్రం ఆ కేంద్రంలోకి ఒకసారి ప్రవేశిద్దాం ఆయన సాహిత్యాన్ని అధ్యయనం చేద్దాం మనుషులుగా పునీతులమవుదాం

# కాళోజీ పుట్టినరోజు - తెలుగు మాండలిక బాషా దినోత్సవం

- పొట్లపల్లి శ్రీనివాసరావు

మనిషికి అచ్చమైన నిర్వచనం కాళోజీ మనవత్వానికి అసలైన అర్థం కాళోజీ నిజాలు తప్ప ఏ ఇజాలు లేకపోవడం కాళోజీయిజం మనిషి తనం మరువని మనిషిని గౌరవించడం 'నా గొడవ నైజం మారని పరిస్థితులకు మనిషి స్థితిగతులకు నాగొడవ ఇంకా సజీవ సాక్ష్యంగా మిగిలిందని అందరూ అంటుంటె నేనిప్పుడు నా కవిత్వానికి కీర్తికి సంతోషించాలా ? యాభై సం॥రాల తరీఖ ఇప్పుడు కూడా ఉన్నందుకు ఏడ్వాల్నా? అని అవేదన చెందే కాళోజీ కవిత్వానికి ముసలితనం అరామైలు దూరంలోనే ఉంటుంది

కవిత్వం సామాజిక ప్రయోజనం కోసమే కాని కవి కీర్తి కండూతి కోసం కాదని కాళోజీ వాదన ఈ వాదనతో ఏకీభవించని వారు కాళన్నను చూసికూడా ఉంటే కనీసం ఒకానొక ఆత్మ విమర్శ చేసుకోవాల్సిందే

ప్రజాస్వామ్యం మీద ప్రగాఢ నమ్మకం ఉన్న ఈయన ప్రహ్లాదుడు మొట్టమొదటి 'సత్యాగ్రహి అంటడు హిరణ్యకశ్యపుని పొట్ట చీల్చిన నరసింహుడు చేసింది ప్రతిహింస అని తీర్మానిస్తాడు పురాణేతిహాసాల్లో అనేకానేక సాంప్రదాయ విశ్వాసాలను ఆధునిక సామాజిక అవసరాలకు అన్వయించి సమయస్ఫూర్తితో చెప్పగల ధీశాలి హింస ప్రతిహింసలకన్న అధికృతహింస మరింత దారుణమని తేల్చి చెపుతాడు ఓటు హక్కును నిర్బంధించడం సహేతుకం కాదని, ఎవరు ఎవరిని కూడా నియంత్రించడం కూడదంటడు రకరకాల సంఘాలు, యూనియన్లు, రాజకీయాలు, ప్రాంతీయ అసమానతలు ఉద్యమాలు, ఊరేగింపులు ఒకటేమిటి అనేకానేక సాంఘిక, రాజకీయ, ఆర్థిక, హార్థిక, అవిశ్రాంత, అశాంతి పోరాట అరాటాలకు ఆయన పలుకు ఊపిరైంది అన్నిటినీ మించి "పౌరహక్కుల వేదిక ఆయన స్వరం ఆయన మాటకు, కవిత్వానికి పెద్ద తేడా ఉండదు, ఆయన జీవితానికి, సాహిత్యానికి తేడా లేనట్లే అంత సరళంగా ఉంటుంది అంత నిరలకారంగా ఉంటుంది అది జనం భాష అది జనం గోడు 'జరిగిందంతా చూస్తూ ఎరుగనట్లు పడివుండగ, సాక్షీభూతుణ్ణికాదు సాక్షాత్తు మానవుణ్ణే అంటున్న కాలేజాతో జులుం ఎక్కడవున్నా ఏ రూపంలో ఉన్నా 'ఎదిరించేవాడే నాకారాధ్యుడు' అనే ఆలోచనా పూరిత ఆవేశం ఆయన సొత్తు ఆయన జీవితం ఒక బతుకు పుస్తకం ఆయన సాహిత్యం ఒక సమగ్ర జీవితం

వాడుక భాషకు అందలమెక్కించిన ఘనత ఆయనది నాటి నుండి నేటిదాక సాధారణ సీదామాట కాళోజీ కవిత ఆ జనం బాటకు నీరాజనం పట్టమంటడు ఇవాళ పల్లె నుండి ఢిల్లీ వరకు అత్యధిక పండిత, పామర జనులకు తెలిసిన విశిష్ట కవి కళోజీ ఇంతగా ప్రజల్తోమమేకమైన కాళోజీని ప్రజలంతా ప్రజాకవి గా కీర్తిస్తే విశ్వవిద్యాలయం డార్టర్ కాళోజీ గా గుర్తించింది కేంద్రప్రభుత్వం పద్మవిభూషణుడి గా గౌరవించుకుంది ఇంకా లెక్కలేని ఎన్నో అవార్డులకు "కాళోజీ అన్న పదం గౌరవవాచకమైంది ఇంతటి మహోజ్వల "మనిషి విశిష్ట సేవలకు గుర్తుగా "రాష్ట్రప్రభుత్వం' కాళోజీ పుట్టిన రోజు సెప్టెంబర్, 9 ని తెలుగు మాండలిక భాషా దినోత్సవం గా ప్రకటించి' సత్కరించడం సముచితముగా ఉంటుంది

వాడుక భాష' అనేది కొన్ని ప్రాంతాలకే పరిమితం కాదు అది తెలుగు జాతి యావత్తుది కాళోజీది కూడా అన్ని మాండలికాలకు తగు ఆదరణ ఉండాలనే తపనే మాండలికాలు మళ్ళీ వెలికి తీయవల్సిన పరిస్థితులు మరింతగా దిగజారకముందే భారీ కృషి చేయవల్సిందే మన వారసత్వాన్ని వదలపరుచుకోవల్సిందే - కాళోజీ పుట్టిన రోజున "తెలుగు మాండలిక భాషా దినోత్సవం' జరుపుతున్న మిత్రులను ప్రోత్సహించవల్సిందే

కాళోజీ భౌతికంగా మన మధ్యలేడు ఆయన జ్ఞాపకాలున్నాయి ఆయన స్వప్నాలున్నాయి ఆయన లక్ష్యాలు, ఆశయాలు కొనసాగించడమే మనం అయినకిచ్చే నివాళి కాళోజీ కండ్లు ఎవరికో చూపైంది శరీరం కాకతీయ మెడికల్ కాళాశాల విద్యార్థులకు చదువైంది ఆయన స్ఫూర్తితో హన్మకొండ అరోరా కళాశాల విద్యార్థులు భీమారం లయన్స్లక్లబ్ సహకారంతో కాళోజికి స్మృత్యంజలి ఘటిస్తూ దాదాపు (145) యూనిట్ల రక్త దానం చేసింఁడ్రు సమాజం పట్ల మనుషుల పట్ల తమ ప్రేమను పంచింఁడ్రు మరణం ముగింపు కాదనే అర్థవంతమైన వాక్యానికి కాళోజీ ఒక నిదర్శనం అయన్పైడూ A Lengend in the Modern Era

# "మూగవోయిన గళ గర్జన"

- డా॥ ఎన్వీ సత్యనారాయణ

నా దేశం పాలించేదీ  నా జాతిని రక్షించేదీ
నాశక్తిని పోషించేది  నా ఓటును శాసించేది
గుండాలా? తుపాకి గుండ్లా?
సట్టా వ్యాపారం దిండ్లా?

అని స్వతంత్ర భారత పరిపాలకులను చూసి విస్తుబోయిన ప్రజాకవి కాళోజీ నారాయణరావు

'మందల పడి మురుస్తాంది గొర్రె
తెగ బలుస్తాంది గొర్రె

అనడంలో గొర్రె దాటు ప్రజాస్వామ్యాన్ని గొంతెత్తి ప్రశ్నించిన కాళోజీ

ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి
అనుచుంటి నీమాట అనుభవము కొద్దీ

అని హెచ్చరించాడు

హైదరాబాద్ సంస్థాన విమోచనోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొని 1939 లో తన 25 వ యేటనే మొదటిసారి జైలు కెళ్ళిన కాళోజీ 1943 లో రెండవ సారి, 1947 లో మూడవసారి కారాగార వాసాన్ని అనుభవించాడు పోలీస్ చర్య తరువాత 1948 సెప్టెంబర్ 26 న జైలు నుండి విడుదలై, మరోపెద్ద జైల్లో పడ్డట్టు త్వరలోనే తెలుసుకున్నాడు ప్రజాస్వామ్యంలోని డొల్లతనాన్ని వ్యక్తిగానూ కవిగానూ ఎత్తి చూపుతూనే ఉన్నాడు జీవితాంతం ప్రజాస్వామ్య హక్కుల కోసం, జీవించే స్వేచ్ఛ కోసం ఉదాత్త సమాజం కోసం అలుపెరుగని పోరాట యోధుడిగా సమరం కొనసాగించాడు

'మానవుని మానవుడు మానవుని మాదిరిగా
మన్నించలేనంత మలిన మైనాది
మానవుని హృదయంబు మలినమైనద' ని

నిరంతరం ఆందోళన చెందాడు

'విలపింపగా వేదనేదైన నేమి?
చితిని చేర్పగ చింత ఏదైన నేమి?
కొల్ల గొట్టగ కొంప ఏదైన నేమి?
కోయ దలచిన గొంతు ఏదైన నేమి?

ప్రశ్నించడం జీవలక్షణంగా గల ప్రజాకవి

'ఆయేడు పోతేమి  ఈ యేడు వస్తేమి
మా యేడుపేదియో  మాతోడనే యుండు

అంటూ కాలగతిపై కాలజ్ఞాన తత్వాలు ప్రకటించాడు

చెమ్మగిలిన కన్నులలో  కమ్మలెన్నొ చదివినాను
బలికి పారలేని బాధ  పలుకు జారని గాధ
చలికి  బయట  వడెడి  గుట్టు
బలిమినెటులోదాచినట్టు
చెమ్మగిలిన కన్నులలో  కమ్మలెన్నో చదివిన'

వాడు కాబట్టే

'చెమ్మగిలని కనులు బ్రతుకు  కమ్మదనము చాటలేవు
చెమ్మగిలని కనులు బ్రతుకు  కమ్మదనము చూడలేవు'

అనడమే కాదు బూటకపు ఎన్‌కౌంటర్లలో వందలాది పోరాట యోధులు నేల కొరుగుతున్న ఉదంతాలు విని కన్నీరుగా కరిగిపోయాడు పరితప్త హృదయంతో చలించిపోయాడు

'సాగిపోవుటే బ్రతుకు  ఆగిపోవుటే చావు
సాగి పోదలచిన  ఆగరాదిచటెపుడు
ఆగిపోయిన ముందు  సాగనే లేవెపుడు
వేచియుండిన పోను  నోచుకోనే లేవు
తొలగి త్రోవెవడిచ్చు - త్రోసు కొని పోవలయు
బ్రతుకు పోరాటము  పడకు ఆరాటము'

అంటూ తెలుగు ప్రజలను తల ఎత్తి నడవమన్నాడు ఆగకుండా సాగిపొమ్మని ప్రబోధించాడు

మాటలను కత్తులుగా కొడవళ్ళు గా మలిచిన వాడు పాటల ను ఈటెలుగా ప్రయోగించినవాడు కవితా పంక్తులను సూక్తులుగా సామెతలుగా నుడులుగా నానుడులుగా వాడుకునే వెసులుబాటు కల్పించినవాడు హక్కుల కోసం పోరాడుతున్న ప్రజలకు పెద్ద దిక్కుగా నిలిచినవాడు నిరంతర పోరాటాలతో త్రికరణ శుద్ధిగా మమేకమైన పరిపూర్ణ మానవుడు కాళోజీ నారాయణరావు

ఉదయం కానే కాదనుకోవడం నిరాశ

ఉదయించి అట్లానే ఉంటుందనుకోవడం దురాశ

ఈ చీకటి ఉండదు సూర్యుడు తప్పక ఉదయిస్తాడు'

అనే చారిత్రక ఆశావాదాన్ని తన జీవితానికీ వ్యక్తిత్వానికీ కవిత్వానికీ అంతర్లయగా ప్రసరింప జేసిన మహాకవి

'అతిథి వోలె వుండి వుండి

అవని విడిచి వెళ్ళుతాను

పల్లె పట్టణంబులనక

పల్లెరై తిరిగనాను

కూటి పేద తన కబళము

నోటికీయ గుడిచినాను

కంటకాల మధ్య నేను

కాలి నడక నడిచినాను

ఈగవోలె దోమవోలె

పొగుచు తిరుగాడినాను

అతిథి వోలె వుండి వుండి

అవని విడిచి వెళ్ళుతాను

అన్న తెలుగు ప్రజల దిల్ ఔర్ దిమాఖ్ తెలంగాణా గళ గర్జన, మానవతా మహా శిఖరం నిత్య చైతన్యదీప్తి అస్తమించింది

'పుటక నీది - చావు నీది

బ్రతుకంతా దేశానిది

అని ప్రకటించిన తన కవితా పంక్తులు తన జీవిత వ్యక్తిత్వాలకు సమన్వయం చేసి చూపిన మహామానవుడి ఆదర్శాలు లక్ష్యాలు, స్వప్నాలు మనముందున్నాయి వాటిని సాధించడానికి పునరంకితం కావడమే కాళన్నకు మనం అర్పించగల నిజమైన నివాళి

❖❖❖

# కాళోజీ యాది

ఎస్ సదాశివ

వరవరరావుగారే కదా వరంగల్లుకు వెళ్లిన వాళ్లు వేయిస్తంభాల గుడిని, కాళోజీల యింటిని చూడకుండా వెళ్లిపోతే వరంగల్లును చూడనట్లే అని అన్నవారు? నేనా మాటను ఎందరితో ఎన్ని భాషల్లో చెప్పినానో, ఎన్ని భాషల్లో రాసినానో! అది కవి వాక్కు ఇప్పుడక్కడేమున్నది? గౌరమ్మను తీసిన గద్దె కాళోజీల యిల్లయినా కాళోజీల గల్లీ అయినా నక్కల గుట్టయినా, హన్మకొండయినా, వరంగల్లయినా ఏమున్నదక్కడ? గౌరమ్మను తీసిన గద్దె ఒక్క మనిషి వెళ్లిపోతే ఎంత వెలితి యేర్పడింది? అది పూడ్చరానివెలితి మళ్లీ అంతటి మనిషి పుట్టడు ప్రఖ్యాత హిందీ కవయిత్రి మహాదేవి వర్మ అన్నట్లు అటువంటి మనుషుల్ని తయారు చేసే సాంచాను బ్రహ్మదేవుడెక్కడో పారవేసుకున్నాడట! అదీ కవి వాక్కే కవి వాక్కులకు కాల దోషం పట్టదు

1996, అక్టోబర్ నెలాఖర్న నా మనుమరాలు నామకరణానికి వరంగల్లుకు వెళ్లినాను నా పెద్దకొడుకు శ్రీవర్ధనము, మహారాష్ట్ర నుంచి వచ్చిన నా బావ మరిది శంకర్‌ను వెంబడించుకొని రాత్రిపూట కాళోజీల యింటికి వెళ్లినాను నడిమి గదిలో 89 ఏళ్ల కాళోజీ రామేశ్వరరావు అనారోగ్యంతో మంచంలో పడుకొని వున్నారు ప్రాయోపవేశం లాంటిదేదో పాటిస్తున్నారు బయటి గదిలో 83 ఏళ్ల నారాయణరావు అన్న మీద ఒక కన్నేసి వుంచి

చుట్టూ కూర్చున్న వాళ్లతో ఏదేదో మాట్లాడుతున్నారు మాట్లాడే మిషతో వారం ఏడుపును ఆపుకుంటున్నారు నన్ను చూడగానే అన్నయ్య పాలు తాగటం లేదు పళ్లరసం తాగటం లేదు మీరైన చెప్పండి ' అన్నారు పెద్ద కాళోజీ నాతో ఒక మాట మాట్లాడినారు మా అబ్బాయిని చెంతకు పిలిచి ఆశీర్వదించినారు 'కొంచెం పళ్ల రసం తాగండి అన్నాను తాగాలని లేదు తాగను అన్నారు కాళోజీలు మరారాలు మరారాలంటే పట్టు విడువని వాళ్లు వారు తాగనన్నారంటే తాగరు అంతే నారాయణరావు ప్రక్కన కూర్చున మా మరారీ బావమరిది, ఇక్కడ మషూర్ కవి వున్నాడట గదా?' అన్నాడు 'అదిగో వారే ' అని అన్న గారిని చూఎంచినారు నారాయణరావు మా భావూపూజీ అన్నాడు అదేదో మందిర్‌ను మా యింటిని చూడకుంటే వరంగల్లు చూచినట్లు కాదట గదా? మా వాడు ఇంకో ప్రశ్న అడిగినాడు నారాయణరావు పేలవంగా నవ్వి ఇప్పుడవి రెండూ కూలిపోయే స్థితిలోనే వున్నాయి ' అన్నారు

పదిహేను రోజుల తర్వాత కాళోజీల యింట్లో వెలుగుతున్న రెండు స్తంభాల్లో పెద్దస్తంభం కూలిపోయిందన్న వార్త వచ్చి ఆరు సంవత్సరాల తర్వాత నవంబర్ నెలలోనే ఇంచుమించు ఆ తేదీనాడే చిన్న స్తంభం కూలిపోయే ఆ అన్నదమ్ముల్దేదో పదురుకున్నారు పెద్దాయన ఏ తల్లికో పుట్టి ఆరేళ్ల వయసులో పెరుగుతున్నాడు చిన్నాయన ఆ తల్లికే పుట్టి అన్నభుజాలెక్కి కూర్చున్నాడు 'బాగీ' కలం పేరుతో రాసిన గజల్‌లోని ఒక 'షేర్' నాకు వినిపించినారు నారాయణరావు రెండవ మస్రా సరిగా గుర్తులేదు

మజే కి చీజ్ హై యే జీస్త్ బార్‌బార్ మిలే

యూంహీ హోతా రహే బాగ్ కాజన్ షాదేకేసాథ్

ఈ జన్మ ఎన్నిసార్లు దొరికినా ఆనందమే కాని, బాగీగా ప్రతి జన్మలోనూ షాద్ వెంటే పుట్టాలె" అని తాత్పర్యం షాద్ అంటే రామేశ్వరరావు బాగీగా అంటే నారాయణరావు ఈ అన్నదమ్ములిద్దరూ అన్ని జన్మల్లో ఒక తల్లికే జన్మిస్తారట ఇది కవిత్వం నారాయణరావు పునర్జన్మను నమ్మేవారని నేననటం లేదు నారాయణరావుగారు అనవలసిన చోట నారాయణరావు అనటం ఎబ్బెట్టుగా వున్నది కదా ఏం చేయను? గారేందిరా? అని వారెక్కడున్నా గర్జిస్తారని భయం వారి గర్జనలు ధిక్కారాలు ఎదిరింపులు, తిరుగుబాట్లు అందరికి తెలిసినవే అందరు విన్నవే చదివినవే వారి గొడవల్లో అన్నిటికంటే పెద్ద గొడవ వారి ప్రేమ ఎక్కడెక్కడి వాళ్లనో, ఎందరెందరినో తమ ప్రేమ పాశంతో బంధించినారు ఎవరి రాజకీయం వాళ్లది ఎవరి సిద్ధాంతం వాళ్లది ఎవరి భావజాలం వాళ్లది అందరూ కాళోజీ "అభిమానులే ఆత్మీయులే డా జయశంకర్‌గారు తరచుగా అంటుండేవారు "వీళ్ల ప్రేమబంధంలోంచి విడివడలేము" అని కనిపించని దారమే కాని గట్టిది

24 నవంబర్ నాడు డా జయశంకర్ గారి అధ్యక్షతన హన్మకొండ గార్డెన్‌లో గొప్ప సంస్మరణ సభ జరిగింది ఆ సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న మాన్య మంత్రివర్యులొకమాటన్నారు వారు తరచుగా నిమ్స్‌కు వెళ్లి కాళోజీని దర్శించేవారట ''మీ నొప్పులెట్లా వున్నాయి? ' అని అడిగితే "శరీరం నొప్పులకేమి శ్రీహరీ! నా మనసును పట్టుకున్న నొప్పులకు మందేది?" అన్నారట "వారి మాట నాకర్థమయింది" అన్నారు మాన్య మంత్రివర్యులు మాకు అర్థమయింది అందరికీ ఒకే రకంగా అర్థమైతే ఎంత బాగుండును? కాళోజీ గొడవను వింటున్నామే కాని అర్థం చేసుకొని స్పందించిన వాళ్లెందరు? కార్యరంగంలో నిజాయితీగా దిగిన వాళ్లెందరు? అందరం ఒకటై, ''ఇదిగో కాళన్నా! నువ్వెక్కడున్నావో కాని నేనీమనసు నొప్పులకు మందు సిద్ధం చేస్తున్నాము " అని నిండు మనసుతో అనగలిగితే ఈ సంస్మరణ సభలకు సార్థకత ✦

# మరపురాని మనీషి కాళోజీ

శైలజా జింబో

ప్రజాకవి పెద్దదిక్కు కాళోజీ నారాయణరావుగారు ఇక లేరని తెలియాగానే నిస్సత్తువ ఆవరించింది దిక్కు తోచని దిగులు మనసంతా నిండింది వేము వెస్టుమారేడ్‌పల్లిలో వుండేటప్పుడు మా ఇంటికి వచ్చేవారు 1992లో అనుకుంటాను మాపాప సెకెండ్ క్లాస్ బాబు యుకెజి చదివే వాళ్ళు అగస్టు 15 నాడు పిల్లలు ఇంట్లోవున్న రోజున కాళోజీ ఇంటికి వచ్చారు బిడ్డా ఆకలైతుండే మేమున్నది తినుటానికి అనగానే నేను వంటగదిలోకి వెళ్ళాను ఈలోగా మావాడు సన్నీ ఆయన ఒళ్ళో చేరి కాళోజీ పొడవాటి తెల్లని మెరిసే గడ్డంతోనూ, కళ్ళద్దాలక వేలాడే తాడుతోనూ ఆటలాడటం మొదలెట్టాడు కాళోజీకి అసౌకర్యంగా వుంటుందనుకొని నేను మా బాబుని మందలిస్తుంటే 'ఆడుకోనీ వాడు కాకుంటే నువ్వు నేను చేస్తమా అల్లరి అనికోప్పడిన ప్రేమమూర్తి కాళోజీ "తాతయ్యగారేంది తాతా అని పిలువు, తాత అంటే వున్న ప్రేమ గారుల వుంటదా అన్నా నిరాడంబరులు కాళోజీ

కాళోజీ గారు పిల్లలతో ఇలా ఆడుకుంటున్న సమయంలోనే మా ఎదురు క్వార్టర్‌లో వున్న జిల్లా జడ్జి శ్రీ దాశరథిగారు మా ఇంటికి వచ్చారు మావారు కాళోజీ గార్కి పరిచయం చెయ్యగానే ఆయన అమాంతంగా కాళోజీ కాళ్ళకి సాష్టాంగ ప్రణామం చేసారు దాశరథిగారు తెలంగాణా వారేమీ కాదు కాళోజీ వ్యక్తిత్వం, ఔన్నత్యం ప్రాంతీయతా ఎల్లలు దాటిందనడానికి ఇదో నిదర్శనం

కవులు, రచయితలు చివరకు సాధారణ వ్యక్తులైనా తమ సమకాలీనుల మీద నిర్భయంగా నిస్సంకోచంగా తమ అభిప్రాయాల్ని వెల్లడి చేయడం అంత సులభం కాదు అది కాళోజీకే చెల్లింది సాహసానికీ నిర్మోహమాటత్వానికి నిలువెత్తు దర్పణం కాళోజీ వ్యక్తిగత స్నేహం ఎంతటిదైనా తమ అభిప్రాయాల విషయంలో నిక్కచ్చిగా వుండేవారు పిల్లల్లో పిల్లవాడిగా పెద్దల్లో పెద్దవాడిగా కలసిపోయే నిర్మలత్వం కాళోజీ గారికే సాధ్యమయింది

మావారు జింబో రాసిన "హాజిర్‌హై కవితా సంకలనానికి ముందుమాట రాసింది కాళోజీ గారే ▪ సందర్భంగా కాళోజీని పలుమార్లు కలవడం ఫోనులో సంభాషించడం జరిగింది ముందుమాట రాయడం అయిపోగానే ఫోను చేసి రాయడం అయిపోయింది పంపించమంటావా అని అడిగిన నిరాడంబరులు కాళోజీ నేను వచ్చితీసుకుంటానని జింబో వెళ్ళి తెచ్చుకున్నారు

చివరిసారిగ కాళోజీని చూసింది గల సంవత్సరం కాళోజీ 88వ జన్మదిన వేడుకలలోనే ప్రముఖుల ప్రసంగాలు అయినాక వేదికపైకి వెళ్ళి జన్మదిన శుభాకాంక్షలు తెలిపినాక ఆయన, పిల్లల, మా కుశలమడుగుతూ మునుపటి లాగా నా అంతట నేను ఎక్కడికీ పోలేకపోతున్నా మీరు వచ్చి తీసికెళ్తేనే రాగలనిప్పుడు అన్నారు నగర జీవితపు ఒత్తిళ్ళలో పడి ఎప్పటికప్పుడు అనుకుంటూనే ఆయన్ని ఇంటికి తెచ్చుకోలేకోయాం జన్మదిన వేడుకలో ఆయనతోకలిసి తీయించుకున్న ఫొటోలే మిగిలాయిప్పుడు

ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
అవనిపై జరిగేటి అవకతవకల జూచి
ఎందుకో నాహృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టములను జూచి పగిలిపోవును గుండె

అన్న కాలోజీ స్వర్గం నుంచి కూడా తన ప్రజల గురించే వ్యథ చెందుతారనీ

సాగిపోవుటె బ్రతుకు
ఆగిపోవుటె చావు
సాగిపోదలచిన
ఆగిరాదిచటెపుడు

అంటూ మనందరిలోనూ స్ఫూర్తిని రగిలిస్తారని భావిస్తూ ఆయనకిదే నా నివాళి ✤

# కవిత్వ ఉద్యమతత్వాల కలనేత : కాళోజీ

'చచ్చిపోయి న వాడి కళ్లు చారెడు అని మనకొక సామెత వుంది నిజంగా చారెడు కళ్లవాడే చనిపోతే అది కాళోజీ మరణంలా వుంటుంది

ఒక పాత సంస్కృత శ్లోకం ప్రకారం సరస్వతీదేవి (జ్ఞానపదేవత) రెండు పాలిండ్లూ వొకటి సంగీతమూ మరొకటి సాహిత్యమూ అయితే కాళోజీ రెండు కండ్లూ వొకటి సాహిత్యమూ మరొకటి ఉద్యమమూ

' అతిథివోలె వుండి వుండి అవని విడిచి వెళ్లుతాను' అని ఆయన రాసుకున్నా తన చారెడు కళ్లు మరొకరి ముఖానికి అమరి ప్రశ్నల కొడవళ్లను, ఉద్యమ ఉరవళ్లను ప్రసరిస్తూనే వుంటాయి ఆయన నిర్జీవ శరీరం కూడా శాస్త్ర విజ్ఞాన వికాసానికి వినియోగింపబడుతూనే వుంది ఆయన స్మృతులూ, స్ఫూర్తి సామాజికమై వర్తమానం నుండి భవిష్యత్తులోకి మరింత సౌందర్యవంతంగా సాగటానికి ఉత్తేజాన్నిస్తోంది ఆవిధంగా ఆయన చిరంజీవి!

తనకూ సమాజానికి సమన్వయం కుదిరేదాకా సంఘర్షణ పడటం కవి లక్షణం కాళోజీ వ్యక్తిత్వం అంటే కవిత్వ, ఉద్యమతత్వాల కలనేత తాను 16 ఏట చెప్పిన విషయాలే 89వ ఏట కూడా చెప్పవలసి వస్తోందన్నాడు ఈ 73 సంవత్సరాలలో సమాజంలో మౌలికమైన మార్పులు రాలేదన్నమాట అన్యాయం అంతరిస్తే నా గొడవకు విముక్తి అన్నాడు విముక్తి సాధించే గొడవను మనకు శాశ్వతంగా వదిలేశాడు

మిగతా అన్ని సాహితీ ప్రక్రియల్లో కంటె కవిత్వానికి ఉష్ణోగ్రత ఎక్కువ జ్వలిస్తూ వుండటం కవిత్వపు జీవ లక్షణాల్లో వొకటి కనుక కవి నిత్యం జ్వలిస్తూనే వుండాలి జ్వలిస్తూ చలింపజేస్తూ ఉండాలి కవిత్వం ఆగిపోయినా, జ్వలనం ఆరిపోయినా లోకం అటువంటి వారిని పట్టించుకోదు

బ్రిటిషువాళ్లు తెరవెనుకకు తప్పుకోగానే బ్రహ్మానందపడి పోయినవాళ్లు నిజాం నవాబు తెల్లజెండా ఎత్తగానే చల్లబడిపోయిన వాళ్లూ వున్నారు కానీ కాళోజీ గొడవ అంతటితో ఆగేదికాదు ఆయన ఆవేదన తీరేదికాదు అవనిపై జరిగేటి అవకతవకలపై ఆక్రోశంతో చివరికంటా ప్రశ్నిస్తాడు 'పరుల కష్టము చూచి గుండె కరగటం మాయ మోసము చూచి ఒళ్లు మండిపోవటం ఆయన జీవలక్షణం తన కలంతోనో, కళంతోనో చివరి క్షణాల దాకా సామాజిక అసమానతలపైనా ఎగుడు దిగుడుల వివక్షతలపైనా నిప్పులు కురిపిస్తూనే వున్నాడు ఆయన ఆవేశ ప్రకటనలూ, అభిప్రాయాలూ అందరి ఆమోదాన్నీ పొందలేకపోవచ్చుగానీ ఆయన నిష్కర్షగా నిస్వార్థంగా అభిప్రాయాల్ని వ్యక్తం చేసే తత్వం ఎవరూ కాదనలేనిది

పుట్టుకతోనే మానవులకు సంక్రమించే పౌరహక్కుల్ని అణిచివేసిన పాలకులందర్నీ ఆయన ఎదిరించాడు ధిక్కరించాడు నిజాం పాలనలో పట్టణ బహిష్కారం, జైలు శిక్షలు ఆయన సంకల్పాన్ని సడలించలేకపోయాయి ఎమర్జెన్సీ అకృత్యాలకు బాధ్యుడైన జలగం వెంగళ్రావునీ, కల్లోలిత ప్రాంతాలను ప్రకటించిన చెన్నారెడ్డినీ హక్కుల అణచివేతలో మామమను మించిన అల్లుడి (ఎన్టీఆర్ చంద్రబాబు) ప్రభుత్వాలనీ నిర్భయంగా నిలదీసి కడిగి ఆరేయటానికి, ఆయనకి జంకూ, గొంకూ వుండేది కాదు ఎమర్జెన్సీ చీకటిరోజులలో నిరసన తెల్పటానికి వస్తామన్న వారెవరూ రాకపోయినా కాళోజీ వొక్కరే నోటికి గుడ్డ కట్టుకుని వరంగల్లు బజారుల్లో నిరసన ప్రదర్శన చేశారు

గ్రంథాలయ ఉద్యమంలో, ఆర్య సమాజపు కార్యకలాపాల్లో ఆంధ్ర మహాసభ వీరోచిత పోరాటంలో కాళోజీ పాల్గొన్నారు తెలంగాణా రచయితల

సంఘంలోనూ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యునిగాను తనదైన ముక్కుసూటిదనంతోనే పనిచేశారు తెలంగాణా జిల్లాలలో ప్రత్యేకించి వరంగల్లులో రచయితలకు ఆయనొక స్ఫూర్తి! కొత్తతనం రచయితలను ప్రోత్సహించి నడిపించటం ద్వారా వారికొక పెద్దదిక్కు గా వుండేవారు తానేకొక మిత్రమండలై మసలేవారు

బిరుదుల కోసం భజనలు చేయటం పదవుల కోసం పల్లకి మోయటం ఆయనకు చేతకాని విద్య తనకు లభించిన గౌరవాలకు పొంగలేదు అవి లేవే అని వ్యధచెందలేదు తనకు లభించిన గౌరవాల్ని పురస్కారాల్ని ప్రజాసేవకే వినియోగించటం ఆయన ప్రత్యేకత

కాళోజీ కొద్దికాలం కాంగ్రెస్ పార్టీలో వుండినా (1952 ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిగా వరంగల్లు పార్లమెంటరీ నియోజక వర్గానికి పోటీ చేసి కమ్యూనిస్టు అభ్యర్థిపై ఓడిపోయాడు) ఆయనిది రాజకీయ పార్టీలు, సంస్థలు నిర్మాణాల్లో ఇమడలేని స్వభావం అలాగని ప్రజాసంఘాలు రాజకీయ పార్టీలు కూడనివని ఆయన భావించలేదు ఆయన నిర్మాణవాది కాడు వినిర్మాణ జీవి ఆయన నుండి నేర్చుకోవలసినది సంస్థలకు వెలుపల వుండటం కాదు నిరంతరం ప్రజల పట్ల గుండె చెమ్మగిల్లే స్పందన కలిగి వుండటం! రాజ్యం విసిరే ఉరులకూ, ఎరలకూ లొంగకుండా ప్రజల పక్షాన అప్రకటిత ప్రతినిధులుగా నిర్భయంగా నిలబడటం!!

ప్రజలమైన ఎవరు దౌర్జన్యం చేసినా కాళోజీ సహించలేకపోయాడు "ఎన్నికలలో ఓటు వేసిన వారి వేళులు నరుకుతామని' పీపుల్సువారు నక్సలైట్లు ప్రకటిస్తే ఓటు వేయటమూ, వేయకుండుట స్వచ్ఛంద హక్కేగాని ఎవరి దౌర్జన్య హెచ్చరికలనూ లక్ష్యపెట్టవద్దంటూ తానే ముందు వెళ్లి ఓటు వేసివచ్చాడు

భాష ప్రాంతము కులము మతము లింగము ఇవన్నీ పీడిత ప్రజల మధ్యన వుండే అనేక రకాలయిన వైవిధ్యాలు, వైరుధ్యాలు వీటిని గుర్తిస్తూనే దోపిడీ పెత్తందారీ పీడక శక్తులకు వ్యతిరేకంగా సమస్త పీడిత ప్రజానీకాన్ని ఐక్యం గావించటం ప్రజా ఉద్యమానికి సున్నితమైన అత్యంత కీలక కర్తవ్యం

మతాన్ని వ్యతిరేకించే హేతువాదులు మతస్థుల్ని ద్వేషించకూడదు లౌకికవాదులు మతవాదాన్ని వ్యతిరేకించాలిగానీ మతాన్ని మతస్థుల్నికాదు తెలంగాణా విమోచనోద్యమ కాలంలో నిజాం వ్యతిరేకత అంటే ఫ్యూడల్ పెత్తందారీ రాజ్య వ్యతిరేకతేగాని ముస్లిం వ్యతిరేకతకాదు ఫాసిస్టు స్వభావం కలిగిన రజాకార్లను ద్వేషించటమూ మొత్తంగా ముస్లిములను ద్వేషించటమూ ఒకటికాదు ఉర్దూ భాషా పెత్తనాన్ని వ్యతిరేకించటమంటే ఉర్దూని వ్యతిరేకించటం కాదు దాని ద్వారా రుద్దబడుతున్న అప్రజాస్వామిక నిరంకుశ పెత్తనాన్ని వ్యతిరేకించటం ఇవి తెలంగాణా విమోచనోద్యమం నెలకొల్పిన లౌకిక ప్రజాస్వామ్య సాంస్కృతిక విలువలు కాళోజీ ఆత్మకథలో వర్ణించిన మత సంబంధిత సంఘటనలు ఈ విలువల పరిధిలోనే వుంటాయి ప్రజల మధ్య వైరుధ్యాల రూపంలో వ్యక్తమయే ఆధిపత్య భావజాలాలపైన కూడా చాలా పోరాటం చేయాల్సి వుంటుంది సాంస్కృతిక అభిజాత్యాలూ ఆహంభావాలూ కూడా దీనికి మినహాయింపుకాదు ఈ పోరాటమంతా ప్రజల మధ్య మరింత బలీయమైన ఐక్యతను నెలకొల్పటానికై వుండాలి

ప్రజల మధ్య వైరుధ్యాల సంక్లిష్టతల్నీ, సున్నితత్వాల్నీ అవగాహన చేసుకోకపోతే ఆ వైరుధ్యాల ఫలితంగా ఉత్పన్నమయే నంఘర్షణే శత్రుణమైనదిగా కీలకమయినదిగా ముందుకు వచ్చి అవసరానికి మించిన ప్రాధాన్యతను పొంది ప్రజాశత్రువులపై సాగాల్సిన మౌలిక సంఘర్షణను వెనక్కి నెట్టటమో, పక్కదారి పట్టించటమో జరిగే ప్రమాదం వుంటుంది వీటి పట్ల ప్రజాస్వామిక, లౌకికవాదులు కూడా అప్రమత్తంగా ఉండటం చాలా అవసరం

ప్రజల మధ్య వైరుధ్యాలను ప్రజాస్వామిక శక్తులు సక్రమంగా పరిష్కరించకపోతే పాలకవర్గాలు, హిందూ

ముస్లిం ద్వేషాలను పెంచాలని చూపినట్టు కులము, ప్రాంతము లింగము పేరిట కూడా ప్రజల మధ్య శత్రుపూరిత ద్వేషాల్ని వ్యాప్తి చేయటానికి ప్రయత్నిస్తారు వీటిని ఎడాపెడా కాకుండా సున్నితంగా, ఓర్పుగా నిరంతరాయంగా దృష్టి నిలిపి పరిష్కారమయేట్టు సాహిత్య కారులు కూడా తమ కార్యరంగాల ద్వారా కృషి చేయాలి

కాళోజీ తల్లి కన్నడిగ తండ్రి మరాఠా ఉర్దూ నిజాం రాజ్యభాష ఇంగ్లీషు బ్రిటిషు వలసపాలకుల భాష కాళోజీ చుట్టూ జీవించే ప్రజలది తెలుగు ఐదు భాషలలో ఆయనకు ప్రవేశం వున్నా ఆయన తెలుగులోనే రాశారు ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాస తెలుగు ఆయన రాత సజీవ తెలుగుభాష అయన కూత ఓరుగంటి ప్రజల యాస ప్రజల ఆనందాలూ ఆవేదనలూ ఆయన అక్షర బాష్పాలు ఆయన చారెడు కళ్లూ మనల్ని ప్రశ్నిస్తాంటాయి నిలవేస్తాయి ప్రజల కోసమే జీవించండిరా అని ఆదేశిస్తుంటాయి

సామాజిక దోపిడీ పీడనా అణచివేతా అసమానతలకు వ్యతిరేకంగా తన కలం గళం ద్వారా ఉద్యమించిన నిజమైన ప్రజాస్వామిక జీవి ప్రజాకవి కాళోజీ! అయన కవిత్వాన్నీ వ్యక్తిత్వాన్నీ స్ఫూర్తిగా స్వీకరించి ఆయన అశలనూ అశయాలను నెరవేర్చే దారిలో దృఢంగా నిలవటమే నడవటమే ఆయనకు అర్పించగలిగే నిజమైన నివాళి

జనసాహితి సంస్థా ప్రజాసాహితి పత్రికా ప్రజాకవి కాళోజీ మరణానికి తీవ్ర సంతాపాన్ని ప్రకటిస్తూ బాష్పాంజలి ఘటిస్తున్నాయి

23 11 02

# ధిక్కార స్వరం మూగపోయింది

- కె జితేంద్రబాబు

అయం నిజ పరోవేతి గణనా లఘుచేతసామ్
ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్

ఇతను నావాడు ఇతను పరుడు అనే భావం అల్ప బుద్ధులకు ఉంటుంది ఉదార చరితులకు వసుధ అంతా తన కుటుంబమే వసుధ అంతా తన కుటుంబంగా భావించిన కాళోజి జీవితం అంతా సమాజ సేవకే అంకితం చేసాడు తొమ్మిది దశాబ్దాల తెలంగాణా జీవితానికి వారధిగా కాళోజి నిలిచాడు ఒక్క మాటలో చెప్పాలంటే కాళోజి జీవితం తెలంగాణా జీవితం తెలంగాణా సంస్కృతికి చిహ్నం కాళోజి ఆయనది సంపూర్ణ సార్థక జీవితం

కాళోజి నారాయణరావు పూర్తి పేరు 'రఘువీర్‌నారాయణ్ లక్ష్మీకాంత్ శ్రీనివాసరావు రామ్‌రాజా కాళోజీ' కాళోజి 9 సెప్టెంబర్ 1914న బీజాపూర్ జిల్లాలోని రట్టిహళ్ళి గ్రామంలో కాళోజి రంగారావు రమాబాయిలకు జన్మించాడు ఆయన పూర్వీకులు మహారాష్ట్రను పాలించిన పేష్వాల వద్ద ఆర్థిక గణాంకశాఖలో ఉద్యోగులుగా ఉండేవారు కాళోజి తల్లి మాతృభాష కన్నడం అమె ఇంట్లో కన్నడ మరాఠి భాషలు మాట్లాడేది తండ్రి మాతృభాష మరాఠి అయినప్పటికీ మరాఠి భాషరాకపోవుటవలన ఇంట్లో ఉర్దూ, హిందీ భాషల్లో ప్రసంగించేవాడు చిన్నతనంలోనే కాళోజికి కన్నడ, మరాఠి హిందీ, ఉర్దూ భాషలు తల్లి దండ్రుల వద్ద, బయట వారితో సంభాషిస్తూ తెలుగు భాషను నేర్చుకున్నాడు కాళోజికి రెండవ యేట వారి కుటుంబం వరంగల్ జిల్లాలోని మడికొండకు వచ్చి స్థిరపడ్డారు

ఆనాడు మడికొండలో నాల్గవ తరగతి వరకు మాత్రమే ఉండేది  అప్పటికే మడికొండలో పెద్ద శివరాజు ప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయం పేర గ్రంథాలయం నడుపుతు పురాణాలు చెప్పేవారు  కాళోజీ అన్న కాళోజి రామేశ్వరరావు మిడిల్‌స్కూల్ పాసయి లా చదువుకు హైద్రాబాద్ వస్తే అన్నతో పాటు కాళోజి కూడా హైద్రాబాద్ వచ్చి రెండవ ఫారంలో చేరినాడు  1938లో కాళోజి అన్న ఉర్దూ మీడియంలో వకాలత్ పాసయి ప్రాక్టీసుకు వరంగల్ వరంగల్ వస్తే కాళోజి కూడా వరంగల్ వచ్చి కాలేజియేట్ హైస్కూల్‌లో చేరినాడు  కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొన్నాడు  వార్ధాలో కాంగ్రెసు మీటింగుకు 1940లో వెళ్ళినాడు  అదే సంవత్సరం వేలూరు మాణిక్యరావుగారి కుమార్తె రుక్మిణి బాయిని వివాహం చేసుకున్నాడు  ఆమెను అందరూ యాదక్క అని పిలుస్తారు  అదే సంవత్సరం వకాలత్ II గ్రూపు పాసై వకీలు అయినాడు  ప్రాక్టీసులో ఇమడ లేదు  నిజాం రాజ్యంలో అకృత్యాలను నిరసించాడు  జిల్లా బహిష్కరణకు గురి అయినాడు  గోల్కొండ పత్రికలో నిజాం ప్రధానికి బహిరంగ లేఖ పేరున

"కోటగోడల మధ్య ఖూని జరిగినచోట
గుండాల గుర్తులు గోచరించినవా?"
జెండా యెత్తిన యంతజంబియాలు దూసిన
శిక్షతప్పదటంచు చెప్ప వచ్చితివారు

అంటూ కవితాప్రశ్నలు సంధించాడు  ఆ నాటినించి కాళోజీ మాటల్లో చెప్పాలంటే ' నా జీవితంలో నేను వేరే పనిపాటలు ఏమీ పెట్టుకోలేదు గాబట్టి ఫలాని చోటుకి ఫలాని రోజుకి పోవలె అనే నియమం ఏమీ లేదు  నాతోటి కలిసిన వాండ్లతో గంటో అర్ధో మాట్లాడేవరకు వాండ్లతో ఆత్మీయత ఏర్పడ్తం, వాండ్లు ఇంకో దిక్కు పోదామంటే వాండ్ల వెంబడి పోవడం  అసలు ఇంటి నుంచి బయల్దేరి పోదామనుకున్న ప్రదేశానికి పోకుండానే, మరోదిక్కు పోవడం చాలసార్లు తటస్థించింది  నేను ఏ రోజున ఎక్కడ వుంటానో ఎవరికీ తెల్వది అన్నమాట  ఇలా తిరుగుతూ తన జీవితాన్ని గూర్చి

అతిధివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను
పల్లెపట్టణంబులనక
పల్లెలై తిరిగినాను
మురికినీటి నడుమవున్న
ఇరుకులలో ఇరికినాను
కూటి పేద తన కబళము
నోటకీయ గుడిచినాను

అని కాళోజి రాసినకవిత చాలా ప్రసిద్ధి పొందింది చిలుకూరులో జరిగిన ఆంధ్రమహా సభలో 1943వ సంగలో 'ప్రజాకవి' బిరుదు ప్రదానం చేసారు  ఆ నాటికే కాళోజి వైయక్తిక జీవితానికి సమాంతరంగా కవిత్వాన్ని రచిస్తూ వచ్చాడు  సమకాలీన రాజకీయ ఉద్యమాల నుండి విడదీసి చూడలేము  కాళోజి 1960లో సంపన్న దేశాలు ఇచ్చే సహాయాన్ని దృష్టిలో వుంచుకొని ఎంతో వ్యంగ్యంగా రచించిన కవిత ఈనాటికీ సరిపోతుంది

బడుగు జాతి ఏడిస్తే
బలిసి నోడు ఎయిడ్ ఇస్తే
బత్యాలకు సరిపుచ్చక
బ్రతుకు బేరమెన్నాళ్ళు?

విత్తనాల గింజలతో
విందులారగించి త్రేన్చి
వ్యవసాయము సాగదనుచు
వగల మాట లెన్నాళ్ళు?

కర్రు ఎద్దు లేదనుచు
కుర్రో మొర్రో అను రైతును
మరనాగలి వివరాలతో
మాయాజేయుటెన్నాళ్ళు?

బావిపూడ్కె తీయలేక
బావురుమను కాపన్నను

పవర్ పంపు తీగలతో
భంగపరచుటెన్నాళ్ళు?

1945వ సంవత్సరంలో కాళోజి ప్రొ॥ లిన్ యూటాంగ్ వ్రాసిన పుస్తకం The Importance of livingను చదివాడు దానిలో చెప్పిన a man with a sense of detachment (takuan) toward life based on a sense of wise disenchantment From this detachment comes high mindedness (Kaunghuai) a high mindedness which enables one to go through life with tolerant irony and escape the tempatations of fame and wealth and achievement and eventually makes him take what comes And from this detachment arise also his sense of freedom his love of vagabondage and his pride and nonchalance It is only with this sense of freedom and non chalance that one eventually arrives at the keen and intense joy of living ఈ వాక్యాల్లో చెప్పిన తత్వాన్ని కాళోజి జీర్ణించు కొన్నాడు అందువల్ల అతని జీవితం అలానే గడచిందనిపిస్తుంది ఈ పుస్తక ప్రేరణతోనే కాళోజి

"నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదితుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్పు కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా! నీకఖ్ఖు కదలినన్నాళ్ళే

డాంభికుని ధ్యానాలు ఛాందసుని జాప్యాలు
తాత్వికుని తత్వాలు మాంత్రికుని మంత్రాలు
గురువుల గోప్యాలుగుడుగుడు గుంచాలు
దేవుళ్ళ తిరునాళ్ళు దివ్యనది తీర్థాలు
కర్షకా! నీకఖ్ఖు కదలినన్నాళ్ళే

ధార్మికుని దానాలు పండితుని భాష్యాలు
వర్తకుని వ్యాజ్యాలు వకీళ్ల వాదాలు
సైనికుని శౌర్యాలు యాంత్రికుని యంత్రాలు
యోధుల యుద్ధాలు రాజుల రాజ్యాలు
కర్షకా! నీకఖ్ఖు కదలినన్నాళ్ళే

అనే ఈ గేయం రాసాడు ఆధునిక కవితా యుగంలో కాళోజి నా గొడవ (కవితలు 1953) స్పష్టమైన సామాజిక దృక్పధాన్ని తెలియజేయడంలో వస్తుపరంగా అభివ్యక్తి పరంగా శిల్పపరంగా సరళమైంది లయామయంగా గతిశీలంగా లలితంగా, స్పష్టంగా సూటిగా భావాత్మక సంవేదన అంతస్సూత్రంగా కాళోజి కవిత సాగింది దాదాపు ఏడు దశాబ్ధాలపాటు సామాజిక సమస్యలకు సమాంతర స్పందనలే కాళోజి నా గొడవ ప్రశ్నాత్మకమైన సామరస్యం స్వభావానికి సరిపడని ధిక్కార స్వరం ఆయన కవిత్వంలో గోచరిస్తుంది కాళోజికి పార్టీ పాతివ్రత్యం గిట్టదు రాజ్య హింస, అధికృత హింసనచ్చుదు బహుభాషా సంస్కృతులతో సహజీవనం చేసిన విప్లవ ఋషి, సజీవోద్యమ కవి

కాలోజి జీవితమే ఉద్యమం ఉద్యమమే ఆయనకు జీవితం కాళోజి జీవితమే కవిత్వం కవిత్వమే కాళోజికి జీవితం నిబద్ధత నిమగ్నతలు కాళోజి కవిత్వానికి ప్రాణం సామాన్య జీవితం గడుపుతూ అసమాన్యుడుగా లోకోత్తర సత్యాలను, సృజనాత్మకమైన పద్ధతిని కవితల్లో అభివ్యక్తపరిచాడు "We make out of quarrel with others rhetoric, but of the quarrel with ourselves, poetry ఇతర్లతో కలహం వల్ల మనకు వాక్చాతుర్యం వస్తుంది, స్వయంగా మనతోనే కలహం వల్ల కవిత్వం వస్తుందని యీట్సు కవి అంటాడు కాళోజి విషయంలో ఇతర్లతో కలహం వల్ల కవిత్వం వచ్చింది స్వయంగా మనతో కలహం వల్ల వాక్చాతుర్యం వచ్చింది కాళోజి జీవితం యొక్క పవిత్రాశయాల్లో ఒకటి స్వేచ్ఛగా జీవించడం స్వేచ్ఛగా ఆలోచించడం కాళోజి నాలాంటి చిన్నవారితో స్నేహం చేసాడు, పెద్దవారితోను చేసాడు కొన్ని విషయాల్లో అందరితో విభేదించాడు ఆయన స్నేహశీలం తెలంగాణా అంతా వ్యాపించింది

స్నేహితులను ఎంతగా ప్రేమించాడో అంత నిష్పాక్షికంగా నిర్భీతిగానూ వారితో విభేదించాడు వారి కష్టాలకు సుఖాలకు స్పందించాడు జీవితాన్ని విచక్షణాత్మకంగా అనుభవించాడు స్థితప్రజ్ఞుడుగా జీవించాడు మిత వాదుల్లో అతివాదిగా అతివాదుల్లో మితవాదిగా సంచరించాడు

అన్యాయాన్నెదిరిస్తే
నాగొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి
అన్యాయాన్నెదిరించినవాడు
నాకు ఆరాధ్యుడు

అంటూ ఆంధ్రప్రదేశ్‌లో తీవ్రవాద ఉద్యమాన్ని అభిమానించాడు రాజ్యాంగాసను ధిక్కరించాడు కాళోజి శిష్యుడు ఎ వి నరసింహారావు ప్రధానమంత్రిగా ఉండిన కాలంలో పద్మ విభూషణ్ ఇస్తే స్వీకరించాడు కాకతీయ విశ్వ విద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్‌ను స్వీకరించాడు అణా కథలు (1941) కాళోజి కథలు (1943) పార్థిక వ్యయము (1946) నా గొడవ (1953), జీవన గీత (1968), తెలంగాణా ఉద్యమ కవితలు (1969 / 70) కాళోజికథలు (2000) కాళోజి ప్రచురించారు నా పరాయి తనం పొగొట్టి ఆర్ద్రత చెలిమి చెలమలో చిందునన్నాళ్ళు నా ఇరుకుల చేరి దూరి అడ్డమైన మురికినంతా తన్నేసి జీవన నది జీవనదిగా ప్రవహించు నన్నాళ్ళు నేను బ్రతికే ఉంటా"నని మిత్రులందరికి చెప్పిన ప్రజాకవి కాళోజి 13 నవంబర్ బుధవారం 2002న నిమ్స్ హాస్పటల్‌లో మరణించారు కాళోజి, జయప్రకాశ్ నారాయణ మరణించినపుడు "చావు నీది పుట్టుక నీది బతుకంతా దేశానిది" అన్నమాటలు కాళోజికీ వర్తిస్తాయి ప్రజాకవి నాకు చిరకాలమిత్రులు అప్పులు కాళోజికి ఇదే నా అశ్రునివాళి

# ప్రజాకవి కాళోజీ

- అంపశయ్య నవీన్

"పుటకనీది, చావునీది బ్రతుకంతా దేశానిది' అని కాళోజీ జయప్రకాష్ నారాయణను గూర్చి చెప్పిన మాట కాళోజీ జీవితానికి కూడా వర్తిస్తుంది ఎనభైతొమ్మిది సంవత్సరాల క్రితం (9 9 1914) కర్ణాటక రాష్ట్రంలోని రట్టిహళ్ళి గ్రామంలో (బీజాపూర్‌జిల్లా) జన్మించిన కాళోజీ జీవితంలో ఎక్కువభాగం ప్రజాపోరాటాల్లో పాల్గొనటానికే వినియోగించబడింది అయినప్పటికీ కాళోజీ ప్రధానంగా కవి కవిగా కాళోజీని అంచనావేసే ప్రయత్నమే ఈ వ్యాసం

"తనకీ ప్రపంచానికీ మధ్య సామరస్యం కుదిరేదాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వమంటాడు చలం' మహాప్రస్థానానికి రాసిన ముందుమాలో కాళోజీ రాసిన కవిత్వానికి ఈ నిర్వచనం చక్కగా సరిపోతుంది కాలోజీకి ప్రపంచానికీ మధ్య సామరస్యం కుదరలేదు ఆ సామరస్యం కోసం కాళోజీ తన బాల్యం నుండి తనతోను, ప్రపంచంతోనూ పోరాటం చేస్తూనే ఉన్నాడు ఆ పోరాటాన్ని కవిత్వీకరిస్తూనే ఉన్నాడు

'అవనిపై జరిగేటి అవకతవకలు చూసి ఎందుకో నాహృదిని ఇన్న ఆవేదనలు పరుల కష్టము చూసి కరిగిపోవును గుండె మాయ మోసం చూసి మండిపోవును ఒళ్ళు మరి అవకతవల్ని సవరించే శక్తి సామర్థ్యాలా? అవిలేవు తప్పదిద్దగలేను దారి చూపగలేను తప్పు చేసినవాని దండింపగాలేను అవకతవకల్ని నేను సవరింపగాలేప్పుడు పరుల కష్టాలతో వనియేమినాకనెడు అన్యులన జూచైన హాయిగా మనలేను అంటాడు కాళోజీ "సామరస్యం స్వభావానికే సరిపడదు కాబట్టి అడుగడుగునా సంఘర్షణ' అని కూడా చెప్పుకున్నాడు కాళోజీ

చుట్టుపట్ల జరిగే ప్రతిసంఘటనకూ స్పందించటం ఆలోచన, అసమ్మతి, నిరసన ధిక్కారం ప్రతిగటన ప్రతిగటనా కార్యక్రమంతో ఆయన హృదిలో కల్గే ఆవేదనల్ని తీర్చుకోవడానికి ఆయనకు కవిత్వం ఒక వామిక అయ్యింది గుండెలబరువు తీర్చుకోవడంగా పనిచేసింది కాబట్టి కాళోజీది ప్రధానంగా కవి హృదయం కాళోజీకి తన గుండెల భారాన్ని తీర్చుకోవడానికి మరో వాహిక ప్రజాపోరాటాల్లో పాల్గొనటం ఇలా రెండు మార్గాల్లో కాళోజీ తన ధర్మాగ్రహాన్ని నియంత్రించుకోవడానికీ తృప్తి పరచుకోవడానికీ ప్రయత్నించాడు

కాళోజీ స్వేచ్ఛకు చాలా ప్రాధాన్యం ఇచ్చాడు నా గతిని ఆకట్టడానికి నన్ను అదుపులో పెట్టడానికి ఎన్ని శాస్త్రాల కట్టడాలు ఎన్నెన్ని ఇజాలగతులు, ఏదో మాత్రానికి తత్వానికి ఇజానికి కట్టుబడిపోయి జీవిస్తున్న ప్రాణులకు స్వేచ్ఛాజీవనం సున్న పరాయిభావాలు, పరాయి చూపులు పరాయి చెవులు పరాయి బాస పరాయి నడక పరాయి చేతలు అన్నీ పరాయివే అట్లా కాకూడదని నా తిక్క అన్నాడు కాళోజీ

"ఇచ్ఛయే ఈశ్వరుడని ఖచ్చితంగా నమ్ముతాను

ఇచ్ఛ వచ్చినట్టు నేను ఆచరించి తీరుతాను" అంటాడు కాళోజీ ఆయన తన జీవితంలో ఎప్పుడూ ఈ స్వేచ్ఛను కల్పోలేదు ఇచ్ఛ వచ్చినట్లుగానే ఆచరించాడు ఆయన రాసిన కవిత్వంలోనూలో ఆయన ఈ ఇచ్ఛే ఈ స్వేచ్ఛా భావమే ప్రధానంగా కనిపిస్తుంది ఆయన మామూలుగా కవులు పాటించే ఏ కవితా నియమాలనూ పాటించలేదు ఆయనలోంచి ముఖ్యంగా ఆయన ధిక్కార మనస్తత్వంలోంచి కవిత్వం

చాలా సహజంగా జాలువారింది అట్లా సహజంగా ఆయనలోంచి వెలువడిన కవిత్వాన్ని శబ్దరమ్యతతో నింపాలనిగానీ అలంకారాలతో అలంకరించాలనిగానీ ఆయన ప్రయత్నించలేదు ఆయన కవిత్వంలో కనిపించే శబ్దరమ్యతగానీ అలంకారాల గుబాళింపుగానీ చమత్కారాల చెమక్కులుగానీ ప్రయత్నపూర్వకంగా ఉత్పన్నమైనవికావు ఒకసారి ఆయన హృదయంలోంచి ఉబికి వచ్చిన కవిత్వం యే కృత్రిమ ఆచ్ఛాదనలు లేకుండా అలాగే ఉండిపోయిందే తప్ప దాన్ని శబ్దరమ్యత కోసంగానీ అలంకారాల కోసం మార్చాలనిగానీ నగిషీలు చెక్కాలనిగానీ కాళోజీ పెద్దగా ప్రయత్నంచెయ్యలేదు ఆయన సహజకవి ఈ కారణం వల్లనే కాళోజీ కవిత్వంలో రూపానికి తగిన ప్రాధాన్యం ఉండదని కవిత్వ సాంద్రత తక్కువనీ, చాలా చోట్ల ఆయన కవిత్వం పలచబడి పోతుందని విమర్శకులభిప్రాయ పడ్డారు ఆయన కవిత్వం కొన్ని చోట్ల సానబట్టని ముడి పదార్థంగా ఉండిపోయిందని కూడా కొందరన్నారు

యే సాహిత్య ప్రక్రియలోనైనా రెండు ప్రధానమైన అంశాలుంటాయి ఒకటి రచయిత యేం చెబుతున్నాడు రెండవది ఎలా చెబుతున్నాడు అన్నవే ఈ రెండు అంశాలు మొదటిదాన్ని వస్తువనీ, రెండవదాన్ని శిల్పమనీ కాక రూపమనీ లేక అభివ్యక్తి అని అంటారు గొప్ప రచనలో ఈ రెండూ పడుగు పేకల్లా కలిసి పోతాయి అందుకే ఈ రెండూ వేర్వేరుకావని ఒకటేనని గొప్ప కవిత్వంలో ఈ రెండూ చాలా సహజంగా కలసిపోతాయని విమర్శకులంటారు అయితే కాళోజీ యేం చెబుతున్నాడనికే ప్రాధాన్యం ఇచ్చాడు తప్ప ఎలా చెబుతున్నానన్న దానికి యేనాడూ ప్రాముఖ్యం ఇవ్వలేదు కవిత్వంలో భావమే ప్రధానం తప్ప భాష కాదంటాడు భావానికనువైన భాషలేదని, భావాన్ని అణచుకోవడం నేరమంటాడు మనకు తెలిసిన భాసలోనే మన భావాల్ని చెప్పాలేతప్ప శబ్దరమ్యత కోసం నిఘంటువుల్లోంచి పదాల్ని సేకరించి భాషతో సర్కస్‌ఫీట్లు చెయ్యొద్దంటాడు ఈ కారణం వల్లనే కాళోజీ కవిత్వాన్ని ప్రజలందరికీ తెలిసిన భాషలో రచించాడు అందుకే ఆయన అసలుసిసలైన ప్రజాకవి అయ్యాడు ప్రజాకవి అని ఎవర్ని అనాలి అన్న అంశాన్ని గూర్చి రెండు మాటలు

వేమనను ప్రజాకవి అన్నారు ఎందుకు? రెండు కారణాల వల్ల వేమన ప్రజాకవి అయ్యాడు సూక్తులుంటాయి అక్రమాలు అన్యాయాలు, వాటిని చీల్చి చెండాడం ఉంటుంది వేమన కవిత్వంలోని వస్తువును పరిశీలించినప్పుడు మనకివన్నీ కనిపిస్తాయి అభివ్యక్తి విషయానికొస్తే ప్రజలందరు మాట్లాడుకునే భాషలోనే వేమన తన కవిత్వాన్ని రూపొందించాడని మనకర్థమౌతుంది 'ఉప్పుకప్పురంబు నొక్క పోలిక నుండు, చూడచూడ రుచుల జాడవేరు పురుషులందు పుణ్యపురుషులు వేరయా విశ్వదాభిరామ వినురవేమ!' లాంటి ప్రజాబాహుళ్యానికంతటికీ చాలా సులభంగా అర్థమయ్యే పద్యాల్ని వేమన కొల్లలుగా రాశాడు ఈ పద్యాల్లోని భావాన్ని అరటిపండు వొలిచి చేతిలో పెట్టినంత సులభశైలిలో వేమన చెప్పాడు తమ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పరిశీలించినప్పుడు సగటు మానవుల్లో కల్గే భావాలనే ఆ సగటు మానవులు తమ దైనందిక జీవితంలో మాట్లాడుకునే భాషలోనే కవిత చెప్పినవాడు ప్రజాకవి ఉదాహరణకు "అన్నపురాసులు ఒకచోట ఆకలి మంటలు ఒకచోట" అన్నాడు కాళోజీ ఈ మాటల్లో ఉన్న భావం మామూలు మానవులందరికీ కల్గే అవకాశం ఉంది ఈ భావాన్ని భాషలోకి అనువదించిన విధానం కూడా మామూలు మనుష్యులకు సాధ్యమయ్యేదే ఇలాంటి కవితాపంక్తుల్ని విన్నప్పుడు ఓ సగటు మానవుడు 'సరిగ్గా నేననుకున్నదాన్నే ఈ కవి చెప్పాడే!' అనుకొని ఆశ్చర్యపడ్తాడు ఇలా ఓ కవిత విన్నప్పుడు లేక చదివినప్పుడు సమాజంలోని అధికశాతం మంది ప్రజలు' ' నేనూ ఇలాగే అనుకున్నాను'' అంటూ ప్రతిస్పందించటమే ప్రజాకీయ కవిత ముఖ్య లక్షణం

అలాంటి కవితలు రాసినవాడే ప్రజాకవి ఇలాంటి కవితలు చదివినప్పుడు కళ్లే ఆనందాన్ని కంటే విన్నప్పుడు కళ్లే ఆనందం గొప్పగా ఉంటుంది

ప్రజాకవికి ప్రజాకవి కానివాడికి మధ్య ఉండే వ్యత్యాసాన్ని తెలియజేయడానికి మరో ఉదాహరణ

నా తెలంగాణా కోటి రత్నాల వీణ' అన్నాడు దాశరథి ఇది అందరికీ సులభంగా అర్థమయ్యే మాటే కానీ ఇది ప్రజాకీయ కవిత్వంకాదు ఎందుకంటే ఈ మాట వినేంతరవకు ఒక సగటు మానవుడికి తెలంగాణ గూర్చి ఇలా అనొచ్చు అనే భావం కల్గదు ఈ మాట విన్న తర్వాత కవి ఎంత బాగా అన్నాడ అనుకుంటాడే తప్ప "ఇలా నేను కూడా అనగలను, ఇదే భావం నాకూ్కడా కల్గింది'' అని అనుకోలేడు అదే 'అన్నపురాసులు ఒకచోటు ఆకలి మంటలు ఒకచోట' ' అన్న మాటలు విన్నప్పుడు ఈ మాటల్లో ఉన్న భావం ఈ మాటల్లో ఉన్న పదాలు రెండూ నాకు తెలిసినవే అని ఓ సగటు మానవుడు అనుకుంటే అది ప్రజాకీయ కవిత్వం అవుతుంది అలాంటి కవిత్వం చెప్పినవాడు ప్రజాకవి అవుతాడు పూర్వం వేమన ఇప్పుడు కాళోజీ అలాంటి ప్రజాకవులు కాళోజీని 'జ్రాకవి' అనడానికి ఆయన కవిత్వంలోంచి ఎన్ని ఉదాహరణలైనా చూపించవచ్చు

"రక్కసుని చావుచే రంజిల్లె జగమంచు
కోటి వెల్గులు చాటె నాటి దీపాలు
రక్కసులు బాధింప రక్షయే లేదనుచు
కోటిరీతుల చెప్ప నేటి దీపాలు" అన్న పంక్తుల్లో ఉన్న వ్యంగ్యం ప్రజా హృదయాల్లో వెంటనే పలుకుతుంది

వ్యంగ్యం కాళోజీ కవిత్వంలో ఒక ముఖ్యమైన అంశం ఈ దేశ ప్రజలు గాంధీ చెప్పిన మాటల్ని ఏనాడో మరచిపోయారని, ఆయన్నుపైపైన మాత్రమే పూజిస్తున్నట్టు నటిస్తున్నారని చెప్పడానికి కాళోజీ గాంధీని గూర్చి

'ఇంకేమి కావాలె ఇంకేమి చేయాలె
బతికిసన్నాళ్లు నిన్ను బాపూ అ౹ఎలిచితిమి
చనిపోయిన నిన్ను జాతిపిత జేసితిమి
ఏనాడో నిను మేము ఏసు గా జేసితిమి

ఎవని చేతనో నీవు ఏసగటు జూచితిమి' అంటాడు ఈ కవితలోని వ్యంగ్యం చాలా గొప్పది గాంధీని ఏసుగా చేయటంలో ఆయనపట్ల గౌరవమూ భక్తీ చూపినట్లే కాదు ఆయన సిద్ధాంతాల్ని దారుణంగా సిలువ వెయ్యటం కూడా ధ్వనిస్తోంది అలా చేసినవాడు సామాన్యుడే కానీ నేనలా చేశానని ఆ సామాన్యుడు అనుకోలేడు ఎవని చేతనో అలా జరిగిందని తన అంతరాత్మను ఓదార్చుకోవడానికి ప్రయత్నిస్తాడు గాంధీని భౌతికంగా గోడ్సే హత్య చేస్తే నైతికంగా ఆయనను ఈ దేశ ప్రజలందరూ హత్య చేశారు కానీ ఆ విషయాన్ని ఈ దేశ ప్రజలు అంగీకరించలేరు అందుకే 'ఎవని చేతనో నీవు ఏసగుట జూసితిమి" అనుకుంటారు నీ కోసం ఇంకా మే ఏంచెయ్యాలి? అని వాళ్ళ అంతరాత్మ వాళ్ళని ప్రశ్నిస్తుంటే రకరకాల సమాధానాలు చెప్పి దాని నోరు మూలయించే ప్రయత్నం చేస్తుంటారు కవి అయినవాడు ఒక జాతి అంతరాత్మలా పని చెయ్యాలి కాళోజీ ఇలాంటి కవితల ద్వారా ఆ పని చేశాడు

కాళోజీ తన సమకాలీన రాజకీయాల్ని రాజకీయనాయకుల్ని ఎద్దేవా చేస్తూ చాలా కవితలు రాశాడు "శాంతి శాంతి అంటూ ప్రజల్ని శాంతింపజేయడానికి ప్రయత్నించే రాజకీయ నాయకుల్ని ప్రశ్నించాడు

సామాన్య ప్రజల్లోని గొర్రెదాటుతనాన్ని ఎద్దేవా చేస్తూ కాళోజీ 'గొర్రెదాటు" అన్న గొప్ప ఖండిక

"దగా గడ్డి కరుస్తాంది గొర్రె
పగలగాలి పీలుస్తాంది గొర్రె
పగల నీళ్ళు తాగుతాంది గొర్రె

మందలపడి మురుస్తాంది గొర్రె
తెగ బలుస్తాంది గొర్రె
తమని పాలించే వాళ్ళను గుడ్డిగా నమ్మే ప్రజల
అమాయకత్వాన్ని ఎద్దేవా చేస్తూ
గొల్లన్న యాతనంతా తన కోసమే అనుకుంటుంది
గొర్రె
గొల్లన్న కలిచే మల్లన తానే అనుకుంటుంది గొర్రె
మోసంలో పడి మోచ్చం చూస్తాంది గొర్రె
మందలపడి మురుస్తాంది గొర్రె
తెగబలుస్తాంది గొర్రె అంటాడు కాళోజీ

కాళోజీ రాసిన కవితల్లోకెల్లా ఈ కవితని తలమానికమనదిగా నేను భావిస్తాను ప్రజల చైతన్యస్థాయి పెరిగితే తప్ప ఈ దేశంలో ప్రజాస్వామ్యం మనలేదన్న ధ్వని ఈ కవితలో ఉంది

కాళోజీ కవిత్వంలో మరో గొప్ప సుగుణం లోకం పోకడను తెలియజేసే అనేక సూక్తులను చెప్పడం ఆ సూక్తులన్నీ ఆయన జీవితానుభవంలోంచి ఉత్పన్నమైనవే సాంకేతికంగా ప్రపంచంలో ఎన్ని మార్పులొచ్చినా మౌలికంగా మానవుడి స్వభావం ఏమీ మారలేదని చెప్పడానికి

"ఏడు మారినా ఈడు ముదిరినా
ఏమి మారినది ఈ లోకంలో?
రాయి రువ్వినా రాకెట్ విసిరినా
గిట్టని వానిని కొట్టుటకే కద!" అంటాడు

మనిషిలోని పోట్లాడే మనస్తత్వం పోదనీ, ప్రతి చిన్న విషయానికూడా మనుషులు తమలో తాము కలహించుకుంటారనీ చెప్పటానికి

"చాప చింపు సామ్రాజ్యం
కోడిగుడ్డు కోహినూర్
పాటిసమన్ను ప్లాటినం
ఏదైతేనేం? ఏదైతేం?
పోటీపడి కాటులాడ ఏదైతేం?
అడవి మనిషి ఆచార్యుడు
పసిబాలుడు పండు ముసలి
బిచ్చగాడు లచ్చిమొగుడు
తొత్తుకొడుకు - పెత్తందార్
ఎవడైతేనేం? ఎవడైతేనేం?

పోటీపడి కాలులాడ 'అంటూ పోటీపడి కాటులాడ అన్న కవిత చెప్పాడు

నిరాశకు దురాశకు మధ్య వ్యత్యాసాన్ని చెబుతూ 'ఉదయం కానే కాదనుకోవడం నిరాశ ఉదయించి అట్లానే ఉంటుందనుకోవడం దురాశ అంటాడు

లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ గురించి చెబుతూ

'పుటకనీది / చావునీది
బ్రతుకంతా దేశానిది అని ఎంత గొప్పగా చెప్పాడో!
అల్పాక్షరాలతో అనంతార్థాన్ని పొదగగల్గినవాన్నే మహాకవి అంటారు అలాంటి మహాకవిత లక్షణాలు కాళోజీలో ఉన్నాయి

అయితే కాళోజీ అనేక ప్రజా ఉద్యమాలలో పాల్గొనటం వల్ల ఆ ఉద్యమాల గూర్చి చాలా కవిత్వం రాశాడు 1962లో చైనా భారతదేశం మధ్య యుద్ధం జరిగినప్పుడు, 1970, 71లో పాకిస్తాన్ నుండి బంగ్లాదేశ్ విముక్తి కోసం సాగిన పోరాట కాలంలో, 69 70లలో ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం సాగిన ఉద్యమ కాలంలో కాళోజీ ఈ పోరాటాలను గూర్చి చాల కవిత్వం రాశాడు కానీ ఈ కవిత్వంలో కవిత్వ సాంద్రత తగ్గిపోవడం కనిపిస్తుంది అదే స్వాతంత్ర్యానికి పూర్వం నిజాం ప్రభుత్వ నిరంకుశపాలననూ, రజాకార్ల దురాగతాలను ఎండగడ్తూ రాసిన కవితల్లో కవిత్వ సాంద్రత పుష్కలంగా ఉంది

కాళోజీ కవిత్వం రాయడంతోటె తృప్తిపడకుండా అనేక ప్రజాపోరాటాల్లో పాల్గొన్నాడు స్వాతంత్ర్యానికి

పూర్వం హైదరాబాద్ సంస్థానంలో నిజాంరాజు నిరంకుశపాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పాల్గొన్నాడు ఆనాటి నిజాం ప్రభుత్వం అయన్నుజైల్లో పెట్టింది ఆనాటి అంధ్ర మహాసభ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొని కొన్ని ముఖ్యమైన తీర్మానాలకు కారకుడుగా పని చేశాడు తెలంగాణలో నక్సలైట్ ఉద్యమం ప్రారంభమయ్యాక బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేంగా పోరాడాడు పౌరహక్కుల సంఘాల కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నాడు అనేక చోట్ల రహక్కుల గ్బా నమాజాన్ని అన్యాయాల నుండి అక్రమాలనుండి కాపాడటంలో పౌరుల బాధ్యతల్ని గూర్చి సుదీర్ఘమైన ఉపన్యాసాలు చేశాడు 'రాజ్యహింస తప్పు ప్రతిహింస తప్పుకాదు' రాజ్యహింసను ఖండిస్తాను కాని ప్రతిహింసను సమర్థిస్తాను' అని ఎన్నోసార్లు చెప్పాడు అలా అని ఆయన నక్సలైట్లను పూర్తిగా సమర్థించలేదు ఎన్నికల్ని బాయ్‌కాట్ చెయ్యాలనీ ఓటేసిన వాళ్ళ చేతుల్ని నరికేస్తామని నక్సలైట్లు ప్రకటించినప్పుడు కాళోజీ ఎన్నికలు జరుగుతన్న రోజు ప్రప్రతమంగా పోలింగ్‌బూత్‌లో కెళ్ళి ఓటేసి బయటకొచ్చి పత్రికా విలేకర్లతో 'నేను ఓటేసి వచ్చాను నా చేతిని నరికెయ్యమనండి అంటి స్టేట్‌మెంటిచ్చాడు

కాళోజీ చివరి రోజుల్లో ఆయనను చాలా మం నక్సలైట్ సానుభూతిపరుడిగా అర్థం చేసుకున్నాడు ఇ కొంతవరకు నిజమేకావచ్చు కానీ ఆయన ఏనాం ఏఇజాన్నీ తలకెత్తుకోలేదు ఇజాలన్నీ మనిష స్వేచ్ఛ హరించటం కోసమే పుట్టాయన్నాడు ప్రజాస్వావ భావనను తనలో పూర్తిగ జీర్ణించుకున్న వాళ్ళల్లో కాళ ఒకరు 'నేను నీ అభిప్రాయంతో ఏకీభవించకపోవ కానీ నీ అభికప్రాయాన్ని స్వేచ్ఛగా ప్రకటించుకునే హక్కు కోసం అవసరమయితే నా జీవితాన్ని పణం పెట్టి పోరాడతాను" అన్న వాల్టేర్ మాటను కాళోజీ ఉపన్యాసాల్లో అనేకసార్లు ఉటంకిస్తుండేవాడు కాళ జీవితతత్వం ఏమిటి? అని ఎవరైనా అడిగితే అందు నా సమాధానం ఆయనొక ఉదార ప్రజాస్వామ్యవా (A Liberal democrat) మనసా వాచా కర్మణా ఉద ప్రజాస్వామ్యవాదిగా జీవితాన్నిపిన ఆ మహానుభావు నాజోహార్లు

*కాళోజీ ఆదర్శప్రాయుడు షూ మార్గాల వేరయ్యాయి అయినా 'కాళోజీ భూతం' ఈనాటికీ నన్నువెన్నాడుతుంటుంది ఏ పని చేసినా, చేస్తున్నా వేయబోయినా - ఏమంటాడోనన్నభయం అందుకే అనుకున్నాను నేను నా జీవిత చరిత్ర వ్రాయకూడదని వ్రాస్తే అబద్ధాలు వ్రాయల్సి వస్తుందేమోనని*

**- కాళోజీ 88వ పుట్టినరోజు సందర్భంగా**
**పి వి నరసింహారావు ప్రసంగంలో నుంచి**

# కాలోజీతో నా ఇంటర్వ్యూ...

- ఆదిరాజు వెంకటేశ్వరరావు

ప్రజాకవి కాళోజీ నారాయణరావు వంటి ఒక గొప్ప వ్యక్తి మహామనిషీ సన్మాన సంచికకో సంస్మరణ సంచికకోవ్యాసం వ్రాయాలంటే ఆయనతో ఎక్కువ పరిచయం ఉన్నవారికి ఇబ్బందికరంగా ఉంటుంది

1968లో తొలి పర్యాయం తెలంగాణా రక్షణల పొడిగింపు' ఉద్యమం సందర్భంలో నేను కాళోజీగారిని కలిసి ఎన్నో సంగతులు తెలుసుకున్నాను తరువాత ఎన్నో పర్యాయాలు కాళోజీగారిని హైదరాబాద్ వరంగల్ ఢిల్లీ నగరాలలో కలుసుకొని సమకాలీన పరిస్థితులపై సుదీర్ఘ చర్చలు జరపడం మాటలలోనే రాత్రులను క్షణాలుగా గడపడం జరిగింది

ప్రజాకవి కవిత్వం తెలంగాణా పీడిత ప్రజానీకానికి ఆయన అనుపమానసేవ గురించి ఎంతో ఆలోచించాను రోజులు దొర్లిపోయాయి డిసెంబర్ 12వ తేదీ గుజరాత్ పోలింగ్‌కు ముందు 1978లో ఆంధ్రప్రదేశ్ శాసనసభకు జరిగిన ఎన్నికలు గుర్తుకు వచ్చాయి ఈ రెండు ఎన్నికలకు కొంత పొంతన ఉన్నట్టు స్ఫురించి పాతకాయితాలు తిరగవేస్తుండగా 1978 ఫిబ్రవరి 23వ తేదీన నేను సత్తుపల్లి నుండి ఢిల్లీ పంపిన ఒక లేఖ కాపీ కనుపించింది

1978 ఎన్నికలలో ప్రజల అభ్యర్థిగా, శ్రీ కాళోజీ నారాయణరావుగారు సత్తుపల్లి నియోజకవర్గం నుండి జలగం వెంగళరావుతో ఢీకొన్నారు ప్రముఖ పత్రికా సంపాదకుడు నార్ల వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతన పలువు ప్రముఖులతో మహాబలవంతుడైన కాళోజీ నారాయణరావురు ఎన్నికల కమిటీ ఏర్పడింది ప్రముఖ న్యాయవాది శ్రీ సి పద్మనాభరెడ్డి వై కాశీపతి, ఎల్ వి భాస్కరరావు సిపిఎం ఉపాధ్యక్షులుగాను మరొక ప్రముఖ న్యాయవాది కె జి కన్నాభిరాన్ ప్రధాన కార్యదర్శిగాను న్యాయవాదులు శ్రీ కె ప్రతాపరెడ్డి శ్రీ ఎం వి రామమూర్తి కోశాధికారి ప్రచార కార్యదర్శిగా ఉన్న కమిటీ సభ్యులతో కలిసి పని చేసేందుకు నేనూ ఢిల్లీ నుంచి వచ్చాను

నాకు దొరికిన పాత ఉత్తరంలో ఒక పేరా ఇలా ఉన్నది ' కాళోజీగారు అభ్యర్థి అవడంతో సత్తుపల్లి ఎన్నికలు చాలా ఆసక్తి కరమలుపు తిరిగాయి ఇంతకు ముందు సత్తుపల్లి ప్రజలకు ఎన్నికల ప్రచారం పోటీ గురించి అంతగా తెలియదు ఖమ్మం వరంగల్ విజయవాడ విశాఖ హైదరాబాద్ ఢిల్లీ నగరాల నుండి కాళోజీపై అభిమానంతో స్వచ్ఛందంగా, సత్తుపల్లి వచ్చిన మూడు వందల మంది విద్యార్థులు మేధావులు సింహాలవలె మారుమూల గ్రామాలకు వెళ్ళి తిష్ట వేసి సంచలనం సృష్టించారు ప్రజాహక్కులను వెంగళరావు ప్రభుత్వం కాలరాస్తున్న తీరు ప్రజలకు వివరించి, ఆయన బండారం నిర్భయంగా బయట పెట్టేందుకు కాళోజీ తన అభిమానులను జయప్రదంగా ప్రేరేపించగలిగారు

' పౌరహక్కులను కాలరాస్తున్న ప్రభుత్వాల దమననీతికి వ్యతిరేకంగా కాళోజీ జరిపిన పోరాటాలలో సత్తుపల్లి ఎన్నికలు పరాకాష్ఠగా పేర్కొనవచ్చును ఇక్కడ పరిస్థితిని ఆయన తారుమారు చేశారు వెంగళరావుగారు వారం రోజుల క్రితం హైదరాబాద్‌లో ఒక పత్రికా గోష్ఠిలో మాట్లాడుతూ, నేను ఎన్నికల ప్రచారానికి సత్తుపల్లి వెళ్ళను అక్కడ నా చెప్పును నిలబెట్టినా గెలుపుఖాయం' అని చెప్పి బింకాలు పలికి, ఒక్కరోజు పర్యటనకై ఇక్కడకు వచ్చి గూటానికి కట్టిన ఎద్దువలె అయిదురోజులుగా

ఇక్కడే మకాం వేసి, ఊరూరా తిరుగవలసిన పరిస్థితి ఏర్పడింది।

పౌరహక్కుల అణచివేతకు వ్యతిరేకంగా సాహసోపేతంగా కాళోజీగారు వెలిబుచ్చిన అభిప్రాయాలను తిరిగి ఈ వ్యాసంద్వారా గుర్తు చేసుకోవడం యువతరానికి ప్రేరణ కాగలదని పాత ఉత్తరం వలన భావించాను

రాష్ట్రంలో తీవ్రవాదుల ఉద్యమ చరిత్ర నేను వ్రాశాను వారి సాయుధ పోరాటం అంతం ఎలా అవుతుంది? గ్రామీణ ప్రాంతాలలో శాంతియుత, సామరస్య పరిస్థితులు ఎలా పునరుద్ధరించవచ్చు? అవే జటిల ప్రశ్నలకు సమాధానాలు లేవు అయితే ఈ ప్రశ్నలకు ప్రజాకవి కాళోజి నారాయణరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు సమాధానాలు చెబుతున్నాయి సమాజంలో చెడును ప్రతిఘటించేందుకే సి పి ఎం ఎల్ పార్టీలు తప్పనిసరి పరిస్థితులలో ఆయుధాలు పట్టాయనేది కాళోజీ గారి వాదన

ఆగ్రహంతో తుపాకీ పట్టుకొని కాల్చేవాళ్ళకంటే లంచగొండితనం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, అక్రమసంపాదన, బంధుప్రీతి, మోసం మొదలైన నేరాలకు పాల్పడుతున్న అధికారులు, రాజకీయ నాయకుల వలన ఈ దేశం నాశనమైపోతున్నదని హింసావాదులకంటే అధికారంలో ఉండి, నేరాలు చేసే వారే ఎక్కువ ప్రమాదకారులని కాళోజీనారాయణావు విశ్వసించారు

ప్రభుత్వాల అవకతవకలే నక్సలిజం ఆవిర్భావానికి కారణాలనేది వారి నమ్మకం

'ఈనాటి పరిస్థితి ఆనాటికన్నా అధ్వాన్నంగా ఉన్నది గత 50 సంవత్సరాలలో సక్రమంగా ఎన్ని ఉద్యమాలు జరుగలేదు అయితే ప్రభుత్వం వాటిపట్ల ఎలా ప్రవర్తించింది ఆలోచించాలి ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా సక్రమంగా జరిగే ఉద్యమాలకు ప్రభుత్వం అడ్డుతగిలితే అవి అక్రమమార్గాన జరుగుతాయి ఈనాడు ఢిల్లీ నుండి పల్లె వరకు అవకతవకలు ఎక్కువైపోయాయి ఇక్కడ వాడు ఇన్ని కోట్లు తిన్నాడు అక్కడ వాడు అన్ని కోట్లు కాజేశారు అన్నీ కుంభకోణాలేనాయె అందుకే నిస్పృహ అసంతృప్తి తలెత్తి ప్రభుత్వంపై విశ్వాసం సన్నగిల్లితే పోరాటాలు ఆవిర్భవించడం తప్పదు వాటిలో ఎవరికి తోచినట్టు వాళ్ళు పోరాడారు జయప్రకాశ్‌నారాయణ వంటివాడు తన ఉద్యమం శాంతియుతంగా కొనసాగుతుంది అని హింసాత్మక సంఘటనలు జరగవని గ్యారంటీ ఇవ్వలేవన్నాడు

మీలాంటివారు నక్సలిజాన్ని విమర్శిస్తే విచక్షణా రహితంగా చేసే నేరాలు తగ్గిపోరేమోననే సూచనకు ప్రతిస్పందిస్తూ

"ఇజంను విమర్శించడం వలన ప్రయోజనం ఉండదు అసలు ఏ ఇజంలోను తప్పులేదు దానిని అమలు చేసిన వారిలోపంవల్లనే అది విఫలమైనదని కాళోజీ అన్నారు అలాగే భారతదేశంలో గాంధీయిజం విఫలం కావడానికి, ప్రజాస్వామ్యం అపసవ్యం కావడానికి అయన వారసులే బాధ్యులు తప్ప ప్రజాస్వామ్యంలో, గాంధీయిజంలో దోషంలేదు ప్రజాస్వామ్యం తప్పుగాదు, గాంధీయిజం తప్పుకాదు కానీ వాటిని ఆచరిస్తున్న పద్ధతి లోపభూయిష్టంగా ఉన్నది అందువలన గాంధీయిజంను విమర్శించి లాభంలేదు ఆ ఇజంను ఆచరించడంలో పొరపాటు చేసేవాడినే విమర్శించాలి

రైల్వేస్టేషన్స్, టెలిఫోన్ ఎక్స్చేంజిలు విధ్వంసం చేసి ప్రజలకు ఇబ్బంది కలిగించవద్దు అని నక్సల్స్‌కు మీరు ఎందుకు విజ్ఞప్తి చేయరు' అంటే "ప్రభుత్వం పై ప్రజలకు ఎంత ద్వేషభావం కలిగితే ఉగ్రవాదం ఆచరించేవాళ్ళకు అంతమంచిది ఈ ప్రభుత్వం పరిపాలించలేదు మనకు రక్షణ కలిగించలేదు అనే నమ్మకం ప్రజలలో కలిగించేందుకు తీవ్రవాద వర్గాలు హింసాత్మక చర్యలకు పాల్పడతాయి అందువలన ఎవరు బెదిరించినా విజ్ఞప్తి

చేసినా వారు పట్టించుకోరు ఉగ్రవాదాన్ని ఖండించడం విమర్శించడం అభినందించడం కంటే ముందు ఆ వాదం తలెత్తటానికి కారణాలు ఏమిటని మనం ఆలోచించాలి

''నక్సలైట్స్ విధ్వంసక చర్యలను ప్రజలు ప్రతిఘటించాలి అంటే ఎలా సాధ్యం? వాళ్ళు ప్రభుత్వ (పోలీసు) హింసను ప్రతిఘటించలేకపోతున్నారు వారి హింసను అడ్డుకోలేకపోతున్నారు ఉన్నవాడికి పేదోడికి మధ్య ప్రభుత్వం వ్యత్యాసం చూపుతున్నది ఈ నేపథ్యంలో నేనొక ఇజం' ను ఖండించడం అభినందించడం ప్రసక్తతం కాజాలదు జరుగుతున్నదేమిటి కొందరు నక్సలిజం నక్సలైట్ చర్యలను మాత్రం ఖండిస్తున్నారు మరికొందరు పోలీసులను వారి చర్యలను తూర్పారబడుతున్నారు దీని వలన లాభంలేదు, దాని వలన లాభంలేదు ఎవరైనా ఏ సమస్యపైన అయినా హేతుబద్ధ న్యాయసమ్మత నిష్పక్షపాత వైఖరి అవలంభించాలి

పౌరుల స్పందన వేదిక అటు పాటకులకు, ఇటు విప్లవకారులకు చెప్పదలుచుకున్న మాటలు చెప్పింది అలాగే న్యాయమూర్తి కృష్ణయ్యర్‌గారు కూడ రెండు పక్షాల హింసా పద్ధతులను వ్యతిరేకించారు తుపాకులు సమస్యలను పరిష్కరించజాలవని ఉభయులకు ఉద్బోధించారు ఆయన ఎవరికొమ్ముకాయలేదు

గ్రామాలలో ఉన్నవారు సాయుధ తీవ్రవాదులను ప్రతిఘటించి ఎలా బ్రతుకుతారు వారికి రక్షణ ఎవరు అందుకే బకాసురిడితో గ్రామస్థులు రాజీ చేసుకొని బ్రతికినట్టే నక్సలైట్స్‌తో రాజీ తప్పడంలేదు లేకుంటే గ్రామం వదిలి పారిపోవాలి ఎటుపోతారు ఎలా బ్రతుకుతారు అందుకని తీవ్రవాదులను ప్రతిఘటించడం కంటే, తుపాకీ సంస్కృతి తలెత్తడానికి గల కారణాలు అర్థం చేసుకుని వాటిని సరిచేయాలి అన్యాయాలను ప్రతిఘటించేందుకు ఎవరికితోచిన మార్గం వారు ఎన్నుకుంటారు అన్నింటి కంటే వెలువైనది ప్రాణమని తన పోరాటంలో ప్రాణాన్నే ఫణం పెట్టేందుకు సిద్ధపడ్డాడంటే ఎంతకు తెగించారో అర్థం చేసుకోవాలి

పిరికిపంద బ్రతుకుకన్న వాంస వేయిరెట్లు మిన్న అన్నోడు మావో కాదు మనోడు మహాత్మాగాంధీ అంటూ, తెలంగాణ ప్రజలను ప్రత్యేకించి యువకులను అటు పోలీసు ఇటు తీవ్రవాదులు బెదిరించి భయకంపితులను చేసి నిర్మొహమాటంగా మాట్లాడే శక్తి కూడాలేని వారిలా చేస్తున్నారని ప్రజాకవి కాళోజి నారాయణ రావుగారు బాధపడ్డారు ఎవరికి సహాయపడినా ప్రజలు భయంతోనే తప్ప ప్రేమతో ఆ పనిచేయడం లేదని ఆయన అన్నారు

'శాంతియుత పరిస్థితి నెలకొనేందుకు దేశంలో సామాన్య జీవనం ఏర్పడేందుకు ఎవరు ఏ ప్రయత్నం చేసినా నేను హర్షిస్తాను సమర్థిస్తాను, సహాయం చేస్తాను అయితే ఆ ప్రయత్నం నిష్పక్షపాతంగా ఉండాలి అందరితో కూర్చొని నిష్పక్షపాతంగా ఆలోచించి ఒక పరిష్కారాన్ని సూచించాలి

అంతే కానీ, ఆయుధాలు త్యజించి జాతీయ జీవన స్రవంతిలో చేరమని నక్సలైట్స్‌ను కోరుతూ అర్థం పర్థంలేని గావుకేకలు వేయకూడదు ఏమిటి వారు చెప్పే జాతీయ జీవన స్రవంతి? అసలు ఈ మెయినస్ట్రీం అనేది మరచిపోవాలి ఏమిటది? అబద్ధాలకోరు, దొంగ న్యాయవాదులు లంచగొండి అధికారులు, మోసాలు చేసే కంట్రాక్టర్స్, నేర చరితులైన రాజకీయ నాయకులు కలిసి ఈ తప్పుడు వ్యవస్థ కలుషిత సమాజంలో దోపిడి కొనసాగించడమే కదా? ఈ మెయిన్‌స్ట్రీంలో నక్సలైట్స్ కూడ భాగస్వాములై తలో పదిలక్షల్లో, పదికోట్లో సంపాదించుకొని నీతులు వల్లించడమా? ఆ మెయిన్‌స్ట్రీం వద్దు గాంధీగారి పేరుతో వల్లించే శాంతిపాఠాలు వద్దు గాంధీ గారి పేరుతో రాజకీయ నాయకులు చేసిన మోసాలు చాలు హింస తప్పు ప్రభుత్వ హింస మరీ

తప్పు ప్రతి హింస తప్పు కాదు అనే సూత్రం సామాన్య పరిస్థితి నెలకొనాలని కోరేవారు అంగీకరించాలి హింసకు పాల్పడే ప్రయివేటు వ్యక్తి ప్రాణానికి తెగించి చివరి ఆయుధంగా దీనిని వినియోగిస్తాడనే సంగతి గుర్తించాలి

అంత మాత్రంచేత నక్సలైట్ కార్యకలాపాలు అన్నీ కాళోజీ సమర్థించారని కాదు నక్సల్స్ ఎన్నికలు బహిష్కరించమని పిలుపు ఇచ్చారు ఓటు వేసిన వాడి చేతులునరుకుతామని బెదిరించారు ఈ బెదిరింపులకు బెదరవద్దని బహిరంగంగా ప్రజలను కోరారు అందరికంటే ముందు నిల్చొని ఓటు ఆయన వేశారు వారు చేసిన హత్యలను ఖండించారు నక్సలైట్స్‌ను బహిరంగంగా విమర్శించారు వాళ్ల చేసిన ఒక హత్యను పోలీసులు దారుణంగా హింసించి ఘాతుకంగా చంపిన నేరాల కంటే పెద్ద నేరమని అభివర్ణించారు

తమ తపనకు అద్దంపడుతూ కాళోజీగారు మా చివరి సమావేశంలో నేను రికార్డు చేసిన తుదిగా వెల్లడి చేసిన భావాలు నేను మరువలేనివి

ఆయన మాటలు

ఈనాడు దేశంలో పరిస్థితి ఏమిటి శాంతియుతంగా గౌరవంగా ప్రజలు జీవించేట్టు సంక్షేమ రాజ్యమని చెప్పుకునే మన రాజ్యం ఉన్నదా? స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంలో పార్లమెంటు ప్రత్యేక సమావేశాలు (1996)లో జరిగినప్పుడు ప్రధానమంత్రి నుండి పీర్‌సాబ్ వరకు ప్రతి సభ్యుడు గొంతెత్తి దేశంలో జరిగే అన్యాయాలను నిరసించారు ఈ కుళ్ళును తొలగించి దేశాన్ని కాపాడేందుకు మరొక స్వతంత్ర సమరం అవసరమన్నారు ఒక విప్లవం ఒక మహోద్యమం రావాలని అందరూ అన్నారు రానీయండి అలాంటి ఉద్యమం వచ్చిననాడు నక్సలైట్స్ ఉద్యమం కనుమరుగైపోతుంది తుపాకులు లేకుండా అన్యాయాన్ని ప్రతిఘటించే వారు ముందుకు వస్తే తుపాకుల అవసరం ఏముంటుంది

నేను శలవు తీసుకున్నాను కాళోజీ గారు తమ్ముడు ఆదిరాజు వేంకటేశ్వరునకు కానుక' అని వ్రాసి సంతకం చేసి జ్ఞాపికగా నా గొడవ బాపూ బాపూ బాపూ' అనే గ్రంథాన్ని బహూకరించి ఆప్యాయతతో వీధి వరకూ వచ్చి వీడ్కోలు తెలిపారు

# నా గొడవే నా 'అన్వేషణ'

- డా॥ కాళోజీ నారాయణరావు

"దేవుడు దేవుడు దేవుడు దేవుడు లేందెవరికి మనిష మనిషికి ఒక్కొక్క మనసు మనసు మనసుకు ఒక్కొక్క దేవుడు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క దేవుడు ఎప్పుడూ ఏదో ఒక దేవుడు నా గొడవ

దేవులాట దేవుడు వెతుకులాట వెతుకుడు దీనికే అన్వేషణ అనేమాట అని నా అన్వేషణ (వెతుకులాట)లో తేలిన సంగతి సారాంశం జీవి కవసరాల వేట చీకట్లో పునుకులాట ఎత్తువంతులది దారి ఎరుగక సాయ సవారి ముందునుయ్యి వెనుక గొయ్యి పెనం బైటబడిన పొయ్యి గగనకుసుమాల కొరకని సగం క్రింద తవ్విన గని' ( నా గొడవ)

మనసు వైరుధ్యాల పుట్ట జిహ్వాకోరుచి పుర్రెకోబుద్ధి' అని సామెత కాని ఓ రుచి ఓ బుద్ధి అన్నది కూడా నిజం కాదు నాలుకకు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రుచి ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క బుద్ధి బుర్రకు నా బుద్ధి విషయం నా రుచి విషయం మరొకరికికాదు నా వరకే నాకే విశ్వాసం లేదు ఎప్పుడే ఆలోచన వుడుతుందో ఎప్పుడేమి రుచిస్తుందో చెప్పలేను ఇటువంటి నా మనసును అదుపులో పెట్టాలని, నిగ్రహించాలని ఏదో ప్రత్యేకమైన విధంగా నడిపించాలని పిల్లబాటలు రహదారుల నిర్మాణం జరుగుతుంది కాని ఏం లాభం? రహదార్ల దారి రహదార్లదే పిల్లబాటల బాట పిల్లబాటలదే మనసు మాత్రం తుచ తప్పకుండా ఆ బాటల బడి సాగనివ్వదు బతుకు సామరస్యం కుదుర్చుకొని బతుకు ప్రయాణం సాగించడం అనివార్యమైనప్పుడే సంఘర్షణ నుండి విరమణ గెలుపు అవకాశం లేకుంటేనే లొంగిపోవడానికి మరోపేరు సామరస్యం లొంగదీయడానికి తుది ఘట్టం సంభవించినాక ఏదో పోనీ తెగేదనుక బిగిస్తే మన కసి తీరినా, తర్వాత మన పెత్తనానికి వీలుగా ఎదుటి వాడు బతికి ఉండాలె గద? అందుకే వాణ్ణి పూర్తిగానాశనం చెయ్యాక సంధి సామరస్యం సంఘర్షణ సహజం అది ప్రాణిధర్మ, సామరస్యం స్ట్రాటజీ ఎత్తుగడ వీలున్న ప్రతిచోట వీరప్రవీగుచు అపర వాట్లరైతాను నే వాట్లరైతాను తలదన్ను వానికడ తలవంచి దయ అనుచు గాంది నౌతాను నే గాంధినౌతాను శాంతి సభలు సంధి చర్చ సంఘర్షణ పూర్వావధి

మానవ సమాజంలో ప్రతిదీ తప్పాడు ప్రయోగమే ప్రయోగాత్మకం బతుకు బతుకు ప్రయాణం నిండా అడుగడుగున ప్రయోగాలు వాటంకొద్దీ వైష్ణవం ఏరోటికాడిపాట ఆరోటికాడ వీలుంటే జుట్టు లేకుంటే కాళ్ళు అడుగడుగున బతుకుటకని పడేపాట్లకు ఓ సిద్ధాంతం లేదు ఓ విశ్వాసానికి కట్టుబడి వర్తించడం లేదు బతుక్కి బతుకు తప్ప మరో సిద్ధాంతం లేదు పెద్ద ఆపదకల ప్రాణాపాయాన్ని తప్పుకొని చిన్న అపాయానికి హానికి తలవొగ్గి బతుకు సాగించడం దీని పేరే ప్రాణిధర్మం అది ప్రతి ప్రాణికి పుట్టుకతోనే సహజంగా అబ్బుతుంది తన అలోచనకనుకూలమైన చర్యను నిర్ణయించుకొని - నిర్ణయం ఎవనిదివానిదే ఎప్పటికప్పుడు అవసరమైనదే ఆలోచన వలెనే ఆచరణ నిర్ణయం కూడా ఎప్పటికప్పుడు మారుతూనే వుంటుంది ఇటువంటి చిత్తవృత్తి గల మనిషిని ఏదోమార్గాన పెట్టాలని ఆ మార్గాన్నే నడవచేయాలని 'మేధావి వర్గంలోని వ్యక్తుల వ్యక్తిగత సామూహిక కృషి - సిద్ధాంతాల రహదారుల నిర్ణయం తాను ఏర్పాటు చేసిన సిద్ధాంత మార్గాన నడవడానికి ఒప్పించాలని ప్రబోధాలు ప్రవచనాలు భగవంతుడు చెప్పినాడని, ఋషి చెప్పినాడని ప్రవక్త చెప్పినాడని ఆకాశవాణి పలికిందని దేవవాణి అని జనుల ప్రభావితులను చేయడానికి ప్రయత్నాలు ఇట్లా ఏర్పడినవెన్నో సిద్ధాంతాలు ప్రతి

సిద్ధాంత మార్గంలో మళ్లీ ఎన్నో ఉపమార్గాలు ఉపమార్గాల దర్శకత్వం చేసే గురుపరంపరలో పరస్పర విభేదాలు ఆయా సిద్ధాంతాలయెడ విశ్వాసం జనులు ఆయోమయం పాలు సిద్ధాంతం ఏర్పాటు చేసిన రహదారికి తర్వాత ఏర్పడ్డ ఉపమార్గానికి పోలు పొంతన లేని వికట స్థితి ప్రతి ఉపమార్గ నిర్దేశకుడూ తన ఎల్లబాటే రహదారి అని ▪ బాటను బట్టి పోతేనే 'అభివృద్ధి లోకకల్యాణం (విశ్వాసం ఉంటే) మోక్షప్రాప్తి అని నిర్ణయిస్తాడు ▪ పిల్లబాట నిర్మాత యెడ విశ్వాసం గల మూక దాన్నే అసలు రహదారి అని భావిస్తుంది ఇదంతా ఎందుకంటే మనిషిని సహజంగా ఆలోచించి తన నిర్ణయానికి రాకుండా చేయడానికి, నా గొడవలో 'చాదస్తం, 'నా ఇజం 'నన్ను ఆకట్ట అదుపులోపెట్ట' దిగులు' 'నేను బతికే వుంటాను' పోటీపడి కాటులాడ ఏడు మారినా ఈడు ముదిరినా' ఖర గేయాల్లో చెప్పిందిదే

ఈ గందరగోళం బతుకులో పోలు పొంతనలేని ఆలోచనలలో సమకూర్చుకున్న అస్తవ్యస్తపు అవగాహనతో వ్యక్తిగతమైన మనుగడలోనే క్రమం స్థైర్యం అవసరమైన ప్రతిభా పాటవాలు లేక తికమక పడుతూనే కుటుంబ సభ్యులు ఇరుగుపొరుగు దేశ జనులు మళ్లీ వారిలో మనపార్టీ మన మతం మన శాఖ మన గోత్రం, మన అభిరుచి మన ఆలోచనలకు సరిపడ అనుకూలమైన ఆలోచన గలవారితో అనుబంధం వ్యతిరేకులతో వైరం మనకన్న గొప్ప అనిపించుకొనే వారి విషయంలో గౌరవంతో అనుసరించే ప్రయత్నం మనం చెడు అనుకునే వారి విషయంలో అగౌరవం అనహ్యం, వారిని సరిదిద్దాలని ప్రయత్నం మెట్టుకు బతుకు వైరుధ్యాల కేంద్రం అన్నిటికీ మూలం మనసు అని ఒక నిర్ధారణ ఆ నిర్ధారణ సరైందని చెప్పడానికి కూడ వీలులేదు దానికి కూడా మనసొప్పదు నా ఆలోచనే కొత్తదని, అపురూపమైనదని, నా అవగాహనే సరైనదని తు చ తప్పకుండా ఏకీభవించే మరోవ్యక్తి దొరకక, ఏ మాత్రం అభిప్రాయ భేదం వున్నా దానితో ఏకీభవించే ఔదార్యంలేక ఎదుటి వారిని ఒప్పించే శక్తి సామర్థ్యాలు ఏకత లేక ఎవరికి వారే పడే పాట్లకు హద్దుపద్దులేదు ఫలితంలేదు ప్రమిదలు కోటానకోట్లు వత్తులు కోటాన కోట్లు స్నేహం మాత్రం లేదు వత్తులు అంటించడానికి గీసిన పుల్లలు మాత్రం కాసేపు కాలుతున్నాయి కొద్దిపాటి వెలుగు కాస్తంత సేపు అంతే మళ్ళీ పెనుచీకటి

'అవనిపై జరిగేటి అవకతవకలు జూచి ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు' 'పరుల కష్టముజూచి కరగిపోవును గుండె మాయ మోసముజూచి మండిపోవును ఒళ్లు మరి అవకతవకల సవరించు శక్తి సామర్థ్యాలా అవీలేవు తప్పు దిద్దగ లేను దారిజూపగ లేను తప్పుజేసిన వాని దండింపగాలేను ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు ఇంత తెలిసి కూడా అవకతవకల నేను సవరింపలేనపుడు పరుల కష్టాలతో పని ఏమి మనకనుడు అన్యులను జూచైన హాయిగా మనలేను ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు ఇది నా గతి ఇట్లా వుంది నా సంగతి

నాకున్న ఈ మతితో సాగుతున్నది నా గతి అంటే బతుకు వ్యక్తిగత వ్యవహారాలైనా, ప్రజా జీవితంలోనైనా అడుగడుగునా సందేహాలు చాలీచాలని అవగాహనతో రకరకాల ప్రశ్నలు, ఏదో సమాధానాలు నిర్ణయాలు నిర్ణయానుసారం నడిచే ప్రయత్నం ఏదో కొద్దిపాటి సఫలత దాని విషయంలో మనకే సందేహం ఆశించిన ఫలితాలు అనుకున్న రీతిలో కలుగకపోవడం అదిచూచి మరో ప్రయత్నం మరో రీతిలో ఇదంతా నా గొడవలో రికార్డు చేసుకున్నాను సామరస్యం స్వభావానికే సరిపడదు కాబట్టి అడుగడుగునా సంఘర్షణ, సామరస్యంతో బతకడంలో సంఘర్షణ తగ్గడం నిజమేగాని దానికి కావలసిన సామరస్యం సంసిద్ధతకు మనస్సు సిద్ధపడాలెగద? సామరస్యం లేనిదే బతుకు పయనం సాగదు బ్రతుకు సూత్రబద్ధం కాకుంటే క్రమశిక్షణా, సభ్యతా, సమాజం దాని ప్రగతీ సాధ్యం కాదని పెద్దలు శృతులు, స్మృతులు, శాస్త్రాలూ మతాలు సాంఘిక శాస్త్రాలు చేస్తున్న సనాతన ఘోష ఇది

ఇంతకూ నేను బతుకు సాగించాల్నా? లేక సమాజం ప్రగతిగని నా గతి మానుకోవాల్నా? రెండు సూత్రాలు ఎన్నడూ సాధ్యంకావు బండ బ్రతుకును ఏదో సూత్రానికి బిగించి వేలాడి బతుకుదామనుకుంటే ఆ సూత్రం పుటుక్కుమనగానే చతికిలఎడడం తప్పదు ఏదైనా సూత్రం అది అది బతుకు బరువును మోయలేదు అందుకేనేమో సూత్రాలు తెగిపోతున్నాయి బ్రతుకు సాగిపోతున్నది నా గతిని ఆకట్టడానికి నన్ను అదుపులో పెట్టడానికి ఎన్ని శాస్త్రాల కట్టడాలు? ఎన్నెన్ని నీతుల గోతులు? ఎన్నెన్ని ఇజాల ఊగులు? ఎన్ని అంతశ్శాఖల డొంక తిరుగుళ్ళు? ఎన్ని కులాల అనుపాతాలు? ఎన్ని కులగోత్రాల ముడికట్లు? ఎన్ని సాంప్రదాయాల నాచు? అబ్బబ్బ నా వాతం పేరిట నా షడ్వర్గాన్ని శీల విహీనం జేయ చంప పాతేయ ఎన్ని స్వర్గసుఖాల ఆకర్షణలు? ఎన్ని నరకయాతనల భయాలు? ఎన్ని లాలనలు ఎన్ని పాలనలు? ఎన్ని దిక్సూచికలు? ఎన్ని మర్మాలు? అహం బ్రహ్మాస్మి కోలాహలాలు దాస్యదీక్షా మంత్రగోపనాలు? వీటికి కట్టుపడుంటే ఇంక వెతెక్కడిది నాకు? నేను పేరుకే మిగిలిపోతాను గతి మానుకుంటే ఇంకిపోతుంది జీవనం మడుగైపోతుంది బ్రతుకు ఏదో సూత్రానికి తత్వానికి ఇజానికి కట్టుబడి పోయి తుచ జీవిస్తున్నామనే ప్రాణులకు స్వేచ్ఛాజీవనం నున్న కన్నులున్నా వారుచూచేది పరాయి చూపులతో, చెవులు వారివే గాని వినికిడి వారిదిగాదు కాళ్ళు వారివి, నడక మాత్రం మరొకరిది చేతులు వారివైనా వారి చేతలన్నీ పరాయి ఆదేశాల అధీనం గోళ్ళు వారివే గాని వారి గోకుడు మరొకరిది బుర్రలో ఆలోచనలు స్వంతంకావు కొనకు ముక్కుపుటాల్లో ఊపిరి పరాయి ఊపిరి వారి నాలుకలు పంజరంలోని చిలు కల్లు" అట్లా కాకూడదని నా తిక్క చిరకాలం బతకాలనే ఆరాటం ఉండగా చావొస్తే ఎట్లా అని కాదు నా ప్రశ్న అనుక్షణంచావాలనిపిస్తూ బతకడం ఎట్లా అన్నది నా ప్రశ్న అనుక్షణం చావుకై నిరీక్షిస్తూ మనం బతుకుతున్నది బతుకేనా అని ప్రశ్న చంద్రమండలంలో ఆవాస మెట్లా అని కాదు ప్రశ్న భూమండలం మీద ఆదిమవాసమెన్నాళ్ళున్నది ప్రశ్న పరిస్థితులెట్లా వున్నాయని కాదు ప్రశ్న ఉన్న పరిస్థితుల్లో మనమెట్లా ఉన్నామన్నది ప్రశ్న

ఇంతకూ 'చేతకు సిద్ధాంతానికి ఉన్న తేడా మాత్రం గొప్పది వెనుకకు చూస్తే భూతం కనుపించును చూడకుండా లభ్యం కాదు కాని భవిష్యం కాంక్షిస్తూ రభస వర్తమానం వ్యర్థం చేయని కర్తవ్యం నీదని మరవకు అని నా గొడవలో చెప్పకున్నా భూతాన్ని చూచి భయపడుతూనే వున్నాను వర్తమానాన్ని వ్యర్థ్యం చేస్తూనే వున్నాను "పశ్చాత్తప్తులు, పూర్వతప్తులు ప్రస్తుత మెరుగని వ్యక్తులు వ్యర్థులు అంటూనే తీరా చూస్తే నేనూ వ్యర్థుణ్ణే అవుతున్నాను అస్తిక సమాజంలో భగవంతుడు సాక్షీభూతుడు ఆ భగవంతుణ్ణే ఉద్దేశించి అన్నాను జరిగిందంతా చూస్తూ ఎరుగనట్లు పడివుండగా సాక్షీ భూతుణ్ణి కాను సాక్షాత్తూ మానవుణ్ణి" అని అదిగో మానవున్ని కాబట్టేచుట్టు పట్ల జరిగే ప్రతి విషయానికి స్పందించడం ప్రతిఘటన ఆలోచన ప్రతిఘటనా కార్యక్రమం నేననుకున్న అవకతవకలను సవరించే ప్రయత్నం నా వలెనే అవకతవకలను సంపూర్ణంగా ఏకీభవించకపోవడం మరెవరూనాతో ఏకీభవించకపోవడం అనిపిస్తుంది ఒకరితో ఏకీభవించే పరస్పర సహకారానికి గొప్ప లోటేమోనని ఇంతకూ మనస్సు క్షణమో తీరుగా మారి రకరకాలుగా ఆడిస్తున్నది అచలం కావడం దాని స్వభావం కాదు దాన్ని ఆచలం చేసే నా ప్రయత్నం ఎప్పుడూ ఫలించదేమో? 'బొంగరమ్ము రకలి మీద బుర్రనమ్మెట పోట్లు నడుమ మిడుకుచు నలుగు ఎడద ఏడుపుపాట్లు, అయ్యొయ్యొ మన బతుకులు అడుగడుగున గతుకులు ప్రతి వాని ఎడదలో పొంగిపారెడు ఆగడు ప్రతివాని మొగములో చిందులాడెడు బెగడు ప్రతివానిపై నొకడు తాళికట్టని మొగడు ప్రతివాడు నిలువెల్ల కాలికాల్చెడు నెగడు మమత లేని మనుగడ మానవునిదే గడబిడ చేసుకున్న కర్మ 'కాలె నిట్లనునొకడు చేసుకొన్న చేను 'పండె నినట్లనునొకడు నహవాన దోషమని పలికించు

మరియొకడు పరుల పెత్తనమందు భావించు నింకొకడు ముగుదాళ్లు పరిసరాలని మూల్గు వాడొకడు వట్టువగ్గాల్లేని ఫలమనెడు వాడొకడు భావదాస్యంబంచు చేయించు వాడొకడు భక్తిలోపం బంచు పరిగణించును ఒకడు వ్యక్తితమే మూలశక్తియు వాడొకడు వ్యక్తిత్వమే అహంకారమను వాడొకడు సంఘశక్తియె ప్రాణికాధారమనునొకడు సర్వమీశ్వర సంకల్పమను వాడొకడు అహం బ్రహ్మాస్మియని హుంకరించును ఒకడు శేష భక్తిని చూచి చేరితిని అనునొకడు అస్తికత్వమె మాయమోసమను వాడొకడు యౌవనమే ముక్తియని గొల్లుకెత్తును ఒకడు కొంత మాయము చేయు అంతమాయము అనునొకడు స్వంత సేవకు సంఘసేవ పేరిడు నొకడు శృతి' కలిపి తన గొడవ వినిపించు వాడొకడు స్మృతి యంచు తనమాట మెప్పించువాడొకడు ఇట్లా వుంది మానవుని గడబిడ ఇదంతా మమత లేని మనుగడ అని నా గొడవ

శాంతి శాంతి శాంతి అని అందరూ శాంతిని కోరుకుంటున్నట్లే మాట్లాడుతారు నా గొడవంటుంది 'శాంతిగ మెలగుట మంచిదె కాని శాంతి పరిస్థితి కలదా సఖుడా? అని పరస్పర ద్వేషాలకూ కలహాలకూ యుద్ధానికీ నాశనానికీ వివిధ మతాలే కారణమనే ఇజాల భక్తులను జూచి 'నాటి మతం వలె నేటి ఇజాలను కాటులాడబడుచున్నవి సఖుడా' అంటుంది నా గొడవ 'మత గురువులవలె మురా నాయకులు మనుషులు ముక్కలు జేసిరి సఖుడా! తనదై తానై మెలగవలసిన తలతాకట్టైపోయెను సఖుడా!' ఈ తల తాకట్టైపోవడమే సమాజ జీవితంలోని మహా విషాదం మానవుని మానవుడు మానవుని మాదిరిగా మన్నించలేనంత మలినమైంది మానవుని హృదయం జాతియని రీతియని దేశమని వేషమని విషము గక్కెడు వింత బిసగమారినది మానవుని హృదయం ఆధునిక ఆర్భాట మందఱగి అవనియే ఆత్మజిచ్చే జనుల అడవి ఐనాది'

ఈహృదయ మాలిన్యం పోవడం ఎట్లా? నేను మనిషిననే అవగాహనతో ఎదుటి వానిని మనిషిగా గుర్తించడం ఎప్పుడు? మనిషికి మనిషికి మధ్య స్నేహం పెరిగి ఘర్షణ తగ్గేదెప్పుడు? సహకార సంఘాలన్నీ సహకార లోపంతో దివాలా తీస్తుంటాయి మైత్రి అంటే సంపూర్ణ సహకార సంఘం క్రుంగు ఎదలకు శాంతి గుడ్డి బతుకుకు శాంతి మానవత్వపు మెరుగ మర్త్యలోకము వెలుగు ఈ మైత్రి ఒక జీవిత విధానం కావాలి అది అక్కర తీర్చుకోవడానికి వేసిన వల కాకూడదు

మైత్రి లేకపోవడం వల్లనే మానవ సమాజంలోని ప్రతి రంగంలో పోటీపడి కాట్లాట ఈ విషయాన్ని నా గొడవలో ఈ విధంగా చెప్పుకున్నాను "పోటీబడి కాటులాడ చావచింపు సామ్రాజ్యం కోడిగుడ్డు కోహినూరు, పాటిమన్ను ప్లాటినం బస్సు సీటు బ్రహ్మరథం ఏదైతేం ఏదైతేం పోటీబడి కాటులాడ ఏదైతేం అడవి మనిషి ఆచార్యుడు పసిబాలుడు పండుముసలి బిచ్చగాడు లచ్చిమగడు తొత్తుకొడుకు పెత్తన్‌దార్, ఎవడైతేం ఎవడైతేం పోటీ పడి కాటులాడ ఎవడైతేం?

'తండ్రి కొడుకు తల్లి బిడ్డ అన్నదమ్ము డక్కచెల్లె, బావమరది భార్య భర్త ఇరుగు పొరుగు ఎరుగనోరు ఎవరైతేం ఎవరైతేం పోటి పడి కాటులాడ ఎవరైతేం? విపణివీధి తపోవనం చాకిరేవు శాసనసభ, సానికొంప సాధుమఠం మూత్రశాల యాత్రస్థలి ఎచటైతేం ఎచటైతేం, పోటీపడి కాటులాడ ఎచటైతేం, ఈ పోటీపడి కాట్లాట ఎవరి మధ్యనైనా ఎచటనైనా దేనినైనా పోటీ పడే కాట్లాట కాట్లాటే మైత్రి వుంటే పోటీ కాట్లాటవంతుకు సహకారం సామరస్యం వుంటుంది

నేను గమనించిన సమాజ జీవితంలో జరుగుతున్న ఈ పోటీపడి కాటులాటకు 'నేను'' నా అనేది అహంభావం ఒకటి దాన్నే నా ఇజం అన్న ఎవనికి వాడు (నేను కూడా) తన ఆలోచనే ఒప్పని తప్పంతా ఎదుటివానిదే అని, తనది నిత్య నూతన బుద్ధివికాసం అని, తక్కిన వారిది బుద్ధి జాడ్యజనితోన్మాదమనీ, నా కోపం స్వభావ సిద్ధం మీకైనను ఓపికుండొద్దా? నాకున్నవి అన్నీయు హాబీలు, మీకున్నవి వ్యసనాలవి తగవు నేనున్నదే నిలువదగిన చోటు అటు నిటు బోయినచో

లోటు నను దాటిన భ్రష్టాచారం వెనుకబడిన చాదస్తం నాకందిందినాది నాకందనిది మనది ఇదిగిదిగో చెలియలికట్ట కాదన్న వారి కన్నులు లొట్ట నాన ఇజాల అడుగున జూడనా ఇజందే కనుపించును జాడ ఇదంతా నా అన్వేషణలో తేలిన విషయాలు నా గొడవలో చెప్పుకున్నది మరో విషయం చాదస్తం వ్యక్తిగతంగానూ సామూహికంగానూ ఏదో ఒక చాదస్తానికి లోనై ఆ చాదస్తం అదుపాజ్ఞల్లో మెలగుతూ జీవితం సాగిస్తూ మరో చాదస్తపు అదుపులో వ్యవహరిస్తున్న వారితో ఘర్షణ ఎవడిచాదస్తాన్ని వాడు మహత్తరమైనదిగా భావించడం ఇహపర సమస్యలన్నింటికీ తమ తమ చాదస్తాల ద్వారానే పరిష్కారం కలదనే భావన ఉన్నదనిపిస్తుంది అందుకే 'చాందస్త' అనే శీర్షికన నా గొడవ ప్రతి చాదస్తం దేవుడే ఏదో ఒక రూపంలో గోకుడే పుట్టుకతోనే పుట్టు నీ పుండు, ఆగపడక అంతరంగాననుండు భావానుగుణ్యంరూపం శక్తిని బట్టి సాక్షాత్కారం సగము పూనిస్తుంది ఉపాసన గిట్టదు గిట్టదు మరో వాసన రామభక్తుడైన హనుమడు కృష్ణుని ఆనవాలు పట్టడు నస్యం చూస్తే ఏవగింపు జర్దారూపంలో గిట్టును కంపు నామరూపాలు అనంతం ఎవనిది వానికే వసంతం అనుభూతి వర్ణనాతీతం సత్యం శివం సుందరం ప్రతిరంగాన దీనిదే చిక్కు గాయానికి కట్టనీదు పక్కు హాయి గోకినా కొద్ది హాయి, మంటను లెక్కించని స్థాయి వ్యసనాలు మహావ్రతాలు వ్యక్తిగత చాదస్తాలు దారిదాపున చేరిన మౌఢ్యం వ్యాపింపచేయు నీ జాడ్యం మురాబందీ సిద్ధాంతాలు ఈ జాడ్యానివే వ్యాపక రూపకాలు ఒక సిద్ధాంతం పూనినపుడు కసి మరొక దానిని చేస్తుంది మన బోధ వివాదాలు పోరలు గాలాలుదాచే ఎరలు భ్రమ కీటక న్యాయం రంగురుద్దుటకు సాయం ఊబిలో పడిన ప్రతివాడు ఆనందాబ్ధి అని అంటాడు

ఎట్లా జీవించాలని కోరిక ఆ కోరిక ప్రకారం ఎట్లా జీవిస్తున్నాననే విషయం నా గొడవలో చెప్పుకున్నాను ఇచ్ఛయె నా ఈశ్వరుడని ఖచ్చితముగా నమ్ముతాను ఇచ్ఛవచ్చినట్లు నేను ఆచరించి తీరుతాను జరిగిన దానిని తలవను జరిగే దానికి వగవను జరగనున్నదది ఇదియని ఊహాగానము చేయను కడుపు నొప్పి భయము తోడ గారెలు తినకుండా లేను కడుపునొప్పి (రాబోయే) ముందు దిన్న గారెల రుచి చెరవలేదు సంతసముగ జీవింపగ సతతము యత్నింతుగాని ఎంతటి సౌఖ్యానికైన ఇతరుల పీడింపలేను ఇది అభిలాష ఆదర్శం

కాని నిత్య జీవితంలో ఎంత వరకు సాధ్యమవుతున్నదనేది ప్రశ్న ఇటువంటి అభిప్రాయాలతో ఆ అభిప్రాయాల కనుకూలమైన ధోరణితో సమాజంలో జరుగుతున్న అలజడులు (సాంఘిక రాజకీయ, సాహిత్య మొ॥) లో పాల్గొంటూ వస్తున్నాను

అన్యాయాన్నెదిరిస్తే నా గొడవకు సంతృప్తి అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి అన్యాయాన్నెదించినోడు నాకు ఆరాధ్యుడు

# డా॥ కాళోజీ జీవనరేఖలు

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు ప్రజాకవి కాళోజీ నారాయణరావు తన మేనమామల గ్రామం రట్టహళ్లి (బీజపూర్ కర్నాటక)లో 1914 సెప్టెంబరు 9న జన్మించారు అయన పూర్తి పేరు (రఘువీర్ నారాయణలక్ష్మీకాంత్ శ్రీనివాసరావు రామ్‌రాజా కాళోజీ)

అయన బాల్యం మడికొండలోనూ ప్రాథమిక ఉన్నత విద్యాభ్యాసం మడికొండ, హనుమకొండలలో గడిచింది ఆ తర్వాత హైదరాబాద్‌లో వకాలత్(లా) పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు

తెలంగాణాలో, కాళోజీ పాల్గొనని సాంఘిక రాజకీయ సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలు లేవు

విద్యార్థి దశ నుంచే ఉద్యమాల్లో పాల్గొనడం ఎక్కడ అన్యాయం జరిగిందని భావిస్తే అక్కడ అగ్రభాగాన నిల్చి పోరాడటం ఆయన నైజం రజాకార్లు నిషేదించిన గణపతి ఉత్సవంకానీ ఆర్యసమాజ ఉద్యమంగానీ, గ్రంథాలయ ఉద్యమంగానీ హైదరాబాద్ విమోచనోద్యమముగానీ అన్నా ఆయననే ఆనాడు బొమ్మకంటి సత్యనారాయణ, కోదాటి నారాయణరావు పి వి నరసింహరావుగారలు ఆయన రాజకీయ ఉద్యమ సహచరులు మాడపాటి హనుమంతరావు సురవరం ప్రతాపదరెడ్డి వంటి మహామహులు ఆంధ్ర మహాసభ ఉద్యమంలో కాళోజీ అనుసరించినవారు గాడిచర్ల హరిసర్వోత్తమరావు కాళోజీని గ్రంధాలయ ఆస్థాన కవి అన్నారు గార్లపాటి రాఘవరెడ్డి సామిత్యంలో ఒకరకంగా ఆయనకు గురువు ఎవీ కాళోజీ మొలైన వారంతా ఆయన్ను అయ్యగారు అని పిలిచేవారు

1934లో గాంధీజీ పిలుపు మేకు జరిగిన ప్రథమ సత్యాగ్రహంలో పాల్గొన్నారు 1939లో 1934లో 1947లో స్వాతంత్ర్య ఉద్యమంలో కారాగార వాసం అనుభవించారు హైద్రాబాద్ నిజాం నుండి విముక్తి అయ్యాకనే ఆయన 26 9-48లో జైలు నుంచి విడులయ్యారు దేశంలోని అన్ని ప్రజా ఉద్యమాలకు ప్రతిస్పందించి వాటిలో పాల్గొనడమేకాక ఎన్నో వేల గేయాలు రచించారు నా గొడవ పేరు మీద అవన్నీ అచ్చయ్యాయి ప్రజల గొడవే కాళోజీ నా గొడవ దేశంలోని పౌర హక్కుల ఉద్యమానికి ప్రజాస్వామ్య పరిరక్షణ ఉద్యమానికి ఆయన వెన్నుదన్ను

ప్రముఖ ఉర్దూకవి, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ కాళోజీ రామేశ్వరరావు 'షాది' కాళోజీకి అన్నగారు

చిరునామా 2 6 30, నక్కలగుట్ట, హనుమకొండ వరంగల్లు 506 001

# మనిషంటే ఎవరు? కాళోజీ చెప్పిన ఒక సంఘటన

- కొత్తపల్లి రవిబాబు

అవి నేను నల్లగొండ ప్రభుత్వ కళాశాలలో పని చేస్తున్న రోజులు 1964 1966 మధ్యకాలం ఆ కళాశాలలో పని చేస్తున్న నవీన్ సీతారామారావు టిఆర్‌జి కృష్ణ నరసింహారావు మొదలగు వాళ్ళం కలిసి స్టడీ సర్కిల్ అనే పేరుతో నెలకొక సమావేశం నిర్వహించేవాళ్ళం అప్పుడప్పుడు తన బంధువులు ఇంటికి వరవరరావు వస్తుండేవాడు నవీన్ వరవరరావు వరంగల్‌లో మిత్రమండలి గురించీ కాళోజీ గురించి చెప్పేవారు

ప్రారంభ సమావేశానికి కాళోజీని అహ్వానించాం ఆయన తన రెండు గంటల ప్రసంగాన్ని ప్రారంభిస్తూ ఒక సంఘటన గురించి వివరంగా చెప్పారు అది శ్రోతలందరి మనస్సుల్లో హత్తుకు పోయింది దాని వివరం ఇదీ

ఎవరో ఆహ్వానిస్తే కాళోజీ ఒక సమావేశానికి వెళ్ళారు ఆయన ఆ సభలో ముఖ్య అతిథి, ముఖ్యవక్త నిర్ణయించిన సమయానికి సభాస్థలానికి కాళోజీ చేరుకున్నారు అయితే అప్పటికి ఇంకా హాలులో సభ ఏర్పాట్లు పూర్తి కాలేదు సభను ఏర్పాటు చేసిన ముఖ్యులు కాళోజీ రావడం చూసి, కుర్చీలు బల్లలు, బల్లపై టేబుల్‌క్లాత్ దానిపై మంచినీళ్ళు గ్లాసులు ఎర్పాటు చేయడానికి పూనుకున్నారు అయితే వారు వారిలో వారు గందరగోళపడుతూ వేరే గదిలో వున్న కుర్చీలు బల్ల తేవడానికి మనిషిలేడే మనిషిలేడే అని పదేపదే అనుకున్నారు చివరకు దూరంగా ఒక ప్యూను కనబడ్డాడు వెంటనే ఆతన్ని ఎలిచి అతనిచేత కుర్చీలు బల్లలు వేయించారు

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే నిర్వాహకులు ముగ్గురు బల్ల కర్చీలు వేయడానికి 'మనిషిలేడే 'మనిషిలేడే అనుకోవడం అవి వేసిన ప్యూన్‌ను మనిషిగా గుర్తించడం అంటే పనిచేసే వాడే మనిషి శ్రమ చేసేవాడే మనిషి అని ● నిర్వాహకులు గుర్తించారన్న మాట తాము కాయకష్టం చేయడం అవమానంగా భావించిన ఆ కార్యకర్తలు తమను మనుషులుగా గుర్తించడం లేదు పనిచేసిన ప్యూన్‌నే మనిషిగా గుర్తించారు కాళోజీ ఈ సంఘటన చెప్పి - అంతిమంగా మనందరం శ్రమ చేసే వారిని గౌరవించాలనీ శ్రమ విలువ తెలుసుకోవాలనీ శ్రమ చేసేవాడే మనిషి అని చెప్పి, తన ప్రసంగం ప్రారంభించారు

# 'కాళోజీ ఒక సందర్భం"

- 'జ్వాలాముఖి"

**కా**లానికి
**లో**బడని
**జీ**వితం

కాలం లౌక్యానికి ఎగదోస్తుంది హేమాహేమీలు లౌక్యం చేతుల్లో పడి నామ రూపాలు లేకుండా పోతారు

ఫ్యూడల్ సమాజంలో మనిషి స్పష్టంగా కనబడతాడు క్యాపిటలిస్టు సమాజంలో స్పష్టంగా కనబడడు

ఇది మధ్య తరగతిలో తెలివిగలవారి లక్షణం వారు అంతటా వుంటారు నిర్దుష్టంగా నిబద్ధంగా కనిపించరు

కాళోజీ దేనికీ ఇమడని స్వేచ్ఛా భావుకుడు తన కేది అన్యాయం అనిపిస్తే దాన్ని తనవారిలోనైనా తిరస్కరించడానికి వెనకాడడు తనకు ధర్మం అనిఎంచిందాన్ని నిర్మొహమాటంగా చెబుతాడు చేస్తాడు లోకం ఏమనుకుంటుంది! అని కూడా ఆలోచించడు కనీస వినయాన్ని కూడా లెక్క చేయకుండా అనాల్సింది అనేస్తాడు అలా అనడాన్ని అందరూ "తిక్క అనుకునే వారు ఇది సద్గుణంగా కూడా ఉనికిలోకి వచ్చింది

కాళోజీ ఒక అశాంతికి ఆందోళనకు ప్రతినిధి ఈ సమాజం ఎటుపోతావుంది? ప్రజల సంగతి ఏమికావాలి? అనేది ఒకే చింతన ప్రజాస్వామ్యం కోసం ఎడతెగని ఆరాటం అభివ్యక్తిలో నిర్మొహమాటం

ఆందోళన ఊపిరి
తిరుగుబాటు వేదాంతం
ఉద్యమం మనుగడ
హెచ్చరిక ప్రజాస్వామ్యం

గాంధీజీ సత్యాహింసలకన్నా "వ్యక్తి సత్యాగ్రహం" కాళోజీలో ఎప్పుడూ రాజుకొని వుండేది ఆ దృష్ట్యానే అతడు అన్యాయాన్ని ఎదిరించేవాడు

ఆదర్శాల ఆందోళన
ఉద్యమాల అశాంతి

కాళోజీని కూచోనీయలేదు కాళోజీ ఒక నడయాడే ప్రశ్నలా తిరిగేవాడు ఒక సవాలుగా బతికేవాడు

అసాధ్యమైన ' పార్టీ రహిత ప్రజాస్వామ్యం కాళోజీలో అశాంతిని రేపింది జయప్రకాశ్ నారాయణ్ ఒక ఆదర్శంగా నిలిచాడు బతుకంతా సమాజం కావాలని ఆరాటం

గత శతాబ్దపు ఏడవ దశకంలో బీహార్‌లో జయప్రకాశ్ నారాయణ్ గ్రామాలు తిరిగే వాడు ఆదర్శాలు బోధించేవాడు "సంపూర్ణ క్రాంతి ని ప్రచారం చేసే వాడు రాత్రివూట బీహారు గ్రామాల్ని నక్సలైట్లు విద్యుదీకరించేవారు చైతన్యం పంచేవారు

మరో ఉదయానికి ప్రాణ ప్రతిష్ఠ చేశేవారు పగటిపూట అదే గ్రామాలు తిరిగి జయప్రకాశ్ నారాయణ్ 'అంత్యోదయ అహింసాత్మకంగా ఆచరణలోకి రావాలని ప్రచారం చేసేవాడు

ఈ దేశంలోని మేధావులకు, గాంధేయులకు రాజకీయ నిష్కామకర్ములకు ఒక విచిత్ర శాపగ్రస్త గాంధేయ వారసత్వం వుంది అహింస"ను మోతాదుకు మించి ప్రజలకు చెప్పి ప్రజల 'ఆత్మరక్షణ' హక్కును శాంతియుతంగా లాగేసుకుంటారు

సామాన్యులు, కష్ట జీవులు తమకుతాముగా ఎన్నడూ "హింసోన్మాదం' లోకి దిగరు నిండు జీవితాన్ని నిప్పులపాలు చేసుకోవాలనికోరుకోరు కాని కష్టజీవులను న్యాయ సమ్మతమైన హక్కు రాకపోవడం ఆపై ప్రశ్నిస్తే అణచివేత ఎదురవ్వడం మొదలయ్యేసరికి దిక్కుతోచనివారవుతారు అన్యాయం చేసే దోపిడీ కూటమి అణచివేతను హింసతో నింపేసరికి ఆత్మ రక్షణకు దిగక తప్పనిసరి పరిస్థితి ఏర్పడుతుంది "ఆత్మ రక్షణ చేసుకునే కష్టజీవుల హక్కును 'హింస'తో

జతపరిచి గాంధేయులు తెలివైన రాజకీయ నాయకులు ఎరిపాలనలో వున్న ప్రబుద్ధులు పాలకవర్గాల వారు పీడితుల్ని సర్వనాశనం చేయడానికి వెనకాడరు ఈ పరిస్థితుల్లోనే భూపోరాటం అనివార్యమైంది రాజ్యం ఎప్పుడూ దోపిడీ చేసే వాంసోన్మాదుల్నే రక్షిస్తూవుంది కోర్టులు అసెంబ్లీలు కష్ట జీవుల రాజకీయాల్ని హింస పేరిట అణచివేస్తూ వున్నాయి మినహాయింపుల సందర్భాలు లేకపోలేవు

న్యాయస్థానాలు అసెంబ్లీ పార్లమెంట్లు పరిపాలనాయంత్రాంగం అన్నీ ప్రజాస్వామ్యాన్ని ఖాతరుచేయక ధనస్వామ్యానికి కావలసిన వ్యవస్థను ఏర్పాటు చేస్తున్నాయి

ఈ సందర్భంలో కాళోజీ ఒక నిర్దుష్ట వైఖరికి రావడం కాలజ్ఞానం 'రాజ్యహింస వున్న చోట ప్రజా హింస వుండడం సహజం అనే ధోరణికి తాత్వికంగా చింతనలో రావడం ఒక అద్భుతమైన రాజకీయనిబద్ధత ఎక్కడ జయప్రకాష్ నారాయణ్ విఫలమయ్యాడో అక్కడ అదే కుదురులోంచి పార్టీ రహిత ప్రజాస్వామ్య వెలితిలోంచి రాజకీయనిబద్ధత ప్రతిఘటనగా ముందుకు రావడం కాళోజీ యుగ చైతన్యం

పౌరహక్కుల పరిధి ని చట్టాల ఇరుకు నుంచి బయట పడేసి రాజకీయ తాత్విక అనివార్యతలోకి నెట్టి ప్రజల ప్రజాస్వామ్యాన్ని చర్చనీయాంశం చేయడం కాళోజీ సాధించిన రాజకీయ విజయం

వర్గ సమాజంలో వృత్తికి, ప్రవృత్తికి వైరుధ్యం రావడం అనివార్యం సామాజిక స్పృహను రాజకీయ చైతన్యంగా అభివృద్ధి చేసుకోలేనివారంతా వృత్తికి దాసోహంగా ప్రవృత్తిని మార్చుకుంటారు తెలివిగా ఆమేరకే ఆదర్శాలు వల్లిస్తారు అనుకూలంగా ఈ సందర్భంలో ఏ అట్టహాసమూ లేకుండా ప్రవృత్తే వృత్తి ఉద్యమమైంది ఈ పరిణతి కాళోజీకే సాధ్యపడింది ఆయన సమకాలికులు ఏదో రకంగా పాలకవర్గాల పరిధి దాటిరాలేకపోయారు రాలిపోయారు చైతన్యం చేరకుండా

కాళోజీ నిశిత పరిశీలన కూడా గమనార్హం ఆయన శాకుంతలం చదివారు - కాళిదాసు వర్ణనలకు సౌందర్యానికి అనాఘ్రాతపుష్పానికి వ్యామోహపడలేదు ఆయన విచిత్రమైన పరిశీలనా దృష్టి ప్రజాస్వామ్యాన్ని వెదికింది

దుష్యంతుడు ఇచ్చిన ఉంగరం శకుంతల వేలి నుండి జారి పడవ ప్రయాణంలో ఏటిపాలైంది దాన్ని మింగిన చేప జాలరివశమైంది జాలరి ఆచేపను కోయగా ఆ ఉంగరం బయటపడింది ఆశ్చర్యపడ్డ జాలరి ఆ ఉంగరాన్ని చూపి రాజభటుని కర్తవ్యం అడిగాడు రాజ భటుడు సహజ ధోరణిలో జాలరిని దొంగ'గా నేరం మోపజూస్తే జాలరే రాజభటుని పట్టుకొని ఫిర్యాదుచేస్తూ దుష్యంతుని రాజ దర్బారు చేరాడు అక్కడ ఆజలరి యదార్థం చెప్పాడు దుష్యంతుడు జాలరిని నిరపరాధిగానే గ్రహించాడు

ఈ విషయాన్ని కాళోజీ వ్యాఖ్యానించిన తీరు ఆయన పౌరహక్కుల దృష్టిని రాజ్య లక్షణాన్ని ముందుకుతెస్తాయి ఒకనాడు మా కాలేజీకి ఎలిచి అక్కడి వాతావరణాన్ని వివరించి ప్రసంగించమనికోరాను ఎమర్జన్సీ రోజులు అన్ని హెచ్చరికలు చేశాను ఆనాటి ప్రసంగంలో పై ఉదంతాన్ని చెప్పి అన్యాయాన్నెదిరించిన వాడు తనకి ఆరాధ్యుడు అని చెప్ప నాటి సభను చైతన్యవంతం చేశారు

కాళోజీ ఎప్పుడూ ఒక 'ప్రతిపక్షం గా వుండేవాడు మాట్లాడేవాడు న్వపర భేదాలులేకుండా విమర్శించేవాడు

1970వ దశకంలో ఒకసారి అందరం కలిసి ఒక బస్సులో ఒక మీటింగు పెళ్లి' కి బయల్దేరాం దారిలో పాటలు అన్నీ జాగ్రతగా వింటున్నాడు ఇంతలో ఎవరో ఒక పాటను అందుకున్నారు "పుట్టగానే తల్లిదండ్రులకు బానిసవు అన్నదమ్ములకు బానిసవు పెరిగాక భర్తకు బానిసవు వృద్ధాప్యంలో కొడుకులకు బానిసవు చెల్లో! అంటూ పాడారు "ఇదేమితప్పుడు కూత!' అని గద్దించి "మానవ సంబంధాల్ని" అలా అనరాదని అది సంప్రదాయంకాదని వారించడమేగాక తగువు పడ్డాడు

కాళోజి ఆతర్వాత పాటలు వెుుత్తానికే మూతపడ్డాయి -

తనకు సరైనదికాదని తోచినప్పుడు ఏమాత్రం జంకకుండా ఖండించేవాడు కాళోజి

1950వ దశకంలో తెలంగాణా రచయితల సంఘం సి నారాయణరెడ్డి గారి కార్యదర్శిత్వంలో సాగేది ఒకసారి "ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ లో సభలు జరిగాయి రాత్రి కవి సమ్మేళనం 8 గంIIలకు ప్రారంభమై తెల్లవారేదాకా సాగింది - వానమామలైవరదాచార్యులు 'పోతన భాగవతం' వానమామలై జగన్నాధాచార్యులు 'రైతు రామాయణం' ఉదయరాజు శేషగిరిరావు మనోరమ" (వందలాది) పద్యాలు, పల్లాదుర్గయ్య 'గంగిరెద్దు దాశరధి "మహాంధ్రోదయం చదివారు - విశ్వనాధ సన్మాన పత్రాన్ని రూపొందించిసినారె అంత కుముందు చదివారు పద్యాలు వింటూ తన్మయుడై ధారాపాతంగా ఏడ్చేవాడు కాళోజీ ఎక్కడ ఏభావం బాగున్నా లీనమైపోయే వాడు అలాంటి తాదాత్మ్యస్వభావాన్ని ఎవరిలోనూ చూడలేదు అలా కరిగిపోవడం కాళోజీ సంస్కారం

అనేక సందర్భాల్లో అనేక సభల్లో కలిసి మాట్లాడాం శ్రీశ్రీ షష్టిపూర్తి సభలు విశాఖలో ఘనంగా జరిగాయి పోలరైజేషన్ కూడా జరిగింది ఆంధ్రవిశ్వవిద్యాలయంలో మర్నాడు ఉదయం కవి సమ్మేళనం జరిగింది కాళోజి అధ్యక్షుడు నేను ప్రారంభకుణ్ణి

1970 ఫిబ్రవరి అప్పటిదాకా సాగిన ప్రత్యేకం తెలంగాణ ఉద్యమం పొగలు వున్నాయి సెగలు ఆరాయి ఆ కవి సమ్మేళనంలో నిర్భయంగా నిర్మొహమాటంగా ప్రత్యేక తెలంగాణా కోరుతూ కవిత చదివాడు 'దోపిడి విషయం స్థానికమా? వర్గ ప్రధానమా?" అనే చర్చ సాగుతూ వుండేది దాన్ని కాళోజీ సమన్వయం చేసుకొని చెప్పిన కవిత గమనార్హం

ప్రాంతేతరుడు దోపిడి చేస్తే
దూరందాక తన్ని తరిముతా
ప్రాంతీయుడే దోపిడి చేస్తే
ప్రాంతంలోనే పాతరవేస్తాం

మాటలు సరిగ్గా ఇవోకాదో కాని భావం మాత్రం ఇదే కాళోజీ కోరుకొన్నది "కష్ట జీవుల తెలంగాణా" దాని సాధ్యాసాధ్యాలు వేరే విషయం

1980వ దశకం ప్రారంభంలో ఎన్టిఆర్ అధికారంలోకి వచ్చిన కాలం హైద్రాబాదులో ఎప్పుడు మత కల్లోలాలు జరిగినా విలవిల కొట్టుకునే మేముకొందరం వాందీ తెలుగు ఉర్దూ మరాఠీ రచయితలం కలిసి చార్మినార్ దగ్గర సంగం అనే సంస్థ పేర 26 జనవరి రిపబ్లిక్ డే నాడు ఊరేగింపు తీశాం వీధులన్నీ తిరిగి ధర్మవంత్ హైస్కూల్ లొ సభ జరిగింది ప్రముఖులంతా వచ్చారు సభను నేను నేపాల సింగ్‌వర్మ కలిసి నిర్వహించాం ఎవరి ధోరణిలో వారు మాట్లాడారు

కాళోజీ మాట్లాడుతూ నాఛాతీ మీద వీపు మీద నన్నుచంపండి అనే ఫలకాల్ని కట్టుకుంటాను ఇక చంపండి అని చాలా ఉత్తేజకరంగా మాట్లాడాడు

కాళోజీలో నిర్లక్ష్యమూ వుండేది కాని నిజాయితీ' పరిధి దాటి వేళ్లేదికాదు ఆయన ఒక మిలిటెంటు ప్రజాస్వామిక సంస్కరణవాది "రాజ్యహింస ను ప్రతిఘటించే విప్లవ వ్యాఖ్యాత అందరిలోనూ అన్ని రకాలవారిలోనూ వుంటూ కూడా 'తన తనాన్ని' ప్రజాపరంగా ప్రజాస్వామ్యం కోసం చెప్పడంలొ ఆయనకు ఆయనేసాటి

విప్లవానికీ అరాచకానికీ రేఖామాత్రం విభజనరేఖ కనబడుతుంది తన కోసం తిరగబడితే అరాచకం వైపు దారితీస్తుంది సమాజం కోసం తిరగబడితే విప్లవం వైపు మార్గం చూపుతుంది ఈ రెండింటిలో మొదటిదానిలో 'తెగింపు" ప్రధానం అయితే రెండో దానిలో "నిర్మాణం' ప్రాధాన్యత వహిస్తుంది కాళోజీ 'నిర్మాణా'న్ని కోరుకున్న ఉద్యమకారుడు పార్టీరహిత ప్రజాస్వామ్యం నుండి పౌరహక్కులదాకా సాగిన కాళోజీ ప్రయాణం గమనార్హం పౌరహక్కుల ఉద్యమం కూడా పార్టీ రహిత ప్రజాస్వామ్యంగా వుండాలేమో ఈనాడు!

వ్యవస్థ వైరుధ్యాల్లోనే ఊపిరిపీలుస్తూ ఎవరైనా అవార్డులిస్తూ బుజ్జగించదలచినా వాటిని తీసుకుంటూనే వాటికి అతీతంగా మాట్లాడిన ప్రత్యేకత కాళోజీది "తామరాకుమీద నీటి బొట్టు అతని తత్వం"

కర్ణుడిలా కసిని ద్వేషాన్ని చూపలేదు భీష్మునిలా అవినీతి రాజ్యంలో భాగం కాలేదు కృష్ణునిలా ప్రాణాంతక సందర్భాల్లో రాజకీయంగా ఆటలు ఆడలేదు - విదురునిలా చాల నిగ్రహంగా "మీపక్షపాత రాజ్యంతో

ఏకీభవించలేను బయటికి వెళ్తాను అని రాజ్యం బయటే వున్నాడు చివరకు తిడతాడ 'ని కాళోజీని మచ్చిక చేసుకోవడానికి పాలక వర్గం వారు సందర్భం వచ్చినప్పుడల్లా ముడుపు ల్లాంటి అవార్డులు సన్మానాలు ప్రకటించి తమని గౌరవపాత్రుల్ని చేసుకున్నారు

ఆ సందర్భాల్లో లౌక్యం పరిధిలో చాకచక్యంగా ప్రవర్తించి మొహమాటానికి ప్రజాస్వామ్య పట్టం కట్టి బయటపడి ప్రజల్ని చేరాడు

ఎవరి ఇష్టం వారిది వారి ఇష్టాలు నాయిష్టాన్ని లొంగదీయవు ' అనే ధోరణిలో వ్యాఖ్యానించడానికి వెనుకాడలేదు కాళోజీ అయన నైతిక దృష్టి అయనది దానికిమైలేదు

విరసం నుండి వేరుపడి 'జనసాహితి (1978) స్థాపించి కాళోజీనే ప్రారంభించిమని కోరగా నిస్సంకోచంగా వచ్చినాలుగు మంచి మాటలు చెప్పి వెళ్ళాడు

కాళోజీ కవిత్వ ధోరణి శతక సాంప్రదాయానికి చెందినది 'ఉపదేశం ప్రధానం ఉపదేశానికి నగిషీలు చెక్కితే ఉపదేశం మాయమవుతుంది కాళోజీ వ్యక్తిత్వాన్ని సాహిత్యాన్ని వెలగట్టాలంటే ఆయన రాసిన "గొడ్రె కవితను జాగ్రతగా చదవాల్సి వుంటుంది 'నా గొడవ' అఖిలాంధ్ర గొడవేకాదు "మధ్యతరగతి మనుగడ నిర్వేదం "మనుగడ విముక్తి" మధ్యసాగిన సంభాషణ ఒక లోటు జీవిత కాలం వెలిబుచ్చిన ఆవేదన అది "మిగులు సంస్కృతి"కి అర్థం కాదు (రారా)

సంస్కృతిలోను సాహిత్యంలోను, సంభాషణల్లోను స్ఖాలిత్యాలు లేవనికాదు అయన నిజాయితీని చూం ఆయన స్ఖాలిత్యాల్ని పట్టించుకోలేదు అలాంటి వాటిలో 'కామరేడు ' అనే మాట కాళోజి స్థాయికి తగిన మాటకాదు వైయక్తిక సంస్కరణ దృష్టి సామాజిక విశ్లేషణను పట్టించుకోదు

పౌరహక్కుల రుస్తుంజీ
తెలంగాణా సింహోజీ
ఆత్మగౌరవం కాళోజీ

అందరి గొడవల్ని పట్టించుకొని వాపోయిన కవి హృదయం కాళోజీ అయన రాజకీయాల్లో ఉండలేడు సాహిత్యం కాళోజీకి చాలదు ఈ వాస్తవం నుండి కాళోజీని చూడాలి తాననుకున్నట్లు చెబుతూ పోవడమే కాళోజీ గొడవ దాని కెంతటి ప్రాంతీయత వుందో అంతటి అంతర్జాతీయతావుంది మధ్యతరగతి విముక్తి ఆకాంక్ష లోంచి వెలువడ్డ సంస్కారం కాళోజి దానికి పరిమితులున్నాయి పతనాలు లేవు కాళోజీ భాషకోసం యాస కోసం ఒక ఆత్మగౌరవ నిర్వచనాన్ని సాధించడానికి మొండి పోరాటం చేశాడు కాళోజీ సంపుటాలు రచనలు విగ్రహాలు స్మారకాలు వుంటాయి ఉండాలి కూడా

పౌరహక్కులు ఈనాడు మానవ హక్కులుగా ముందుకు వస్తున్నాయి అంతా బాగే జరుగుతున్నట్లే నిఎస్తూవుంది చెరవులోని చేప సముద్రంపాలయింది ఈ స్వేచ్ఛ ప్రాణాంతకం ప్రతి క్షణం ప్రమాదం బిరాన మానవ హక్కుల పునశ్చరణలో అమెరికా పలుకుతుంది బిరానను లొంగదీసుకోగలిగిన అమెరికా దానికి సంబంధించిన సమస్త ఆకాంక్షల్ని తనకు అనుకూలంగా పునర్నిర్వచించడానికి చేస్తున్న పాతాళ హోమం "ప్రపంచీకరణ ' సామ్రాజ్యవాదాన్ని ఎండగట్టకుండా ప్రపంచీకరణను దుయ్యబట్టడంలో, నిజాయితీ వున్నా గురితప్పే ప్రమాదం లేకపోలేదు అందునా సబాల్టర్న్ ఉద్యమాల్లో" చురుగ్గా తిరుగాడుతున్న స్వచ్ఛంద సంస్థలు

ఇక్కడ ఎవర్నైనా ఎప్పుడైనా నక్సలైటనో టెర్రరిస్టనో కాల్చేసే ప్రమాదం ప్రతివారి ఇంటి ముందుకు వచ్చేసింది 'ప్రత్యామ్నాయ న్యాయస్థానాల ఏర్పాటు ప్రజ్యాస్వామ్యాన్ని ప్రజల చైతన్యాన్ని సరైనమార్గంలో నడపడానికి దోహద పడగలదు ఇదికాళోజీకి సరైన నివాళికాగలదు

అలాగే తెలంగాణా యాస కోసం, తెలంగాణా భాష కోసం తెలంగాణా సంస్కృతి కోసం జీవితమంతా తహతహలాడిన కాళోజీ సంస్మరణార్థం 'ప్రజా విశ్వవిద్యాలయానికి రూపకల్పన" చేయాలి

ఇవి అసాధ్యాలు కావు బాధ్యతగల పెద్దలు ఒకచోట కూర్చొని నిరంతరం ఆలోచించాలి

కాళోజి ప్రాజస్వామిక చైతన్యంతో కొంత దూరం నడిచాడు తోటివారిని నడిచేలా ఉద్యమించాడు అది అంతటితో ఆగిపోరాదు

ప్రజల మనిషిని గౌరవించడం సంస్కారం, కాని ఆచరించడం చైతన్యం యుగ బాధ్యత ఆలోచించండి

# ఆయన ప్రశ్న - మనకు జవాబు

- టి జితేంద్రరావు

ఇదిగో ఇది కాళోజీ పుట్టిన తేది ఇది కాళోజీ యిల్లు ఇవి ఆయన వ్రాసిన పుస్తకాలు ఇవి ఆయన అందుకున్న పురస్కారాలు ఆటేప్ రికార్డర్‌లో నుండి వినిపించే గొంతు ఆయనదే ఇది ఆయన చనిపోయిన తేది అదిగో ఆ కాకతీయ మెడికల్ కాలేజీలోకి తనను తాను సమర్పించుకొని చేరిపోయిన ఆ శవం కాళోజీదే అదిగో ఆ ఫొటోలో ఉన్నది కాళోజీనే ఆ బొమ్మకూడా కాళోజీదే కాళోజీ అంటే ఎవరు'? అన్న ప్రశ్నకు పైన చెప్పినవే జవాబులైతే వాటికి వందకు రెండు మార్కులు ఇవ్వడం కూడా ఎక్కువే

కాళోజీ జీవితం అంటే పుట్టిన తేదికి, మరణించిన తేదీకి మధ్యన ఉన్న సంవత్సరాలను నెలలను లెక్కించికాదు ఆరెంటి మధ్యన గొప్పగా బ్రతికినతనం గురించి తెలుసుకోవాలి ఫొటోలోను బొమ్మలోనో కనపడే ఆయన కళ్ళకంటే అవి కార్చిన కన్నీళ్ళు ఎంతో చెపుతాయి టేప్‌లో వినపడే మాటలకన్నా కనపడని ఆయన మనసు ఎన్నో చెపుతుంది ఆయన నిలువెత్తు ఫొటోకన్నా ఆయన నిలతీసేతనం అయనంటే ఏమిటో చెపుతుంది

89 ఏళ్ళ జీవితంలో చిన్నపాటి బాల్యాన్ని మినహాయిస్తే మిగిలిన జీవితమంతా మంచి సమాజం కోనం ఆరాటం తోను, ప్రజల పక్షాన పోరాటంతోను గడిఎన గొప్ప వ్యక్తి కాళోజీ

కాళోజీ జీవితాన్ని సాహిత్యాన్ని వేరు వేరుగా చూడలేము అంటారు విశేషకులు అలాగే కాళోజీ కన్నీళ్ళను కన్నెర్రను వేరుగా చూడలే ఆయన ఆరాటాన్ని పోరాటాన్ని వేరు వేరుగా చూడలేం అనుక్షణం ఆవేదనతో ఆరాటపడే వాడే పోరాటానికి సిద్ధ పడతాడు చలించిపోయి కన్నీళ్ళు పెట్టుకునే ఆర్ధ్రత ఉన్న వాడే కన్నెర్ర చేయగలడు ఇవన్నీ కాళోజీ చేయగలడు కాళోజీ చేసాడు ఆయన ఆరాటమైనా పోరాటమైనా తన కోసం కాదు నాగొడవ నా గొడవ అన్నది ఆయన గొడవ కానేకాదు అది ప్రజల గొడవ పౌరుల గొడవ వాళ్ళ హక్కుల కోసం గొడవ, సమాజ శ్రేయస్సుకోసం గొడవ ఆయన గోడు

ఎంతగొప్ప పోరాట యోధుడైనా ఏదో ఒకటి రెండు ఉద్యమాలకు పరిమితమైపోతాడు వయస్సువల్లో మరోకారణం వల్లో విరమించుకోవడమో తగ్గించుకోవడమో చేస్తాడు కాని ఎవరైనా 70 ఏళ్ళకు పైబడి అవిశ్రాంతంగా చివరి క్షణం వరకు పోరాడిన వాళ్ళు ఓ నలుగురుంటే అందులో ఖచ్చితంగా కాళోజీ ఒకరు

ఒక న్యాయవాది గొప్ప ప్రజాకవి, నిరంతర ఉద్యమకారుడు, ఒక గొప్ప ప్రజాస్వామ్య వాది, ఒక సునిశిత మేధావి ఒక సున్నిత మనుస్కుడు, అన్నింటిని మించి ఒక గొప్ప మానవతావాది, ఇవన్నీ చాలా హెచ్చుపాళ్ళలో కలిసిపోయి ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఏర్పడితే అది కాళోజీ అని పిలువబడుతుంది

సంక్షేమ రాజ్యమంటే ప్రజల సంక్షేమమే ధ్యేయంగా ప్రభుత్వాలు తమ విధులను నిర్వర్తించాలి ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రజలు స్వేచ్ఛగా బ్రతకాలి ఈ రెండూ రాజ్యాంగంలోని ముఖ్య లక్షణాలు ఇవంటే కాళోజీకి తన ప్రాణం కంటె ఎక్కువ యిష్టం అందుకే ఏదయినా రాజ్యాంగానికి లోబడి చట్టప్రకారమే జరగాలంటాడు ఈ రెండింటి కోసం ఆయన జీవితమంతా పోరాడాడు ఒక సర్వసత్తాక దేశపు ఝుండా తలెత్తుకొని రెపరెపలాడినంత గొప్పగా ఆదేశ ప్రజలు కూడా తలెత్తుకొని ఉన్నతంగా స్వేచ్ఛగా బ్రతకాలంటాడు ఆ ఔన్నత్యం ఎక్కడ ఎలా

తగ్గినా ఆయన కలం కదులుతుంది గళం గర్జిస్తుంది ఆ ఔన్నత్యాల మీద దాడి జరిపిన తనం మీద తిరబడతాడు గొడవ పడతాడు గొడవ గొడవ నా గొడవ అంటూ ఆయన చేసిన గొడవలన్నీ ఆ దాడులకు వ్యతిరేకంగా ఆయన సంధించిన గాండీవాలే

అధికారం ఉన్న దగ్గర అతిక్రమించేందుకు అవకాశం ఉంటుంది అది నియంతృత్వం దాకా తీసుకుపోతుంది ఎంత గొప్ప నాయకుడైనా ఎంత పెద్ద అధికారి అయినా చట్టపరిధిలో ప్రజాస్వామ్య బద్ధంగా నడుచుకోవాలనేదే ఆయన డిమాండ్ అలా కాకపోతే ప్రజలు పౌరులు వాళ్ళు ఆశపడే శాంతిమత సమాజంలో స్వేచ్ఛామత జీవితం కాకుండా మరో విభిన్నమైన, అన్యాయంగా అధికారం చలాయించబడే, అణగదొక్కబడే వ్యవస్థలో జీవించాల్సి వస్తుంది ఒక గౌరవమైన పౌరుడిలా కాకుండా ఒక పనివాడిలా బ్రతకాల్సి వస్తుంది అలాంటప్పుడే కాళోజీ ≡ ప్రజల్ని చూసి కన్నీళ్ళు కారుస్తాడు ఆ అధికారం మీద కన్నెర్ర చేస్తాడు ఆయన పోరాటమంతా అ అన్యాయం దబాయింపు చలాయింపుకు వ్యతిరేకంగానే దాన్ని ఎదుర్కొనేందుకు ఆయన అందుకున్న అస్త్రం 'ప్రశ్న' ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవాలంటే దారితప్పిపోతున్న అధికారాన్ని నిలదీయాలంటాడు పొరపాటు చేసినప్పుడల్లా ప్రశ్నించాలంటాడు నిజమైన ప్రజాస్వామ్యంలో ప్రజలకు ప్రశ్నించేతత్వం నిలదీసే దమ్ము ఉండాలంటాడు

ప్రజాస్వామ్యం అంటే ఆయనకు ప్రాణం అందుకే ప్రశ్న అంటే కూడా ఆయనకు ప్రాణమే ఆయన జీవితం అంటే పోరాటం పోరాటమంటే ప్రశ్నించడం ఉద్యమమంటే నిలదీయడం ఆయన తన పోరాట జీవితం ప్రశ్నించడం 'నిలదీయడం అన్న రెండు కాళ్ళమీదే సాగిపోయింది ఆ రెండు కాళ్ళలో ఏ ఒక్కటీ కూడా కనీసం ఒకసారి కూడా వెనక్కి అడుగు వేయలేదు రాజీ పడలేదు ప్రగతికి మూలం ప్రశ్న అయితే ప్రశ్నే అన్నిట్కి మూలం అయితే ప్రశ్నను నమ్ముకున్నవాడు తన అమ్ముల పొదిలో ఉంచుకున్నవాడు ఎప్పుడైనా ఉన్నతంగానే బ్రతుకుతాడు

ప్రశ్న ఎంతగొప్పదో ప్రశ్నించడం ఎంత గొప్పదో ప్రశ్నిచేవాడు ఎంత ఉన్నతుడో ప్రశ్నకు ఉన్నతమైన బ్రతుక్కు ఎంత గొప్ప అనుబంధం ఉందో తన జీవితమంతా ప్రశ్నిస్తూ, నిలదీస్తూ తాను సజీవ ఉదాహరణై జీవించిన వాడు కాళోజీ

అలా జీవితమంతా ప్రశ్నిస్తూ బ్రతికిన కాళోజీ జీవితం, మనమెట్లా బ్రతికితే నిజంగా బ్రతికినట్టు అన్న ప్రశ్నకు ఒక జవాబు

# కవన యోధుడు కాళోజీ

- ఎం ఎల్ నరసింహారావు

తన మాటతో రాతతో తెలంగాణా జీవితాన్ని ప్రభావితం చేసిన వైతాళికుడు కాళోజీ అధిపత్యంపై ధిక్కారస్వరానికి ఆయన ప్రతీక అన్యాయమైన వ్యవస్థతో నిరంతరం గొడవపడిన ఉద్యమకారుడు మాటకీ చేతకీ మధ్యన అంతరంలేని ఆయన స్వభావం సదా స్ఫూర్తిదాయకం

నిజాం రాజు నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా పెల్లుబడికిన పోరాటంలో అత్యంత ప్రముఖ పాత్ర వహించి ప్రజాకవి కాళోజీ ప్రదర్శించిన అద్భుతమైన ధైర్యసాహసాలు త్యాగాలు మనకందరికీ తెలిసినవే ఆయన ప్రతిభావంతుడైన మహాకవి రచయిత కథకుడు బహుభాషావేత్త మేధావి జిజ్ఞాసువు శక్తిమంతమైన కవితలచే తెలంగాణా ప్రజానీకానికి స్ఫూర్తిని ఇచ్చిన వైతాళికుడు

సుదీర్ఘమైన ఏడు దశాబ్దాల ప్రజాహిత జీవితంలో ఆయన ఎన్నో ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించారు ఎన్నో పోరాటాలలో పాల్గొన్నారు అన్యాయాలను అక్రమాలను ఎదిరించారు అన్యాయాలను ఎదిరించినవాళ్ళకు బాసటగా నిలిచి "అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు' అని ఎలుగెత్తి చాటారు

కాళోజీ స్వేచ్ఛాప్రియుడు ప్రజాస్వామ్య పరిరక్షకుడు సచ్ఛీలుడు త్యాగమూర్తి మానవతావాది నైతిక విలువలకు ప్రాధాన్యతనిచ్చిన ప్రజానాయకుడు తాను నమ్మిన సిద్ధాంతాన్ని తాను సత్యమని, సబబని అనుకున్న అంశాన్ని ప్రకటించటానికి ఆయన ఎన్నడూ వెనకాడలేదు మనసులో మాటను కుండబద్దలు కొట్టినట్లుగా చెప్పేవారు అయితే ఆయన ఎవరినీ ద్వేషించలేదు చెడుని మాత్రమే ద్వేషించారు కపటమెరుగని కారుణ్యమూర్తి కాళోజీ అని పేరు పొందారు

కాళోజీ ప్రజాహిత జీవితంలో అడుగుపెట్టినప్పటి నుంచీ వివిధ సందర్భాలలో వివిధ సమస్యలపై తన ఆవేదనను కవితలలో వెల్లడిస్తూ వచ్చారు సమాజంలోని హెచ్చుతగ్గులు పీడితుల కష్టాలు, అన్యాయాలు, ఆయన కవితా వస్తువులు దానినే ఆయన నా గొడవ' అన్నారు అయితే అది ఆయన ఒక్కరి గొడవ కాదు మనందరి గొడవ సమాజానికంతటికి వర్తించే నగ్నసత్యాలు ఆయన కవితలు . చిన్నచిన్న మాటలలో అందరికీ అర్థమయ్యే రీతిలో ఎన్నో కావ్యఖండికలు రచించారు తాను చెప్పదలచిన విషయాన్ని నిర్మొహమాటంగా, నిర్భయంగా చెప్పారు ఎత్తుగడ, అధిక్షేపం ఎత్తిపొడుపు వ్యంగ్య చమత్కృతులు ఆయన కవిత్వంలోని ప్రత్యేకతలు

"అవనిపై జరిగేటి అవకతవకలు చూచి
ఎందుకో నా హృదిని అన్ని ఆవేదనలు?
పరుల కష్టముచూచి కరిగిపోవును గుండె
మాయ మోసము చూచి మండిపోవును ఒళ్ళు'

సమకాలీన సమాజంలో జరిగే అవకతవకలను ప్రజల భాషలో భాషలో హృదయానికి హత్తుకొనే రీతిలో తన కవిత్వంలో వర్ణించిన కాళోజీకి ఆధునికాంధ్ర సాహిత్యంలోగల స్థానం అత్యున్నతమైనది

# జీవన గానంలో మనోరాగాలు - ధారావాహికలో ఇదీ నాగొడవ

**కాళోజీ ఆత్మకథ**

- ఐ తిరుపతిరావు

ఏ భాషలోనయినా ఎక్కువ సందర్భాలలో ఆత్మకథల్ని రచయితలే స్వయం రాసుకోవడం జరుగుతుంది ఆత్మకథల్ని చెప్పటం చాలా అరుదు ఆత్మకథని రచయిత స్వయం రాయటం అనేది శైలీగతంగా పాఠకుణ్ని ఎంతో కొంత రచయిత నుంచి దూరంవుంచుతుంది ఇందుకు భిన్నంగా రచయిత తన జీవిత కథని వేరొకళ్ళకి చెపుతూవుంటే వినే వ్యక్తి దానికి పుస్తక రూపం ఇచ్చినట్లయితే అటువంటి ఆత్మకథకి సజీవ లక్షణం ఎక్కువగా వుంటుంది పాఠకుణికి నిరాపేక్షంగా చదువుకుపోవటం కాకుండా తానొక రచన చేయటంలో రచయిత లక్ష్యాన్ని ఎంతో కొంత తీర్చగలుగుతుంది ఈ అభిప్రాయనికి తక్షణ సాక్ష్యం కాళోజీగా ప్రసిద్ధులైన కాళోజీ నారాయణ రావుగారి ఆత్మకథ ఇదీనాగొడవ మరొక సాక్ష్యం గుడిపాటి వెంకటచలం గారి ఆత్మకథ చలంగారు కాళోజీగారు ఆత్మకథల్ని రాయటం కాకుండా చెప్పారు అందుకే వీళ్ళిద్దరి ఆత్మకథలు పాఠకుడి మనస్సుమీద గాఢమైన ముద్ర వేయగలిగాయి

కాళోజీ వచన కవిత్వంలో మౌఖిక సాహిత్య లక్షణాలు ఎంతో ఎక్కువగా వుంటాయి ఈ అభిప్రాయం వచనంలో రాయబడిన కాళోజీ ఆత్మకథకు కూడా వర్తిస్తుంది కాళోజీ ఆత్మకథని కాళోజీగారు చెపుతూవుంటే తూర్పుమల్లారెడ్డి ఎ బి కె ప్రసాద్, స్మైల్ మరికొంతమంది కాళోజీ అభిమానులు, మిత్రులు రికార్డు చేశారు రికార్డు చేయబడిన విషయాలే ఆ తరువాత అంటే 1995లో 'ఇదీ నాగొడవ అనే పేరుతో పుస్తక రూపంలో వచ్చాయి ఈ పుస్తకం పేరు 'నా గొడవ' అయినా ఇది కాళోజీ సొంతగొడవకాదు కాళోజీ ఆత్మకథ తెలుగు సమాజపు ఎనిమిది దశాబ్దాల చరిత్ర తెలుగు సమాజపు నిర్దిష్టంగా తెలంగాణా ప్రాంతపు రాజకీయ సాంస్కృతిక ఆర్థిక చరిత్రకి సంబంధించి ఒక పార్శ్వాన్ని కాళోజీ ఆత్మకథ మనకు అందిస్తుంది

తెలుగు చరిత్రకారులు చరిత్ర పరిశోధనలో ఆత్మకథల్ని జీవిత కథల్ని డైరీలోను అంతగా వుపయోగించుకున్నట్లు కన్పించదు నిజానికి వీటిని వుపయోగించుకోక పోవటం అంటే చరిత్రకు సంబంధించిన ఒక పార్శ్వాన్ని కొన్ని సందర్భాలలో చాలా ముఖ్యమయిని పార్శ్వాన్ని విస్మరించటమేననిపిస్తుంది తెలుగు చరిత్రకారులు సామాజిక శాస్త్ర సిద్ధాంతాలకిచ్చిన ప్రాముఖ్యం ఈ స్వీయకథనాలకి జీవిత కథలకి ఇవ్వక పోవటం తెలుగు చరిత్ర రచనా శాస్త్రంలో ఒక లోపం, ఒక ప్రధాన లోపమేమో కూడా! చరిత్ర కారుడికి కావలసిన సమాచారం ఎంత ఎక్కువగా ఆత్మకథల్లో దొరుకుతుందో తెలుసుకోవటానికి కాళోజీ నారాయణరావుగారి ఆత్మకథ 'ఇదీ నాగొడవ ఒక వుదాహరణ మాత్రమే

కాళోజీ ఆలోచనల్లో తర్కం ప్రధానం ఈ తర్కం కాళోజీ కవిత్వంలో ఎంత ఎక్కువగా కనిపిస్తుందో అంతకంటె ఎక్కువగా తన స్వీయకథనంలోనూ కన్పిస్తుంది ఈ తర్కం కాళోజీ కవిత్వాన్ని పలుచపరిస్తే వచనానికి మరింత శక్తినిచ్చిందని కాళోజీ ఆత్మకథ రుజువు చేస్తుంది చెప్పే విషయంలో కళాత్మక అంశంకంటె విషయాన్ని ఎంత సూటిగా నిక్కచ్చిగా చెపుతున్నామన్నదే కాళోజీకి ప్రమాణం అందుకని అతనన్నట్లు కళాత్మక

విలువలమీద వచ్చిన విమర్శల్ని ఆయనెప్పుడూ లెక్కచేయలేదు కాళోజీ తర్కం తర్కశాస్త్రం నుంచి వచ్చింది కాదు కాళోజి తర్కం చాలా సహజంగా జన గ్రామీణుడి భాషలో వ్యక్తమయ్యే తర్కంలాగా వుంటుంది ఈ తర్కానికి ఆయన చదివిన న్యాయశాస్త్రానికి న్యాయవాద వృత్తికి ఏ సంబంధం లేదు అలేకపోవటమే కాళోజి తర్కానికి అంతబలం, సహజత్వం రావటానికి కారణమయింది కాళోజీలో ఏమాత్రం గందరగోళం, మార్మికత లేవు అన్యాయాన్నిదిరిస్తె నా గొడవకు సంతృప్తి అన్యాయం అంతరిస్తే నాగొడవకి ముక్తి ప్రాప్తి అన్యాయాన్నిదిరించినవాడే నాకారాధ్యుడు ' అన్నంత స్పష్టంగా వుంటాయి కాళోజీ ఆలోచనలు

కాళోజి ఆత్మకథలో తానే చెప్పుకున్నట్టు ఒక క్రమ పద్ధతిలేదు, తారీకులు దస్తావేజులు లేవు ఆయన స్నేహాలు, సమాజం సాహిత్యం రాజకీయాలు వాటి వూసులేవున్నాయి కాళోజీ జీవితం నిరంతరం సంఘటనాత్మకంగా నడిచింది స్కూలు రోజుల నుండి ఈనాటి వరకు కాళోజి నిరంతరం ఎదొఒక వుద్యమంలో తలమునకలౌతూనే వున్నారు కాళోజీ ఏ ఉద్యమంలోవున్నా స్వతంత్ర వ్యక్తిత్వాన్ని వదులుకోలేదు, ఎవరికీ అనుచరుడుగా మిగలలేదు గొర్రెదాటు వ్యవహారానికి ఆయన విరోది కాంగ్రెస్ పార్టీ అభిప్రాయాలలో పనిచేసినా కమ్యునిస్టు పార్టీ సభ్యులతో కలసి పనిచేసినా, ఆయన తన అభిప్రాయాలకి వ్యతిరేకంగా పని చేయలేదు తన వ్యక్తిత్వాన్ని వదలుకోలేదు

ఉద్యమాల్లో స్వతంత్రంగా వుంటూ కూడా కాళోజీ ప్రతి వ్యక్తిని, ప్రతి రాజకీయ అవగాహనని ఎంతో లోతుగా పరిశీలించటం, విశ్లేషించటం కన్పిస్తుంది కాళోజీ ఆత్మకథలో అనేక రాజకీయ వైఖరుల మీద, తీర్మానాల మీద తన అభిప్రాయాలను కరాఖండిగా ప్రకటించారు కాళోజీ తన ఎనభైఏళ్ళ వయస్సులో చెప్పిన ఆత్మకథలో ఎంతో జ్ఞాపక శక్తితో చాలా చిన్న చిన్న విషయాల్ని కూడా సంభాషణాత్మక శైలిలో అద్భుతంగా చెప్పారు పద్దెనిమిదవ శతాబ్ధపు మూడవ దశకంలో రూపొందిన నిజాం రాజ్యాన్ని గురించి, అంతకు పూర్వమే భారత దేశంలోకి ప్రవేశించిన ఈస్టిండియా కంపెనీ గురించి మొగలాయి చక్రవర్తుల గురించిన అనేక చారిత్రక అంశాల్ని ఆశ్చర్యం కలిగించే జ్ఞాపకశక్తితో, ఏ డైరీల సహాయం లేకుండా విశ్లేషణాత్మకంగా చెప్పారు కాళోజీ స్వతంత్ర్యం రావటానికి పూర్వం భారత దేశంలో వున్న 563 సంస్థానాలు వాటి పరిపాలనా పద్దతులు, వివిధ సంస్థానాల మధ్యవున్న సంబంధాలు, శత్రుత్వాలు భాషలు వాటి పాలకుల పేర్లు చాలా సందర్భాలలో కాళోజీ సునాయసంగా వుటంకించారు ఏ లిఖిత ఆధారాల సహాయం లేకుండా, కేవలం జ్ఞాపకశక్తి మీద ఆధారపడి ఇన్ని విషయాల్ని నిరాటంకంగా చెప్పటం అనితరసాధ్యం అనటం అతిశయోక్తి కాదు

నైజాం సంస్థానం మీద కాళోజికి అపారమైన అవగాహన వుంది ఈ విషయం కాళోజి ఆత్మకథలోని అక్షరం అక్షరం రుజువు చేస్తుంది కరెన్సీ పోస్టల్ సర్వీసులు, మిలటరీ, పాఠశాలలో మొదలయిన వాటి వరకు నైజాం సంస్థానంలోని ప్రతి అంశాన్ని కాళోజీ చాలా లోతుగా, ఒక చారిత్రక పరిశోధకుడిలాగా తన స్వీయకథనంలో రికార్డు చేసారు

తెలుగు, ఉర్దు సాహిత్యాల గురించిన, వాటి చరిత్రకు సంబంధించిన అవగాహన కూడా కళోజీలో కన్పిస్తుంది ఈ అవగాహనవల్లే కాళోజి చాలా జఠిలమయిన అంశాల్ని కూడా ఎంతో తేలికగా విశ్లేషించి చూపారు కాళోజి విశ్లేషణలో ఏ మార్మికతా లేదు 'నిర్మొహమాటంగా చెప్పటం ఆయన పద్ధతి లేకపోతే 'దేవుణ్ణి స్తుతించాలంటే దేవ భాషలోనే రాయాల'ని విశ్వనాథ సత్యనారాయణని ఆయన సమక్షంలోనే తెలుగులో రాసి మమ్మల్ని ఇబ్బంది పెట్టటంకంటె సంస్కృతంలో రాస్తే సంస్కృతం వచ్చినవాళ్ళే చదువుకుంటారు మాకు బాధ తప్పుతుందని ఎలా

చెప్పగలరు? వాడుక భాష గురించి కాళోజి స్పష్టమైన అవగాహన వుంది పర్షియన్ భాష రాజ భాష అని పర్షియన్ భాష నుంచి రూపొందిన ఉర్దు ప్రజల భాష అని కాళోజి అభిప్రాయం కాళోజి ఈ అభిప్రాయాల్ని సంస్కృతం తెలుగులకు కూడా వర్తిస్తాయి కాళోజీ ఎప్పుడు ప్రజలభాష వైపే ప్రాంతీయ భాషల్లో ప్రజల భాషల్లో రాసిన రచనలపట్ల ఆయనకి ఇష్టం ఎక్కువ

వలసవాద లక్షణాల సామ్రాజ్యవాద ఆలోచనలు ఇంకా మనలో మిగిలివున్నాయని ఆ ఆలోచనల ఫలితమే మన యునివర్సిటీలకి కృష్ణ దేవరాయ, కాకతీయ అనే పేర్లు పెట్టటం అంటారు కాలోజీ ఇలాంటి పేర్లు పెట్టడం లౌకిక ప్రజాస్వామిక సూత్రాలకి విరుద్ధమని అనాడు హిందూ ముస్లింలు నాకు చెరొక కన్ను అంటూనే ముస్లింలను ప్రోత్సహించిన నైజాంకి ఇప్పుడు మనం చేస్తున్న పనులకి తేడా ఏమీ లేదంటారు కాళోజీ రెండు సందర్భాలలోనూ కొన్ని వంశాలు గొప్పవనే ఫ్యూడల్ ఆలోచన అంతర్లీనంగా వుందని, అతీరులోనే మనం కూడా ఆలోచిస్తున్నామంటారు కాళోజీ

భారతీయ సమాజం రకరకాల పెత్తందారీ అంతరాల దొంతర్లతోటి, ఫ్యూడల్ చిత్త వృత్తులతోటి కూడుకున్న సమాజమని ఈ పాత అవలక్షణాలన్నీ వుండగా బ్రిటిష్ వాళ్ళరాకతో మతపరమైన కొత్త అవలక్షణాలు రంగంమీదకు వచ్చాయని కాళోజీ గారి పరిశీలన ఫ్యూడల్ విధానంలో మతపరమైన రాజకీయాలు మత ఘర్షణలకు దారితీశాయని నైజాం సంస్థానంలో ముస్లిమేతరులు పెత్తందారీ తనం మీద దాడి చేస్తే ఆ పోరాటాలు హిందూ ముస్లిం ఘర్షణలుగా పిలువబడ్డాయని, నిజానికి ఆ పోరాటాలు ఫ్యూడల్ విధానాలకి, పెత్తందారీ తనానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాలని కాళోజీ అంచనా

నైజాం పెత్తందారీ తనానికి వ్యతిరేకంగా రూపొందిన హిందూ సంఘటన్‌లో కూడా ఎక్కువ భాగం ఫ్యూడల్ విధానానికి చెందినవాళ్ళే ఎక్కువగా వుండేవాళ్ళని, పెద్దవాళ్ళు చిన్నవాళ్ళు అనే అంతాల్ని హిందూసంఘటన్ సభ్యులు కూడా పాటించే వాళ్ళని చెపుతూ ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడిన రాజకీయ సంస్థలలో అమలయిన ఆధిపత్యాల్ని శ్రేణీకరణల్ని బహిర్గతం చేశారు కాళోజీ తన ఆత్మకథలో

నైజాం సంస్థానంలో జరిగిన మత మార్పిడలను కేవలం ముస్లింల ప్రోద్భలంగా చూడకుండా స్వచ్ఛందంగ జీవిత అవసరాల్నించి మతం మార్చుకున్న వైనాన్ని కూడా కాళోజీ ప్రస్తావిస్తారు హిందూ వితంతువులకి పెళ్ళి నిషిద్ధం కాబట్టి హిందూవితంతువులుగా బతకటంకన్నా ముస్లిం భార్యగా వుండటం మేలని చాలామంది ముస్లిం మతంలో చేరేవాళ్ళు తమని అంటరానివాళ్ళగా చూడనటువంటి ముస్లిం మతంలోకి చాలా మంది స్వచ్ఛందంగా వెళ్ళి చేరారు ఇటువంటి మత మార్పిడకులు కొన్ని సందర్భాలలో చాలా ముమ్మరంగానే జరిగాయి ఈ మార్పిడులు ఎంత తీవ్రంగా జరిగాయంటె వీటి ఫలితంగా హిందూ ముస్లింల జనాభానిష్పత్తిలో మార్పులు చోటు చేసుకున్నాయి కొన్ని సందర్భాలలో హిందూమతానికి చెందినవాళ్ళు విదేశాలకి వెళ్ళారనో, కాఫీలు సారాలు తాగారనో, మతం నుంచి వెలివేయబడేవాళ్ళు అలా వెలివేయబడిన వాళ్ళు చాలామంది ముస్లింమతంలోకి చేరారు అని వుదాహరణ సహితంగా చూపిస్తారు కాళోజీ

తెలంగాణా జిల్లాలో ఇప్పటికే ఎదొఒక రూపంలో తలెత్తుతూవుండే ముల్కీ, నాన్ ముల్కి సమస్యని మూడువందల ఏళ్ళ నుండి వున్న సమస్యగా గుర్తిస్తారు కాళోజీ బహమనీ రాజ్యంలో కూడా ఈ ప్రాంతేతరుల సమస్య వుండేది రాజుల వెంట కొన్ని కుటుంబాలు రావటం, వాళ్ళతోపాటు వాళ్ళ బంధువులు రావటం జరిగేది దీని ఫలితంగా కొత్తగా వసల వచ్చిన వాళ్ళ సంఖ్య పెరగటం, స్థానికులకి వుద్యోగావకాశాలు తగ్గటం జరిగేది అందువల్ల ముల్కీ నాన్‌ముల్కి అనే సమస్య ఆర్థిక సమస్య, బతుకుదెరువు సమస్య అంటారు కాళోజీ ఈ

సమస్య ఇవ్వాళ ఉత్తర దక్షిణ దేశాల మధ్య ప్రాంతీయంగా ఆంధ్ర, తెలంగాణ మధ్య తలెత్తిందని అంటారు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నుండి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలని పోరాడినవాళ్ళు తమకి జరిగిన అన్యాయాలకి వ్యతిరేకంగా పోరాడిన వాళ్ళు ఇవ్వాళ ప్రత్యేక తెలంగాణా పోరాటాన్ని అర్థం చేసుకోలేక పోతున్నారు అని కాళోజీ ఆందోళన ఆవేదన

నైజాం రాజ్య అధికార ఆధిపత్య చట్రాలని చాలా నిశితంగా పరిశీలించారు కాళోజీ హైదరాబాద్ స్టేట్‌లో ముస్లింలకి సంపూర్ణమైన స్వేచ్ఛవుండేది గ్రామాల్లో పటేల్ పట్వారీ, జగిర్దార్ దేశముఖ్‌లదే పెత్తనం రాజకీయ అధికారాన్ని కూడా ఎక్కువగా వీళ్ళే అనుభవించేవాళ్ళు నైజాం ప్రభుత్వానికి వీళ్ళందరూ ఇరుసులాగా పని చేశారు ఈ అధికార ప్రయోగానికి హిందువులు, ముస్లింలు అనే తేడా ఏమీలేదు అందరూ ఏదో ఒక రూపంలో నైజాం ప్రభుత్వ యాంత్రగపు అణిచివేతకు గురయ్యారు

కాళోజీ ఆత్మకథ చదువుతూ వుంటే మనకి చాలాత్వరగా అర్థమయ్యే విషయం ఆయనకి సామాజిక లేక రాజకీయ జీవితమేతప్ప చెప్పుకోదిన వ్యక్తిగతమైన జీవితం అంటే సామాజికంగా తాను పాల్గొంటువున్న వుద్యమాలకి వెలుపలి జీవితం లేదని కాళోజీ వైయక్తి జీవితం అనేది ఏమన్నా వున్నా అది కూడా రాజకీయాల చుట్టూనే నడిచింది నిరంతరం ఆయన ఎదొఒక వుద్యమంలో నిమగ్నమవుతూ వచ్చారు స్కూలు రోజుల్లోనే 'సంఘటనే శక్తి' 'సహకారమే మేలు', ముల్లుని ముల్లుతోనే తీయాలి అనే నినాదాల్ని ప్లేకార్డుల మీద రాసి పట్టుకుని తిరిగిన జీవితం కాళోజీ జీవితం అందువల్ల కాళోజీకి వైయక్తిక జీవితం అనేది లేకపోవటం అత్యంత సహజం

కాళోజీచాలా చిన్నవయస్సు నుంచే పౌరహక్కుల కోసం పోరాడుతూవచ్చారు మతాలకి అతీతంగా ఎవరి పౌరహక్కులకి భంగం కలిగినా పోరాడుతానని ప్రకటించి ఆ విధంగా పని చేశారు కాళోజీగారు మతం అనేది చర్చి గుడి మసీదులకు మాత్రమే పరిమితమని కాళోజి నమ్మకం అదే నమ్మకంతో కాళోజీ ఇవ్వాల్టికీ పౌరహక్కుల వుద్యమాల్లో చురుకుగా పాల్గొంటూవున్నారు ఏ ప్రజానంఘం నిర్వర్తించే పౌరహక్కుల వుద్యమంలోనయినా కాళోజీ పాల్గొంటారు ఒక సంఘ నియమావళికో ఒక పార్టీ నిబంధనలకో లొంగి వుండే తత్వం కాదు కాళోజీగారిది కాళోజీగారె చెప్పుకున్నట్టు ఆయన 'పార్టీ ప్రత్యానికి' వ్యతిరేకి

మనుష్యుల్లోని నున్నితాంశాల్ని, చిన్న చిన్న ప్రయోజనాల కోసం పెద్ద పెద్ద లక్ష్యాల్ని త్యాగం చేసిన వాళ్ళని కూడా ఏ విద్వేషమూ లేకుండా క్షమించటం అర్థం చేసుకోవటం కాళోజీ వ్యక్తిత్వంలో విశిష్టలక్షణం నైజాంలో ఒరిగిన పత్యాగ్రహాల సందర్భంలో తనతోపాటు జైళ్ళకి వచ్చిన తోటి ఖైదీలు చుట్ట బీడి అలవాట్లను మానుకోలేక వాటి కోసం 'మాఫినామాలు' రాసి జైలు నుంచి బయటకు పోయిన వాళ్ళని కాళోజీ ద్వేషించలేదు, వాళ్ళ దేశభక్తిని నిందించలేదు శంకించవలసిన అవసరం ఎంత మాత్రమూ లేదంటారు

కాళోజీ తన ఆత్మకథలో కేవలం నైజాం సంస్థానంలోపల జరిగే పోరాటాల్ని చిత్రించి వూరుకోలేదు నైజాం సంస్థానానికి వెలుపల జరుగుతున్న వివిధ రాజకీయ స్వాతంత్ర్య పోరాటాల్ని అంతర్జాతీయ పరిణామాల్ని, మారుతున్న అంతర్జాతీయ పరిస్థితుల నేపథ్యంలో దేశ రాజకీయాల్లో వస్తున్న మార్పుల్ని ఎత్తుగడలను చాలా నునిశితంగా పరిశీలించి వివరించారు అంతేకాకుండ ఏఏ పార్టీలు ఎవరెవరు ఏ వైఖరులు తీసుకుంటున్నారు? ఎలా నందిస్తున్నారు, ఆ స్పందనల పట్ల తన అభిప్రాయాలు ఏమిటి అనే అంశాల్ని ఎక్కడి కక్కడ తేల్చి చెప్పారు కాళోజీ గారు

కాళోజీ జీవితంలో మరింత ఆశ్చర్యకర అంశం నిరంతరం క్రియాశీలరాజకీయాలలో వుంటూ కూడా సాహిత్యం పట్ల మమకారాన్ని, సాహిత్య కారులతో

పరిచయాల్ని చర్చల్ని వదులకోకపోవటం స్వయంగా తాను కవిత్వం రాయటం కాళోజీ చాలా అంశాలమీద సంఘటనలమీద తన అభిప్రాయాల్ని కవిత్వంలో పెడుతూ వచ్చారు సాహిత్య వేత్తలతో తనకున్న పరిచయాలు తన అభిప్రాయాల్ని నిర్మొహమాటంగా వ్యక్తం చేయటానికి అడ్డుకోలేదు అప్పట్లో తెలుగు మీజాన్ ప్రతికకి ఎడిటర్‌గా వున్న ప్రముఖ రచయిత అడవి బాపిరాజుగారు నైజాం పుట్టిన రోజున రాసిన అభినందన ఎడిటోరియల్ గురించి కాళోజీగారు బాపిరాజుగార్ని నిలదీసి ప్రశ్నించటం కాళోజి నిర్మొహమాటానికి ఒక వుదాహరణ మాత్రమే బాపిరాజు లాంటి రచయిత కాళోజీ ముందు దోషిగా నిలబడాల్సి వచ్చింది కాళోజిలోవున్న ఈ ధైర్యమూ నిజాయితీ కాళోజీని నైజాంలు పాటు మిగతావాళ్ళందరూ 'ఖతర్‌నాక్' మనిషి అని అనుకునేటట్టు చేశాయి

కాళోజీ సాహిత్య రంగంలోకి రావటానికి కూడా ప్రేరణ రాజకీయాలే మంచికవో వ్యాసకర్తో విమర్శకుడు కావాలని కాళోజీ సాహిత్య రంగంలోకి రాలేదు నిర్దిష్టంగా రాజకీయ భావాల్ని వ్యక్తం చేయటానికే అయన సాహిత్యం వైపు వచ్చారు పది, పన్నెండు ఉపన్యాసాలు చేయలేని పని ఒక చిన్న గేయమో కథో చేస్తుందని కాళోజీ అభిప్రాయం తన కవిత్వంలో చెప్పాలనుకున్నది, చెప్పింది రాజకీయాలే అ రాజకీయాలు స్పష్టంగా ప్రజలకి అందుతున్నాయా? లేదా? అనే దానిపైనే కాళోజి గారి ధ్యాస గొడవ అది కవిత్వమా? కాదా? అనే చర్చలతో కాళోజీకి పని లేదు నలుగురిలో కూర్చున్నప్పుడు విందుల్లో, వినోదంలో ఎప్పుడూ మీకు రాజకీయాలేనా? అని ప్రశ్నించే మిత్రులకు అయనిచ్చే సమాధానం 'సమాజంతో సంబంధం లేకుండా మీరెట్లా బతుకుతారు?' అనే ప్రశ్న రూపంలో వుంటుంది

భాష విషయంలోనూ కాళోజీవి నిశ్చితాభిప్రాయాలు వున్నాయని అయన ఆత్మకథ చదివితే తెలుస్తుంది కాళోజీ దృష్టిలో భాష రెండు రకాలుగా వుంటుంది ఒకటి బడిపలుకుల భాష రెండు పలుకుబళ్ళ భాష గ్రాంధిక భాషకి ఆయన పెట్టిన పేరు బడిపలుకుల భాష అని బడిపలుకుల భాషకంటె కాళోజీ ఎక్కువ పలుకుబళ్ళ భాషనే ప్రేమించారు వాడుక భాష కూడా తెలుగులో ఒకేరంగా లేదు అందువల్ల ప్రామాణికమైన వాడుక భాష కూడా వుండే వీలులేదు రాసిశాస్త్రిగారు రాసేదీ వాడుక భాషే రాజయ్య రాసేది వాడుక భాషే అలాగే గురజాడ రచనలు ఏ ఒక్క భాష ప్రామాణికమూ, రెండవది తక్కువ కాదు వాడుక భాషలో పాఠ్యపుస్తకాలు పెడ్తామనేవాళ్ళు అంతిమంగా ఏ ప్రాంతీయ భాషని లేక మాడలికాన్ని ప్రామాణికం చేసి పెడ్తారు? అని కాళోజీ గారి సూటిప్రశ్న ఈ సందర్భంలోనే కృష్ణా గుంటూరు వాండకల భాష జిల్లాల మాండలికాల మీద రుద్దటానికి ప్రయత్నిస్తే వచ్చే దుష్పరిణామాల్ని గురించి కాళోజీ హెచ్చరిక చేస్తారు ఈ క్రమం కనుక కొనసాగినట్లయితే కొన్ని జిల్లాలు ముఖ్యంగా తెలంగాణా జిల్లా సాంస్కృతికంగా నష్టపోతాయని కాళోజీ గారి అభిప్రాయం

మాండలికంలో తేడాలు, యాసలో వ్యత్యాసాలు వుండటమే ఏ భాషకయినా జీవలక్షణం ఏ భాషకయినా జీవ ధాతువు మాండలికం ఈ విషయాన్ని మర్చిపోయి కొన్ని మండలికాల్ని, యాసల్ని తొక్కివేయటానికి ప్రయత్నిస్తే భాష మరణిస్తుందంటారు కాళోజీ తెలుగు భాష మొత్తం మీద కాళోజీకి విపరీతమయిన మమకారం అందుకే చాలా కాలం క్రితమే "అన్య భాషలు నేర్చి ఆంధ్రంబు అదంచు / నకిలింపు ఆంధ్రుడా! చావవెందుకురా?' అని ప్రకటించారు కాళోజీ

రాజకీయ ఖైదీలుగా జైళ్ళకెళ్ళిన చాలా మంది తమ ఆత్మకథల్లో తాము అనుభవించిన కష్టాలు గురించి రాస్తూ వుంటారు ఈ రాతల్లో అతిశయోక్తులు కన్పిస్తుంటాయి కానీ అనేకసార్లు జైలుకెళ్ళిన కాళోజీ ఆత్మకథల్లో అతిశయోక్తులు లేకపోగా అసలు జైలు జీవితాన్ని అంత

కష్టంగా కాళోజీ భావించినట్టు తోచదు జైల్లో దొంగలు, హంతకులు మొదలయిన వాళ్ళను కాళోజీ ఎప్పుడూ విద్వేషంతో చూడలేదు ఇరవయ్యేసి ఏళ్ళు జైలు శిక్ష పడిన ఖైదీలు సత్యాగ్రహం చేసి ఏ అయిదారు నెలలో శిక్ష అనుభవిస్తూ వున్న తనలాంటి వాళ్ళకి జొన్న రొట్టెలు పంపటం, ఆత్మధైర్యాన్నిస్తూ లేఖలు రాయటం చూసి కాళోజీగారు చలించిపోయి కన్నీళ్ల పర్యంతం అయిన సందర్భాలు అనేకం వున్నట్టు కాళోజీ ఆత్మకథ వల్ల తెలుస్తుంది

కాళోజీ తనను తాను మితవాది ననుకుంటారుకానీ ఆయన మితవాదుల్లో అతివాది

జైలు జీవితంలో కూడా కాళోజీ ఎక్కడా రాజీపడలేదు ఒకసారి జైల్లో వుండగా జైలు అధికారులు తన దగ్గరకు వచ్చి శిక్షాకాలం ఇంకా రెండు సంవత్సరాలు వుండగానే విడుదల చేస్తాం ఈ పత్ర మీద సంతకం పెట్టమన్నప్పుడు ఆ పత్రంలో వున్న కొన్ని వాక్యాలకి అభ్యంతరం చెప్పి జైలు నుండి బయటకి వెళ్ళటానికి నిరాకరించారు కాళోజీగారు వర్తమానంలోనే కాదు భవిష్యత్తులోనూ తన స్వేచ్ఛ వట్ల కాళోజీకి అంతమమకారం ఈ మమకారం వల్లే శరీరసంబధమైన ఇబ్బందుల్ని గురించి ఆలోచించకుండా భావవ్యక్తీకరణ ష్ల ఆయన నిబద్ధత పెరుగుతూ రావటం సాధ్యమయింది ఈ క్రమంలో అనేక సార్లు నగర బహిష్కరానికి గురయినప్పుడు కూడా కాళోజీ చలించలేదు

నైజాం సంస్థానం స్వతంత్రంగా వుండటానికి వీలులేదు, అది భారత దేశంలో విలీనం కావాలని తీవ్రంగా ఆకాంక్షించారు కాళోజీ గారు అందుకోసం అనెక కష్టాలు పడ్డారు జైల్లో కూడా ఆయన ప్రక్కవాళ్ళ తోటి ఖైదీల కష్టాల గురించే ఆలోచించేవారు అందుకోసం అనేకసార్లు జైలు అధికారులతో ఘర్షణలకు దిగి ఇబ్బందులకు గురయ్యేవారు కాళోజీ జైల్లో వున్నారు అయినప్పటి నైజాం అసంబద్ధ చేష్టలను ఎప్పటికప్పుడు లోతుగా పరిశీలించారని ఆత్మకథవల్ల అవగతమౌతుంది

కాళోజి ఆత్మకధని చదివిన వెంటనే మనకు స్ఫురించే అంశం కాళోజీ దశాబ్దాల దేశ చరిత్ర అని ముఖ్యంగా తెలంగాణా చరిత్ర అని ఈ చరిత్ర క్రమం మొత్తంలో కాళోజీ వ్యక్తిగతం అనేది ఏమయినా వుంటే ప్రతి చారిత్రక సందర్భంలోనూ తనవైన స్వేచ్ఛాపూరితమైన నిబద్ధత నిండి ఆలోచనల్ని ముందుకు తేవటం మాత్రమే

ఇంత నిర్భీతి, నిస్వార్థం, నిబద్ధత భవిష్యత్తులో ఎవరి జీవితంలో నయినా చూడగలమా? అంటే అసాధ్యమనే చెప్పాల్సి వుంటుంది వర్తమాన మంతటిలోను నేను' అనేది ప్రధానమైపోయింది ఈ స్థితిలో కాళోజీలాంటి వ్యక్తుల్ని వూహించటం కూడా కష్టం మరింత చింతించాల్సిన అంశం భవిష్యత్తులో కాళోజీలాంటి వాళ్ళ జీవితాలు, జీవిత కథలు ప్రజల ముందు నమూనాలుగా వుండవేమోనని ఏమయిన వర్తమానం కాళోజి కృషి గుర్తించి 'పద్మవిభూషణ్'తో సత్కరించింది కాళోజి ఆత్మకథకి ముందు మాట రాస్తూ వరవరరావు గారు అన్నట్లు "అణగారిన శ్రమజీవులు నిర్మిస్తున్న చరిత్రతో పాటు నడుస్తున్న, బ్రతుకంతా దేశానిదైన మనిషి ' కాళోజి

కాళోజీ జీవితం - సాహిత్యం

# తెలంగాణా చరిత్ర మ్యూజియం

- డా॥ తూర్పు మల్లారెడ్డి

'జరిగినదంతా చూస్తూ ఎరిగనట్లు పడివుండగ సాక్షీభూతుణ్ణిగాను సాక్షాత్తు మానవుణ్ణి అని నాగొడవలో చెప్పుకున్నా అగో ఆ మానవుణ్ణి కాబట్టే చుట్టు పట్ల జరిగే ప్రతీ విషయానికి స్పందించడం అలోచించడం అవి ప్రజావ్యతిరేకాలైతే వాటి పట్ల అసమ్మతి నిరసన ధిక్కారం ప్రతిఘటనా కార్యక్రమం నేననుకున్న అవకతవకలను సవరించే ప్రయత్నం ఎవరితోను సంపూర్ణంగా ఏకభవించక పోవడం మరెవరూ నాతో ఏకభివించకపోవడం తెలంగాణా చరిత్రలో ఆయన జీవించిన 89 ఏండ్ల కాలంలో ఎన్నెన్ని సామాజిక ఉద్యమాలు వచ్చాయో అన్ని ఉద్యమాల్లో అయన నిర్వహించిన కార్యకలాపాలు చేసిన ప్రజా చైతన్యపు పనులు విసిరిన చణుకులు పాలకులపై ఎక్కుపెట్టిన ప్రశ్నలు అనితర సాధ్యమైనవి అందుకే ఆయన జీవితం తెలంగాణా చరిత్రకు ఆర్కివ్స్ వంటిది తెలంగాణాలోని ఇండ్లన్నీ ఆయన ఆతిధ్య మిచ్చిన లోగిళ్లే 'కొందరిండ్లల్లనయితె ఆరునెలలు ఏడాది రెండేడ్లు కూడా ఉండెటోన్ని వాండ్ల ఇండ్ల పద్ధతుల ప్రకారం నేను నడుచుకున్నది ఎక్కడా లేదు కాని ఆ కుటుంబంల ప్రతి ఒక్కరితో నాకు పరిచయం పసిపాప మొదలు కొని పండుముసలి వరకు చెలిమియే కలిమిగా బతికిన వాణ్ణి" అని కాళోజీ తన ఆత్మకథ 'ఇదీ నాగొడవ లో చెప్పుకొన్నాడు జీవిత మంతా ప్రజల్ని ప్రేమిస్తూ ప్రజల మనిషి' గా బతికాడు

ఆయన వ్యక్తిత్వం అపూర్వమైన అన్వయానికి సంక్లిష్టమైన ఒక ప్రత్యేకమైన, 'ఫినామినన్ సంఘటనలను సంస్థలను నిర్మాణాలను రూపొందించడంలో అయనకు ఆయనే సాటి గణేశోత్సవాలు, గ్రంథాలయోధ్యమాలు, ఆర్యసమాజ కార్యకలపాలు, సత్యాగ్రహోద్యమాలు ఆంధ్ర మహాసభలు, ప్రజా ఉద్యమాలు ఇలా ఎన్నని!

పలనాడు యుద్ధాలు రామదండు నిరసనలు చీరాల పేరాల పోరాటాలు మన్నెం తిరుగుబాట్లు తప్ప నైజాం రాజ్యంలో జరిగిన సామాజిక, రాజకీయ ఉద్యమాల పునాదిగా వచ్చిన అనేకానేక సాహిత్య ప్రక్రియలతో పరిచయం లేని సాహిత్య చరిత్రకారులకు కథకుడుగా కాళోజీ పరిచయమే లేదు గోలకొండ పత్రికలో మా చిన్న కథ' శీర్షిక క్రింద వరుసగా వచ్చిన తెలంగాణ కథకుల కథలు, తెలంగాణా ప్రాంతపు మొట్టమొదటి అధునిక సావాత్య సంస్థ "వైతాళిక సమితి సాహితీ సేవలు ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో ఒక పేరాగ్రాపు కైనా నోచుకోలేదే! తెలుగు సాహిత్యంలో బ్రహ్మసమాజాన్ని తత్ప్ర భావంతో వచ్చిన సాహిత్యాన్ని అర్థం చేసుకున్న మనం నిజాం రాష్ట్రంలోని ఆర్యసమాజాన్నీ తత్ప్రభావంగా వచ్చిన సాహిత్యాన్ని ఏమేరకు సాహిత్య చరిత్రలో ప్రతిపాదించాం? తెలంగాణాలోని ప్రత్యేక పరిస్థితులను మాత్రమే ప్రతిపాదిస్తూ ఇక్కడి సాహిత్యం వచ్చింది ఇక్కడే సురవరం వట్టికోట, దాశరథి వంటి రచయితలు అణాగ్రంథముల దేశోద్ధారక గ్రంథమాలల వంటి ప్రచురణ సంస్థలు, శ్రీకష్ణ దేవరాయహంధ్ర రాజరాజనరేంద్రాంధ్ర గ్రంథాలయాల వంటి ప్రజాచైతన్య కేంద్రాలు ఆంధ్రజన కేంద్ర సంఘం (తర్వాత ఆంధ్ర మహాసభ) కార్యకలాపాలను అధ్యయనం చేయాలి అందుకు కాళోజీ మాట, పాట, పోరాటం, కవిత (నాగొడవ) ఆయన అత్మకథ (ఇదీ నాగొడవ) మ్యూజియం లాగా తోడ్పడుతాయి

ఆయన కవిత్వం 'నా గొడవ' మనగొడవ ప్రజా పోరాటాల క్రానికల్ పాలకులెవరైనా వారి ప్రజావ్యతిరేక చర్యలను ప్రశ్నించే నిరసన కంఠం ఆయనది కాళోజీ కవిత్వం తెలంగాణంలో వచ్చిన అన్ని రాజకీయ, సామాజిక ఉద్యమాలకు ప్రత్యక్ష వ్యాఖ్యానం కవిత్వాన్ని కవిత్వం

కోసం గాక జన చైతన్య ప్రయోజనాన్ని ఈడేర్చే ఉపన్యాానికి ప్రత్యామ్నాయంగా చేపట్టాడు కాళోజీ కవిత్వం వేరు వ్యక్తిత్వం వేరు కాని మనిషి కాళోజీ బాధితుల్ని చూఎ సున్నిత మానవీయ హృదయంతో చలించి పోయాడు ఆ చలన తరంగాలే నా గొడవ కవితలుగా రూపుదిద్దుకున్నాయి ఒక రకంగా కాళోజీ కవిత కాలం ప్రసవిస్తున్న వ్యథ ఆయన నా గొడవ ప్రజల గొడవ అది సమకాలీన సామాజిక రాజకీయ ఆర్థిక సాహిత్యచరిత్ర పరిణామానికి రన్నింగ్ కామెంట్రీ ప్రశ్నను ప్రగతికి మార్గంగా భావించి సదా ప్రజల తరఫున పాలకుల నరంకుశాధికారాల్ని ఆధికృత హింసల్ని పార్టీతత్వాన్ని ప్రజాస్వామ్య విరుద్ధచర్యల్ని ప్రశ్నించిన కవి ప్రజా ప్రశ్నయైన కాళోజీ పాలకుల బిరుదాలకు పరదాలకు చల్లార లేదు అది చలనమున్నంత కాలం జ్వలిస్తూనే ఉంది అన్యాయాన్నెదిరిస్తే వా గొడవకు పంతృప్తి అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి అన్యాయాన్నెదిరించే వాడు నాకు ఆరాధ్యుడు అన్నది కాళోజీ ఆకాంక్ష తెలంగాణ 'యాస ను భాషకాదని ఎద్దేవా చేసే వారినుద్దేశించి రెండున్నర జిల్లాలదె/ దండి బాస అయ్యినపుడు / తక్కినోళ్ళనోళ్ళయాస / తొక్కిపెట్ట బడ్డప్పుడు/ బాన చాన వయ్యారం / యాసకంటు అయిప్పుడు / మాండలికపు మర్యాదల / మాటలు చేదయినవ్వుడు / బాలానంద కోస్తా / బాలలసోమ్మైనప్పుడు / ప్రాంతం వారీ రక్షణ / పనికి రాదు అన్నప్పుడు / ప్రత్యేకంగా రాజ్యం / పాలుకోరడం తప్పదు అని నినదించిన తెలంగాణ రాష్ట్ర స్వాప్నికుడు కాళోజి తెలంగాణా రాష్ట్రసిద్ధి తెలంగాణా భాష వాడుకలోకి రావడం ఆయన ఆశయాలు

కాళోజీ జీవితం సాహిత్యం తెలంగాణా చరిత్రకు మ్యూజియం లాంటిది ఆర్కివ్స్ వంటిది అచ్చమైన తెలంగాణా ప్రజాకవి కాళోజి తెలంగాణా చారిత్రక గమనంలో సంఘర్షణాత్మకమైన సంక్లిష్టమైన సామాజిక జీవితంలో భాగంగా ఉంటూ పౌరహక్కులకు ఏ స్థాయిలో భంగం కలిగినా ప్రతిఘటించాడు మాటలో చేతలో ఆలోచనలో ఆవేదనలో వేషంలో, ప్రవర్తనలో మనసులో మమతలో నూటికి నూరు పాళ్ళు తెలంగాణా స్వరూపం కాళోజీలో మూర్తీభవించి కన్పిస్తుంది

# కథకుడుగా కాళోజి

- డా పేర్వారం జగన్నాథం

ప్రజాకవి కాళోజి నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన ప్రజాపోరాటంలో అగ్రభాగాన నిలిచిన వీర సైనికుడు నిజం పలికినందుకు నిజాం ప్రభుత్వం ఆయన్ని నగర బహిష్కరణకు గురిచేసింది జైలుకు కూడ పంపింది ఐనా ఆయన ఏనాడూ ప్రభుత్వంతో రాజీపడలేదు పదవులకోసం ప్రాకులాడలేదు ప్రజల్ని మరచి పోలేదు ప్రజాసమస్యలపై ప్రజల పక్షం వహించి నాటికీ నేటికీ పోరాడు తూనే ఉన్నాడు ప్రజల గొడవలను తన గొడవగా ప్రజల వాణిని తన బాణిగా వినిపిస్తూనే ఉన్నాడు ఆయనకర్మయోగి నిరంతర ఉద్యమశీలి కనుకనే కేంద్ర ప్రభుత్వ మాయనకు 'పద్మవిభూషణ్' బిరుదుతో సత్కరించింది కాకతీయ విశ్వవిద్యాలయం గౌరవడాక్టరేటును బహూకరించింది

ఐతే సాహిత్యపరంగా చూస్తే కాళోజి దేశంలో కవిగానే సుప్రసిద్ధుడు కాని ఆయన కథలుకూడ రాసి ప్రచురించిన సంగతి చాలా మందికి తెలియదు నిజాంకాలంలోనే అయన ముచ్చటగా మూడు చిన్నకథలు రాసినాడు ఆ మూడు కథలూ కలిసి కాళోజి

కథలు పేరుతో 1943లో చిన్న సైజు పుస్తకంగా 24 పేజీలతో వెలువడింది దీన్ని ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని సుల్తాన్ బజార్ హైద్రాబాద్ వారి పక్షాన శ్రీ కె ఎ గుప్తగారు ప్రకాశకుడుగా ఉండి అణా గ్రంథమాల ప్రచురణల వరుసలో 24వ గ్రంథంగా ముద్రించినారు ముఖ పత్రంపై అణా ఆకారంలో భారత దేశ పటం భూమికగా ప్రచురణ సంస్థ ఎంబ్లమ్‌ను ముద్రించినారు అందులో రాట్నం సుత్తె కొడవలి నాగలి చిహ్నాలు కూడ ఉన్నాయి అంతేకాక అణాగ్రంథమాల అనే మాటల్ని తెలుగులోనూ ఇంగ్లీషులోనూ ముద్రించినారు ఈ చిహ్నాలన్నీ ప్రధాన రాజకీయ పార్టీలను సమన్వయ పరచడాన్ని సూచిస్తున్నాయని ఊహించవచ్చు అంతేకాక సమాజంలో అన్ని వృత్తులకు చెందిన ప్రజలకు ప్రాతినిధ్యం వహించేవిగానూ భావించవచ్చు దీనివెల ఒక్క కల్దారు అణా మాత్రమే ఆనాడు హైదరాబాదు రాష్ట్రంలో హాలీ నాణాలు అమల్లో ఉన్నా దీని ధర కల్దారులో ప్రకటించినారు ఇందుకు కారణం ఈ పబ్లిషింగ్ సంస్థ సుల్తాన్ బజారులో ఉన్నది ఈ ప్రాంతం బ్రిటిష్ రెసిడెన్సీలో భాగం అందుకే పుస్తకం వెలను కల్దారులో నిర్ణయించి ఉండవచ్చు నాకు లభించిన ఈ ప్రతిని ఆనాడు పీపుల్స్ బుకుడిపో, భువనగిరి వాళ్లు విక్రయించినట్లుగా పుస్తకంపై వేసిన రబ్బరు స్టాంపువల్ల తెలియవస్తున్నది

పుస్తకానికి ముందు మాటగా రాసిన స్వవిషయం లో ఈ ప్రచురణ సంస్థను మూడు సంవత్సరాల క్రితమే స్థాపించి పలు గ్రంథాలు ప్రచురించినట్లు శ్రీ కె ఎ గుప్త గారు తెలిపినారు ఈ గ్రంథం ఏప్రియల్ 1943లో ప్రచురింపబడింది కనుక సదరు ప్రచురణ సంస్థ 1939 40 ప్రాంతంలో స్థాపించబడినట్లు మనం ఊహించవచ్చు అంతేకాక ప్రపంచ యుద్ధం కారణంగా కాగితం కరువు ఏర్పడి అనుకున్నంతగా గ్రంథ ప్రచురణలు చేపట్టలేక పోయినామని కూడ నివేదించినారు ఐతే ఈ సంస్థ 20వ ప్రచురణగా 'సుభాష్ చంద్రబోస్' అనే గ్రంథాన్ని ప్రచురించినందుకు గాను ప్రభుత్వం రచయితకు 18 మాసాల కఠిన శిక్షనూ, ప్రచురణకర్త అయిన గుప్త గారికి ఒక మాసం కఠిన శిక్షతో పాటు రూ 250 లు జురుమానానూ విధించినట్లు పేర్కొన్నారు ఇంతకూ ఆ గ్రంథ కర్త పేరు తెలుపలేదు ఇదే పుస్తకంలో అక్కడక్కడా ఖాళీగా ఉన్నచోట సంస్థ ప్రచురణల జాబితాలను ప్రకటించినారు వాటిలో ఒకచోట ఈ సంస్థ ప్రచురించిన 'అల్లూరి సీతారామరాజు' అనే గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించినట్లు తెలిపినారు ఈ గ్రంథ కర్త పేరు కూడ తెలుపలేదు ఇవన్నీ ఎందుకు చెప్పవలసి వస్తున్నదంటే ఆనాటి స్థితి గతులూ ప్రభుత్వ నిర్బంధవిధానాలూ ప్రజల అగచాట్లూ ఈ నాటి తరానికి తెలుపాలన్న ఉత్సుకతతోనే

ఇక ఈ పుస్తకంలో ఉన్న కథలు వరుసా (1) మనమే నయం (2) తెలియక ప్రేమ తెలిసి ద్వేషము (3) విభూతి లేక ఫేస్ పౌడర్ అనే శీర్షికలతో ఉన్నాయి వీటిలో మొదటి రెండు కథలు ప్రగతివాద భావాల్ని వ్యక్తీకరిస్తుండగా మూడవది పారిజాతాపహరణం కథకు పేరడీగా ఉన్నది కాళోజీ కవితల్లో వ్యంగ్యమూ అధిక్షేపణమూ పేరడీ ధోరణీ ఉన్నట్లే ఈ కథల్లోనూ ఆలక్షణాలు అధికంగానే భాసిస్తున్నాయి

ఇక 'మనమేనయం అనే కథను పరిశీలిద్దాం ఇందులో, స్థూలంగా కథ ఇది ఒక గ్రామంలో ఎస్ పి సి ఏ (జంతువుల యెడ జరుగు అన్యాయ నిరోధక సంస్థ) వార్షికోత్సవం పెద్ద ఆడంబరంలో జరుగుతుంటుంది ఆ ఉత్సవం నిర్వహించడం కోసం ప్రభుత్వాధికారులు గ్రామంలో ఉన్న ఎడ్లు ఆవులు గుఱ్ఱాలు మొదలైన జంతువుల్ని తెప్పించి వనువుకుంకుమలతో పూలదండలతో బాగా అలంకరింపజేస్తారు వాటికారోజు ఆటవిడుపన్నమాట వాటిలో మల్లన్న సేటుకు చెందిన నల్లఎద్దూ తెల్లఎద్దూ కూడ ఉన్నాయి అట్లాగే ఈ ఉత్సవంలో పాల్గొనడానికి ప్రభుత్వాధికారులు సమాజంలో ఉన్న అన్ని రకాల ప్రజలనూ, అన్ని వర్గాలకు చెందిన ఉద్యోగులనూ, చిన్న పెద్ద తేడా లేకుండా రప్పిస్తారు అధికారుల ఆజ్ఞ ప్రకారం వలంటీర్లు గార్డ్ ఆఫ్ అనర్ చెప్పగా, బాజా బజంత్రీలతో మనుష్యుల వరుస ముందు నడుస్తుండగా, వెనుక జంతువుల వరుస పెద్ద ఊరేగింపుగా వెళ్లుతుంటుంది ఈ ఊరేగింపు ఎందుకు ఎక్కడికి వెళ్లుతున్నదో జంతువులకు తెలియనట్లే, అందులో పాల్గొన్న మేధావులకూ, విద్యావంతులకూ్కడా తెలియదు ఇక్కడ

రచయిత ఈ ఊరేగింపునుద్దేశించి ద్విపద చతుష్పాదములగుంపు అంటాడు అంటే అందులోని మనుషులు మెదడు లేని జంతువులతో సమానమని ధ్వని అప్పుడు నల్లఎద్దుకు అనుమానం వచ్చి ఇదంతా దేనికోసమని తెల్ల ఎద్దునడుగుతుంది తెల్ల ఎద్దు తన క్కూడ తెలియదంటుంది ఇక్కడ మనమొక అంశాన్ని గమనించాలి ఒక పశువుకైనా ఎందుకన్న ప్రశ్న ఉదయించింది కానీ ఊరేగింపులో పాల్గొంటున్న మేధావులక్కూడా ఈ ప్రశ్న పుటనే లేదు ఐతే రచయిత దాన్ని వాచ్యం చేయలేదు కథాకథన శిల్పం ద్వారానే దాన్ని ధ్వనింపజేస్తాడు ఇట్లా ఆ రెండింటి సంభాషణ జరుగుతుండగానే ఊరేగింపు పురమందిరం చేరుతుంది ఒక ప్రభుత్వ ఉన్నతాధికారి అధ్యక్షతన సభ ప్రారంభమై కార్యదర్శి తన వార్షిక నివేదిక చదువుతాడు అందులో ఆ సంవత్సరం ఎన్ని ముల్లు కట్టెల్ని విరగ్గొట్టినదీ ఒక్క ఎడ్లను బండ్లకు కట్టినందుకూ రోగపు గుఱ్ఱాలతో జట్కాతో లి నందుకూ ఎంద రెందరిని కోర్టుకీడ్చి శిక్షలు వేయించినదీ మొదలైన వివరాలుంటాయి కాని తిండి పెట్టలేని పేదరైతుల తాలూకు ఎడ్లు ఎన్ని చనిపోయినాయో అందులో వాటి వివరాలుండవు పిదప మరికొందరు జంతువులకు జరిగే అన్యాయాలగురించీ, మనుషులు వాటికి పెట్టే హింసలగురించీ ఘనంగా ఉపన్యసిస్తారు అంతటితో సభసమాప్తమై అధికారులు కార్లలో తమ తమ బంగ్లాలకు వెళ్లి పోతారు పశువులు తమ తమ దొడ్లకు వెళ్లిపోతాయి ఈ ఉత్సవంలో పాల్గొన్న చాలా మందికి అసలు ఆవులంటే ఏమిటో ఎడ్లంటే ఎట్లా ఉంటాయో తెలియదు

దొడ్లోకి వెళ్లిన పిదప నల్ల ఎద్దుకూ తెల్ల ఎద్దుకూ జరిగిన సంభాషణ చాలా రసవత్తరంగా ఉంటుంది పశువులకు జరుగుతున్న అనేకమైన అన్యాయాల గూర్చి తెల్ల ఎద్దు నల్ల ఎద్దుకు వరుసగా ఏకరువు పెడుతుంది ఈ ఉత్సవం నిర్వహించిన నిర్వాహకులకు చిత్తశుద్ధి లేదంటుంది తమకు బాధలు పెట్టే మానవజాతినంతా విమర్శిస్తుంది ఈ ఉత్సవమొకనాటకమూ బూటకమూ అంటుంది తమ ఆహారం కోసం ఈ మనుషులొకవైపు ప్రతినిత్యం ఎన్నో జంతువుల్ని నరుకుతూ మరొక వైపు ఇలాంటి సభలు చేస్తుంటారంటుంది యజమాని ఏది పెడితే అది తింటూ జీవితాంతం వాళ్లకు చాకిరీ చేయాల్సిన దుర్గతి పట్టిందంటుంది కట్టి వేసిన గుంజ వద్దనే పడి ఉండాలి తప్ప పశువులకు స్వేచ్ఛలేదంటుంది ఇదంతా విన్న నల్ల ఎద్దు పశువులకు తమ తమ యజమానులు సమయానికి తిండి పెడతారు ఉండడానికి దొడ్డి చూపిస్తారు త్రాగడానికి క్రమం తప్పకుండా కుడిదిపోస్తారు రోగం వచ్చినా నొప్పి వచ్చినా మందులిస్తారు కాని మనుష్యుల్లో అధిక సంఖ్యాకులు కష్ట జీవులు, సమాజంలోని భాగ్యవంతులు ప్రొద్దస్తమానం వాళ్ల చేత చాకిరీ చేయించుకుంటారు తమ విలాసాలకు వాళ్లను వాడుకుంటారు ఐనా ఈ భాగ్యవంతులు వాళ్ళకు కడుపు నిండతిండి పెట్టరు వాళ్లకు ఉండడానికి గూడు ఉండదు కట్టడానికి గుడ్డ ఉండదు వాళ్లను ఆదుకునే నాథుడే ఉండడు వాళ్లకంటే మనమే నయం' అంటుంది

ఇట్లా ఈ కథ మనమూహించని విధంగా ముగుస్తుంది చివరి దాకా ఇందులో రయిత సస్పెన్స్ నిర్వహించినాడు వ్యంగ్యమూ అధిక్షేపమూ కలగలిసిన కథా కథన శిల్పం ఇందులో ప్రదర్శింపబడింది సమాజంలో నిరుపేదల కష్టజీవుల బ్రతుకులు పశువులకన్నా కడుహీనంగా ఉన్నాయన్న వాస్తవికతను వ్యంగ్య వైభవంగా ఈ కథలో రచయిత చిత్రించినాడు అంతేకాక తెల్లఎద్దు నల్లఎద్దు లాంటి మనస్తత్వం కల మానవులూ మన సమాజంలో ఉంటారన్న అంశాన్ని కూడ ఇందులో కాళోజి ధ్వనింపజేసినాడు

ఇక రెండో కథ "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము" ను పరిశీలిద్దాం ఒక గ్రామంలో దేవాలయంలోకి హరిజనులు ప్రవేశించడాన్ని సవర్ణ హిందువులు ప్రతిఘటిస్తారు ఈ రెండు వర్గాలూ లాఠీలతో గొడ్డళ్లతో తన్నుకోగా ఒక బ్రాహ్మణుడూ ఒక హరిజనుడూ మరణిస్తారు యమదూతలు వాళ్ల జీవాత్మలను తీసుకొని యమలోకానికి వెళ్లుతుంటారు మధ్యలో ఈ జీవాలను వైతరణీనది ఒడ్డున ఉంచి యమదూతలు గంధర్వుల గానం వింటూ విశ్రాంతి తీసుకుంటారు ఆ సమయంలో ఈ జీవాలు ఎదురుపడి సంభాషణసాగిస్తాయి భారత దేశంలో ఒకే ప్రాంతంలోని ఒకే గ్రామానికి చెందినవిగానూ, ఒకే భాషమాట్లాడేవిగానూ పరస్పరం పరిచయం

కోవడంతో అవి మరీ సన్నిహితమవుతాయి యోగక్షేమాలు మాట్లాడుకుంటూ ఉండే సందర్భంలో అవి అదే రోజు ఘర్షణపడి హతులైన బ్రాహ్మణుడి హరిజనుడి తాలూకు జీవాలైనట్లు తెలుసుకుంటాయి అంతటితో వాటికి మళ్లీ వైరం ప్రారంభమై తన్నుకుంటాయి బ్రాహ్మడి జీవాత్మ ఓరిముండా కొడుకా! మాదిగ వెధవవు ఇక్కడాదాపరించావు! అంటూ తిడుతుంది ఇట్లా పోట్లాడుకుంటూన్న సమయంలోనే యమ దూతలువచ్చి ఇదేం కావరంరా! చచ్చినా ఈ మతఎచ్చి ఈ వర్గ భేద శత్రుత్వం పోలేదేం' అంటూ గట్టిగా మందలించి యమ ధర్మరాజు సమక్షంలో నిలబెడుతాయి అప్పుడాతడు విచారణ జరిప బ్రాహ్మణుని జీవాత్మ కొచ్చిన్‌లోని వరయా (మాదిగ) కుటుంబంలో పుట్టునట్లునూ, హరిజనుడి జీవాత్మ తిరువాన్కూరులో ఒక హరిజన కుటుంబంలో పుట్టునట్లుగానూ శిక్షవిధిస్తాడు ఈసందర్భంలోకుల దురహంకారంతో ప్రవర్తించిన బ్రాహ్మణున్నీ గాంధీ అహింసా మార్గాన్ని వదలిని హరి జనున్నీ యమధర్మ రాజు మందలిస్తాడు ఇంతటితో ఈ కథముగుస్తుంది

మన దేశంలో మనుష్యులు చచ్చిపోయినా ఈవర్ణ వర్గ వైషమ్యాల్ని మరచిపోవడం లేదన్నది ఈ కథలోని సారాంశం ఫలానా వాళ్లమన్న సంగతి తెలియనంతవరకు జీవాలు ఎంతో ప్రేమానురాగాలతో పలుకరించుకుంటూ స్నేహంగా ఉంటాయి పూర్వ చరిత్ర తెలియగానే మళ్లీ మామూలుగా కులం పేరుతో మతం పేరుతో కలహించుకుంటాయి ఈ కథంతా సంభాషణ రూపంలో సాగింది కథ ప్రారంభమే జీవాత్మలు సంభాషించుకోవడం కలహించుకోవడంతో మొదలవుతుంది సంవాదం ద్వారానే వాటి పూర్వ చరిత్ర మనకు తెలుస్తుంది ఇందులోనూ రచయిత చివరి దాకా సస్పెన్స్ నిర్వహించినాడు సున్నితమైన వ్యంగ్యాన్ని ప్రదర్శించినాడు ఇందులోని కథా కథన శిల్పం మనల్ని ఆకట్టుకుంటుంది

ఇక మూడవది 'విభూతి లేక ఫేస్ పౌడర్' అనే కథ రచయిత ఇందులో ఫేస్ పౌడర్‌నే విభూతిగా పేర్కొన్నాడు ఇది పారిజాతాపహరణం కథకు పేరడీగాసాగింది కృష్ణయ్య భార్య సత్యమ్మ తనకు ఫేస్ పౌడర్ (విభూతి) కావాలంటూ భర్తతో పట్టుపడుతుంది శంకరయ్య విభూతి తయారు చేసే ఫ్యాక్టరీని నడుపుతుంటాడు శంకరయ్య ఫ్యాక్టరీ నుండి విభూతి తేవడం చాలా కష్ట సాధ్యమైన పని శంకరయ్య వద్దంటున్నా ఆహ్వానంలేకున్నా పార్వతమ్మ తన చెల్లెలు పెండ్లికోసం తల్లి గారింటికి వెళ్లుతుంది నారదయ్య ఇటు శంకరయ్యకూ అటు శంకరయ్య మామకూ మధ్య మనస్పర్థలు పెంచుతాడు అందువల్ల పార్వతమ్మను తల్లిదండ్రులు ఆదరంతో చూసేది పోయి అవమానిస్తారు అది భరించలేక పార్వతమ్మ తిరిగి తన ఇంటికివస్తుంది ఈలోగా పార్వతమ్మ తన మాట విననందుకు శంకరయ్య కోపంతో ఇల్లువిడిచి వెళ్లిపోతాడు పార్వతమ్మ తిరిగి వచ్చే సరికి ఇంట్లో శంకరయ్య లేనందున అతన్ని వెదుకుతూ పార్వతమ్మ కూడా ఇల్లు వదలి వెళ్లిపోతుంది ఈలోగా సత్యమ్మ కోరిక నెరవేర్చడం కోసం కృష్ణయ్య హుటాహుటిగా బయలుదేరివచ్చి ఎవరూ లేని అదనుచూసుకొని శంకరయ్య ఇంట్లో జొరబడి విభూతినీ, విభూతితయారు చేసే విధానాన్ని తెలిపే పత్రాన్నీ దొంగిలించుకొని పోతాడు అటు శంకరయ్య పార్వతమ్మలు ఒక చోటమళ్లీ కలిసికొని ఇంటికివస్తారు ఇల్లు దోపిడీకి గురి కావడం గూర్చి చింతిస్తారు అటు కృష్ణయ్య ఫేస్ పౌడర్ (విభూతి) తెచ్చినందుకు సత్యమ్మ సంతోషిస్తుంది కృష్ణయ్య చేసిన దొంగతనం గురించి శంకరయ్యకు తెలిస్తే సివిల్‌వార్ వస్తుంది కనుక ఎవరూ చెప్పకూడదంటూ రచయిత కథను ముగిస్తాడు

ఇది ప్రబంధాల్లో కొన్ని అవాస్తవిక కథల్ని వెక్కిరించడం కోసం రచయిత ఈ కథను రాసి ఉంటాడని ఊహించవచ్చు ఈ కథంతా ఖిన్నభిన్న దృశ్యాలతో నాటకీయంగా నడిచింది ఇట్లా కాళోజి కథల్లో సున్నితమైన వ్యంగ్యమూ, అధిక్షేపమూ, పేరడీ ధోరణీ కళాత్మకంగా పోషించబడినాయి అంతేకాక నాటకీయమైన శైలి ప్రదర్శింపబడింది ముఖ్యంగా సంభాషణలతోనే కథను నడిపించడం కాళోజీలో కనిపించే అద్భుతమైన శిల్ప చాతుర్యం

# కాళోజీ స్వర చక్రం

ప్రొ॥ మాదిరాజు రంగారావు

బాపూ! బాపూ! బాపూ!

కాళోజీ ఫౌండేషన్ సంస్థ ఆవిర్భావం సాహిత్య ప్రియులకెంతో ఆనందాన్ని కలిగించే విషయం కాళోజీ రచనల్ని పునర్ముద్రించే మహా ప్రయత్నమూ మొదలైంది ఇది మొట్టమొదటి కృషి ఫలం ఈ కృతి బాపూజీ వర్ధంతి రోజున ఆవిష్కృతం కావడం ఎంతో సముచితంగా వుంది

'నా గొడవ పరంపరలో మొదటి తరంగం ఇది బాపూ! బాపూ! బాపూ! సంపుటిలో గాంధీజి హత్య జరిగిన నాటి నుండి ఇటీవలి ఆగష్టు 1994 వరకు సాగిన గాంధీజికి సంబంధించిన వస్తువు కేంద్ర బిందువుగా ఉంది వర్తమాన సామాజిక స్థితి గాంధీజి సిద్ధాంతాల్ని మరచిపోయిన జాతి జీవన రీతి చిత్రితమైంది అక్కడక్కడా తళుక్కున మెరిసే ఆశా రూపమూ భావ సూత్రంగా ఉంది ఇది కాళోజీ సామాజిక సాహిత్య వ్యక్తిత్వ పార్శ్వానికి ప్రాతినిధ్యం వహిస్తోంది

ఈ మొదటి తరంగం గాంధీజీ మాట అరవయ్యో జయంతి సందర్భంలో మద్యపాన నిషేధానికుద్యమించిన స్త్రీ శక్తికంకితమైంది మద్యపాన నిషేధం గాంధీజికి ప్రియమైందీ, ఆయన ప్రముఖమైన ఆదర్శాల్లో ఒకటి ఇదో కలగానే మిగిలింది

ప్రస్తుతానికి మన రాష్ట్రంలో ఈ ఘన విజయాన్ని సాధించిన కీర్తి స్త్రీ శక్తిదే

ఇక ఈ కావ్యానికి వస్తే బాపూ! బాపూ! బాపూ! ఇందులో పిలుపులో ఆహ్వానం ఉంది! ఆక్రందనం ఉంది ఆవేదన ఉంది! స్వరంలో ఒక్కొక్కప్పుడు ప్రేమ మరొకపుడు జాలీ ఇంకొకపుడు ఆక్రందన ఇట్లా అంతరంగం ప్రతిధ్వనిస్తోంది రచనలో ధీని కాలం ఈనాటి బాధాకరమైన పరిస్థితులన్నీ ఎదురయ్యే విషమ గతుల్నీ చూడొచ్చు! విద్యానుభవంలో సమాజంలో పద పదాన ఎదురయ్యే ఎగుడు దిగుళ్ళు కష్ట నష్టాలూ అవినీతి అక్రమం గురించీ గాంధీజీకి కవి అంతరంగం చెప్పుకున్న బాటలే ఈ రచన ఈ దృష్టి కోణంలో చూస్తే గాంధీజీ ఎక్కడున్నాడు? ఈ మట్టిలో ప్రజల్లో సిద్ధాంతాల్లో ఆదర్శాల్లో వెలుగులో అంతరాత్మలో మానవతా రాగంలో అని పరోక్షంగా సమాధానం చెబుతుందీ రచన ప్రత్యక్షంగా ఎదురయ్యే సమాజంలో బ్రతకడం కోసం మరచిపోయిన అంతరాత్మను పరోక్షంగా ఎత్తిచూపుతుందీ రచన ఇదీ కావ్యంలో వాస్తవ రూపానికి దీప్తినిస్తోంది

'బాపూ! నీ మార్గం!<br>
మా ప్రాణం బాసే మార్గం

నిత్య జీవితంలో ఇది నిజం బ్రతుకుతప్పదు బ్రతక్క తప్పదు అవసరాలు పరిమితం చేసుకోవాలన్నది గాంధీజీ దృక్పథం అవసరాలు పెంచుకోవడంతో మనిషిపడే పాట్లకూ అవలంబించే అక్రమరీతులకూ భిన్నమైందీ గాంధీజీ మార్గం దీన్ని అనుసరించడమంటే ప్రాణం పోయేంత పని ఔతూంది ప్రాణాన్ని కూడా లెక్కచేయని త్యాగం గాంధీ మతం ఇది ప్రస్తుత సమాజంలో మృగ్యం గాంధీజీని జ్ఞాపకం చేసే గ్రీన్ సిగ్నల్స్ అక్కడక్కడా లేకపోలేదు

'ఒక చెంప చరిస్తే రెండోది ముందుంచడం<br>
మాకేం పిచ్చా చాదస్తమా!<br>
అవన్నీ నీకే ముబారక్'

సహనం, శాంతి, ప్రేమ త్యాగం గాంధీజీకి సంబంధించినవి మాత్రమే, మాకు సంబంధించినవి కావన్న అభిప్రాయం ప్రమాదభరితమైంది చివరి పంక్తిలో తీసుకున్న మలుపులో వైచిత్రి ఉంది సన్నని చిరునవ్వుతో అంతరాత్మను ఆహ్వానిస్తుంది విలువల్ని దర్శింపచేస్తుంది ఇందులో చమత్కారంతో కూడిన అర్థస్ఫూర్తి ఉంది ఇది కాళోజీ ప్రత్యేకత సాధారణమైన సంభాషణ పద్ధతి వెనుక నుండి మనిషి మనస్సును

కోధిస్తుంది మానవుణ్ణి జ్ఞాపకం చేస్తుంది మానవతను దర్శింప చేస్తుంది

తెల్లవాని ఇంటి వెనుక
కాలుతిన్నె (ఫుట్‌పాత్) మీద నీవు
కాలుబెట్టి నడిస్తేను
మెడ బట్టి నెట్టబడితే
నడిరోడ్డున బడితివి గద!

దక్షిణాఫ్రికాలో గాంధీజీ జీవితానుభవం ఆయన వ్యక్తిత్వాన్నే సంపూర్ణంగా మార్చివేసింది కొత్త రూపాన్ని ప్రకాశింప చేసింది దీనితో చరిత్ర గమనమే మారింది

అస్పృశ్యత నివారింప
అంటరాని అతిథులను
ఇంట బెట్టుకొని వారికి
చాకిరంత జేస్తివిగద!

ఇది గాంధీజీ సంగతి! ' ఇది నీ సంగతి మరి మా సంగతి అంటూ కాంట్రాస్ట్ పద్ధతిలో సంవిధానం మనల్ని ఆకర్షిస్తుంది ఇక్కడ మనం గాస్ నూనె కోసం సినిమా టికెట్ కోసం హింసకు గురిఅయ్యే స్థితి చిత్రితమైంది గాంధీజీ నియమాల్ని ఉల్లంఘించిన సందర్భం వేరు చారిత్రకమైన ప్రాధాన్యం కలిగింది బాధలకూ కష్టాలకూ గురియైన స్థితి వేరు ఆయన లక్ష్యం స్వార్థానికతీతమైంది ఆదర్శం సమాజ శ్రేయస్సును కోరేదీ

నీవలెనే హింసకు గురి ఔతున్నా
తిరగబడితే చస్తానన్న భయం
సింపుల్ ఇంజరీ భరిస్తున్నా
సీరియస్‌ను తప్పించుకుంటున్నా

చమత్కారం హాస్యం వెలుగు పొర వెనుక నుండి వర్తమాన సమాజంలోని విషాద దృశ్యం కన్పిస్తుంది

ఇంకేమి చేయాలి/ ఇంకేమి చేయాలి
పెక్కు భంగుల నిన్ను చెక్కి నిలిపేసితిమి!
వేడ్కతో ఇంటింట వ్రేలాడదీసితిమి
నీ 'పేరుతో టోపీ నిత్యమై పోయింది '

ఎంత గొప్ప శిల్పమైనా చిత్రమైన జీవకళతోనే అందం ఆనందం ప్రయోజనమూ జీవకళ అంతరంగ వికాసంతో ప్రకాశిస్తుంది

ఖలీల్ గిబ్రాన్ 'ది ప్రొఫెట్'కి అనువాదం 'జీవనగీత'

# పరిచయం

- కాళోజి నారాయణరావు

1953లో 'నా గొడవ రెండవ ముద్రణ జరుగుతున్నప్పుడు 'ఖలీల్ గిబ్రాన్' పుస్తకం 'ది ప్రొఫెట్' నా చేతికి వచ్చింది మిత్రుడు ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఇచ్చిండు ఆ పుస్తకం ఎన్నిసార్లు చదివిన్నో అనువాదం చేయటానికి ఎక్కువ సమయం పట్టలేదు దాన్ని నేను అర్థం చేసుకున్నంత మట్టుకు, మూలంలోని భావం మారకుండా వ్యాఖ్యానం మాదిరి అనువాదం చేసిన ఇంగ్లీషుల ఉన్నంత క్లుప్తత తేవటానికి నా వశం కాలే అప్పటికే ఉన్న ఉర్దూ, మరాఠీ, అరబ్బీ అనువాదాలన్నిటిని చదివిన ఖలీల్ గిబ్రాన్ గురించీ చదివిన నేను పోయిన అన్ని చోట్లా చదివి వినిపించి, ఎంతో మందికి చూపించి అభిప్రాయం అడిగిన కొంతమంది విషయంలో ఏకీభవించలేదు అనువాదం వినిపించినప్పుడు ఏమీ అననివాండ్లు పుస్తకం అచ్చయినాంక అదీ రాచమల్లు రామచంద్రారెడ్డి విమర్శ రాసిన తర్వాత వ్యాఖ్యానించటం మొదలుపెట్టింద్రు విమర్శకు ముందు రామచంద్రారెడ్డి ఇంగ్లీషు అనువాదం ప్రతి వాక్యం చదివిండు ఆయన విమర్శను ఖండించవలసిన అవసరంగానీ, నా అనువాదాన్ని సమర్థించుకోవలసిన అవసరం కానీ లేవు విచారకరమయిన విషయమేమిదంటే చాలమంది ఏమీ చదవకుండానే అభిప్రాయాలు ఏర్పరచుకుంటారు కాళిదాసును చదవకుండానే "ఆహా! కాళిదాసు" అంటరు ఇది అసలు ట్రాజడీ

"నేను కమ్యూనిస్టు వలె చెప్తున్న', "నేను సోషలిస్టుగా మాట్లాడుతున్న', "నేను హిందువుగ ఈ విషయం చెప్తున్న" అంటరుగానీ మరి మనిషివలె ఆలోచించేదెప్పుడు? అనేది నా ప్రశ్న 'డాక్టర్' అంటే పలుకుతరు 'వకీల్' అంటే పలుకుతరు 'కవీ! అంటే పలుకతరు కానీ మనిషి అంటే 'మనిషంటవ్" అని కోపానికస్తరు

'మేం దీనికి వ్యతిరేకం, 'దానికి వ్యతిరేకం' అని ఎన్నిటినో వ్యతిరేకిస్తరు కానీ, దేనికోసం నిలబడుతరు? మనం విభేదించే విషయాలల్ల చాల పట్టుదలగ ఉంటంకానీ దేన్నీ అంగీకరిస్తమో చెప్పం పట్టించుకోం సిద్ధాంతానికీ, ఆచరణాత్మక జీవితానికీ సంబంధం కనబడటం లేదు

> నీకూ నాకూ, వానికి
> నీతుల్లో వున్న తేడ
> కూతల్లో వున్న తేడ
> చేతల్లో కనబడదేం' (నా గొడవ)

తెలుగుల మనకు మూడు పదాలున్నయి నా, మా, మన అని నా దృష్టిల నా అంటే ప్రాణి ధర్మ నేను అనే మా అంటే కుటుంబం కులం అట్లాటివి మా కుటుంబం మా కుం, ఇట్ల 'మనం' అన్నది అందరికి చెందింది అంతిమంగ 'మనం' అన్నది రావాలి

> నేను ఇంకా 'నా' నుండి 'మా' వరకే రాలేదు
> మన అన్నప్పుడు గదా ముందగుడు (నాగొడవ)

బతుకు రెండు విధాలు సంగడి బతుకు అంగడి బతుకు సంగడి అంటే స్నేహం, మైత్రి అంగడి అంటే బజారు, వ్యాపారం జరిగేచోటు బజారుల అన్ని సంఘర్షణలు, వైరుధ్యాలు, అంతా వ్యాపారం 'సంగడి బతుకులో అంతా స్నేహం అందుకని నేననేదేమిడిదంటే సంగడి బతుకు కావాలె, అంగడి బతుకుకాదు

సంతసముగ జీవింపగ
సతతము యత్నింతు గాని
ఎంతటి సౌఖ్యానికైన
ఇతరుల పీడింపబోను (నా గొడవ)

ది ప్రాఫెట్ మొదటి అధ్యాయం చివర అధ్యాయం మధ్య ఇరవై ఎనిమిది ప్రశ్నలున్నయి అన్నీ జీవితానికి సంబంధించినవే పిల్లల గురించి ఇండ్ల గురించి పెండ్లి గురించి పని గురించి ఇట్లా

భక్త తుకారాం తన భజనలో అంటడు ఏ జీవినీ తప్పు పట్టకు ప్రతి ఒక్కడూ ఏదో పని చేస్తున్నడు పని దేవునితో సమానం అని గిబ్రాన్ ప్రేమతో పనిచేయి ఏ హ్యతతో కాదు అంటడు పని ద్వారా ప్రేమ ప్రకటితమవుతుంది అంటడు ఏ పని చేసినా నీకు ప్రాణ ప్రదమైన వ్యక్తి కోసం చేస్తున్నట్లు చెయ్యమంటడు

నేరం శిక్ష గురించి మాట్లాడినప్పుడు "చెట్టు అంతటికీ ఎరుక లేకుండా ఒక్క ఆకు కూడా పండుబారనట్లే మీ అందరి రహస్య సమ్మతి లేకుండా ఏ ఒక్కడూ తప్పు చెయ్యలేడు అంటడు

గాంధీని చంపింది గాడ్సే ఒక్కడే కాదు ఆయన ఆలోచనలతోటి ఏకీభవించని వాండ్లు ఆయన పార్టీలోనే కాక ఆయన అనుచరుల్లో, ప్రభుత్వంలో ఎంతో మంది ఉన్నరు దేశ విభజన తర్వాత తేలిన లెక్కల ప్రకారం పాకిస్తాన్ ఇండియాకు 220 కోట్లు, భారత్ పాకిస్తాన్‌కు 55 కోట్లు ఇవ్వవలసి వుండె పాకిస్తాన్‌ను మనకివ్వవలసిన 220 కోట్లలో ఆ 55 కోట్లు జమపట్టుకోమని అంటే గాంధీజీ ఒప్పుకోకుండా, పాకిస్తాన్ పేద దేశం, 55 కోట్లు ధనం ఇవ్వవలసిందే అని పట్టుపట్టిండు ఆ డబ్బు యిచ్చిన తర్వాత పటేల్ ఇట్ల అన్నడు "We are giving these 55 crores to Paki stan to save Bapu from some mental agony Inspite of this Pakistan remains same then fate, fate, fate '

గిబ్రాన్ స్నేహం గురించి చెప్పినప్పుడు, నీ అవసరాల సమాధానమే నీ స్నేహితుడంటడు అక్కర ఏర్పడంగనే తెలిసేది స్నేహితునికయితే, అక్కర ఏర్పడకముందే తెలిసేది దేవునికి అదే స్నేహితునికీ దేవునికీ మధ్య తేడా చెలిమి గురించి రాసిన గేయంలో నా గొడవ లో అసిన

'అక్కరలు దీర్చమని అడగనక్కరలేదు
అడిగినను అయ్యదియు యాచనసలే కాదు
అడగకయె పొందినను అపచారము కాదు అని

ఈ గేయం విన్నాంకనే ఏల్చూరి గిబ్రాన్‌ను బాగా చదివినట్లున్నవు అన్నాడు అప్పటికి గిబ్రాన్ రచనలేవీ నేను చదవలేదు ఆ మాటే అన్న ఏల్చూరితో అప్పుడే తన దగ్గరి The Prophet' నా కిచ్చిండు

ప్రాఫెట్ ఎన్నిసార్లు చదివిన్నంటె నా అనువాదం మొన్ననే అందులోని ప్రతివాక్యం గుర్తున్నది గిబ్రాన్ ప్రతి విషయం గురించి చాలా లోతుగా, ఎంతో ఆధునికంగా చెప్పిండు 'బతుకు పుస్తకం అని అందుకే నేను పేరు పెట్టె శశాంక దాన్ని జీవన గీత' అని మార్చిండు

చట్టం తప్పుతుంది, మతం తప్పుతుంది ప్రభుత్వం తప్పుతుంది, న్యాయం తప్పుతుంది కాని బతుకు తప్పదు బతుక్కు తప్పదు బతుక్కు సంబంధించిన పుస్తకం కనుకనే ఇప్పటికీ కొత్తగానే వుంటుంది ఖలీల్ గిబ్రాన్ మహానుభావుడు

జీవనగీతం
ఖలీల్ గిబ్రాన్
అనువాదం
కె సురేష్
హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, మార్చి 2002

# జీవితం : సాహిత్యం

– శ్రీ కాళోజి

మొట్ట మొదట ఒక విషయాన్ని స్పష్టం చెయ్యదలచినాను ఈ విమర్శ అనేది అటు పాఠకులకూ ఇటు రచయితకూ సంబంధించినది కాదు అంటే సాహిత్య నిర్మాణంలో విమర్శ ఒక అంగం కాదు రచయిత అయినవాడు పరిసరాలను పరిశీలిస్తాడు, అధ్యయనం చేస్తాడు పరిసరాలే రచయితను ప్రభావితుణ్ణి చేస్తాయి ఆ ప్రభావంతో రచన చేస్తాడు అంతే గాని విమర్శకులు తన రచనను చదివి ఏవిధమైన అభిప్రాయాలను వెలిబుచ్చుతారు? అన్నదాన్ని ఆధారం చేసుకుని ఏ రచయితా రచన చెయ్యడు ఏ రచయితన్నా అట్లా చేస్తే అంత దిగువరకం రచయిత మరొకడు వుండడు పరిసరాల నుండి పొందే స్పందనవల్ల రచన చేసేవాడే రచయితగాని విమర్శకుణ్ణి దృష్టిలో పెట్టుకుని రాసే రచయిత రచయితేకాదు

మానవజీవిత విమర్శకుడు రచయిత సమాజం విలువలు, సంప్రదాయాలు, ఆదర్శాలు, ఆచరణ ప్రేమ, కరుణ, ద్వేషం, దు ఖం ఆనందం ఇట్లాటి అనేకానేక భావపుంజం అయిన మానవజీవితం విమర్శే రచన మళ్లీ రచన మీ విమర్శ ఏమిటి? అర్థంలేని మాటకాకపోతే!

ఇక పాఠకుని దృష్టితో చూద్దాం పాఠకునికి విమర్శ ప్రయోజనం ఏమీ లేదు రచనను నేరుగా చదివి అందులోని స్వారూప్యాన్ని ప్రత్యక్షంగా ఆస్వాదించడానికి పాఠకుడికి స్వేచ్ఛకావాలె ఈ స్వేచ్ఛకు విమర్శకుడు అడ్డు తగిలి తానేదో వ్యాఖ్యానం చేస్తానంటాడు పాఠకుణ్ణి ఎట్లాంటి తప్పు దారులు పట్టించినా పట్టించవచ్చు రచన స్వయంగా చదివి ఆనందించగల వాడే పాఠకుడు విమర్శకుని సలహా ప్రకారం చదివేవాడు పాఠకుడుకాదు విద్యార్థి కావచ్చునేమో "విమర్శ"ను పాఠకుడు ఏనాడూ ఆదరించలేదు ఏ పుస్తక విక్రేతను అడిగినా ఈ విషయం రుజువవుతుంది విమర్శకుణ్ణి పాఠకుడు పట్టించుకొనేలేదన్నది అనేకసార్లు అనేక సందర్భాలలో రుజువైంది ఉదాహరణకు గురజాడను 'అకవి" అని విమర్శకులు ప్రచారం చేసినంతమాత్రాన పాఠకులు ఆయన రచనలను ఆదరించడం మానినారా? విమర్శయొక్క ఉపయోగం మళ్ళీ విమర్శకులు కాదలచుకున్న వారికి తప్ప పాఠకులకూ లేదు, రచయితలకూలేదు

విలువలుమారటం సహజం తరతరాలుగా విలువలు మారుతూనే ఉన్నవి ముందు కూడా మారుతూనే ఉండగలవు అయితే ఇక్కడ మరొక భ్రమ విషయం ప్రస్తావిస్తాను సమాజంఓ విలువలను మార్చగలనన్న విశ్వాసం, మారుస్తున్నానన్న ధీమా మార్చవలెనన్న ఆతురత రచయితకు ఉంటుంది అదంతా వట్టి భ్రమే రచయితకు ఉండే ఆతురతనుబట్టి గాని, అతని కుండే ధీమాకు అనుగుణంగాగాని విలువలు మారవు

సమాజం మీద సాహిత్యం వేసే ముద్ర అతిస్వల్పం, అత్యంత తాత్కాలికం ఉదాహరణకు వాల్మీకి రామాయణం రాయకముందు మానవసమాజంలో ఏక పత్నీ వ్రతులు లేరా? ఇతరుల భార్యలను ఎత్తుకొనిపోయే రావణుని వంటివారులేరా? ఉండే ఉండాలె ఎవడూ రామాయణం విన్నందువల్ల ఏకపత్నీవ్రతుడు కావటం లేదు అదేవిధంగా ఇతరుల భార్యలను ఎత్తుకునిపోయే అలవాటు లేదా తత్వం ఉన్న వారు రామాయణం విని తమ అలవాటును లేదా తత్వాన్ని మర్చుకోవటం లేదు ఆధునిక సాహిత్యంలో నుంచి ఉదాహరణలు తీసుకోండి మునిమాణిక్యం వారి కాంతం కథలను చదివిన తర్వాతనే సంసార పక్షానికి మారిన స్త్రీలు ఎంత మంది ఉంటారు? చలం నవలలను చదివి కుటుంబజీవితాన్ని అరాచకంగా మార్చుకున్న వారెందరు? ఉండరనే నా విశ్వాసం

ఉంటే బహుస్వల్పం వారి పుస్తకాలు అమ్ముడుపోయినదానితో ఆ గ్రంథాల పాఠకుల సంఖ్యతో పోల్చినప్పుడు ఇటువంటివారి సంఖ్య నగణ్యం

ఎవరైనా ఒక వ్యక్తి ఏకపత్నీ వ్రతుడో సంసారపక్షో లేదా విప్లవ వీరుడో అవుతున్నాడంటే అతడు రామాయణం కాంతం కథలు లేదా మహా ప్రస్థానం పాఠకుడైనందువల్ల కాదు అతని వ్యక్తిగత టెంపరిమెంటువల్ల టెంపరిమెంటు వ్యక్తికి ఒక రకమైన సంస్కారాన్ని అభిరుచులనూ అలవాట్లనూ కలుగజేస్తుంది ఆ సంస్కారాన్నీ అభిరుచులనూ బట్టి ఆ వ్యక్తి తన అభిమాన రచయితలనూ, ఆ సాహిత్యాన్నీ ఎంచుకుంటాడు రచనపట్ల పాఠకునికి ఏర్పడే అభిమానం రచన యొక్క విశేషం కాదు

'నా గొడవ మొట్ట మొదటిసారిగా అచ్చులో పుస్తకంగా వేసినప్పుడు నేను రాసిన నాలుగైదు వాక్యాలను ఇక్కడ మళ్ళీ పేర్కొంటాను

'ఆనందమో ఆవేదనో కలిగినప్పుడు వచ్చిన భావాన్ని వెలిబుచ్చడం జరిగింది అది ఇతరులకు కాకున్నా వెలిబుచ్చినవానికి బాగానచ్చింది ఇతరులకు కూడా నచ్చుతే విశేషం ఈ విశేషధర్మం కైతలకేమాత్రం ఆధారంకాదు దానికి మూలం, ప్రాణం కవికి అప్పుడప్పుడు కలిగిన ఆవేదన ఆనందం మాత్రమే

ఎన్నో సంఘటనలు జరుగుతుంటవి మన చుట్టుపట్ల ఒకే సంఘటన అందరినీ ప్రభావితులనుచేయదు ఒకే రీతిన అసలే చేయదు

ప్రసారయంత్రం ఒకటే అయినా స్వీకరించే యంత్రాలు తమ తమ శక్తితో దానిని గ్రహిస్తవి యంత్రాలలో అన్ని విధాల సమానశక్తి గల పరికరాలను నిర్మించవచ్చు మానవుల నిర్మాణం అట్లా జరగలేదు మనకు ఏదైనా "శక్తినిబట్టి సాక్షాత్కారం భావానుగుణ్యం రూపం"

*** *** ***

మానవ జీవితానికి సాహిత్యానికీ అనేక పోలికలున్నవి జీవితం వంటిదే సాహిత్యం జీవిత ప్రతిబింబమేకద! జీవితంలో ఉన్నంత వైవిధ్యం సాహిత్యంలోనూ ఉంటుంది మానవ జీవితానికి ఒక ఖచ్చితమైన నిర్వచనం ఒక ఖచ్చితమైన పద్ధతీలేనట్లే సాహిత్యానికీ లేదు ప్రతి సాహిత్య స్రష్టదీ ఒక ప్రత్యేకమైనదారి ఎవరిదారి వారిదే

మానవులందరూ ఈ దారుల్లోనే నడవాలి ఫలానా సమయాన దు ఖించాలి ఫలానా సమయంలో నవ్వాలి అని ఖచ్చితమైన సూత్రాలు చేస్తే వాటి ఆచరణకన్నా ఉల్లంఘనే ఎక్కువ జరుగుతుంది రచయితల విషయంలోనూ అంతే సాహిత్యం అంటే ఇల్లా ఉండాలని ఖచ్చితమైన సూత్రాలుచేస్తే ఉల్లంఘనలో జరిగినంతగా ఆచరణ జరుగదు

అయితే విమర్శకలూ, అలంకార శాస్త్రజ్ఞులూ కొన్ని సూత్రాలనూ పద్ధతులనూ రూపొందిస్తూనే వుంటారు ఆ పద్ధతులన్నీ ట్రంకురోడ్ల వంటివి కార్లు, సున్నితమైన వాహనాలను ఉపయోగించే స్వల్ప సంఖ్యాకులకు మాత్రమే వాటి ఉపయోగం బహు సంఖ్యాకులైన పేదవారికి వాటి ఉపయోగం ఉండదు బహు సంఖ్యాకులైన పేదలు కాలిబాటనే వాడుతారు ట్రంకురోడ్డుమీది నడకకు వేగం, దిశ మొదలైన కట్టుబాట్లు అనేకం వుంటాయి వాటి ప్రకారం నడుచుకోవలసిందే అంటే ట్రంకు రోడ్డుమీది నడకలో నడిచేదానికి స్వేచ్ఛఉండదు అడుగులు వేయటంలో తమ స్వీయ ధోరణిని చూపించడానికి "స్వ"ను ప్రదర్శించడానికి వీలులేదు కాలిబాటలో అల్లాకాదు ప్రతి బాటసారీ ఆ కాలిబాటమీద వేసే అడుగులు వేరువేరుగా వుంటవి ప్రతి నడకలోనూ వైవిధ్యం ఉంటుంది ఏ బాటసారైనా అంతకుముందు నుంచి వేసివున్న కాలిబాట తనకు అసౌకర్యంగా ఉన్నదని భావిస్తే అంతకన్నా సౌకర్యవంతమైన కొత్తకాలిబాటను నిర్మించుకుంటాడు బహుజనుల బాట కాలిబాట వైవిధ్యం ఉండగల బాట, బాటసారికి స్వేచ్ఛఉండేబాట

ఒక పద్ధతిని సిద్ధాంతాన్ని ఏరుకొని దాని ప్రకారం నడకను సూత్రబద్ధం చేసుకోవటం అట్లాంటి జీవితాన్ని ట్రంకురోడ్డుతోనూ, స్వేచ్ఛా జీవితాన్ని కాలిబాటతోనూ పోల్చవచ్చు ట్రంకురోడ్డు మీద నడిచే బాటసారికీ, కాలిబాటన నడిచే బాటసారికీ ప్రయాణం సామాన్యగుణం అయినట్లు సూత్రబద్ధ జీవితానికీ స్వేచ్ఛా జీవితానికి జీవితం సామాన్యగుణం

ట్రంకు రోడ్డు వాహనాల మీద కార్ల మీద తదితర శకటాలమీద ప్రయాణం ప్రగతికి చిహ్నమని లక్ష్యానికి వేగంగా త్వరగా చేరుస్తాయని ఒక భ్రమవున్నది అది వట్టి భ్రమే వాస్తవం దానికి పూర్తిగా భిన్నం కాలిబాట అనేది పయనించిన చోటి నుండి చేరవలసిన లక్ష్యానికి సర్వదా దగ్గరి దారి అయివుంటుంది అంతేకాక సాంకేతిక యంత్ర సంబంధ వైఫల్యాలు, తదితర ప్రమాదాలూ కాలిబాట బాటసారికి ఉండవు అందుకని కాలిబాట అనాగరిక, అటవిక సంప్రదాయమనీ, ట్రంకురోడ్డు ఆధునికమైనదీ నాగరికమైనదీ అన్న వాదంలో పసలేదు పోతే జీవితలక్ష్యం ఆనంద ప్రాప్తి అనందప్రాప్తి సులభంగా సురక్షితంగా సాధ్యపడేది కాలిబాట వంటి స్వేచ్ఛా సాహిత్యం ద్వారా అనంద ప్రాప్తి దూరం చేసేది దుస్సాధ్యం చేసేది నాగరికత అయితే నాగరికత కోసమే నాగరికత ఎందుకు? వలసివస్తుంది ఆనందప్రాప్తి అన్న లక్ష్యానికి తోడ్పడని నాగరికత ఎందుకు?

సామాన్య మానవునికీ రచయితకూ తేడా ఎక్కడ వుంటుందో పరిశీలిద్దాం కట్టు బొట్టులో అచార వ్యవహారాల్లో ఈ ఉభయులకూ తేడా ఉండదు తేడా అంతా భావవ్యక్తీకరణ ప్రతిభలో ఉంటుంది

ఏ కాలంలోనైనాసరే అప్పటికి అమలులోవున్న రాజకీయ సాంఘిక నియమాలూ, విలువలూ కట్టుబాట్లూ అనేకమంది వ్యక్తులకు తమతమ వ్యక్తిగత జీవితంలో అసౌకర్యంగా ఉంటాయి వాటిపట్ల సామాన్యునికి అసంతృప్తి ఉంటుంది అయితే వాటిని ధిక్కరించడంవల్ల ఏర్పడే అసౌకర్యాలు మరింత దుర్భరంగా, భయంకరంగా ఉంటాయన్న భయంచేత నైతేనేమి, అసౌకర్యాలను చాటుమాటుగా దాటవేసుకునే సులువులు ఉండటం వల్ల నైతేనేమి అమలులో ఉన్న సాంఘిక కట్టుబాట్లనన్నింటినీ ఖచ్చితంగా పాటిస్తున్నట్లే కనపడి వ్యక్తిగత జీవితంలో చాటుమాటుగా వీలు చిక్కినప్పుడల్లా తన సౌకర్యంకోసం ప్రతి వ్యక్తీ వాటిని ఉల్లంఘిస్తూ వుంటాడు రచయితకూడా ఇందుకు అతీతుడుకాదు నడక లేదా చరణ వరకు అతడు అందరివలెనే సాంఘిక కట్టుబాట్లను తన సౌకర్యం కోసం ఉల్లంఘిస్తూనే వుంటాడు అయితే సామాన్యుల మనస్సుల్లో ఉన్న అసంతృప్తిని అమలులో ఉన్న విలువలు కట్టుబాట్లు మారాలన్న ఆవేదనను ఆతురతను రచయిత వ్యక్తపరుస్తాడు సామాన్యులు వ్యక్తం చెయ్యలేరు రచయిత వ్యక్తం చేసిన భావాలు సామాన్యులు వ్యక్తం చెయ్యాలని తపన పడుతున్న భావాలే కానీ వ్యక్తీకరణ సామాన్యునికి సాధ్యపడదు రచయితకు సాధ్యపడుతుంది అంతే తేడా

రచయిత ఏదో ఒక విశ్వాసానికి లేదా తత్వానికి కట్టుబడి ఉంటే అనగా 'కమిటెడ్' అయితే సదరు వ్యక్తీకరణము కూడా స్వేచ్ఛగా చెయ్యలేడు "కమిటెడ్ లేదా కట్టుపడ్డ మనిషి రచయిత కాలేడు

రచయిత అయినవాడు ఏదో ఒక సిద్ధాంతానికి లేదా తత్వానికి కట్టుబడి ఉండాలన్న వాదం ఇటు రచయితనూ, అటు సిద్ధాంతాన్నీ గోతిలోకి తోసే వాదమే రెండు వైపులా ప్రమాదాలే

మనం ఒక్క సంగతి స్పష్టంగా గుర్తించాలి మార్క్సిజం, గాంధిజం, సోషలిజం కాపిటలిజంలాంటి సిద్ధాంతాలూ, తత్వాలు సామాజిక లేదా రాజకీయ వ్యవస్థ విశేషాలు, కవితా విశేషాలో, కళావిశేషాలో లేదా కనీసం భావ వ్యక్తీకరణ విశేషాలో కావు

రచయిత ఏదైనా తత్వానికి లేదా సిద్ధాంతానికి కట్టుబడిపోయినట్లయితే ఉభయ భ్రష్టత్వానికి ఎలా గురవుతాడో పరిశీలించండి

1 కట్టుపడిపోయి వున్నందువల్ల ఆయా సిద్ధాంతాల ప్రచారకుల లేదా నాయకులకు ఉపకరించే రచనలు వారి మార్గాన్ని సుగమం చెయ్యడానికి ప్రయోజనపడే రచనలనే చెయ్యవలసిరావడంవల్ల "స్వ ను రచయిత వ్యక్తీకరించలేడు ఈ విధంగా ఆత్మహత్యకు పూనుకొనవలసిన అగత్యం తప్పనిసరి అవుతుంది

2 ఏ సిద్ధాంతానికి కట్టుబడతాడో దానికి కమాండరూ కాలేడు సిద్ధాంతాన్ని నిర్వచించేవాడూ, నడిపించేవాడూ, సిద్ధాంత ప్రకారం లేదా సిద్ధాంత సాధనకోసం జరిగే పోరాటాలకు నాయకత్వం వహించే వాడు వేరే మరొక సిద్ధాంతకర్త మావో లెనిన్ గాంధీ లోహియా బుద్ధుడు వంటివారు వేరే ఉంటారు

3 తాను ఏ సిద్ధాంతానికి కట్టుబడిపోతాడో అందులో తన్మయుడై పోయి భావావేశంలో పడి దాన్ని వర్ణించే పద్ధతిలో ఆ సిద్ధాంతాన్ని అనుసరించదలచుకున్న అనేక మంది సామాన్యులను అజానులను స్వయంగా మానిఫెస్టో చదివి అర్థం చేసుకోలేని వారిని ఈ రచయిత రచనలద్వారా స్ఫూర్తిని పొంది రంగంలో దుమికే వారిని సిద్ధాంతపరంగా తప్పుదారి పట్టించే ప్రమాదం కూడా వున్నది భారతీయ వేదాంతాన్ని బోధించడానికి పురాణాల్లో కవులు వాడిన ప్రతీకలన్నీ ప్రధానపాత్రలుగా భావనేనుకుని పూజలూ, పునస్కారాలూ అందుకుంటూ అసలు భావాన్ని గాలికి వదిలేసిన సంఘటనలు ఎన్ని లేవు,

కట్టుబడిన రచయిత తన రచనద్వారా మహా అయితే "కంపెని వస్తువుల' ను విరివిగా అమ్మటానికి ఉపయోగపడే మంచిపోస్టరును సృష్టించగలడు మంచి పోస్టరుగా ఉపయోగపడగలడు అంతే

అయితే సాహిత్యానికి ఏ ప్రయోజనమూ లేదా? అన్న ప్రశ్న రావచ్చు ఉన్నది సాహిత్యం సాధించవలసిన బృహత్తర ప్రయోజనం ఒకటి వున్నది మరెవ్వరూ సాధించలేనిదది సాహిత్యకారులు రచయితలు పేనుకుంటేతప్ప సాధ్యంకాని ప్రయోజనం

మన విజ్ఞాన శాస్త్రాలన్నిటికీ, సిద్ధాంతాలకూ తత్వాలకూ లక్ష్యం సర్వేజనా సుఖినోభవంతు ' దాన్నే మొట్ట మొదటిసారిగా ఫ్రెంచివిప్లవం సందర్భంగా స్వాతంత్ర్యం సమానత్వం సౌభ్రాతృత్వం అని మరింత స్పష్టంగా నిర్వచించారు ఈ మూడూ ఉన్నప్పుడే సర్వేజనా సుఖినోభవంతు లక్ష్యం సిద్ధిస్తుంది అయితే ఈ మూడింటిలో చివరన పేర్కొన్న సౌభ్రాతృత్వం అనే లక్ష్యం మిగతా అన్నిటికీ మూలాధారం స్వాతంత్ర్య రక్షణకైనా, సమానత్వ సాధనకైనా మొట్ట మొదటా కావలసిన ప్రీరిక్విజిట్ సౌభ్రాతృత్వం

రాజకీయ విప్లవాల ద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించవచ్చు విప్లవానంతరం ఏర్పడిన ప్రభుత్వాలు తమ కృషిద్వారా సమానత్వాన్నీ స్థాపించవచ్చు కాని సౌభ్రాతృత్వం లేనిదే ఈ రెండిటివల్ల కలిగే ఫలితం "సర్వే జనులకు" చెందదు

ఇంతవరకూ ప్రపంచ మానవాళికి రాజకీయ విప్లవాల ద్వారా స్వాతంత్ర్యం అందినది విప్లవానంతర ప్రభుత్వాలు కొన్ని చిత్త శుద్ధితోనూ నిజాయితీతోనూ కృషిసల్పి మానవత్వాన్ని కూడా సాధించినాయి కాని సౌభ్రాతృత్వం మానవజాతి అందుబాటులోనికి రాలేదు ఎందుకని?

రాజకీయ విప్లవాలద్వారా సౌభ్రాతృత్వం సాధ్యపడేదికాదు కనుక సమానత్వస్థాపనకోసం రూపొందించే ప్రణాళికలుగానీ, సోషలిస్టు చట్టాలు గానీ సౌభ్రాతృత్వాన్ని సాధించజాలవు కనుక సౌభ్రాతృత్వానికి కృషి చేయవలసింది రాజకీయ నాయకులూ, విప్లవకోవిదులూకారు, రచయితలు

రచయిత ఇన్నాళ్లూ తన స్థానాన్ని తాను చేరుగా ఏర్పరచుకోలేదు స్వాతంత్ర్యానికి లేదా సమానత్వానికి జరిగే కృషికి పోరాటానికి లేదా విప్లవానికి వత్తాసుగా నిలిచినాడు అంటే మిగతావారి రంగాలలో పడిపోయి

తన రంగాన్ని విస్మరించినాడు అందువల్ల సాధించుకున్న స్వాతంత్ర్యమూ, సమానత్వ స్థాపనకు జరిగిన ప్రయత్నమూ ఫలించకుండా పోతున్నాయి

రచయిత తన విధిని బాధ్యతను గుర్తెరిగి సౌభ్రాతృత్వ సాధనకు కృషి చెయ్యడమే తన ధర్మంగా నిర్వచించుకుని ఆ పరిమిత రంగంలో కృషి జరిపినట్లయితే రాజకీయ నాయకులు విఫలమైనచోట రచయిత విజయం సాధించి మానవ జాతికి మ ఉపకారం చెయ్యగలడు

ఒక్కటే షరతు మొదటి రెండింటిలో నిమగ్నమైపోయి, తన భాగాన్ని రచయిత విస్మరించరాదు

రచయిత కృషి వలన సౌభ్రాతృత్వం రాగలదా అను ప్రశ్న అటుంచి ఏ వర్గానికీ ఏ సిద్ధాంతానికీ కట్టుపడకుండా వర్గాలు, సిద్ధాంతాలలో ఉన్న లోపాలకు తలవంచకుండా వారివర్గాల ఎద్ధాంతాల తు చ తప్పని నడవడిని స్వీకరించే గొర్రెదాటు విధానం కాకుండా మానవసమాజములోని సమానతకు అది నెలకొలిపే స్వాతంత్ర్యానికి మూలాధారమైన సౌభ్రాతృత్వాన్ని దానికి సంబంధించిన భావనను తన రచనల ద్వారా కలిగించి తన కనీసబాధ్యతను నెరవేర్చిన చాలని నా అభిప్రాయం

కాళోజీ ఇంటర్వ్యూ

# తమ్ముడు మురళీధర్ గౌడ్‌కు

నువ్వు నవీన్ ద్వారా పంపిచిన ప్రశ్నల పరంపర అందింది పాత ప్రశ్న లెక్కదో పోయినయి అసలు

ఇవ్వాళనే, మళ్ళీరాను శాస్త్రి తో జవాబులు రాయించిన

అయితే ఒక్క సంగతి ఇన్ని ఏండ్ల పరిచయం ఉన్న నీవంటి వానికే నా గురించి రాయవలసి వచ్చినప్పుడు, మళ్ళీ ఇన్ఫర్మేషన్ కావల్సి వస్తే, ఇంక వేరే వాండ్ల సంగతి చెప్ప వలసిన పనే లేదు అడుగుతె చెప్పే సంగతంతా చెప్పక పోతెనే నయమేమో!

అట్లైనంక, పుస్తకం ఒకటి పంపిస్తే సంతోషిస్తా అందగానే ఉత్తరం రాస్తవు గదా

నక్కలగుట్ట నీ

16-8 2001 (కాళోజీనారాయణరావు)

1 కాళోజీ గారు, ప్రజాకవిగా అభినవ వేమనగా

ప్రసిద్ధికెక్కిన మీ కవితా సృష్టి ఎప్పుడు మొదలైంది

జ నేను చదువుకున్నది పదవ తరగతి వరకే ఇంటర్మీడియెట్ లో ఉన్నప్పుడు ఆరోగ్యం బాగలేక చదువు ఆపవలసి వచ్చింది తర్వాత వకాలత్ పరీక్షలు పాస్ కావడం అదంతా వేరే సంగతి ఉర్దూలో పదివాచకాలు తెలుగులో నాలుగో ఆరో వాచకాలు ఇంగ్లీషులో కొన్ని వాచకాలు చదివిన కావ్యం పేరుతో ఏ పుస్తకం చదువుకోలేదు చదువుతున్న ఆయా పుస్తకాలలోని కవితలు కొన్ని నన్ను ప్రభావితం చేసినయి నాకు యాదికి ఉన్నంతవరకు స్కాట్ దికావచ్చు "Breaths there a man with soul of dead into himself has not said this is my own native land" అన్న కవిత ఆధారంగా రాసిన 'నా గొడవ' మాతృదేశము మాటముచ్చట, ముదము ముదము కూర్పరు మదికి అనియెడి, పమునీచతు పృథ్వి అంతట కలియవెదికిన కాననగునా? నీరులేని ఎడారి ఐనను వానవదల వసతి ఐనను అగ్గికొండలఅవని ఐనను

మాతృదేశము మాతృదేశమే బహుశా మొదటి కవిత ఇదీ నావిద్యార్థి దశలోనే 1930 లో ప్రాంతాల్లో నాగొడవ పత్రికల్లో ప్రకటింపబడడానికి మాత్రం నాంది ఐన వారు సురవరం ప్రతాపరెడ్డి

<u>*2 మీపై ప్రభావాన్ని కలిగించినవారూ మీరు అమితంగా అభిమానించేవారూ ఎవరు?*</u>

జ చిన్నప్పుడు మా అమ్మ వీరసావర్కార్ గురించి కథా మరారీలో ఎందరో వీరుల కథలూ చెప్పేది లోకమాన్య బాలగంగాధర్ తిలక్ గాథలూ ఆర్యసమాజ్ కార్యక్రమాలూ మా అమ్మ ద్వారా అన్న ద్వారా వినేవాడిని నాయన ఏమో ఎప్పుడూ ఏదో ఒకటి చదువుకుంటూనే వుండేవారు పోతన భాగవతంలోని ప్రహ్లాదచరిత్ర ఘట్టం నన్నెంతో ప్రభావితం చేసింది మా మేనమామ పండిత నరదేవ శాస్త్రి ఆయన లోకమాన్యుని అనుయాయి సంస్కృతంలో 'శాస్త్రి డిగ్రీ పొందినవారు ప్రభావము నా మీద ఎక్కువే అయనవి నైతిక విలువల రాజకీయాలు ఆయన అజన్మ బ్రహ్మచారి వీరసావర్కార్ సాహసగాథలు రాంప్రసాద్ బిస్మిల్‌ను ఉరికంబమెక్కించినప్పుడు మా నాన్న చదివిన ఉర్దూకవిత అయితే ఇంకా నన్ను ప్రేరేపిస్తునే ఉంటుంది మా అన్నగారు కూడా నన్ను ప్రభావితం చేసినారు

<u>*3 కాళోజీ సోదరుల్లో ఒకరైన మీ అగ్రజులు శ్రీ రామేశ్వరరావు గురించి మీ అభిప్రాయం?*</u>

జ ఆయన వంటి అన్న అందరికీ లభించడం అరుదు ఆయన సహ ప్రచంద్ర ఉత్సవంలో పూలకిరీటం పెడితే అయిదు నిముషాలకు మించి ఉంచుకోలేదు చిరాకు పడ్డాడు అట్లాటిది నన్ను 83 ఏండ్లు భరించిండు ఏడేండ్లవాడైన మా అన్న రామేశ్వరరావు బుజం మీద, నా ఏడు నెలల వయస్సునపుడు మా అమ్మ వేసింది అప్పటి నుంచి ఆయన చనిపోయే వరకు ముళ్ళకిరీటం వంటి నన్ను మోస్తూనే ఉండే రానుకున్నాను "ఎన్నేండ్లు వచ్చినను చిన్నవాడనరుంచు అతి గారబముతోడ అన్ని నమకూర్చుచుచు ఆట పాటలకెంతో అవకాశమిచ్చిన అన్నయ్యకీ గొడవ అంకితము సేతు అని నా గొడవ ఆయనకే అంకితం ఇచ్చిన అంతే కాదు 'సైరణలో పుడవిచి అతనికి ఉన్న తేడకడునన్నది కందిరీగ నడుమనుటయు మోటగునను భయమున్నది అని కూడా అన్న నన్ను సొసైటీకి ఆయన డొనేట్ చేసిందని కూడా సభల్లో చెప్పుకున్న ఉర్దూలో గొప్ప కవిత్వం రాసిండు 'కలామెషాద్ అవ్వల్ కలా మెషాద్‌దువ్వం ఆయన బతికుండగానే అచ్చయినయి ఆయన చనిపోయినాక కాయనాతౌషాద్ అని మూడో పుస్తకం అచ్చైంది ఇంకా ఎన్నో హిందీ కవితలు, గుణగాన్ అని వివిధ వ్యక్తుల మీద రాసినవి ఉర్దూ కవితలు అచ్చు కావలసి ఉన్నాయి తెలుగులో కూడా ఆయన రచనలు, ఆయన సొంతంగా రాసినవి దేవులపల్లి సుదర్శన్‌రావు అనువాదం చేసినవి ఒక పుస్తకంగా వచ్చినాయి

<u>*4 కవిగా స్వాతంత్ర్య సమరయోధుడుగా స్వాతంత్ర్య పోరాటంలో మీరు నిర్వహించిన భూమిక ఏమిటి?*</u>

జ ముందుగానే చెప్పినట్లు, మా అమ్మ చెప్పిన కదలు నన్ను బాగా ప్రభావితం చేసినాయి అనాడున్న పరిస్థితులు, అంటే నేను శౌఖానియాలో ఉన్నప్పుడు అంటే హైస్కూల్‌లో చాలా క్లిష్టమయినవి నిజాం పరిపాలన తెలుగులో చదువులేదు తెలుగంటే ఉర్దూకు వ్యతిరేకం ఉర్దూకు వ్యతిరేకం కనుక ఇస్లాంకు వ్యతిరేకం ఇస్లాంకు వ్యతిరేకం కనుకు ఇస్లాం రాజు, నిజాంకు వ్యతిరేకం కాబట్టి రాజ్యానికి వ్యతిరేకం తెలుగేకాదు ఉర్దూ కాని భాష ఏదైనా అయితే ముస్లింలు కానివాండ్లనందర్నీ అనుమానంగా చూచే రోజులవి తెలుగువాండ్ల జనాభా 95% ఉన్నా చదువులు, పరిపాలన అంతా ఉర్దూలోనే సాగుతుండేది ఉర్దేతరవాండ్లకు అసౌకర్యం ఇక గ్రామాల్లో పెత్తందార్ల, జాగీర్దార దేశముఖ్‌ల పెత్తనం అప్పుడే విస్తరిస్తున్న ఆర్యసమాజ ఉద్యమం నన్ను ఆకర్షించింది ముస్లింలు హిందువులను ముస్లింలనుగా మార్చడం, ఆర్యసమాజ్ వాండ్లనందర్నీ శుద్ధి కార్యక్రమం నిర్వహించి మళ్ళీ హిందువులుగా మార్చడం, గణపతి ఉత్సవాలు నిర్వహించి అనాటి రాజ్యానికి విరుద్ధంగా ఊరేగింపులు తీయడం

ఇవ్వన్ని జరుగుతుండేది నేను హైస్కూల్‌లో చదువుతున్న రోజుల నుంచే ఈ ప్రజాజీవనంలోని Restrictionsకు విరుద్ధంగా అంటే అసమంజసమయిన రాజ్యపు' ఆధిపత్యానికి నిరసనగా పని చేయడం అలవాటైంది అనాడు ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ అధ్యక్షుడు బహదూర్ యార్ జంగ్ అనల్‌మలిక్ అదే నినాదం ఇచ్చిండు అది మత దురహంకారం దానికి విరుద్ధంగా పోరాడినాం ఆర్యసమాజ్ కార్యక్రమాలేకాక, గ్రంథాలయోద్యమం ద్వారా కూడా నాటి నైజాంకు విరుద్ధంగా పోరాడినాం అనాడు తెలుగులో మాట్లాడటమే రాజ్యానికి రాజకు విరుద్ధంగా ఉన్న రోజుల్లో 1901లో హైదరాబాద్‌లో నేను పుట్టకముందే శ్రీకృష్ణదేవరాయ భాషానిలయం మొట్టమొదటి లైబ్రరీ స్థాపించడం జరిగింది తర్వాత వరంగల్‌లో 1913లో శబ్దానుశాసన గ్రంథాలయం 1904లో రాజరాజనరేంద్ర గ్రంథాలయం హన్మకొండలో, ఆ తర్వాత 1920లో మడికొండలో ప్రతాపరుద్ర గ్రంథాలయం స్థాపించబడ్డాయి ఇదంతా ఎందుకు చెప్తున్ననంటే గ్రంథాలయాల ద్వారా అనాడు ప్రజలను చైతన్యపరచి, అనాడు జరుగుతున్న ప్రజావ్యతిరేక చర్యలను ఎదుర్కొవడానికి ప్రజలను సిద్ధపరచడం జరిగిందని చెప్పడానికే ముస్లిం మతం నుంచి హిందూమతంలోనికి మార్చే ప్రక్రియలో నేను ఆర్యసమాజ్ కార్యకలాపాల్లో పాల్గొన్నాను ఉట్లపండుగ జరిగి వరంగల్ ఇంతెజార్‌గంజ్ పోలీస్ నాకా దగ్గర బాజాబజంత్రీలతో పోవడానికి వీల్లేదని ముస్లింలు అభ్యంతరం చెప్తే ఆ కొట్లాటలప్పుడు ప్రజల తరపున పాల్గొన్నారు గణేష్ ఉత్సవాలు తిలక్ పిలుపు ప్రకారం నిర్వహిస్తే ఊరేగింపుపై ముస్లిం మతోన్మాదులు దాడిచేస్తే నేనూ రంగారెడ్డి అనే విద్యార్థి గాయపడి దవాఖానాలో చేరినాము తర్వాత ఆంధ్ర మహాసభ స్థాపన మాడపాటి హనుమంతరావు, రావి నారాయణరెడ్డి వంటి వాండ్ల సాహచర్యం లభించి, ఆంధ్రమహాసభ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొన్నా భోనగిరి ఆంధ్రమహాసభలో చీలికలు వచ్చినపుడు నేనో తీర్మానం ప్రవేశపెట్టినా 11 8 1946 లో జాతీయ జెండాను ఎగురవేసిన బత్తిని మొగిలయ్య అనే అతన్ని రజాకార్లు నరికి వేసినపుడు నిజాంరాజును ప్రశ్నించినందుకు శాంతిభద్రతలకు విఘాతం కల్గిస్తున్నానంటూ నన్ను మూడు నెలలు షహరేబదర్ నగర బహిష్కారం శిక్ష విధించినారు సర్ మీర్జా ఇస్మాయిల్ వరంగల్ వెళ్తున్నాడని తెల్సి హైదరాబాద్‌లో ఉన్న నేను వరంగల్ వెళ్తానన్న అనుమతి లభించలేదు ఆయనకో బహిరంగ లేఖ రాస్తే సురవరం ప్రతాపరెడ్డి గోలకొండ పత్రికలో అచ్చువేసిండు మొగిలయ్యనేకాక అయన్ని చంపి వస్తూ వస్తూ త్రోవలో ఒక పిల్లవాడిని కూడా చంపి బల్యాలకుపేగులు వేసి బజార్ల తిరిగి వారు రజాకార్లు ' బజార్లో బాలకుని బల్లెంబుతో పొడుచు బద్మాష్ పసిగట్టినావా? ' అని ప్రశ్నించా నా గొడవలో ఎక్కడైనా అన్యాయం జరుగుతున్నదని అనిపిస్తే ఆ అన్యాయానికి విరుద్ధంగా మాట్లాడినాను అన్యాయాన్ని చేసిన వారు ఏ స్థాయిలోని వాండ్లైనా సరే అనాటి నల్లగొండ జిల్లాలో జనగామ తాలూకా బైరాన్‌పల్లి గ్రామంలో రజాకార్లు, నిజాం పోలీసులు వందలాది మందిని క్రూరంగా చంపి వేసిన సంగతి మేం జైల్లో ఉండగా తెలిసింది అట్లనే ఆకునూరు మాచిరెడ్డి పల్లెలో కూడా అత్యాచారాలు స్త్రీల మానభంగాలు, దోపిడీలు విచ్చలవిడిగా సాగించినారానాడు రజాకార్లు "మాచిరెడ్డిలో ఆకునూరులో దోచినమానమి చాలంక పాలనపేరిట పల్లెపల్లెలో జరిగే దోపిడి చాలింక అని రాసినాను నా గొడవలో అప్పుడే కాలంబురాగనే కాటేసి తీరాలో అనే గేయం కూడా భారతదేశం మొత్తానికి స్వాతంత్ర్యం 1947 అగస్టు 15న వస్తే హైదరాబాద్ రాష్ట్రానికి మాత్రం రాలేదు 1947 నుంచి ఇంకో సంవత్సరం కొట్లాడవలసి వచ్చింది నైజాం రాజ్యం పోలీస్ చర్య 13వ సెప్టెంబర్ నుండి 17 సెప్టెంబరు వరకు జరిగి లాల్‌ఖిల్లా మీద అసఫ్జాహీజెండా ఎగురవేస్తాన్న కాశింరజ్వీ, భంగపడ్డ తర్వాత, నిజాం సర్దార్ పటేల్ ముందు లొంగిపోయినాడు, 17 సెప్టెంబర్‌నాడు అనాడే హైదరాబాద్ రాష్ట్రానికి స్వాతంత్ర్యం అప్పుడు మేం గుల్బర్గా జైల్లో ఉన్నాం మమ్మల్ని విడుదల చేసే

అర్డర్లు వచ్చినా బయట ఉన్న ఉద్రిక్త పరిస్థితులవల్ల ఇంకో వారం రోజులు జైల్లోనే ఉన్నాం 26 సెప్టెంబర్‌కుగాని విడుదలకాలేదు వేము తర్వాతనైనా ప్రజలు కోరుకున్నట్లు పరిపాలన ఉన్నదా? మా ఆశలన్ని తల్లకిందైనాయి అందుకే అనాటి పరిస్థితులను లంకా పునరుద్ధరణ అనే కథలో రాసుకున్న హైదరాబాద్ రాష్ట్రంలోగాని ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాకగానీ పరిస్థితులు ఇంకింత బిగడాయించినాయిగాని బాగు పడలేదు భాష ప్రాతిపదికగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ బాగుంటదనుకుంటే దారుణంగా మారిపోయినయి పరిస్థితులు అందుకే భాష 'పేరసాలెగూడు భద్రమనకు' అని రాసుకున్న రెండున్నర జిల్లాలదె దండి బాస అయినపుడు తక్కొనోల్ల నోళ్ళ యాస తొక్కిపెట్టబడ్డవుడు, ప్రత్యేకంగా రాజ్యంపాలుగోరడం తప్పదా అని 1969లోనే అన్న ప్రజాజీవనం పూర్తిగా అల్లకల్లోలం చేయబడింది జనజీవన స్రవంతి అని మనపాలకులు జరిపించేది ఎట్లా ఉన్నదో అందరూ చూస్తూ అనుభవిస్తున్నదే అవినీతి పరులు బ్లాక్ మార్కెటీర్లు, గూండాలతో నిండి ఉన్నది అందుకే నా దేశం పాలించేది నా జనతను రక్షించేదీ గూండాలా తుపాకీ గుండ్లా? ప్రజాస్వామ్యంక్షణ లక్షిత భారత రాజ్యాంగం కుండ్లా' ' అని ప్రశ్నించిన నిజాం రాజ్యంలో పౌరుల హక్కులకు భంగం కలిగినపుడు ఆ తర్వాత ప్రజారాజ్యంలో కూడా పౌరహక్కులకు భంగం కలిగినపుడు నేను మౌనంగా ఉండలేదు ఉండలేను అనాటి, నేటి పాలకులను ప్రశ్నిస్తూనే ఉన్న 'జరిగిందంతా చూస్తూ ఎరగనట్లు పడివుండగ సాక్షీభూతుణ్ణిగాను, సాక్షాత్తూ మానవుణ్ణి అన్నాను నా గొడవలో పరిపాలన ఎట్లా ఉన్నదీవాళ మన అభిప్రాయంతో ఏకీభవించనోణ్ణి టాలరేట్ చేసే పరిస్థితి లేదు "ఏకీభవించనోని పీక నొక్క సిద్ధాంతం అంటే మరేమీ కాదు అచ్చమైన ఫాసిజం' ఎమర్జెన్సీలో కూడా ఎవడూ మాట్లాడనపుడు ప్రహ్లాద చరిత్ర చదువుతూ ఆంధ్ర అంతటా తిరిగిన హిరణ్యకశిపుడు ఫాసిస్టు వానిది రాజ్యహింస ప్రహ్లాదుడు సత్యాగ్రహి సత్యాగ్రహం ఫలితం ఇవ్వలేదు నరసింహుడు ప్రతిహింస చేయవలసివచ్చింది పిరికి పందబతుకు కన్నా హింస వెయ్యిరెట్లు మిన్న అన్నాడు మావో కాదు మనోతు మహాత్మాగాంధీ అని కూడా అన్నీ నా గొడవలో యాదగిరి యాది అవే గేయంలో ప్రభుత్వాలను వాటిలో ఉండే అవినీతిని ప్రశ్నించినా అసలు నేనేది రాసినా అనాడున్న సమకాలీన రాజకీయ సాంఘిక సంఘటనలపైన నా కమెంట్ రికార్డ్ చేసిన అందంతా ఒక రన్నింగ్ కామెంటరీ నిజాంకాలం నుంచి ఇవ్వాల్టి వరకు కూడా పౌరుల హక్కులకు భంగం కలిగినపుడు ఎప్పుడూ నేను మౌనంగా లేను ఈ 60 70 ఏండ్ల ప్రజాజీవితంలో ప్రశ్న నిరసన ఈ రెండూ నేను మానలేదు అందుకే కొందరు నేను నా గొడవలో 1946లో రాసిన గేయాలను చదివి, "అబ్బ ఈ గేయం ఈవాళట్కి రిలెవెన్స్ ఉందండీ అంటారు 'నా సమాధానం ఏమిటిదో ఎర్కైనా? నాగేయం ఇవ్వాళ్టికి రెలెవెంట్ గా ఉందని సంతోషించినా, పరిస్థితులు ఈ 70 ఏండ్లలో ఏమీ మారలేదని ఏడ్వనా? అని అసలు సమాజంలోని అవకతవకలన్నిటికీ, పాలకులతో పాటుగా ప్రజలు ముఖ్యంగా అనాటి స్వాతంత్ర్య సమరయోధులు కూడా కారణమే అంత పోరాటం బ్రిటిష్ వాండ్లలో చేసి, నిజాంలో చేసి, అ తర్వాత కిమ్మన్నాస్తి చుప్ చాప్ బంద్రు దానికి కారణం అధికార రాజకీయాలు ఉపేక్ష ఈ ఉపేక్షాభావమే చానా డేంజర్ అందుకే 'ఏరి ఏరినావారలు' అని నా గొడవలో ప్రశ్నించిన పాలకులు, ప్రజల్ను గొర్రెలుగా భావించుతున్నారు ప్రజలు నమ్ముతున్నారు ఎంత నమ్ముతున్నారంటే ఎద్దు కాడిచే బట్టంగనే తనంతటతానే వచ్చి దానికింద తలపెట్టుతది అట్ల బానిసత్వానికి స్వయంగా లొంగుతున్నారు 'గొర్రె' గేయంలో అన్నా నేను 'మందలబడి మురుస్తాంది గొర్రె తెగ బలుస్తాంది గొర్రె బయళ్ళ గడ్డిగొల్లన్నే మెలిపిస్తాండనుకుంటాంది గొర్రె సెలయేళ్ళ నీళ్ళన్ని గొల్లన్నే ఒలికిస్తాండనుకుంటాంది గొర్రె గొల్లన్న గొంగడి బొచ్చే తనపెయినిండా మెలిపిస్తాడానుకుంటాంది గొర్రె అని ఈ పరిస్థితి మారాలె నేనెన్నడూ అన్యాయం చేసినవాడు ఎంతటి గొప్పవాడయినా ఎంతటి పదవిలో ఉన్నా పౌరునిగా

నా హక్కుని వాడుకున్న రాజ్యాంగం ప్రకారం అనవరత జాగరూకుడుగా ఉండి పౌరుడు నిజాం రాజుగానీ, ఇందిరాగానీ నెహ్రూగానీ చెన్నారెడ్డిగానీ చంద్రబాబుగానీ, వ్యక్తులతో ప్రమేయంలేదు వ్యవస్థతోటే మన దెబ్బలాటంతా 1995లో ఎ వి నరసింహారావు నవగాంధేయవాదం అనేది ఒకటి ఉద్భోధించిండు అప్పుడు కూడా ప్రశ్నించినా? నేనెప్పుడూ అన్యాయానికి వ్యతిరేకిని 1956లో విశాలాంధ్ర అయితే బాగొంటుందనుకున్నవాండ్లలోనే నా ఒక్కణ్ణి కాని అనుభవం మన ఊహ తప్పని రుజువు చేసింది 1969లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో మళ్ళి ఓసారి జైలుకు పోయిన ఇవ్వాళ కూడా నేను తెలంగాణా ఉద్యమాన్ని సమర్థిస్తున్న అంటే, అది తెలంగాణాకు జరిగిన అన్యాయం, తెలంగాణా భాషకు, యాసకు సంస్కృతికి జరిగిన అన్యాయం, వివక్ష ఏటికారణంగానే అందుకని, నేను నిర్వహించిన భూమిక అనే పెద్దపెద్ద పదాలెందుకుగానీ, పౌరునిగా బాధ్యతాయుతంగా నా హక్కును వినియోగించుకునే ప్రయత్నం చేసినా 'పౌరునిదా పోరనివా' అనేది ఆలోచించుకోవాలే ప్రతివాడూ అని నా మాట

5 *'నా గొడవ గా ప్రసిద్ధికెక్కిన మీ కవిత్వం ప్రజలగొడవేనని అంటారు ఇది ఎంత వరకు వాస్తవం? ఎందువలన?*

జ నా కవిత్వం ప్రజలగొడవ అని నేనెప్పుడూ చెప్పలేదు అయితే నేను రాస్తున్నది కవిత్వమనీ రాయలేదు ఎక్కడైనా అన్యాయం జరిగినప్పుడు ప్రజల హక్కులకు భంగం కలిగిందని రాజ్యాంగం ప్రకారం ప్రజలకున్న పౌరహక్కులు కాలరాయబడుతున్నాయని నేను భావించినపుడు ఆ దోపిడి చేస్తున్న వాండ్లను, చేయబడుతున్న వాండ్లతరపున ఒక పౌరునిగా ప్రశ్నించిన నాకున్న, రాజ్యాంగం ప్రసాదించిన పౌరహక్కుల ప్రకారం ప్రశ్నించిన నిజాం రాష్ట్రంలో కూడా అంతే స్వాతంత్ర్య భారతంలో అంతే ఇప్పుడూ అంతే దీన్ని మీరేమన్నా నాకేం పర్వాలేదు అయితే నేను ప్రశ్నిస్తున్నవన్ని నేను మాత్రమే ప్రశ్నించగలిగినవీ, మాత్రమేకావు ఏ పౌరుడయినా, ఏది నిజమైన పౌరుడైతే రాజ్యాంగం వానికి ప్రసాదించిన హక్కుతో నిర్భయంగా ప్రశ్నించవచ్చు ప్రశ్నించగలగాలె అది లోపిస్తున్నదనే నాబాధంతా ముఖ్యంగా కవులు రచయితలు అనవారు అందుకే నా గొడవలో కలం గారడీ కవితల వలలల్లకు మహాకవివి పూటగడచుమాటాడకు అనానూ 'వంగడమే వంశం కంపే సువాసన అని అనుకోకుమని కూడా అన్నాను ఇదంతా ప్రజల గొడవ అనీ లేదా తమ గొడవ అని ప్రజలకనిపిస్తే నేను, నా రాతలపట్ల తృప్తి చెందవలసిందే నేను వారి కష్టాలపట్ల స్పందించి, దోపిడి చేసేవాళ్ళే ప్రశ్నించగలిగినందుకు కాని, వాండ్ల కష్టాలు తీరడంలేదనే బాధ అట్లాగే ఇవాళటికీ ఉన్నది నా గొడవలో అన్నాను "ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు తప్పు చేసివాని దండిపగతకుఅని అసలు ఇది వాస్తవమా? కాదా? అనే ప్రశ్న దగ్గరి రచయితలుండటమే విచారకరం

6 *వాసిలో మంచి కవిత్వం రాసినా, రాసిలో మీరు రాసింది తక్కువేనని విమర్శకులంటారు మీరేమంటారు అందుకు కారణం?*

జ నేను ముందే చెప్పిన, నేను చెప్పతున్నదో రాస్తున్నదో కవిత్వం అని నేనెన్నడూ అనలేదు నాకు ఆవేదనో, ఆనందమో కల్గినప్పుడు, నాలుగు పంక్తులు రాసినా ప్రజలకు, వాండ్ల హక్కులకు భంగం కలిగినప్పుడు వాండ్లు దోపిడికి గురయినప్పుడు వాటికి కారణమైన దోపిడిగాండ్లను నిలబెట్టి ప్రశ్నించిన పాతకాలం నాడు కూడా ఒక ఉపన్యాసం కంటే, దగ్గరవుతుందని వాండ్లను ప్రభావితం చేస్తుందని నేను భావించిన నా గేయాలు రాజకీయ నేపథ్యం ఉన్నవయినా, ఆంధ్ర, మహాసభ వేదిక మీద ఎన్నో సార్లు చదవబడ్డవి అసలు, నా గేయాలు ఎక్కువగా ఒక సంఘటన నేపథ్యంగా ఉన్నవే సమకాలీన రాజకీయ సాంఘిక సంఘటనల మీద రన్నింగ్ కామెంటరీయే నా కవిత్వం అనేది అని నేను ఓసారి అన్నాను రాసి, వాసి గురించి నేను చెప్పిందేం లేదు ఎవడికయినా నచ్చితే సంతోషం, నచ్చకున్నా సంతోషం

7 *క్రూర విమర్శకుడుగా పేరు పొందిన రారా మీరు*

*అనువదించిన ఖలీక్ జీబ్రాన్ కవితను విమర్శిస్తే మీరెందుకు మౌనం వహించారు?*

జ అనలు ఖలీల్ జీబ్రాన్ ప్రాఫెట్‌ను అనువదించినాంక చాలా వేదికల మీద చదివి వినిపించిన భాషా పండితులు అన్నవాండ్లకూ వినిపించిన ఒక్కడయినా ఎన్నడూ 'కాళోజీ ఇది బాగాలేదని ఇక్కడ ఈ దోషాలున్నాయి అని చెప్పలేదు చెప్పకపోవడం తప్పు అని నా అభిప్రాయం చెప్తే దొర్లిన తప్పులు సవరించుకుందునేమో అట్లాగే, నేను ఏదో గొప్పకవి నని ఎప్పుడూ క్లెయిమ్ చేయలేదు ఇక రారా విషయానికొస్తే పాపం మహానుభావుడు ఆయన పుస్తకం పూర్తిగా చదివి, ఆయనకు తోచిన అభిప్రాయం చెప్పినడు నేను చదివి వినిపించిన నా మిత్రులైన పండితులకంటే రారా నయమేగదా ఇక నా మౌనం గురించి నేనెపుడు, నా కవిత్వం విషయంలో సమర్థించుకుంటూ ప్రకటనలో చర్చే చేయలేదు కంట్రోవర్సి కెప్పుడూ దిగలేదు మనం రాసి పబ్లిక్‌లోకి కవిత్వం పోయినాక అది అందరి సొత్తు వాండ్ల వాండ్ల ఇష్టం

*8 కవికి సైద్ధాంతిక నిబద్ధత అవసరమా?*

జ లార్డ్ బైరన్ అంటాడు 'ఒకే ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక' అని రచన అట్ల ఉండాలె వేయి ఆలోచనలు ఏ నిర్బంధాలుండకూడదని చెప్పే మనం, రచయితకు నిబద్ధత ఉండాలని చెప్పడం విచిత్రమే ఏ నిబద్ధతకూ లొంగకుండా స్వీయ ఆలోచనల పరంగా తన అభిప్రాయాన్ని ప్రకటించే స్వేచ్ఛ స్వాతంత్ర్యం ఉన్నవాడు ఒక్క రచయితే ఏ ఇజంగానీ, మతంగాని రచయిత స్వాతంత్ర్యాన్ని అడ్డుపడకూడదని నా అభిప్రాయం

*9 కవిత్వం జీవితం వేరువేరని కొందరు, కాదని మరికొందరి వాదన మీరేమంటారు*

జ ప్రతి జాతీ ఒక అబద్ధాన్ని ఎన్నుకొని, ధాన్ని తన ఆదర్శంగా ప్రకటిస్తుంది అక్కడి నుండి అది మాగి, మాగి ఆదేశపు, వాక్కుగా, తత్వంగా, ఇంకా ఏవేవోగా ప్రచారంలోకి తేబడుతుంది కొంత మంది గొప్పవాళ్ళ వాళ్ళ అన్నింటికీ అతీతంగా ఆలోచించే కొన్ని క్షణాల్లో (ఎల్లవేళలాకాదు) ఆ స్థాయి నుండి పైకెదిగి వాస్తవం మాట్లాడగలుగుతుండని రోమారోలండ్ కావచ్చు అన్నాడొకసారి రచయితలు అట్లా ఉండాలని నా అభిప్రాయం అందుకే కలంగారడీకైతలవలల్లకు మహాకవి పూటగడుచు మాట్లాడకు అన్నాను నా గొడవలో నామటుకు నేను అట్లా ఉండటానికే ఇష్టపడ్డాను అధికారానికి పదవులకూ లొంగవద్దు రచయిత అనేదే నా భావన

*10 ప్రభుత్వ విధానాలను విమర్శించే మీరు ప్రభుత్వం ప్రకటించిన పద్మవిభూషణ బిరుదును ఎందుకు స్వీకరించారు*

జ నాకు పద్మవిభూషణ్ ప్రకటించిన ప్రకటనలో రాష్ట్రపతి ఇచ్చిన దాంట్లో నా వ్యక్తిగత గుణాల కారణంగా పద్మవిభూషణ్ ఇస్తున్నానని ఉన్నది నేను నా జీవితమంతా అధికారాన్ని ప్రశ్నించినవాణ్ణే ఎప్పుడూ అధికారానికి మంగళహారతులు పట్టలేదు పద్మవిభూషణ్ స్వీకరించినాక, నేను ప్రభుత్వాన్ని, దాని పద్ధతులనూ మెచ్చుకొంటూ లొంగిపోయి మాట్లాడ లేదు పద్మవిభూషణ్ స్వీకరించిన రోజే, ఆంధ్ర ప్రదేశ్‌లో పౌరహక్కులపట్ల, జరుగుతున్న ఉల్లంఘ లనూ ప్రభుత్వం చేస్తున్న దౌర్జన్యాలనూ పేర్కొంటూ ఒక మెమోరాండం ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి ఇచ్చినాను అదే రోజు అందుచేతనే నేను నా ఇష్టపూర్వకంగానే స్వీకరించిన ఇప్పటికీ ఈ ప్రభుత్వాన్నీ వ్యవస్థనీ విమర్శిస్తూనే ఉన్నాను

*11 నేడు ప్రాచుర్యాన్ని పొందిన దళిత స్త్రీవాద సాహిత్యాలు తమ లక్ష్యాన్ని సాధించినట్లేనా?*

జ నేనిదివరలో ఒక ఇంటర్వ్యూలో చెప్పినాను కొత్త కవిత్వాన్నీ కొత్తవాదాన్ని పాతతరం కవులు ఎప్పుడూ నిరసిస్తూనే ఉంటారు కమ్యూనిస్టుల రచనల మీద కూడా ఇటువంటి విమర్శలే చేసినారు స్త్రీవాద కవులు ఈ వేళ పట్టణాల్లోనూ పల్లెల్లోనూ ఉండే స్త్రీలందరికీ సంబంధించిన సమస్యల మీద రాస్తున్నారు వాండ్ల మౌలిక సమస్యలను బాగా శక్తివంతంగా చెబుతున్నారు దళితవాదం కూడా అట్లాగే వాండ్ల స్వీయ అనుభవాల్ని వేరెవరో చెప్పేకంటే, వాండ్లే చెప్పడం శక్తివంతంగా

ఉంటుంది తరతరాలుగా సాగుతున్న అణచివేతను ఈ రెండు వాదాలను తమదైన అనుభవంతో బాగా శక్తివంతంగానే ఎదుర్కొని వ్యక్తీకరిస్తున్నాయి తమ లక్ష్యాల్ని సాధించడంలో ముందడుగువేసినట్లే ఏ వాదమయినా Thus far and no further అన్నట్లుండవద్దనేదే నా మాట ఏకీభవించనోని పీకనొక్కి సిద్ధాంతం కాకూడదు

*12 నేడు వస్తున్న కవిత్వంపై మీ అభిప్రాయం*

జ ఏ కాలంలో నయినా ఎన్నో ధోరణులుంటాయి సాహిత్యంలో పాతకాలంలో రాచరిక వ్యవస్థను మతాన్ని పొగడ్తూ కూడా కవులు అన్యాయాలను నిరసించారు శ్రీనాథుడు పరమేశగంగ విడుము పార్వతి చాలున్ అంటే ధూర్జటి రాజన్మత్తులు వారి 'సేవ వరకు ప్రాయంబు' అన్నాడు ఇవ్వాళటి సాహిత్యంలో కూడా అన్యాయాన్ని పరోక్షంగానో పాక్షికంగానో ఎదిరిస్తున్న కవులున్నారు అధికారానికి మంగళహారతి పట్టేవాండ్లు ఉన్నారు దోపిడిని దౌర్జన్యాలను ధైర్యంగా ప్రతిఘటిస్తున్న వాండ్లు ఉన్నారు కవుల్లో ప్రజాస్వామ్యంలో అన్యాయాన్ని నిరసించవలసిన బాధ్యత కవులకుంది అది అవసరం కూడా కనుక ఈనాటి కవిత్వంలో వ్యక్తి వాద పలాయనవాద ధోరణులతో కాక అధికార వర్గాల అక్రమాల్ని సాహసంతో ఖండించే బాధ్యతను రచయితలు చేపట్టాలి

*13 కవిత్వంలో గాఢత క్లుప్తత అవసరమా?*

జ మనం చెప్పాలనుకున్నది అనుకున్నది ఎవరికైతే లేదా ఎవరినుద్దేశించి చెప్పతున్నామో వాండ్లకు చేరుతున్నదా అనేదే ముఖ్యమైన విషయం ఎంత స్పష్టంగా stright forwrd చెప్పగలిగితే అంతమంచిది క్లుప్తత గాఢత అనేది పెద్ద సమస్యకాదు అయితే చెప్పదల్చుకున్న విషయాన్ని అతి తక్కువ మాటల్లో అవతలవారికి చెప్పగలిగితేనే మంచిది అదే కావచ్చు అల్పాక్షరముల అనల్పార్థరచన

*14 మీ అనుభవాలకు అక్షర రూపం కలిగిస్తే భావితరాలకు ఉపయోగపడుతుందిగదా!*

జ నా జీవితం ఆనాటి రాజకీయ సాంఘిక సమస్యలతో పెనవేసుకుని ఉన్నది ఇదీ నా గొడవ పేరట విశాఖపట్నం మిత్రులు మొదటి భాగం ఇదివరలోనే అచ్చువేసినారు రెండవ భాగం 18 క్యాసెట్లు రికార్డు చేసి వున్నాయి అవి ఎప్పుడు అచ్చవుతాయో ఆ ప్రయత్నంలో ఉన్న మిత్రులకెరుక

*15 మీ సమాంతర జ్ఞాపకాలను వివరిస్తారా?*

జ జ్ఞాపకాలను సమాంతర జ్ఞాపకాలను వివరించడం కష్టమే ఎన్నో జ్ఞాపకాలు వరంగల్‌లో మా ఇల్లు మా అమ్మగారున్న రోజులో మా తర్వాత ఒక సాహిత్య రాజకీయ కుటీరం జాషువా విశ్వనాథ శ్రీశ్రీ, దాశరథి, గార్లపాటి రాఘవరెడ్డి మా గురువుగారు మునిమాణిక్యం దగ్గర్నుండి వట్టికోట ఆళ్వారుస్వామి సురవరం ప్రతాపరెడ్డి బిరిదెండా మురమా వరవరరావు నరసింహారెడ్డి నవీన్ ఎవికె తాదతతరం కవులందరికీ మా ఇల్లు తమ స్వంత ఇల్లే 44 ఏళ్ళ క్రింద మా అన్నగారు పి జి లే ఉదయరాజు శేషగిరిరావు కలసి స్థాపించిన మిత్రమండలి ఈ వాళటికీ నెలకొకసారి సమావేశం అవుతూనే ఉన్నది ఎంతో మంది, పండితులు నేను వారితో ఏకీభవించినా ఏకీభవించకపోయినా, అందరి స్నేహాదరణ నాకు లభించింది రాజకీయాల్లో కూడా మాడపాటి హన్మంతరావు రావినారాయణరెడ్డి దగ్గర్నుండి పి వి మొదలైన వాండ్లంతా నాకు స్నేహితులే వారి రాజకీయ ఆలోచనలు వేరే కావచ్చుగాక వారి స్నేహాదరణ కూడా నాకు లభించింది 88 ఏండ్లుగా ఈ స్నేహాదరణతోటే ఇట్లా ఉన్నాను వివరంగా చెప్పడం ఆ జ్ఞాపకాల ముళ్ళె విప్పడం కష్టమే ఎన్నో ఆసక్తికరవిషయాలూ ఉన్నాయి అందుకే నా గొడవలో అన్నాను 'నా మనసులోని ఆసక్తికి నా అవయవాల గల శక్తికి, కట్టడి, అమలు కుదరక కొట్టుకు చస్తున్నా, మొట్టుకు నెట్టుకు వస్తున్నా' అని ఈ వేళటికే అన్యాయాన్ని ఎదిరించినోడు నాకు ఆరాధ్యుడు అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి

# అనుభూతీ..........

- సిరాజుద్దీన్

అనుభూతీ అనుభూతీ కాళోజీ లోగిలిలో
కళ్ళు రెండు మెరసినట్లు పేరుపెట్టి ఎలిచినట్లు
కూర్చో మని అంటూనే బాగున్నవ అన్నట్లు
తనువు నెవరో తట్టినట్లు మనసునెవరో ముట్టినట్లు

గదిలోని జ్ఞాపికలూ గంధాలను పూసినట్లు
పద్మవిభూసణ బిరుదం పూలవాన కురిసినట్లు
ప్రజాకవీ బిరుదేమో షహనాయీ ఊదినట్లు
ఇంటినిండ కాళోజీ అభిషేకం జరిగినట్లు

కవిమిత్రులు వచ్చినట్లు మిత్రమండలి జరిగినట్లు
కవిత జల్లు కురిసినట్లు ముషాయిరా విరిసినట్లు
మురిసి మురిసీ షాదాత్మ వహ్వా అని అరిచినట్లు
పరవశించి కాళోజీ అనుభవాలు విప్పినట్లు

కవులందరు కలాలను ఎక్కుపెట్టినడిచినట్లు
కలాలన్ని గళం విప్పి కరవాలం ఝుళిపినట్లు
నినాదాలు లేచి లేచి నింగంచుకు తాకినట్లు
కదం తొక్కి కాళోజీ సారథ్యం నెరపినట్లు

ఆత్మీయులు అభిమానులు ఆ సొంతం మూగినట్లు
కొడుకూ కోడలితోటి రుక్మిణమ్మ నిలిచినట్లు
తాతయ్యను చూపండని సంతోషా అరిచినట్లు
ఛాతివిరిచి రామశాస్త్రి కాళోజిని చూపినట్లు

పీడితులూ శ్రమజీవులు చేతులెత్తి మొక్కినట్లు
మానవీయవిలువలన్ని నివాళులను ఒసగినట్లు
విప్లవాలు ఉద్యమాలు నినాదాలు ఇచ్చినట్లు
తుది యాత్రకు భుజాలపై కాళోజీ లేచినట్లు

తెలంగాణా గడ్డంతానావోడని అన్నట్లు
కాదుకాదునావోడని భరతమాత అరచినట్లు
ఈ బిడ్డా నా బిడ్డని భూగోళం చాటినట్లు
విశ్వంలో కాళోజీ కపోతమై ఎగిసినట్లు

# మనిషి - రాజ్యం

- అబ్బాస్

పులి అలా తిరుగుతూ వుంటుంది
ఏళ్ళ శతాబ్దాల నాగరికతల వీధుల్లోంచి

దు ఖాన్ని దుర్మార్గాన్ని చెట్టుకు వేలాడగట్టి
నీడలో తలదాచుకున్నాను కాసేపు ఆలోచనలో
పడ్డాను
తెగిన చేతులు కాళ్ళు మొండాల మధ్యనుంచి
అడుగులు వేసుకుంటూ

పులి వచ్చి నా నీడన చేరింది
చెరువొకటి తవ్వింది కొన్ని చెట్లు నాటింది
కాకులతో విసిగి నేను కాలినడకన బయలుదేరాను
పులి అక్కడే తచ్చాడింది

ఆకాశం నాలుగు ముక్కలైనవేళ పుట్టాన్నేను
పులి నాకో కొత్త అంగీ తెచ్చింది
పద నీకు లోకం చూపిస్తానంది
నేను ఏడ్చాను నువ్వు పాపివి అంది
నన్ను జోలెలో దాచుకుని బైటికి నడిచింది పులి
అనాథశిశువు! బాబూ కాసిన్ని పాలు పొయ్యండి
అంది
అనాథలు ఏమివ్వగలరు?
గొంతు మార్చింది పులి
అనాథలూ! ఇవిగో కాస్త పాలు తాగండి -
పులి నన్ను వారికి తాగించింది
తినిపించింది నన్ను వారి గాయాలకు పూసింది
అలా తెరచాటున కూర్చుంది పులి నా పాపాలు
నివేదించసాగాను

రత్నఖచిత కంబళ్ళు దుప్పట్లు
ఖర్జూరాలు ఒంటెలు
ఇసుక తుఫానులో అకస్మాత్తుగా పులి నన్ను
మాయం చేసింది
అందర్నీ పిలిచి నాకోసం పడమరకేసి వెతకమంది
ఐదుసార్లు వంగమంది, కొంత చిల్లర పారేయమంది

పురుషుల కళ్ళకు గంతలు కట్టింది
స్త్రీలకు ఏమీ కట్టలేదు ఒళ్ళంతా తారు పూసింది

వాళ్ళు వెతుకుతున్నారు
నన్నిటు నెట్టుకుంటూ కనుమ దాటించి కళ్ళు
తెరవమంది పులి
అరె! ఇది నా చెట్టు!!
పైకి చూస్తే
నేను వేలాడగట్టిన దు ఖం దుర్మార్గం మిగులముగ్గి
నేలకానుతున్నాయి
నేను కూర్చున్న చోట ఇప్పుడొక సింహాసనం
చక్రాలతో, సింహాలతో జాతీయ నగిషీలు
పులి నవ్వుతూ కూర్చుంది
నేను పనిచేయడం మొదలుపెట్టాను

ఇదింత క్రితమే మహాపులులు సంచరించిన నేల
ఇక్కడ పులి తీరే వేరు అంతా పవిత్రం
నా కాలి గుర్తులు మిగలకుండా
పులి ఒక తాటాకు ఆలోచన చేసింది
నా చిరునామాకు ఊరుచివర ఒక కొండగుర్తు
పెట్టింది
నా వినోదానికి సీసపు సంగీతం వినిపించింది
నా సౌందర్యానికి ఇనుపశత్రువుతో మెరుగులు
దిద్దింది
నన్నంటుకోలేదు చిత్రంగా
నా నుంచి గింజలు ఖచ్చితంగా వసూలు చేసుకుంది

నేనొకమారు ఎర్రబడ్డాను, ఎగిరెగిరి పడ్డాను
పులి నా కీళ్ళు సడలించి నా రక్తాన్ని ఇగిర్చింది
రక్త వర్ణాన్ని కనిబెడుతూ అది కలదిరిగింది

అది పులి
మరేదీ తనలా వుండరాదని కుందేళ్ళకు సైతం గోర్లు
వద్దంది
వాటిని నిలువెల్లా తనిఖీ చేసింది

ప్రతీ కుందేలునీ రెండు చేసి కలోనియంలో కత్తులు
దూయమంది
వేదికెక్కి ఈల మోగించింది

నేను రక్తంలో మునిగిపోతున్నాను
అదిగో అప్పుడొచ్చాడు ఒక తెల్లగడ్డం తాతయ్య
పోయి పులిని ఢీకొన్నాడు
పులితో తలపడ్డాడు
పలిని తరిమాడు
పులిని బోనెక్కించాడు
ఎముకలు వాంగ్మూలమిచ్చాయి
పుర్రెలు సాక్ష్యం పలికాయి
కన్నీరు కళ్ళు తుడుచుకుని తీర్పు చెప్పింది
నేనానందించాను పులికిది శాస్తి
ఒక గజ్జె ఘల్లుఘల్లున నా గుండెల్లో మోగింది
ఒక కంజిర నన్ను మైమరపించింది

ఓ అదమరపు వేళ పులి తప్పించుకుపోయింది
ఈసారి కొత్త ఎత్తులతో మళ్ళీ నా ముందుకొచ్చింది
అది నా దేహాన్ని విభజించింది
కొన్ని నరాల్లో సుఖాన్ని చొప్పించింది
కొందరికి పులితోళ్ళు కప్పింది
ఒక పులి అనేక తోళ్ళ మధ్య మరోసారి
ఒంటరినయ్యాను
ఏళ్ళు శతాబ్దాలు నాగరికతల పాటు పదేపదే
రక్తమోడాను

అలా రక్తం కారుతూనే వుంది
వీధి చివర చేతికర్ర తాతయ్య వెనుదిరిగి చూసి
వెక్కి వెక్కి ఏడుస్తూ మలుపుతిరిగి పోతున్నాడు
తాతా కాస్త ఆగవా? నన్నిక్కడ చంపేస్తారు పరుగెత్తి
ఆపాను
తాత లేడు చేతికర్ర దొరికింది
భుజాన వేసుకుని ఏడుస్తూ ఊరంతా తిరిగి
ఒక పొడుగాటి బల్లపై దాన్నుంచాను
పిల్లలూ! ఆ కళ్ళు పరీక్షించండి
ఆకలిని అన్నాన్నీ విడివిడిగా ఎలా కనుగొన్నాయో
గ్రహించండి
చెవుల్ని పరీక్షించండి నమోదైన గర్భశోకాలు
డీకోడ్ చెయ్యండి
నోటిని పరీక్షించండి హక్కుల నినాదాలు వినిపిస్తే
వినండి
ఇక గుండెను తట్టండి
భయపడొద్దు గుండెను తెరవండి
అక్కడ లోతుల్లో పరాయిదైన సొంతచేలో
గింజ గింజ ఏరుకుంటున్న ఒక ముసలితల్లి
ఆ దృశ్యం అక్కడెందుకుందో ఆలోచించండి
మెదడు తంత్రుల్లో ప్రయాణించండి మరో లోకాన్ని
ఆవిష్కరించండి
రాత్రంతా అలా వీధుల్లో తిరుగుతున్నాను
తాత మాయమైన చోటికొచ్చి చూస్తే
అక్కడేదో చెమ్మ చిన్న నీటిచెలమ
అది తాతయ్య కన్నీరని గ్రహించాను వంగి పరీక్షగా
చూశాను
అందులో ఏడు సముద్రాలు కనిపించాయి
క్రమంగా అన్నీ ఒక్కటిగా మారాయి
ఆరు ఖండాలు కనిపించాయి అవీ
ఒకటయ్యాయి
నెర్రెలు విచ్చిన నేల కనిపించింది
దృశ్యాలు కదిలిపోతున్నాయి అదిగో ఎవరిదో
ఉరితాడు
మందు దక్కని చిన్నిపాపను మట్టిలో
దాస్తున్నారు
ఊరవతల రాళ్ళురప్పల్లో రక్తపుదేహం
శవం పక్కన ఒక తుపాకి, కొన్ని ఆకలికేకలు
అమ్మా అయ్యా నెత్తి కొట్టుకుంటున్నారు
శూన్యంలోంచి తాతయ్య తొంగి చూస్తూ భోరున
ఏడుస్తున్నాడు
నేనూ ఏడవసాగాను
కన్నీరులికి దృశ్యం కనుమరుగైంది
చివరికి నా కన్నీరు తిరుగుబాటయింది
కన్నీరే పోరాటమై మిగిలింది

(కాళోజి కోసం)

# అమరుడుకాళోజీ

(అపరాజిత) పి ధరణీశ్వరరావు

మంఖీ జీనా సీఖో అంటూనే
మరీపోయాడు అమరుడైనాడు
మనబజీమేషాద్ రాముడు
పదకొండు నవంబరున
కాళోజీ లోగిలినుండానాడు
కదలాడే నాగొడవ కాళోజీ
పదమూడు నవంబరున
నింగికెగిరాడు అకస్మాత్తుగా
నన్నూనిన్నూ మనందర్నీ
నిరాశకులోనుగా
ప్రజాకవీ, ప్రజాబంధూ
ఏకశిలభీష్మపితామహా
ఏక లవ్యేకాకిఐందంటూ
ఏడుస్తూ వెతుకులాటలే
ఎక్కడా నీచిరునామా? హంళక్కే

కాళోజీ లోగిలిలో చేరడమే
ఎంత పిన్నవారైనా ఏమైనా
వానిలో మనిషి వాసనరప్పిస్తూ
కవిత్వకర్షకకృషీవలుడై
చటుక్కున మొలకెత్తాలని
కాళోజీ శిష్యులిగా ఎదగడమనేదిహ
కరిమింగినవెలగలామాయం
మీ ఆటుపోట్ల చరిత
త్యాగాలు విజయాల
తీపి గుర్తులు సదా ఎదలో మెదిలేలా
కాళోజీ అందించునింగినుండి
మీ దీవెనలు ఏకశిల
ఏనాడూ ఏకాకి కాదంటూ
మీ స్మరణే మా దిన చర్యగా

# 'కాలోజీ'

ఎస్ రాజమోహన్

అతనొక అగ్నికణం
అన్యాయాన్ని ఎదిరించె వజ్రాయుధం

అతని వ్యక్తిత్వం హిమశిఖరం
మానవతా విలువల మణి గోపురం

అతని జీవితం
ప్రతిక్షణం ఆగని సమరం

అతను మానవతకు దర్పణం
ప్రజాస్వామ్యానికి నిదర్శనం

అతను మానవతా మూర్తి
కలం కవనాలకు స్ఫూర్తి

అతని మనసు
మమతల కడలి

అతని పిలుపు
హృదయాంతరాళాలకు మేలుకొలుపు

అతని పంతం
అన్యాయానికి అంతం

అతని వేదం
పీడిత విముక్తి నినాదం

# కాళన్న ధోక జేసిండు!

- అనిశెట్టి రజిత

పెద్దాయన పదునైన మాటలు రివ్వుకుంటనె
విస్రులు విసురుకుంటనే
ఎన్కకెన్కకు మర్లిపోయిండు
ఎవలకు జెప్పకుంటనె ఎల్లిపోయిండు
పెంచ్చీకటి అవతలికి వలసబోయిండు
మనల కండ్లు మూసుకొండని హుకుంజేసి
తాను కండ్లు పెరికిచ్చిండు
ఇగ నేనింత కంగాలాన్ని సూడలేనని
మొండికేసిపోయిండు
ఎంత ధోకా జేసిండు!

***

ఏనుగుల మీద్కి ఏట్లాడిండు
కంటకుల మీద కలెబడిండు
కలుతల్ని కడదాక మోసిండు
ప్రజలకోసం కల్లోలిత సవుంద్రమై అలలెత్తిండు
ప్రజకవిగా కీర్తిశేషుడయ్యిండు
"పుటక నీది సావు నీది
బతుకంతా దేశానిది' అని ఘోషించిండు
అయినా పెద్దాయన ఎంత
ధోకా జేసిండు!

***

రాజ్యం మీద్కి రగడాయించుకుండు
ఏలికలను ఏకులోలె ఏకిండు
జనం కోసం అల్లాడిండు
మంది బాగుకనె తన్లాడిండు
"ఏందిరా గిద"ని అల్లాకుల్లమయ్యిండు
సడక్ మీదికెక్కి లొల్లిలొల్లి జేసిండు
అయినా పెద్దాయన కంటి రెప్పపాటున్నె
తన 'గొడవ' లేపి
ధోకా జేసి పోయిండు!

***

ఎన్నడన్నా గాని ఎవలకు తలవంచలేదు
ఎస్సమెన్ అంటె మంది పడిండు
దేనికి ఎవలకు లొంగలేదు వంగలేదు
దేశ ప్రేమకు పానం పెట్టిండు
అన్నాయాలను ఎదిరించినోడేరా
నాకారాధ్యుడన్నడు
వీరులకు వీర తర్పనాలిచ్చిండు
తడి కన్నులతోటి అమరులకు సలామ్‌లు జెప్పిండు
నోరిప్ప మాట్లాడినోడె మనిషిరా పొమ్మన్నడు
గొర్రెలసొంటి ప్రజల గోసలు జూసి
కాలరుద్రుడయ్యిండు
కాళీ శక్తి పూనిని 'కాళన్న య్యిండు
కని ఎంత ధోక జేసిండు!

***

కాళన్న మాట్లాడే కవితయ్యిండు
మానవతకు నిలువెత్తు మనిషయ్యిండు
నడ్డిల్లేని వయసు సొద్దుగాల్లకు
ఎన్నెముకలు మొలిఎస్తదనుకుంటె
జాదూలెన్నో జేసి
జనం జండా లెగరేస్తదనుకుంటె
బస్తర్ అడవిలున్న తెలింగిణ తల్లి ముంగట
తెలంగాణ ససంత్రపు పండుగ జరిపిస్తదనుకుంటె
అదాటున అస్త్రాలప్పగించి మనకు
చాన దూరమెల్లి పొయ్యేనేంది
గింత ధోక జేసెనేంది!

***

పెద్దాయన చెట్టుకిందన నల్లంగ ఉన్నోల్లను
అయొన కొమ్మల మీదన కాపురముంటునోల్లను
బెదురులేపి చెల్లా చెదరు జేసిండు
గూడులేని పక్షులను జేసిండు

కొండంత అండనిచ్చిన నాయిన
మన చినబాపుకు పెదబాపుకు
ఏం చీదుజొచ్చిందో సర్రున
ఎంత కోపమచ్చిందో ఎంత మన్ను నొచ్చిందో
గీ స్వార్థజీవుల మీద
మూగ గొడ్లమీద ఏం యాష్టపుట్టిందో ?
దోడ్త్ పొండన్నడు!

***

బుజాల మీది బరువును కిందెత్తేసి
ఎన్కకెన్కకు పోయిండేంది
ప్రేమించిన ప్రాంతానంత
పచ్చ పచ్చగ చూడకుంటెనె
కన్నీళ్ళతో తడుపుకుంట
తనువు చాలించిండేంది
పండంటి మా పెద్దాయన

తన కండ్ల నిక్కద్దే కావలుంచి
కానరాని కారడివిలకు పయనమై పోయెనేంది?

***

అబ్బ! ఎంత ధోక జేసిండు
ఇగ అల్లి పోయిన్నని కండ్లు కప్పుకున్నడుగని
తెలంగాణ ఏమంటాందే ! అని
ప్రశ్నై బొబ్బబెడ్తున్నడేంది ?
మా కంట్లె చిత్రమై కదులుతున్నడేంది
తానె ప్రతి మీటింగై మోగుతున్నడేంది
కాళన్న! మా కండ్లల్ల వేలు పొడిసి
గుండెల్ల ఈటె గుచ్చి
మన్నును మర్మంగ కెలికి
అబ్బ! ఎంత పుండు జేసిండు!
ఎంత ధోక జేసిండు!

# వీరత్వానికి పురుడు పోసిన గుండె - కాళోజీ

- అన్వర్

సముద్రం ఆకాశం అరణ్యం అవని
వీటన్నింటిని ఒక దగ్గర ఒకచోట ఎప్పుడైనా
చూడగలమా?
కాళోజీ చుట్టుపక్కలే వుండేవి అవన్నీ!

సముద్రపు రహస్యాలు ఆకాశపు అవధులు
అరణ్యపు దారులు నేలసొరగులు అన్నీ కాళోజీకి
తెలుసు!
ఆవేశం ఆక్రోశం ఆవేదన నిరసన ధిక్కారం
తలవంచనితత్వంతో పాటు
అందర్నీ ప్రేమించడం కాళోజీకి తెలుసు!

ఈ మనుషులంతా మంచిగా వుంటే
నీతి న్యాయం సరిగ్గావుంటే
అక్రమాలు అన్యాయాలు అనలే లేకుండా
వుండివుంటే
ఈ రాజ్యం స్వరాజ్యమే అయ్యుంటే
కాళోజీ ఇన్నేళ్ళు బతికే వాడేకాదు
'నా గొడవ' పెట్టేటోడే కాదు

అనేక కష్టాలల్ల ముందుండక పొయ్యుంటే
రాజ్యాధికారాన్ని వినిపించక పొయ్యుంటే
తీవ్రవాద కార్యకలాపాలను
హెచ్చరించకపొయ్యుంటే
కాళోజీ ఇన్నేళ్ళు బతికేవాడే కాదు -

జీవితాలను ఉద్యమించిన కాళోజీకి
ఉద్యమించడమే జీవితం
అందుకే కాళోజీ ఎప్పటికి బతికేవుంటడు

గోడల మీద నినాదాలుగా
మన హృదయాల మీద ఆశయాలుగా

కాళోజి పోయాక
వీరుడి చేతిలోని జెండాకు ఇప్పుడు గద్దె కరువైంది
మన వంగిన శిరస్సులు
అవనతం చేసిన జాతీయ పతాకంలా వున్నాయి

మేరే దోస్తోఁ భాయోఁ సమస్త జనులారా
నాకు తెలిసే ఓ మాటడుగుతాను
సచ్చిన తర్వాత ఇంకా ఎందరు బతికుంటారు
సూర్యునిలాగా చంద్రునిలాగా
ఒక్క కాళోజి తప్ప!
వీరత్వానికి పురుడుపోసిన గుండె   కాళోజి

---

# కాళోజికి వందనాలు

- బోసిరి సాంబశివరావు

1 వందనాలు ప్రజాకవికి
వందనాలు నిజాయితికి
వందనాలు ధిక్కారం
వరియించిన కాళోజికి

కల్లా కపటం రెంటిని
ఒల్లనట్టి సుస్థిరునకు
ఉన్న మాట పలుకుటలో
చిన్నని పసి బాలకునకు
బెదిరి పోవకుటిలమతుల
ఎదురుకొనెడు శౌర్యమునకు
తులువల అవినీతి పరుల
తూలనాడు ధైర్యమునకు

వందనాలు ప్రజాకవికి
వందనాలు కాళోజికి

2 నిజమనియెడు నిష్ఠూరం
ప్రజలకు అందించువికి
చెడునడువడి సీనుపైకి
వెలుగును విరజిమ్ము రవికి
కుళ్ళిన సంఘం దుస్థితి
కళ్ళకు కట్టెడు అన్నకు
వేపకన్న చేదు నిజం
చూపకల్గు వేమన్నకు ॥వం॥

3 పోలీసులబందీయై
పారిపోవువీలున్నను
పారిపోక పోలీసుల
చేరి పిలుచు నిజాయితికి
నిరంకుశుని యెదురుకొని
నిలువ కల్గు స్థిర శక్తికి
ప్రజాస్వామ్యమునకంటిన
దుమ్ము దులుపు ఆసక్తికి ॥వం॥

4 బ్రతుకునీడ్వలేకజనం
పడెడుబాధ పడెడు గొడవ
తనబాధగ తన గొడవగ
తలచెడు నారాయణునకు
తిరోగ్ర మనమునుకాదని
తిట్టెడు 'రఘువీరునికి
ఎన్ని ఏండ్లు వచ్చినను
అన్న చాటు పోరనికి ॥వం॥

5 కుటిలనీతి యెండ గట్టు
గుండె ధైర్యమున్నోనికి
అన్నచేత మంకు మంగు
రన్న బిరుదు గొన్నోనికి
అక్రమాల ఎదురుకొనెడు
అగ్గివంటి కోపానికి

కడుబీదలు తలచుకొనెడు
కరుణామయ రూపానికి ॥వం॥

6 బడిపలుకుల కన్నమిన్న
పలుకు బడులు మిన్నయన్న
అనుసరించ దగిన ఋషికి
అలసట యెరుగని మనసుకి
మన బాసను మనయాసను
మన్నించిన గట్టి కృషికి
మానవతను ప్రేమించిన
మాననీయుడగు మనిషికి ॥వం॥

7 పద్మ విభూషణ బిరుదము
ప్రజలు మెచ్చుకొనిన కవికి
పద్మ విభూషణ బిరుదము
నిజం నిప్పు చెరుగు కవికి
బిరుదిచ్చిన 'హుకూమతునె'
నిలదీసిన నిజాయితికి
అరుదగు ఈ సత్యానికి
అపూర్వమగు విషయానికి ॥వం॥

8 కే యు ఒసగినయట్టి
గౌరవ మగు బిరుదానికి
కడలి అలలవోలె జనుల
కదిలించెడు కవితలకు
మరణించిన పిదప కూడ
జనుల కొరకు కనుల నొసగి
తనువును అర్పణ జేసిన
ఘనతరమగుత్యాగానికి

వందనాలు ప్రజాకవికి
వందనాలు నిజాయితికి
వందనాలు కారుణ్యం
వర్షించిన కాళోజికి

# కాళోజీ అమరవాణికి అక్షర నివాళి

- పొర్ల వెంకటేశ్వర్లు

ఒక నాటి గాంధీజి నిన్న మొన్నటి జయప్రకాశ్ ఈనాటి మన కాళోజ వ్యక్తులు కారు ఒకమహాశక్తికి ప్రతినిధులు తరం తరం నిరంతరంగా ఊళ్ళను కలుపుకుంటూ సాగిపోయే వాగు లాగ ఎదలను తడిపే వాగుడు ఇది కాదు!కాదు! ఒక నిత్య నూతన అక్షర స్రవంతి

పదమునుండి పరమ
పదసోపానానికి
చేరుకున్న మన
కాళోజి సోదరులు
అపూర్వ సహోదరులు!
ఉదయ భానుడు ఒకరైతే
సాయంకాలం శోభ ఇంకొకరు!
ఒకరు మధ్యాహ్న మార్తాండుడు
ఇంకొకరు పున్నమినాటి పూర్ణచంద్రుడు
'చిన్న' భూలోక సంచారి
అన్న అంతరిక్ష విహారి!
ఒకరిది విమర్శ
ఇంకొకరిది పరామర్శ!
ఒకరిది వచనం
ఇంకొకరిది ప్రవచనం!
ఒకరు ఏకవచనం
ఇంకొకరు బహువచనం!
స్పందనలో వారి గొంతు
మూగబోయి నప్పుడు
కళ్ళు రెండే మేమున్నామంటూ
కన్నీరు కారుస్తాయి
అందుకే వారు నవ్వినా ఏడ్చినా
కన్నీళ్లే వస్తాయి
గొడవలు ఎందరివో ఐన
గొడుగు మాత్రం తనదే
దానికి మరోపేరు 'నాగొడవ!
జీవి పూపుగా చావు తావిగా
బ్రతుకంతా పరిమళించిన' చరితార్థులు!
చావు బ్రతుకుల అంతు
చూసిన గొప్ప దార్శనికులు!
కన్నీట మునిగి తేలిన స్నాతలు
కడిగిన ముత్యాలు!
అర్ద్రతతో తడిచిన వారి చూపులు
నింగిలోన చుక్కలు!
ఒక చేత తత్వాన్ని
ఇంకొక చేత కవిత్వాన్ని
పండించుకున్న ధన్య జీవులు
చిరంజీవులు!
మన కాళోజి సోదరులకు
సమకాలీనులం మనం!
అని గర్వంగా చెప్పగలిగే
ఒకే ఒకమాట
మన కాళోజి సోదరులు
అపూర్వ సహోదరులు!!

# సతతం వర్షించే సమత

- వేణూ సంకోజు

హింసను నిలదీసే ప్రశ్న
తిరుగుబాటుగానే జవాబు
పేదలతో మమేకమైపోయే పసి(డి) తనం
సకలవిధ దు ఖ సమయాలలో తడిసే కన్నీటి ఒడివాన
రాసినా మాట్లాడినా కవితావేశమే
తనువంతా విప్లవాభినివేశయే
బతుకంతా పోరుబాటే యోధులతో సహవాసమే
ఆర్తులకై వకాల్తా పుచ్చుకునే నిసలైన సన్నివేశమే
తమ్ముళ్లకూ అన్న - అన్నలకూ అన్న కాళన్న
నిన్నా ఇవాళా రేపూ అచ్చమైన స్ఫూర్తి కాళన్న
ఒక నెరూడా ఒక జిబ్రాన్ వొక నజ్రుల్ -
ఒక గాంధీ ఒక మండేలా ఒక అలెండీ
ఒక కాస్ట్రో ఒక హొచిమిన్ అయితేచేవాడు
ప్రభంజనంలా వీచేవాడు
దౌత్యం మీద క్రౌర్యం మీద పడి దూకేవాడు
వీరుడుగా పోరాడుతూ విక్రమించే వాడు

వేయి చంద్రుళ్లనిట్టే వేడెక్కించి
వేయి సూర్యుళ్ల తేజాన్ని తాకేవాడు
ఉద్యమాల నెలబాలుల్ని మన పూర్వకంగా సాకేవాడు
అధర్మ నిధనం ఒక్కటే అనివార్యమని నమ్మేవాడు
తరం వెంట తరాన్ని తనతో చాటి నడిపేవాడు
ముళ్లమీదైనా సరే విసురుగా మసలేవాడు
మట్టిని నమ్మినవారికి
సమతకై ముట్టడి చేస మట్టుబడటానికైనా
సిద్ధపడే వారికి మధుర స్వప్నం
ధూర్తులకు దు ఖస్వప్నమయ్యేవాడు
మార్పుకు పర్యాయపదమై నిలిచేవాడు
తూర్పును సంకేత్తించే అరుణారుణ
పతాకమై తోచేవాడు
మనుషులలో మనీష అయిన మిత్రుదాతడు
సతతం వర్షించే సమత అతడు

# మరో పోతన కాళోజీ

- జొలురు గౌరీశంకర్

చూపుల్ని నిప్పులు చేసి
చైతన్యాని తడిమిన
జనం పాట వేమనబాట కాళోజీ
యాసను భాషచేస
మాండలీకాన్ని తొడుక్కొని
తనువంతా తెలంగాణాగా
తపించిన నీ అనువుపదాలే మా పదకోశం

ఎదురుకాల్పులన్నీ ఏకపక్షకాల్పులేయని
గుక్కబట్టిన ఎల్లగాడు కాళోజీ
సత్తువకు నెత్తురెక్కించి
చర్చలకు నెత్తురు రాయొద్దన్న అరుపు కాళోజీ

అలిసిన గౌతమబుద్ధుడు
అంపశయ్యనుంచి లేసి
తన భోదనలను తానే విన్నట్లు
పొక్కిలి ని చూసి నేలను ముద్దాడాడు
వేయిభావాలు వికసించినట్లు చూసిన నీ సూనుకు
పూసిన పువ్వులం
తల్లిభాష 'యాస ను అందరికీ
పంచిన ప్రపంచం చేతులు కాళోజీ
సంకెళ్ళ స్వరం కాళోజీ

తెలంగాణ అక్షరమాల కాళోజీ
అసిలిపోని అయన నడకే తెలంగాణ
తన 'యాస' ను మాటంటే
నిప్పులవానే
జీవితమంతా పోతన వ్యవసాయమే

కాళోజీ అను నది'
లోతుతెలియని సాహిత్యనిధి
ఎప్పటినుంచో మా చిరునామ కాళోజీ
ఇవన్నీ 'నాగొడవ' ను ధరించిన ఆయుధాలు
పౌరహక్కులకు రెక్కలైన సంచార జీవాయన
అమ్మపలుకుల పాఠశాల కాళోజీ
ఆయన జీవభాష నిఘంటువు
ఎవరు పిలిచినా పలికే పిల్లగాడు కాళోజీ
నెత్తురవుతున్న బుల్లెట్లను
ఎట్నుంచి చూసినా భోరుమన్న కళ్ళవి
మానవత్వవాదుల పిచ్చుక గూళ్ళగది కాళోజీ

వయసు మీదపడ్డ వినకుండా
మందికోసం తిరగబడ్డవు సూడన్నా
దాని మేం మా కంటిపాప సేస్కుంటం
ఇంక నీగొడవే-
మా గొడవ

# కన్నీటి సెలిమె

- శైదల అంజయ్య

ఒక మంచు శిఖరం విరిగి పడ్డట్టు
ఒక అగ్ని పర్వతం పేలిపోయినట్టు
మమ్ములను మేం నమ్మనట్లు
గడుక నీళ్లు గలుపుక తాగే
మా పంటి కింద రాయి వడ్డట్టు
చెట్టు చెట్టుకు ఏడువుండ్రని
పూటకు పుట్టెడు దు ఖాన్నిచ్చి
మా గొడవను మాకిడిసిపెట్టి
మాకు దైర్నాన్నిచ్చే తూర్పుదిక్కు ఖాళీఅయింది
మా గుండెలకు కోతనిచ్చి
ఒక జొన్నకంకి తలవాల్చి నడిచి వెళుతున్నది
కోటి రతనాల కలలను జెండాలెత్తిన ఒక కలం
మమ్ముల కాటగలిపి వెళుతున్నది
ఎండల నిలవడ్డోన్ని నీడకు పిలుసుకున్నోడు
తెలతెల్లని ఎన్నీల మునినవ్వుల వాడు
మా స్వతంత్ర జెండానెగరేస్తాదనుకున్న ఋషి
మా భూమి కోసం తవుసువట్టిన ముని
మమ్ములనిడిసి అడివికెళ్ళి పోయిండు
అలెగ్జాండర్ చనిపోంగ తనరెండు ఖాళీచేతులను
శవ పేటికలోంచి పైకెత్తి ఉంచుమన్నట్టు
ఉత్తచేతులతో మా సాఫల్యాన్ని కాకుండా
స్వప్నాన్ని మోసుకెళుతున్నావు

ఇపుడు తెలంగాణా పల్లెలు పాటలై దు ఖిస్తున్నయ్
'బంగారి పొంటీను జేబుల్లో జేబుల్లో కాళన్న జేబుల్లో
పైడీ బెత్తాపు కట్టె పక్కల్లో పక్కల్లో కాళన్న పక్కల్లో
ఎండీ బెత్తాపు కట్టె ఎన్నుల్లో ఎన్నుల్లో కాళన్న ఎన్నుల్లో
ఏడా జూసీన లేడె ఎలదరియ ఎలదరియ కాళన్న ఎలదరియ
ఎక్కడెళ్లి పాయెనమ్మ కాళన్న మమ్ములెట్ల జేసీ పాయెనమ్మ కాళన్న
అన్నా! ఎడ తెగని దు ఖం మాది
నిన్నెడ బాయని ఏడుపు మాది
ఉర్లువడి తిరిగిరాని తల్లికై చూసే
గువ్వ పిల్లల ఎదురు సూపు మాది
చావు వలలో చిక్కిన తల్లిని చూసి
తల్లడిల్లే సింహం పిల్లల సన్నాహం మాది!
నీ బంగారి అడుగులు
మా వాకిళ్ల నుంచి నడిచి వెళుతున్నట్టే వుంది
నీ బెదురులేని గొంతు
ఇంకా మాతోని మాట్లాడుతున్నట్టే వుంది
మాకు వెన్నుదన్నునిచ్చే
నీ చేతులింకా మ భుజాల మీద వున్నట్టే వుంది

# యశోభూషణుడు

- డా॥ బన్న అయిలయ్య

ఉద్యమ ఒడ్డుల్ని
నదిలా ఒరుసుకు పారి పారి
తెలంగాణ భూమినంత
ద్రవీభూతం చేసి
సముద్రాన్ని తనవంకకే లాక్కొని
చెమ్మ పుష్పమైనాడు

నిలువెత్తు మూర్తి బక్క పలచటిఒళ్ళు
ఎక్స్‌రే కళ్ళు
ఒంటి ఊపిరితిత్తి కొలిమితో
నిప్పురవ్వల జడులు వెదజల్లి
నిజాం చీకటి రాజ్యంలో నిలువెత్తుచెమ్మెయ్
గ్రామగ్రామానికొక గ్రంథాలయమైన
ఈ వెలుగుజాడ ఎక్కడిది?

గణేష్ ఉత్సవాల్లో గజ్జకట్టినాట్యమాడి
ఆర్యసమాజ భజనల్లో ఆధ్యాత్మికతను బోధించి
తెలంగాణలో తెలుగువాడు
తౌరక్యాంధ్రుడౌతున్నాడని రౌద్రుడైన
తెలంగాణ సాంస్కృతిక గిడ్డంగి

కత్తులు మెరిసినచోట
కవిత్వమై గొడవచేసి
రక్తం పారిన కాడా శవానికి జీవం పోస
ఒకనాటి నిశీథంలో విస్ఫులింగాలు ఊదినాడు

ముసలినక్క, నిజాంకు నీలుగుడెక్కువని
రజాకార్‌మూన్‌లకు మామయన్న చరిత్రరలో స్థానం
లేదంటూ
ప్రజాసింహాల ముందు
నక్కలన్నీ తోక ముడిచిన సత్యం చాటినవాడు

తొలినాటి తెలంగాణ ఉద్యమ కేకతడు
విద్యార్థి యువకిశోరమై

నిద్రాణమైన తెలంగాణాను మేల్కొల్పి
నిజాం మత్తగజంను గడగడలాడించి
అస్మదాది జనావళికి దేవాలయమ్మయ్

పాల్కురికి పోతన్న వేమన్న వారసత్వాలకు
బీరపూల పందిరేసి
బడిచదువుల భాషకు స్వస్తి చెప్పి
పలుకుబళ్ళ భాషలోనే తీయదనం ఉందంటూ
లొల్లిలొల్లి చేసన వాడు

పత్తికాయ దు ఖిస్తే విలవిల్లాడి
దేహం పత్తికాయలా పేలితే
వజ్రకంఠమెత్తి
దూసుకొచ్చిన బుల్లెట్‌ని చిరునామా ఏదైతేనేం
మనిష ప్రాణం తీసే హక్కెవడిచ్చాడని
పరిమితులు లేని ప్రశ్నల కొడవళ్ళువిసరి
ప్రజాస్వామ్యానికి నిలువెత్తు నిగా'లా నిలిచినవాడు

అతడులేని ఓరుగల్లు
ఆకాశంలేని జల్లు
అతడు లేని తెలంగాణ
తొడిమ ఊడిన పువ్వు
ఆమనిషి జాడతెలియక
సహస్రదేవాలయంలోని
స్తంభాలన్నీ మూగబోయినయ్

కదలక కూర్చున్న నంది
కన్నుల నీరు కారుస్తుంటే
ఓరుగల్లు కోటలోని
రాతిసుమాలు [illegible]
కుష్‌హహల్ దిగులుగా [illegible]
ఆ మనిష ప్రజాకవి కాళన్న
పద్మవిభూషణ్ నారాయణ రావు

# ప్రజాకవి జోహార్!

- కాంచనపల్లి రాజేందర్‌రాజు

అవినీతిమయమై
భవిష్యత్తు అంధకారం చేస్తున్న
అధికారానికి దడపుట్టించిన
నీ గుండె ధైర్యానికి జోహార్ జోహార్

పాపపంకిలమైన ప్రపంచాన్ని
ప్రక్షాళన చేసిన
కుండబద్దలు కొట్టినట్టుండే
నీ విశిష్ట ధోరణికి జోహార్ జోహార్

పని మనిషి నుండి ప్రధానమంత్రి వరకు
శత్రువు నుండి మిత్రుని వరకు

సమదృష్టితో ఆదరించిన
నీదైన వ్యక్తిత్వానికి జోహార్ జోహార్

నువ్వున్నప్పుడు నీకళ్ళు
నీలాల కుహూలు
పోయాక మా గుండెలు
కన్నీటి చెలిమలు

ప్రేమమూర్తి
మరణం తర్వాత
మరో జీవితం ఉందని
నిరూపించిన
మహా మనిషి జోహార్ జోహార్

కాళోజీ కోసం

ఆలోచన నీది ఆవేదన నీది
అడుగు వేసింది దేశం కోసం
ఆక్రోశం నీది - ఆవేశం నీది
పోరు చేసింది న్యాయం కోసం
వేదన నీది యాతన నీది
వేసారింది వేకువ కోసం

కల నీది కన్నీరు నీది
కవితయ్యింది మానవత కోసం
నిజం నీది నిజాయితీ ఇజం నీది
నిలదీసింది జాతి కోసం
ఎదురీత నీది ఎదకోత నీది
ఎదురించింది నవ సమాజం కోసం

విశ్వకవికి నివాళి

ఇప్పుడు
అక్షరాలు రాలటం లేదు
అశ్రువులు రాలుతున్నాయి
పోయింది నువ్వో
మా నవ్వో అర్థం కావటం లేదు

పిల్లల్లో పిల్లాడివై
నువ్వాడిన ఆటలు గుర్తున్నయ్
ఎంతటి వారినైనా శాసించిన
నీ చూపులు గుర్తున్నయ్

నిరంకుశ మూడు సింహాల ఖాకీ క్యాపుల్ని
కనిపించని నాలుగో సింహానివై
నువ్వు నిలదీసిన పంచాయితీ గుర్తుంది
ఓటు వేస్తే కాల్చివేస్తామన్న అన్నల నెదిరించి
మొదటి ఓటు నువ్వే వేసి

'నన్ను కాల్చండంటూ
తుపాకీ గుండుకు భయపడని
నీ గుండె ధైర్యం గుర్తుంది

నాణానికి బొమ్మాబొరుసు మల్లే
నువ్వు అడవిని ధిక్కరించావ్
రాజ్యాన్ని ఎదిరించావ్
ఆవేశంగా ఎదిరించటం ఎంతో
ఆప్యాయంగా ఆదరించటమూ అంతే
చమటలు పట్టించటం ఎంతో
చమత్కృతమూ అంతే
ఖచ్చితంగా ఇప్పుడు పోయింది నువ్వు కాదు
మా భరోసా
మా వెన్నుముక

# అంజలీ - గీతాంజలీ

- కానూరి వెంకటేశ్వరావు

అంజలీ గీతాంజలీ
అరుణారుణ బాష్పాంజలీ

తెలుగు వెలుగుల కాళోజీ కవి
విలువలు తెలిసిన తెలంగాణ కవి
నీ తెలుగు పలుకు మాండలికోహల
నీసాహితిసమ రోజ్వల జ్వాల ॥అంజలీ॥

జాతీయోధ్యమ సిద్ధార్థి
జనసంస్కృతి చైతన్య రథి
ప్రలోభాలకే లొంగని నిధి
పదలవులనాశించని ప్రజ్ఞానిధి ॥అంజలీ॥

క్రోధం వస్తే హిరణ్యాక్షునివి
మోదంవస్తే హిమాంశురాయివి
నీపసినవ్వులు మల్లెలమాలలు
నీతిట్లన్నీ బెమ్మదీవెనలు ॥అంజలీ॥

క్రోధం ఖేదం హసనం - హాసం
ఏవివచ్చినా బావోద్వేశం
ఆగదుఅశ్రు ధారాపాతం
అల్పసంతోషీ అరుదైన మహామనిషీ ॥అంజలీ॥

తెలుగు వెలుగుల - కాళోజీ
తెలంగాణకే తాతాజీ
మరువలేము నీ నామస్మరణం
మాజాతికదే గర్వకారణం ॥అంజలీ॥

# మా కాళోజీ

-డాక్టర్ కూరెళ్ళ

మానవ హక్కుల కోసం తనను
మనుగడనంతా ధారపోసిన
"మానవతామూర్తి' మా కాళోజీ
ప్రత్యేక తెలంగాణా కోసం
నిత్యం పోరాటం నలిపిన "సత్యవాది మా కాళోజీ
అచ్ఛమైన తెలుగు కోసం
అహర్నిశలు ఆరాటపడిన
।"స్వచ్ఛమైన ప్రజాకవి" మా కాళోజీ
శోకతప్త ప్రజానీకం కోసం
లోకం పట్ల కన్నీరు కార్చిన
'కరుణ రసార్ద్రమూర్తి" మా కాళోజీ
న్యాయం కోసం
ఏ అధినాయకునైనా ఎదిరించిన
'సాహసమూర్తి' మా కాళోజీ

మా కాళోజీ
కలమెత్తితే చాలు
మా గొడవంతా వినిపిస్తుంది
మా కాళోజీ
గళమెత్తితచే చాలు
తెలంగాణా అంతా గర్జిస్తుంది
మా కాళోజీ అంటే
మడికొండ,
హన్మకొండ కాదు
మా కాళోజీ అంటే
ముక్కోటి తెలుగు వాళ్ళు
మొక్కుకునే దైవం
ఆ పవిత్రమూర్తికి
మా నృత్యంజలి
ఆ అమృతమూర్తికి
మా భక్త్యంజలి

# గళం విప్పిన తెలంగాణం కాళోజీ కవితా సమరం

డా॥ ఇందుర్తి ప్రభాకర రావు

కాళన్నకు

87 వసంతాలు నిండిన వయస్సు

77 వసంతాలప్రజా కవి చరిత్రలో చెదరని ఓజస్సు

67 వసంతాల కవితా యశస్సు
27వ వసంతం నుంచే నిజాం నిరంకుశాన్నడ్డుకున్న తేజస్సు
17వసంతం నుంచే స్వేచ్ఛా భావాల తపస్సు
కాళోజీ నాగొడవ కావ్యాలు
అరున్నర దశాబ్దాల ఆధునిక సమాజంలో
సగటు మనిషి మనుగడల గోడు
సత్యశీల సమసమాజ వికటనల గోడు
పాలకుల నిరంకుశధోరణుల గోడు
పాలితుల వ్యధాభరితహృదయ స్పందనల గోడు
అంతరిస్తున్న మానవ విలువల విధి విధానాల గోడు
ఆస్తుల పెంపకాల లక్ష్య సాధానాప్రతీకల గోడు

రాజ్యాంగం విచ్చుకత్తులు విప్పినప్పటి గోడు
రాజ్యం భోజ్యమై విచ్చలవిడితనం
పురులువిప్పినప్పటి గోడు
ప్రహలాదుడు ప్రబంధాలవీడి నమకాల
సమీకరణమైనప్పటి గోడు
ప్రహ్లాద చరిత్ర అధునిక అధికార
అహ్లాదకదంబమైనప్పటి గోడు
పాలకులపై ప్రజల ఓటు తూటాలంటున్న
మేధావి గోడు
ప్రజాసామ్యంపై వేటుకు తూటాల్లో వోటంటున్న
సాదాసీదా జనం గోడు
ఓట్లు కోట్లతో జతగడుతున్న గోడు
ఝట్లు ఝట్లు ముడివేసే కులం, మతం
పచ్చదన, వెచ్చదనం గోడు

భాష యాస భేషజాల విద్వేషవిద్రోహం గోడు

87 జన్మదినం సందర్భంగా వ్రాసిక కవిత
కాళోజి కాళన్న భావావేశపు రూపాల గోడు
విడివిడిగా నుడువలేని వేరులేని గూడు
కాళన్న(లో) అన్న భావితరాలకు అదర్శం
కాళన్న (లో) కాళుడు బవ్యతరం విస్ఫోటం
కాలాతీతపు వ్యక్తుల్లో కాళోజీ దొక కోవ
కాలం కొలమానం కుదరని కవితా సృజనే కంకాళుడి దోవ

ఏ యిజ చట్రంలో ఇముడని కవి కాళోజీ
ఏ నిజ చట్టం తొట్రుపాటు సహించని సిటీజన్ కాళన్న
ఏ పద సన్నిధిలేని, ఆ పన్నుని పెన్నిధికి జడువని వాడులెవరు
ఆ పద్మవిభూషణ గ్రహీతకు నూటినుడులు నూరిపోయు సాహసులెవ్వరు

అందుకే,
87 వసంతాలై కవికాళోజీ చిరుజవ్వనుడే
ఇంకెన్ని వసంతాలైనా నా గొడవ కవితాఝరి
చిగురించే చిన్నారే
'పాపీ చరంజీవి' అన్న వారు వ్యంగ్యోక్తుల
ఆశీ పలధాతలు
శతమానం శతాయుష్పనడానికి వయో సంకట
శ్రేయోకాములు
అందుకే ఈ సభను ఆశీస్పందచేయమంటాను
కాళన్నకు శతమానంభవతి శతాయుష్మ కలగాలని
ఆత్మీయంగా కోరతాను 'నాగొడవ' కావ్యానికి
పూర్ణాయుష్షుండాలని
చిరంజీవ చిరాయు కవి కాళోజీ
శతాయుష్మాన్ భవ తెలంగాణ కలం గళం కవి
కాళోజి

# Kaloji - My Guru

*Keshav Rao Jadhav*

To write about Kaloji is like trying to imprison a river in a bottle However a little river water can be put in to a bottle

Kaloji was above all a rebel a rebellious poet, a rebel in politics, a rebel against all humbug

We can not say that Kaloji took the idea of citizens' rights from the West But he always spoke up for the helpless citizen Similarly was his emphasis on punctuality He did not ever tolerate the Indian concept of "timeless" time Unfortunately, however, most of his admirers and followers do not care either about citizens' rights or punctuality

His uncompromising fight for Telangana was an offshoot of his concern for the citizen Are not Telengana people citizens of this country, he asked?

He was a totally fearless person not afraid either of authorities or those who wield the gun in the fight against oppression For him the pen was indeed mightier than the sword

The Telangana dialect suited him admirably The language is simple, direct and democratic Both for the big and small people Telangana Telugu has the same expression So Kaloji addressed the powerful and eminent Andhras in the same manner as he addressed the common man of Telangana, to the great discomfort and chagrin of the mighty He spoke to the Prime Minister in the same manner as to the Prime Minister's chauffer

There are thousands of incidents and anecdotes about Kaloji But I will relate only one A few organizations in Hyderabad had given a call for Bandh against the antireservation movement in Andhra Pradesh But they did nothing to implement their call A day before we had organised a meeting of activists in Chudibazar to enforece the Bandh Call atleast in the Old City On the Bandh Day at about 10 a m I went to see Kaloji who was then staying in Hanuman Tekdi and told him about the inactivity of the bandh supporters in the areas north of Musi His instant reaction was, "then why are we sitting here, let's go " I asked him, "where"? "To enforce the bandh in the new city, where else?"

I said, "But Kaloji we are only two What can we do?" But he said, "Come on let's go Don't sit here complaining about others Let us do our duty " I was uncertain but there was no way one could argue with Kaloji when he was in such a mood So we went to Abids and requested some shop keepers to close down Some of them obliged though they were rather curious at the sight of two non-leader like people asking them to close down the shops In the meantime a small group of students appeared from somewhere and started shouting slogans in support of the Bandh Soon shopkeepers started pulling down shutters

That was Kaloji

# Great Dissenter

*K G Kannabiran*

'And if I am given this world with its injustices, it is not that I may contemplate them coldly, but that I might animate them with my indignation, that I might disclose them and create them with their nature as injustices, that is abuses to be suppressed" These words of Sartre aptly describe Kaloji s unending indignation all through his life His anger was against injustices in society and against authority, which does not provide redress, and whose imperviousness, which ignores the existence of these injustices He chose for himself the role of a campaigner against injustices and his constituency was obviously the people The injustices he perceived were written down as aphorisms, in not very complicated verse from, he avoided obscure language, which needed a commentary, and a glossary He understood that his freedom was linked to the freedom of the people and in this effor effective communication was the key He was a great communicator He did not speak to entertain his audience He educated them without in the least pontificating to captive audience He conversed with them in the language they understood and put them in the form with which they are familiar

Kaloji, being a campaigner, had a common sense way of arguing the existence of a common denominator among them and this enabled him to steer clear of party and party politics He was one social thinker who never canvassed for or promoted a particular point of view Some, therefore, called him a non conformist This loaded expression used by established church against persons who opposed its hegemonic claims stood transferred to modern political vocabulary It is almost like calling a communist who does not tow the party line as revisionist Such expressions are anathema to Kaloji for he believed in the existence of plurality of views Eliminations of non conforming persons is fascism, he said He evolved a political vocabulary, which was acceptable to almost all political parties, and thinkers who believed in democracy in its finest sense

He campaigned against Indira Gandhi's Emergency He was against liquidating 'extremist' political dissent in the name of encounters His campaign against these encounters began with his becoming a member of Tarkunde Committee appointed by J P for enquiring into these staged encounters during the Emergency The enquiries by the Tarkunde Committee led to the appointment of Justice Bharghava, a retired judge of the Supreme Court, to inquire into these encounter deaths It was during the period of these enquires that he led the campaign against these encounters for he alone was acceptable to all the political parties excepting the Congress whose government was in the dock before Justice Bharghava then This campaign could not be sustained because it later was seen as a Naxalite problem and was not perceived as a democratic and human rights issue But for Kaloji it always remained a human rights issue

He was an unrelenting protagonist of a separate Telengana state When this issue was recently resurrected he extended his unreserved support He took up harsh positions against colonizers from Andhra and their aggressive appropriation of resources and job opportunities, the systematic cultural linguistic denigration of the Telengana dialect and their politics of water distribution and management His position is not to be viewed from a parochial angle When this half a century of collective injustice went unnoticed and unrectified a demand for a separate state is a logical consequence When this demand was suppressed earlier once, the leadership bought over and when marginal reforms and even amendment to the Constitution failed to remedy iniquitous political and administrative policies and practices, there was a revival of the demand for a separate Telengana Kaloji took an unequivocal and uncompromising stand Kaloji never compromised with political skullduggery and for him the Telengana people were deprived of the use of their resources and were subjected to injustices and iniquities from 1956

The last act of his was to preside over the peace process between the Naxalites and the state government He willingly presided over this Committee for he found the distorted importance given to violence by both the State and the CPI(ML)PW very disturbing and of making innocent people the targets of violence As a democrat he was for a violence free society Undoubtedly he was for social transformation but was never for long drawn out violent engagement which put the right to life of large sections of people in jeopardy

All his life he talked about justice in all its facets, he was angry against abuse and misuse of authority Gandhiji influenced him in large areas of activity He believed in non violence He never equated this to mere half hearted articulation of protest in a ritualistic manner Very often he used to say that violence is better than cowardice This courage had its origin in his belief that it is the right of a person as a citizen to fight and to overthrow oppressive regimes Perhaps he alone among his contemporaries noticed the transition of a person from the status of a subject to that of a citizen The citizen's power to change governments by democratic process if possible or violent overthrow should it become necessary formed the kernel of his thought The quality of life and the style of living such a life called for absence of hypocrisy and an abundance of credibility and this he had He is a person who was able to correlate means and ends and therefore the expressions strategy and tactic will not be found in his political lexicon This was responsible for his integrity and unswerving commitment to justice, fairness and equality

In a country beset with intractable injustices and a continuous arbitrary rule he was for seven decades a dissenter with a chorus of support from different sections of people and political groups at various points of time His death brought all these various groups together to hail him as a great dissenter whom we should all emulate Again it was only Kaloji who could do that

# Kaloji : Not a Man of the Past but Our Future

*Gujja Bhiksham*

Knowing Kaloji is one of the greatest experiences of my life My interaction with him over the last two decades was almost regular I would meet and spend some time with him atleast twice every year

Iam sure many will write about Kaloji's greatness and his overall contribution to society I wish to restrict myself basically to a few personal dimensions

I always felt that my relationship with Kaloji was a special one However, over time, I realized that anyone who interacted with him would have this feeling of being special in some sense or the other Kaloji's approach to fellow human beings was such that one ended up feeling the some way as I did over all these years

He was a remarkably wonderful human being with a child like curiosity in every thing that he came across

I would like to recall a few of my normal interactions with Kaloji which I think are of immense value to me now and will continue to be so in future as well

I would like to think that Kaloji was a free thinker in the truest sense of the word Just as he had no baggage to carry along, so did he not have any fear nor any hangup of anything in life He was one person who had no fear of death

I recall my last meeting with him in the first week of last october I found him to be the same as he was when I first met him almost two decades ago This particular encounter is etched in my memory I remember entering Prabhaker's house to find Kaloji sitting at the dining table and being fed by Ajitha He was facing away from me as I declared my presence by saying "How are you"? followed by "Did you recognize me?" The man's reaction was instant and sharp "I have not reached that stage as yet" When I interjected by saying" That is a long way up! Atleast another decade!", his reply again was chaceteristic of his personality " Why set a time limit?"

The subtle but the clear and satirical remark was not lost on me Kaloji was one person who never lost an opportunity to twist the other man's words into a humourous, gentle, at times pungent, remark or repartee and imbue it with deep meaning that can only come from a profound understanding of life He always looked at life as a vibrant, productive and a meaningful process and not as a particular length of time to keep oneself alive

Normality was the hallmark of his everyday life He kept himself above the trappings most celebrities owned up to keep their image afloating He had no image problems He readily accompanied me and my friends into a palmyra groove and

happily drank toddy This was immediately after he was told about him being choosen for Padma Vibhushan, the secord highest civilian award in the country I recollect this incident to enphasize the man's free-going nature that brooked no artificial hangups He always advocated that one should do what one felt as proper regardless of what others might think or say His life is a beautiful example of what simplicity, clarity, unpretentiousness was all about There are many mighty and famous who dare not do things in public for fear of losing their 'good' name Kaloji's life, if I may say so, was truly an open book It is this openness coupled with his disarming friendly disposition that have made us all feel that it is possible to be like him, which we could not be all over life

He also had this great ability to narrate several stories and connect them to drive home the point he chose to make His simple narrations, in the beginning, made us feel that he was indulging in some meaningless conversation It is only towards the end when he connected them to spellout the great underlying meaning that we were made to realize what he was trying to drive at all the while We could not but exclaim, "How did we miss such a simple thing?"

Every one who was a listener was invariably drawn into discussion with him One was always tempted in his presence, to narrate a story of his own and was left with a feeling of elation on being approvingly given a hearing by Kaloji

Kaloji rarely regretted anything that he did- big or small - in his life I had the great fortune of taking a video interview of this remarkable man, lasting a few hours I was more than curious to record the personal side of his life, his familial relations, his failures, his disappointments, his frustrations etc for in India, the personal aspects of the famous are rarely documented or recorded and such an exercise is considered impolite to say the least Kaloji was more than candid I sealed the tape and tried not to open it till the news of his death reached me in faraway Switzerland and I could not contain myself from seing this man on my TV screen and hear him speak

In this priceless possession of mine, perhaps my friend's too, Kaloji had recalled several incidents, personal details etc In one such incident he narrated, he recollected the times when he was facing economic hardships He also remembered his first earnings of about Rs 200/ some fifty years ago, which he handedover to his brother late Rameswar Rao Rukmini, Kaloji's wife, was not happy She had expected him to give her atleast 20 rupees for personal use, mostly for the symbolic value it would have conferred on her in the status of she being his wife Kaloji dealt with that predicament in style and had no regrets about it

Kaloji also chose a life-style befitting his social commitments He never missed an opportunity to mention about his brother's role in relieving him from the day-to day problems of running a house

On hind sight, I can say that I observed Kaloji to explore myself I was aware of the fact that we belonged to different generations and my ambitions and priorities in life were in variance with his He was not some one who has done something worthwhile a long time ago For me, he was someone who made a lot of sense today, to my life and the lives of every one who was acquinted with him

For him, to be an ardent fan of the game of cricket was not inconsistent with his opposition to the colonial rule, nor was his appreciation of certain religious celebrations a negation of his firm belief in secularism He had no moral yardstick to measure the present generation His values were not the measuring rod for judging others values

For me Kaloji's influence pervades through seven decades of this region's history He was not just a poet, a freedom fighter a human rights activist, he was, in my view, a great human being It would be fallacious to relegate him to the past He is, and shall remain, our future Many a young person will continue to be influenced and inspired by his personality and ideas

Kaloji will be a major influence on my future thinking too

కాలానికి
లోబడని
జీవితం
కాళోజీ జోహార్లు

# Aurora Degree & P.G. College

Chikkadpalli, Hyderabad

---

# Arora Engineering College

Bongir, Nalgonda District

---

# Ramappa Engineering College

Mahaboobabad, Warangal District

తెలంగాణా మరువలేని మహామనిషి
ప్రజాకవి కాళన్న మీకిదే మా నివాళి

# Vignana Bharathi Jr. College

# Vignana Bharathi Residential School

# Vignana Bharathi Dr. College

Mahaboobabad, Warangal District, A P

నిజాయితీకి నిలువెత్తు దర్పణం

కాళన్నా మీకిదే మా నివాళి

## HRD Enginering College

Affiliated JNT University

Recognised by AICTU

Deverakonda Nalgonda District

## Human Resources Development Degree & P.G. College

Affiliated Osmania University

Narayanaguda, Hyderabad

---

"అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు"

అన్న కాళన్నా మీకిదే మా కన్నీటి నివాళి

## Bharath Degree & P.G. College

(for Women)

Nallakunta,

Hyderabad

# యాదిలో...

## కాళోజి అరవై ఏండ్ల పండుగ - 1974

(షష్ఠి పూర్తి సంచిక నుండి)

శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం వారి సౌజన్యంతో

# వైతాళికుడైన కవి కాళోజీ

- డి రామలింగం

కాళోజీకి అరవైయేళ్ళు నిండాయంటే పూర్తిగా నమ్మలేకపోతున్నాను ఎందుచేతనంటే మొట్ట మొదటి సారి నేను ఆయన్ను కలుసుకొని ఆయనతో కొంతసేపు ఇష్టాగోష్టి జరిపినప్పుడు సభలలో ఆయన ఉపన్యాసాలను విన్నప్పుడు, తెలంగాణాలో తెలుగు సాహిత్యోద్యమాన్ని వ్యాపింప జేయడానికై తెలంగాణా రచయితల సంఘం సహాయ కార్యదర్శిగా ఆయనతో మారుమూల బస్తీలకు సైతం పోయినప్పుడూ అయనలో నాకు ప్రస్ఫుటంగా కాన వచ్చిన జవం, జీవం చైతన్యం, చురుకుదనం, సమయ స్ఫూర్తి సందర్భాన్ని గమనించి చెణుకులు విసిరేప్పుడు ద్యోతకమైన పరిశీలనాశక్తి ఇవన్నీ నాలో ఆయన వ్యక్తిత్వాన్ని గూర్చి ఒక చెరగని ముద్ర వేశాయి ఆ ముద్ర ఏమిటంటే కాళోజి అనగా ఒక కంచు కాగడా ఎడతెగని ఎనర్జీ కాని నాకే యాభైఏళ్ళు వస్తూవుంటే ఆయనకు షష్టిపూర్తి కాలేదని ఎలా అనుకుంటాను? అయినా వయస్సు అనేది ప్రతిభ, ప్రజ్ఞా ప్రాభవములు ఎంతగా దేదీప్యమానంగా, మరపురాని విశేషాలుగా మరెంత నవ నవోన్మేషంగా వుంటాయో, లేదా వుండిపోతాయో అలాగిపోదు కాలానికి గడిచిపోయే స్వభావం తప్ప, వ్యక్తులూ, వ్యక్తిత్వాలూ ఎలా వున్నారు ఏమయ్యాయి అన్నదానితో నిమిత్తంలేదు కాలానికీ కాళోజీకి ఒక విధంగా చూస్తే కార్యకారణ సంబంధం వుంది మరొక్క విధంగా పరిశీలిస్తే ఆయన కాలమనే గడియారానికి అతీతుడుగా కనిపిస్తాడు క్షమించాలి అయన్ను గూర్చి ఏకవచనంలో వ్రాస్తున్నాను ఆయన మాలో ఐదుగురికి జ్యేష్ఠుడి వంటి వాడు మరి తక్కిన ముగ్గురు, ఎవ్వరని అడుగుతారేమో స్పష్టంగా చెప్పడం బాగుండదు అయినా ఇప్పుడు చెప్పడంలో ఇబ్బందేమీ లేదను కుంటాను చెప్పేస్తాను ఒకరు డా॥బి రామరాజు, రెండవ అతను దాశరథి, మూడవ యువకుడు డా॥ సి నారాయణరెడ్డి, తెలంగాణా సాహిత్యోద్యమపరంగా ఇదినేను సంభావించిన సౌభ్రాతృత్వం మా ఐదుగురికీ అన్నల వంటి వారూ, తమ్ముల వంటివారూ చాలామంది వున్నారు చాలా సన్నిహితులు కూడా వారి పేర్లు కూడా నా దృక్పథంలోకి వస్తున్నాయి అవి తెలంగాణా వరకే పరిమితమైలేవు మహాంధ్ర అంతటా వున్నారు పైగా చాలా సన్నిహితులూ ఆప్తులూ ఇష్టులూ ఎందరో జ్ఞాపకం వస్తున్నారు శివశంకర స్వాములవారు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పుట్టపర్తి నారాయణాచార్యుల వారు క్షమించాలి ముందే చెప్పా ల్సింది శ్రీశ్రీ (వీరికి కూడా ఇటీవలే షష్టిపూర్తి అయింది) ఇంకా ఆరుద్ర వంటి విఖ్యాత సాహితీపరులు అంతా సాహితీ బంధువులం తెలుగు భాష ఆధునిక తెలుగు సాహిత్యం ముఖ్యంగా ప్రగతితత్వం మమ్మల్ని ఏక కుటుంబీకులుగా చేశాయి గోదావరి తీరం వారైన ఇంద్రగంటి ఓరుగల్లు వారైన కాళోజీ కవితను చదివించుకొని విన్న ఘట్టాన్ని నేను గుర్తుకు తెచ్చుకుంటూ వుంటే తెలుగు వాళ్ళం ఎక్కడవుంటేం, ఏ పరిస్థితులలో పుట్టిపెరిగి జీవిస్తూ వుంటేనేం, పరిస్థితు లనే గాలులు ఎటు వీచి ఎటు వైపు కొట్టివేస్తేనేం, అందరం ఒక తల్లి బిడ్డలమే కాకపోతే కంచాల దగ్గర కూర్చున్నప్పుడు కీచులాటలకు కయ్యాలకు దిగుతాము ఆ తర్వాత ఎవరు ఎవరితో మాట్లాడుకున్నా భాష ఒకటే అని అనుకుంటూ వుంటాను

ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ మళ్ళీ చెప్పినా కాళోజీ తెలంగాణా వైతాళికులలో ఒకడనే అంటాను ముఖ్యంగా సాహిత్యరీత్యా పరిశీలిస్తే గొప్ప వైతాళికుడు రాజకీయంగా ఆయన నిజామును ఎదిరించి స్వస్థానం నుంచి అధికారు లచే బహిష్కరింపబడి వుండవచ్చు నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభలలో గ్రంథాలయ మహాసభలలో రాజకీయ పార్టీల సమావేశాలలో ఆయన నిరంకుశత్వాన్ని నిరశిస్తూ బాధ్యతాయుత పరిపాలన సత్వరమే రావాలని కోరుతూ, ప్రజాస్వామిక వ్యవస్థకు స్వాగతం చెబుతూ ప్రగతి నిరోధక శక్తులను చెండాడుతూ ప్రవంగాలు చేసి వుండవచ్చు కాని ఆయన ముఖ్యంగా సాహితీ పరుడైన వైతాళికుడు మరి అటువంటి వారిలో తెలంగాణాలో అతిరథ మహా రథులే వున్నారాయనకు సమకాలికులుగా అప్పుడూ, ఇప్పుడూ ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు, రాజకీయ వాది, న్యాయశాస్త్రవేత్త పంచభాషాకవి సమ్మేళనాలతో వినోదించిన పరిపాలకుడు

డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు, దిగ్గజంవంటి సాహిత్య వేత్త, పత్రికా సంపాదకుడూ అయిన శ్రీ సురవరం ప్రతాప రెడ్డి గొప్ప జర్నలిస్టూ, అర్థశాస్త్రవేత్త శ్రీ మందుముల నర సింగరావు మరి కాళోజీ ఊరివారూ దాదాపు నమవయస్కులూ అయిన శ్రీ దేవులపల్లి రామానురాజరావుగారు, ఇంకా కొందరు వున్నారు మరి ఇందరి మధ్య కాళోజీ చోటు చేసుకొని చరిత్ర కెక్కాడంటే అది సామాన్య విషయం కాదు అది ఆ వ్యక్తిలోని విశిష్టమైన వ్యక్తిత్వం అని చెప్పాలి

కాళోజీ ప్రధానంగా కవి ఆ విషయం ఆయన ప్రజాహిత జీవనంలోకి అడుగు పెట్టినప్పటినుంచీ ఇప్పటి దాకా ఆయన చేస్తూ వచ్చిన కృషిని గమనిస్తే విశదమవు తుంది తెలంగాణా ప్రజాజీవితంలోనికి ఆయన ప్రసరింప జేసింది కవిత్వమనే కాంతికిరణాలు అది ఏ సందర్భం కానివ్వండి దానిపై తన భావాలను కవితారూపంలో వెల్లడించి చదివేవాడు ఒకవేళ ప్రజా జీవితానికి సంబంధిం చిన సందర్భమేదీ లేకపోతే, తన మనసులో రేకెత్తిన భావాలను, (దాన్నే ఆయన 'నాగొడవ" అన్నాడు) మననం చేసుకొని కవితలుగా వెలయించాడు మహావ్యక్తులను స్మరించవలసి వచ్చినపుడు తానే స్వయంగా ముందుకొచ్చి తన బాణీలో ఆ మహావ్యక్తిత్వాల ప్రశంస చేశాడు ఇవన్నీ తన గొడవలంటాడు కాని వాస్తవానికి ఇవి కేవలం ఆయన వ్యక్తిగత భావాలు అని సరిపెట్టుకోవడానికి వీలులేదు అవి అందరి గొడవలు మన అందరికీ వర్తించే సత్యాలు, మన అందరి జీవితాలకు సంబంధించిన భావ శకలాలు, అభిప్రాయ పరంపరలు మరి ఆ కవితలుకూడా అలాంటివే రూపంలో అతి సాధారణమైనవి చిన్న చిన్న గేయాలు చిన్న చిన్న మాటలతో కూర్చిన కావ్యఖండికలు, కాని వాటిలో అసలు సిసలైన కవిత్వం వుంది అవి చిటిపుట్ చినుకులలాగే వుండవచ్చు కాని కుంభవృష్టి చేసిన పని కన్న అవి మించిన పనేచేశాయి విషయం ఎత్తుగడ, చెప్పేతీరు వేసేచెణుకులు చేసే అధిక్షేపణ, పొడిచే ఎత్తిపొడుపులు, విడమరిచిచెప్పే యదార్థం ఖండిక మొత్తాన్ని మరొకమారు అవలోకిస్తే అందులో కన్పించే మానవతా దృక్పథం ఇవన్నీ ఆయన కావ్య ఖండికలకు (ఇతర రచనలకు కూడా) విశ్వ శ్రేయస్సు అనే ప్రధాన గుణాన్నీ, నర్వజనీనతనూ అపాదింప చేజేశాయి కాబట్టే సామాన్యులూ సాహిత్యవేత్తలూ ఆయన నిలబడి కవిత్వం చదువుతూ వుంటే తల లూపేవారు కాదు ముగ్ధులై అలా వింటూ వుండి పోయేవారు ఇది గమనించిన పరిశీలకులు ఏకకంఠంతో కాళోజీ 'ప్రజాకవి అని ఉద్ఘోషించారు అది పరమ సత్యమైంది కొందరు ఆయనను వేమనతో పోల్చితే అభ్యుదయవాదులూ విప్లవకవులూ ఆయన లూయీ ఆరగాన్ వంటి వాడన్నారు ఎవరు ఏ పోలిక తెచ్చినా కాళోజీని కవిగా అభివర్ణించారే కాని మరొక విధంగా చెప్పలేదు కవిగా కాళోజీ సార్వజనీనత అది

అయితే ఒక కవియొక్క వైశిష్ట్యం గొప్పతనం ఆయన కవిత్వం ప్రజాహిత జీవనంలో ఎట్టి ప్రభావాన్ని కలుగజేశాయి? ఏ ఉద్యమానికి ఎటువింటి చేయూత నిచ్చాయి? ప్రజలను ఎటు తీసుకుపోయాయి? మొత్తంపై ఆ కవిత్వంవల్ల కలిగిన ఫలితమేమిటి? అన్న ప్రశ్నలకు వచ్చే నమాధానాలపై ఆధారపడి వుంటాయి ఈ దృక్కోణం నుంచి పరిశీలిస్తే కాళోజీ కారణజన్ముడనీ, తన కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చిన కవివతంసుడనీ ఈనాడు ప్రతి ఒక్కరూ నాతో అంగీకరిస్తారనుకుంటాను మిత్రులు ఎం ఎల్ గారి నుంచి అర్జెంటు ఆదేశంపై ఈ నాలుగు ముక్కలనూ రెండు సెలవు రోజులు గడపడానికి ఈ పాండిచేరికి వచ్చిన నేను వాన కురుస్తూవున్న రాత్రిలో కూర్చుని వ్రాస్తున్నాను సముద్ర తీరానికి సమీపంలో నేను బసచేసిన గవర్నమెంటు టూరిస్టుహోమ్‌లో వానరాకడ మరీ క్రుంగదీసేట్టుగా వుంటుంది ఇదిగో ఇటువంటి సందర్భాలలోనే తేజో మూర్తులైన వారి స్మరణ బెంగనూ భయాన్నీ, సందేహా లనూ పటాపంచలు చేస్తుంది ఇవాళ ఉదయం అరవిందా శ్రమానికి వెళ్ళి కొన్ని గంటలు గడిపి, అరవిందుని గ్రంథాలను కొనుక్కొని వచ్చాను ఆశ్రమంలో భారతదేశం లోని అనేక ప్రాంతాల నుంచి వచ్చినవారినీ, విదేశీయు లనూ చూచాను ఒక ఉత్తర భారతీయునితో, ఒక పాశ్చాత్యునితో కొద్ది నిమిషాలు మాట్లాడాను "ఇక్కడొక కాంతి కిరణం ఒకప్పుడుండేదని విని చూచి పోదామని వచ్చాను" అన్నాడా విదేశీయుడు అరవిందుని గ్రంథాలెన్నో చదివాను అయనను గూర్చి వ్రాయబడ్డ గ్రంథాలను, ముఖ్యంగా అయనచే ప్రభావితులైన తెలుగు ఆలోచనా పరులూ, మేధావులూ అయిన వారి రచనలు

చదివాను అయినా అరవిందుడు నాకు అర్థమయ్యాడని చెప్పలేను కాని మహా చైతన్య పూరితుడైన ఆ దివ్యజ్ఞానిని కాదనగలమా? భారతీయులకు వారి జ్ఞానసంపదను గూర్చి విదేశీయులకు భారతదేశ ఆధ్యాత్మికౌన్నత్యాన్ని గూర్చి తెలియజెప్పిన మహర్షి ఆయన ఆయన చివరకు ఏమైనప్పటికీ ముఖ్యంగా గొప్ప దేశభక్తుడు గొప్ప మేధావి అటువంటి వారే జాతిని మేల్కొల్పి జాతి యొక్క ఔన్న త్యాన్ని చాటుతారు మన భారతదేశంలో ప్రతి ప్రాంతంలో అవసరమైనప్పుడల్లా ఇటువంటివారు ఉద్భవిస్తూనే వున్నారు ఇది మన భూమికి పరిపాటియైన ధర్మం గాంధీ తిలక్ బంకిం రవీంద్రుడు నెహ్రూ బోసు వీరేశలింగం ప్రకాశం ఇత్యాదులు మన కాళోజీ అరవింద పరంపరకు చెందినవాడనిపిస్తుంది కాళోజీ కూడా దేశభక్తుడు స్వాతంత్ర్య ప్రియుడు స్వాతంత్ర్య సమరంలో గొంతువిప్పి పాడినకవి తెలంగాణా ను తన కవితలచే తేజోవిలసితం చేసిన వైతాళికుడు, మానవత అనేదీపం తెలుగు వెలుగు ఈ భూమండలం లోని ఒక వెనుకబడ్డ ప్రాంతంలో అరిపోకుండా ఆత్మ నివేదనం చేసుకున్న జిజ్ఞాసువు ఇటువంటి వారే చరితార్థులు

❖ ❖ ❖

# "నిఖిలాంధ్రకవి" శ్రీ కాళోజీ నారాయణరావు

- వేదులూరి రాధాకృష్ణమూర్తి

"అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టము జూచి కరిగిపోవును గుండె
మాయ మోసము జూచి మండిపోవును ఒళ్ళు
పతితమానవు జూచి చితికి పోవును మనసు
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు"

అని అంటూ ఈనాటి సమాజంలో వ్యాప్తమై పోయిన ఈర్ష్యాద్వేషాలను, హెచ్చులొచ్చులను, అన్యాయాలను, అక్రమాలను దుర్మార్గాలను దురాచారాలనూ చూచి బాధ పడిపోయి తన ఆ బాధను ప్రజాభాషలో సూటిగా, హృదయానికి హత్తుకొనేలా వర్ణించి ఆధునిక ఆంధ్ర కవితా జగత్తులో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్న నిర్మొహమాటి, నిష్కపటి నిర్మల హృదయులునగు వేమన వంటి కవి శ్రీ కాళోజి నారాయణరావుగారు ప్రజానీకంలో బాగా ప్రచారం పొందిన వారి అందమైన ఉపనామం కాళోజి

### కవుల్లో కాళోజి కోవ

సామాన్యంగా కవుల్ని బుద్ధివాదులు, హృదయ వాదులు అని రెండు విధాలుగా విభజించవచ్చు బుద్ధి వాదులగు కవుల రచనల్లో శైలీగత సౌందర్యం కల్పనా చాతురి విశేషంగా కనబడుతూ ఉంటాయి కాని హృదయవాదులగు కవుల రచనల్లో కళాపక్షం కంటే భావపక్షానికే ఎక్కువ ప్రాధాన్యం లభిస్తుంది ఇట్టి కవుల హృదయ సింధువులో నుండి బయల్వెడలే బడబాగ్ని కవితారూపం లో విజృంభించి సమాజాన్ని కదిలించి వేస్తుంది మొహ మాటాలుగాని, ముఖస్తుతులుగాని ఇట్టి కవులకు పనికి రావు చెప్పదలచుకొన్న సత్యాన్ని స్పష్టంగా సూటిగా, పటిష్ఠమైన భాషలో ఆచి తూచి చెప్పడం యిట్టి కవుల విశేషం ప్రపంచం లోని భాషలన్నింటి లోను యిట్టి కవులు మనకు కనబడుతూ ఉంటారు ఈ కోవకు చెందిన కవీశ్వరులే శ్రీ కాళోజి

దాశరథి చెప్పినట్లు "కాళోజి కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది అతడు ఒక్కమాట సమాజం వైపు కన్నెత్తి నిశితంగా చూస్తే సమాజం నిలువునా, గజగజా వణికిపోయి తనలో తరతరాలనుండి దాచుకొన్న కుళ్ళును ఒక్కమాటు బయట పారేస్తుంది అట్లా చేయకుండా ఇంకా రహస్యంగానే వుంచడం అతని ముందు సాధ్యం కాదు గనుక అతనికి గుడ్డి ఆశలులేవు తాను చూస్తున్నదీ,

తనకు తోస్తున్నదీ రాస్తాడు నిజం ఆలోచిస్తే కాళోజి
శాస్త్రజ్ఞుడు శాస్త్రజ్ఞుడు గర్భితమై వున్న కవి "

**అపూర్వ అభిలాష**

'నాదాల మునిగి ఆనందాల తేల
వాసనల దీర్చు సువాసనల గ్రోల
జన్మించెదను దేవసర్పమై నేను"

అని కాళోజి తన అభిలాషను వ్యక్తం చేశారు లౌకికమైన నాదాలవల్ల కవికి ఆనందం కలుగదు సువాసనలు పీల్చినంత మాత్రాన కోరికలు తీరవు సంసార సంబంధ మైన నాదాల్లోను, సువాసనల్లోను కపటాలూ, కార్పణ్యాలూ నిండి ఉన్నాయి అందువల్లనే కవి దేవ సర్పంగా జన్మించాలని తన అభిలాషను వ్యక్తం చేశాడు నాదం విని దేవసర్పం మురిసి పోతుంది సువాసనల గ్రోలి తన్ను తానే మరిచిపోతుంది అటువంటి తాదాత్మ్యం, ఆనందం మానవుడు పొందలేకపోతున్నాడు కనుకనే దేవ సర్పమై జన్మించాలని కవి ఆశయం సర్పపు దేవత్వమే కవి యొక్క నిర్మల హృదయానికి తార్కాణం అయితే కవికి దు ఖాలంటే భయంలేదు కష్టసుఖాలకు దూరం కావడం యిష్టంలేదు

"చెమ్మగిలని కనులు బ్రతుకు
కమ్మదనము చాటలేవు,
చెమ్మగిలని కనులు బ్రతుకు
కమ్మదనము చూడలేవు
దప్పితీర గ్రోలనిదే
విప్పారదు మనసుమబ్బు
తలపులన్ని తీరనిదే
తలుపులేవి తెరచి కొనవు"

అని గానం చేస్తూనే కవి

"సంతసముగ జీవింపగ
నతతము యత్నింతుగాని
ఎంతటి సౌఖ్యానికైన
ఇతరుల పీడింపలేను "

అని ఉద్ఘాటించి "జీవించు, ఇతరులను కూడా జీవించనీయి" అను సిద్ధాంతాన్ని తన కవితలద్వారా ప్రజానీకానికి అందించారు

కాళోజి రచించిన 67 కవితలు 'నాగొడవ' అనే పేరుతో పుస్తక రూపంలో వెలువడ్డాయి పరిమాణ దృష్ట్యా ఎక్కువగా వ్రాయక పోయినా వ్రాసిన కొద్ది రచనలే వారికి మంచి పేరూ ప్రఖ్యాతీ సంపాదించి పెట్టాయి

**కాళోజి సోదరులు**

కాళోజి జన్మించింది 1914లో తెలుగుతో బాటు ఉర్దూ పారసీ మరాఠీ, ఆంగ్లభాషల్ని బాగా అధ్యయనం చేశారు వారు మంచి ఉర్దూ కవి కూడాను కాళోజి అన్న గారగు ప్రసిద్ధ వకీలు రామేశ్వరరావుగారు కూడా ఉర్దూ కవులు సత్సాహిత్యకులు ఈ సోదరుల భ్రాతృ ప్రేమను గురించి ప్రజలు ఘనంగా చెప్పుకుంటూ ఉంటారు కాళోజి నారాయణరావుగారు వకీలు పట్టా పుచ్చుకొన్నప్పటికీ అటు శ్రద్ధ వహించక మొదటినుండి తెలంగాణా రాజకీయ ఉద్యమాలతో సంబంధం పెట్టుకున్నారు మూడు పర్యాయాలు నైజాం ప్రభుత్వంచే శిక్షింప బడి కఠిన కారాగారయాతల్ని సహించారు వరంగల్లు జిల్లా నుండి ప్రభుత్వం ద్వారా బహిష్కరించబడడం కూడా జరిగింది స్వాతంత్ర్యోద్యమంలో వారి అడుగు ఎప్పుడూ ముందు ఉండేది త్యాగం సాహసం పట్టుదల కాళోజి వ్యక్తిత్వపు ప్రధానమైన విశేషాలు అయితే మురాతత్వాలు, హేయమైన అవినీతి చర్యలు ఆయనకు పనికిరావు అందువల్లనే స్వాతంత్ర్యోద్యమ సమయంలో ముంద డుగు వేసిన కాళోజి స్వాతంత్ర్యం లభించిన తరువాత ముమ్మరం గా కొనసాగుతూ వున్న యీనాటి పదవుల వేటలో పాల్గొనడం యిష్టంలేక దూరంగా ఉండిపోయారు

**రాజకీయాలు - నాడూ , నేడూ**

"సత్యాహింసల యెబదేండ్ల కృషి
క్షణంతో అయిపోయెను మసి "
"బాపూజీ బ్రతికిన యప్పటి
సత్యాహింసల దుప్పటి
బొంకుల బొంతగ మారెను
ఘనతలు సొంతము దీరెను
ప్రజాస్వామ్యం గణరాజ్యం
చతురనాయక మ్మన్యుల భోజ్యం
తోడేలు అండనున్న మేకలు
'బ్యా' అన్న ఊడిపోవు పీకలు"

అని ఎంతో సజీవంగా యీనాటి స్థితిని వర్ణించారు కాళోజి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత తెలంగాణా ఉపాధ్యాయుల నియోజకవర్గాన్నుండి ఎగువ సభ

మెంబరుగా ఎన్నుకోబడ్డారు కొంతకాలం తెలంగాణా రచయితల సంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు

బక్కపలుచని పొడగరి శరీరం, అందమైన ముఖం పొడుగుపాటి కొనతేలిన ముక్కు పలుచని పెదవులు మెరిసే కండ్లు అపరిచితులను కూడా ఆకర్షించే మొగ మాటం లేని తర్కంతో కూడిన సంభాషణ భావుక హృదయం ముఖం మీద నిర్లక్ష్యాన్ని వ్యక్తంచేస్తూ వుండే రేఖలు, పదిమందిలో సైతం ప్రత్యేకంగా కనబడే వ్యక్తిత్వం వీటన్నిటి సమన్వయమే శ్రీకాళోజి

## దేశభక్తి

కాళోజి గొప్ప దేశభక్తులు స్వతంత్ర భారతాన్ని సందర్శించడం కోసం విద్యార్థి జీవితంలోనే రాజకీయ రంగంలో ప్రవేశించి అష్టకష్టాలూ పడిన త్యాగ పురుషులు వారు వారి దృష్టిలో మాతృభూమిని ప్రేమించని వారే ఉండరు అందువల్లనే

"మాతృదేశమువూట ముచ్చట
ముదము గూర్పదు మదికి సనియెడి
పరమనీచుడు ధరణినంతట
గలయవెదకిన గాననగునా?
లాఠిదెబ్బల లక్ష్యమేమీ
కఠినశిక్షయె కాదు కాదు
చావుకైనను జంకనియదు
మాతృదేశము మాతృదేశమే"

అని వర్ణించారు

## ప్రజలకు మేలుకొలుపు

తన మాతృభూమియగు తెలంగాణాలోని బీద ప్రజల దైన్యాన్ని, అధికారుల విలాసాల్ని, దుర్మార్గాల్ని చూచి వారి హృదయం దహించుకపోయింది ప్రజల జాలిన బ్రతుకును చూచి వారి నేత్రాలు విస్ఫులింగాల్ని విరజిమ్మాయి ధైర్యంతో నైజాం ప్రభుత్వాన్ని ఎదుర్కొన్నారు మూగజీవుల హృదయం లోని ఆవేదన కాళోజి వాణిలో ప్రతిధ్వనించింది కిరాతకులైన నవాబు సైనికుల్ని సంబోధించి

"బాధ్యత లేని ప్రభుత్వభటులు
పెట్టే బాధలు చాలింక,
బాధ్యత గల పరిపాలన లేక
బ్రతికిన బ్రతుకులు చాలింక
రక్షణకై ఏర్పడ్డ బలగమే
చేసే భక్షణ చాలింక
కాలము వ్యర్థము జేయగ కళయని
వ్రాసే కైతలు చాలింక
కైతచేత మేల్కొల్పకున్న
కాళోజి కాయము చాలింక"

అని గర్జించారు కోటగోడలు నేల కూలుతున్నాయి తిర్పు ఓ రాజా మొదలుగాగల కవితల ద్వారా

రాణివాసములోన రంజిల్లు రాజా
రైతుబాధల దీర్చి రక్షింపలేవా?
ప్రజలను హింసించు ప్రభువు మా కేల
వధియింప భక్షింప వనరాజు లేడా?"

అని అనేక విధాలుగా నచ్చజెప్పి చూచినా ప్రయోజనం లేకపోయింది దానితో ఉగ్రుడై కవి ప్రజానీకాన్ని తీవ్రంగా హెచ్చరించి, వారికి కర్తవ్యబోధను "కాటేసి తీరాలి" అను కవిత ద్వారా

"మన కొంప లార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండగ గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె
తిట్టిన నాల్కలను చేపట్టి కొయ్యాలె
కొంగు లాగిన వ్రేళ్ళ కొలిమిలో పెట్టాలె
కన్ను గీటిన కళ్ళ కారాలు చల్లాలె
తన్నిన కాళ్ళను 'డాకలి'గ వాడాలె
కండకండగ కోసి కాకులకు వెయ్యాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె

అని అంటూ బోధ చేశారు

కోరిక తీరింది, కాని

కాళోజి త్యాగం ఫలించింది వారి అభిలాష నెరవేరింది భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత హైద్రాబాదు సంస్థానమందలి నిరంకుశ పరిపాలన అంతమొందింది విశాల మైన ఆంధ్రప్రదేశ్ కూడా ఏర్పడింది కాని కవి ఆత్మకు నిజమైన శాంతి లభించలేదు మనకు స్వారాజ్యం వచ్చిందేగాని సురాజ్యం రాలేదు స్వాతంత్ర్యం లభించిన తరువాత పరిస్థితులూ, మానవుల స్వభావాలూ

విచిత్రంగా మారిపోయాయి మారిపోతూ ఉన్నాయి

"మాయలోకము మాయజనుల
మనసులో గల మాట యొకటి
పైకినుడివెడు పలుకు ఒకటి
చేయదలచిన చేష్ట యొకటి
ఏడు మారినా యీడు ముదిరినా
ఏమి మారినది యీలోకంలో?
రాయి విసిరినా రాకెట్టు విసరినా
గిట్టనివానిని కొట్టుట కేకదా?"

అని అంటూ తమ అసంతృప్తినీ, అసంతోషాన్నీ వ్యక్తం చేశారు

## స్వతంత్ర దృక్పథం

ఏ వాదాన్నీ అనుకరించే స్వభావం కాదు కాళోజీది ప్రతి విషయాన్నీ స్వతంత్ర దృక్పథంలో చూడడం వారి ప్రత్యేకత ఈనాటి సమాజాన్ని గురించి యోచించి యోచించి 'ద్వైత జగత్తు' అను కవితలో నేటి మానవుల్ని రెండు భాగాలుగా విభజించారు

"కుటిలమతులు దేబెమొగాలు
జగతిలో రెండే రెండు రకాలు
చతురవర్గం విలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు
లోక మెపుడు చతురునిదే సొత్తు
లేదమాయకున కందుల పొత్తు
శాస్త్రకార్లు శాసనకర్తలు
జనులకు తాళికట్టని భర్తలు,
చేయుటకై సామాన్యుల లూటీ
చాణక్యుల మధ్యన పోటీ"

## నేటి స్థితిగతులు

దేశసేవ పేరుతో జరుగుతూవున్న అన్యాయాల్ని, పదవుల వేటకై జరుగుతూవున్న భయంకరమైన పోటీని చూచి బాధపడి కాళోజి నిర్భయంగా 'పోటిబడి కాటులాడ' అను కవితలో యీ నాటి స్థితిని నిశితంగా చిత్రించారు

"చాపచింపు సామ్రాజ్యం
కోడిగుడ్డు కోహినూరు
పోటిమన్ను ప్లాటినం
బస్సుసీటు బ్రహ్మరథం
ఏదైతేం? ఏదైతేం?
పోటిబడి కాటులాడ
ఏదైతేం?
అడవిమనిషి ఆచార్యుడు
పసిబాలుడు పండుముసలి
బిచ్చగాడు లచ్చిమగడు
తొత్తుకొడుకు పెత్తందార్
ఎవడైతేం? ఎవడైతేం?
పోటీబడి కాటులాడ
ఎవడైతేం?
విపణివీథి తపోవనం
చాకిరేవు శాసనసభ
సానికొంప సాధుమఠం
మూత్రశాల యాత్రాస్థలి
ఎచటైతేం? ఎచటైతేం?
పోటీబటి కాటులాడ
ఎచటైతేం?"

గణరాజ్యం పేరుతో జరుగుతూవున్న బూటకాన్ని స్పష్టం చేశారు తన కవితలో -

"హక్కుల పట్టిక లెక్కతప్పక
ఒప్పజెప్పెడి ఉత్సాహం,
బాధ్యత అంటే బానిసత్వమని తర్కం,
పనిలో తాత్సారం
జరిగే పనిలో పొరపులు జూసి
అడ్డుతగిలెడు ఆచారం
ఎవనికి వాడే ప్రవక్త,
వానిపలుకే జ్ఞానవుభాండారం,
రష్యా అమెరికా రహదారులపై
సర్వోదయభావ సంచారం"

ఇకనైన బూటక వ్యవహారం ఆగిపోవాలని, స్వరాజ్యంతో బాటు సురాజ్యం కూడా ఏర్పడాలనీ అంటూ

"కట్టాలిక క్రొత్త తెర
పాత ఆట రక్తికట్టదు
పాతసరుకు ధర గిట్టదు
మారాలిక లేబిల్ ప్యాకింగు
మారాలిక స్టేజుల సెట్టింగు"

అని కాళోజి ఉద్ఘోషించారు

పైన వివరించిన కవితలేగాక 'జంటసింగిణులు నేతాజీ కన్నీటిలో ఎన్నెన్నో కలవు కోకిల సంధ్యారూపం మొదలుగా గల కావ్యసౌందర్యంతో నిండిన ఉత్తమశ్రేణికి చెందిన రచనలు కూడా కాళోజీ అనేకం రచించారు ఇంకా పుస్తక రూపంలో వెలువడకుండా పత్రికల్లో వెలువడిన కవితలు అనేకం వున్నాయి

భాషలో కొత్తదనం

ఆధునిక తెలుగు కావ్యజగత్తులో అభ్యుదయ కవులు కావ్యవస్తువులోను వర్ణనాశైలిలోను క్రొత్త మార్పు తెచ్చారే గాని భాషకు సంబంధించినంతవరకూ క్రొత్త మార్పు చెప్పుకోదగి నంతగా తీసుకొనిరాలేదనే చెప్పవచ్చు అలోటు కాళోజీ కవితల్లో ఎక్కడా కనబడదు ఆడంబరం లేని, సరళమైన బిగువుగాను పొంకంగాను కవితలు రచించి క్రొత్తభాషా స్వరూపాన్ని అభ్యు దయ కవులకు కాళోజీ అందించారనడం అతిశయోక్తి కానేరదు సరస్వతీ భక్తుల్లారా! అను కవితలో

'కైతకు లక్షణాలున్నాయి కోటొక్కటి
వానిలో వ్యాకరణం కూడా ఒక్కటి
మీకు దాని సూత్రాలే సర్వస్వం
గొంతుకు పొసుకొని వ్రేలాడి సతతం
చేస్తారు ఆక్రందన అంటారు కవిత్వం
'కైతకు వ్యారణమే పరమావధి
కాదు అనలేకాదు' అన్నాడు దాశరథి!
మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు
మీ రచనంతా వ్యాకరణం, మరేమీ కాదు
వ్యాకరణసూత్రాలు 'పెట్టితే భట్టీ
కా దెప్పుడు కైతపాకం గట్టి
పాతబాటలబట్టియే నడవగలరు మీరు
మా నడకలో పడుతుంది క్రొత్త త్రోవలకు తీరు "

అని భాష శైలి మొదలుగాగల విషయం లో తమ అభిప్రాయాల్ని బహు రంవత్తరంగా చిత్రించారు కాళోజీ

వచన రచనయందుకూడా వారిది అందెవేసిన చేయి వారు రచించిన కొన్ని కథలు కథాసంపుటాల్లో వెలువడ్డాయి వారు మంచి వక్త చెప్పదలచుకొన్నది సూటిగా ముక్తసరిగా గుండెలకు తగిలేలా చెప్పడం శ్రోతలలో ఉత్తేజంతో బాటు ఆత్మవరిశీలనను రేకెత్తించడం వారి వక్తృత్వపు విశేషం

ఆయన గొడవ అందరి గొడవ

కాళోజీ రచించిన కవితాసంపుటి నాగొడవ ప్రథమ ముద్రణకు 12 1 53న అలంపురం సభలో ఆవిష్కరణ జరుపుతూ

'కాళోజీ నిఖిలాంధ్రకవి అందులో యెట్టి సందే హం లేదు ఆయనకు తెలంగాణా అంచులు గోడలుగా అడ్డు నిలువజాలవు ఆయన తన ఖండ కావ్య సంపుటా నికి 'నాగొడవ' అని పేరుపెట్టారు అదే కవియొక్క ప్రతిభ, అదే కవి చెప్పవలసిందీను ఇది కవిగొడవగానే అనిపించి నప్పటికీ చదివిన వారికి ఇది తమ గొడవగానే అర్థమవు తుంది ఇది విశాలజగత్తు ప్రజలందరి గొడవ ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం

యుద్ధంలో ఫ్రాన్సు కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ అరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహా ప్రజావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు కాళోజీ లూయీ అరగాన్ వంటివారు అలా ఎవరికీ తెలియ కుండా అజ్ఞాతంగా ఉండి రచనను సాగించారు తెలంగాణా మూగజీవాల హృదయాల్ని ప్రతిబింబింప జేశాడు "

అని అన్న శ్రీశ్రీ మాటలు ముమ్మాటికీ నిజం

❖ ❖ ❖

# ప్రజాస్వామ్య కవి

- డా మంకురాల రామారెడ్డి

కండ్లల్లో నీళ్ళూరించే కవిత్వాన్ని రచించగలిగే వాళ్ళను వర్గీకరించి చూసుకొన్నప్పుడు నేటి తెలుగు దేశంలో అట్లాంటి రచయితలు మూడు వరుసల్లో కనిపిస్తున్నారు

మూగహృదయాల వేదనాభారాన్ని నివేదించడానికి కలంబట్టి ప్రాతినిధ్యం వహించి, వాటి స్థానే తాము స్పందించి కవిత్వాన్ని పలికించేవాళ్ళది ఒక వరుస

అందరూ ఏడుస్తుంటే తాము నవ్వుతూ అందరూ నవ్వే పరిస్థితుల్లో తాము ఏడుస్తుండే వాళ్ళది మరోవరుస

ఇక తమఏడ్పు తమదే అన్నట్లు ఇంకోవరుస

ఇందులో మొదటిరకం కవిత్వానికి సహృదయులనూ సానుభూతిపరులనూ వెతుక్కోనక్కరలేదు సర్వసామాన్యమైన ఇబ్బంది వారి కవితా వస్తువు దానికి సమాజంలోని సామాన్యులూ, అసామాన్యులూ కదుల్తారు ఆ కవిత్వాన్ని చదువు కొంటున్నప్పుడో, ఎంటున్నప్పుడో కండ్లనీళ్లు వాటంతట అవే వస్తాయి

రెండో రకం కవిత్వాన్ని వినే శ్రోతలందరినీ సహృదయుల పట్టికలో చేర్చడం కష్టమే, ఒకే ఒక పద్ధతిలో అందరినీ 'ఏడ్వమనే ఆ కవితా తత్వమే అందుకు కారణం అనవచ్చు అట్లా ఏడ్చి ఏడ్చి తూడ్చిన కవులకే ఇపుడు కన్నీళ్ళు కొరకుండా అయినాయి

మూడోరకం కవులకు సానుభూతిపరులు దొరకడం మరీ సమస్య వారి ఏడ్పువారిదే తిన్నది అరుగుబాటు కాకనో, పచ్చని పైతోలు ప్రియురాలు కోసమో, తీరిక సమయాల్లో వాళ్ళు తమ గృహారామాల్లో కవిత్వాన్ని ఏడ్పిస్తూ కూర్చుంటారు ముదిరిన పిచ్చో, తెగబలిసిన కొవ్వో దానికి కారణమై ఉంటుంది

ఎవరు దేనికోసమైనా ఏడ్వవచ్చు కొన్నిటి కోసమో కొందరికోసమో, ఏడ్చేవాళ్లుగూడ ఉండవచ్చు కాని తన ఆవేదనా హృదయాన్ని పలికిస్తూ సర్వసామాన్యంగా అందరి కండ్లకూ నీళ్ళు తెప్పించడం పుట్టుకతో జాలిగుండె కలిగిన వాళ్ళకే అబ్బిన విద్య అట్లాంటి కవులను నేటి సమాజంలో పేర్కొనాలంటే కాళోజీ పేరె మొదట తోస్తుంది

కవిత్వం కోసమే జీవితాన్ని వెచ్చించేవారిలో కాళోజీది ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఆవేదన ఆయన కవితాత్మ జీవితమంతా ఒక కవితోద్యమం తమ తమ ప్రయోజనాల కోసం పరస్పరం తన్నుకొంటూ, సమాజాన్ని అడ్డాదిడ్డిగా నలగదొక్కడానికే అన్నట్లు వస్తూ పోతూ ఉన్న ఆయా మురాతత్వాలు సృష్టించే సంక్షోభకరమైన సంఘటనలూ, విప్లవ విషాధగాథలూ ఆయన కావ్య నిర్మాణానికి సరంజామాగా సామగ్రిగా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి

కొన్ని ప్రత్యేక ఉద్దేశాల ప్రచారంకోసం వ్రాసే వ్రాతలు తాటాకు మంటలు కేవలం తన సంతృప్తి కోసమో, తాను మెచ్చినదానికోసమో, పోటీ బేరం కోసమో, మన్నన కోసమో ఆయన వ్రాయడంలేదు మనిషి కోసం వ్రాస్తున్నాడు

జీవన వాదం కళ మానవీయతకోసం అనే నివాదం ఆయన కవితలో పదఎదంలో పలుకుతూ ఉంది సర్వోత్కృష్టజీవి అనిపించుకొన్న మానవుడు సాటివాణ్ణి చంపడానికి తానూ చావడానికీ చేస్తూన్న చేష్టలను చూసి ఆ దు ఖాన్ని మోయలేక మొరపెడుతూ తన 'గొడవ'ను ప్రకటిస్తున్నాడు

తెలుగులో స్వతంత్ర యుగ కవిత్వానికి కాళోజి నన్నయ్య వంటివాడు కాడనుకొన్నా అన్నయ్య వంటివాడు మాత్రం ఖచ్చితంగా అవును కొత్త కొత్త పద్ధతులతో కొత్త కొత్త స్ఫూర్తులను కలిగిస్తూ ఆధునిక కవిత్వంలో పుట్టి పెరిగిన వాళ్ళకందరికీ ఆయన అన్నయ్య కవిత్వాన్ని ఆరాధించి, అనుభవించి, ఉపాసించి, దానితోనే ఉద్యమించి, దాన్నే ఉపన్యసిస్తున్నాడు

ఒక కవికి గల స్వతంత్ర స్వాభావిక వ్యక్తిత్వాన్ని పరిశీలించవలసి వచ్చినప్పుడు నాలుగుప్రక్కలా ఛాయాగ్రహణం చేసి చూడవలసి ఉంటుంది (1) ఇతివృత్తాన్ని తీసుకోవడంలో (2) భాషాశైలిని అలవర్చుకోవడంలో (3) భావసామగ్రిని కూర్చుకోవడంలో (4) ప్రక్రియను ఎన్నుకోవడంలో పరీక్షించి ఫలితాన్ని తేల్చవచ్చు

పై నాల్గింటికోసం కాళోజి ఇటు సంస్కృతాన్ని యాచించినట్టుగానీ అటు ఆంగ్లాన్నో అన్య సాహిత్యాన్నో అడుక్కొన్నట్టుగానీ లేదు తన పరిసరాల నుంచి కూర్చు కొన్నవే అవి ఆయన సొంత ఆస్తి అయిపోయినవి ఈ నాల్గింటినీ ఆయన సర్వతంత్ర స్వతంత్రంగా బహు రంజ కత్వంగా నిర్వహించి లోక ప్రియత్వాన్ని చూరగొని కావ్య క్రియలో తానొక ప్రత్యేక నిపుణుడైన కిటుకును కొస్త తెలుసుకొనే అందుకు ప్రయత్నం సాగింతాం

ఇతివృత్తంలోని కవిత్వం మృగ్యం ఆత్మాశ్రయ కవిత్వాల్లోకూడా ఏదో ఒక సొంతకథ సొంతవ్యథ ఉండి తీరుతుంది ఆత్మాశ్రయంగా చెప్పినా పరాశ్రయంగా చెప్పినా ఆయన గొడవ వాస్తవిక జగత్తునే ప్రతిబింబి స్తుంది కాళోజి చెప్పతూ వస్తున్న కథ కాలం ప్రసవిస్తున్న వ్యథ, నాయకులు, దురోద్ధతులు, వక్రవర్తులు, చతుర మతులు ఉపనాయకులు పీడితులు తాడితులు, దేబ మొగాలు ' నాయికల గొడవ లేదు

సమకాలిక సంఘటనలను పరామర్శించి వ్యక్తులు సృష్టించే సమస్యలనూ, సమస్యలు సృష్టించే వ్యక్తులనూ బొమ్మకట్టించినాడు కవి అకృతులను తడవబోడు ప్రకృతులను విడువబోడు ప్రకృతులనుబట్టి పాత్రలను ప్రవేశపెడతాడు మనువులవలె, మాంధాతల వలె, ధృతరాష్ట్రులవలె శకునులవలె అక్బర్లవలె ఆలంఘీర్లవలె సీజర్లవలె, కైజర్లవలె, క్లైవులవలె, భుట్టోల వలె, మావోలవలె ఈ పాత్రలు కనిపిస్తాయి ఇతివృత్తం దొరకక కొందరూ నిర్వహించరాక కొందరూ చారిత్రక పాత్రలను చిక్కబట్టి నెత్తివార గొరిగించి ఊరేగించిన వాళ్ళు న్నారు కొన్నిచోట్ల పాత్రలపేర్లు చెప్పడు ఆయన గుణ పరిచయం చేసి వదలినచోటల్లా ఎన్నో చారిత్రక పాత్రల నామాలు మనకు జ్ఞాపకం వస్తాయి అష్టాదిగ్గి భూత ప్రకృతులు ఆవేశిస్తే శివమూగిన మానసిక స్థితి కవిలో కన్పించదు

కాళోజీ వస్తువు ప్రస్తుతాన్ని పలుకుతున్నట్టున్నా, మూడుకాలాలకూ తద్ధర్మాన్నే పలికే బాపతు పాతలోని ప్రకృతినీ, ప్రకృతిలోని ప్రకృతాన్నీ, ప్రకృతం లోని సరికొత్తదనాన్నీ, కొత్తలోని భావపరిణామశీలాన్నీ, పరిణా మంలోని ఆకర్షణ, వికర్షణలనూ కలవరిస్తుంది, పలవరి స్తుంది, పలకరిస్తుంది ఆయన వస్తువు అప్రస్తుతమైన విషయాన్ని వల్లించడు కాలమేదైతే నేమి? కాళన్న కాళన్నె

ఏమి వ్రాయవలె? ఎందుకు వ్రాయాలె? అనుకొంటూ సందిగ్ధంలో పడ్డ సామాన్య రచయితలకు జ్ఞానదానం చేస్తున్నాడు నన్ననుకరించగలవా? చూడు మరి? అని ఒకవంక హెచ్చరిస్తున్నట్టు కనిపిస్తూ మరోవంక సవాలు చేస్తున్నాడు

తన భాషాశైలిలో ఈ కవి తెలుగుదనాన్నీ భాషీయాన్నీ ప్రజాస్వామ్యానికి అర్థమయ్యే పలుకుబడినీ అందులోనూ తెలంగాణా బడినీ బహుళార్థసాధకంగా పలుకుతాడు కూర్పులో నుడికారాలు బంతులుదీరి సరికొత్తగా శబ్దిస్తున్నవి వాక్యనిర్మాణంలో సంస్కృత బంధాన్ని చాలావరకు విడిపించినాడు తత్సమతద్భవాలు, దేశి విదేశి భేదం లేకుండా కలసిమెలసి సామాన్యార్థం భాషిస్తుంటవి బహు నాజూకుగా శ్లేషిస్తుంటవి విదేశీ తత్సమ తద్భవాల దిగుమతిని నిషేధించేవాళ్ళను చూసి 'మీకు పరిసర రాష్ట్రాలలో గూడా మంచినీళ్ళు దొరకవు' అంటాడు ఇది ఏమిటి అంటే 'అది తద్భవానికి తద్భవం' అంటాడు అట్లా అనగూడదంటే నీవుగూడా పిల్లలను కనగూడదు మరి అంటాడు ఆంధ్రాంగ్ల తౌరక్యాంధ్ర హైబ్రీడు సమాసాలు జట్లు కడుతుంటవి ప్రశ్నించిన వానిదే పాపం రైలుబండి ఎక్కితిమి 'కాంగ్రెస్ సభ్యత్వం తీసుకొంటిమి అన్నింటికీ హక్కుదార్ల మంటిమి 'కొత్త తరహా రివాజు చేసుకొంటిమి అంతర్జాతీయ వివాహాలను గూడా అంగీకరిస్తిమి అట్లే అందరి సౌలభ్యంకోసం ఏర్పడ్డ ఈ సమస్త పదజాలంలో మనకు గిట్టనిదేముంది? అంటాడు ఆయనతో మాట్లాడడం కొస్త కష్టమే కావచ్చు నష్టం మాత్రం కాదు

ఆయన భావవేగాన్ని హైడ్రాలిక్ బ్రేక్స్ కూడా ఆపలేవు వ్యాకరణ సూత్రాలు ఎప్పుడో పుటుక్కు మన్నవి 'కవితకున్న లక్షణాలు కోటొక్కటి, అందులో వ్యాకర ణంకూడా ఒక్కటి సరస్వతీ భక్తులైనవాళ్ళు (పండితులు) బ్రహ్మను (కవిని) వెక్కిరించడం అవినయం' అంటాడు సాంఘికామోదం లభించిన పదాన్ని మన అవసరం కొద్దీ వాడుకుందాం దాని చావు బతుకులను మనం నిర్ణయించ లేం కాలమే ఆయుష్కర్త అంటాడు విమర్శ పెరిగినా కొద్దీ వేలెడెక్కువగా పెరుగుతుంది కాళోజీ కవిత్వభాష

ప్రయోగంలో దుబారా ఖర్చు చేయడు పీనుగును ఏనుగును చేయడు భాషనూ భావాన్నీ పొదుపుగా కుదుపుగా వాడడం బాగా అభ్యసించినాడు పరమౌషధం వైద్యుడాశించిన రోగ నివారణమే కాకుండా విశేషగుణాన్ని కూడా ఇస్తుంది కాళోజీ ప్రయోగించే పదాలూ, భావాలూ అదేపని చేస్తున్నవి అవి కల్పించి కండ్లకు కట్టించే చిత్రవిచిత్ర రూపధేయాలూ, విన్పించే ధ్వనులూ, మెరసే మెరపులూ, కురిసే అమృతధారలూ, సంతప్తులనూ శప్తులనూ సాదరించడంకోసం, ముక్తిలేని మూగజీవాల సందేశాలను మోసి దయలేని ధనాధిపతుల గుండెల్లో దడదడలు పుట్టించి అర్హులైన వారికి ఆనందైక్యం సంఘటించడంకోసం విడిపడ్డ జంటలను అతకడం కోసం

"అన్నపురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
కళాప్రదర్శన మొకచోట
కళారాధకులు ఒకచోట,
తనువులు ఉండే దొకచోట,
తలపులు ఉండే దొకచోట,
అనుభవమంతా ఒకచోట
అధికారంబది ఒకచోట

ఇట్లా అయన చెపుతూ పోతుంటే, సమాజంలో చిరవిరహంతో తపించే వ్యత్యాసాలకు ఐక్య సంఘటనను కూర్చే సత్వర యత్నం చేతాం, విప్లవం తెత్తాం, అనే ఆవేశం ప్రతి పాఠకుణ్ణి పట్టి ఊపుతుంది

భావసామగ్రిని కూరుచకోవడంలో స్వీయేం గితాన్నే పురమాయించినా డీ కవి ఉర్దూ మరాఠీ సాహిత్యాలతో కవికి బాగా పరిచయముంది ప్రభావాలు ఎందరి పైననో పడతాయి వాళ్ళంతా 'హిజ్ మాస్టర్స్ వాయిస్' అన్నట్టే ఉంటారు అయనపై పడ్డ ప్రభావాలు అంత అగ్పవగా బయటికిరావు కాని ఆధునిక తెలుగు కవిత్వంపై ఆయన వేసిన ప్రభావం స్వయంసమృద్ధిలో నుండి వచ్చిన సంపద పురాణ లక్షణాలతో పుచ్చిపోతూ, ఆధునికత పేరుతో బదులు తెచ్చుకొన్న భావాలతో అనుకరణ బాదస్తంలో తికమక పాలవుతున్న తెలుగు కవిత్వాన్ని పునరుజ్జీవింప జేసినాడు కాళోజీ భావాలు కావలసినవారికి బదులిస్తాడు కాని పుచ్చుకోడు అంతా సొంతం కాకపోతే కవులనే కవ్వించే నేర్పు ఎందరికుంది?

ఆయన భావప్రకటనా సామర్థ్యంలో ప్రస్ఫుటమయ్యే లక్షణాలు స్పష్టతా విశిష్టతా గుప్తతా క్లుప్తతా, సుందరతా స్వతంత్రతా నవ్యతా, సార్వకాలీనతా ముఖ్యమైనవి అడుగడుగునా అన్నింటి లోనూ ఒక కొత్త మలుపే

'ఓటును' గురించిన (మంజరి ద్విపద) స్పష్టతా గుణానికి మచ్చుతునక స్పష్టంగా చెప్పడానికి ఎంత ఓర్పు అవసరమో ఆ చెప్పినదాన్ని విశిష్టంగా చెప్పడానికి అంత నేర్పు అవసరం చెలిమి కలిమిని గూర్చి ప్రసంగిస్తూ

'కులముతో పనిలేదు గుణముతోడనులేదు
అందచందాలతో ఆవశ్యకములేదు
వయసుతో పనిలేదు వరుసతోడను లేదు
కలిమిలేములు రెండు కలిసి సయ్యాటాడు
నచ్చజెప్పటెకాని రచ్చకీడ్చుట లేదు
మానవత్వము మెరుగు, మర్త్యలోకపువెలుగు
సంపూర్ణ సహకార సంఘంబు మైత్రి '

ఇది నిజంగా దేవత లెరుగని 'దివ్యానుభవము' మహోన్నతమైన మానసిక సంస్కారమే విశిష్టత అది గల వారికే దేవత లెరుగని దివ్యానుభవము లభిస్తుంది కవితా రచనకు మంచిమంచి లక్షణాలు ఎవరెవరో ఎన్నెన్నో చెప్పారు కాని కవిలోని మంచి మనస్సు కవిత్వానికొక విశిష్టలక్షణం అనే సంగతిని మనం కాళోజీలో చూస్తున్నాం అవస్థలకు అనుకూలమైన ప్రక్రియను ఎన్నుకోవడంలో కూడా ఈ కవి సిద్ధహస్తుడు, రెండు రకాల పద్యాలనే ఎక్కువ రాస్తాడు (1) దేశిఛందస్సులు (మంజరీ ద్విపదలు, గేయాలు) (2) స్వచ్ఛందాలు (ముక్త ఛందాలు లేదా వచన పద్యాలు) అవీ,ఇవీ ఉర్దూ బాణీకి దగ్గరగా ఉంటాయి అంతర్లయనూ, భావలయనూ అల్లుకొంటూ సాగుతాయి అంత్యప్రాసలతో కొరడాలు పేనుతాడు యమకంతో గమనిస్తాడు పదాలతో గారడీ చేయదలచినవాళ్ళు 'పరాభవం' చిత్తగించండి అలంకారాలకోసం ఛందోవైవిధ్యం కోసం కవిత్వం వ్రాయడు అవి వస్తే వద్దనడు, రాకుంటే లాగడు ఆయన నడిపించిందే ఛందం, రచన అంతా అలంకార్యం

భావనాడోలతో, రసవ్యంజనతో, శబ్దనిష్ఠతో, అర్థవ్యక్తితో, వాక్యం మలుపుతో, ఒక వాక్యార్థానికీ మరో వాక్యార్థానికీ అంత్యప్రాసతో ముడిపెట్టి, అన్వయ, వ్యతిరేకాన్వయ, సమన్వయాలతో, అర్థాంతర కల్పనలతో, పాఠకులను కలకల లాడించే భవ్యభావ సంచాలకు డీ కవి

శ్రీని బడయ ఏద్దైనను
చేయ సాహసింతునేను
కైవల్యము శ్రీపదమున
కలదని భావింతు నేను
శాస్త్రకార్ల శాసనకర్తలు
జనులకు తాళికట్టని భర్తలు
వీలున్న ప్రతిచోట విఙ్ఞవీగుచు
అపరహిట్ల రౌతాను నే హిట్ల రౌతాను
తలదన్ను వానికడ
గాంధి నౌతాను నే గాంధి నౌతాను'

'ఒక సిద్ధాంతం పూనినపుడు కసి
మరోదానిని చేస్తుంది మసి
'భావానుగుణ్యం రూపం
శక్తినిబట్టి సాక్షాత్కారం'
'ఉన్నవంకల దిద్దిపోయేటిమిషతో
లేని వంకల తెచ్చి పెట్టేటి వయసు'

"రక్షణకు ఏర్పడ్డ బలగము
రక్కసుల పక్షంబు జేరిన
రాక్షసుల ఇష్టానుసారం
రాజ్యమును నడిపించినట్లే
ప్రపంచ చరిత్ర సాంతము
ప్రకటించును ఒక విషయము
మాంధాతల నాటినుండి
మార్పు లేదు ఈజగాన"

"రాయిరువ్వినా రాకెట్టువిసిరినా
గిట్టని వానిని కొట్టుటకేకద"

పై పంక్తులను చదివి, అసంఖ్యాకంగా వెలువడుతున్న నేటి కవుల రచనలతో వాటిని పోల్చి చూసుకొన్న తర్వాత కాళోజీకి ఇవ్వవలసిన ప్రత్యేక స్థానాన్ని కేటాయించకుండా ఉండలేం మన స్వతంత్రయుగ సాహిత్య చరిత్రలో ఒక ప్రకరణాన్నే ప్రారంభించవలసి ఉంది ఆయన కవితా సామగ్రిని విడమరచి చూడడానికి

ఆయన భావాలను మననం చేసుకొంటూపోతే సాధారణ తత్వాలకు అతీతమైన ఒక మానసికస్థితి ఏర్పడుతుంది అది సర్వసంగ పరిత్యాగుల ఆలోచనలకు భిన్నమై, భౌతిక స్వభావాన్ని బాహిరంచేసే లౌకిక సత్యం 'ఆ అకాశానికి మన్నై, పాతాళానికి మిన్నైన ఈ పుడమి మీద నివసించే ఏమానవ సంఘంలోనైనా ఆది అనుభూతమై ఉంది అదే ఆయన కవితలోని సార్వజనీనత విశ్వవిపణిలో ఏ కొనుగోలుదారు ముందైనా దాని విలువ దాని కుంది

రాముని భక్తుడైన హనుమదు
కృష్ణుని అనవాలు పట్టడు
నస్యం చూస్తే ఏవగింపు
జర్దారూపంలో గిట్టును కంపు

కవి భారతీయుడు కాబట్టి భారతీయ పౌరాణిక చారిత్రక జీవితంలోంచి ఉదాహరణలు అక్కడక్కడ వచ్చి పడ్డవి వాటి అసరాతో సృష్టించిన జీవిత పోరాటాల సత్యమే అంతటా ప్రతిబింబిస్తుంది హిమాలయ శృంగాలకూ వాందూమహాంబుధి తరంగాలకూ నడుమ మాత్రమే వినిపించే నాదంకాదు కాళోజీది

కాళోజీ కవిత్వాన్ని చదువుతున్నపుడు వింటున్నపుడు పెదవులు మౌనబంధాలను తెంచుకొని హాస మాత్రంగా విడిపోతుంటే హృదయం ఘోషయాత్రలో పడిపోతుంది కరుణ హాస్యాల వింత సంయోగం అంతటా రసపట్టు సాగినంత దూరం భీభత్సం హాస్యం నీడలవలె వెన్నాడుతుంటాయి

"చాపచింపు సామ్రాజ్యం
కోడిగుడ్డు కోహినూరు
బస్సుసీటు బ్రహ్మరథం
సానికొంప సాధుమరం
చాకిరేవు శాసనసభ
ఏదైతేం?
ఎచటైతేం?

పోటీపడి కాటులాడ

"నా చెల్లెని వెంటాడెడి రౌడీలకు 'సాలా'నై
రౌడీ తోబుట్టువులను వెంటాడుదు బావనౌచు
ఎవరిదేమి పోతున్నది?"

మనం నవ్వక తప్పదు నొవ్వక దప్పదు బహిరంగంగా నవ్వే తామనుకొన్న వాళ్ళం హృదయంలోకే ముడుచుకపోతాం మూల్గుతూ కూర్చుంటాం అక్కడ గూడా గెలిచిన దౌర్జన్యంవలె అపహాస్యం గెలిచేస్తుంది ముఖగహ్వరాలకు బదులు హృదయ కుహరాలే ప్రతిధ్వనిస్తుంటవి తప్పు దిద్దుకోలేక దారి చూసుకోలేక కవితో

పాటు మనం కూడా ఎందుకో హృదయంలో అన్ని ఆవేదనలను అనుభవిస్తాం

"చాపచింపు' ఖండికలో కథకునికి కవికీ ఉండే తేడాను సామాన్యపాఠకుడుగూడా చప్పున గ్రహించగలడు ఒక అనుభూతిని, నీతిని, చెప్పడానికి పెద్ద కథ రచిస్తాడు కథకుడు చిన్నమాటలో పెద్దకథలు చెపుతాడు కవి కోడిగుడ్డు అనడంతోనే రష్యాచరిత్ర 'కోహినూరు పేరు వినడంతోనే హిందూ దేశచరిత్ర జిగేలున ప్రత్యక్షమైతవి

సర్వేజనా సుఖినో భవంతు లక్ష్యం
స్వార్థం స్పర్ధా, ఈర్ష్యా సర్వత్రా ప్రత్యక్షం'

కత్తిది కేవలం ఏడ్పించడమే వంతు నవ్వించడం దానిచేత కాలేదు కలంలోంచి రెండూ (ఏడ్పించినా నవ్వించినా) ఉదాత్తంగా పుట్టుకొస్తవి కత్తికీ, కలానికీ ఉండే తేడాను వేమన్న తర్వాత కాళోజి ఒక్కడే బాగా చూపగలిగినాడు ఏడ్పించడమేకానీ కత్తిచేతులవాళ్ళు చేస్తే కటికవృత్తి కరినవృత్తి, కలం చేతులవాళ్ళు చేస్తే కరుణావృత్తి, కళావృత్తి కలం సాయంలేకుండా కత్తి చేసిన పనికి 'హింస' పేరు వచ్చింది

వినే వాని స్థాయినిబట్టి చెప్పేవాని పద్ధతులు మారుతుంటవి సభ్యతా సంస్కారం ఉన్న వాళ్ళకు చెప్పే పద్ధతి వేరు చిరునవ్వుల సైగలతో వారికి సదనద్ర హాస్యాలను బోధించవచ్చు ఇక సామాన్యుల ప్రపంచంలోకి వచ్చేసరికి చెప్పే రీతుల్లో ఎన్ని పద్ధతులనో అనుసరించవలసి ఉంటుంది అదే అవసరం కవికిగూడా ఉంది పూర్వకవులు చెప్పే పద్ధతులలో అంటే శైలిలో వృత్తి రీతీ సరళభావ ప్రకటనం, పరుషభావ ప్రకటనం వంటివి ఉండేవి కాళోజీ చెప్పవచ్చేనాటికి సమాజస్థితి అంతా మారికూర్చున్నది చెప్పితే వినేవాళ్ళతో ఎప్పుడూ చిక్కే లేదు చెప్పినా, చెప్పిన విషయాన్నే మరీ మరీ చెపుతున్నా, వినని వాళ్ళతోనే చిక్కులన్నీ వస్తవి చెప్పింది అర్థమై కూడా శరించే వాళ్ళకోసం చెప్పే పద్ధతులలో చెంపపెట్లూ, కొట్లూ, తిట్లూ అవసరమైతవి అట్లాంటిచోట కవి వాక్ప్రాగల్భ్యాన్ని మనం సకారణంగానే క్షమించవలసి వస్తుంది

"వటసావిత్రీ వ్రతమును
వారకాంత చేస్తుందని
ఎవరనుకొన్నారు? ఇట్లవునని
ఎవరనుకొన్నారు?
నిండిన గోదాములుండి
తిండిలేక చస్తారని
ఖాదీధారులలోనే
కాంగ్రెసిజము చస్తుందని,
ఎవ రనుకొన్నారు?
ఎవ రనుకొన్నారు?
మారాలిక లేబిల్ ప్యాకింగ్
మారాలిక స్టేజుల సెట్టింగ్
ఏడు తిరిగిన పంచాంగాలు
చూపవు తిథివారాలు
"నిజం మొగం దాస్తుంట
ఇజం మొగ్గ వేస్తుంటే
ఓటు బీటు కేగుతుంటె
సీటు సేటు జేబులుంటె
బ్రతుకు చితికి పోతుంటె
శాంతి శాంతట, శాంతి?
గుండా లీడరవుతుంటె
జండా దిగజారుతుంటె
జనం జడం అవుతుంటె
శాంతి శాంతట, శాంతి!'
"పగటి దోపిడుల ఆపగ లేని
ప్రభుత్వ ముండే దెన్నాళ్ళు?
ప్రతిష్ఠ పేరట తప్పులు దాచే
పాడు పద్ధతింకెన్నాళ్ళు?"

మర్మాలను చెరలాడిన ఈ వాక్యాలు నిద్రమబ్బు మొగాలనూ, కోతినీతి కొంటె బేరగాళ్ళనూ, తెలిసిన మూర్ఖలనూ సత్తాలేక సన్యాసులయ్యే వాళ్ళనూ మందలించడం కోసమే

అడుగడుగునా పరుల ప్రభావానికి లొంగి జీవించేది దుర్బల జాతి అని సమీపార్థంలో చెప్పడానికే "ఏ భాషరా? నీది ఏమి వేషమురా? ఈ భాష ఈ వేషమెవని కోసమురా?' వంటిగేయాల రచన జరిగింది దేశ, వేష, భాషాభిమానాలను గురించి నొక్కి, చెప్పనంత మాత్రాన విశ్వ సోదరభావానికి లోటు రానవసరంలేదు తల్లిని ఆదరించనివాడు పినతల్లినేమి ఆదరిస్తాడు? ఎనతల్లిని ఆదరించి తల్లిని దూరం చేయడం మాత్రం ఏం చక్కదనం?

మనం ప్రేమించే వాళ్ళు మనపై ద్వేషించి చంపడానికి వస్తున్నప్పుడు ద్వేషం తప్ప మరొటి అర్థం కాని వాళ్ళు మనచుట్టూ మూగినప్పుడు ద్వేషించి దెబ్బకొట్టి ఎలవంతంగా ప్రేమపారం నేర్పవలసి వస్తుంది ద్వేషించినట్టు కనిపిస్తూ ప్రేమించే వ్యతిక్రమ పద్ధతిని కొన్నిచోట్ల వినిపించినా మతరాక్షసులు చెలరేగి మానవత్వాన్ని చెరబట్టిన రజాకార్ల దురుద్యమంలో కవిలోని కరుణ కసినిదరిసింది కలం కత్తివలె మెరిసింది కన్నీళ్ళు కురిసింది మన స్త్రీల చెరచిన మానవాధములను మరచిపోకుండగ గురుతుంచుకోవాలె కాలమ్ము రాగానె కాటేసి తీరాలె సాటివాడు సహజీవనాన్ని కాలదన్ని చంపడానికి వచ్చినప్పుడు సహనం చచ్చింది ప్రతిగ్రహించి నిలిచి ప్రతీకారాన్ని ఉద్బోధిస్తూ భీమ ప్రతిజ్ఞలు నేర్పిన ఈ ఘట్టాలు విమత పక్షాలను వీరలక్షణాలతో ఎదుర్కోమనడమే రామాయణ భారతాల సమరనీతి కాళోజీ సాహిత్యనీతి

మంచిని పెంచుకోవడం కాళోజీకి మరొకడు నేర్పవలసిన అవసరం ఎన్నడూ లేదు మంచి అంటే చెడ్డకులొంగి చావడం కాదని ఆయనచెప్పే సూటి అర్థం కలసి బ్రతుకుదామనేవాళ్ళ కౌగిలింతలో ఆయన కండ్లు చెమ్మగిల్లుతవి పొట్టు నాది పప్పు నీది ఊదుక తిందాం కలసిబతుకుదాం అని చెప్పే కౌటిల్యులకు బుద్ధి చెప్పడానికి ఎన్నడూ వెనుతీయడు శత్రువు చెలరేగినపుడు సాహసానికి సన్యాసమిచ్చి పరదాస్యంలో బ్రతుకు తెరువును చూసుకొనేటందుకు రాజీపడడు అచ్చం వీర జాతకుడు

రజాకార్ల దుండగాలనూ చైనా దురాక్రమణాన్ని ఎదుర్కొంటూ ఒకే పద్ధతిలో ఆయన కలం నడిచింది మహమ్మదు వారసులూ మార్క్సు వారసులూ ఏకమై తోటి మనషుల రక్తంతో వసంత మాడినారు తమ చర్యలకు అనుకూలమైన భాష్యాలను చెప్పుకొన్నారు కాళోజీయే కాదు 'కలేజా ఉన్న ప్రతివ్యక్తి శోకించిన విషాద సంఘటనలు అవి శాంతిపేర, క్రాంతిపేర ఎందరెన్ని నక్క తర్కాలను, గడ్డ తర్కాలను వల్లిస్తున్నా, తోడివాళ్ళను చంపుదామనే తత్త్వాలు ఇప్పట్లో అర్థంకావు ఎప్పటికీ ప్రశంసనీయంకావు

కాళోజీని వేమన్నతో పోల్చి చూసుకొన్నారు కొందరు కాన్త నయమే కొందరైతే కాళోజీ కవితా పాదాలను మార్క్సిస్టు మీటరుతో కొలిచి చూసుకొని ఎటూలెక్కతేలక గుటకలు మ్రింగినారు ఏదైనా నిజం అనేది దాని పద్ధతిలో అది సాగుతుంది అసలు కవి అయినవాడు ఒకే ఒక ప్రత్యేక పద్ధతిలో ఆలోచించే రాజకీయ తత్వాల తతంగాలకు ఎన్నడూ దాసుడు కాడు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క ఇజానికి ధర బాగా పలుకుతుంది నిన్నటి మతాల గతి ఏమైందో నేటి ఇజాల గతీ అంతే అంగడి సరకుల ధరలలాగా విన్పించే ఇజాలు వేరు నిజాలు వేరు

నానా ఇజాలకు చూడ
నా ఇజానిదే అడుగున జాడ
ఇకపై చెల్లవని శ్రీశ్రీ అనినంత
మోసం దౌర్జన్యం తగ్గిన దెంత?
ఇంకానా ఇకపై చెల్లవు
ఏమైనది ఎందుకు చెల్లవు?

ఆయనది బూటకపు మార్క్సిజం కాదు బుద్ధిగలిగి బతికే మనిషి ఇజం వృత్తినీ ప్రవృత్తినీ జోడించి కవిమూర్తి అయినాడు స్ఫూర్తిని పెంచుతున్నాడు పంచుతున్నాడు సర్వస్వతంత్రుడైన ఆయనకు అంధపరదేశమూ అగాధమీ జీవితమూ నచ్చలేదు నిత్య సత్య గవేషణ శాస్త్రదాస్యం సృష్టించే నూతన ఈతిబాధ ఆయన ఆలోచనలో శబ్దంలో రచనా శిల్పంలో కనిపిస్తున్నవి

కవిత్వం వ్రాయడానికైనా వినడానికైనా రసికత్వమే కావాలె అన్నాం విన్నాం ఇందాక అదికాదు ధైర్యమే కావాలె కవిత్వమొక కల్పనగా విరామకాల వినియోగానికి వినోదకళగా కల్పించుకొన్ని వర్గ నాగరికతా విలాసంగా భావించిన రాజుల రోజుల్లోనే ఈ 'రసికత్వం' అనేమాట వాళ్ళ అవసరంకోసం పుట్టి ఉండవచ్చు కవిత్వమంటే కేవలం కల్పనే కాదుగదా! అనుభూతమైన విషయాన్ని హేతుబుద్ధి అవసరం లేకుండా ఏదో పదవాక్య చాతుర్యంతో కలగాపులగంచేసి కూర్చే రచన కల్పన, అది అబద్ధానికి పర్యాయపదం నిత్య సత్యాన్ని మనోరంజకంగా ప్రవచించే కవిత్వానికి అలంకరణగా వచ్చిన కల్పన సత్యకల్పన అయి నిలుస్తుంది

కవిత్వం అంటే ఒక సత్యకల్పన అనుకొన్నంత మాత్రాన సరిగ్గా అర్థంకాదు 'దర్శనం' బంగారం వంటిది దాని ఆసరాతో చేసిన సొమ్ముల వంటిది కవిత్వం

సత్యదర్శనానికి కవిత్వానికి ఇంత దగ్గరి సంబంధం ఉంది అయితే సత్యాన్ని దర్శించే శక్తి ధైర్యం ఎందరికుంది?

"చతుర మతులు, దేబెమొగాలు
జగతిలో రెండే రెండు రకాలు,
చతురవర్గ విలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు"
"ప్రజాస్వామ్యం గణరాజ్యం
చతుర నాయకమ్మన్యుల భోజం
పాలితులపై జరిగే శోషణ
పాలకవర్గం చేసే పోషణ
నెత్తిన నోరుంటే చాలు
పెత్తనం లభిస్తుంది'
"ఎవరికి చేపని ఎండిన చన్నులు
రసవిహీనములు రాజకీయములు'

ఇట్లా తూర్పారబట్టడం, దుష్టమంత్రుల దుశ్శాసనుల ధృతరాష్ట్రుల మొగాల మీద నిప్పులు చెరుగుతూ నిజాలను పేనుకొని కొరడాలల్లి, ఇజాల సంచాలకుల భుజాలు బొబ్బటిల్లేలా ఫెడాఫెటట్లు కొడుతూ జన వాహినుల నడ్డగించే కుటిల అనకట్టలను తెంచేస్తూ పోవడం పిరికినరాలవాళ్ళకు చేతనవునా?

మనం స్వతంత్రులమా? అస్వతంత్రులమా? అనే ప్రశ్నలు ప్రతి పౌరునీ వేధించే ఈ రోజుల్లో కాళోజీ తన 'కలేజా'ను విప్పి, విడమరచి వేసారక చెవినిల్లు కట్టుకొని చెపుతున్నా, కనీసం విద్యావంతులైనా, అందులోనూ నిరంకుశాధికారం గల కవులైనా ధైర్యంగా ప్రవర్తిస్తున్నారా? వెనుకటివాళ్ళ నయం నిలువునా మనుషులను పాతేసి ఏనుగులతో తొక్కించే రాజుల రోజుల్లో కూడా "మనుజేశ్వ రాధములను" ఎదిరించి బతికినాడొకవి 'వాలవీజనుల గ్రాలుచు ఈగకు నంటిని ఖరవర్తు లాండనములు" అంటూ ఆ మనుజేశ్వరాధముల మర్మాలను ఛేదించి మనగలిగినాడు మరోకవి ఏదీ ఒక్క పంచాయతీ మెంబరుతో కలహించి ఊళ్ళో క్షేమంగా బ్రతకమను, మనలో ఎంత మందికి ఆ ధైర్యం ఉంది? కాబట్టి సత్యదర్శనమైన కవిత్వాన్ని గ్రంథించే వాళ్ళకూ, గ్రహించే వాళ్ళకూ రాసిక్యం కంటె ధైర్యమే ముఖ్యంగా కావలసింది

కాళోజీ రాజకీయాలోచనలను గురించి తడవడం తప్పనిసరి ఆయన ఏం కావాలంటున్నాడు? దేన్ని వ్యతిరేకిస్తున్నాడు? అంటే ఓటువేసే వాళ్ళకు బుద్ధి కావాలంటున్నాడు ఓటుకాశపడి మాటయిచ్చి దాటేసే వాళ్ళను వ్యతిరేకిస్తున్నాడు

రాజకీయ కుటిల రహస్యాలను ఆయన రచ్చకీడుస్తున్న మాట వాస్తవం, చెప్పిందే చెప్పి వ్రాసిన దాన్నే తిప్పితిప్పి వ్రాస్తున్న మాటా వాస్తవమే అప్పుడు వ్యంగ్యం దెబ్బతినే సంగతికూడా కొంత సంభవమే పరాభవం లో ఋతువు కొక్కటి చొప్పున ప్రచురించిన సంపుటాలలో కొన్ని రచనలు కవిత్వోపన్యాసాలవలె కనిపిస్తవి

రాజకీయాలు ప్రజాజీవనానికి నిత్యావసరాలు ఎవరూ వాటిని వ్యతిరేకించ నవసరంలేదు రాజకీయాలలో చేరి వాటికి చెడ్డ పేరు తెచ్చిన వ్యక్తులదే తప్పుగాని రాజకీయాలదే తప్పు అని కాళోజీ అనడంలేదు

ఈ మధ్య ఆయన కావ్యకర్తవలె చెప్పడంలేదు ఆయన కవిత్వం ఉపన్యాసంవలె కనిపిస్తుంది ప్రతిపక్ష రాజకీయ కార్యకర్తల 'అసంతృప్తి' ధోరణిని ఎక్కువగా వినిపిస్తుంది

ఆయన అంత స్వేచ్ఛగా కవిత్వోపన్యాలివ్వడానికి తగినన్ని కారణాలున్నవి (1) బాధ్యతలను విస్మరించవద్దని తోటివాళ్ళకు పదేపదే చెప్పే సత్పౌరుడు ఆయన (గొడ్డి పాట చదవండి) (2) ప్రజాస్వామ్యంలో ఉన్నాడు తనకు వాక్స్వాతంత్ర్యం ఉన్నదనే ధీమా (3) మహాత్ముడు కలలుగన్న రాజకీయ, సామాజిక, ఆదర్శాలు ఆయన ఆత్మను ఆవరించి ఉన్నవి (4) ఆయన పుట్టుకవి పైగా మనసు సున్నితం, మాట సూనృతం (5) ప్రస్తుత రాజ్యాంగాన్ని గురించి ఆయనకు అంతగా విరోధం లేదు దాన్ని అమల్లో పెట్టబోయి అసమర్థులై, అవస్థపాలై, చెడుపరిణామాలను సృష్టిస్తున్న వాళ్ళమీదనే ఆయన తిరుగుబాటు ఉద్యమాన్ని నడిపించమంటున్నాడు కవిత్వంలో తిడుతున్నాడు అదే వృత్తి పునరావృత్తి అవుతూ ఉంది పరిస్థితులు అట్లా ప్రేరేపిస్తున్నవి ఆయన పౌరులపక్షం వహించిన ప్రజాకవి అంటే ప్రజాస్వామ్యకవి అధికారలుబ్ధులచర్యలపై ఎప్పటికప్పుడూ తన అధిక్షేపణను తెల్పడం హక్కుగా భావిస్తున్నాడు

ఎగతాళి, హేళన వెక్కిరింత వెటకారం వికట త్వం అపహాస్యం మందలింపు, నింద మొదలైన లక్షణాలు అధిక్షేప కవితకు తొడుగులు అధిక్షేపం ఉత్తమ శ్రేణికి చెందిన రచన కాదని కొందరి అభిప్రాయమున్నా సహృదయుల ప్రశంసలను అది పొందుతూనే ఉంది మన సాహిత్యంలో పుట్టుక వచ్చిన వ్యాజనింద, వ్యాజ స్తుతులకూ ఆంగ్ల సాహిత్యకులు మెచ్చిన సెటైర్ ప్యారడీ పద్ధతులకూ నాడూనేడూ మంచి చెలామణి లభించింది కేవలం వ్యక్తిగత విషయాలపైకే దూకితే అధిక్షేప కావ్య మంత అధమమైంది ఉండదు అదే సామాజిక ప్రయోజనా లకు ఉద్దేశించిందైతే దానికంటె ఉత్తమమైంది గూడా మరొకటి ఉండదు కాళోజి తన వ్యక్తిగత సమస్యలను దృష్టిలో పెట్టుకొని అధిక్షేపించినట్టు ఎక్కడాలేదు ఒక్కసారి నేటి ప్రపంచ పరిస్థితులను పారజూడగలిగితే ఆయన కలం అట్లా ఆడడానికి కారణం తెలిసిపోతుంది చూడండి

ప్రపంచనాయకుల స్థాయిలో కన్పిస్తున్నవాళ్ళే ఒకచోట బుజాలు రాసుకొంటూ మరోచోట ద్రోహాలతో ద్వేషాలతో పరస్పరం దుమ్ము దుమారం గుప్పుకొంటు న్నారు దెప్పుకొంటున్నారు అధికారంకోసమే దురాక్రమణ చెలరేగుతూ ఉంది పైకం మైకంలో పక్కవాణ్ణి మనిషిగా గుర్తించడంలేదు మరాలు మురాలుగా మారినవి మతాల స్థానంలో ఇజాలు మారణహోమాలు చేస్తున్నవి సభ్యతా సంస్కృతులపేర మోసం వక్రభాష్యాలను ప్రచారం చేస్తు న్నది మత వ్యాపార రాజకీయ తతంగాలు అంతర్జాతీయ స్థాయిలో పోటీలు పెంచుకొని, శాస్త్రాన్ని ఆయుధంగా ధరించి, హేతువాదాన్ని ఏకపక్షం చేసుకొని, ఆత్మవిమర్శను రోసి, సహజీవనానికి చిచ్చుపెడుతూ, మానవత్వం మొగాన మసిపూసి, నరలోకాన్ని నరకలోకంగా మారుస్తున్న ఈ తరుణంలో ప్రజాస్వామ్య దేశంలోని పౌరుడైన కాళోజి కలం బట్టి అధిక్షేపిస్తున్నాడు అభిశంసిస్తున్నాడు అట్లాంటి కవి నిజంగా ఎన్నుకోని శాసనకర్త

ఒక్కొక్కచోట అధిక్షేపిస్తున్నాడో అన్యాపదేశంగా పలుకుతున్నాడో పొగుడుతున్నాడో పొడుస్తున్నాడో అదీ ఇదీ అవును కాదనిపించే అవస్థలో పాఠకులను ముం చేస్తూ వ్రాస్తూ పోతుంటాడు హాస్య రసాధిదేవత అయిన గణనాయకుని సంభోదిస్తూ 'అధినేతా వినాయకా' అనడంతోనే ప్రజాహితం మరచి విఘ్నాలకు నాయకత్వం వహించే ఛోటా బడా నాయకులందరూ పరోక్షంగా తోస్తారు గణనాయకా అని ఎత్తుకోవడంలోనే మురానాయకుని పేరుబెట్టి పిలిచినట్లుంటుంది

'నీ బొజ్జను నింపనిదే
బాబూ మాపని సాగదు,
మొదలె నిన్ను మెప్పించక
మొదలేకాదేపనియును
నీ అర్థము రాకుండగ
నీతి నేర్పు చాలు మాకు

ఇట్లా సాగదీస్తూ గణనాయకుల ప్రకృతులను పట్టి చూపుతాడు 'చేదుగొంతు అయ్యకన్న నీవన్ననే భయము మాకు విషవాక్కులు వినిపించే బోళా అయ్యల కన్న బొజ్జకదలకుండా కూర్చొని విఘ్నాలు కల్పించేవాడే అపాయకారి మరి

"నీ పేరుతో టోపి నిత్యమైపోయింది
నీ మాట వెనుకనే మామాట చెప్పాము
ఇంటింటిలో నిన్ను వ్రేలాడదీశాము
ఇంకేమీ కావాలి?
ఇంకేమి కావాలి?

"ఓగాంధి' అని సంభోదిస్తూ వ్రాసిన గేయమిది బాపూజీ తలంపులకు తలంపులై కొత్త నైరాశ్యాలు తలయెత్తిన పరిస్థితులలో ముక్కుమొగం లేకుండా చాలామంది మొద్దుమొద్దుగా విమర్శించినారు నేడు గాంధిపైగల భక్తిని ఇంత ముద్దుముద్దుగా పరామర్శింప గలిగినవాడు కాళోజీ ఒక్కడే

అధిక్షేప పద్ధతితో భావధ్వని వాస్తవికత వినోదం, ఉద్వేధ, జాతికి కావలసిన ఆత్మవిమర్శ, వగైరా వగైరా ఒకటి వెన్క మరొకటి తగులుతుంటే ఎటూతోచదు ఏడ్పురాదు ఏడ్వవలసిన పరిస్థితుల్లో నవ్వే నాగరికుల మీద మరోరాయి విసిరినట్టు కాళోజి మాటలకు కడుపుబ్బ నవ్వాము ఇంకేమి కావాలి?' అంటాడు గేయం చివరలో

సమకాలిక జీవిత పోరాటంలో అంతగా ఆరాట పడి ఆవేదనాత్మను పెంచుకొని, కన్నీట కలమద్ది కవిత్వాన్ని రచిస్తున్న కాళోజీలోని మానవుడు విరాగికాడు, నిరాశావాదీ కాడు అతడొక భావవిప్లవోద్యమానికి కార్యకర్త అంతే కాదు భావసంస్కర్త

రావలసిన కొత్తను ఆహ్వానిస్తూ అభినందిస్తాడు ఒక పంచాంగం మారి మరో పంచాంగం రానున్న మలుపులో రచించిన గేయమిది

పాతకేమొ ఉండి ఉండి
పట్టుదప్పి పోతున్నది
కొత్త కేము సరికొత్తని
పట్టు దొరికిపోతున్నది
ప్రకృతి బయటపడుతున్నది
వికృతి మాయమవుతున్నది
నవత నగచు వస్తున్నది
సవిత వెంట వస్తున్నది
యువత ఈలవేస్తున్నది
కవిత భవతు అంటున్నది
కొత్త చీపురొస్తున్నది
చెత్త కేడుపొస్తున్నది

ఇప్పటి ఆయన కలం చప్పుడులో సామాజిక విప్లవ ఝుంఝులు హోరుహోరుగా వినిపిస్తున్నవి

క్రీ శ 1954 వరకూ ఆయన రచించిన గేయ సంపుటి 'నా గొడవ' అలంపురంలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు వార్షికోత్స "లలో శ్రీశ్రీ ఆవిష్కరించింది ఇటీవల మరికొన్ని ఖండికలతో అది అచ్చయింది అదే పేరుతో 'పరాభవ' సంవత్సరంలో ఋతువుకొక్కటి చొప్పున ప్రకటించిన సంపుటులున్నవి

కాళోజీ కథలు వ్యాసాలు రచించినాడు 'రచన' పేరుతో వెలువడ్డ ఇటీవలి వ్యాస సంపుటిలో ఆయన వ్రాసిన వ్యాసం చాలా విలువైంది ఒకే ఒక ఇజానికి తాకట్టు పడిపోతే రచయిత వ్యక్తిత్వం ఎట్లా దిగజారి పోతుందో ఆ వ్యాసంలో చక్కగా విశ్లేషించి చూపినాడు ఖలీల్ జిబ్రాన్ రచించిన 'ది ప్రాఫెట్' అనే పుస్తకం జగద్విఖ్యాతమైంది దాన్ని తెలుగులోకి దించినాడు

ఒక తరాన్ని కదలించే పట్టుదలతో కొన్నివేల పుటలను రచించిన కవిని యుగకవి' అన్నారు పాకెటు సైజులో ఒకటి రెండు వందల పుటలే రచించినా కాలకాలాలనూ కదలింపగలిగే కాళోజీ ప్రతియుగంలోనూ కదిలిస్తాడు

**జీవిత రచన**

చిట్ట చివరకు చెప్పినా మొట్టమొదలే జ్ఞాపకం ఉంచుకోదగిన సంగతి ఒకటి రచయిత వ్యక్తిత్వాలు రెండు రకాలు (1) నిత్య జీవితంలో కనిపించే వ్యక్తి (2) రచనల్లో కనిపించే వ్యక్తి నిత్యజీవితంలో కనిపించే కాళోజీ అలవాట్లనూ, అభిరుచులనూ, బతుకుతున్న పద్ధతినీ సామాన్యులంతా అనుసరించవచ్చు, చాలా తక్కువ ఖర్చుతో బతకగలుగుతున్నాడు సామాన్యుల ప్రతినిధులమని చెప్పుకొనే కొందరి కవుల నిత్యజీవితాలు సామాన్యులు అనుసరించడానికి ఏమాత్రమూ వీలు లేనంత ఖర్చు భారాలతో కనిపిస్తున్నవి నిత్యజీవితంలో గూడా తనను ప్రజలు అనుసరించగలిగేస్థాయిలో ఉండే కాళోజీ ఆదర్శం ప్రత్యేకంగా చెప్పుకోదగ్గది మాయమర్మాలూ కల్లకపటాలూ నచ్చని కాళోజీ తన రచనలలో పాఠకులకు ఎట్లా కనిపిస్తాడో నిత్య జీవితంలో అట్లే ధీర హృదయాన్నీ నిజాయితీ గల దినచర్యనూ చూపగలుగు తున్నాడు ఇట్లాంటి వ్యక్తులున్న సమాజం ఏనాటికీ ఎవ్వనికీ తలవంచవలసిన అవసరం రాదు కవిత్వం సమాజానికి అర్పితమయ్యేది జీవితం సృష్టికర్తకు అర్పించుకోవలసింది ఉదాత్తాశయాలతో జీవితాన్ని రచించుకొన్న కాళోజీ ఒక ఆదర్శ మానవుడు మనీషి అయిన కాళోజీ ఒక మహాతత్వానికి ప్రవక్త, మానవులదంతా ఒక కుటుంబం అని ఆయన ప్రగాఢ విశ్వాసం మానవుని మనుగడకు అడ్డంవచ్చే మతాల పేరెత్తినా, ఇజాల పేరెత్తినా విధానాల పేరెత్తినా ఆయన సహించడు తోటి మానవుడు తండ్లాడుతూ బతికేవిధానం ఏదైనా సరే బహిరంగంగా వ్యతిరేకిస్తాడు ఈ ఉద్దేశాలతోనే ఆయన ప్రజాస్వామ్య భారతదేశంలో ప్రజాకవిగా నిలుస్తున్నాడు 'ప్రజల చేతిలో రాజకీయాధికారం ఉండడం ఏనాటికైనా మంచిదే అని అభిప్రాయపడ్డ రస్సెల్ భావాలతో ఆయన ఆలోచనలు కలుస్తున్నవి ఆయన ఆశయాన్ని ఆదర్శ భావవాదం కింద జమకట్టి లోకం పోకడ లోకానిదే, కాళోజీ గొడవ కాళోజీదేఅని ముక్తసరిగా సరిపుచ్చుకొనేవాళ్ళు మానాభిమానాలు కాశిలో విడిచినవాళ్ళే 'నా గొడవ అని అన్నా ఆయన వ్రాసి చూపిందంతా "మన గొడవ" కాదా?

' ఉదయం కానేకాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లే ఉండాలనుకోవడం దురాశ"

ఈ రెండు పాదాల ఆయనను ముందు ముందు ఎన్ని తరాల మీదనైనా నడిపించ గలుగుతవి అవకాశం, ఆరోగ్యం, కలసివస్తే కాళన్నను గురించి ఓ గ్రంథమే వ్రాయాలని నా ఆకాంక్ష

# "తెలంగాణా ఆదునిక సాహిత్య ముఖద్వారం"

- దాశరథి

మనం జీవితంలో ఏమేమి చూచామో జీవితం లో నుంచి ఏయే అనుభవాలు పొందామో మనందరికీ వెంటనే ఆసక్తిని కలిగించే యే విషయాలను గూర్చి ఏమని ఆలోచించామో వాటివల్ల ఎట్లా ప్రభావితులమైనామో అదంతా రికార్డు చేస్తే సాహిత్యం అవుతుంది శబ్దాల్లో శతాబ్దాల సహస్రాబ్దాల పొడుగు మానవ జీవితాన్ని ప్రకటించడమే స్థూలంగా సాహిత్యం

జీవితంలో ఇంత దగ్గరి సంబంధంగల సాహిత్యాన్ని జీవితపు మాలిన్యం అంటకుండా దూరంగా ఊహా లోకంలో స్నానమాడించి, పవిత్రంగా ఉంచడానికి ప్రయత్నించే సాహిత్యకారులు కొందరు అన్ని కాలాల్లో ఉన్నారు వారితో మనకు ప్రమేయం లేదు కాడలు, తీగ కొమ్మలు, వేళ్లు నేల ఏమీ లేకుండానే వికసించే ఆకాశ కుసుమం వంటి సాహిత్యం మనకు ఉపాదేయం కాదు

ఉదాత్తమైన సాహిత్యంలో అధునికమని, ప్రాచీనమని ఏమీ ఉండదు ఇవి కేవలం కాలాన్ని నిర్ణయించుకోడానికి ఉపయోగపడే శబ్దాలు, వెనుకటి సాహిత్యాన్ని ప్రాచీనమనీ ఈనాటి సాహిత్యాన్ని అధునిక మనీ అనుకోవాలి ప్రతి అధునికుడూ నవ్యుడు కానక్కర లేదు పురాతన రీతిలో వ్రాసే ఈనాటి రచయిత కూడా అధునికుడే అతడు నవ్యుడు కాకపోవచ్చును

ఒక్కొక్కని ఊహింపులో ఒక్కోరకమైన విశిష్టత వుంటుంది ఆ ఊహింపుకు శబ్దత్వం కల్పించడంలో ఒక్కొక్కడు ఒక్కోరకమైన పనితనాన్ని చూపిస్తాడు ఆ ఊహింపులో ఆపనితనంలో ఉన్న ప్రత్యేకత అతనికి ఒక ప్రత్యేకతను చేకూర్చి పెడుతుంది

చలనశీలమైన మానవ జీవితంతో సంబంధం ఉన్న రచన గుండెల్ని కదిలిస్తుంది గుండెల్ని కదిలించే రచనకు గుండెల్ని కదిలించే ఏదో సంఘటన ఆధారశిల అవుతుంది వాల్మీకికి వ్యాధుడి వలె ఏదో ఒక వస్తువు కోపకారణము అయి, క్రౌంచపక్షివలె ఏదో ఒక వస్తువు కరుణ కారణమై రెంటి కలగలుపులో కావ్యం పుడుతుంది సాహిత్యం ఉద్భవిస్తుంది

తెలంగాణంలో వ్యాధుడు క్రౌంచపక్షి దుష్టపరి పాలకుని రూపంలోనూ అనాధ ప్రజారూపంలోనూ సాహిత్యకునికి సాక్షాత్కరించినవి తరతరాలుగా మూగ పడిన గొంతు విప్ప అజ్ఞాతపు వాల్మీకం విదుల్చుకుని అతడు బయటికి వచ్చినాడు

ఆయనే సురవరం ప్రతాపరెడ్డి ఆయనే కాళోజీ నారాయణరావు ప్రతాపరెడ్డి ఎక్కువగా పద్యాలు వ్రాయని గొప్పకవి కాళోజీ ఎక్కువగా వచనం వ్రాయని గొప్ప విమర్శకుడు వీళ్ళు సృష్టించిన ప్రతిపంక్తీ బంగారం ప్రతివాక్యూ ఒక బాణం ఒకరు రాజకీయాలకు కొంత దూరంగా వుండి సాహిత్యమే తన ముఖ్యవిషయంగా పెట్టుకున్నట్టు కనపడతారు మరొకరు సాహిత్యాన్ని కాస్త పక్కకుపెట్టి ఎప్పుడూ జైళ్లూ పోరాటంలో ఉన్నట్టు కనబడతారు కాని ఇరువురూ రెండింటిలో సమానంగా పాదం పెట్టినవారే తెలంగాణాలోని ఆంధ్రోద్యమంలో, స్వాతంత్ర్యోద్యమంలో సంపూర్ణంగా పాల్గొన్నవారే ఒకరు హైదరాబాద్ నగరంలో ఉండి దుష్టుల గుండెల్లోకి శబ్దాలతో దాడిచేస్తే, ఒకరు శతాబ్దాల క్రింది ఆంధ్రాన్నత్యాన్ని చాటే ఓరుగల్లులోవుండి, తెలుగువీరుని అలనాటి ధీరతను చూపి, శత్రువుమీదికి దండెత్తినారు ఒకరు పుస్తకాలే తన సర్వస్వంగా భావిస్తున్నట్టు అనిపిస్తే ఇంకొకరు ప్రజలే సమస్తం అనుకుంటున్నట్టు కనబడతారు ఆయనకు ప్రజలలో ఉన్న పలుకుబడి ఈయనకు పుస్తకాలతోగల అపారమైన పరిచయం తెలంగాణీయులంతా ఎరిగినదే

ఈ యిరువురి సమాహారమే తెలంగాణాలోని అధునిక సాహిత్యానికి రూపం కట్టింది ఈమాట నేనంటే కొన్ని పెద్ద తలకాయలకు కోపం రావచ్చు అయితే వారి ముఖప్రీతికి అబద్ధం చెప్పలేను నేను పేర్కొన్న ఈ యిరువురిలో నేడు ఒకరు మనలో లేరు రెండవవారు అంచుమించు రాజకీయ సన్యాసం చేసి మొదటివారి సాహిత్య ప్రక్రియలో పడినారు కనుక నేడు వీరిని గూర్చి చెప్పడం, వీరి పదవులను, అధికారాన్ని బట్టి కానేకాదనేది

స్పష్టం కేవలం వీరి అర్హతనుబట్టే అనేది దృష్టం

ఆంధ్రుల సాంఘిక చరిత్ర ప్రతాపరెడ్డి అయి ఢిల్లీలో ఉన్నతపదం అందు కున్నది (ఆయన లేని నాడయినా) 'నాగొడవ' అఖిలమానవుల గొడవగా ఆంధ్రా వని వ్యాపించింది వీరికి వ్యష్టి చింతలేదు సమష్టిచింత తప్ప కనుకనే ఆంధ్రుల సాంఘిక చరిత్ర ఆంధ్రులందరిదీ నా గొడవ అందరి గొడవ

ఈ రెండూ చదివితే సాహిత్యరంగంలో తెలంగాణా శక్తి తెలుస్తుంది తెలంగాణాలో ఆధునిక సాహిత్యం యొక్క రూపం కొంతగాకుంటే కొంతైనా కన్నులకు కడుతుంది

ఆధునిక సాహిత్యం తెలంగాణాలో పుట్టి పెరిగిన వివరాలు నేడు ఇంతకుమించి రాయకూడదు ఎందుకంటే నా ప్రసక్తి రావలసి వచ్చే ప్రమాదం వుంది కనుక ముగిస్తాను

(1956లో దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రచురించిన తెలంగాణం వ్యాస సంపుటి మొదటిభాగం నుండి దాశరథి వ్రాసిన ఈ వ్యాసం పునర్ముద్రితం)

❖ ❖ ❖

# స్నేహశీలి శ్రీకాళోజీ

- ఆచంట జానకిరామ్

కొందరి నైజము ఏదో ఒక సంఘటనను గురించిన ప్రస్తావన అతినిలువైనదిగా తమ హృదయ సీమను పదిలపరచు కొనుట ఎప్పటిమాట! పదిహేను ఏండ్ల క్రితము జరిగినది నేను ఎన్నటికీ మరచిపోలేను అప్పటికి నాకు శ్రీ కాళోజీ నారాయణరావుతో ప్రత్యక్షంగా పరిచయము కలిగి ఉండలేదు అటువంటప్పుడు, ఒక రోజున ఆయన హైదరాబాద్‌లోని తాజ్‌మహల్ హోటల్‌లో ఒక మూల ఒక్కడూ కాఫీ త్రాగుచున్నారట అప్పుడు హైదరాబాద్‌లోని ఎల్ ఐ సి ఆఫీస్‌లో ఒక పెద్ద ఉద్యోగ ములో ఉన్న నా చిరకాల స్నేహితుడొకడు కాళోజీని వెనుక నుంచి చూచి, దగ్గరకు వెళ్ళి మితిమీరిన స్నేహ భావంతో ఆయన వీపును గట్టిగా చరచి, "దొంగా! జానకిరామ్!! నాకు తెలియకుండా ఈ ఊరు ఎలా వచ్చావు?" అని ప్రశ్నించాడట తనకు (స్నేహభావంతోనైనా) గట్టిగా తగిలిన దెబ్బనుండి తేరుకుంటూ, తాను చేసిన పొరపాటుకు తెల్లపోయిన నా స్నేహితునితో కాళోజీ అన్నారట "దెబ్బ మాత్రం చాలా గట్టి దెబ్బే తగిలింది, కాని, మీరు నన్ను జానకి రామ్‌గా భ్రమించడము నాకు గర్వకారణము" అని ఆ సంఘటనను గురించి తరువాత తెలిసిన నాకున్నూ అది చాలా గర్వకారణమే!! ఆ తరువాత, ఉద్యోగరీత్యా ఓరుగల్లు ప్రాంతాలలో పర్యటిస్తున్న నాకు శ్రీ కాళోజీ నారాయణరావుతో పరిచయం కలిగింది మొదటిచూపులోనే అనిర్వచనీయమైన పరస్పర స్నేహభావము అంకురించి స్నేహలత చివురు తొడిగింది ఆ పర్యటనలోనే నేను రెండు మూడు సార్లు హనుమ కొండకు వెళ్ళడమూ వారితో కలిసి కొన్ని సభలను జరుపడమూ కొందరు క్రొత్త స్నేహితుల్ని సంపాదించ డమూ జరిగింది ఆసందర్భాలలో శ్రీ కాళోజీ నా ఎడల ప్రకటించిన స్నేహభావము జన్మలో మరువరానిది

మరొకొన్నాళ్ళకు భారతదేశానికీ పీకింగ్ చీనాకు మధ్య సంగ్రామము ప్రారంభమైనది ఆ సందర్భంలో వారు "తుది విజయం మనది నిజం" అనే మకుటంతో ఒక ఖండకావ్యమును వ్రాశారు ఆ రచనను గురించి విపులమైన విమర్శ 'నేటి వీరోచిత కవిత' అనే పేరుతో నేను పత్రికాముఖమున ప్రకటించాను అప్పటి ప్రభుత్వము కొంత ధనసహాయముచేసి, కొందరు కవుల చేత పీకింగ్ చీనాను ప్రతిఘటించే కవితను వ్రాయించారు కాని, ఆ కవిత అంతా ఒక ఎత్తూ, కాళోజీ రచన ఒక్కటీ ఒక ఎత్తూ నేను వ్రాసిన విమర్శలో సందర్భానుసారంగా ఈ అభిప్రాయాన్ని ప్రకటించాను "ఈ తుది విజయము

మనది నిజము అనే రచనను ప్రభుత్వమువారు లక్ష ప్రతులు ప్రచురించి ప్రకటించాలి అన్నాను

ఆ రచనలో శ్రీ కాళోజీ కొన్ని అమూల్యమైన విషయాలను గురించి ప్రస్తావించారు నేటి భావ కవులను వారు కలము కుంచెకులమువారు" అన్నారు ఈ ప్రయోగము చాలా అందముగా కుదిరినదని నా భావము వారు తమ రచనలో ఈ అభిప్రాయాన్ని వెల్లడించారు ఈ భయంకర సమయంలో ఈ కవులు శృంగారరస ప్రధానంగా రచన సాగిస్తూ అలివేణుల కీల్జడల అందాన్ని వర్ణిస్తూ హిమాలయ ప్రాంతాలపైకి ప్రాకి వస్తున్న మహాసర్పాన్ని గుర్తించడంలేదు అష్టపదులూ జావళీలు పాడుకుంటూ కాలము గడిపే సమయంకాదిది ఆ సందర్భంలో ఎటువంటి వారి హృదయమూ రుల్లుమనే ఒక వాక్యం వ్రాశారు 'నందీశ్వరు గంగడోలున ఈ రక్తపు చారలేమి?' అని

కాళోజీ నారాయణరావు ఎటువంటి అభిప్రాయాన్నీ మొమాటము లేకుండా ప్రకటిస్తారు వేయి వరహా లిచ్చినా తెలుపును నలుపుగానూ, నలుపును తెలుపు గానూ వర్ణింపరు

పీకింగ్ చీనాతో యుద్ధము జరిగిన పిదప శ్రీలంక ప్రధానియైన శ్రీమతి బండారు నాయకే ఇరు దేశముల మధ్య సఖ్యతను చేకూర్చే యత్నమును చేసినారు అందు కాళోజీ ఉద్దేశంలో, శ్రీలంక ప్రధాని కొంచెముగా మన ప్రత్యర్థి తరపుననే పక్షపాతము చూపించినట్లు భావించడము జరిగినది దీనిని గురించి విశదపరుస్తూ 'బండారు నాయకే బండారము బయట పడింది' అని చమత్కరించారు శ్రీ కాళోజీ శ్రీ కాళోజీ రచనలలో ఇటువంటి చమత్కారాలు చాలా కనిపిస్తవి

ప్రసిద్ధ లెబ్నానీస్ కవి, తత్వవేత్త ఖలీల్ జిబ్రాన్ కవితను తెలుగు చేసిన సందర్భంలో శ్రీ కాళోజీ పత్రికా ముఖమున కొంత నిశితమైన విమర్శకు గురిఐనారు ఈ విమర్శ చాలా కటువుగా ఉన్నది ఐనా, మన రవీంద్రుని రచనలను పొంతమూ శ్రద్ధతో చదివినవారికి జిబ్రాన్ కవిత పేలవంగానే ఉంటుంది ఇది నా వ్యక్తిగతా భిప్రాయము

ఈ శుభ సమయంలో, వారిని "స్నేహశీలి గా పలుకరిస్తూ వారికి ఎల్ల శుభములూ కలుగవలెనని హృదయ పూర్వకంగా ఆశిస్తున్నాను

❖ ❖ ❖

# కాళోజీ - జీవనగీత

- ఇంసెంటి కృష్ణమూర్తి

కులమతాల విషవలయాలకు అతీతంగా ఆలోచించడం నిర్మొహమాటంగా తానునమ్మిన సత్యాన్ని బాహాటంగా ప్రకటించడం కాళోజీ వ్యక్తిత్వంలోని విశిష్ట గుణాలు దైనందిన జీవిత సమస్యలను ఎంత సూటిదనం తో అర్థం చేసుకున్నాడో అంత సూటిదనంతో చెప్పే భాషను గూడా సొంతం చేసుకున్నాడు కాళోజీ ఆ భాష ప్రజలది, పండితులదికాదు ఆ భాషలో అతడు నిర్భయం గా ప్రకటించిన భావాలు సామాన్యుని వేదనలు కరుడు గట్టి హేతువును గోల్పోయిన సంప్రదాయాలకు ఎదురు తిరిగిన విశ్వకవి ఖలీల్ జిబ్రాన్ భావలోకంలో విహరించి కాళోజీ తనను ఆలోకవాసిగా గుర్తించుకున్నాడు తన భావాలకేమిగాని ఖలీల్ భావాలకు తెలుగుదేశంలో ప్రాచుర్యం కలిగించాలనే మహత్వాకాంక్షతో అనుసృతి ప్రారంభించాడు మానవతావాదానికి ప్రతీక జిబ్రాన్ కవిత సత్ప్రవర్తనకును, విశుద్ధమైన ఆలోచనలకు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు జిబ్రాన్ కవితాకృతిని కల్పించాడు అతనిది లెబ్నాన్ దేశం అతని ఆర్ధవాన్నీ, స్వేచ్ఛా ప్రియత్వాన్ని ఆ దేశంవాళ్లు సహించలేకపోయారు జిబ్రాన్ దేశం విడిచి పోయాడు జీవితశేషం అమెరికాలో గడిపాడు కవితలు, కథలు, వ్యాసాలు ఎన్నో వ్రాశాడు తమ మతాన్ని

గుడ్డిగానమ్మే అనుయాయుల దుష్ప్రవర్తనంవల్ల జిబ్రాన్ హృదయం తల్లడిల్లిపోయింది అతని అనుభూతులు, భావాలు మహాప్రవక్తల సందేశాలను పోలి వుంటాయి మానవ జీవితానికి సంబంధించిన అన్ని సమస్యలను ఆర్ధ్ర హృదయంతో పరిశీలించిన మేధావి ఖలీల్ వివిధ దేశాల్లో వివిధ దశల్లో వివిధ రూపాల్లో ఉవ్వెత్తుగా ఎగసిన విప్లవాలను-వాటిని రేపిన పరిస్థితులను అవగాహన చేసుకున్న జిబ్రాన్ శాశ్వత శాంతికి బాహిరమైన మార్పులవల్ల, ప్రభుత్వాల కట్టుబాట్లవల్ల శాసనాలవల్ల ఏర్పడదని నమ్మినవాడు హృదయ పరివర్తనంపట్ల నమ్మకం ఉన్నవాడు మారే మతాల కంటే మారని నైతిక విలువలు మనిషికి సౌఖ్యాన్ని ప్రసాదిస్తాయనే నమ్మకంతో రచనలు సాగించిన వాడు

ప్రజల గొడవను తనగొడవగా పాడుకున్న కాళోజీ ఖలీల్ జిబ్రాన్ భావాలకు సహజంగానే పరవశుడై పోయాడు శ్రీ ఏల్చూరు సుబ్రహ్మణ్యంగారు కాళోజీ 'చెలిమి' గేయం విని మీరు ఖలీల్ జిబ్రాన్ రచనలు బాగా చదివినట్టున్నారు' అన్నారట అప్పటికి జిబ్రాన్ సంగతి కాళోజీకి తెలియదు జిబ్రాన్ కవితలో ఉన్న వేదన, సూటిదనం కాళోజి కవిత్వంలో కనిపించింది సుబ్రహ్మణ్యంగారికి కాళోజీకి ఆయన జిబ్రాన్ రచనలతో పరిచయం కలిగించారు ది ప్రాఫెట్ అనే జిబ్రాన్ గ్రంథాన్ని కాలోజీ 'జీవనగీత' గా తెలుగు చేశారు దాదాపు పదిహేనేళ్ళు జీవనగీత అజ్ఞాతంగానే ఉండిపోయింది "యువభారతి" వారు "జీవనగీత" రెండుమార్లు ప్రచురించి పదివేల ప్రతులను తెలుగు పాఠకలోకానికి అందజేశారు

కాళోజీ తన జీవనగీతను ప్రచురించడానికి పూర్వం ఎందరో విశ్వ విద్యాలయాధ్యాపకులకు చూపించారు భాషా దోషాలు అందులో లేవనీ, నుడికారం ఇంపుసొంపులు అందులో దండిగా ఉన్నాయని తప్పకుండా ప్రచురించాలనీ పలువురు ప్రోత్సహించారు

ఖలీల్ జిబ్రాన్ భావాలు చాలా తీవ్రమైనవి లోతైనవి వాటిని పూర్తిగా జీర్ణం చేసుకుని సొంత భాషలో చెప్పడం ఒక పద్ధతి అయితే కాళోజి అనువాదం సమంజసంగా లేదని విమర్శలు వచ్చినవి అయినా పదివేల ప్రతులు చెల్లిపోయాయి ఇంకా "జీవనగీత" ప్రతుల కోసం "యువభారతి 'ని అడుగుతున్నారట

తన అనువాదం బాగాలేకపోయినా మరెవరైనా అంతకంటే మంచి అనువాదం వెలువరిస్తే సంతోషిస్తాన 'ని కాళోజీ అన్నాడు కాళోజీకి కావలసింది విశ్వాత్మకమైన జిబ్రాన్ భావాల ప్రసరణం తనకు తోచిన రీతిలో వాటిని ఆయన ప్రచురించినా అశేష ప్రజలు వాటిని ఆదరించారు

'గుడి పునాది రాయికంటె, గోపురాన వున్న రాయి
గొప్పదేమి కాదు, గుడి రాయే ఏదైనను
మీరు మీ మృదంగాల పలుకకుండ చేయగలరు
మీ వీణల తీగలన్ని త్రెంచి పారవేయగలరు
కాని ఆకసమున విహరించుచు,
తియ్యని పలుకులు పలికెడి
చిలుకలను ఎవ్వడాపగలడు "
'ఆలోచన అంతరిక్ష విహంగము
మాట పంజరాన అది రెక్కల తప్పక విప్పును'

ఇవి చాలా గంభీరమైన భావాలు కొంచెం ఆలోచిస్తేగాని అంతు తెలియదు ఈ భావాలలోని శబలత, అంతర్యం ఎందరో పాఠకుల నాకర్షించింది చదువు కొని, తమను ఆలోచనాధనులనుచేసిన జిబ్రాన్‌ను, కాళోజీని అభినందించుకున్నారు యువభారతి ప్రచురించిన తర్వాత వ్యాప్తిలోనికి వచ్చిన 'జీవనగీత' ఉత్తమ అనువాదమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కాళోజికి బహుమతి ఇచ్చి సత్కరించింది

తెలుగు పాఠకలోకానికి జిబ్రాన్‌ను పరిచయం చేసిన కాళోజీ మానవత్వం మీద, కవితా ప్రతిభమీద తనకున్న నమ్మకాన్ని ప్రకటించాడు జిబ్రాన్ సాహిత్యం అంతా తెలుగులోకివస్తే కవిత్వాన్ని గురించి తెలుగు దేశంలో అల్లుకుపోయిన దురూహలెన్నో చెదిరిపోతాయి జిబ్రాన్ మాతృభాష అరబ్బీ ఆయన రచనలను ఆయనే కొన్ని ఇంగ్లీషులోనికి అనువదించుకున్నాడు కొన్ని స్వయంగా ఇంగ్లీషులో వ్రాశాడు జీవనగీతను ప్రచురించి కాళోజి ఒక వినూత్నమైన, విలక్షణమైన ప్రతిభాసౌధ ద్వారం తెరిచాడు అది మన తెలుగువాళ్ళకు కొత్తది అయినా అతనిలో మరో వేమన్నను తెలుగు పాఠకులు చూడగలుగుతారు

సభ్యతా ప్రపంచం కనులు నులుముకొని తన్ను తాను చూచుకొనే ప్రేరణను జిబ్రాన్ కలిగించాడు జిబ్రాన్

కవిత కారుణ్యోపనిషత్తు అంధీభూతమైన సంప్రదాయా లను ఇనుపచట్టాల ప్రభుత్వాలను పాశవికోన్మాదాన్ని నిర్వే తుకమైన విద్వేధాలను జిబ్రాన్ నిరసించాడు ఆ నిరస నాన్ని స్వచ్ఛంగా అందంగా చెప్పాడు కవియై చెప్పాడు

కేవలం తన కిష్టంలేని వ్యవహారాలను ప్రకటించ డం కవిత్వంకాదు తన అక్కను వెల్లబోసు కోవడం కవిత్వం కాదు తిట్టడం, దుష్ప్రచారం చెయ్యడం తనకే స్పష్టంగా తెలియని సిద్ధాంతాలను కవిత్వంగా చెలామణి చెయ్యడం కవిత్వం కాదు ఆనందంలోనో వేదనలోనో స్పందించిన హృదయం శబ్దాకృతిని పొందేటప్పుడు ఎంతో సంయమ నాన్ని ఎంతో గాంభీర్యాన్ని సంతరించుకుంటుంది ఇది మహాకవులకు సహజమైనది ఈ సహజత్వమే సార్వకాలీన సార్వజనీన సత్యాలను బావారిల్ల జేయడానికి హేతుభూత మౌతుంది 'ఎవరికి చేపని యొండిన చన్నులు రసవిహీన ములు రాజకీయములు, అనగలిగిన కాళోజీకి ' జిబ్రాన్ సన్నిహితుడైనాడు ఆల్బర్ట్ ష్విట్జర్

నాగరికత పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొన
అది మానవులలో ఒకడై బ్రతుకును
పూజిస్తూ బ్రతికి
మానవసేవయే మాధవ సేవగా యెంచి
ప్రపంచానికి బ్రతుకుబాట చూపిస్తూ

అమరత్వం సాధించిన మానవుడు"గా కాళోజీకి కనిపించాడు కనుకనే కాళోజీకి జిబ్రాన్ భావాలు నచ్చినవి 'నాగొడవ' ప్రథమ సంపుటంలో ఉన్న గీతికలు కాళోజీ తాత్త్విక జిజ్ఞాసా ఫలమే జిబ్రాన్ కవితాభిమానం జిబ్రాన్ కవితా విహాసాల అందాలను చూడమని కాళోజీ కిటికీ తెరిచాడు ఆ కిటికీ 'జీవన గీత' జీవనగత కవిని -

అంత గొప్ప కవిని పరిచయం చేసి కాళోజీ తన హృదయం ఎంత ఉన్నతమైందో ఎంత స్వచ్ఛమైందో ఋజువు చేసుకున్నాడు

❖ ❖ ❖

# కాళోజీ "గొడవ"

- మిరియాల రామకృష్ణ

'కైత చేత మేల్కొల్పకున్న కాళోజీ కాయము చాలింక" అన్నాడు కాళోజీ తన కవిత్వం ఎందుకోసం అనే నిర్ణయం చేసుకోకుండా రచనలు చేసే కవి ఎవడూ తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకోలేడు కవిత్వం ఎందుకూ దాని ప్రయోజనాలేమిటి అనే ప్రశ్నకు సవాలక్ష సమాధానా లున్నాయి ఆ ప్రయోజనాల్లో ఏది ప్రధానం, ఏది అను షంగికం అనే మీమాంస ప్రతియుగంలోనూ జరుగుతూనే ఉంది ఆ సమాధానం ఆ యుగావసరాల్ని బట్టి ఉంటూ ఉన్నది ఆధునిక యుగంలో కవిత్వం యొక్క ప్రయోజ నం ఎవరెన్ని చెప్పినా సమాజాన్ని మేల్కొల్పి మంచివైపు నడిపించడం అనేది నిర్వవాదమైన అంశం సమాజానికి హితం బోధించలేనిదేదీ సాహిత్యం కాదు కవిత్వం అనలేకాదు, కాళోజీకి ఈ విషయంలో నిర్దిష్టమైన అవగాహన ఉంది అందుకే ఆయన ఆధునిక కవీ సార్వకాలిక కవీ కూడా కాగల్గుతున్నాడు కాళోజీ చేసిన ప్రతిజ్ఞ ఆశ్చర్యకరమైనది తన జీవిత ప్రయోజనమే కవితా ప్రయోజనం మేల్కొల్పడం

దేశభక్తి, వర్గాలపోరాటం లోకంలో జరుగుతున్న దగాలు, సామాజిక వ్యత్యాసాలు, కర్షకుల ప్రాధాన్యం మనస్తత్వాలు హృదయ మాలిన్యాలు, మంచిచెడ్డలు, హృదయాన్ని కోతపెట్టే ఘట్టాలు ఇలాంటివన్నీ కాళోజీకి కవితావస్తువులే!

కాళోజీ గేయాలు రచించినట్లుండవు ఆవేశంతో పలుకుతూ ఉన్నట్లు ఉంటాయి అందుకే ఆయన ప్రతి గేయపాదమూ ఒక సామెతలాగా స్థిరపడుతుందా అనిపిస్తుంది

లోకాన్ని పరిశీలిస్తాడు కాళోజీ ఆ పరిశీలన భావ కవుల పరిశీలన లాంటిది కాదు సమాజంలో అన్ని వర్గాల

వారి చర్యల్ని పసిగడతాడు ఎక్కడైనా లోపం కనిపించిందా ఊరుకునే రకం కాదు ఇది ఇలా ఎందుకుంది? ఎందుకిలా జరుగుతోంది? అని ధైర్యంగా ప్రశ్నిస్తాడు అవసరమైతే అధిక్షేపిస్తాడు అసలు అధిక్షేపమే ఆయనకు నచ్చిన విద్య వేమన లోకాన్ని పరిశీలించి సత్యాల్ని ఎలా వ్యంగ్య దర్పణంలో చూపించాడో ఆధునిక లోకాన్ని అలా పరిశీలించి అద్భుతమైన సత్యాల్ని అందరికీ కనిపించేంత ఎత్తుగా ఎత్తి చూపిస్తాడు ఆజాను బాహువు కాళోజీ

భావకవుల్లో బసవరాజు అప్పారావు గేయాల్లోని నైర్మల్యమూ ప్రసాద గుణమూ మళ్లీ కాళోజీ రచనల్లోనే కనిపిస్తాయి గురజాడ అప్పారావు ఏ శేట తెలుగు కోసం, దేశిచ్ఛందస్సుల కోసం, మానవత్వం కోసం ఉద్యమం లేవనెత్తాడో దాన్ని సరిగా అర్థం చేసుకుని ఆ దారిలో నడిచిన అభ్యుదయ కవుల్లో కాళోజీకే అగ్రతాంబూల మివ్వాల్సి ఉంటుంది

కాళోజీలో సమాజంపై దండెత్తి విమర్శచేసి చివాట్లువేసే పెద్దతనమేదో పొడుచుకు వచ్చి కనిపిస్తూ ఉంటుంది ఒక అసంతృప్తి, ఒక ఆవేదన, జాతి తరపున ఒక బాధ్యత, నిద్రపోయే పిల్లణ్ని మేలుకొల్పే కేకలు కాళోజీ కవిత్వంలో మనకి స్పష్టంగా వినిపిస్తాయి

ప్రజాస్వామ్యంమీద విశ్వాసం, నిరంకుశత్వం మీద జుగుప్స ఈయన ఖండికల్లో వినిపించే నిశ్వాస రావాలు

'నాగొడవ' అని కాళోజీ తన కవితా సర్వస్వానికి పెట్టిన హ్రస్వనామం ఇలా పేరు పెట్టడం లోనే కాళోజీ వ్యక్తిత్వంలో ఉన్న తెలుగుతనమూ, ఆయన కోరుకునే ప్రజానురంజకమూ కనిపిస్తాయి అసలు కవిత్వ మంటేనే కవి గొడవ ఆత్మాశ్రయమైనా పరాశ్రయమైనా సాహిత్య మంతా ఆ సాహిత్య స్రష్టయొక్క మనోలోకాన్ని ప్రతిబింబిం చేదే అవుతుంది కాళోజీ మనో లోకమంతా 'నాగొడవ'లోనే ఉంది ఈ ప్రపంచానికీ ఆయనకీ జరిగే యుద్ధమే నా గొడవలో వినిపిస్తుంది

కాళోజీ గేయాలలో జానపద వాఙ్మయ ధోరణి విస్పష్టంగా కనిపిస్తుంది అసలు కొన్ని గేయాలు తర తరాలుగా మనజాతి చదువుకుంటూనే ఉన్న గేయాలేమో అన్నంత భ్రమ కలిగిస్తాయి తెలుగు పలుకుబడి అంతగా కాళోజీ కసన కెక్కి నాట్యం చేసిందన్నమాట

"అన్నపురాసులు ఒకచోట
అకలి మంటలు ఒకచోట
సంపదలన్నీ ఒకచోట
గంపెడు బలగం ఒకచోట'

కాళోజీ వేసే ప్రశ్నలు సమాజం గుండెల్లో గుచ్చు కుంటాయి ఆంధ్రత్వం గురించి మహా పట్టుదల ఉన్న మనిషి కనకనే ఇలా నిలదీసి అడుగుతాడు నిర్మొహ మాటంగా

'అన్య భాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు
సకలించు ఆంధ్రుడా! చావ వెందుకురా!"

కాళోజీ చిత్తశుద్ధి అనేక గేయాల్లో మెరుస్తూ కనిపిస్తుంది "అవనిపై జరిగేటి అవకతవకలు జూచి ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు" అని ఆక్రోశిస్తాడు కాళోజీ

కర్షకుణ్ని అభినందించడంలో కాళోజీ వైలక్ష ణ్యం ప్రదర్శిస్తాడు కర్షకుని కర్రు కదలకపోతే ఈ నాగరికతే లేదని హెచ్చరిస్తాడు "కందర్ప కయ్యాలు కవిరాజు కావ్యాలు/కర్షకా! నీ కఱ్ఱు కదిలినన్నాళ్లె" అంటూ వ్యాఖ్యా నిస్తాడు

కాళోజీ కవిత్వం ఇంట్లోనూ చదువుకోవచ్చు సభల్లోనూ చదవవచ్చు దానికి వ్యాఖ్యానం అక్కరల్లేదు అసలు సభల్లో ముఖ్యంగా ప్రజా మహాసభల్లో ప్రజల్ని ఉద్రూతలూగించే, కదిలించే, కర్తవ్యానికి పురికొల్పే కవిత్వం ఏదైతే ఉందో అదే ప్రజా కవిత్వం 'ఇంకెన్నాళ్లు' వంటి ఖండికలు నిజమైన ప్రజాకవితా ఖండాలు "దొంగలు దొంగలు ఊళ్లు పంచుకొని/దొరలై వెలిగే దెన్నాళ్లు? పగటి దోపిడుల నాపగలేని/ప్రభుత్వముండే దెన్నాళ్లు?" అని సవాలు చేస్తాడు

కాళోజీ ఆత్మవిశ్వాసం, అహంభావం ముచ్చట గొల్పుతాయి అవి ప్రగల్భాలు కావని అనిపిస్తుంది ఔచిత్య మున్నచోట అహం భావం కూడా అందంగానే ఉంటుంది మరి "కలముపోటున కదపజాలని కావ్యగాన మింకెన్నాళ్లు/కాళోజీ కవి కైతలు వినియు/కదలకుండు రింకెన్నాళ్లు?"

కాళోజీ కలానికి తిరుగుబాటు తత్వం ముఖ్య లక్షణం వీరుడి లక్షణాలున్నవాడే కవిత్వాన్ని ఆయుధంగా

వాడగలడు ఆ తిరుగుబాటులో మందలింపు కూడా ఉండటం కాళోజీ విశిష్టత అందులో కాళోజీ సంయమనం కనిపిస్తుంది తిరుగుబాటు కవుల్లో సాధారణంగా ఆవేశమే కాని నియంత్రణ కనిపించదు ప్రజలను హింసించు ప్రభువు మాకేల / వధియింప భక్షింప వనరాజు లేడా? రాజును వనరాజుతో పోల్చడం అలంకారధ్వని 'ప్రజా శక్తిపై పందెమువేసిన / ప్రభుత్వమే పాటిక నిల్చున్ అంటూ 'నివురుగప్పిన నిప్పును ఊదిన నిండ వెలిగి నింగిని ముట్టున్ / బేజరైన బీదల వోపిక / పెద్దలపై పిడుగయి రాలున్ అని పద చిత్రాలతో భయపెడతాడు చివరికి చాలా తీవ్రంగా తానే రంగం మీద నిల్చి భస్మమొనర్చే వరములబొందిన / భస్మాసురుడే భస్మంబాయెన్ / కానున్నది కని కాళోజీ కవి / కైతలోపల ఘాటుగ చెప్పన్ అని హెచ్చరిస్తాడు

కాళోజీ ఎంత ఘాటయిన మనిషో అంత సున్నితమైన వాడనడానికి మనిషినే ఎరిగి ఉండ నక్కర్లేదు కవిత్వమే అతని వ్యక్తిత్వాన్ని అద్దం పట్టి చూపిస్తుంది బాల్యం గురించి ఆయన వ్రాసిన చిరుత ఖండిక ఒక్కటే ఒక మహాకావ్యంతో సమానమైనది "దానిమ్మ గింజలో దాగిన యెరుపు / లేత అరిటాకు / పై పూతల నునుపు / కొత్త మఖమలులోని మెత్తందనాలు / కన్నతల్లీ పాల కమ్మందనాలు / గోదుగ్ధ ధారల గోర్వెచ్చదనము / ద్రాక్ష ఫలములలోన ద్రవియించు తీపి / పువ్వు పొదుగుల్లోన పొంగేటి తేనె / ముసిముసి నవ్వుల కుసుమముల సొంపు / అందచందాలొల్కు ఆనందఝరులు / చంటిపాపని పెదవి జంటసింగిణులలో/అన్ని చేరి ఆటలాడుతున్నాయి '

వీర గంధం గల హృదయంతో తిరుగుబాటును ప్రబోధించే మరో ఖండిక "కాటేసి తీరాలె ' ఇందులో కవి ఒక సరోస్మాదిగా గోచరిస్తూ 'మన కొంపలార్చిన మన స్త్రీలచెరచిన / మన పిల్లలను చంపి మనల బంధించిన / మానవాధములను మండలాధీశులను / మరచి పోకుండగ గురుతుంచుకోవాలె / కసి ఆరిపోకుండ బుస కొట్టు చుండాలె / కాలంబు రాగనే కాటేసి తీరాలె" అని ఉపన్యసిస్తాడు ఉద్యమం లేవదీస్తాడు ఉసికొల్పుతాడు ఇందులో కవి అమర్షం వ్యక్తం మవుతుంది

కాళోజీ వంటి ప్రజాకవులు నూటికొకరుంటారు అలాంటి కవులే కావాలి లోకానికి లోకం తన కంఠమెత్తి దేన్ని చాటాలనుకుని మాటలు చాలక మాట్లాడ కూరుకుంటుందో దాన్నే మామూలు మాటల్లో అనేయగల యుక్తి కాళోజీకుంది ప్రజల ప్రతినిధిగా ఘోషిస్తా డాయన కాళోజీ అనే పేరు అప్రధానమై అతని కవిత్వమే ప్రధానమయిపోతుంది అతను లోకోజీయే అసంఖ్యాకులైన ప్రజాకవులు తమ గీతాలతోనే ఈ నాటికీ జీవిస్తున్నారు అలాగే కాళోజీ కూడా కవిత్వం చాటున బతుకుతూనే ఉంటాడు ప్రజా కవిత్వం అంటేనే చిత్రమైనది పండిత కవిత్వానికి మల్లే దానికి ప్రత్యేక హక్కులుండవు ఈ కవిత్వం సర్వస్వామ్య సంకలితం అని ప్రకటించుకొనే అవసరం ప్రజాకవికి లేదు ఇది నా అనుమతి లేనిదే చదవరాదు అనే ప్రకటనని ప్రజాకవి సమ్మతించడు లోకుల ముఖాలే ప్రజాకవితకు భాండాగారాలు నిజానికలాంటిదే మహాకవిత్వం కాళోజీ ఆ దృష్టితోనే మహాకవి

సమకాలీన సమస్యల్ని గురించి ఆవేదన పడటం సజీవ కవిత్వానికి ముఖ్యలక్షణం సమాజాన్ని మంచి వైపు మళ్లించడం అభ్యుదయ కవిత్వానికి జీవ లక్షణం చిత్త శుద్ధి గల ఏ కవి అయినా చమత్కారంగానే హితబోధ చేస్తాడు అదే రసవత్కవిత్వానికి లక్షణం కాళోజీలో ఈ లక్షణాలన్నీ ఉన్నాయి

ఉత్తమ కవిత్వం సంకుచితత్వం నుంచి విశాలత్వం వైపుకి విస్తరిస్తుంది ఒక రసాత్మకమైన వాక్యం అనిర్వచనీయమైన అనేక సత్యాలను తనలోనే దాచుకుని ఉంటుంది అందుకు కవికి గల ఋషిత్వం అంటే దర్శన ప్రతిభ కారణం "చంప బూనిన, సమయ మేదైన నేమి? /వ్యభిచరింపగ, వరుస ఏదైన నేమి?" అనే పంక్తుల్లో కాళోజీ చెప్పే సత్యాలు తీవ్రమైనవి

ఏ కవినైనా గొప్పవాడని నిరూపించేది అతని వర్ణనశక్తి అసలు కవిత్వమంటేనే వర్ణించడం ఈ శక్తివల్లనే కవి తాను మనోనేత్రంతో చూసిన దాన్ని మనకు ప్రదర్శిస్తున్నాడు కాళోజీ రచనల్లో 'పయసు' అనె ఖండిక అతని వర్ణనాశక్తికి మంచి మచ్చు

కాళోజీ కవితారూపాల్లో మాత్రాచ్ఛందస్సులు ప్రధానం అయినా ఆయన వచన పద్యాన్ని కూడా వచనం

చేయగల రచయితే, మాత్రాచ్ఛందస్సులు ఎంత హొయలుతో నడవగలడో 'కోకిలా' వంటి ఖండికలు చెబుతాయి 'సరస్వతీ భక్తుల్లారా' అనే ఖండిక వచనపద్యానికి అవసరమైన వాడుకభాష జిగి బిగినీ, భావనాశక్తి సంపదనీ చేతులెత్తి చూపిస్తుంది

కాళోజీ కవితల నిండా సూక్తి వైచిత్రి సూక్తి విన్యాసమూ సత్యసూక్తులు బాగా కనిపిస్తాయి

హాస్యం ఉట్టిపడే భావాల్ని విన్యసించడంలోనూ కాళోజీ ఎత్తు లెరిగినవాడే 'ఖర' నామ సంవత్సరం మీద రాసిన వచన గీతంలో 'గాడిదల్ని' ఎంత అపహాస్యం చేసి పారేశాడో చూడండి

మార్పుకోసం తపించే కవి కాళోజీ మార్పు కావాలి అనేవాడికి ప్రపంచ చరిత్ర తత్వం, కాలజ్ఞానం ఉండాలి లేనివాడికి మార్పు కిట్టనే కిట్టదు 'మాంధాతల నాటి నుండి' అనే రచనలో పురాణాల నన్నింటినీ తిప్పి చూపిస్తాడు

'చిన్న కవితలు రాయడం కవి ప్రతిభకు పెద్ద పరీక్ష కాళోజీ కవితలు జేబులో పెట్టుకునే అద్దాల్లాంటివి అందులో ఎంతో చూడవచ్చు 'మహా మహా మేధావులు' చూడండి కావలిస్తే

మానవతావాది కాళోజీ అచ్చమైన మానవుడి అనుభూతులు ఆవేదనలు కాళోజీ తనవిగానే చిత్రిస్తూ 'నరుడ నేను నరుడ నేను' అని ఘోషిస్తూ రచిస్తాడు

సాగిపోవుటె బ్రతుకు / ఆగిపోవుటె చావు' అనీ "ఉదయం కానే కాదను కోవడం నిరాశ / ఉదయించి అట్లానే ఉంటుందనుకోవడం దురాశ అనీ సామాన్య పదాలతోనే అసామాన్య భావాలు చెప్పగల్గడం నిజమైన శిల్పం

ఇదంతా ఎవరి గొడవ?  
కాళోజీ గొడవ  
కాదు,  
ప్రజల కోసం నడిపే కవిత్వం పడవ

❖ ❖ ❖

# కాళోజీతో ఇంటర్వ్యూ

**- 3 జగదీశ్వరరావు**

'ప్రజోద్యమాలు కాళోజీ" అను విషయంమీద వ్యాసం వ్రాయాలె కొందరు ఆయన సహచరులు మిత్రులతో మాట్లాడినాను ఎవరూ వివరాలు ఇవ్వలేకపోగా ఆయన యించుమించు అన్ని ప్రజోద్యమాలతో సంబంధం కలవారని మాత్రమే అన్నారు వివిధ ప్రజాసంస్థలతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆయనకున్న సంబంధం ఎవరికి తెలియనది? ఇంకా వివరాలకోసం నేరుగా ఆయనవద్దకే పోదామనుకున్నాను ఒకరోజు సాయంత్రం ఇంటికి వెళ్ళాను ఇంట్లో లేరు అన్నగారు రామేశ్వరరావు గారు ఒక చిన్న పంచె నెత్తికి చుట్టుకొని ఇంటి వెనక తోట పని చేసి వస్తున్నట్టుంది - కనిపించారు ఆ నెత్తికి చుట్టుకున్న గుడ్డతో అచ్చం భారతీయ కర్షకుడే! ఆయన సాహితీ కర్షకుడుకూడా అవడం ఎంత సబబు, మరునాడు పదకొండు గంటలకు టైము తీసుకున్నాను పదకొండు గంటల పదిహేను నిమిషాలకు వెళ్ళాను 'ఏమోయ్, నిన్న వచ్చి పోయినవట, ఏం సంగతి, అన్నారు 'కాసేపు తమతో మాట్లాడదామని' అన్నాను 'అ ఏందో చెప్పు' ఒక నిమిషంపాటు కుర్చీలో కూర్చున్నాను నిశ్శబ్దంగా 'అం ఏందో చెప్పవు!' అన్నారాయన తిరిగి

ఆయనకు ఆర్జించాలనే తాపత్రయం లేదు అయినా Restlessness నీతి నిజాయితీలను గురించి ఆవేదన సామాన్యులకు మాన్యులు పెడుతున్న టోపీలను గురించి చెప్పటమే ఆయన పని రాజకీయాలు, సాంఘికాలు, సారస్వత వీధులు, వర్తకవాణిజ్యాలు, విద్యావ్యాసం

గాలు కళా సాంస్కృతిక రంగాలు సర్వమూ కాలుష్యంతో నిండిన నేటి పరిస్థితులపట్ల ఆయన ఎంతో ఆవేదన చెందుతున్నట్టు ఆయన మాటలనుబట్టి వెల్లడవుతుంది

మీకు ప్రజోద్యమాలతోగల సంబంధాలు కొన్ని వివరాలు కావాలన్నాను నేను చెప్పడేమిటి The question is awkward అన్నారు ప్రజలే చెప్పాలన్నారు (మన దేశంలో ప్రజలున్నట్టు) నా గొంతులో వెలక్కాయ పడక పోయినా కరక్కాయ పడినంత పనయింది ప్రజలు చెప్పే వేవో చెప్తున్నారు మీనుంచి కూడా కొన్ని విషయాలు విందామని వచ్చానన్నాను నాన్సెన్స్ నాది నేం జెప్పకోవడ మేమిటి? అన్నారు ఇంక సాగదీయడం యిష్టంలేక కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం ఏ సంవత్సరంలో స్థాపించ బడిదండీ అన్నాను '1901లో' హనుమకొండలోని రాజ రాజ ఆంధ్ర భాషా నిలయమో? 1904లో' వరంగల్ శబ్దానుశాసనాంధ్ర భాషా నిలయం 1913లో ప్రతాపరుద్ర ఆంధ్ర భాషా నిలయం, మడికొండ 1920లోనట ఆంధ్ర భాషా వికాసోద్యమంతో తనకుగల సంబంధాన్ని ప్రజలే నిర్వచించాలన్నారు మరొకమారు రాజకీయంగా ఏ రకమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలులేని కాలంలో ఈ గ్రంథాల యాలు భాషోద్యమం పేరిట రాజకీయ చైతన్య ప్రభలను విస్తరింప జేస్తున్న రోజులుకదా ఈ నిశ్శబ్ద మౌన గంభీర మహోద్యమంలో మీ పాత్ర ఏమిటి? అంటే నేం చెప్పేదేం లేదు అన్నారు మళ్ళీ

మహారాష్ట్ర దేశంలో గణపతి ఉత్సవాల పేరిట తిలక్ యిత్యాదుల సంచాలకత్వాన స్వాతంత్ర్య పిపాసకు లభించిన ప్రోది అందరికీ తెలిసిందే అవి మా వరంగల్‌కు కూడా వచ్చినవి మా చిన్నతనంలో గణపతి రథం వరంగల్ చౌరస్తాలోని రామలింగేశ్వరాలయం సందులో సుమారు రెండేళ్ళు ఆగడం చూచాం అది హిందూ ముస్లిం తగాదాకు పర్యవసానంగా ఏర్పడిన పరిస్థితి ఆనాటి నగర నాయకులు ఇటికాల మధుసూదనరావు హయగ్రీవా చార్యులు, కాళోజీ, చెరుకు కాంతయ్య మరికొందరు వణిక్ప్రముఖులలో కొమురవెల్లి కాశయ్య, అల్లాడి లింగన్న, మడూరి శంకరలింగం యిత్యాదులు, కొరవి పహిల్వాన్ వగైరాలు మరికొందరు వీటి నిర్వాహకులు

కాళోజీ తన విద్యార్థి దశనుండే హైదరాబాదులో (1924) ఈ ఉత్సవాలలో పాల్గొనేవారు నిజానికి వీటిల్లో ఆనాటి విద్యార్థుల పాత్రయే పెద్దది

హనుమకొండలో మొదటి బ్యాచ్ సత్యాగ్రహులుగా జైలుకు పోయినవారు హయగ్రీవాచారి గారు ఇటికాల మధుసూధనరావుగారు పొట్లపల్లి రామా రావుగారు (అదిగదిగో కాలిబాట ) కాళోజీదేమో రెండవ బ్యాచ్ అయివుండాలన్నారు

1930 నుండి సాహిత్య గోష్ఠులు ప్రతి పక్షానికొక సారి నిర్వహించేవారు మిత్రమండలి పేరుతో 1935 నుండి నేరుగా ఆంధ్ర మహాసభతో సంబంధం ఉందన్నారు ఆంధ్ర మహాసభ జాతీయ పక్షంలో చేరడం, నిజామాబాదు కాన్ఫరెన్సు శ్రీ మందముల అధ్యక్షత అయితే ఆనాడు ఆంధ్ర మహాసభలో తెలుగు మాట్లాడవలె వేరే భాషలకు తావీయకూడదు అని వాదించిన వారిలో కాళోజీ ఒకరు కాని మందముల ఏ భాషలోనైనా మాట్లాడ వచ్చని రూలింగ్ యిచ్చారు ఆనాటి తన ఈ స్టాండ్ తప్పే అన్నారాయన కొంత Reflective mood లో పడి

ముగ్గురు మిత్రుల ముచ్చట ముచ్చటగా చెప్పారు ముగ్గురూ ఉద్యమ స్వరూపులే కోదాటి, కొమరగిరి కాళోజీ

మన ప్రజలు మనభాష అన్నప్పుడు
పదిపన్నెండైన కాదు వీరి వయస్సు
ఈనాటికి ఉద్యమాల ఏలుబడే వీరిపైన

ఫలానా ఉద్యమానికి నేను బీజావాపనం చేశాను ఫలానా పోరాటాన్ని నేను నిర్వహించాను అని ప్రజా జీవితంతో సంబంధం ఉన్నవారు గోరంతలు కొండంతలుగా చేసి చెప్పకోవడం కద్దు కాగా 'ఈనాటికీ ఉద్యమాల ఏలుబడే వీరిపైన అని చెప్పకోవటంలో నిజాయితీ హృద్యంగ మంగా ఉంది

ఈ నారాయణరావు త్రయం
1930 లగాయతు
ఈనాటికి జరుగుచున్న
అలజడుల ఆలోచన
ఆతతాయి ధిక్కరణ
ఇతిహాసాని కొకింత

ఇతివృత్తం ఈ ముగ్గురు

తప్పచేసి ఎరగరనుట ఒప్పదు వీరును మనుషులే అన్నారాయన ఆనాడు విశాలాంధ్ర కోరటం

తప్పుచేసినట్టుగా భావిస్తున్నారా? అన్నాను కాదు విశాలాంధ్ర ఏర్పడితే ఏవేవైతే సౌకర్యాలు లాభాలు వస్తాయనుకున్నామో అవేవీ రాకపోగా దగాకు దోపిడీకి గురియైనాం అది అంచనాలలో పొరపాటు అన్నారు తెలంగాణా సమస్య పరిపాలకుల కూట నీతివల్ల ఏర్పడిన సమస్యయే నన్నారు భారత రాజకీయాలే ఆంధ్రప్రదేశ్ రాజకీయాలుగా ఉంటవనుకున్నాముగాని తెలుగు రాజకీయమంటూ ప్రత్యేకంగా ఒకటుంటుందని అనుకో లేదు రాష్ట్రాల పునర్విభజనకూ, భారత సమైక్యతకూ ముడి పెట్టటం తప్పు భాషా ప్రాతిపదికపై భారత విభజన తప్పు కాదన్నారు ఒకే భాషకు ఒకే రాష్ట్రమనటం తప్పుకాదన్నారాయన

తెలంగాణా కోరిననాటి పరిస్థితులు ఈనాటికీ ఉన్నవి ఆనాడున్న సౌకర్యాలు, ఈనాడు తుడిచిపెట్టబడినవి షట్సూత్ర ప్రణాళిక తెచ్చిపెట్టిందేమీలేదు అన్నారాయన

'ఒక వార్నింగ్' అంటూ తన ప్రస్తుత గొడవంతా 'తెలంగాణా యాస' తుడుచుకొని పోవటంపట్ల అన్నారు రేడియోలో పదిగంటలు పలికే తెలుగు కార్యక్రమాలమీద ప్రతి నిమిషానికీ వందరూపాయలు ఖర్చు అవుతున్నాయట ఇదంతా నాన్ తెలంగాణా యాసమీద ఖర్చవుతుందన్నారు గుంటూరు, కృష్ణా జిల్లాల యాసనే మిగతా జిల్లాల వారెందుకు అనుసరించాలని ప్రశ్నించారు

రెండున్నర జిల్లాలది
దండిబాస యైనప్పుడు
తక్కినోళ్ళ యాస
నొక్కి తొక్కబడ్డప్పుడు
ప్రత్యేకంగా రాజ్యం
పాలు అడగడం తప్పుడు

అని చెప్పారు ఈ యాస ప్రసక్తి తెచ్చినప్పుడు ఆయన ముఖం జేవురించింది ఇంగ్లీషుకు ఐరిష్ యాసలో జానపద కవితా రీతులకు బాటలువేసి రూపమిచ్చి మహాకవి అనిపించుకున్న బర్న్స్ నాకు జ్ఞాపకం వచ్చాడు విచిత్రమేమంటే ఈ యాస విషయంలో ఇంత మొండి ఆలోచనలుగలవారైనా ఈయనకు ఆంధ్ర సాగర సీమవాసుల సాహితీ సదస్సులలోనే తెలంగాణాలోకంటే ఎక్కువ ఆదరణ గౌరవమూ లభించటం

ఎలక్షన్లు అభ్యర్థులు పార్టీలు సమస్యగా మాత్రమే ఉంది ఈనాడు ఇది ప్రజలకు సంబంధించిన అంశంగా మారాలి ఎప్పుడౌతుంది మరి? అనవరత జాగరణయే ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు మూల సూత్రం ప్రతి పౌరుడు తన పౌరధర్మాలను గుర్తుంచుకుని నడుచుకున్నాడు ఇది సాధ్యం సమాజంలోని వివిధ వర్గాలూ తమతమ సమస్యలన్నీ వేర్వేరని భావిస్తున్నాయి ఇది తప్పు అందరి సమస్యా ఒక్కటే వేర్వేరు రూపాలలో ఉండవచ్చు పాయలుపాయలుగా ప్రజోద్యమాలు చీలటం పాలకులకే క్షేమం ఈ సంగతి ఉద్యోగులూ ఉపాధ్యాయులూ, విద్యార్థులూ గుమస్తాలూ కార్మిక, కర్షక శక్తులూ గమనించాలి

ప్రజల్ని దరిద్రంలో చావకుండా, లేవకుండా ఎడతెగని క్యూలల్లో నిలబెట్టటంలోనే ఉంది ప్రభుత్వం చతురత ప్రజల్లో Realisation రావాలి సత్యాగ్రహమా, సాయుధ పోరాటమా? ఏమిటి మీ పరిష్కార మార్గం నేటి పరిస్థితికి? Realisation వచ్చిన ప్రజలు ఈ రెంటిలో ఏదైనా చేస్తారు ఏది చేసినా నా కభ్యంతరంలేదు అన్నారాయన

60 ఏళ్ళ జీవితంలో ఏంచేశాననికాదు ఇక ముందు ఏం చేయాలన్నదే నా ముందున్న సమస్య అన్నారు కాళోజీ

ఏరి వారు నావారలు?
అలనాటి నావారలు
అసహాయ శూరులు వీరులు
పోలీసు యాక్షనుకు ముందు
పూసిన కెంపు గులాబీలు
ఏరివారు ఏరివారు?

అన్నారు కదా? ఏకాకియైనట్టు, విఫలం చెందినట్టుగా భావిస్తున్నారా? అన్నాను అసందిగ్ధంగా 'అవును వైఫల్యమే' అన్నారు శ్రీ నారాయణరావు అలా అనటం ఆయన ఔన్నత్యమే వ్యక్తి శక్తిగా మారలేదన్నమాట అయినా వైఫల్యం కేవలం ఆయన బోంట్లదే అనుకోవడం న్యాయంకాదు ఈ వైఫల్యం త్యాగనిరతికి తిలోదకాలిచ్చి భోగనిరతికి నివాళులు పట్టిన నాయకత్వానిది నాలుగు గోడల మధ్య విద్యార్థులను తీర్చిదిద్దని ఉపాధ్యాయులది రచయితలది కవులది అందరిదీనూ

ప్రజోద్యమాలు కాళోజీ అను విషయాన్ని కొన్ని సంఘటనల్లో ఇమిడ్చి కొన్ని తేదీలు చెప్పి చూపే అంశం కాదు ఆయన 44 ఏళ్ళ ప్రజా జీవితం అనేక ఉద్యమాలకు ఆటపట్టు భాషావికాసం, గ్రంథాల యోద్యమం హైదరాబాదు నవాబు కాలంనాటి తొంభై మంది హిందువులకు పది మంది ముస్లిములకు మధ్య సమాన ప్రతిపత్తి నొసంగజూపిన అసామ్య సంస్కరణ వాదం, బాధ్యతాయుత ప్రభుత్వానికై పోరాటం భారత స్వాతంత్ర్యానంతరం సంస్థాన విలీనం సమస్య తదనం తర నిరంతర వక్ర చరిత్ర అడుగడుగునా ప్రతి అంశానికి స్పందించిన ఆయన నాయక రాజకీయ హృదయం కవిగా దడదడ లాడింది ఆయన ఏ గేయంలో ప్రజల గొడవ లేదు? జాతీయ జీవనాన్ని అనేకవిధాలుగా పెనవేసుకున్న జీవిత మాయనది ఉద్యమాలకు ఆయన ఆలంబన ఉద్యమాలే ఆయన ఊపిరి ఉద్యమ ప్రతిరూపమే ఆయన కవిత

❖ ❖ ❖

# స్వాతంత్ర్య సమరయోధుడు కాళోజీ

*- యాంజాల పెద్ది అంజయ్యగుప్త*

అవి 1938లో వందేమాతరం ఉద్యమం తీవ్రంగా జరుగుతున్న రోజులు స్వాతంత్ర్యంకోసం జరుగుతున్న పోరాటంలో వేల సంఖ్యలో యోధులను నిజాం ప్రభుత్వం అరెస్టుచేసి జైళ్లలో నిర్బంధించింది జైళ్లు చాలక ఖైదీల నందరినీ ఒక శుభముహూర్తాన విడుదల చేసింది ఖైదీలను విడుదల చేసిందే కాని స్వాతంత్రోద్యమంపై దానికి కన్నెర్ర పోలేదు హైదరాబాద్ రాష్ట్ర విముక్తికి జరుగుతున్న పోరాటంలో ప్రధాన పాత్రధారి ఐన కాంగ్రెస్‌ను నిషేధించి ప్రభుత్వం తన అక్కసు తీర్చుకున్నది అదే సమయంలో కాశ్మీర్ నాయకుడు షేక్ అబ్దుల్లా హైదరాబాద్ రావడము కాంగ్రెస్‌కు బదులు నేషనల్ కాన్ఫరెన్సును రంగంలోకి తేవడము జరిగాయి ఎందరో హేమాహేమీలైన నాయకులు, అనేకమంది విద్యార్థులు ఉద్యమంలో చేరి నిజాం ప్రభుత్వాన్ని ముప్పు తిప్పలు పెడుతున్నారు ఆ సందర్భాన్ని పురస్కరించుకొని రాష్ట్రోద్యమ నాయకులు స్వర్గీయ పండిత గోవిందరావు నానల్, స్వర్గీయ రామానంద తీర్థ, శ్రీయుత రావి నారాయణరెడ్డి గార్లు ప్రజలలో నూతనోత్సాహాన్ని కల్గించేందుకు వరంగల్లుకు విచ్చేసిరి నాయకులు వస్తున్నారని బహిరంగ సభ ఏర్పాటు చేయాలని కార్యకర్తల మంతా సమాయత్తమయ్యాం బహిరంగ సభ ఏర్పాటు చేయడమంటే సామాన్య విషయం కాదు ఆరోజుల్లో నాయకులకు నాలుగు గోడల మధ్య స్వాగతమిస్తామని అధికారులను ఒప్పించి ఎంతో కష్టం మీద సభకు అనుమతిని సంపాదించగలిగారు శ్రీ కాళోజీ నారాయణరావుగారు ఆ సభ రామన్నపేట బస్తీలో ఏర్పాటు చేయడమైంది వేలాది మంది ప్రజలు హాజరైనారు నాయకులకు స్వాగతమివ్వడానికి వారి ఉపన్యాసాలు వినడానికి అనేకమంది ప్రజానీకంతో సభా ప్రాంగణం కిక్కిరిసి పోయింది కార్యకర్తలందరికీ నూతనోత్సాహన్నిస్తూ, ఆ సభను రూపొందించడానికి నాయకత్వం వహించినవారు శ్రీ కాళోజీ ఈ సభ పాలకులకు గొంతులో పచ్చి వెలక్కాయ వలె తయారైంది దీన్ని ఎట్లాగైనా విచ్ఛిన్నం చేయాలని ప్రభుత్వం తలపెట్టింది ప్రజలలోకి వేల సంఖ్యలో నిజాం పోలీసులు మారు దుస్తుల్లో ప్రవేశించినారు లోన చేరి ఏదో విధంగా సభను విచ్ఛిన్నం చేసి హంగామా చేయాలనీ అది ఆసరగా నాయకులపై దొంగ కేసులు పెట్టవచ్చనే వారి ఉద్దేశం ఈ సంగతి కనిపెట్టిన మా కార్యకర్తలు కర్తవ్యం తోచక తికమక పడిపోయారు సభ ప్రశాంతంగా జరుగుతుందా లేదా అనే భయసందేహాలు మాలో కలిగాయి

ఈ విషయాన్ని భయపెడుతూనే చిన్నగా అన్నయ్య (కాళోజీ) చెవిలో వేసినాము "మెడ పట్టి

గెంటండి కుక్కల తరిమినట్టు తరమండి అట్లా పంపకపోతే ఉత్తర్వు లేకుండా బహిరంగ సభ జరిపామని ఎందరికో చికాకులు కల్పిస్తారు కుక్క కాటుకు చెప్పుదెబ్బ తగలాల్సిందే అట్లా వెళ్ల గొడితేనే మన తెరువుకు వారు రారు' అని గర్జించిరి అంతే అందుకోసం ఒక వ్యూహం పన్ని, ఆహ్వానాలు ఉన్నవారే ఇందులో ఉండాలని లేనివారు వెళ్లి పోవాలని చెపుతూ కార్యకర్త లంతా పరిశీలన జరుపుతూ మారుదుస్తుల పోలీసులను, సి ఐ డి లను పంపి వేయటం జరిగింది అ తర్వాత సభ ఘనంగా జరిగింది కవియేకాదు సమయస్ఫూర్తి, ధైర్య సాహసాలుగల నాయకుడు కాళోజి కాళన్న లేకుండా స్వాతంత్ర్యోద్యమ కార్యరంగమే లేదు అరోజుల్లో ఆయన ఎంతటి కోపిష్టో అంతటి శాంతస్వభావుడు కూడా కాళన్నకు ఇంత శాంతం ఉన్నదా అని అప్పుడప్పుడు మేం విస్తుపోయే వాళ్లం గణపతి ఉత్సవాల సందర్భంగా ఊరేగింపు వస్తున్నది, అల్లరి ఘర్షణమూలంగా ఊరేగింపుతోపాటు భగవంతుడు రోడ్డుమీద అగిపోవలసి వచ్చింది ఈ విషయం పెద్దన్నగారైన శ్రీ కాళోజి రామేశ్వరరావుగారికి కోపకారణమైంది హర్కార శ్రీనివాసరావుగారి ఇంటిలో పెద్దలు సమావేశం అయినారు దైవాన్ని అల్లరిపాలు చేసి రోడ్డుపై ఆపితిరి బుద్ధిలేదు, ఇదేనా మన ప్రతాపం అని ఆవేశంతో తాము కాళోజి నారాయణరావును పెద్దన్నగారు కేకలు వేస్తుంటే తమ్ముడే మంటాడో, ఏం జరుగుతుందో నని కుతూహలంతో మేం చూస్తున్నాం సమాధానంగా తమ్ముడి చిరునవ్వు అంతే అల్లరి చేసిన శ్రీకృష్ణుని అన్న బలరాముడు మందలించిన త్రేతాయుగంనాటి సంఘటన జ్ఞప్తికి వచ్చింది మాకు ఇట్లా కాళన్నను గూర్చిన సంఘట నలు ఎన్నైనా వ్రాయవచ్చు

రాజకీయాల్లో డొంకతిరుగుళ్లు నాలుగురాళ్లు వెనుకవేసుకోవాలనే తాపత్రయం నాయకత్వ కుమ్ము లాటలలో తలదూర్చడం వంటివి గిట్టని నిస్వార్థత్యాగి కాళన్న అందుకే ఆయన్ను ఇప్పటి ప్రభుత్వం తగిన రీతిగా గుర్తింపు ఇచ్చి సత్కరించ లేదు సత్యాచరణ ఎంత కష్టమో స్వచ్ఛమైన వెలుగుతను తలెత్తి చూడడం ఎంత దుస్సాధ్యమో ఇల్లాంటి మేలిరకం దేశభక్తులకు తగిన గుర్తింపు ఇవ్వడం అంతేకాదా

కాళన్న ఆర్ద్ర హృదయుడు కష్టాలు చూచినా ఇతరుల బాధలు విన్న ఆయన మనస్సు కరిగి కళ్లు జల కరిస్తాయి, నీరు ధారాప్రవాహమవుతుంది భోరుమం టాడు అది ఆయన మానసిక ప్రవృత్తి స్వాతంత్ర్య పోరా టకులలో అన్నయ్య నాయకత్వం క్రింద పనిచేసిన కార్య కర్తలలో నేనొకణ్ణి కావటం వల్ల నాపట్ల కూడా కాళన్నకు ప్రేమ, వాత్సల్యం, సానుభూతి మెండుగానే ఉన్నవి నేను చేస్తున్న ఉద్యోగం పోయిన తర్వాత ఒకసారి కాళన్నను చూడడం జరిగింది నా యోగక్షేమాలు అడిగి తెలుసు కున్నారు అంతే ఒంటివాడివి కాదు, భార్య, బిడ్డ, అప్పులు ఎట్లా బ్రతుకుతావు ఎట్లా అప్పుల్ని తీరుస్తావు అంటూ భోరుమన్నారు ఆయన ఆర్ద్ర హృదయం అటు వంటిది

నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా జరిగిన విముక్తి పోరాటంలో అన్నయ్య నాయకత్వ పటిమ, బుద్ధి కుశలత, పట్టుదల సమయస్ఫూర్తి, చాతుర్యము ప్రశంస నీయమైనవి ఆ వ్యక్తి ఆనాడు అరోజుల్లో లేకుంటే వరంగల్ జిల్లాలోనే అంతటి చైతన్యం ఉండేదికాదేమో

అప్పుడే 60 ఏళ్లు నిండినవి అన్నయ్యకు అందరికీ ఆత్మీయుడైన కాళన్నను భగవంతుడు ఇంకో 60 ఏళ్లు చల్లగా చూడాలని కోరుకుంటున్నాను

❖ ❖ ❖

# జాతీయనాయకుడు కాళోజీ

- ఇందుర్తి ప్రభాకరరావు

దేశ స్వాతంత్ర్యానికి పూర్వం జాతికోసం శ్రమించిన అనేకమంది జాతీయస్థాయి నాయకుల ప్రవృత్తిలో చిత్తవృత్తిలో స్వాతంత్ర్యానంతరం మార్పును మనం గమనించవచ్చు స్వాతంత్ర్య పోరాటంలో అత్యంత జాగరూకతతో వైతాళికులవలె వ్యవహరించి బాధ్యతా బరువుల్ని నెత్తినవేసుకున్న ఏ కొందరో స్వాతంత్ర్యానంతరం కూడా అదే పంథాలో నిస్వార్థంగాను నిరాడంబరంగానూ తమ విధిని నిర్వర్తించినవాళ్లూ, నిర్వరిస్తున్న బహు కొద్ది సంఖ్యలో కానవస్తారు గాంధీ సుభాష్ వంటి కొందరు త్యాగమూర్తులు కార్యసాధనానంతరం మరుగైపోయినారు కొందరు జాతీయ నాయక స్థాయికి చేరినా ఇప్పటి పరిస్థితులతో రాజీ కుదుర్చుకున్నవారూ ఉన్నారు

ఆనాడు, ఈనాడూ తనదైన నిర్దుష్ట వ్యక్తిత్వంతో హమేషా సమాజ సంక్షేమం కోసం ఆలోచిస్తూ ప్రతి సంఘటనకు స్పందిస్తూ తామెంచుకున్న మార్గంలో గమించే బహుకొద్ది మందిలో 'కాళోజీ' ఒకరు ఏదో ఒక పోరాటం ఏదో సంఘర్షణ ఎప్పటికీ పరహిత చింతన అన్యాయాల ఛేదన ప్రజాశ్రేయస్సే ధ్యేయంగా వారి పయనం సాగుతుంది

కాళోజీ ప్రజలకోసం కవిత్వం వ్రాసి ప్రజాకవి అయినారు అంటే అయన పరోక్షంగా నాయకత్వం వహించారన్న మాట అయన రాజకీయాలలోనే ఉండి ఉంటే ప్రత్యక్షంగా నాయకులయ్యేవారేమో అట్లా కాలేక పోయినా నష్టంలేదు అయన చేపట్టిన కవితా మార్గం ప్రజల కోసం విలసిల్లింది ప్రజల్ని దశ దశలో నిద్దుర లేపింది కర్తవ్యాన్ని సృజింపజేసింది కవిత్వం ప్రజలకోసం వ్రాసినారు గనుక, కాళోజీ కవితలో, ప్రవక్తగా, ప్రబోధకుడుగా, వైతాళికుడుగా ఉత్తమ నాయకుడుగా మనకు దర్శనమిస్తాడు

ఏదో ఒక అవసర సమయంలోనో, ఒకానొక ఉద్యమ సమయంలోనో, ఆందోళన సమయంలోనో, ముందుకు వచ్చి ఆ తరువాత కనుమరుగు కావడం కాదు, లక్ష్యసాధన తర్వాత కూడా, జీవిత లక్ష్యంగా ప్రజా సమస్యల్ని భుజాన వేసుకొని ప్రజల తరఫున వకాల్తా పుచ్చుకొని అహరహం తన పంథాలో ఉద్యమించగల ప్రతిభ ఆ వ్యక్తిత్వం కాళోజీకే ఉన్నదంటే అతిశయోక్తికాదు

అయన కవిత్వ వ్యక్తిత్వ విశ్లేషణ గావించే పక్షంలో ఆయనలో ఒక గాంధీ ఒక సుభాష్, ఒక జయప్రకాశ్ ఒక రవీంద్రుడు, ఒక మార్క్స్ నాజీ రజాకార్ల రాక్షసకృత్యాలకు ఎదురొడ్డి పోరాడిన ఒక దేశభక్తుణ్ణి మనం చూడగలుగుతాం ఈ పట్టుదల ఈ శక్తి ఈ వివేచనా పరిజ్ఞానం ఈ అకుంఠిత దీక్ష కలగడానికి ఆయనలో కేవలం ఆవేశం కారణమా, ప్రశ్నించుకుంటే అన్నింటి కన్నా ముందుగా సమాజంలోని సమస్తాన్ని ఆకళింపు చేసుకొని సమాజం ఎట్లా రూపుదాల్చవలెనో ఆ వైపునకు శాసించగల పరిణతి చెందిన ఒక సంపూర్ణ వ్యక్తిగా, ఒక ధీశక్తిగా ఆయన రూపొందగలిగినట్టు మనకు తోస్తుంది

నేర్చుకోవలసిన రోజుల్లోనే నేతగా మారి తోటి వారికి ఆదర్శంగా ఉంటూ ప్రవక్తగా ప్రబోధించిన అధినేత ఆయన సామాన్య మానవుని కడగండ్లను కడిగివేసి, స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకోగల స్తోమతను సామాన్యునికి కలిగించడానికి జరిగిన స్వాతంత్ర్య మహాయజ్ఞంలో అయన హవిస్సువలె ప్రజా చైతన్యాన్ని ప్రజ్వలింప జేసినారు

చిన్న వయస్సులోనే ఆయన రాష్ట్ర దేశస్థాయి నాయకులతో సహచర్యంచేస్తూ అత్యున్నత కార్యకలాపాలయందు నిమగ్నమైనారు అవి హైదరాబాద్ రాష్ట్రంలో నిజాం నవాబు పాలన రోజులు ముస్లింల ఆగడాలు పెరిగి హిందువులు చావాలో బ్రతకాలో తేల్చుకోవలసిన ఘడియలు ఆర్యసమాజం రంగంలో ప్రవేశించి మహోన్నతాదర్శాలతో చైతన్య స్రవంతిని వెలిగించి యువకులెందరినో ఆకర్షిస్తున్న సమయం అంతే కాళోజీ తనంతట తానే ఆర్యసమాజ్ కార్యకాలాపాలవైపు మొగ్గు చూపినాడు అయనేదో కేవలం కార్యకర్తగా వాటిలో పాల్గొనలేదు వరంగల్‌వంటి ప్రసిద్ధిగల ప్రదేశంలో నాయకునివలె సర్వాన్ని భుజస్కందాలపై వేసుకొని కార్యక్రమాల నిర్వహించే వారు పిట్టకొంచెం కూతఘనం అన్నట్టుగా ఆయన వయస్సూ ఆయన కార్యక్రమాల పోలికలుండేవి

ఇంతటి చొరవ అవగాహన చిన్నతనంలోనే కలుగడానికీ, ఆయనలో చైతన్యజ్యోతి వెలుగడానికి ప్రధాన కారణం ఆయన్వంశానుగతంగా సంక్రమింప జేసుకున్న జాతీయ భావనలు, త్యాగశీలత, పట్టుదల, కార్యదక్షత - అన్నిటికన్నా ప్రధానమైనది జాతిపీడన విముక్తి పోరాటం

ఆయన మేనమామ గొప్ప ఆర్యసమాజవాది పండిత నర్దేవ్ శాస్త్రిగారంటే తెలియని వారు లేరు ఆర్య సమాజ పరంగా ఆయన దేశానికి చేసిన సేవ అనంతం కాళోజీ తాతగారి కుటుంబం పూనాలో ఉండగా శ్రీ నర్దేవ్ శాస్త్రిగారికి తిలక్ గోఖలే ఆప్టే రానడే, నాంజోషి వంటి వారితో కలిసి పనిచేసే అవకాశం లభించింది వారి ప్రబోధంలో ఆయనలో జాగృతమై ఉన్న జాతీయ భావనలు పెల్లుబికినాయి ■ తర్వాత ఆయన ఆర్య సమాజంలో చేరి దేశంలోని ప్రముఖ ప్రదేశాలు పర్యటించి తమ బోధనలతో యువకులను కర్తవ్యోన్ముఖులను చేసెడివారు శ్రీ నర్దేవ్ శాస్త్ర అసలు పేరు నరసింహా రావు, ఆయన బనారస్ విశ్వవిద్యాలయం వేదతాడ్, కలకత్తా శాస్త్రి పరీక్షలలో ఉత్తీర్ణులై నర్దేవ 'శాస్త్రి' అయినారు శ్రీ శాస్త్రిగారిలో మౌలికంగా తిలక్ భావాలు ఆర్య సమాజ ఆచారాలు సమ్మిళితంగా చోటుచేసుకోవడం గమనార్హం ఇదే ధోరణి కాళోజీకి పట్టు బట్టింది

ఆయన గాంధేయవాది ఆర్యసమాజ కార్యకర్త, అభ్యుదయభావుకుడు అన్నింటికీ మించి మానవ తావాది కాళోజీ కుటుంబంలో పరిమితమైన భావాలు గలవారుగా, గాక అందరూ దేశాన్ని గురించిన ఆలోచనలు గలిగి, తదనుకూల కార్యక్రమాలతో సతమతమవుతున్న వారే అందుకే ఆయన దేశ సేవకై ఎంచుకున్న కవితామార్గాన అనంతంగా పయనించడానికి, విస్తరిల్లడానికి ఎవరూ ఆక్షేపించలేదు కాళోజీ అన్నగారైన రామేశ్వరరావుగారు వారి సతీమణి కాళోజీని కన్నకొడుగులాగా పోషించినారు వారికి ఆయనపట్ల అమితమైన ప్రేమ ఆయన ప్రగతికి అడ్డురాలేదు సరికదా వారు ఆయన పురోగతికి దోహదం చేసినారు కాళోజీకి భార్య ఒక కుమారుడు ఉన్నారు

ఆనందనామ సంవత్సర, భాద్రపద బహుళ పంచమి అనగా సెప్టెంబర్ 9వ తేదీ 1914లో వరంగల్ జిల్లా మడికొండ గ్రామంలో ఆయన జన్మించిరి కాళోజీకి అన్నగారు అక్కగారు కూడా ఉన్నారు కాళోజీ తల్లి కర్ణాటక మధ్వబ్రాహ్మణ కుటుంబానికి చెందిన ఆడపడుచు ఆమె విద్యాభ్యాసం మరాఠీలో ఒరిగింది మరాఠీ నేర్చిన మధ్వ కన్నడిగులకు తెలంగాణా తెలుగు నియోగుల కుటుంబం లోని వ్యక్తితో వివాహం జరగడం ఆ రోజుల్లో ఒక వింతే కాళోజీ తాత శ్రీనివాసరావుగారు హైదరాబాదు రాష్ట్రంలో తహసీల్దార్‌గా పనిచేసేవారు అయినా తమ కూతురు పెళ్లి కాళోజీ రంగారావుగారితో తిరుపతిలో జరిపించడం మరొక విశేషం

1923 వరకు కాళోజీ విద్యాభ్యాసం మడికొండలో జరిగింది ఆయన తొలి గురువులు శ్రీ రామచంద్రం, శ్రీ సాంబసిద్ధయ్యగారలు ప్రస్తుతం ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖలో అధ్యాపకులైన డాక్టర్ పల్లా దుర్గయ్య, వరంగల్‌లో ప్రముఖ వర్తకులు శ్రీ పెద్ది దుర్గయ్య మొదలగు పదిమందిపైగా దుర్గయ్యలు శ్రీ కాళోజీకి అప్పట్లో సహాధ్యాయులు

ప్రారంభ విద్య మడికొండలో పూర్తిచేసిన తర్వాత ఆయన విద్యాభ్యాసానికై హైదరాబాద్ చేరినారు 1924 నుండి 1928 వరకు రెసిడెన్సి అప్పర్ మిడిల్ స్కూలులో ఆయన విద్యాభ్యాసం సాగింది రెండవ ఫారం కొన్నాళ్ళు అయినతర్వాత కాళోజి సిటీ కాలేజీలో చేరిరి అక్కడ, 1930 వరకు ఫారం పూర్తిచేసిరి శ్రీ ఎర్రం సత్యనారాయణ, అజీజ్ అహ్మద్, నందగిరి లక్ష్మణరావు వంటి ప్రముఖులు శ్రీ కాళోజి సహాధ్యాయులు

1931 నుండి 1936 వరకు కాళోజి విద్యాభ్యాసం హనుమకొండలో జరిగింది ఈ దశలోనే కాళోజి వ్యక్తిత్వ వికాసాన్ని కార్యదక్షతను గుర్తుచేసే అనేక చారిత్రక సంఘటనలు, కార్యక్రమాలు జరిగినవి వాటన్నిటిలోను వారిది ముఖ్యపాత్రే 1931 నాటికి కాలోజీ వయస్సు 17 సంవత్సరాలు ఆయన సహాధ్యాయులందరిలోకీ "మేటి", అప్పటికే హైద్రాబాద్‌లో విద్యాభ్యాసం గావించి, పలువురు రాష్ట్ర నాయకులతో పరిచయం సంపాదించి వివిధ రంగాలలో ప్రవేశించిన కాళోజీకి విద్యార్థి దశలోనే వరంగల్ రాజకీయాలలో మేటి స్థానం లభించింది అన్నింటికీ ఆయన ముందువరుసలోనే ఉండేవారు 17 సంవత్సరాల వయసుగల కాళోజీకి ఖాకలుతీరిన బడా నాయకులందరితోను సమాన ప్రతిపత్తి ఉండేది

కాళోజీకి తాతలతరం వారితో కలిసి పనిచేయడం వారిస్థాయిలో ఆలోచించడం, కార్యక్రమాలు రూపొందించడం నాయకత్వం వహించడం వగైరాలు పరిపాటై పోయాయి సమవయస్కులు సహధ్యాయులు ఎంతో పెద్దవాడిగా అతన్ని గుర్తించడం కూడా జరుగుతుండేది మధ్యతరం వారు ఆయనతో సమాన స్థాయిలో నడుచుకునేవారు వయస్సుకూ చేపట్టిన కార్యక్రమాలకు పొంతన లేని ఒకానొక విచిత్రావస్థ కాళోజీకి ఎదురయ్యేది

గణపతి ఉత్సవాలు, ఆర్యసమాజ్ సభలు ఊరేగింపులు కవి సమ్మేళనాలు రచయితల సభలు సదస్సులు ఒకటేమిటి ఏ పక్షంగా ఏ కార్యక్రమం జరిగినా కాళోజీదే తొలివరస వరంగల్లులో ప్రముఖ ఆర్యసమాజవాది కవి, పండితుడు అయిన 'గురూజీ' శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారితో 1931 లో పరిచయమేర్పడింది ఆ పరిచయం క్రమంగా వృద్ధిఅవుతూ వచ్చి ఆయన కాళోజీకి గురువు అయినారు గురూజీ అంటే కాళోజీకి ఎంతో అభిమానం గార్లపాటి రాఘవరెడ్డిగారి పేరు ప్రస్తావనకు వస్తేనే కాళోజీ కళ్ళు చెమ్మగిల్లుతాయి ఆయనంటె కాళోజీకి అంత అవ్యాజానురాగం

వయస్సులో పెద్ద తేడాలేకపోయినా ఎంతో మంది కాళోజీ సహధ్యాయులు యువకులు, ఇప్పుడు ప్రముఖులైన వారు కొందరు అప్పట్లో ఆర్యసమాజ్ వాలంటీర్లుగా కార్యకర్తలుగా పనిచేసేవారు అప్పుడు కాళోజీ నాయకుడుగా వక్తగా ఆర్గనైజరుగా వ్యవహరించేవారు ఆనాటి సభలలో మాజీ పార్లమెంటు సభ్యులు కీ॥శే॥ ఇటికాల మధుసూదనరావు ప్రభుతులు వాలంటీర్లుగా పనిచేసినవారే

వరంగల్‌లో చదువుతున్న రోజులలో ఉద్యమాలలో భాగస్వామిగా ఉంటూ ఉండడం వల్ల ఉద్యమాలకు మూలకేంద్రమైన హైద్రాబాద్‌తోనూ అక్కడి నాయకులతోనూ ఆయనకు సన్నిహిత సంబంధం ఉండేది పతంగే, పండిత గోపదేశ్ శాస్త్రి చంద్రపాల్ మొదలుగాగల ఆర్యసమాజ్ నాయకులతోనూ, బిందూ, మందుముల నరసింహారావు, కె వి నారాయణరెడ్డి, శ్రీ రాజ్ బహదూర్ గౌర్‌వంటి కమ్యూనిస్టు నాయకులతోనూ, కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డి, పుల్జాల హనుమంతరావు, వెల్దుర్తి ఆళ్వారుస్వామి ఆ తర్వాత దాశరథి, నారాయణరెడ్డి వంటి సాహితీ మిత్రులతోను ఆయనకు చనువు సన్నిహిత సంబంధాలు ఉండేవి శ్రీ పుల్జాల హనుమంతరావుగారు స్థాపించిన సాహితీ మేఖల ప్రచురణ, వెల్దుర్తి మాణిక్యరావు, వెంకట్రాజన్న అవధాని గంటి లక్ష్మీనారాయణ కాళోజీలు కలిసి స్థాపించిన వైతాళికసమితి, అనే గ్రంథమాల కార్యకలాపాలతో ఆయనకు సన్నిహిత సంబంధం ఉండేది 1936 37లలో 'వకాలత్' చదవడానికి కాళోజీ హైదరాబాద్‌కు రావలిసి వచ్చింది ఆ తర్వాత ఇక్కడ ఇతర కార్యక్రమాలతో పాటు సాహిత్య కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనడం గ్రంథమాలలు ప్రచురణలు, ఆళ్వారుస్వామి ప్రభృతుల సహవాసం కాళోజీకి వివిధ వ్యాసంగాలు చురుకుగా సాగేవి

1939లో కాళోజీ తొలిసారి జైలుకు వెళ్ళినారు ఆ తర్వాత 1943లో రెండవసారి జైలు దర్శనం నిజాం వ్యతిరేక పోరాటంలో జైలులో నిర్బంధించిన వారిని నానాయాతనలకు గురిచేసేవారు జైలు నిర్బంధంలో ఉంటూ కూడా కాళోజీ వృథా కాలక్షేపం చేయలేదు జైలులో తన సహచరులతో కలిసి సాహిత్య సమాలోచనలు సాగించేవారు ఆయన జైలులోనే ప్రముఖ గ్రంథాలు అనువదించారు హెచ్ ఎన్ బ్రెయిల్స్ ఫర్డ్ వ్రాసిన 'రెబల్ ఇండియా'ను "నా భారతదేశ యాత్ర' పేరుతోనూ, సానె గురూజీ మరాఠీ గ్రంథాన్ని 'భారతీయ సంస్కృతి' అనే పేరుతోనూ అనువదించినారు నారాయణ సీతారాం ఫడ్కే గ్రంథాన్ని 'భారతీయ సంస్కృతి' అనే పేరుతోనూ అనువదించినారు నారాయణ సీతారం ఫడ్కే గ్రంథాన్ని అంజలి' అను పేరుతోనూ 'థాట్స్ ఆఫ్ ఆర్కేలియస్ ఆరేలియస్" అను గ్రంథాన్ని "పరమాత్ముని ఆత్మకథ" పేరుతోను అనువదించిరి

జైలులో మాజీమంత్రి శ్రీ ఎమ్ ఎస్ రాజలింగం, శ్రీ భండారు చంద్రమౌళీశ్వర రావు, కల్వల మనోహరరావు, కొలిపాక రామచందర్‌రావు, అయితరాజు రామారావు, వెంకట్రామశాస్త్రి ప్రభృతులు ఆయన సహచరులు, రామారావు రామచందర్‌రావు, పుల్జాల హనుమంతరావు గారలు కాళోజీ చెపుతుంటే అనువాద రచనలు ఉల్లేఖించేవారు అందువల్ల అనువాద గ్రంథాల వ్రాత ప్రతులు చాలావరకు ఆయన వద్ద లేకుండా పోయినవి ఒక్క "నా భారతదేశ యాత్ర" గ్రంథం తప్ప మరేది అచ్చులోకి రాలేదు

జండా సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు కాళోజీని 1946 నవంబర్ నుండీ 1947 ఫిబ్రవరి వరకు వరంగల్ నుండి బహిష్కరిస్తూ నిజాం ప్రభుత్వం ఆదేశించింది ఈ రోజులలోనే తెలంగాణా ప్రజలు ఆయనకు స్వాగతం పలికి తమతమ ప్రదేశాలకు ఆహ్వానించి ఘన సత్కారాలు చేసినారు ఈ తరుణంలోనే నల్లగొండ జిల్లా చుండూరు గ్రామంలో శ్రీ పుల్లల హనుమంతరావుగారి అధ్వర్యంలో బ్రహ్మాండమైన కవిసమ్మేళనం జరిగింది జాతీయభావనలు కట్టలు త్రెంచుకొని వచ్చి తెలుగు కవితా సరస్వతి చుండూరు గ్రామ నడిబొడ్డు నుండి కర్తవ్యతా శంఖారావాన్ని పూరించింది ఆనాటి కవితావేశానికి మూల నాయకుడు కాళోజీ ప్రజల మనిషి, ప్రజాకవిని కష్టకాలంలో ప్రజలెట్లు తమ అవ్యాజాను రాగాలతో తమలో నింపుకుంటారో, ఆ రోజుల్లోనే కాళోజీకి అనుభవానికి వచ్చిందంటే అది ఏ జాతీయ నాయకునికో తప్ప ఇతరులకు అనితర సాధ్యమైన సంఘటనగా పేర్కొనవచ్చు ఆ తర్వాత వరంగల్ జిల్లా ముసిపట్ల గ్రామంలో జరిగిన చారిత్రక కవి సమ్మేళనానికి ఆయన అధ్యక్షత వహించినారు

కాళోజీ ప్రభావితమైంది ప్రధానంగా ఆర్యసమాజ్ ద్వారాను ముఖ్యంగా మేనమామ సర్దేశ్‌శాస్త్రిగారి ఉపన్యాసాల ద్వారాను అయినప్పటికి ఆయన తెలుగు ప్రజల కడగండ్లను కండ్లకు గట్టించి కర్తవ్యోన్ముఖుల చేసేందుకు ఆ నాడు సాగిన ప్రధానమైన మూడు ఉద్యమాల ద్వారా ప్రజల్ని ప్రభావితుల్ని చేసినారు అప్పటి ప్రధానోద్యమాలైన గ్రంథాలయోద్యమం, ఆంధ్ర మహాసభ, ఆంధ్ర సారస్వత పరిషత్తు సభలు సమావేశాలు అన్నింటిలో ఆయన ప్రధాన పాత్రలను నిర్వహించినారు

గ్రంథాలయోద్యమ సందర్భంగా ఆయన తెలంగాణాలోని దాదాపు అన్ని గ్రామాలను పర్యటించినారు చాలా చోట్ల కవి సమ్మేళనాలు చేసినారు గ్రంథాలయోద్యమ నాయకుడు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు కాళోజీని అభినందిస్తూ గ్రంథాలయోద్యమ ఆస్థానకవిగా ఆయనను కీర్తించినారు మాదల వీరభద్రరావు వ్రాసిన సర్వోత్తమ చరిత్ర'లో నారాయణరావు త్రయం ప్రశస్తి ఉన్నది

1935లో షాద్‌నగర్‌లో జరిగిన ఆంధ్రమహాసభలలో ఆయన చురుకుగా పాల్గొన్నారు అక్కడ కవి సమ్మేళనంలోనూ, కార్యనిర్వహణలోనూ కాళోజీదే అధ్యక్షత, ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనలోకూడా కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డి గడియారం రామకృష్ణ శర్మ, శ్రీ పుల్లాల హనుమంతరావు ప్రభృతులతో పాటు కాలోజీ ఉన్నారు ఆంధ్ర మహాసభలలో జోగిపేట ప్రథమాంధ్ర మహాసభలు, సారస్వత పరిషత్తు సభలలో వరంగల్‌లో జరిగిన ద్వితీయ వార్షిక మహాసభలు ఇల్లెందులో జరిగిన గ్రంథాలయ సభలు చరిత్ర ప్రసిద్ధి గాంచినవి వరంగల్‌లో జరిగిన అటువంటి సభలకు శ్రీ కాళోజీ నారాయణరావు గారు ఆహ్వాన సంఘం ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించినారు అంతకు ముందే ఆయన గార్లపాటి రాఘవ రెడ్డిగారితో కలిసి ఆంధ్ర సారస్వత సంఘం పేరిట ఒక సంస్థను నెలకొల్పిరి వరంగల్‌లో 1945లో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వితీయ మహాసభలు కీ॥శే॥ ఉదయరాజు రాజేశ్వరరావుగారి అధ్యక్షతన వరంగల్ కోటలో ఏర్పాటు చేయబడినవి విశాలమైన పందిళ్లలో, పెద్దసభా మండపంతో భారీ ఎత్తున సభ ఏర్పాట్లు చేయబడినవి ఈ చారిత్రాత్మకమైన సభను విచ్ఛిన్నం చేయడానికి ముస్లింగూండాలు యత్నించిరి వారిని ధైర్య సాహసాలతో వాలెంటేర్ దళాలు ఎదుర్కొన్నవి ఇటు సభల ఏర్పాట్లు చేస్తూ అటు అల్లరులు కాకుండా కార్యదీక్షతతో వ్యవహరించడంలో కాళోజీ ఓర్పు, నేర్పు వహించాడన్నది ఆనాటి కార్యకర్తలకు తెలియంది కాదు ఈ సభలు తెలంగాణాలో తెలుగు సంస్కృతి పునరుజ్జీవనానికి నాంది పలికినవి ఆ తర్వాత తెలుగు సరస్వతి విస్తారంగా తెలుగువారింట చిందులు వేయదొడిగింది అంతెందుకు నేడు సారస్వత పరిషత్తు కార్యదర్శిగా ఉన్న శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఆ సభల ద్వారా సారస్వత లోకానికి పరిచితులైనవారే అంటే సహాధ్యాయులకు నాయకులుగా ఉన్న కాళోజీ ప్రతిభను వేరే చెప్పనక్కరలేదు ఈ సమావేశం సందర్భంగా పుస్తకాల ప్రదర్శనం, వ్రాత ప్రతుల ప్రదర్శనం తొలిసారిగా ఏర్పాటు చేయబడింది

ఆర్యసమాజ్ అధ్వర్యాన గణపతి నవరాత్రప్పుడు ఉత్సవాలు ఆసందర్భంగా సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు పెద్ద ఎత్తున జరిగేవి అప్పటి సభలలో పాల్గొని

తరుచు సాహిత్య కార్యక్రమాల బహుమతులను ఇప్పటి ఉస్మానియా తెలుగుశాఖ అధ్యక్షులు డాక్టర్ బిరుదురాజు రామరాజుగారి వంటివారు అందుకునేవారు సాహితీ రంగంలోను, ప్రజోద్యమరంగంలోను రాజకీయాలలోను గ్రంథాలయోద్యమంలోను వివిధ పార్టీల నాయకులతోను సంబంధం ఉండడమేగాక ఆయా రంగాలలో నేడు ప్రముఖులుగా ఉన్నవారు కాళోజీ సమకాలికులు సహితం అప్పట్లో అయన మేటి తనాన్ని అంగీకరించినవారే ఇప్పటికీ కాళోజీ అన్నా అయన నిజాయితీ అన్నా మిత్రులకు ప్రత్యర్థులకు అందరికీ భీతే నాడు నేడు పౌరుడుగా ఆధిక్యతను నిలబెట్టుకుంటూవచ్చిన కాళోజీ ప్రజాస్వామ్యంలో నాయకులనే వారుండరనీ వారంతా ప్రజాసేవకులనీ అధికారులు జీతగాళ్లని విశ్వసించి ప్రబోధించే ప్రజాస్వామ్య తత్వవేత్త ఈ ప్రజాస్వామ్యవాధి అంధ్ర ప్రదేశ్ విధాన పరిషత్తుకు ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి ఎన్నికై, 1958 60 వరకు శాసనసభ్యులుగా ఉన్నారు

జీవితం రాజకీయ జీవితం సాహిత్యం ఒకటి కొకటి ముడివేసుకొని నాడూ నేడూ తననూ తన కవిత్వాన్నీ, ప్రజలకు ప్రజాస్వామ్యానికి అంకితం చేసుకున్న వ్యక్తి శ్రీ కాళోజీ

అందుకే 1969లో ఉవ్వెత్తున తల ఎత్తిన తెలంగాణా ప్రజా ఉద్యమాన్ని అయన సమర్థించినారు ఆయన అందులో చేరినారు ఎందరు మారినా ఆయన మారలేదు చేరిన కాళోజీ ఊరికే లేరు అయా సందర్భాలలో ఆక్షేపణలను తెలుపుతూ ప్రజలకు కర్తవ్యాన్ని వినిపించినారు

ఎందరో పేరుపడిన కవులు ప్రభుత్వశాలువలు సత్కారాలకు ఆశపడి సమైక్యతా శంఖారావాన్ని పబ్లిక్ గానూ, వేర్పాటు ఆక్రందనను ప్రైవేటుగాను గావించినా వారూ ఉన్నారు సమైక్యత అంటూ ఊరికే వ్రాసి రేడియోలకు పత్రికలకూ పుట్టుకొచ్చిన అనేక మంది కవులు సహితం బాగుపడిన రోజులలోనైనా ఆయన ప్రజల పక్షం వీడలేదు ఆ మాట అయనే అనుంటే బహుశా ఈ షష్టి పూర్తి ఘనంగా ప్రభుత్వ పక్షాన్నే జరిగి ఉండదేవెూ అయినా ఏదో అయి ఉండేవారే కానీ కాళోజి 1939లో ఎందుకు జైలుకు వెళ్లారో ఎందుకు స్పందించి నారో ఎందుకు ఉగ్రులై పాలకులపై అగ్ని బాణాల్ని వర్షించినారో 1969లో అందుకే స్పందించి నారు అదే విధంగా ప్రజాపక్షం వహించి తన కలం వాడిలోని వేడిని గుప్పించినారు ప్రజల ప్రతినిధిగా 1969 ఆగస్టు 14న తెలంగానా ఏర్పడినట్టు ప్రకటించ వెళ్తూ అరెస్టై జైలుకు వెళ్ళడం ఆయన నిష్టకు పట్టుదలకు తార్కాణంగా పేర్కొనవచ్చు ప్రతిసారి రేడియో ఉగాది కవి సమ్మేళనాలకు ఆహ్వానం అందుకునే కాళోజీకి ఉద్యమం తీవ్రంగా ఉన్న రోజుల్లో ఆహ్వానం రాలేదు సమైక్యతను ప్రబోధించే సంస్థలో తమ వేర్పాటును ఆ రూపంలో ప్రదర్శించి నారు అందుకే కాళోజీ రేడియోవారి బాలానందం నుండి బ్రహ్మాండ కార్యక్రమాల వరకూ స్పర్శించనే స్పర్శించినారు తన కలంలో

ప్రజల హక్కుల కోసం అహరహం పరిశ్రమించే కాళోజీ పదహారణాల ప్రజాస్వామ్యవాది 'ఓటు' ప్రజాస్వామ్యం ఉన్నంతవరకు అందరికీ గుర్తుంటారు కాళోజీని తెలియనివారు సహితం ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి" అన్న సూక్తి ప్రతినిత్యం జ్ఞప్తికిరాగా ఎవరిదో ఈ 'నుడి' అని పేరుకోసం తడుముకొని ఓహ్ కాళోజీ' అంటూ గునుచుకొని నిట్టూర్చే సంఘటనలు ఈ 'ఓటు ప్రజాస్వామ్యంలో కోకొల్లలు ఇది మనకే పరిమితమైన మాట కాదు ప్రపంచ ప్రజాస్వామిక దేశాలలో ఉన్న పౌరులందరికీ హితమైన మాట ఇది కాళోజి ప్రజాకవి మాత్రమే కాదు విలక్షణ దేశభక్తుడు విశ్లేషించి ప్రజాతంత్రజ్ఞుడు, స్వయం ప్రతిభగల పౌరుడు, స్వాతంత్ర్య సమరయోధుడు జాతీయ నాయకుడు ఈ నాయకుని విభిన్న ప్రవృత్తులు యువతపట్ల అయన సానుభూతి, ప్రేమలు ఇత్యాదుల గురించి ఎంత వ్రాసినా తక్కువే కాళోజీ షష్టిపూర్తి ఒకానొక చైతన్యస్ఫూర్తిసంకేతం తప్ప వయో గణాంకాల ననుసరించిన షష్ట్యబ్ది కానేకాదు

❖ ❖ ❖

# మేము ముగ్గరము

– కోదాటి నారాయణరావు

అది 1938 వ సంవత్సరం స్టేట్ కాంగ్రెసు ఉద్యమ నిర్వహణ కొరకు విజయవాడ గవర్నర్ పేటలో ప్రస్తుతం లక్ష్మిటాకీసు ఉన్నచోట అంటే శ్రీ డి టి రావుగారి ఇంటిలో ఒక కార్యాలయాన్ని పెట్టారు దీని యాజమాన్యులు స్వ॥ శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు ఆంధ్రవాణి అనే ఒక వారపత్రిక కూడా శ్రీ బి ఎన్ శర్మగారి సంపాదకత్వంలో వెలువడేది ఆఫీసు చాలా సందడిగానూ ఉండేది నేను ఖమ్మం నుంచి తరచుగా వస్తూ పోతూ ఉండేవాడిని స్టేట్ కాంగ్రెసు కార్యకర్తగానే కాకుండా ఆంధ్రవాణి విలేఖరిగా కూడా పనిచేస్తూ ఉండేవాడిని ఒకనాడు ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకొంటుండగా కాళోజీ అరెస్టు వార్త వచ్చింది అదే మొదటిసారిగా ఆయన పేరు వినడం ఆ తర్వాత విజయవాడ స్టేటు కాంగ్రెస్ కార్యాలయంలోనే, వరంగల్లునుంచి వచ్చిన మిత్రులెవరో జ్ఞాపకం లేదు కాని కాళోజీ వ్రాసిన 'బందేమక్కమ్' బందె నదీనమ్", 'యామెరి అల్లమ్" "యాహే రసూల" అనే పాటను వినిపించాడు అప్పుడింకా కాళోజీ కవి కాలేదు ఇది అతనిలో సహజంగా పెల్లుబికివచ్చిన ఒక గీతం అనాడు ఉస్మానియా యూనివర్శిటీ హాస్టళ్ళలో వందే మాతరం గేయం పాడరాదని యూనివర్శిటీ అధికారులు నిషేధం విధించారు వందేమాతరం తమ ధర్మవిరుద్ధమనే అనాటి ముస్లిములవైఖరి, అంటే తాము పాడమని కాదు, హాస్టలులో హిందూ విద్యార్థులు కూడా పాడగూడదని, అ వైఖరిని వెక్కిరిస్తూ ఆయన ఈ గీతం వ్రాశాడు ఇందులో ఒక పాదంలో మేము పశువుల కంటె ఏం తక్కువ అని అర్థం వచ్చేటట్టు వ్రాశాడు చాలా నవ్వు పుట్టించేటట్టుగా ఉన్నది

1938 సత్యాగ్రహోద్యమం తర్వాత రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషానిలయం వార్షికోత్సవం హనుమ కొండలో ఏర్పాటుచేశాము బహుశ అప్పుడు కాళోజీ ఆంధ్ర భాషా నిలయానికి కార్యదర్శి అయి ఉంటాడు దాని యాజమాన్యం అంతా ఆయనదే అధ్యక్షులుగా అప్పుడే ఇంగ్లండు నుండి చదువుకొని వచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేస్తున్న శ్రీ రావాడ సత్యనారాయణగారిని పిలిచారు ఈ వార్షికోత్స వానికి నేనూ ఖమ్మం నుండి పనిగట్టుకొని వెళ్లాను వరంగల్ వెళ్ళడం అదేనాకు బహుశ మొదటిసారను కుంటాను మిత్రులు హాయగ్రీవాచారిగారు కూడా సత్యా గ్రహంచేసి జైలునుండి విడుదలై వచ్చారు నేను రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయానికి వెళ్ళి కాళోజీని కలుసు కొని నేను ఫలానా అని గోత్రనామాలతో పరిచయం చేసు కొన్నాను అది మా మొదటి కలయిక అప్పటికే కాళోజీ వరంగల్‌లో తిరుగులేని నాయకుడు సత్యాగ్రహం జేసి జైలుకు పోయిరావడం కాకుండా వరంగల్ చౌరస్తా పోలీసు స్టేషను ప్రక్కనగల మసీదునుండి గణపతి ఉత్సవాన్ని పోనీయమనే ముస్లిముల మతోన్మాదాన్ని ఎదుర్కొని విజయవంతంగా ఉత్సవం జరిపించుకుని వెళ్ళాడు దానితో వరంగల్, హనుమకొండ, యువక లోకమంతా ఆయనకు బ్రహ్మరథం పట్టారు

ఆంధ్ర భాషానిలయంలో రెండురోజులు జరిగిన వార్షికోత్సవంలో ప్రతి యువకుడు ఆయన కనుసైగలలో మెలిగాడు, పెద్దవాళ్ళలో ప్రతి ఒక్కరూ ఆయనపట్ల ఆదరాభిమానంగా కనిపించారు

ఖమ్మం తిరిగివచ్చిన కొద్దికాలానికే ఆర్యసమాజ్ సత్యాగ్రహం చేద్దామని తయారయి అవకాశం దొరకక మానివేసిన మరొక బృందంతో స్నేహమయింది ఆయనే కొమరగిరి ఈయన అబ్కారీ శాఖలో సబ్ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తూ ఆర్యసమాజ్ సత్యాగ్రహం చేయడానికి అవ కాశం చిక్కలేదు ఆయన తిన్నగా మా ఇంటికేవచ్చి ఏదో ఒక విషయంపై చర్చసాగించి నా అభిప్రాయాలు తెలుసు కోవడం మొదలుపెట్టాడు ఈ విధంగా 5, 6 సార్లు వచ్చిన తర్వాత మా పరిచయం స్నేహంగా మారింది

అది 1940 వ సంవత్సరం నల్లగొండ జిల్లా చిలుకూరులో అష్టమాంధ్ర మహాసభ శ్రీ రావి నారాయణ రెడ్డిగారు అధ్యక్షులు ప్రఖ్యాత ఆంధ్ర పండితులు శ్రీ వేదం వెంకట్రాయ శాస్త్రి, చిలకమర్తి లక్ష్మినర్సింహం గార్లు మొదలైన వారంతా ఆ సంవత్సరమే దివంగతులైనారు వారి ఆత్మశాంతికి పరమేశ్వరుని ప్రార్థిస్తూ వారి సేవలను

శ్లాఘించే సంతాపతీర్మానం నేను ప్రవేశపెట్టాను వారు నిజాం రాష్ట్రవాసులు కారనే నెపంతో పెద్దలు ఆ తీర్మానాన్ని నిరాకరించారు అప్పటికి ఆంధ్రమహాసభలో మౌలానా షౌకతలీ మహమ్మదాలీవంటి వారల మరణానికి సానుభూతి తెలపడం జరిగింది ఇవన్నీ నేను ఉదాహరణగా చూపించినాను అయినా పెద్దలు నసేమిరా అన్నారు అప్పుడప్పుడేర్పడుతున్న కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ఉన్న యువకబృందం కూడా పెద్దలనే అనుసరించారు విషయ నిర్ణయ సభలోనూ తీర్మానం వీగిపోయింది నా తీర్మానాన్ని బలపరుస్తూ మాట్లాడిన వారు కాళోజీ నారాయణరావు కొమరగిరి నారాయణ రావు వట్టికోట ఆళ్వార్‌స్వామి అప్పటి నియమాను సారంగా విస్తృత సమావేశంలో ■ తీర్మానాన్ని చర్చకు పెట్టవలసిందిగా నేను నోటీసు ఇచ్చాను ఆనాడు ఆంధ్ర మహాసభలో తీర్మానాలు నేను ప్రతిపాదించి మాట్లాడగా కాళోజీ కొమరగిరిలు బలపరిచారు ఆ ఉపన్యాసాలు ప్రజలనెంతో ఆకర్షించాయి చాలామంది ముగ్గురలపై పోయామన్నారు ఆవేశం, హేతువాదం చాలా చక్కగా అమరినటవటు అందులో ఆనాటినుంచి కాళోజీ కోదాటి, కొమరగిరి అనే పేర్లు ప్రజలతో వ్యాప్తిచెందాయి, మా అసలు పేర్లులుప్తమైనవి అప్పటినుండి మేము ముగ్గురం, ఈనాటి వరకూ మేము ముగ్గురమే అంటే ఒకటి రెండూ మూడూకాదు, ముగ్గురమంటే లేదా బ్రహ్మ, విష్ణు మహేశ్వరులవలె త్రిమూర్తులంగాదు ప్రతి ఒక్కరిలోనూ ముగ్గురూ ఉన్నారు అంటే ప్రతిఒక్కరూ త్రిమూర్త్యాత్మ స్వరూపమన్నమాట

అది 1944 సంవత్సరం, సింగరేణి కాలరీస్‌లో 25వ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ మహాసభ జరిగింది ప్రఖ్యాత నాయకులైన స్వ॥ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు ఆ మహాసభను గురించి తమ అభిప్రాయాలను వ్రాస్తూ మా ముగ్గురిని నారాయణ త్రయమని వ్రాసి ఎంతో ప్రశంసించారు అప్పటి నుండి మా త్రిమూర్తి ఆత్మ బల పడింది

హైదరాబాదు స్టేటు కాంగ్రెసుపై ఆంక్ష తొలగగానే 1946 సంవత్సరంలో అధ్యక్షుని ఎన్నిక అవసరపడింది మొదట కాశీనాథరావు వైద్య, స్వామి రామానంద తీర్థ పోటీచేస్తామన్నారు ఆంధ్ర జాతీయ పక్షము ఆధ్వర్యంలో యువక బృందమంతా స్వామీజీకి ఓటు చేయాలని తీర్మానించుకున్నారు మితవాద నాయకులు, చివరి క్షణంలో తమ ఎత్తు గడలను మార్చుకున్నారు వైద్యాగారి బదులు బూర్గులవారిని అధ్యక్ష పదవికి పోటీగా పెట్టారు స్వ॥ జమలాపురం కేశవరావుగారి ప్రోత్సాహంవల్ల చాలామంది యువకులు బూర్గుల వారి వైపు తిరిగిపోయినారు అయితే మేము ముగ్గురం మాత్రం ఆంధ్ర అనాంధ్ర భేదభావం కాక సమయానుకూలంగా పోరాటం నడుపగల నాయకత్వం కొరకై స్వామీజీనే బలపరచాలన్నాము మా సహచరులు కొంతమంది మాతో ఏకీభవించారు అతి తీవ్రమైన పోటీ జరిగింది కేవలం 3 ఓట్ల మెజారిటీతో స్వామీజ నెగ్గారు దీనినిబట్టి మా ముగ్గురి నిర్ణయం మా సహచరుల సహకారం లేకపోతే స్వామీజీ నాయకత్వం వచ్చేదే కాదు హైదరాబాదు పోరాటం మరొకవిధంగా ఉండేది

ఈ విధంగా వ్రాస్తూపోతే హైదరాబాదు రాజకీయ చరిత్రలో మాత్రమేకాదు సాంఘిక, సాహిత్య రంగాల లోనూ మేము ముగ్గురం వహించిన పాత్ర అల్పమైనదేమీ కాదు విశాలాంధ్ర నిర్మాణంలోనూ, మేము ముగ్గురం సమైక్యంగానే పనిచేశాము

ఇప్పుడు మేము ఏమి చేసామని చెప్పవలసిన అవసరంలేదు పరిస్థితులవల్ల సమస్యలపట్ల భిన్నాభిప్రాయాలు ఏర్పడినప్పటికీ లేదా వేరేవేరే రంగాలలో పనిచేసినప్పటికీ ఇవన్నీ ఐక్యతకూ అడ్డుగా నిలిచే స్థితిని అధిగమించాము ఎవరు ఎక్కడున్నా ఎవరు ఏమిచేసినా మేము ముగ్గురము ఒకటే మమ్ముల గురించి అప్పుడప్పుడు కొందరు పొరపాటున ఒక్క పేరుతో ఇంకొకరిని పిలుస్తారు లేక ఒకరు చేసిన పనిని మరొకరికి అంటగడతారు ఒకరి సుఖదు ఖాలను రెండవవారివిగా తలిచి ఓదార్చడానికి ప్రయత్నిస్తారు అయితే మాలో ఎవరు గాని ఇది నాకు సంబంధించింది కాదని మాలో ఫలానా వారికి సంబంధం చిందని చెప్పరు ఆ మాదిరిగానే మాలో ప్రతివారూ భావించి ప్రత్యుత్తరమిస్తాము అలాగే భావిస్తాము భావాల్లోనూ, కార్యాల్లోనేకాదు, సుఖదు ఖాలలోనూ ముగ్గురమూ సమాన భాగస్వాములమే, ఎవరికి కలిగినా అందరికి కలిగినట్లే అనుభూతితో ప్రవర్తిస్తాము

అందుకనే మేము ముగ్గురం ఇందులో ఎవరు ప్రత్యేకంగా ఒక్కరు కాదు ప్రతివారున్నూ మేము ముగ్గురమే

❖ ❖ ❖

# కాళోజీ షష్టిపూర్తి 1974

ఊ కృష్ణ

ఎవరిని గురించి వ్రాసినప్పటికీ అది కొంత వరకూ ఆత్మకథే అవుతుంది తోచినంత, తనకు ఓపినంత, తనకు అవగతమైనంత అంతే కదా వ్రాయగలిగేది తనగోడవే శ్రీ కాళోజ నారాయణరావును గురించి వ్రాయబూనుకుంటే, అది నాకు 'తెలిసినంత కాళోజీకథ కాకతప్పదు పైగా, నేను చెప్పే సంగతులు ఈనాటివికావు నేను గతంలో బ్రతుకుతున్నాను మన్నిస్తారని ఆశిస్తున్నాను

మా కాళోజీ కవి హృదయం కలవాడు తన కవిత కంటే దొడ్డ వ్యక్తిత్వం కలవాడు తనను మినహాయించుకుని ప్రపంచాన్ని చూడగవాడు కాడు మన వాడు మనం అతని వాళ్ళం ఉల్లం గుల్ల చేసుకున్నానని అతడు అననూలేదు అట్లా అని ఉంటే నేటిపరిస్థితుల్లో రహస్యంగానైనా ఏవగించుకునే వారం నవ్వుకునేవారం

భగవద్భక్తి పుట్టినందువలన వ్రాసనామని పలువురు అంటూ ఉంటారు ఆ పరిషబాకూడా వారి కవితల్లో ఉంటుంది అయినప్పటికీ 'భగవంతునికి పీడి భక్తి అధారమయినదా పాపం' అని అనేకుల విషయంలో మనం జాలిపడ్తున్నాంకాదా కాళోజీ అటువంటి దౌర్భనుడులు మనకు వర్ణించలేదు

నిజానికి కాళోజీకి ఒక బాణీ ఉన్నది అతని కవితలో ఒక తత్వం ఉన్నది ఎవ్వడైనా ముందు ముందు వీటిని గురించి వ్రాసి ఏ విశ్వ విద్యాలయం ద్వారానో ఒక డాక్టొరేట్ పుచ్చుకుంటాడేమో చెప్పలేము ఇప్పటికి మాత్రం కాళోజీ యుగంగానీ, కాళోజీ సంప్రదాయం కానీ కాళోజీ పంథీలు కానీ లేరు హాయిగా ఉంది

1936 ప్రాంతంలో నాకంటే చాలా పెద్దవాడయిన ఒక "నాయుడు' నాకు స్నేహితుడు

"ప్రసాద్" పెట్టేవాడు భగవద్గీత శ్లోకాలు ఒక్క టొక్కటే చదివించి అప్పగించుకునేవాడు వాటి అర్థం నాకు తెలియదు అతడు ఆర్యసమాజం సభ్యుడని నాకు తెలియదు 1938 39 ప్రాంతంలో దత్తాత్రేయ శర్మగారనే తెలుగు ఉపాధ్యాయుని ద్వారా (సికింద్రాబాదులో వారి పేరిట ఒక రోడ్డు ఉన్నది) నాకు ఆర్యసమాజం అనే సంస్థను గుంంచి కొంత తెలిసింది అప్పటినుంచి కొంచెం కొంచెం ఆర్యసమాజాన్ని గురించి తెలుస్తూనే ఉంది నైజాం రాజ్యంలో వరిపాలన తీరు తెన్నులను ఒక్కొక్కన్నుడైనా వివుర్శించి నెగ్గిన దిట్టలు ఈ ఆర్యసమాజంవారే ననే నమ్మకమూ కుదిరింది పండిత నరేంద్రజీకి పెద్ద శిక్ష విధించినారని తెలిసి బాధపడిన వారిలో నేనొకడను

నేను ఆర్యసమాజంలో చేరలేదు చేరవలెననే తలంపుకలగలేదు 1948 తర్వాత జమలాపురం కేశవరావుగారితో విలేఖరిగా తిరగడంలో పండిత రుద్రదేవ్ పరిచయం అయింది అతడు ఆర్యసమాజీయుడు చదువుకున్నవాడు అతడి ఉపన్యాస ధోరణి నాకు అనాయం కలిగించింది మంచి హాస్య ప్రియుడుకూడాను నా నివాసం ముందు ఉన్న అర్యసమాజీయుల గృహంలో కాళోజీ ఉంటూ ఉండే వాడు వారి ప్రవర్తన చూసి నాకు అటువంటి సౌజన్యం లేదే అని అసూయ కలిగింది

ఎందరిని చూసి అసూయపడను వారందరితో స్నేహంచేస్తే తీరిపోతుందనుకున్నాను కానీ నేనొకరికి నౌకరును నన్ను ఓకేచోట ఉంచరు బదిలీలతో, ఇతర మార్పులతో, ఒక వంకనుంచి ఇకొక వంక లోకి కొట్టుకుని పోసాగాను నా స్నేహితులందరూ నాకంటే మంచివారు అనే ధైర్యంతో జీవిత ప్రవాహంలో కొట్టుకు పోసాగాను

పోలీసు చర్యానంతరం కాళోజీవలన ఒకటి రెండు సమస్యలు ఎదురైనాయి

రావణ వధానంతరం రాముడు లంకను పాలిచడానికి కొందరు వానరులను నియమించగా, అవి బంగారురాళ్ళు తోకలకు కట్టుకుని మిణక నారంభించినాయని ఒక కథ వ్రాశాడు కాళోజీ అది ఒక సమస్య

ఒక రాజకీయవాది, ఎవ్వరినో దూషిస్తూనో, ఏదో సమస్యపై తన అజీర్ణ భావాలను వివరిస్తూనో ఒక

ప్రకటనచేస్తే అన్ని పత్రికలూ ప్రచురిస్తాయి ఒక రచయిత ఒక కథగానీ కవితగానీ వ్రాస్తే ఏదో ఒక పత్రికే ప్రచురిస్తుంది మిగిలిన పత్రికలు ప్రచురించవు నీ పాడు పైసలు నాకు వద్దు అన్నా కూడా ప్రచురించవు ఇది ఏమి అన్యాయం? ఇది ఏమి అన్యాయం? ఇది ఎవరుపెట్టిన సంప్రదాయం? అని ప్రశ్నించాడు కాళోజీ

నేనొక పత్రికకు ప్రతినిధిని నేను కాళ్ళతోనే అనగా మరీ క్రింది అవయవంతోనే నడుస్తాను యజమాని ఉత్తమాంగంతో అనగా తలతో నడుస్తాడు కాళోజీ గుండెతో నడుస్తాడు ఈ ముగ్గురికీ పొంతన కుదరదు

రేడియో వాళ్ళు తన కధను ప్రసారం చేయనన్నారనీ వాళ్ళను చివాట్లు పెట్టి వచ్చినాననీ కాళోజి చెప్పాడు కాళోజీ చివాట్లు పెడ్తేనూ అమ్మ చివాట్లు పెడ్తేనూ కలిగే బాధ ఏమీలేదు

కానీ నిజమే ప్రజ్ఞకు ప్రచారం చేయడం అప్పటికీలేదు రాజకీయవాదికి వచ్చే ప్రచారం రచయితకురాదు రాజకీయవాదికి అకస్మాత్తుగా ప్రచారం ఆగిపోయినట్లు రచయితకు ఆగదుగదా

ఆ కాలంలో నేను ప్రతినిధిగా ఉన్న పత్రిక పోలీసు చర్యను పురస్కరించుకుని ఒక ప్రత్యేక సంచికను వెలయించింది వ్యాసాలు కావాలి రాజకీయనాయకుల వ్యాసాలు ముఖ్యం కదూ ఎవరి వద్దక వెళ్ళినప్పటికీ వారు కొన్ని సంగతులు చెప్ప "ఇట్లా వ్రాసుకో పో అని చెప్పేవారే అట్లాగే వ్రాసుకున్నాను రచయితలతోనే పేచీ వాళ్ళు వ్రాసి ఇవ్వాలి ఏదో తంటాలు పడ్డాను తీరా కాళోజీ పేర నేనే ఒక వ్యాసం వ్రాశాను 'రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ కూ గిర్దావర్ కూ ఆంధ్రభాషకు సంబంధించినంతవరకూ, వ్యత్యాసం ఏమీలేదని' ఏదేదో వ్రాశాను దానిని అచ్చులో చూసుకుని కాళోజీ వరంగల్లు నుంచి వచ్చిపడ్డాడు భావాలు సరేగానీ భాష తనది కాదు అన్నాడు నిజమే

తెలంగాణా కోస్తా రాయలసీమ, శ్రీకాకుళం ప్రాంతాల యాసలేగాక వ్యక్తిత్వం ఉన్న ప్రతి మనిషికీ ఒక శైలి ఉంటుందనే జ్ఞానం అప్పటికి నాలోలేదు అప్పుడే ననుకుంటాను మా దేవులపల్లి రామానుజరావుగారి వ్యాసాన్ని ఎత్రిక శైలికి అనువుగా దిద్దాను వారు అసంతుష్టి ప్రకటించగా, సిగ్గు పడ్డాను

ఇంతకూ కాళోజీకి ఒక వ్యక్తిత్వం ఉంది ఆ వ్యక్తి మందలో ఇరకరు

అటువంటి వ్యక్తిని కూడా గుర్తించని సందర్భాలు ఉంటవికదా కాళోజీని 1952 లో వరంగల్లు లోకసభ నియోజక వర్గం కాంగ్రెసు అభ్యర్థిగా నియమించారు అప్పటికే నేను బెజవాడకు బదిలీ అయి ఉన్నాను కాళోజీ ఎన్నిక ప్రచారం తీరు చూసి తీరాలి అనిపించింది సెలవుపెట్టి వరంగల్లు చేరుకున్నాను విలేఖరి హోదాలో రానందుకు కాళోజీ సంతసించాడు ■ ఇంట్లో కాళోజీ ఒక పసివాడు వాళ్ళ అమ్మగారు కూడా పసివానిని చూసినట్లేచూసేది ఏమి అదృష్టం చంటిబిడ్డ లేని ఇల్లు శూన్యం గుర్తు లేదు కానీ అతడికి ఒక ముద్దు పేరు ఉంది! రావువా! ముద్దియరామన్న ఎగిరి గంతిడుచు హాయిగను కౌగిలించువాడు' అన్నట్లు కానవచ్చింది, ఆ తల్లీ కొడుకుల ప్రేమ సొంపు

ఇంట్లో హాయి లేనివాడు బయట చేసే నిర్వాకం ఏమీ ఉండదు

పోనీ వాళ్ళ అన్నగారికైనా తమ్ముడైనా తక్కువ ఈడువాడా! అనే భావం ఉన్నట్లు లేదు అ తమ్ముడు ఉండనివ్వడేమో! లక్ష్మణజాతకుడేమో!

అటువంటి పసివానితో ఎన్నికల తిరునాళ్ళు చూడ బయలుదేరాను ■ యాత్రలో ఒకటి రెండు సన్నివేశాలు

మానుకోట పోయే మార్గంలో, ఒక చౌరస్తా అడవి అక్కడ సగం కూలిన ఒక అడవి బంగళా దానిలో ఒక అల్పాహారశాల దర్వాజావద్ద ఒక యువ కుడు తన పెద్దకళ్ళు తెరచుకుని కూర్చుని ఉన్నాడు కిటికీలోంచి ఒక యువతి చూస్తున్నది "వీడెమి! ఈ అడవిలో ఈ ఆడది దీన్ని ఇక్కడ పెట్టుకుని బతుకుతున్నాడు' అని మందహాసం చేసుకుంటూ, లోపలకు వెళ్ళబోయాము వాడు దర్వాజా వద్దనుంచి కదలలేదు 'అట్లా చూస్తూకూర్చున్నావ్ కదలవేం?' అని, వాని ప్రక్కనుంచి అంగవేసి లోపల ప్రవేశించాము ఆ అమ్మ బిస్కట్ల పళ్ళెం ముందు పెట్టింది టీ కావాలన్నాం తెచ్చింది ఆకులు వక్కలు కూడా తెచ్చింది అప్పుడు చూశాం

ఆ యువకుడు తడుముకుంటూ వసారాలో నడవడం కడుపు భగ్గుమన్నది కాళోజీవెళ్ళి వాణ్ణి కౌగిలించుకుని 'క్షమించండి మీరు దోవలో కూర్చుండగా గద్దించాము అని కన్నీటితో విన్నవించుకున్నాడు వాడు తికమకపడ్డాడు ఆమె పరుగున వచ్చి వీరు ఈ నియెజకవర్గ కాంగ్రెసు ప్రతినిధి మన కాళోజీ నారాయణరావుగారు వీరు నా భర్త అంధుడు అని పరిచయం చేసింది

అతడు అంతకు కొన్ని నెలలకు ముందువరకూ ఉద్యోగిట హైదరాబాదు వెళ్ళడానికి ఖమ్మం స్టేషన్‌లో రైలు ఎక్కబోతుండగా అకస్మాత్తుగా దృష్టిపైన 'ఒక చీకటి తెర" పడిందిట అంతే వైద్యాలు పనిచేయలేదు ఖర్చులు పోగా వారు మిగిలారు ఆ అడవిలో హోటల్ పెట్టుకొని కాలక్షేపం చేస్తున్నారు పూలు అమ్ముకున్న ఊరికి పోకుండా

ఆమె నిజంగా వనదేవతే! మా ముగ్గురికీ టీ తెచ్చి పెట్టింది ఎక్కలాకులు ఇచ్చింది కాళోజీ వది రూపాయలు అతనికి ఇవ్వబోగా, ఆశీర్వదిస్తూ ఇమ్మంది కాళోజీ వర్షం కడిగిన వెన్నెల!

ఎవరో మనలను గురించి ఏమి అనుకుంటే మాత్రం మనకేమి! మనం ఇంకొకర్ని గురించి ఏమనుకుంటున్నామా అనేదే సత్పురుషునకి ముఖ్యం

ఆ తర్వాత మామకోట వెళ్ళాం - అక్కడ ఎన్నికల పెద్ద లెవ్వరూ కాళోజీని తమ లెక్కలో వేసుకోలేదు! అది శాసనసభ నియోజకవర్గం

ఆ పైన వరదన్న పేట

అక్కడ అద్లూరి అయోధ్యరామ కవి కూడా ఒక అభ్యర్థి (శాసనసభకు)

ఊరు చిన్నది చీకటిపడేనరికి రెండు మూడు ఊరేగింపులు అరువులు, మేళాలు నానా బీభత్సం కాళోజీ సభ అదనం ఊరిలో ప్రవేశించి, చూసితిమి గదా పసిపిల్లలు ఏడుస్తున్నారు ఏంచేస్తారు శబ్దం బాంబు పడింది అక్కడ

సభ తర్వాత కానిద్దాం అని ఊరిబయటకు మరలాడు కాళోజీ ప్రశాంతంగా ఉంది రోడ్డు ప్రక్కనే కారు ఆప చూస్తున్నాం

రోడ్డుకు అవతల ప్రక్కన కొందరు ఆడా మొగా చలిమంట చుట్టూ చేరి ఉన్నారు పల్లీలు కాల్చుకు తింటున్నారు మేమూ అక్కడకు చేరుకున్నాం మాకూ పల్లీలు పెట్టారు

వారిలో ఒకడు నల్లగొండ నుంచి వచ్చాడట అక్కడ సంఘానికి ఓటువేసి ఇక్కడ తన వాళ్ళు కూడా అట్లాగే ఓటు వెయ్యాలని చెప్పడానికి వచ్చాడట చలికాచుకుంటున్న ఒక యువతి అన్నీవిని నిబ్బరంతో ఇట్లా చెపింది ఉపన్యాస ధోరణి కాదు చక్కటి సంభాషణా ధోరణి

అనగనగా ఒక ఊరు ఆ ఊర్ల అన్నీ గొర్లే ఒక తోడేలొచ్చిపడింది గొర్లేం జేస్తవయ్యా? ఒక్కటొక్కటి తోడేలుకు నానవుతుండె గొర్లల్లో కూడ తెలివి ఉంటుందిగద ఒకటి ఈ తోడేలును వదల్చుకుంటం ఎట్ల అని అలోచించింది కొన్ని గొర్ల కలిసి పులితానకుపోయి ఈ తోడేలును చంపి మమ్మల్ని రచ్చించు అని వేడుకున్నవయ్య అట్లుంది సంగానికి ఓటిమ్మంటం నైజాం సర్కారుతో కొట్లాడింది కాగ్రెసోళ్ళు అళ్ళకే ఓటిద్దాం ఇకపోతే కాళోజీ నారాయణరావు జాగీర్దారని ఈ పెద్దమనిషి అంటున్నడు కాదు అని నేను అంటున్న

ఈ ధోరణిచూసి, అ నంగపాయన, ఆలోచించుకోండి" అని గొంగళి దులుపుకుంటూ రోడ్డు ఎక్కాడు

ఆ తర్వాత సభలో కూర్చుని ఆ యువతి ఉపన్యాసం విన్నది ఆ ఉపన్యాసం కాంగ్రెసు సంగతి చెప్పేదే కానీ, ఇతర పక్షాలను తిట్టేదికాదు కాళోజీ తిట్టలేదు గెలవలేదు రాజకీయ తత్వం కాళోజీ వంట జీర్ణించనేలేదు

> కవి కాళోజీ కవి కాళోజీగానే ఉన్నాడు
> సోహం అని జపియిస్తూ
> క్షుద్రుని వలె జీవిస్తా వెందుకు
> ఆత్మ అమరత్వాన్ని ఏకరువు పెడుతూ
> ఐహికాలకై తోకాడిస్తా వెందుకు ?
>
> – కాళోజీ

# స్వాతంత్ర్య యోదుడు శ్రీ కాళోజీ!

భండారు చంద్రమౌళేశ్వరరావు

అది 1934 అప్పుడు నా వయస్సు పదమూడేండ్లు హనుమకొండలో నాల్గవ ఫారములో చదువుతున్నాను గజానన మండలి ఉత్సవాలు మహావైభవోపేతంగా ఒరిగేవి ఆ రోజుల్లో దేశంలో అనేక యితర ప్రాంతాలలోవలే తెలంగాణాలలో కూడా జాతీయోద్యమం బహుముకాలుగా విస్తరిస్తున్న రోజులు ఒక స్వరూపము గ్రంధాలయోద్యమంగా వికసిస్తే మరోవైపు యువకుల నూ విద్యార్థులనూ ఉత్తేజపరచినవి యీ గజాననోత్సవాలు

ప్రధమంగా యీ గజాననోత్సవాల సందర్భంలోనే శ్రీకాళోజీ నారాయణరావుగారితో నాకు పరిచయం కలిగింది (వారికి నాతో పరిచయం కాదు) వారూ అనాడు విద్యార్థులే మెట్రిక్యులేషన్ క్లాసులో వున్నట్లు నాకు జ్ఞావకం బక్కపలుచగా ఉండేవారు నిక్కచ్చిగానూ ఉద్రేకంతోనూ సంభాషిస్తూ యువకులనూ బాలురనూ అకర్షిస్తూ వుండేవారు అనాటి ప్రభుత్వము మహమ్మదీయ కులతత్వాన్ని వెంటవేసుకొని యీ ఉత్సవాలను అటంక పరచాలని చేసిన ప్రయత్నాలను అధిగమించి, ప్రజానీకంలో ఉత్సాహోద్రేకాలను రేకెత్తించిన పెద్దలు అనేకమంది, వున్నారు కాని యువకులనూ విద్యార్థులనూ సమీకరించి, ఆయత్తపరచిన అనాటి విద్యార్థి నాయకులలో శ్రీ కాళోజీ అగ్రగణ్యుడు శ్రీ నారాయణరావుగారు అప్పట్లో నన్నెరిగుడంక పోవచ్చు మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తి అయిన తరువాత హైదరాబాద్ నిజాం కాలేజీలో విద్యాభ్యాసము పూర్తిచేసుకొని కొన్నాళ్ళకు తిరిగి వరంగల్ చేరుకొన్న తరవాత ముఖ్యంగా 1946 నుండి నాకు వారితో సన్నిహిత పరిచయం కలిగింది

పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో కాళోజీకి సంబంధంలేని ప్రజా ఉద్యమమే లేదు 1938 ఉద్యమంలోనూ బహుశ 1942 లో కూడా ఆ తర్వాత 1947 48 లోనూ కాంగ్రెస్ పోరాటంలో ఆయన భాగం తీసుకొన్నారు కారాగార శిక్షలు అనుభవించారు 1948 లో వరంగల్ పట్టణం నుండి బహిష్కరింపబడ్డారు ఇవన్నీ నా దృష్టిలో సామాన్య విషయాలే ఇంతకన్నా త్యాగాలు చేసనవారు అనేక మంది ఉన్నారు ఏండ్ల తరబడి కారాగార శిక్ష అనుభవించిన వారిని కూడా మనము ఎరుగుదుము రాజకీయాల కారణంగా సంసారాలు శిథిలము చేసుకొన్న వారూ వున్నారు మరి కాళోజీలో ఉన్న విశిష్టత ఏమిటి? అనేకమంది స్వాతంత్ర్యమోధులున్నారు వీరిలో ప్రత్యేకత ఏమిటి?

కాళోజీ ఒక విచిత్రమైన మనిషి ఆకస్మాత్తుగా కోపానికి వస్తారు కోపంలోనే విలపిస్తారు తర్వాత ఆలింగనం చేసుకుంటారు నైజాం పరిపాలనలో మహమ్మదీయ పరిపాలకులనూ మహమ్మదీయ కులతత్వవాదాన్నీ తీవ్రంగా విమర్శించారు ఎదుర్కొన్నారు అయినా అతనికి అనేకమంది మహమ్మదీయ మిత్రులున్నారు ఉర్దూ భాషపట్ల అతనికి అత్యంత గౌరవం విశాలాంధ్ర కావాలని శంఖారావం చేశాడు 1969 నుండి తత్భిన్నంగా ప్రత్యేక తెలంగాణా కావాలంటున్నాడు ఏమిటి యీ వైరుధ్యం ఇవి స్వచ్ఛమైన స్వాతంత్ర్య యోధుల లక్షనాలేనా అని కాళోజీని మూర్తిగా అర్థం చేసుకోని కొందరు విమర్శిస్తుంటారు కాళోజీది నవనీత కోమల హృదయం అతనిలో అర్ద్రభావం ఎక్కువ సమన్య బాహ్య స్వరూపంతో ప్రభావితుడౌతాడు తెలుగువారంతా ఏకమైతే తెలుగా జాతి పుష్పించి ఫలిస్తుందనిచెప్పి భావోద్రేకంలో విశాలాంధ్ర కావాలన్నాడు పాటలు వ్రాశాడు కాళోజీ కాంక్షించిన విశాలాంధ్ర రాలేదు పై పెచ్చు సర్కారు వగైరా భాగాల ఆంధ్రులు కొందరు అహంకారపూరిత చర్యలవల్ల తెలంగాణా ఆంధ్ర ప్రజల

మనోభావాలపై తీవ్ర అఘాయిత్యాన్ని కలిగించారు తిరిగి కాళోజీ హృదయం ద్రవించింది విశాలాంధ్ర పద్దన్నాడు అంతే! ప్రత్యేక తెలంగాణా కావాలని ఎలుగెత్తి చాటాడు

ప్రత్యేక తెలంగాణా వాదనచేస్తున్న కాళోజీకి వారితో ఏకీభవించని మా బోంట్లపై అభిమానంగానీ అనురాగంగానీ తగ్గలేదు తగ్గదు కాళోజీలో కనుపించే పరస్పర విరుద్ధాలు వాస్తవంగా విరుద్ధాలు కావు ఆర్ద్రహృదయుడైన ఒక మనిషిపై సమస్యలు కలుగజేసే ప్రభావాల పరిణామాలు మాత్రమే కాళోజీకి ఎవరిపట్లా ద్వేషము లేదు అతనిచే తిరస్కారం పొందిన అనేకమంది యిప్పటికీ అతని మిత్రులే కాళోజీ హృదయం వారికి తెలుసు

శారీరికంగా చాలా బలహీనంగా కనుపడే కాళోజీ అతి ధైర్యశాలి ఆ ధైర్యంకూడా అతనిలోగల అర్ద్రహృదయ జనితమే దుర్మార్గాన్నీ అక్రమాన్నీ ఎదురించవలసి వచ్చినపుడు వెనుక ముందు అలోచించే ఓపిక కాళోజీకిలేదు 1948 లో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకానికి వస్తున్నది వరంగల్ సెంట్రల్ జైలులో మేమంతా ఖైదీ లుగా వుంటిమి అప్పుడు బురుజుమీద ఉన్న ఒక సిపాయి రాత్రి ఎనిమిది గంటల సమయంలో మమ్ములందరినీ ఉద్దేశించి 'తుపాకితో వీళ్ళను కాల్చి చంపినా పాపంలేదు అని తన అక్కసు వెల్లడించుకొన్నాడు కాళోజీ మిగతా మేమంతా ఆ సమయంలో కూర్చొని ఏదో మాట్లాడుకుంటూ వున్నాము విన్నాము తక్షణమే కందిల్ (లాంతరు) తీసుకొని బురుజుదాకా వరుగెత్తి దీపము వానికి చూపి ధైర్యముంటే కాల్చవోయ్ అని అతనికి సవాలు చేశాడు వాడెందుకో భయపడి బురుజు దిగిపోయినాడు నిజంగా మేమంతా చాలా భయపడ్డాము కాళోజీ చేసిన సాహసం యితరు లెవ్వరూ చేయరు ఆ సిపాయీ ఉనత్తుడై కాల్చి వున్నట్లైతే పరిస్థితి ఏమై వుండేది? ఈ అలోచనే కాళోజీ మనస్తత్వానికి విరుద్ధం ఆ సమయంలో ఆ సిపాయిలోగల దుష్టత్వాన్ని సహించే ఓపిక కాళోజీకిలేదు కాళోజీ జీవనంలో ఇదే తత్వము ప్రతి సంఘటనలోనూ కనబడుతుంది అతని కవితలోనూ, సంభాషణలోనూ అర్ద్రత ఉట్టిపడుతుంది స్పందన కనిపిస్తుంది ఈ అర్ద్రభావమే అతణ్ణి ప్రధమ శ్రేణి స్వాతంత్ర్యయోధునిగా చేసింది అనేకమంది యువకులనూ పెద్దలనూ అకిర్షితులను చేసింది

అందుకనే ' తెలంగాణా వైతాళికుడు కాళోజీ'' అని అనాడు "ప్రగతి" అభివర్ణించింది ఆ వారపత్రిక వారికి సాధూవాదాలు పలికింది

> ఉత్తమాటలు కట్టిపెట్టి - పెత్తనాలకు దేవులాడక
> చిత్తశుద్ధిగ చేయజూనిన - చేతలొల్ల ఘటించినట్లే
>
> -కాళోజీ

# నే నెరిగిన కాళోజీ

-యల్లాప్రగడ సీతాకుమారి

సోదరుడు కాళోజీ నారాయణరావుకు షష్టిపూర్తి జరుగుతున్నదీ అంటే నా మనస్సు ఆనందంతో పులకరించపోతున్నది చాలా కాలం క్రిందటి మాట 1936 37 ప్రాంతాల్లో కాళోజీ లా చదువుతూ హైదరాబాదులోనే వుండేవాడు ఆ రోజుల్లో సోదరులు కాళోజీ వెల్దుర్తి సంగిసెట్టి భాస్కరభట్ల నెల్లూరి మరికొందరూ మేమూ కలిసి సన్నిహితంగా పనిచేస్తూవుండే వాళ్ళము అభ్యుదయ సంఘాలు యువజన సంఘాలు అణాగ్రంధమాల గోల్కొండ పత్రిక ఆంధ్రమహా సభలు శ్రీకృష్ణదేవరాయ భాషానిలయం ఇవ్వన్నీ మా కార్యక్షేత్రాలుగా వుండేవి

యువజనులమైన మా హృదయాలల్లో ఆ నాడు ఏదో చెయ్యాలి అన్న ఆవేదన పొంగి పోతుండేది

విద్యార్థిదశనుండే కాళోజీ దేశం కోసం సంఘం కోసం బాధబడుతుండేవాడు

ప్రజాకవి కాళోజీ ప్రజలకోసమే గళంవిప్పి కవితాగానం చేశాడు కాళోజీ కవిత్వంలో ఉద్యానాలు రాకుమార్తెలూ విరహవేదనలూ కనిపించేవికాదు, ఆకలీ, ఆవేదనా, అన్యాయాలూ, అక్రమాలూ, అవినీతి మాత్రమే కనిపించుతాయి కాళోజీ ఒక్కొక్క కలం గీత మనలో ఒక్కొక్క కన్నీటి బొట్టును రాల్చుతుంది కాళోజీ గొడవలన్నీ దేశం గొడవలే దళిత ప్రజానీకపు గొడవలే

క్రియాశీలియైన కాళోజీ రాజకీయ, సాంఘిక సారస్వతరంగాలల్లో ముందడుగు వేసి దేశం కోసం త్యాగాలు చేసి చెరసాలల ప్రవాసాలు అనుభవించిన మహనీయుడు నిరాడంబర దేశ భక్తుడు కాళోజీ ఏ కాంగ్రెసు సంస్థలోచేరి తన జీవితమంతా దేశంకోసం పోరాడినాడో ఆ కాంగ్రెసు సంస్థలో కాలక్రమాన చేరిన అవినీతి అంత కలహాలూ స్వార్థపరతచూచి తల్లడిల్లిపోయి నాడు అంతటితో కాంగ్రెసు రాజకీయాలకూ ఉన్నత పదవులకూ దూరమై ప్రజాకవి కాళోజీ ప్రజలమనిషిగానే ఉండిపోయినాడు

దేశభక్తుడు కాళోజీ శత వసంతాలు జీవించి ఈనాడు దేశ వ్యాప్తంగా పాదుకుపోయిన అవినీతిని ఎదుర్కొని తన కలాన్ని మళ్ళీ మళ్ళీ సాగించి చిర కీర్తి సంపాదింపవలెనని భగవంతుని ప్రార్థించుతూ కాళోజీకి మా హృదయపూర్వకమైన అభినందనలు వెల్లడిస్తున్నాను

> బూజుపట్టిన రాజ్యభారం - మోయజాలక జానపదులు
> రోజుచుండే దేశమేలెడు - రాజు రోజులు నిండినట్లే
>
> -కాళోజీ

☆ ☆ ☆

# కథకుడుగా కాళోజీ

- నెల్లూరి కేశవస్వామి

ఆధునిక తెలుగు సాహిత్యంలో కేవలం ఒకే ఒక్క నవల రాసి అగ్రశ్రేణి నవలా రచయితల్లో స్థానం సంపాదించుకున్న రచయితలు ఇద్దరు డాక్టర్ శ్రీదేవి (కాలాతీత వ్యక్తులు) బుచ్చిబాబు (చివరకు మిగిలేది) ఇద్దరూ ఇప్పుడూ లేరు వంద లాది కథానికలు రాసినా అగ్రశ్రేణి కథకులుగా నిలవటానికి ఆ ఒక్క కథే చాలు' నన్నట్లుగా రాసిన కథకులు ఇద్దరు చలం (ఒక పూవు పూసింది), గోపీచంద్ (వరే కానివ్వండి) వీరిలో ఒకరు ఆంధ్ర దేశాన్నే శాశ్వతంగా త్యజించి ఆశ్రమ నివాసం అవలంబిస్తే మరొకరు భౌతిక కాయాన్నే త్యజించి వెళ్ళి పోయారు బహుకొద్ది కథానికలు రాసినా వాటిలోనే ఒక మంచి మరపునకు రాని రచనను సృష్టించిన రచయితలు ఇద్దరు అందుగుల తిరుమలరావు ('నిష్ఫలం ) కాళోజీ నారాయణరావు ( లంకా పునరుద్ధరణ ) వీరిలో తిరుమలరావు ఈతిబాధలతో సతమతమవుతూ ఉద్యోగపు సాలెగూడులో చిక్కుకుని ఏనాడో సాహితీ రంగాన్నుంచి నిష్క్రమించాడు, అసలు ఆ పేరుగల రచయిత అంటూ ఒకడు ఉండే వాడని కూడా ఎవరికీ తెలిసిఉండదు ఇకపోతే, మిగిలింది కాళోజీ కాళోజీ పేరు విననివారు అరుదు కానీ కథకుడుగా మాత్రం కాదు కేవలం కవిగానే అందరూ ఎరుగుదురు పాతిక సంవత్సరాలకు పైగా వరదలు వరదలుగా ప్రవహిస్తోన్న కాళోజీ కవితా స్రవంతిని చవిచూడని సాహిత్యాభిమానులు లేరనటం అతిశయోక్తికాదు

మరి అలాంటి ప్రఖ్యాత కవిని నేడు నేను కథ కుడుగా పాఠకలోకానికి పరిచయం చేయ్యటం సాహసమే ననిపించినా రాస్తున్నాను కాళోజీ గనక 'కవిత' ను కాక 'కథానికా ప్రక్రియను చేబట్టివుంటే ఈనాడు ఉత్తమ కథకుల శ్రేణిలో నిలిచి వుండే వాడనటంలో సందేహం లేదు వాటి బీజాలు అతను వ్రాసిన బహుకొద్ది కథానికల్లో ముఖ్యంగా రాజకీయరంగంలో జరిగే అవకతవకలవల్ల అన్యాయాల వల్ల ప్రజానీకం పడే బాధలను చూస్తూ సహించలేక కలం ఝుండా నెత్తి వాటిపైనా యుద్ధం ప్రకటిస్తూ ప్రజానీకాన్ని మేలుకొలిపి ఉత్తేజపరిచి, యుద్ధ సన్నద్ధుల్ని చేయబూనే కాళోజీకి కవితా ప్రక్రియకంటే మంచి సాధనం మరొకటిలేదు అందుకే ప్రతి ప్రజోద్యమంలోనూ ముందజవేస్తూ ప్రజాకవి'గా రాణిస్తూ వచ్చాడు

తమ మనసులోవున్న భావాలన్నీ, తాము నమ్మిన సూత్రాలనీ స్పష్టంగా ధైర్యంగా నిర్మొహమాటంగా పైకి వెలుబుచ్చటమేగాక వాటిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించిన తెలుగు రచయితలు ఇద్దరే ఇద్దరు కనిపిస్తారు ఒకడు చలం రెండో వాడు కాళోజీ చలం తెలుగువాళ్ళ సమాజంలో ముసుగుతన్ని పడుకున్న కుళ్ళునంతా కడగజూశాడు సమాజంలోని పెద్దమనుషులకి కోపంవచ్చి చలాన్ని వెలివేసి ముప్పుతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించారు ఎన్నో ఏళ్ళు ఎదురీత ఈది అఖరికి సమాజం కోప తాపాల ధాటికి తట్టుకోలేక హతాశుడై దేశాన్నుంచే పారిపోయాడు కాళోజీది రాజకీయ రంగం రాజు తలుచుకొంటే దెబ్బలకు కొదవ వుండదు రాజులు మారినా రాజకీయ కుతంత్రాలు మారలేదు వాటిని ఎదిరించిన కాళోజీకి దెబ్బలు తప్పలేదు జైళ్ళు తప్పలేదు అయినా తొణకలేదు, బెణకలేదు ఎలుగెత్తి తన కంఠశోషను 'నా గొడవ రూపంతో వెలిబుచ్చుతూనే వున్నాడు దీనికి మంచి తార్కాణం 1969 లో తెలంగాణ మంతా ప్రజ్వరిల్లిన ప్రత్యేక తెలంగాణోద్యమం తెలంగాణాలో పేరు ప్రఖ్యాతలుగాంచిన మహా మహా రచయితలు, మహా మహా నాయకులు కేవలం ధన దాహానికీ స్వార్థానికీ, భానిసత్వానికీ లోబడిపోయి తమ మనసులోని భావాల్ని కప్పిపుచ్చి పైకి 'నాది వీరతెలంగాణం, వేరు తెలంగాణంకాదు అంటూ అర్థదారులు తొక్కుతున్న

రోజులలో ఢంకామీద దెబ్బవేసి 'వేరు తెలంగాణా గీతాలు ఎలుగెత్తి పాడిన ఏకైక తెలంగాణా మహాకవి కాళోజీ ఆ తార్వాత ప్రత్యేక ఆంధ్రోద్యం ముమ్మరంగా సాగుతున్నపుడు మరి కొందరు రచయితలు కూడా తాళంవేశారు కాని మొదట్నించీ నిర్భయంగా నిలబడ్డ ప్రముఖ రచయిత కాళోజీ ఒక్కడే

పాతిక సంవత్సరాల క్రితం అలాంటి సందర్భమే వచ్చినపుడు వ్రాసిన కథానిక లంకా పునరుద్ధరణ అంతకు పూర్వమే కాళోజీని కథకుడుగా రంగంపైకి తెచ్చింది అనాటి అణా గ్రంధమాల కాళోజీ కథలను ఈ గ్రంధమాల కాళోజీ కథలు అనే పేరుతో ప్రకటించింది అది ఇప్పుడు అలభ్యం కాళోజీ దగ్గరకూడా దాని ప్రతి వుందోలేదో అనుమానమే నాకు జ్ఞాపకమున్నంతమట్టుకు అందులో అయిదారు కథలకంటే ఎక్కువవుండవు కథా కమామీషు మీద బేరీజువేసి సమీక్షిస్తే భాషలోగానీ శైలిలోగానీ శిల్పంలోగానీ అవేవీ అధునిక కథలుగా నిలవక పోవచ్చు కానీ అవేవీ కేవలం ఉబుసుపోకకు రాసినవి మాత్రంకావు సంఘంలోనూ, రాజకీయ రంగంలోనూ జరిగే అవక తవకల మీద కాళోజీ తన సహజ హాస్య, వ్యంగ్య ధోరణిలో తగిలించే చెణుకు దెబ్బలే అన్నీనీ ముఖ్యంగా చెప్పుకోదగ్గ కథానిక 'ఫేసుపౌడర్' కొత్తఫాషన్ల మీద మోజుపడ్డ వారికి గుణపాఠంగా సత్యభామా పార్వతీ పాత్రలనుపయోగించుకొని రాసిన వ్యంగ్యరచన అందులో హాస్యమూ విషాదమూ సున్నితంగా మిలితమై వున్నాయి

ఆ తర్వాత కాళోజీ రాసిన ప్రఖ్యాత కథానిక లంక పునరుద్ధరణ లో కూడా పౌరాణిక పాత్రలనీ పౌరాణిక సంఘటనలనీ వాడుకోనటం ఒక విశేషం అందులోని కథా సారాంశం ఇది

రామావావణ యుద్ధంలో రావణాసురుణ్ణీ అతని అనుచరుల నందరినీ హతమార్చిన తర్వాత రాముడు అయెధ్యకు తిరిగి వెళ్ళేయుందు లంకాపురికి విభీషణుణ్ణి రాజుగా పట్టం కట్టించాలనుకున్నాడు కానీ అతని వాతవరులు లంక లో పుట్టిన వాళ్ళంతా రాక్షసుతేననీ, వారికి తమ్ముతాము పాలిచంచుకొనే అర్హత లేక పోవచ్చుననీ వారికి ఆ అర్హత కలిగే వరకు రాముని అనుచరుల్లో ఎవరన్నా లంకను పాలిస్తూ వాళ్ళకు రాజకీయ విధానాలు నేర్పితే బావుంటుందనీ సలహా ఇచ్చారు రామునికి అది సమంజసంగానే తోచింది హనుమంతుణ్ని పిలిపించి అడిగితే అది తనకు చాతకాదనీ రామపాద సేవే తనకు పరమావధి అని తప్పుకున్నాడు సుగ్రీవుణ్ణి అడిగితే తాను కిష్కింధాపురి పాలన చెయ్యాల్సి వుందనీ అయితే తన మేనమామ ఈ రాజకీయాల్లో ఆరితేరిన ఘనుడనీ ఆయన్ను ఆయన అనుచరుల్ని ఎంపిస్తానని చెప్పాడు రాముడు సరేనన్నాడు వెంటనే సుగ్రీవుని మేనమామ ఆయన వానర బలగం లంకలో దిగారు రాముడు అయెధ్యకు తరలి వెళ్ళిపోయాడు తనతో పాటు విభీషణుణ్ణికూడా అయెధ్యకు తీసకెళ్ళాడు ఇన్నాళ్ళు అడవుల్లో చెట్లమీదా గుట్టలమీదా గడిపిన వానర బలగానికి లంకాపట్టణంలోని సిరిసంపద లనీ భోగభాగ్యాలనీ చూడగానే కళ్ళుజిగేలు మన్నాయి కొద్ది రోజుల్లోనే వాటికి దాసులైపోయారు అన్ని దురలవాట్లూ అలవడ్డాయి రాజ్యపరిపాలన పేరిట లంకాపురంతా కొల్లగిట్టటం మొదలెట్టారు వాటి వార్తలు మెల్లమెల్లగా అయెధ్యాలోనున్న విభీషణుని చెవికి సోకాయి వెళ్ళి రామునికి విన్నవించుకొన్నన రాముడు వినలేదు సుగ్రీవుణ్ణి సంజాయిషీ అడిగాడు సుగ్రీవుడు తన మేనమామను విచారించి ఒక రిపోర్టు తయారుచేసి పంపించాడు ఆ వార్తలన్నీ ఉత్త కబుర్లేననీ, అర్భులంటే గిట్టని రాక్షసులు కల్పించిన బూటకాలనీ రాముడు ఆ రిపోర్టును విభీషణునికి చూపించి మందలించాడు విభీషణుడు నోరుమూసి కోక తప్పలేదు ఇటు లంకలో వానరబలగం దుండగాలు హెచ్చవుతూ వచ్చాయి వాటి వార్తలు ఎప్పటికప్పుడు విభీషణునికి అందుతూనే వున్నాయి ఇంక భరించలేక తానే స్వయంగా లంకకు వెళ్ళాడు చూసి వద్దామని తాను విన్నవాటికంటే ఎక్కువగానే దుండగాలు జరుగుతున్నాయని తెలసుకోటానికి అట్టే కాలం పట్టలేదు వెంటనే అయోధ్యకు తిరిగి వెళ్ళాడు రాముని కాళ్ళమీదపడి అంతా విన్నవించుకున్నాడు రాముడు సుగ్రీవుని బలగాన్నంతా వెనకకు రప్పించేసి విభీషణునికి లంకాపురి పట్టాభిషేకం చేయించాడు ఇదీ కథ

అయితే ఇందులో ఏముందనీ? భాషలోనా? శైలిలోనా శిల్పంలోనా ఎందులో ప్రత్యేకత వుందని దాన్ని 'మంచి కథ గా ఎరిగనించాలి అని అడగొచ్చు అవును ఇందులో కొత్తదనం ఏదీ లేదు భాష కాళోజీ ఎప్పుడూ వాడే సుమతీ శతకం భాషే కథా విధానం పాతకాలపు తాతమ్మ చెప్పే పద్ధతే అయితే అందులోని వ్యంగ్యాన్ని చీల్చుకొని గూఢార్థాన్ని గ్రహించగలిగినవారి హృదయాల్లోకి సూటిగా బాణంలాగా దూసుకుపోయే చురుకుదనం వుంది నిజాయితీ వుంది

1948 సెప్టెంబర్ నెలలో భారత ప్రభుత్వం అనాటి హైదరాబాదు రాష్ట్రం మీద 'పోలీస్ చర్య జరిపింది నైజాంను హతమార్చలేదు గాని గద్దె దించింది ఇక్కడి హైదరాబాదు రాష్ట్రప్రజలకు పరిపాలనానుభవము లేదని వారికి స్వయంపరిపాలనా దక్షత కలిగేంతవరకు భారత ప్రభుత్వం తన ప్రతినిధుల ద్వారా పరిపాలన జరిపించాలని నిశ్చయించినది ఆ నిర్ణయానుసారం భారతసైన్యం వెనువెంటనే అనాటి మదరాసు రాష్ట్రంలోని చిల్లరదేవుళ్ళు (ఆఫీసర్లు) అనేకుల్ని హైదరాబాదు రాష్ట్రానికి దిగుమతి చేసింది వాళ్ళు 1950 లో ఇక్కడ రాష్ట్రప్రభుత్వ మేర్పడేవరకు అధికారంలో వున్నారు ఆ రామరాజ్య' పరిపాలనలో జరిగిన అన్యాయాలూ అరాచకాలు వాటిని కళ్ళారా చూసి అనుభవించిన వారికే గాని అర్థం కావు ఆ అనుభవంలోంచి పుట్టిన సాహిత్య శిల్పఖండికే కాళోజీ కథానిక లంకా పునరుద్ధరణ' నూటికి నూరుపాళ్ళు వ్యంగ్యపూరితమైన అలాంటి చక్కని రచన ఎక్కడో నూటికి కోటికి ఒక్కటి కనిపిస్తుంది అది తెలుగు సాహితీ చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తుంది ఈనాడు మంచి కవిగా చలామని అవుతున్న కాళోజీ కూడా ఒకనాటి మంచి కథకుడేనని నిరూపించటానికి ఆ ఒక్క కథే చాలు

నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదకుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్పు కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా! నీ కళ్లు కదలి నన్నాళ్ళే

# కాళోజీ - శాసనసభ్యత్వం

--వి పి రాఘవాచారి

ఆ మధ్యన వరంగలులో ఒక మిత్రుడు కాళోజీ షష్టిపూర్తి ఉత్సవాల సందర్భంలో ఒక ప్రత్యేక సంచిక వెలువరిస్తున్నారనీ దాని కొక వ్యాసం వ్రాయమని నన్నుకోరారు అప్పట్లో వ్రాయలేదు కారణం కాళోజీని గురించి వ్రాయడానికి నేను కాస్త జంకినాను ఏమి వ్రాయాలని ఆలోచిస్తూ ఉండగానే వారు పెట్టిన గడవు దాటి పోయింది

ఇప్పుడు మిత్రుడు శ్రీ యం యల్ హైదరాబాదులో కాళోజీ షష్టిపూర్తి జరుపుతున్నామనీ ఒక ప్రత్యేక సంచిక వెలువరిస్తున్నామనీ దానికి ఒక వ్యాసం వ్రాయవలసిందనీ నన్ను కోరారు వ్రాస్తానని చెప్పాను కాని మళ్ళీ జంకే ఆలోచనలోనే మొదట నిర్ణయించిన తేదీ గడచిపోయింది తేదీ పొడగించమనిచెప్పి వ్యాసం తప్పక వ్రాయవలసిందనీ యం యల్ మళ్ళీ కోరాడు ఇక వ్రాయక తప్పదని వ్రాస్తున్నాను

అంటే కాళోజీని గురించి వ్రాయడానికి యిష్టం లేక కాదు ఆయన యెడ నే నొకప్పుడు తప్పుచేసానేమోననే పరివేదన నాటికీ నేటికీ నా కున్నది నేను చేసింది చేయజాలకపోయింది బుద్ధిపూర్వకంకాకపోయినా చేయగలిగే ధైర్యం లేకపోయిందనే బాధ కాళోజీని గురించి వ్రాయడానికొక నైతిక స్థాయి ఉండాలనీ అషామాషీగా వ్రాయకూడదనీ నా అభిప్రాయం నాకానైతిక స్థాయి కొరవడిందని సంకోచం

నేను వ్రామబోయేది కాళోజీ జీవితంలోని చాలా మందికి తెలియని ఒక ఘట్టం ఆయన రెండే రెండేళ్ళు శాసన సభ్యుడుగా ఉన్న ఉదంతం

1958 లో ఆంధ్రప్రదేశ్ లో విధానపరిషత్తు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పడి మొదటి ఎన్నికలు జరిగాయి విధాన పరిషత్తులో ఉపాధ్యాయుల నియోజక వర్గాలు ఎనిమిది వాటిలో తెలంగాణాకు రెండు కేటాయింపబడినవి మొదట అది ద్విసభ్య నియోజక వర్గంగా ఉండింది ఈ నాటి రాష్ట్ర ఉపాధ్యా సంఘ మానాడు ప్రభుత్వోపాధ్యా సంఘం దాని పూర్వ నామం హైదరాబాదు రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం గా వ్యవహరించ బడుతూ ఉండేది నేనా రోజులలో ఆ సంఘానికధ్యక్షుణ్ణి

విధాన పరిషత్తు ఎన్నికలలో ఉపాధ్యాయ సంఘం అధికారి పూర్వకంగా కలుగజేసుకోవాలా వద్దా అనే సమస్య మా యెదుట వచ్చింది కలుగజేసుకోవాలనే సంఘం నిర్ణయించింది ఒక సీటుకు అధికార అభ్యర్థిని నిలువబెట్టాలనీ మరొక సీటుకు పోటీచేసే వారిలో మంచివారిని చూచి సమర్థించాలనీ సంఘం నిర్ణయం రెండు సీట్లు గెలుచుకొనే బలం సంఘానికున్నా మొదటిసారి ఎన్నికలలో ప్రవేశించేటప్పుడు జాగ్రత్తగా ఉండడం మంచిదని ఒకరినే అధికార అభ్యర్థిగా ప్రకటించాలని సంఘ నిర్ణయం

అధికార అభ్యర్థిగా పోటీచేయమని సంఘం లోని కొందరు సహచరులు నన్ను కోరారు శాసనసభారంగంలో నా కాసక్తి లేకపోవటంవల్ల నేనంగీకరించలేదు ప్రభుత్వోద్యోగిగా ఉన్న ఒక ఉపాధ్యా యువకుడు సంఘం పక్షాన పోటీ చేస్తానని ముందుకు వచ్చాడు మొదటి అనుభవం కావడంవల్లనూ, సంఘ సభ్యులైన ఉపాధ్యాయులందరూ అప్పుడూ ప్రభుత్వోద్యోగులు కనుక ఉద్యోగానికి రాజీనామా యిచ్చి పోటీ చేయడానికి సంసిద్ధులు కానందువల్లనూ ముందుకు వచ్చిన "ఆగంతకు" డే మనవాడనుకొని అతనిని అధికార అభ్యర్థిగా నిర్ణయించాము

ఈలోగా వరంగలులోని సంఘకార్యకర్తలైన కొందరు మిత్రులు కాళోజీని రెండవ అభ్యర్థిగా నిర్ణయించాలని సూచించారు ఆయన పేరు వినగానే నా కెంతో సంతోషం

కలిగింది ఆయన ఎన్నికలలో పోటీ చేస్తాడా అని నాకు సందేహం కలిగింది కనుక్కొమ్మని మిత్రులకు చెప్పాను వారు మాట్లాడివచ్చారు నిలువ బెట్టేది ప్రచారం చేసేది, గెలిపించుకొనేది అంతా మన బాధ్యతనే మిత్రులు చెప్పారు సంఘంలోని ముఖ్యులైన సహచరులతో సమాలోచించాను ఒకే అభ్యర్థిని నిలువబెట్టాలనే మొదటి నిర్ణయానికే కట్టుబడి ఉండాలనీ ఒక అభ్యర్థికి ఈవరకే మాట యిచ్చాము కాబట్టి, దానికి బద్ధులమై ఉండాలనీ వారభిప్రాయపడినారు సంఘగౌరవం దృష్ట్యా నా కది సబబే అనిపించింది అయితే ఆయనను గెలిపించడం ఎలాగని వారితో మళ్ళీ ఆలోచించాను సంఘం నిర్ణయించిన అధికార అభ్యర్థి మొదటి లెక్కింపులోనే గెలుపొందేటట్లు వోటర్లను అతనికి కేటాయించి మిగతా వోటర్లు కాళోజికి మొదటి వోటు ఇచ్చేటట్లు అంతరంగికంగా కార్యకర్తలకు చెప్పి ఏర్పాటు చేయాలనుకొన్నాము కానీ బహిరంగంగా కాళోజీని గురించి ప్రాచారం చేయడం గాని విజ్ఞప్తులు వెలువరించడంగాని కూడదనుకొన్నాము

కాళోజీనే అధికార అభ్యర్థిగా నిర్ణయించక పోవడానికి మరొక కారణం అతడుపాధ్యాయుడు కాదనీ కనీసం గ్రాజుయేటైనా కాదనీ కొందరు సహచరులు అభ్యంతరాలు చెప్పారు మన రాజ్యాంగం ప్రకారం వోటుచేసేవారే ఉపాధ్యాయులై ఉండాలని విధింపబడింది కాని అభ్యర్థికి అలాంటి నియమంలేదు 30 సంవత్సరాలు అంతకు పై బడ్డ వయస్సు కలవాడెవ్వడైనా సాధారణ ఎన్నికల వోటర్ల పట్టికలో పేరు నమోదైఉండే ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి పోటీ చేయవచ్చు పట్టభద్రుల నియోజకవర్గంలోకూడా యిలాంటి నిబంధనేఉంది వోటర్లు మాత్రం పట్టభద్రులై ఉండాలి పోటీచేసే అభ్యర్థులా నియోజకవర్గంలో వోటర్లు కానక్కర్లేదు పట్టభద్రులు కానక్కర్లేదు

భారత రాజ్యాంగంలో ఇలాంటి ఏర్పాటుకు ప్రత్యేక కారణముంది అధికాంశం పరోక్ష ఎన్నికల ద్వారా ఏర్పడే రాష్ట్రవిధాన ఎరిషత్తులలో ప్రత్యక్ష ఎన్నికలద్వారా పరిమితమైన వోటర్ల సముదాయముచే సభ్యులయ్యేవారు ఉపాధ్యాయుల ప్రతినిధులు పట్టభద్రుల ప్రతినిధులు ఉపాధ్యాయులకు వృత్తిపరులుగాకాదు ప్రాతినిధ్య మిచ్చింది మేధావులుగా విశాల సమాజంనుండి యోగ్యులైన వారిని ఎన్నుకొనే అవకాశం వారికుండాలనే ఉద్దేశ్యంతోనే అభ్యర్థులు ఆ నియోజక వర్గంలో వోటర్లు కానక్కరలేదనీ ఉపాధ్యాయ వృత్తిలోకూడా ఉండవలసిన అవసరం లేదనీ విధింపబడింది

అయితే విధాన పరిషత్తులుగల అన్ని రాష్ట్రాలలోను ఉపాధ్యాయ నియోజకవర్గాల నుండి సర్వసాధారణంగా ఉపాధ్యాయులే, ఉపాధ్యాయుల ఉద్యమంతో ఇంతో అంతో సంబంధం కలవారే, ఎన్నికోబడడం పరిపాటి అయిపోయింది రాజ్యాంగంలో ఇచ్చిన విస్తృత సౌకర్యాన్ని ఉపాధ్యాయులు అంగీకరించలేదు తమ సమస్యలు బాగా తెలిసిఉండి వాటి పరిష్కారానికై కృషి చేసేవాడే తమ ప్రతినిధి కావాలని ఉపాధ్యాయుల అకాంక్ష అంటే ఉపాధ్యాయులకు విధాన పరిషత్తులో ఇచ్చిన ప్రాతినిధ్యం వృత్తి ప్రాతినిధ్యంగానే పరిణమించింది ఇది వాస్తవిక పరిస్థితి

రాజ్యాంగ చట్టం సూత్రాల ఆధారంగా కాళోజీని అధికార అభ్యర్థిగా అంగీకరింప చేయాలని నేను చేసిన ప్రయత్నం ఫలించలేదు సంఘానికి మరొకరు అధికార అభ్యర్థి అయినాడు కాళోజీ "అనధికార అభ్యర్థి" అయినాడు ఆయన యెడ సంఘనాయకులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని నాకు మన్నించక తప్పలేదు "ప్రజాస్వామ్యం" కదా!

నాతోపాటు కాళోజీయెడ గౌరవాదరాలు గల కార్యకర్తలు మాత్రం సంఘంలో చాలా మంది ఉన్నారు అది నాకు కొంత ఉపశమనం కలిగించింది కాళోజీనికూడా గెలిపించుకోగల మనే ధైర్యంకూడా కలిగింది ఎన్నికల ప్రచారం ప్రారంభమైంది 11 గురు అభ్యర్థులు పోటీ చేసారు ఈ ఎన్నికలు proportional representation by means of the single transferrable vote పద్ధతిపై జరుగుతాయి మొదటి లెక్కింపులోనే ఎన్నిక కావడానికి అవసరమైన వోట్లకన్న యింకా ఎక్కువ వోట్లు వచ్చేటట్లుగా అధిక ప్రాంతాలలోని వోటర్లను మా "అధికార అభ్యర్థి" కి కేటాయించి మిగిలిన

ప్రాంతాలలోని వోటర్లు కాళోజీకి మొదటి వోటు వేసేటట్లు అంతరంగికంగా కార్యకర్తలద్వారా వర్తమానం పంపాను కాళోజీ వ్యక్తిత్వం ఆయన కున్న పలుకుబడిమా యీ వోట్లు తోడై ఆయన గెలుస్తాడని నా విశ్వాసం

ఎన్నికల ప్రచారం ముమ్మరమైనట్లల్లా అధికార అభ్యర్థిపైన ప్రత్యర్థులదాడి ఎక్కువైనట్లల్లా ఆయనకు మరికొన్ని ప్రాంతాలు కేటాయించాలనే ఒత్తిడి తేవడానికి కారణ భూతుడైనాడు ఎన్నికలు గదా! ఎవరి అందోళన వారిది నాకు మాత్రం అనుకొన్న ప్రకారం జరుగుతుందనే నమ్మిక ఉన్నా సంఘమనే సరికి పలువిధములైన అభిప్రాయాలు కలవాళ్ళుంటారు వారి నందరిని కూడగట్టుకొని పోవలసి ఉంటుంది ఈ పరిస్థితులలో చివరి దశలో కాళోజీకి కేటాయించిన వోటర్లలో ఒక 50 మందిని సంఘ అధికార అభ్యర్థికి మొదటి వోటు వేయవలసిందిగా కోరవలసి వచ్చింది ఈ మార్పు కాళోజీకి బాధ కలిగించిందని మిత్రులు చెప్పారు నాకూ బాధగానే ఉండింది అయినా నిస్సహాయుడనయ్యాను

అ ఎన్నికలలో నేనెప్పుడూ కాళోజీని కలుసుకోలేదు అన్ని ఏర్పాట్లు మధ్యవర్తులైన మిత్రుల ద్వారావే జరిగాయి

పోలింగ్ ముగిసింది ఓట్ల లెక్కింపు హైదరాబాదులో కలెక్టరు కార్యాలయంలో ఏర్పాటైంది ఉపాధ్యా సంఘ అధికార అభ్యర్థి ' మొదటి లెక్కింపులో గెలుపొందాడు కావలసిన ఓట్లకంటే 11 మాత్రమే ఆయన కెక్కువ వచ్చాయి కాలోజీ రెండవ స్థానంలో ఉన్నాడు మిగతా తొమ్మండుగురు లెక్కింపులో ఒకరి తర్వాత ఒకరు వీగిపోగా వారందరికన్నా ఎక్కువ ఓట్లుగల కాళోజీ రావలసిన కోటా ' రాకపోయినా ఎన్నుకోబడినట్లు ప్రకటింపబడినాడు ఎన్నికల ఫలితం ప్రకటింపబడగానే కాళోజీ లేచి రుసరుసలాడుతూ "కాళోజీకి షక్సియత్ కాం కియా న యూనియన్ కా మ్యాండేట్ కాం కియా (కాళోజీ వ్యక్తిత్వం పనికిరాలేదు (ఉపాధ్యాయ) యూనియన్ ఆదేశం పనికిరాలేదు) ' అనుకొంటూ ఎవ్వరితోనూ మాట్లాడకుండా వెళ్లిపోయాడు నేనక్కడే ఉన్నాను ఇద్దరూ గెలుస్తారనే నమ్మకం ఉండేది కనుక కార్యకర్తలు కొందరు పూలమాలలో ఉభయులను సత్కరించడానికి కెలక్టరు కార్యాలయ అవరణలో గుమిగూడి ఉన్నారు

నాతో గాని మరెవ్వరితోగాని మాట్లాడకుండా సంఘానికి కతజ్ఞత లైనా తెలుపకుండా కాళోజీ అలా వెళ్ళిపోవడం చూసి సంఘ కార్యకర్తలు ఆయన స్వభావం తెలియని వారు కనుక కోపగించుకున్నారు ఎన్నికైన మొదటి రోజే ఈయన ఇలా ప్రవర్తించాడే ఇక రేపాయన మాకేం చేస్తాడనం ఆయన వాదన కాళోజీని వారెవరుగరు హిపాక్రసీ అంటే అతని పరమ ద్వేషమని యెరుగరు ఆయన ప్రకృతి ఎంత సున్నితమైందో ఎరుగరు ఒకరిని సంతృప్తి పరచడానికి తెచ్చి కోలు సంతోషంతో మాట్లాడడం అసలెరుగడు నే నెరిగిన వాణ్ణి కనుక నాకేమీ అనిపించలేదు కోటా'కు కావలసిన ఓట్లు వచ్చి గెలువలేదని అందరూ వీగిపోగా మిగిలిన వాడుగా గెలిచానని ఆయన హృదయం గాయపడింది ఆయన వ్యక్తిత్వానికి విఘాతం కలిగినట్లయింది ఎన్నికల పక్షులైతే ఎలా అయితేనేం గెలిచాం కదా అని సంబరపడతారు కాళోజీ అంత చవకగా సంబరపడే వాడు కాదు సంఘం ద్వారా తనకు వస్తాయని చెప్పబడ్డ ఓట్లు రాలేదు సంఘ ఆదేశమేమైనట్లు అని ఆయన ప్రశ్నించడంలో నాకేమీ వైపరీత్యం కనుపడలేదు అయితే ఈ ఉదంతం తర్వాత అయన రెండవసారి శాసనసభ్యుడు కాకపోవడానికి కొంత కారణభూతమైంది అప్పుడు తనకు తోచిన మాటలను నిక్కచ్చిగా చెప్పడంలో వాటి ప్రభావం తన భావి జీవితంపై ఎలా ఉంటుందని కాళోజీ ఆలోచించడు నిజాయితీపరుడు ఖండితవాది అయిన వాడెవడూ అలోచించడు

రెండేళ్లు విధాన పరిషత్తు సభ్యుడుగా కాళోజీ ఏ పార్టీకి చెందన స్వతంత్ర సభ్యుడై ప్రతిపక్షానికి విధాన పరిషత్తుకు వన్నె తెచ్చాడు అక్కడ కూడా తన వ్యక్తిత్వపు ముద్రవేసాడు

కాళోజీకి పార్టీలంటే గిట్టవు 'రాజకీయ పార్టీలు మీరు కొంతమంది పంచుకున్న తర్వాత ఏ పార్టీకి చెందని ప్రజానీకం వుంది ఆ ప్రజానీకం యొక్క భావాలు ఏమిటో ప్రజానీకంలో అసంతృప్తి పేరుకొన్న తర్వాత మన దేశం యొక్క గతి యేమిటో ' అని కౌన్సిల్‌లో ఒకసారి (12 8 1958) "కులభావం, మదభావం వర్గ భావం,

ఇవికాక మరొకటి వున్నది ఇప్పుడు కొత్త రోగం మనకు ఆవరించింది అది పార్టీ అనేది ఇపుడు ఈ రోగం నుండి మనం బాధపడుతున్నాం దీనితో ఉన్నప్పుడు ప్రభుత్వానికి ప్రజల క్షేమాన్ని గురించి ఆలోచించడానికి సమయమేది? అని మరొకసారి (27 6 1960) ఆయన అన్న మాటలు

అన్యాయమంటే అమితంగా అసహ్యించుకొనే కాళోజీ 27 06 1960 నాడు కౌన్సిల్‌లో మాట్లాడుతూ మహా భారతంలో భీష్ముడు ధర్మ రాజుకుపదేశించిన రాజనీతిని ఉదహరిస్తూ 'నీ రాజ్యంలో ఒకడు అన్యాయానికి గురయ్యె అసహాయ స్థితిలో పడి 'అయ్యో అనవసరంగా నా కన్యాయం జరిగిందే ఈ అన్యాయం నుండి నన్ను రక్షించేవాడు లేడు అని కన్నీరు కారిస్తే ఆ కన్నీరు నుంచి పుట్టిన అగ్నిలో ఎటువంటి పటిష్టమైన రాజ్యం కూడా భస్మమైపోతుంది ఈ మాటలను జ్ఞాపకం పెట్టుకోవాలని ప్రభుత్వాన్ని హెచ్చించారు ఇది కౌన్సిల్‌లో ఆయన చివరి ఉపన్యాసంలోని మాటలని నాకు జ్ఞాపకం

జులై 1959లో కౌన్సిల్‌లో ప్రభుత్వోద్యోగుల ఉపాధ్యాయుల జీతభత్యాల సమస్య చర్చకు వచ్చింది ఫిబ్రవరి 1959లో వీరంతా ఒక రోజు సమ్మె (క్విట్ వర్కు) చేయ నిర్ణయించడం ప్రారంభమైన కాసేపటికి విరమింపబడడం జరిగింది రాష్ట్ర ప్రభుత్వం మాట తప్పిందని ఉద్యోగులారోపించారు ప్రభుత్వం పక్షాన ఉద్యోగులలో 'డిసిప్లిన్" పోతే ఎలా సహించాలని వాదించడం ఒరిగింది ఆ సందర్భాన్ని పురస్కరించుకొని కౌన్సిల్‌లో కాళోజీ అన్న మాటలు 'డాక్టర్ టింగ్యూ టాంగ్ " The president will refuse to rule, the senators will refuse to debate, the dancers will refuse to dance, the dancers will refuse to fight when they are hungry" అన్నారు ఆహార సమస్య, ధరల సమస్య ఇట్లా ఉండగా మన ప్రభుత్వం డిసిప్లిన్,డిసిప్లిన్ అని చెబుతోంది ఈ డిసిప్లిన్ ఎక్కడి నుండి వస్తుంది?'

మార్చి 1960లో బడ్జెట్ సమావేశంలో ప్రయిమరి హెల్త్ సెంటర్ల సమస్య వచ్చింది మంత్రి గారు కొన్ని సెంటర్ల భవనాలు పూర్తి అయినవి మరికొన్ని కాలేదని చెప్పారట భవనాలున్న చోట డాక్టరులున్నారా అంటె వేశారు కాని వారు చేరలేదు అని సమాధానమిచ్చారట ఎవరో ఒక సభ్యులు ఫలానా బిల్డింగు ఎందుకు సిద్ధం కాలేదు అని ప్రశ్నించారట ఈ చర్యను ఉదహరిస్తూ కాళోజీ ఒక విందు చేద్దామనుకొని విస్తళ్ళు లేవు కనుక భోజనం పెట్టకుండా ఉండడ మెట్లా ఉంటుందో అట్లా ఉన్నది ప్రభుత్వం యొక్క పద్ధతి అని చమత్కరించాడు ఆయన కౌన్సిల్‌లో గావించిన ప్రసంగాలలో ప్రశ్నలలో ఛలోక్తులలో ఎన్నో విలువైన భావాలు వాక్యాలు ఉన్నవి మచ్చునకు ఈ కొన్ని ఏరి చూపాను

విధానపరిషత్తు సభ్యుని కాలపరిమితి 6 సంవత్సరాలు ప్రతి సంవత్సరానికి మూడవవంతు సభ్యులు రిటైరు కావాలి అలా రిటైరు కావడానికి సౌకర్యంగా ఉండడానికి కౌన్సిలు ఏర్పడిన వెంటనే 2 4 6 సంవత్సరాలకు వరుసగా రిటైరు కావలసిన సభ్యుల పేర్లను, వారి స్థానాలను 'లాట్' ద్వారా నిర్ణయిస్తారు 1958లో ఆంధ్రప్రదేశ్‌లో అలాగే జరిగింది లాట్స్‌లో తెలంగాణా ఉపాధ్యాయుల ప్రతినిధుల, పట్టభద్రుల ప్రతినిధుల కాలపరిమితి రెండు సంవత్సరాలుగా నిర్ణయింపబడింది కనుక కాళోజీ సభ్యత్వ కాలం రెండేళ్లయింది

రెండేళ్ళ తర్వాత 1960లో ద్వైవార్షిక ఎన్నికలు తెలంగాణా ఉపాధ్యాయుల నియోజకవర్గంలో జరుగవలసి వచ్చింది మొదట ఎన్నుకొన్న అధికార అభ్యర్థి వలన కలిగిన అనుభవాన్ని పురస్కరించుకొని నన్ను పోటీ చేయవలసిందిగా ఉపాధ్యాయ సంఘ మాదేశించింది పూర్వ అధికార అభ్యర్థి సమస్య పరిష్కారమై పోయింది ఇక రెండవ స్థానానికి యెవరా అనే ప్రశ్న వచ్చింది కాళోజీని కొనసాగించి, ఈ సారి రెండవ అధికార అభ్యర్థిగా ప్రకటించాలని నా కోరిక సంఘ కార్యకర్తలలో చాలా మంది దానికి సుముఖంగా లేరు ఆ విషయం నేనెరుగుదును (రెండవ స్థానం విషయంలో) కొంత బేరసారాలు జరుగుతూ వున్నవి ఆ వివరాలలోకి నేను పోదలచుకోలేదు కాని కాళోజీని మాత్రం కొనసాగించజాలమని సంఘం పెద్దలు నిర్ణయించారు

అందులో నేను కూడా చేరి వున్నాను ఈ విషయంలో నేను పట్టుదల వహించే స్థితిలో లేను నేనప్పుడధ్యక్షుణ్ణి కాదు నాకున్న బలుకుబడి నాకున్నా ఈ విషయంలో ప్రముఖ నాయకులను ఒప్పించే పరిస్థితులు లేవు నేను పై జెప్పిన బేరసారాలు విఫలములై చివరకు రెండవ అభ్యర్థిని నిర్ణయించవలసి వచ్చింది అప్పుడు కూడా కాళోజీ ప్రసక్తి రానీయలేదు ఎన్నికల ఫలితం ప్రకటింపబడిన మొదటి రోజునాటి సంఘటన కూడా ఆయననను తప్పించడానికి దోహదం చేసింది నేనూ కాళోజీ ఒకే కులానికి చెందిన వాళ్లం కావడం మరొక కారణమైంది సంఘంలో ఇవన్నీ గణింపదగిన విషయాలవుతాయి రాజకీయాలలో మరీ యెక్కువగదా! కాళోజీ ఏ కులానికి చెందిన వాడు కాదు మానవతయే ఆయన కులం, మతం కాని ముఖ్యంగా రాజకీయ రంగంలో దానికి సంబంధపడిన రంగాలలో కూడా కుల, మత విషయాలకు ప్రాధాన్యత లభిస్తుంది ఇది ఈ నాటి మన కుల మత వర్ణ వర్గ విబేద రహిత సమాజ స్థితి

ఉపాధ్యాయ సంఘం తరపున రెండవ స్థానానికి కూడా అధికార అభ్యర్థిని నిర్ణయించారు కాళోజీ పోటీ చేస్తానని పట్టుబట్టారు నామినేషన్ వేశారు ఉపసంహరించుకోవలసిందని కొందరు మిత్రులాయనకు సలహా యిచ్చారు ఆయన వినలేదు నన్ను వెళ్లి ఆయనను ఒప్పించమని సంఘ నాయకులు కోరారు నేను వెళ్లనన్నాను వెళ్ళమని బలవంతం చేశారు వెళ్ళాను నేను వచ్చిన పని ఆయనకు చెప్పాను ఎందుకు ఉపసంహరించుకోవాలని ప్రశ్నించారు నేను ఓడిపోతాననేగదా! ఓడిపోతే ఓడిపోతాను ఇంతేకదా! కులాల ప్రాతిపదికపైన మీరు అభ్యర్థులను నిర్ణయిస్తారా? నేను ఫలానా కులానికి చెందినవాణ్ణి అనే కదా నన్ను మీరు అభ్యర్థిగా పెట్టలేదు అని నిలదీసి అడిగారు నచ్చజెప్పజాలనని కూడా నాకు తెలుసు వెళ్ళిన వాణ్ణి వెళ్ళినట్లే తిరిగి వచ్చాను ఓటిచ్చునప్పుడే ఉండాలి బుద్ధి ' అనే ఆయన గేయం ఎలా మరువగలను! పైగా నా హృదయంలో నాకు నేనపరాధినన్నట్లు భావిస్తూనే ఉన్నాను ఇక ఆయనతో వాదన ఏం చేస్తాను!

ఈ రెండేళ్ళ కాలంలో ఆయనకు చెప్పిన ఉపాధ్యాయుల సమస్యలను కౌన్సిల్‌లో ఆయన ప్రతిధ్వనింపచేశారు ఆయన సంఘ కార్యాలయానికి యెప్పుడు రాడనీ సంఘ నాయకులను ఆశ్రయించడని ఇవి రెండు పరస్పర విరుద్ధములైన భావాలు పదాలు ఈ మాట యెవరికి చెప్పాలి ఆశ్రయిస్తేనే తప్ప ఆదరణ లభించని రోజులలో కాళోజీలకు స్థానమేది? ఒక రోజు కౌన్సిలుకు నేను వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు ఆయన బేబీ ఆస్టిన్ లో నన్ను దారిలో దిగబెట్టాడు అది 1960వ సంవత్సరం నేను కారు దిగిపోతుండగా ఏమి ఆచార్లుగారూ! నన్నెవరూ కలువరు మీ సమస్యలను గురించి నాకేమీ చెప్పరూ అని బాధతో అడిగారు ఏదో మాట చెప్పి తప్పించుకొన్నాను అప్పటికే ఆయనను గురించిన తీర్మానం సంఘం పెద్దలు చేసుకొని ఉన్నారు నేనాయన కేంచెప్పను

నామినేషన్ల ఉపసంహరణ తేదీ వచ్చింది మొత్తం నలుగురు నామినేషన్లు వేసారు సంఘం తరపున ఇద్దరం అధికార అభ్యర్థులం కాళోజీ మరొకరు ఆ రోజు సంఘ నాయకులు మిత్రులు బలవంతం చేసి ఆయనచే నామినేషను ఉపసంహరింపచేశారు మరొకాయన కూడా ఉపసంహరించుకొన్నాడు నామినేషను ఉపసంహరించుకొన్న తర్వాత కాళోజీని ఉపాధ్యాయ సంఘ కార్యాలయానికి తీసుకొని వచ్చారు నేనప్పుడక్కడే ఉన్నాను తలయెత్తి ఆయన ముఖం చూడలేకపోయాను ఆయనను బలవంతపెట్టి ఉపసంహరింపచేయడం నా కిష్టంలేదు ఎన్నికలలో నిలువబడి తనకు జరిగిన అపరాధాన్ని ఆయన వెల్లడిజేసి కాలుష్యాన్ని కడిగి ఉంటే నేను సంతోషించేవాణ్ణి ఉదాత్తమైన ఆ జీవాత్మను క్షోభపెట్టి నందుకు నేనిప్పటికీ బాధపడుతున్నాను

కాళోజీ శాసనసభ్యుడుగా లేకుండా పోయాడు పీడితులైన ఉపాధ్యాయుల వేదనా భరితమైన గొంతును ప్రతిధ్వనింపజేయడానికి కాళోజీ కలం గళం లభించకుండా పోయింది అది దురదృష్టకరం

•

# ప్రజా కవి

- దేవులపల్లి రామానుజరావు

కాళోజీ సమకాలికులైన మా వంటివారికి ఆయనకు షష్ఠి పూర్తి అంటే కొంత ఆశ్చర్యం కలుగుతుంది ఎందుకనగా సహాధ్యాయులైన నా వంటి కొందరి దృష్టిలో కాళోజీ ఇంకా యువకుడే బాహ్య స్వరూపము మాట యెట్లున్నప్పటికీ ఆయన అంతరంగం యౌవనోద్రేక భరితం

నాకు కాళోజీతో మొదటి పరిచయం 1930వ సంవత్సరమున అనగా నలభై నాలుగు సంవత్సరాల క్రిందటి మాట అనాడు కాళోజీతో సహవాసము చేసిన వారెవరూ ఆయన తెలుగు కవి కాగలడని అనుకోలేదు కారణం ఆనాటి ఆయన వివిధ వ్యాసం గాలే 1930వ సంవత్సరంలో ఆయన హనుమకొండ హైస్కూలులో ఇంగ్లీషుమీడియం నాలుగవ ఫారంలో ప్రవేశించినపుడు అయనకు తీవ్రమైన సాంఘిక రాజకీయ అభిప్రాయాలు ఉండేవి అంతకు ముందు హైదరాబాదులో చదువుకొని, ఉర్దూ మరాఠీ భాషలలో తగినంత ప్రవేశము సంపాదించి ఆర్య సమాజంలో కొంత కాలం ముఖ్య కార్యకర్తగా పనిచేసిన ఉత్సాహముతో కాళోజీ హనుమకొండ రంగ ప్రవేశం గావించి స్థానికంగా రాజకీయ సాంఘిక ఉద్యమాలతో సంబంధాలు కల్పించుకొని యువనాయకుడుగా రూపొందినాడు అనాటి ఆయన వేష భాషల్లో ఆర్య సమాజ ఆదర్శాలు ప్రతిబింబించేవి విద్యార్థిగా ఉంటూనే ఆయన స్థానికులైన పెద్దలతోనే కాక రాష్ట్ర స్థాయి నాయకులతో కూడా సమానంగా మెలుగుతూ దేశసేవ చేస్తుండేవాడు చిన్న వయసులోనే కాళోజీ అఖిల హైదరాబాదు నాయక స్థాయిని అందుకోగలిగాడు

ఆనాటి ముఖ్యమైన రాజకీయోద్యమం ఆంధ్రోద్యమం తర్వాత ఈ ఆంధ్రోద్యమము కమ్యూనిస్టు కాంగ్రెస్ ఉద్యమాలుగా చీలిపోయినది ఆంధ్రోద్యమ, కాంగ్రెసు ఉద్యమాలతో గాఢ సంబంధం కలిగిన కాళోజీ ఆనాటి జాతీయోద్యమాలన్నిటిలోను పనిచేసినాడు ఆంధ్రోద్యమం ఆయనను తెలుగు సాహిత్యానికి సంస్కృతికి దగ్గరగా తీసుకొని వచ్చింది ఆనాటి జాతీయోద్యమంలో ప్రముఖమైనది గ్రంథాలయోద్యమం గ్రంథాలయ వార్షిక సభలలో పాల్గొనిన తెలుగుకవి పండితుల సహవాసము కళోజీ కవిగా అవతరించడానికి దోహదం చేసింది గాఢమైన దేశాభిమానం భాషాభిమానంతోపాటు ఉత్సాహమూ ఉద్రేకమూ తొణికిసలాడే హృదయం కలిగిన కాళోజీ సహజంగానే ఒక్కమారు కవియైనాడు ఆ కావడం సాధారణమైన కవిగాదు, ప్రజాకవియైనాడు చిన్నప్పటినుండి స్వాతంత్ర్య భావ పూరితుడై వివిధ జాతీయోద్యమాలచే ప్రభావితుడైన కాళోజీడెందమును ఒక్కమారు కదలింపజేసినది

నాయకుడు కావలసిన వ్యక్తి అదృష్టవశాత్తు కవియైనాడు క్రమ క్రమంగా రాజకీయ రంగాలలో విజృంభించిన శక్తుల మధ్య యిముడలేక కాళోజీపూర్తి సమయాన్ని సాహిత్యానికి ఉపయోగిస్తున్నాడు కాళోజీతో చిన్నప్పటి పరిచయం కలిగిన నావంటివాని దృష్టిలో ఇది సహజ పరిణామమే వాంఛ నీయమైన పరిణామమే

కాళోజీ యెక్కడ వున్నా యేమి చేసినా ఆయన ప్రజల మనిషి ప్రజల గొడవే కాళోజీ గొడవ అయన కవితా సంపుటాలలోని ప్రతి పేజీ ఇందుకు ఉదాహరణము ప్రజల సమస్యలే ఆయనను కవిగా పలికించినవి కాళోజి కవితా దర్పణాన్ని అవలోకించితే, గడచిన ముప్పది సంవత్సరాల జాతీయోద్యమాల ప్రతిబింబము, ఆ ఉద్యమాలచే ప్రేరితులైన ప్రజా హృదయాల స్వరూపము ఇందులో సమగ్రంగా మనకు కనిపిస్తుంది కాళోజి తొలిరచన 1942 ప్రాంతంలో జరిగినదని చెప్పవచ్చును నాటి నుండి నేటికి అనగా ముప్పై రెండు సంవత్సరాల కాలంలో ఈ ప్రాంతంలో జరిగిన చరిత్ర అంతా కాళోజి కవిత్వానికి ఇతి వృత్తమైనదని చెప్పవచ్చును ప్రజల భాషలో ప్రజల హదయాలను ప్రదర్శించిన నేటి తెలుగు కవి కాళోజి ఈ మార్గంలో ఈయన అద్వితీయుడేమో

నాకు బాగా జ్ఞాపకం ఉన్నది 1946 48 మధ్యకాలం హైదరాబాదు రాష్ట్రంలో రజాకారు శక్తులు విజృంభించినపుడు ఆశక్తులను అన్ని విధాలా ఎదుర్కొనినాడు నల్లగొండలో "నాజీ శక్తుల నగ్న నృత్య

మింకెన్నాళ్ళు? పోలీసు అండన దౌర్జన్య శక్తులు పోషణం బొందే దెన్నాళ్ళు అని గర్జించినాడు ఈ గర్జన నాటి తెలంగాణమంతా ప్రతిధ్వనించింది నల్లగొండ జిల్లాలో నిరక్షరాస్యులయిన రైతులు పొలాలలో నాట్లువేస్తూ కలుపు తీస్తూ ఈ గేయాన్ని ఆలాపించిన సంఘటనలెన్నో ఉన్నాయి ఒక్కమారు కాళోజీ కవిత్వాన్ని పరిశీలించండి ప్రతి పంక్తిలో ఆయన హృదయాన్ని పోల్చుకోవచ్చును ఇంచుమించుగా ఇదే కాలంలో వరంగల్లు కోటలో రజాకార్లు మొగిలయ్య అనే కాంగ్రెసు కార్యకర్తను పట్టపగలు దారుణహత్య గావించిరి తరువాత పుండు మీద కారం చల్లినట్లుగా కాళోజీ కొంత కాలం వరంగల్లు పట్టణంలో ప్రవేశించరాదని నిషేదాజ్ఞలు ప్రభుత్వం జారీ చేసింది అప్పుడు సర్ మీర్జా ఇస్మాయిల్ హైదరాబాద్ ముఖ్యమంత్రి మొగలయ్య హత్య జరిగిన కొన్నాళ్ళ తరువాత వరంగల్లు పట్టణం సందర్శించే కార్యక్రమం సర్ మీర్జా ఇస్మాయిల్ ఏర్పాటు చేసుకొనగా కాళోజీ హైదరాబాదు నుండి ఆయనకు వ్రాసన కవితాలేఖ మన లేఖా సాహిత్యంలో చిరస్థాయిగా నిలువదగినది ఆ లేఖలో కాళోజీ

"కోటగోడల మధ్య ఖూని జరిగినచోట గుండాల శక్తులు గోచరించినవా?

బాజార్లో బాలకుని బల్లెంబుతో బొడుచు బద్మాషు నేమైన పసిగట్టినావా?

మొగలయ్య భార్యతో మొగలయ్య మాతతో మొగమాటమున లేక ముచ్చటించితివా? '

అని వేసిన ప్రశ్నలు అనాటి తెలంగాణమంతా మారుమ్రోగినవి అప్పటి ప్రభుత్వము కొన్ని రాజ్యాంగ సంస్కరణలు ప్రవేశపెట్టగా ప్రజల సంస్థలు వానిని నిరాకరించినవి ఆ సందర్భంలో కాళోజీ వ్రాసన గేయము మన జాతీయ వాఙ్మయంలో శాశ్వతంగా నిలువదగినది అధిక సంఖ్యాకులయిన మూర్ఖంలతో నిజాం ప్రభుత్వము సమాన రాజకీయ ప్రతిపత్తిని గురించి వ్యాఖ్యానిస్తూ కాళోజీ తొంబదితో పది సమమన తురకలెక్కది యెన్నాళ్ళు?" అని ప్రశ్నించినాడు ఈ విధంగా జ్ఞప్తికి తెచ్చుకుంటే ఆనాటి కాళోజీ గేయములు అసంఖ్యాకంగా ఉదహరించవచ్చును ఇవన్నీ కాళోజీ ప్రజల మనిషి, ప్రజల కవి అని అసందిగ్ధంగా ఋజువు చేస్తున్నవిగదా? (ఋజువే అవసరమైతే)

కాళోజీ రచనలలో అడుగడుగునా ఒక విశిష్టత గోచరిస్తుంది ■ ప్రత్యేకతే కాళోజీ ముద్ర సంఘంలోని వ్యత్యాసాలను గూర్చి రాసిన గేయంలో గట్టిదవడ లొకవైపు కమ్మని చకిలా లొకవైపు అన్న పాదాలు ఇందుకొక మచ్చుతునక

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వచ్చిన ద్రవ్యోల్బణాన్ని గూర్చి యుద్ధము మూలమున చలామణులకు ఉబ్బులరోగము వచ్చింది అన్నాడు కాళోజీ ఇది మరొక మచ్చుతునక

కాళోజీ బహుభాషలలో పరిచయమున్నమాట నిజమే అయినా ఆయనను ప ండితుడని చెప్పడానికి వీలులేదు అనేక విషయాలను గూర్చిన అవగాహన ఆయనకు ఉన్నది అయినా ఏ విషయములోనూ పారంగతుడని చెప్పడానికి వీలులేదు స్వార్థాన్ని గూర్చి ఆలోచించక అన్ని జాతీయోద్యమాలలో పాల్గొనిన త్యాగమూర్తి అయన అయినప్పటికిని ఆయనను ఈనాటి పరిభాషలో నాయకుడని చెప్పడానికి వీలులేదు దేశసేవకు జీవితాన్ని అంకితం చేసిన కాళోజీ అన్నిటికన్నా మిన్నగా కరుణార్ద్ర హృదయుడైన కవీశ్వరుడు ఎక్కడ ఏ అన్యాయము జరిగినా ఆయన కండ్ల నుండి జల జల నీళ్లు రాలిగాయపడిన హృదయంలోని భావాలు గేయ రూపమున వెలువడును ఆయన కవిత్వమంతా ఈ విధంగా ప్రకటితమైనదే సమాజంలోని వ్యత్యాసములను దౌర్జన్యాలను కాళోజీ సహించే మనిషికాదు వీనిని వ్యతిరేకించడంలో వెనకాడే మనిష కాళోజీకాదు ఆయన జీవితమంతా ఈ మార్గంలోనే నడచినది అందుచేతనే ఆయన నూటికి నూరుపాళ్ళు ప్రజాకవి జాతిమత విచక్షణ పాటించక సమస్త ప్రపంచాన్ని తన కుటుంబంగా భావించుకొనిన సుకుమార హృదయుడు కాళోజీ ఈ షష్టిపూర్తి సందర్భంలో ఆయనకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు

---

సత్యమే జయతి అంటూ
అసత్యాలతో రాజీ పడతా వెందుకు?
మృత్యుంజయు నారాధిస్తూ చావంటే
బెదిరిస్తావెందుకు?
శివభక్తుల ముస్తాబుతో శవారాధన చేస్తావెందుకు?

- కాళోజీ

# మంచి మనసున్న యోధుడు కాళోజీ

- ఎమ్ ఎస్ రాజలింగం

"మనసున్న మనిషికి సుఖములేదంతే అని డాక్టర్ సి నారాయణరెడ్డిగారు వ్రాసిన పాట రేడియోలో తరచూ వింటూంటాము ఈ పాట శ్రీ కాళోజీ విషయంలో ముమ్మాటికి నిజమైనదని కొన్ని వాస్తవిక ఘట్టాలే తెలియజేస్తాయి మనసు ఉండి, ప్రతి దానికీ స్పందించి బాధపడడం, వాటికి పరిష్కారం లేక పోవడమే వారు కవిగా మారడానికి కారణమేమో అనిపిస్తుంది

వారి కవిత్వంవల్ల కలిగే భావ విప్లవమే వారిని ఇతరులకు తెలియని, క్రమ వికాసము చెందే విప్లవకారిగా మార్చినవన్న అతిశయోక్తి కాదు

నా జన్మ స్థానం వరంగల్లే అయినా హైస్కూలులో చదువుతుండగా ఆయనతో నాకు పరిచయం కల్గింది

నేను నాలుగవ ఫారం చదువుతుండగా అంటే 1939 సంవత్సరం నాటికే ఆయనను విద్యార్థి నాయకుడుగానే గాక ఓరుగల్లుకు నాయకుడుగా కూడా ప్రజలు గుర్తించారు

విద్యార్థి సంఘం కార్యకలాపాలలో పాల్గొనడంవల్ల మా ఉభయులకు సాన్నిహిత్యం ఏర్పడింది అయితే నాకు ఆ రోజుల్లో నాటకాలలో ఉన్న పిచ్చివంటిదే ఆయనకు గణపతి ఉత్సవాలు, దసరా ఉత్సవాలలోను ఉండేది ఈ రెండు సందర్భాలలో వారు ప్రభుత్వ దమననీతికి గురైనారు వారిని అనాడు చూచిన తెలిసిన మిత్రులు ఈనాటి షష్ట్యబ్దిలో ఉన్న కాళోజీలో కానవచ్చే ఉత్సాహ, ఉద్రేకాలు, మూర్తీభవించిన వ్యక్తిత్వం వెనుక, ఎంతటి త్యాగం, సింహగర్జనలు, పోరాటశక్తి ఆరోజుల్లో ఎంత గొప్పగా ఉండేదో అంచనా వేయగలరు ఈ రెండు ఉత్సవాలు భావ స్వాతంత్ర్యానికి, మత స్వాతంత్ర్యానికీ, సమావేశ స్వాతంత్ర్యానికీ చిహ్నంగాను ఉండేవి వీటి ఆలంబనతో ప్రజలకు స్వాతంత్ర్యదీక్ష పెట్టడానికి ఆయన యత్నించారు

వారు ఆ రోజుల్లో ఆర్య సమాజ కార్యక్రమాల్లో విరివిగా పాల్గొన్నారు కాని వారికి వైదిక మంత్రాలు ఒక్కటైనా వచ్చునో లేదో నాకు తెలియదు అంతేగాక ఆయనకు వాటిపట్ల అంత మూఢ విశ్వాసము ఉందో లేదో కూడా నాకు తెలియదు కాని ఆర్య సమాజ్ ఉద్యమాలు నైజాం ప్రజల ప్రాథమిక హక్కులను రక్షించడంలో తోడ్పడ్డాయి అందుకే ఆయనకు వాటితో మమత్వం ఉన్నట్టు నా కనిపించింది అంతేకాదు కాళోజీ ఒక్క, కవిత్వ వ్యాసాంగాన్ని తప్ప, ఏ సంస్థను గానీ, ఏ వ్యక్తినిగానీ, ఏ సిద్ధాంతాన్ని గానీ పది కాలాలపాటు అంటిపెట్టుకున్నట్టు నే నెరుగను

సమాజాభివృద్ధి పరిధిలో, అవధులులేని స్వేఛ్ఛా స్వాతంత్ర్యాలను ఆయన అభిలషిస్తారు ఆయన భావాలకు మనిషి దేవుడు ఎవరూ అడ్డురాకూడదు అట్లావస్తే ఆయన సహించరు ఈ నైజం తెలిసినవారే ఆయనకు మిత్రులవుతారు ఆయన చర్యల్ని అభినందిస్తారు ఆయన్ని చూసి గౌరవిస్తారు

నిరంతరం కృషి చేయడం ఆయనకు కావాలి ప్రపంచం సహకారం సానుభూతికై పాకులాడటం ఆయనకు తెలియదు పైగా అటువంటి విషయాన్ని ఏవగించుకుంటారు ఆదర్శవంతమైన స్వేఛ్ఛా స్వాతంత్ర్యాల అనుభూతిని అడుగడుగునా పొందగలిగిన మనిషి అటు వంటి మనుషులు గల సమాజం ఆయన లక్ష్యంగా కనిపిస్తుంది ఇలాంటి రంగంలో ఎదురయ్యే సహాయం, అటువంటి సంఘటనలు ఆయన హృదయాన్ని ఆకర్షిస్తాయి దానిలో ఆయన తన్మయుడౌతారు

1930లో నేను శ్రీ లక్కినేని నరుసయ్య బి రంగారెడ్డి కలిసి 'స్నేహలత' అనే విద్యార్థి పత్రిక ఒకటి కొన్నాళ్ళు నడిపాం దానికి ఏదైనా వ్యాసం వ్రాయవలసిందని వెళ్ళి వారిని అభ్యర్థించాం అయన తన సహజ ఛలోక్తి ధోరణిలో నా దగ్గరకు వ్యాసానికి వచ్చారా అంటూ ఆ పత్రిక కొన్నాళ్ళు నడవాలని ఉందా అని ప్రశ్నించారు అలా అనడంలో మరో ఉద్దేశమేమీ లేదు అనాటి పరిస్థితులలో ఆయన భావాలు వెల్లడిచేసే పత్రికలు నాలుగునాళ్ళు కొనసాగడం కష్టమైన దని వారికి తెలుసు ఎదుటివారి కష్టసుఖాలను గూర్చి మొట్టమొదట ఆలోచించి వ్యవహరించే అలవాటు ఆయనకు మొదటి నుండి ఉన్నది అందువల్ల ఉద్యోగుల్లో కాని మరో వర్గంలోకాని ఆయనకు శత్రువులు లేనేలేరు అయనతో ఏకీభవించని వారు కూడా మిత్రులే అయన చూపే సానుభూతి సహృదయం అటువంటిది మా పత్రిక చందా దారుల జాబితా చూచిన తర్వాత పత్రికకు వ్యాసం వ్రాశారు 1939లో వరంగల్లులో గణపతి ఉత్సవాలు జరుగుతున్నాయి ప్రభుత్వాధికారుల సహాయంతో ఇత్తైహాదుల్ మునల్ మాన్‌లు ఈ కార్యక్రమాలకు భంగం కల్గిస్తున్నారు ఇత్తైహాదుల్ ముసల్‌మీన్ సంస్థ హిందువులను ముస్లింలుగా మార్చే కార్యక్రమాన్ని ముమ్మరం చేసింది ఇట్లా మారేవారికి మారే మతంపైకన్న ప్రభుత్వం అండదండలు లభిస్తాయని ఆశమెందు ఇందులో ఒకరు వీర సర్దారలి దసరా ఉత్సవాల సందర్భంగా కత్తిసాము ప్రారంభించడం అది ఘర్షణగా మారి హిందూ ముస్లిం తగాదా ఏర్పడే పరిస్థితికి దారితీసింది ఈ సంఘటన న్యాయాన్యాయాలను గూర్చి వివరంగా ప్రతి వారు మాట్లాడవచ్చు అయితే ఇత్తైహాదుల్ ముసల్‌మీన్ నాయకులతో ముఖాముఖి మాట్లాడటం ఎవరి వశం అందుకు తగిన వారు కాళోజీ ఒక్కడే తర్కం వదిలేసి కాళోజీ ' అరే ఆప్ కే ఔర్ హమారే బచ్చేం మరేంగే' మీ పిల్లలు మా పిల్లలూ చస్తారు మనం బాగానే ఉంటాం, అని అంటూన్నప్పుడు వారి హృదయావేదన కన్నీరు స్పందన ఈ వివాదం పెరుగకుండా సమన్వయ పరచడానికి దోహదం చేసేవి అయితే వారి స్వాతంత్ర్య తీవ్ర భావాలు పోరాట పటిమవల్ల జిల్లా నుండి అనాటి ప్రభుత్వం బహిష్కరించింది

1942లో నేను నా కాలేజీ చదువు ముగించుకొని గాంధీ ఆశ్రమం వదలి వరంగల్లులో నా రాజకీయ జీవనం ప్రారంభించడం జరిగింది అప్పటికే క్విట్ ఇండియా ఉద్యమ ప్రభావం వరంగల్లు ప్రజలపై గూడా వేయాలిసిన ప్రభావం వేసింది దాదాపు 270 మంది యువకులు రైలు పట్టాలు పీకడం వంటి విధ్వంసక చర్యలకు పాల్గొనేందుకు సిద్ధమయ్యారు ఇది తెలిసిన అనేకమంది తల్లిదండ్రులు తమ బిడ్డల్ని గదులలో వేసి బంధించి బయటికి వెళ్ళనీయడంలేదు ఈ దశలో నా రాక ఆ భయాన్ని మరింత ఎక్కువ చేసింది ఈ సందర్భంలో శ్రీ కాళోజీతో నేను కలువడం తటస్థించింది అప్పుడాయన "ఆ పొరగాళ్ళందరినీ మేకలను నరికినట్టు నరుకుతారు' ' చచ్చినా ఛస్తే ఏదో ఖచ్చితమైన ఫలితం ఉండేటట్లుండాలి అన్నారు ఆయన ఏ ఉద్యమంలోనూ ప్రభుత్వాన్నెదిరించకుండా ఉండలేదు బాధపడడం తప్పలేదు కాని ఇతరుల బాధపట్ల ఆయనకు బాధమెందు అయితే ఈ సందర్భంలో ఏమి చేయాలో తోచలేదు ఆయన కళ్ళనిండా నీళ్ళు నేను చూడలేకపోయాను ఏమి చేయలేని పరిస్థితి

మిత్రద్రోహులవల్ల ఈ 270 మంది యువకుల జాబితా పోలీసులకు చేరిపోయిందని తెలిసింది ఆ ఉద్యమాన్ని అనాటి పరిస్థితుల దృష్ట్యా అహింసాయుత సత్యాగ్రహ ఉద్యమంగా మార్చాలిసి వచ్చింది ఇది వారికి చెప్పాను పొరగాళ్లయితే బ్రతికారులే" అన్నారు

ఒకవైపు స్వాతంత్ర్య పిపాస మరోవైపు ఇతరుల ఏ కొంచెం బాధనైనా సహించలేని సున్నిత హృదయం ఈ రెండిటికీ మధ్య అయన మనస్సు ఘర్షణపడేది ఈ ఘర్షణ నుండి ఆయనకు శాంతి కల్పించడం ఎవరి తరం? ఊరట కల్గించడానికి ఎవరేం చెప్పగలరు? ఆయనకెలా చెప్పగలగడం అనే విషయంలో మిత్రులకిప్పటికీ సమస్యే

1942 ఉద్యమం తీవ్రత పెరుగుతూ వచ్చింది మితవాదులపై కోపం అధికమయింది వారికి దారిలో ఎవరైనా ఆంధ్ర మహాసభ నాయకులు కనిపిస్తే చాలు "మీరు వకాలతు చేసుకొని ఇంట్లో పొట్టలోని చల్ల కదలకుండా కూర్చొని ఆ పోరగాల్లను ఎందుకు చంపుతారు అని కసిరేవాడు వారి ఆరోగ్యం కారణంగా ఆయన అధికంగా కష్టపడలేకపోయినా ఇతరుల బాధలను చూస్తూ ఊరుకోలేదు ఫలితంగా 1942లో కూడా ప్రభుత్వ దమన నీతికి వారు గురికాక తప్పలేదు

ధర్మారం ఆంధ్ర మహాసభలో హరిజనోద్ధరణ గురించిన తీర్మానంపై సికింద్రాబాద్‌లో అధ్యాపకులుగా ఉన్న శ్రీ దత్తాత్రేయ శర్మగారు ఉపన్యసించడానికి వేదికపైకి వచ్చారు ఆ సభకు శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావు అధ్యక్షులు అయ్యా తీర్మానానికి అనుకూలంగా మాట్లాడమంటారా లేక ప్రతి కూలంగానా అని శ్రీ శర్మగారు అధ్యక్షులను ప్రశ్నించగా సభలో గొల్లున నవ్వులు కొంతమంది కార్యకర్తలు హరిజన వాలంటీర్లతో తాగునీటిని సరఫరా చేయించడం ప్రారంభించారు అప్పటికే "ఈ హరిజన తీర్థం కాస్త అధ్యక్షులవారి నోటిలో పోయండి చాలు, శర్మగారు ఉపన్యాసం ఇవ్వనవసరంలేదు" ఏ మూలనుండో కాళోజీ కంఠం ధ్వనించింది ఉపన్యాసాలు చేయడం, తీర్మానాలు చేయడం కన్నా భావ విప్లవ చర్యలంటేనే కాళోజీకి నచ్చుతాయి తుదకు ఒక విధంగా నాడు అలాగే జరిగింది

భోనగిరి ఆంధ్ర మహాసభ ప్రజా యుద్ధాన్ని దృష్టిలో ఉంచుకొని కమ్యూనిస్టులు ఉద్యమాన్ని నిర్మిస్తున్న రోజులవి ఆంధ్ర మహాసభ వాదులు కాంగ్రెస్ వాదులు విడిపోతున్న దశ అది వారు ఆంధ్రోద్యమానికి రాజీనామా ఇవ్వలేదు ఆ సభ నుండి విడిపోవలసిన కారణాలను, అవసరాన్ని వివరించడానికి నేను ఆయన వద్దకు వెళ్ళాను నేను చెప్పడం ప్రారంభించానో లేదో "అరే అది మాతృ సంస్థరా దాన్ని వదులుతే తల్లిని వదిలినట్టురా" అన్నాడు ఏం చెప్పాలి? వారికి గల గాఢానుబంధం అటువంటిది వారి జీవితంలో "సెంటిమెంటు" అనేది బాగా పనిచేస్తుంది అది బయటి ప్రపంచానికి సంబంధించిన విషయాలలోనే గాక అన్నదమ్ములు విడిపోకుండా సమిష్టి జీవనం గడుపడానికి యోగ్యమైన వ్యక్తిత్వాన్ని కలిగించినట్టు వాళ్ళ సమిష్టి కుటుంబం తీరు కనిపిస్తుంది బహుశా అది కుటుంబ లక్షణమేనేమో ఈ గుణం వారి అన్న గారు శ్రీ రామేశ్వరరావుగారిలోను కన్పిస్తుంది ఈ కలయిక కాళోజీగారి బాల్యంలోను యవ్వనంలోను ఇప్పటి వృద్ధాప్యంలోను వారిని ఆడుతూ పాడుతూ తిరిగేటట్లు ఉంచగలుగుతున్నది భోనగిరి ఆంధ్ర మహాసభ నా మాతృ సంస్థ దానికి మారువేషం వేయవద్దని ఘోషించిన కాళోజీని అర్థం చేసుకోగలిగిన వారెంతమంది?

1946లో ఓరుగల్లులో కాంగ్రెస్ పతాకం ఎగురవేశాం మరోవైపు జాతీయ విద్రోహశక్తులు విజృంభిస్తున్నాయి మాతో కలిసి పనిచేస్తున్న స్వాతంత్ర్యయోధుడు మొగలయ్యను విద్రోహులు కాశిం షరీఫ్ నాయకత్వంలో హత్యచేశారు కాళోజీని నన్ను బత్తిని రామస్వామిని హయగ్రీవాచారిని జిల్లా నుండి బహిష్కరిస్తూ ఆజ్ఞలను జారీచేశారు బహిష్కరణ ఆజ్ఞలను ఉల్లంఘించాలని నా వాదన కార్యకర్తలలో అభిప్రాయ భేదాలు వచ్చాయి రాజకీయ స్వార్థత, త్యాగాలకు కూడా ఒకప్పుడు అడ్డునిలుస్తుంది మరొకప్పుడు ఏమయినప్పటికీ నేను ఆజ్ఞలను ఉల్లంఘించాను వరంగల్లులో దీన్ని చూసి సంతోషించిన వారిలో మొదటివారు కాళోజీ అని నాకు తెలుసు చాలా మంది నా ఈ చర్యను మరో విధంగా చెప్ప యత్నించారు వెళ్ళిన వారికల్లా "వాడు మొండి దమ్ములున్నాయి ఉల్లంఘన చేశాడు" అని చెప్పి వారిని పంపించి వేశాడు

వ్యక్తి చర్యలలోని స్వార్థం, నిస్వార్థతను ఆయన తరచి చూడగలరు అట్లాంటి దృష్టి వారికుంది అదే వారి కవిత్వంలోను స్పష్టమవుతుంది మా గురించి పై మాటలు అంటూ కళ్ళ తడి పెట్టిన కాళోజీకి ప్రతిగా నే నేమీ సమర్పించుకోలేను ఆ సహృదయతను, ఆ వ్యక్తినీ హృదయంలో నిలుపుకోలేక ఉండనూలేను

స్టేటు కాంగ్రెస్ స్వాతంత్ర్య పోరాటంలోకి దిగింది

భారత యూనియన్‌లో ఈ సంస్థాన విలీనికరణ జరుగాలని ఆందోళన లేవదీసింది చాలా మందిని జైల్లో నిర్బంధించారు అట్టివారిలో శ్రీ కాళోజీ కీశే షటికాల మధుసూదనరావు కూడా వున్నారు కాళోజీ అనారోగ్యంగా ఉండడంవల్ల ఆయన చాలా కాలం ఆసుపత్రిలోనే ఉన్నారు నేను నా మిత్రులు ఏదో విషయంలో హాస్పటల్‌కు వెళ్ళి వారిని చూసి వచ్చేవారము ఒక రోజు నేను వెళ్ళే సరికి ఆయన వెక్కి వెక్కి ఏడుస్తున్నారు ఆయన చేతిలో పుస్తకం వున్నది ఎందుకు ఏడుస్తున్నారని అడిగే ధైర్యంలేదు చనువు ఉన్నా అడిగితే ఆ ప్రశ్న వారిపై ఎటువంటి ప్రభావాన్ని వేస్తుందోనన భయం వారికి ఒకే ఊపిరితిత్తి ఉందని చాలా జాగ్రత్తగా ఉండాలని నా మిత్రలనేవారు దానియదార్థం తెలుసుకునే యత్నం నేనింతవకు చేయలేదు చేసే ధైర్యం లేకపోయింది అలాగే వారి వద్ద మౌనంగా నిలుచున్నాను చాలా సేపటి వరకు అయనేమీ అనలేదు చివరకు "వాడి గతి చూశావా అన్నాడు ' ఎవరో రాజకీయ వ్యక్తి ఇబ్బందుల్లో ఉన్నాడని ఏదో ఘోర వార్త విని ఉంటాడని ఊహించి ఇటువంటి ఉద్యమాలలో జరుగు తుంటాయి లెండి అన్నాను అదికాదురా ఒక ముసలిదాన్ని బాల్ రూం (Ball 100m)లో చూచి వయసుదని భావించి దాని ప్రేమను అందుకోవాలని ఒక వయసుపోరడు కొన్ని అంతస్తులపైకి పాకి కిందపడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు' అని ఆయన చేతిలోని నవలలోని వృత్తాంతం చెప్పాడు ఈ వెక్కి వెక్కి ఏడ్వడానికి కారణం నవలలోని ఆ పాత్ర అని అప్పుడు తెలిసింది నాకు అంతటి సున్నితమైన మనస్సాయనది

జైలు ఆసుపత్రిలో మరొకరోజు కలుసుకున్నాం 'నీకేమైనా బుద్ధుందా అన్నాడు కానేమీ అర్థం కాలేదు ' వాడు నిండు జీవి అయితే లోలోన వాడు కుములుతున్నాడు వాడి సంగతి మీకక్కరలేదా?" మెరుపువంటి ప్రశ్న? ఎట్లా బోధపడుతుంది ఆయన చెప్పదలుచుకున్న విషయంలో కర్త తరువాతగాని సంభాషలో ప్రవేశించడు సంభాషలణలో మొట్టమొదట వ్యక్తమయ్యేది క్రియాత్మకమైన ఎదుటి వాడి బాధే అర్థం చేసుకోవడానికి ప్రయత్నింస్తున్నాను తేలిందేమంటే శ్రీ మధుసూదన్ జైలులో నిర్బంధితులు కావడం వల్ల ఆయన భార్యా పిల్లలను భండారు ప్రసాదరావుగారు తీసుకొని వెళ్ళి గొల్లపూడి సీతారామశాస్త్రిగారి సంరక్షణలో ఉంచారు వారక్కడ కష్టపడుతున్నారని ఊహించిన బాధ

ఈ బాధ, ఆవేదన చేసుకున్న భర్త ఆ పసి పిల్లల తండ్రి కన్నా తనకే మెండు ఇట్లాంటి బాధే ఒక రోజు మధుసూదన్ విషయంలో మరొక రోజు నా కుటుంబం విషయంలో మరొకరోజు మృతజీవి ఎస్ మనోహర్ కుటుంబ విషయంలో ఉండేది అందరి బాధ అందరి గొడవ తనకే పట్టింపుగా ఉండేది అందరి బాధా పంచుకుంటూ తాను తన కుటుంబ బాధల నుండి విముక్తి పొందేవాడు

గిడుగు రామ్మూర్తి పంతులుగారో న్యాయపతి సుబ్బారావుగారో నాకు గుర్తులేదు మృతిచెంది నట్టు వార్త వేదం వెంకట్రాయశాస్త్రి చిలకమర్తి ప్రభృతుల మృతికి సంతాప సూచకంగా ఒక తీర్మానాన్ని కోదాటి నల్లగొండ జిల్లా చిలుకుర్తి ఆంధ్ర మహాసభలలో ప్రవేశపెట్టగా వారు ఆంధ్ర మన తెలంగాణా వాసులు సానుభూతి తీర్మానం చేయనవసరంలేదని కొందరి వాదనతో తీర్మానాన్ని నిరాకరించారు వ్యక్తికీ వ్యక్తికీ తేడా పాటించక ప్రాంతీయాల్ని అధిగమించే ఈ తత్వానికి ఎదురొడ్డి నిల్చినవారు కాళోజి అయనవెంట నిలిచిన మిత్రులు కోదాటి కొమరగిరి ఈ ముగ్గురు నారాయణ త్రయంగా పేర్కొనబడేవారు

1946లో జైలులో వుండగా నిర్బంధితులకు తెలంగాణా ప్రాంతం ఆహారం పెట్టాలని నేను సత్యాగ్రహం ప్రారంభిచాను ఇదేదో నాయకుణ్ణి కావడానికి నేను వేసి ఎత్తు అని కొందరు భావించారు నిజానికి జైలులో ఇచ్చే రొట్టెవల్ల చాలా మందికి విరోచనాలు ప్రారంభమైనవి అందువల్ల అన్నం పెట్టాలని నిరశనవ్రతం ప్రారంభించాను ఇది సాధించాలంటే సామూహిక బలం అవసరం కదా! విషయం అర్థం చేయించగలననే నమ్మకం నాకైతే ఉన్నది గాని ఏం చేయాలో తోచలేదు ఈ సంగతి కాళోజీకి తెలిసింది వారం దాటింది నా ఆరోగ్యం

గురించిన ఆవేదన ఆయనకు ఎక్కువైంది "వాడు వీరశైవుడు వాళ్ళు నారసాలు గ్రుచ్చుకుంటారు వాడు చస్తాడు - ఏదో చేయాలి అంటూ ప్రచారం లేవదీశాడు

డాక్టర్ హనుమంతరావుగారు మాకు జైలు డాక్టరు ఆయనను నిదుర పోనివ్వలేదు కాళోజీ ఒక రోజు డాక్టరుగారు నా వద్దకు వచ్చి కాళోజీ నీకేమవుతారు, నీ నిరాహార దీక్ష బాధతోనే ఆయన కృంగిపోయేటట్టున్నాడు అని అన్నారు నేను నిశ్చేష్టుడయ్యాను ఏం చెప్పాలో నాకు తోచలేదు ఏం చేయలేదు ఆయనపడే బాధే జైలు లోని రాజకీయ ఖైదీలందర్నీ ఒక్క త్రాటిమీదికి తెచ్చింది జైలంతా సమిష్టి నిరశన వ్రతానికి పూనుకొన్నారు నా కోర్కెను మన్నించినట్టుగా అంతరంగిక కార్యదర్శి నుండి ఆదేశం వచ్చింది త్యాగం మరే ఇతర సిద్ధాంతం చేయలేని పనిని కాళోజీ కన్నీరు, సానుభూతి చేయగలిగింది

వరంగల్లు కోటలో జరిగిన నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు సభల సందర్భంగా జాతీయ విద్రోహశక్తులు పెండాలు తగులబెట్టి బీభత్సం చేశారు అప్పుడు నేను అడవాల సత్యనారాయణ ప్రభృతులం బాగా దెబ్బలు తిన్నాం మొత్తానికి ప్రాణాలతో బయటపడ్డాం బ్రతికి బయటపడ్డామని తెలిసి కాళోజీ నా బాధల్ని తన కన్నీటితో దూరం చేశారు నిజం చెప్పాలంటే కష్టసమయాల్లో తల్లి ఒడిలో కూడా ఊరట లభించని నాకు కాళోజీ కన్నీరు కదిలించింది ఇదే తెలియని అనుబంధం? ఆ కన్నీటికి కారణం కూడా తెలియనిదే? ఇది ఎన్నటికీ అర్థం కాని తెలుసుకోలేని ప్రశ్నే

ఇట్లాంటి స్వచ్ఛమైన మంచి మనసుగల కాళోజీని గూర్చి ఎంతైనా చెప్పవచ్చు నేను కవినే అయితే ఎన్నో యుగాలు గానం చేయగల కవితను కాళోజీని గురించి సృష్టించేవాడిని

> కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది అతడు ఒక్కమాటు సమాజంవైపు కన్నెత్తి నిశితంగాచూస్తే సమాజం నిలువునా గజగజ వణికిపోయి తనలో తరతరాల నుండి దాచుకున్న కుళ్ళును ఒక్క మాటు బైట పారేస్తుంది అట్లా చేయకుండా ఇంకా రహస్యంగానే వుంచడం అతని ముందు సాధ్యంకాదు గనుక, అతనికి గుడ్డి ఆశలులేవు తాను చూస్తున్నదీ తనకు తోస్తున్నదీ రాస్తాడు నిజం ఆలోచిస్తే కాళోజీ శాస్త్రజ్ఞుడు - శాస్త్రజ్ఞత గర్భితమైవున్న కవి
>
> - దాశరది

# నా కిష్టుడైన కాళోజీ

- నాయని కృష్ణకుమారి

హనుమకొండ మిత్రమండలి కాళోజీ 'నా గొడవ మూడో ముద్రణకు మనవి మాటలు చెప్తూ ఆయన జీవితానికొక దిఙ్మాత్ర రేఖా చిత్రాన్ని గీచి యిచ్చారు అందులో ఒక కాళోజీ ఆంధ్ర మహాసభలతో సన్నిహితత్వం పెంపొందించుకుని ఆంధ్ర పితామహుడితో అనగి పెనగి ముసలిన కాళోజీ దేశీయోద్యమమైన కాంగ్రెస్ ఉద్యమం పట్ల పరమమైన అస్థి కలిగిన కాళోజీ మరొక కాళోజీ అర్య సమాజీయుడై రజాకార్ దుండగుల అటలు కట్టించే అగ్గి రాముడై, ఆనాటి ప్రజల విశ్వాసాలకు ప్రతీకగా నిలిచిన కాళోజీ ఇంకో కాళోజీ, ఎక్కడ మోసం ఉన్నా కుట్రలువున్నా ఎక్కడ తన వ్యక్తిత్వంతో పొసగని తనం కనిపించినా ఏ మాత్రమూ దాఏరికం లేకుండా కుండ బద్ధలుకొట్టినట్లు మొహం మీదనే అనేసే స్వభావం కల కాళోజి ఈ కాళోజీని గురించి అలోచిస్తేనే 'పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము అనే మాట జ్ఞాపకం వచ్చేది ఈ కాళోజీ అందువల్లనే రాజకీయాలకు అచ్చిరాకుండా పోయాడు తెరవెనక జీవితాలను కూడా సాగించే మిత్రులకు, కాకుండా పోయాడు కాని మామూలు జనానికి దగ్గరితనాన్ని సాధించాడు సమాజంలో ఉన్న సవాలక్ష లోపాలకు తానంటే బెదురు కల్పించే ప్రయత్నంలో సఫలీకృతత్వాన్ని సాధించాడు

"మూతులు నాకుచు ఆత్మవంచనతో
కట్టిన మూటలు చాలింక
రక్షణకై ఏర్పడ్డ బలగమే
చేసే భక్షణ చాలింక అని అన్నా"
కడుపు నిండని కాపు కొడవలి
కాసు దొరకని కూలి సుత్తి
కలిసి యెత్తిన, దొంగ దొరలూ
కంపమెత్తి చచ్చినట్లే! అని

గర్జించినా తీవ్రస్వభావుడైన కాళోజీ చిందులు తొక్కుతూ కనిఎస్తాడు ఇటువంటి కాళోజీయే నిజంగా ఈనాటి సమాజానికి కావలసినవాడు

కాళోజీకి చెందిన ఈ అన్నిరూపాలనూమించి మిత్ర మండలికి కనిఎంచని మరో రూపం నాకు కనిపిస్తున్నది ఈ రూపంలో ఉన్న కాళోజీ కేవలం భావావేశంలో మునిగిపోయే అచ్చపు కవితాత్మగల కాళోజీ మానవతను మన్నికచేసి ఆర్ద్రమైన మనస్సులో కన్నీరు నింపుకునే కాళోజీ ఇటువంటి కాలోజీలో నేను కవిని గుర్తించ గలుగుతున్నాను మిగిలిన చోట్ల ఆయన, రాజకీయవాది కావచ్చు ఇజాల నిజానిజా ల వెనుక పరుగులెత్తే నిజాయతీగల వ్యక్తి కావచ్చు లోకంలోని పలు అన్యాయాల పాలకువల్ని నహించలేని క్రోధవరీత మాననుడైన మానవుడు కావచ్చు క్షణికమైన భావావేశంలో పూచిక పుల్లలాగా కొట్టుకుపోయే అసహనశీలికావచ్చు ఏమైనా కావచ్చు అటువంటి కాళోజీకి ఉద్రిక్తత సహజగుణంగా కనిపిస్తుంది అది ఎంత ఉద్రేకమంటే, ప్రవక్తలాగా శాసించవలసిన కవియైన తాను కూడా ఆ ప్రవాహంలో అడుగు తగలకుండా కొట్టుకుపోయేంత! ఆ ఉద్రేక స్వభావాన్ని ఆయనే స్పష్టంగా చిత్రించుకున్నాడు

'అవనిపై జరిగేటి అవకతవకలు చూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టము చూచి కరగి పోవును గుండె
మాయ మోసము చూచి మండి పోవును ఒళ్ళు
పతిత మానవు జూచి చితికి పోవును మనుసు
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు"

ఇంత ఆవేదన మనస్సును కదల్చివేస్తుండగా తన శక్తి తనకు తెలియని వానిలాగా బొత్తిగా అమాయకునిలాగా,

"తప్పు దిద్దగ లేను దారి చూపగ లేను
తప్పు చేసిన వాని దండింపగా లేను
కష్టపడు వారలను కాపాడగాలేను

అని వాపిడిచి దు ఖిన్నూ, పరితలను, తన నిజాయతీతో కదిలిస్తూ, సాగిపోతాడు అంతేకాక,

"పరుల కష్టాలతో పనియేమి మాకనెడి
అన్యులను గనియైన హాయిగా మనలేను"

అని తటస్థ జీవులతో కలవలేని తన అసమర్థతను ఒక విధంగా తన ఆత్మకు సంబంధించిన స్వచ్ఛతను స్పష్టంగా వెల్లడించుకుంటాడు ఉద్రేకాన్ని కాసేపు అవతలుంచితే, ఇటువంటి మాయామర్మాలులేని దాపరికాలు తెలిని పసిపిల్లవాడిలాంటి కాళోజీ అంటేనే నా కిష్టం

ఆయన ఆవేశ కావేషాలు ఎటువంటి వన్నా కానీ, వాటి వెనకుండే నిజమైన కారణాల చరిత్ర ఎంత క్లిష్టంగానన్నా ఉండనీ, ఆయనకు కోపం వచ్చిందంటే, ఆ ఆగ్రహంలో ఒక విధమైన స్వచ్ఛత, మెరికలులేని సాఫీతనం కనిపిస్తుంది నిర్భయత్వం స్పందిస్తుంది

"టక్కరితన మెప్పుడుండదు పొంగక
బిక్కమొగా లెప్పు డుండవు కుంగక
అనాదిగ ఋజువగు చుండగ నీ మాట
ఎందులకో కవి వ్రాయుట ఈ పాట
ఎలుగెత్తి పాడిన కంఠాలు
ఏపాటి దోచ్చెను లోకుల తంటాలు"

"ఇంకానా ఇకపై చెల్లవు

"ఏమైనది ఎందుకు చెల్లవు?"

"కవుల కసలు బుద్ధిలేదు
అన్నవాడు మహా సుబుద్ధి '

కాళోజీ చెప్పున్నదంతా నిజమే కవులు కేవలం తమ కవిత ద్వారా మాత్రమే సామాజిక పరిస్థితిని మార్చిన సంఘటనల్ని చరిత్రలో మన మెప్పుడైనా చూచామా? అన్ని రంగాల నుండీ, అన్ని దిక్కుల నుండీ, అసంతృప్తి కమ్ముకురాగా కవి కూడా తన అసంతృప్తిని, తన రచన ద్వారా వెలువరించగలడు తప్ప? కేవలం ఒక్కడూ ఏం చెయ్యగలడని? కాళోజీ ఇటువంటి నిజాలను ఏ మాత్రమూ మొహమాటం లేకుండా చెప్పగలడు ఇటువంటి ప్రత్యేకతను సంతరించుకున్న కాళోజీ అంటే నా కిష్టం

సభల్లో కవిత్వ పఠనం చేసే కాళోజీని ఎప్పుడూ మర్చిపోలేను

కుటిల మతులు దేబెమొగాలు
జగతిలో రెండే రకాలు
చతుర వర్గ విలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు
లోక మెప్పుడు చతురుని సొత్తు
లే దమాయకున కండుల పొత్తు
బిక్క మొగపు జన సముదాయం
టక్కరి బృందానికి తృణప్రాయం
దండె గొట్టు తెలివే చాలు
జోన వచ్చి గింజలు తాలు
మేధావుల కార్యాచరణం
సామాన్యుల పాలిటి మరణం "

ఇట్లా కవితాగానం చేస్తూనే ఆయన కంఠం రుద్ధమైపోతుంది కళ్ళల్లో నీరు క్రమ్ముతుంది ఆ కంఠగాద్గదిక్యం వెనక, అశ్రువుల తెర వెనక, అమాయకజనుల 'దేబెతనం' మీద జాలి, దట్టంగా కమ్ముకుని కనపడుతుంది వాళ్ళను గురించి కవి పడే తపన, చండ కిరణ ప్రసారంలాగా మనస్సును గుచ్చుతూ, అవగతమౌతుంది కాళోజీ వ్యక్తిత్వంలో ప్రధానంగా కనిపించే మనుష్యులమీది ఆత్మీయత అటువంటిది ఆ వ్యక్తిత్వంతో భాసించే కాళోజీ అంటేనే నా కిష్టం

ఇంత ఉద్రేకి, సత్యమైన ఆగ్రహం కలవాడూ, నవ్య నవనీత నమానమైన మనన్సుతో, మానవతను ప్రేమించేవాడూ అయిన కాళోజీ లోపల, మరో ప్రేమికుడూ, భావుకుడూ అయిన కాళోజీ దాక్కున్నాడేమోనని నా అనుమానం

"భావార్ణవంబులో నావరకు నేను
మునకలేసిఎంతొ మురిసిపోతాను
మన మిరువురము కలసికొనిన సమయాల
ఆటలూ పాటలూ మాటలూ పనులూ
ఎపుడెపుడు ఏ వేవి ఎటుల జరిగినవో
ఎదలోన అటులనే పదిలపరిచాను
స్మృతిచేత వానినే వెదికించుతాను
వెదికించి మనసులో అతికించుతాను
తలచుకుని తలచుకుని ఉలికిపడతాను
గుట్టుకనపడనీక నిట్టూర్చుతాను

మా నాన్నకు ప్రియమిత్రుడైన కాళోజీని, నాకు ఎత్తులుల్యుడైన కాలోజీని అ రెండో వ్యక్తి ఎవరో చెప్పమని ఎవ్వడైనా అడగాలనుకుంటాను ఎప్పుడడుగుతానో తెలీదు

కాళోజీకి మాతృదేశమన్నా, చంటిపాపల పెదవిజంట నీంగిణులన్నా చెమ్మగిలిన కన్నులన్నా, ఆగకుండా సాగిపోవడమన్నా ఎంతో ఇష్టం

సాగిపోవుటె బ్రతుకు
ఆగిపోవుటె చావు
సాగిపోదలచినా
ఆగరాదెచటెపుడు
ఆగిపోయినముందు
సాగనే లేవపుడు
వేచి యుండిన పోను
నోచుకోనేలేవు

అన్నదే ఆయన జీవిత సూక్తం బ్రతుకుమీద ఎంతో ఇష్టాన్ని పెంచుకుని బ్రతకదలచినవాడు। పోట్లాడవలసివస్తే భయపడకుండా ధీరంగా మానవత్వానికి మచ్చ రానీయకుండా గంభీరంగా, ముందుకే, పరిక్రమించే కాళోజీ అంటే నాకు చాలా ఇష్టం ఇట్లా కాళోజీని గురించి నాకున్న ఇష్టాన్ని ఎన్ని విధాలుగా చెప్పను?

అటువంటి కాళోజీ ఒక షష్ట్యబ్ద పూర్తేకాక మరొకటి కూడా జరుపుకుని తీరాలన్నది నేను మన పూర్వకంగా కోరుకుంటున్న కోరిక

# "కాళన్న సాట్వీ( ఘరానా" సాల్గిరాభి వందనలు

-ఎం ఆర్ బలరామాచార్య

కావేషము లెరుగనివాడు
కాలుష్యము తెలియనవాడు
కవితకు భూషణమగువాడు
కాళోజి "నారాయణుడు"

బహు భాషల నెరిగినవాడు
పరమేష్ఠిగ మెలగెడివాడు
పరాజయము లెరుగనివాడు
"ప్రజాకవిగ వెలిగెడివాడు

వేమన్నను మించినవాడు
వేదనలే తెలియనివాడు
నాదన్నది లేదను వాడు
నలుగురి కాత్మీయుండతడు

స్వాతంత్ర్యపు యోధుడు తానై
సమరానికి ఉరికినవాడు
సకలాంధ్రావని ప్రియతముడై
సంతసమున తిరిగెడివాడు

నిక్కచ్చిగ పలికెడివాడు
నిలదీసి అడుగు మొనగాడు
టెక్కులన్న సైపగలేడు
మక్కువలకు ప్రియమగువాడు

సంఘానికి వెరువనివాడు
సౌఖ్యాలను మరుగనివాడు
సాహిత్యములో తల పండి
సాహిత్యముతో మనువాడు

పైమెరుగుల కోర్వగలేడు
పైరవీల ఖండిస్తాడు
పరిజనముల రుజవర్తనలను
ప్రాణముగా ప్రేమిస్తాడు

పొరపొచ్చము సైపగలేడు
కరుణార్ద్ర హృదయముల రేడు
పౌరులను తన వారలను
వొకే తీరు జూచెడివాడు

అరుబడి సంవత్సరముల ఈ
పరువము మరియొక పరువమ్మును
జరపింపగ మా "కాళన్న"కు
హరి ఆశీస్సుల నిడుగాత

# క రినా / రుణా త్ముడు కాళోజీ

సురమౌళి

ఈనాటి వ్యవస్థలో లౌక్యాలన్నీ అలవరచుకుని బ్రతుకుతున్న అనేకమంది సన్నిహితులకు కాళోజీ చాలా కఠినాత్ముడుగానే కనిపిస్తాడు

ఉదాహరణకు రన్నింగ్ బస్సులో ఎక్కామనుకోండి, లేదా బస్సు ఫుట్‌బోర్డుమీద వేళాడుతూ ప్రయాణం చేశామనుకోండి, లేదా బస్సు బాగా ఖాళీగావుంటే 'నో స్మోకింగ్ బోర్డు కెదురుగా కూచుని దండిగా పొగాదమ్ము లాగేస్తున్నామనుకోండి సభలో ముందువరుసలోనో, మరే వరుసలోనో కూచుని, ప్రసంగించే వ్యక్తి ప్రసంగాన్ని వినడానికి బదులుగా పరస్పరం ఏవో ముచ్చటలు పెట్టుకొంటున్నామనుకోండి, ఇలాంటి స్వల్పమైన లోపాల దగ్గరనుంచీ, ఇంకెలాంటి లోపాలనైనా ఆయన ఇతరులు చేస్తేనే కాదు, తనవాళ్ళు చేసినా సహించడు

దేశమంతా అవినీతిమయమై పోయింది, దాన్ని ఎదురొడ్డి పోరాడండి అని గొంతెత్తి సందేశం ఇచ్చే కవితాసంకలనాన్ని, లేదా మరే రకమైన పుస్తకాన్నయినా న్యూస్‌ప్రింట్ కాగితంమీద అచ్చువేసినా ఆయన సహించడు సర్దుకొనిపోయే గుణం బొత్తిగా లేనందువల్ల ఆత్మీయులకూ, సన్నిహితులకూ కాళోజీ చాలా కఠినాత్ముడుగా కనిపిస్తాడు

ఈనాడు ఎక్కడి బీరకాయ పీచు సంబంధాన్నో పురస్కరించుకొని అధికార పదవుల్లో ఉన్న వారి నుండి ప్రయోజనాలు పొందడానికి అనేకమంది ప్రయత్నిస్తూ వుంటే ఈయన కనీసం రావలసిన హక్కునే అయినా, మైత్రీ ప్రభావం లేదా మరేదైనా అతిస్వల్పమైన వంకరదారిగుండా రాబట్టుకోవటానికి ప్రయత్నించడు సరికదా, ఈ విషయంలో అత్యంత ఆత్మీయులకు సైతం సహకరించడు అందుకే అప్పుడప్పుడు ఆయనతో సన్నిహితపరిచయం వున్న ఆత్మీయులకు సైతం అనిపిస్తుంది ఈయన ఎంత కఠినాత్ముడని? లేకపోతే, అరె, ఒక్కమారు ఒక్క ఫోన్‌కాల్ చేస్తే సరిపోతుంది - ఎవడెవడో సహాయం చేస్తామంటారుగాని ఇంత ప్రతిష్ఠ ప్రభావం ఉన్న ఈ కాళోజీ బొత్తిగా కరగడేమని అనిపిస్తుంది కాళోజీ క్లాసుమేట్లు ఆయనచేత ఏకవచన ప్రయోగం చేయించుకొని నొచ్చుకోనివారు అనేకమంది అనేక ఉన్నత పదవులను అధిష్ఠించారు, మంత్రులైనారు, ఉన్నతాధికార పదవులను వెలిగించినారు, దిగిపోయినారు ఎక్కడా కూడా ఎవరికీ ఆయన, తనకోసం గానీ తన మిత్రులకోసం గానీ చెయ్యిచాపిన సందర్భాలు లేవు

రూల్ ఆఫ్ లా అంటే ఆయనకెంత పట్టింపంటే 'క్యూ'లో నిలబడకుండా టిక్కెటు కొనడం దగ్గర్నుంచీ కోర్టు ఆవరణలోనుంచి అడ్డదారిని (థరోఫేర్ కాని దారిన) నడవడం కూడా ఆయనెప్పుడూ చెయ్యలేదు (హనుమకొండలో ఆయన ఇంటి సమీపంలోనే కోర్టు భవనాలున్నాయి చాలామంది ఆ ఆవరణలోంచి ఉన్న అడ్డదారిని నడుస్తూ ఉంటారు, ఆయనతప్ప)

ఈయనలో ఇంత కారిన్యం ఎందుకున్నది? అని మనం కొంచెం పరిశీలిస్తే అనంతకరుణారసమే ఈ కారిన్యానికి మూలం అని తేలుతుంది దేశంలో కొనసాగుతున్న అక్రమాలకూ, బాధలకూ, అన్యాయాలకూ కారణం వీటిలో మనిషి ఏదో ఒక స్థాయిలో అల్పంగానో అధికంగానో రాజీపడటమేనని ఆయన విశ్వాసం పరోక్షంగాగానీ, ప్రత్యక్షంగాగానీ, అల్పస్థాయిలోగానీ అత్యల్పస్థాయిలోగానీ అన్యాయంతో రాజీపడకపోవడమే కాళోజీ వ్యక్తిత్వం

వయస్సు పెరిగితే, తాకులుతింటే, జీవిత భారం బాగా నెత్తినపడితే ఈ పవిత్ర సిద్ధాంతాలు చెప్పే వారనేకమంది ఏ కొంతైనా లౌక్యంనేర్చుకొని, ఏకొంతైనా

అన్యాయంతో రాజీపడక పోతారా? అని సమాజం ఛాలెంజిచేస్తూ వుంటుంది 60 సంవత్సరాలు నిండిన కాళోజీలో ఈ కాఠిన్యం మరింత పెరిగిందే కాని, మరింత రాటుదేలిందేగాని ఏ మాత్రం మొక్కవోలేదు రామేశ్వరరావుగారి వంటి అన్న దొరికాడు కనుక అన్నీ ఆయనకు సాగుతున్నాయని కొందరు సన్నిహితులు అనడం ఆయన అన్నను కీర్తించడానికేనో, కాళోజీ 'కఠినాత్మత' లోని ఘనతను తగ్గించడానికేనో తెలియదు అవును రామేశ్వరరావు వంటి అన్నలు అందరికీ దొరకరు కాని కాళోజీవలె సాగేవారెంత మంది ఆయనలా కఠినంగా ఉన్నారు?

కరుణ కాళోజీకి మారుపేరు అన్యాయం జరిగితే సహించడు ఎక్కడ జరిగినా సహించడు, ఎంత స్వల్పంగా జరిగినా సహించడు ఆవేదన పడతాడు ఆక్రోశిస్తాడు అన్యాయానికి ఎదురు తిరుగుతాడు తిరుగుమని బోధిస్తాడు తిరిగేట్టు చేస్తాడు

ఆయన కవిత్వానికి లక్ష్యం, ప్రేరణా, జీవం అన్నీ అన్యాయంపట్ల ఆయనకున్న కఠినాత్మతా, అన్యాయం అనుభవించే వారిపట్ల ఆయనకున్న కరుణాత్మతలే

కాళోజీలో ఇప్పటికీ అంటే ఈ వయస్సులో గూడా మొక్కవోకుండావున్న ధైర్యసాహసాలను పరిశీలిస్తే ఆశ్చర్యం వేస్తుంది పరిణామాల తీవ్రత తెలియని కుర్రకారు యువకులు ఆవేశంలో సాహసోపేత కార్యాలకు ఉరకడంలోకన్నా అన్నీ తెలిసి, చేసే సాహసానికి రాగల పరిణామాల తీవ్రత తెలిసి సాహసించడం ఘనత ఈ అమోఘ సాహసం వరంగల్ పురవీధుల్లో అరబ్బు గుండాల విచ్చుకత్తి వీరవిహారంనాటి నుండి నేటివరకూ మొక్కవోకుండా ఉండటం విశేషం

పోలీసు కాల్పుల మధ్య తిరుగుతాడు 'జై తెలంగాణా' అని నినదిస్తాడు "దోపిడిచేసే ప్రాంతేతరులను తరుముతాం, ప్రాంతంవాడే మోసంచేస్తే పాతరవేస్తాం" అంటాడు

ఆయన కోపానికీ, ఉద్రేకానికీ కారణం అన్యాయంపట్ల అసహనమూ బాధితులపట్ల కరుణేనని తెలిసిన ఏ ప్రాంతం వాడైనా అతనిని ప్రేమిస్తారు పూజిస్తారు భయపడతారు తమ లోపాలను, లొసుగులనూ బలహీనతలనూ కప్పిపుచ్చుకోవడానికి అందమైన తర్కాలల్లి సిద్ధాంతాలు చేయడం మరెక్కడైనా సాధ్యమేనేమోకాని ఆయనముందు అసంభవం

చేతికి మంచి పుస్తకం దొరికితే చదవకుండా ఉండరు చాలా చదివారాయన చదివిన ప్రతిదాన్నీ పూర్తిగా జీర్ణం చేసుకున్నారు 'కొటేషన్లు అప్పగించడానికి ఆయన చదివినదిలేదు చదివినవాటిలో నుండి కొటేషన్లు వల్లె వేయడం ఆయన కలవాటులేదు

కాళోజీకి వ్యక్తిగతమైన బలహీనతలు ఏమున్నా ఉన్నాయా? అని పరిశీలించి, వాటిని సాధనాలుగా చేసుకొని ఆయనపై విజయం సాధించడానికి ప్రయత్నించడం వృథా

తృప్తిగా తింటారు వుంటే ఉపవాసాలు చేయవలసివస్తే పశ్చాత్తాపంలేదు నిండుగా నిద్రపోతారు, నిద్ర మానుకొనవలసివస్తే విసుక్కోరు ఎండలో బయటికి వెళ్ళరు మామూలుగా కాని అత్యవసరమనిపిస్తే ఈ వయస్సులో కూడా నడిఝామున మండుటెండలో కాలినడకన అడవుల్లో పయనించడానికి వెనుకాడరు

కొంచెం నర్దుబాటు, మరికొంచెం చూచీ చూడనట్లుపోయే గుణం వుంటే కాళోజీ ఎంత గొప్పవాడు ఈనాటి రాజ్యాంగంలో గొప్ప స్థానాలను అందుకునే వాడో ననిపిస్తుందిగాని అలా అనిపించడం మన బలహీనతే, అలా జరిగివుంటే కాళోజీ కాళోజీకాక మరేదో అయ్యేవాడు

కఠినాత్ముడైన కాళోజీ కరుణను పంచి ఇచ్చినట్లుగానే తాను పొందిన అపూర్వమైన అన్నగారి ప్రేమ'ను 'కాళన్న'గా ఎంతమందికి రుచి చూపించాడో!

ఏ నిర్వచనానికీ, పరిధికీ, గిరికీ లొంగని మనిషి కాళోజీ! ఆయన సోషలిస్టా? కాంగ్రెసా? నాస్తికుడా? నక్సలైటా? గాంధేయుడా? అనే ప్రశ్నలు అప్రస్తుతాలు

# స్వేచ్ఛాజీవి కాళోజీ

- వెల్దుర్తి మాణిక్యరావు

ఆ మాటకొస్తె, ఆనాటిపిల్ల కాళోజీని కళకళలాడే కవిగా ప్రకాశించే ప్రజాకవిగా చేసింది ఆయన అన్న రామేశ్వరరావుగారే నిజంగా ఆ మహానుభావుని ఆలన లాలన, పాలనా పోషణా లేకుంటే ఈనాటి కాళోజీ ఏ బడిపంతులుగానో ఏ ఆఫీసులో క్లర్కుగానో కాకపోతే ఏ నల్ల జుబ్బా వేసకొని వాదిస్తూ పొట్టపోసుకునే వకీలుగానో కె నారాయణరావు (కె అంటే కాళోజీ) గా ఎక్కడో అనామకుడుగా ఉండిపోయేవాడు పితృవర్గమంతా శత్రుత్వం మాతృవర్గమంతా మిత్రత్వం సాధిస్తుందంటారు అదిలోకమర్యాద ఉన్నది పంచుకోవటం సంక్రమించినదాన్ని అక్రమించుకోవటమే భ్రాతృమర్యాద సోదరత్వము 'భాయి చారా అనేది అందరాని ఆదర్శంలాగానే కనబడుతుంది ఒక 'దాశరధుల'లో తప్ప రామాయణంలోని రావణ విభీషణులు, వాలి సుగ్రీవులు వైరులేగదా! ఇష్టమొచ్చినచోటికి పోవుట, పొద్దుపోయి ఇంటికి వచ్చుట అనుచరవర్గంతో ఇంట్లో గంటల కొద్ది చర్చాగోష్ఠులు జరువుట, మిత్రబృందానికి టీ ఫలహారాలతో సత్కరించుట నిత్యవిధి తెనుగు ఉర్దు, హిందీ మరాఠీ, ఇంగ్లీషు వార, మాసపత్రికలు కొనటం చదవటం, ఇదీ నిత్యవిధే ఇంతేగాదు సభలు సమావేశాలలో పాల్గొనటానికి గ్రామాంతరాలకు గూడా వెళ్ళటం పరిపాటి మొదటే, తాను ఫలానారోజు ఫలానాచోటికి పోతన్నానని, తిరిగి రావటానికి ఇన్నాళ్ళు పట్టుతుందని, అందుకు సుమారింత ఖర్చవుతుందని మొదలే అన్నగారికి చెప్పితే వీలునుబట్టి వారు ఖర్చులు అందిస్తూ పోవాలె కాని అట్లా అంతా 'పకడ్‌బందీ'గా నడుచుకుంటే మరి స్వేచ్ఛకు స్వాతంత్ర్యానికి అర్థమేమి? అనుకునే వాడేమొ! మరి, అడిగి, అజ్ఞపొంది పోవటం, వాయిదా ప్రకారం తిరిగి రావడం అంటే భయభీతులతో మెలిగితే ఆత్మాభిమానానికి ప్రతీక ఎట్లుకాగలిగేవాడు ఇంతకు తాను తప్పుడు పనిచేస్తేగా భయం ఎక్కడికి ఎప్పుడు ఎంత ఎందుకు, ఇదేమి అదేమి అనే శబ్దాలు రామేశ్వరరావుగారి నిఘంటువులో కనబడవు అందుకే తన తమ్ముని అట్లా ప్రశ్నించేవాడుకాదు ఈలాంటి ప్రశ్నలకు ఉత్తరం ఇయ్యలేక ఉత్తర కుమారు"డయి పోతాడేమో నని బెంగ తాను ఉత్తరకుమారుని అన్నకాదలచుకోలేదు అందుకే రామేశ్వరరావు అడిగేవాడు గాడు నారాయణరావు చెప్పేవాడుకాదు మన కాలికి తట్టుతాకితె 'అన్నా అంటాము అంటే మనకు ఎక్కడ ఏ బాధకలిగినా అదుకునేవాడు 'అన్న' వున్నాడనేగదా ఈ ఆర్తనాదానికి అర్థం నాకు తెలిసినంతలో ఈ ఆర్తనాదానికి గురుత్వం తెచ్చినవాడు రామేశ్వరరావే తత్ఫలితంగా ఎదురులేని నారాయణరావు యజ్ఞం చేయక ఏంచేస్తాడు? చేసినాడు స్వాతంత్ర్య యజ్ఞం అందులో తన సమయాన్ని సౌఖ్యాన్ని ఆరోగ్యాన్ని తన తెలివి తేటలను - అన్నింటిని ఒక్కటొకటే సమిధగా యజ్ఞగుండంలో వేస్తూపోయినాడు మతసాంప్రదాయాన్నిబట్టి వారు అద్వైతు లవునో కాదో (బహుశ స్మార్తబ్రాహ్మణులే కావచ్చు) కాని ఆచరణలో మాత్రం సోదరులిద్దరు అక్షరాలా అద్వైతులు

1934-36లో కాళోజీ 'వకాలత్' చదువటానికి హైదరాబాదు వచ్చినాడు వెంకటరాజన్న అవధానిగూడా అందుకే వచ్చినాడు నాకూ బుద్ధిపుట్టింది గంటి లక్ష్మీనారాయణ గంటుపడ్డాడు నలుగురం రోజూ కలిసేది చేతుల్లో ఖానూన్' పుస్తకాలున్నా, మాట్లాడేది లోకాభిరామాయణం "వైతాళిక సంఘం' అని ఓదాన్ని స్థాపించినాము 'కాళోజీ, వెల్దుర్తి, అవధాని అని ముగ్గురం కలిసి కథలు రాసేది ఈ పద్ధతి నాటికి నేటికి సరికొత్తదనే చెప్పాలి అప్పటి నుంచి రచనా వ్యాసంగంలో కాళోజీకి అభిరుచి కలిగిందంటే అతిశయోక్తి

తెలంగాణ గడ్డ గర్వించదగ్గ బిడ్డ
కాళన్న మాకిదే మా నివాళి

**Sri. Nagi Reddy**
Secretary

**Mandala Sahakara Jr. College**
**&**
**Sai Vikas Degree College**

Kodad, Nalgonda District, Ph 253923

మానవతావాది, మహోన్నతుడు
కాళన్న మీకివే మా జోహార్లు

**Jagruthi Degree & PG College**

Kachiguda, Hyderabad

# తెలంగాణ గోరుకొయ్య

- అంబటి సురేంద్ర రాజు

"ఏడు రంగుల ఇంద్ర ధనుస్సు
మూడు కోట్ల మంది తొలి ఉషస్సు"

అంటూ ప్రసిద్ధ గాయని విమల కాళోజీ మీద పాడిన పాట కాళోజీని ప్రత్యూషవేళ నింగిన పొడిచే గోరు కొయ్యను కొక్కొరొకో అని మేలుకొలిపే తొలికోడిని మన కళ్ళ ముందు నిలుపుతుంది కాలజ్ఞాని కావడం మూలంగానే కాళోజీ తెలంగాణ రాష్ట్రం విశాలాంధ్రలో కలవకూడదని ఎలుగెత్తి చాటింపు వేశారు బలవంతంగా కలిసిన తరువాత విడిపోవాలని 'యిడుపు కాయితాలు' సిద్ధం చేశారు తెలంగాణ అంతకు మునుపు మాదిరే స్వతంత్ర రాష్ట్రంగా మనుగడ సాగించాలని మొట్టమొదట లోకానికి చెప్పిన ఖ్యాతి ఒక్క కాళోజీకే దక్కుతుంది 1952లో ఉధృతంగా రేగిన 'గైర్ ముల్కీ గోబ్యాక్' ఉద్యమం కాళోజీని జాగృతం చేసింది

'విశాలాంధ్ర'లో ప్రజారాజ్యం ఏర్పడాలని పుచ్చలపల్లి సుందరయ్య పథకం రచిస్తే దాశరథి శ్రీశ్రీలతో కలిసి వరంగల్ ఆజాం నర్సింగం తోటలో శ్రీశ్రీతో చేయి చేయి కలిపి విశాలాంధ్ర తీర్మానం చేసి, శ్రీశ్రీ పరిభాషలో 'రాళ్లు విసురుతున్న అఖిలాంధ్ర కవి'గా పేరొంది, అంతలోనే జ్ఞానోదయమై విశాలాంధ్ర బద్ధ విరోధిగా ఒంటిగా నిలిచిన ఖ్యాతి కూడా ఒక్క కాళోజీకే దక్కింది 1952వ సంవత్సరం కాళోజీ ప్రాపంచిక దృక్పథాన్ని అవిధంగా మౌలికంగా మార్చివేసింది ఆంధ్రోద్యమం వలన నాటుకొన్న అఖిలాంధ్ర భావనను పరిమార్చింది కోదాటి నారాయణరావు వంటి ఎందరో తన సమకాలికులు సన్నిహిత మిత్రులు, సహచరులు, ఆంధ్రోద్యమం మత్తులోనుంచి బయటపడకుండానే కన్ను మూస్తే కాళోజీ మాత్రం యాభై ఏండ్ల నాడే తెలంగాణ అస్తిత్వ సమస్యను మనసు మీదికి తీసుకొన్నారు తాత్విక, సామాజిక రాజకీయ స్పష్టతో వున్నందునే కాళోజీ తెలంగాణ మనిషి ఉనికిని కాపాడే అన్ని అంశాలను, ముఖ్యంగా భాషను సంస్కృతిని, జీవన విధానాన్ని తన కవిత్వం నిండా చాటుతూ వచ్చారు స్వతంత్ర దేశంలో తెలంగాణ అంతర్గత వలస మూలంగా పారతంత్ర్యంలో మగ్గిపోవడం ఆయనను కలచి వేసింది అతి సున్నిత మనస్కుడు అయిన కాళోజి తెలంగాణకు అన్ని రంగాలలో అను నిత్యం జరుగుతున్న అన్యాయాలను చూసి చలించి పోయారు వేరు తెలంగాణ సాధనకు కట్టుబడి తన వంతు కర్తవ్యాన్ని సదా నిర్వహిస్తూ వచ్చారు 1969 నాటి ప్రత్యేక తెలంగాణ విద్యార్థి ఉద్యమంలో అత్యంత క్రియాశీల పాత్ర పోషించారు తెలంగాణ రాష్ట్రాన్ని మనందరి కన్నా ముందే కలగన్న కాళోజీని మన మధ్య పెట్టుకుని కూడా మనం ఆయన నడిచిన తోవలో నడవక తెలంగాణకు మరింత కీడు చేసే రాజకీయ కార్య కలాపాలలో ఇంతకాలం మునిగిపోయాం తుదకు ఆయనే గెలిచారు ఆయన చూపిన బాటలోకి ఆలస్యంగానైనా మళ్ళాం తెలంగాణ సాధనకు కార్యరంగం కట్టుదిట్టంగా సృష్టించుకున్నాం మన కోసం కాళోజీ కన్న కలను నిజం చేసుకునేందుకు కృత నిశ్చయంతో మునుముందుకు సాగుతున్నాం ఇగ తెలంగాణ సాధనోద్యమం ఆగదు మన గమ్యాన్ని చేరుకొనే దిశగా మన అడుగులు పడుతున్నాయి కనుక ఈ రోజు కాకపోతే రేపైన మనం తెలంగాణ సాధించి తీరుతాం కాళోజీ ఇచ్చిన భరోసాతోనే ఈ కార్యభారాన్ని మనం మోయగలుగుతున్నాం

కాళోజీ పౌరహక్కుల కోసం ఎమర్జెన్సీకీ ముందు నుంచి సాగిస్తున్న పోరాటంలో కూడా తెలంగాణదే అగ్రస్థానం ఆ నాటి ఇందిరా గాంధీ, జలగం వెంగళరావుల అత్యాచారాల నుంచి మొదలు పెడితే ఈనాటి చంద్రబాబు నాయుడు సాగిస్తున్న అణచివేత దాకా కాళోజీ చూపు ఆనని సందర్భం లేదు కాళోజీ కార్యక్షేత్రానికి కేంద్రబిందువు వరంగల్ కావడాన తెలంగాణ ఆసాంతం ఆయన నుంచి వెలుతురు ప్రసరించింది వ్యక్తిగా సర్వ స్వతంత్రునిగా వ్యవహరించిన కాళోజీ ప్రజాస్వామ్యానికి పునాది రాయి అయిన స్వేచ్ఛకు ఎనలేని ప్రాధాన్యం ఇచ్చారు మనిషి నిత్య జీవితంలో స్వేచ్ఛగా చరించడానికి అవసరమైన పరిస్థితులు ఏర్పడేందుకు ఆయన అహరహం కృషి చేశారు స్వేచ్ఛకు ప్రాతిపదిక సౌభ్రాతృత్వంలో ఆయనకు కనిపించింది సమానత్వం సమీప భవిష్యత్తులో సమకూరేది కాదు కనుక ముందు సోదరభావం బలపడితే అప్పుడు స్వేచ్ఛకు అస్కారం

ఏర్పడుతుందని ఆయన ఆశించారు అయితే సౌభ్రాతృత్వాన్ని దర్శించడంలో ఆయన కొన్ని పరిమితులకు లోనయ్యారు వర్ణవ్యవస్థ పునాదిగా పూరించ వీలుకాని సామాజిక అగాధాలకు అలవాలంగా వున్న మన సమాజంలో హక్కులు కొంత మందికే ఎందుకు వుంటున్నాయో ఆయన అంతగా పట్టించుకోలేదు చట్టం ముందు అందరూ సమానులైనప్పుడే పౌర సమాజానికి ప్రాతిపదిక ఏర్పడుతుంది మన దేశంలో దాదాపు ఎనభై శాతం మంది ఈనాటికీ పౌరసత్వం నోచుకోలేదు పౌరుల హోదా వారికి లేకపోవడానికి తద్వారా హక్కులు వారికి కొరవడటానికి, పౌరహక్కులు అలావుంచి మానవ హక్కులు సైతం వారికి మృగ్యం కావడానికి గల సామాజిక కారణాల మీద ఆయన దృష్టి పెట్టినట్టు కనిపించదు హక్కులను కేవలం రాజ్యాంగ పరిధిలో చూసి ప్రభుత్వం జవాబుదారీగా వ్యవహరిస్తే చట్టం సవ్యంగా తన పని నిర్వర్తిస్తే హక్కులు సిద్ధిస్తాయనే స్థూల దృష్టి ఈ విషయంలో ఆయన ఆచరణకు అనివార్యంగా కొన్ని పరిమితులను విధించింది వర్ణ వ్యవస్థను సృష్టించిన మను ధర్మం గీచిన రేఖకు లోబడే మన రాజ్యాంగం ఈనాటికీ పనిచేస్తున్నదనే వాస్తవిక సామాజిక దృష్టి రాష్ట్రంలో దాదాపు గత ముప్పై ఏండ్లుగా పనిచేస్తున్న పౌరహక్కుల ఉద్యమానికి లోపించినట్లే కాళోజీకి కూడా లోపించింది ఈ ఒక్క విషయంలో అధునికత' తాలూకు భావజాలంలో కాళోజీ తనకు తెలియకుండానే చిక్కుకొని ఆచరణలో నిర్దిష్టతను కోల్పోయారు అయినా కాళోజీ వయసులో సగం కూడా లేని వారు, పౌర హక్కులకు సంబంధించి కాళోజీ కన్నా లోతైన జ్ఞానం అనుభవం వున్నవారే ఒక వైపు 'అధునికత' అనే పెనుజాడ్యానికి (వలసవాదం పోతూపోతూ మిగిల్చి పోయిన అవశేషం ఇది) లోనై హక్కుల ఉద్యమాన్ని ప్రధాన స్రవంతి కి పరిమితం చేసి యథాతథ వాదాన్ని నిరందిగా పెంచి పోషిస్తుంటే, మనం మారాలని అనుక్షణం రంధి పడుతూ బతికిన కాళోజీని అనవలసిన అవసరం ఏముంది!

ఈ మధ్య కాళోజీ పోయిన తరువాత ఆయన మీద ఒక మేధావి రాసిన వ్యాసంలో కాళోజీకి జాన్ స్టూవర్ట్ మిల్ అనే ఉదారవాద రాజకీయ తత్వవేత్తకు పోలిక తెచ్చారు ఈ మిల్ మహాశయుడు ఆనాటి బ్రిటిష్ వలసాధిపతులకు దళారీగా వ్యవహరించాడనేది జగద్విదితం అయినా మన మేధావి రచయిత ఎందుకో ఆ మాట మరిచాడు మరచి కాళోజీ స్ఫూర్తికి అపచారం తలపెట్టాడు బ్రిటిష్ ప్రభువుల తరఫున ఆనాటి ఇక్కడి గవర్నర్ జనరల్స్ చేపట్టే కార్యక్రమాలకు మద్దతు కూడగట్టేందుకు తన పలుకుబడిని ఉపయోగించిన ఘనుడి భావాలతో కాళోజీ భావధారను పోల్చడం మామూలు తప్పు కాదు కాళోజీ వంటి సుసంపన్నమైన భావ/రాగ జలధిని తప్పుడు అంచనాలతో కలుషితం చేసే ఇటువంటి శుష్క పండితుల నుంచి రక్షించుకోవాల్సిన బాధ్యత మన మీద వుంది

రాజకీయ సాహిత్య రంగాలలోనే కాదు నిత్య జీవితంలో కూడా యజమాని–బానిస సంబంధాలను తన ఆచరణతో రద్దు చేసిన ఘనాపాటి కాళోజీ అయన అటు నాయకుని పాత్ర, ఇటు అనుచరుని పాత్ర పోషించడానికి నిరాకరించారు గురు శిష్య సంబందాన్ని కూడా ఆయన తోసిపుచ్చారు ఇద్దరు మనుషుల మధ్య సమానత్వం ప్రాతిపదికగా విలసిల్లే స్నేహ బంధానికి మాత్రమే ఆయన ఆమోద ముద్ర వేశారు చరిత్రలో ఇప్పటి దాకా మనుషులు ఈ రెండు అమానవీయ పాత్రలనే పోషిస్తూ వచ్చారు కానీ కాళోజీ న్యూనతకు గురి చేసే ఈ సంబంధాన్ని, పాత్రపోషణను అధిగమించేందుకు శత విధాల యత్నించారు అసలు సిసలైన ప్రజాస్వామిక సిద్ధాంతాన్ని ఆచరణలో నిగ్గు దేల్చారు కవిత్వంలోనే కాదు నిజ జీవితంలో కూడా కాళోజీది దేశీ సంప్రదాయం అది పాల్కురికి సోమన బమ్మెర పోతన సురవరం ప్రతాపరెడ్డి మార్గం కాళోజీ నడిచిన ఈ బాటలో మనం నడిచినప్పుడే కాళోజీ జీవితానికి, స్ఫూర్తికి సార్థకత సిద్ధిస్తుంది మనం కోరుకొంటున్న తెలంగాణ సిద్ధించాలన్నా ఇదే బాట పట్టాలి మరో మార్గం లేదు రేపటి తెలంగాణకు తోవ చూపిన క్రాంతదర్శి కాళోజీ అజరుడు అమరుడు

*(గోల్కొండ ఖిల్లా – డిసెంబర్ 2002)*

# స్వతంత్ర పోరాట 'డైనమో' కాళోజి

- వి హెచ్ దేశాయి

"గుల్బర్గా క్యాంప్ జైలులో కాళోజీతో కలిసి నేను ఐదు నెలలు వున్నాను నేను హైదారాబాద్ సెంట్రల్ జైలు నుంచి అక్కడికి పోయే వరకు కాళోజీ ప్రభ అప్పటికే జైలులో ఒక వెలుగు వెలుగుతుంది తొలిచూపులోనే మేము ఒకరి నొకరం ఇష్టపడ్డాం నేను హైదరాబాద్ జైలులో మాదిరే అక్కడా తెచ్చిన డెమోక్రాట్ అంగ్ల లికిత పత్రికకు కాళోజీ తన వంతు సాయం చేసేవాడు ఇంగ్లీష్‌లో ఆయనది అందె వేసిన చేయి కాళోజీకి తనమీద తనకు పట్టరాని ప్రేమ తనను ఎంత ఇదిగా ప్రేమించుకుంటాడో ఇతరులను కూడా అంతే ఇదిగా ప్రేమిస్తాడు కాళోజీ పసివాడి ప్రవర్తన తల్లి హృదయం - ఇవీ కాళోజీని మనకు పట్టిస్తాయి కాళోజీ పేలడానికి సిద్ధంగా ఉన్న డైనమో కూడా

అప్పట్లో నిజాం జన్మదినం వచ్చింది జన్మదిన వేడుకల్లో భాగంగా రాజకీయ ఖైదీలకు స్వీట్ ప్యాకెట్స్ పంపి ంచారు నిజాం అణచివేత నుంచి స్వేచ్ఛ కోసం పోరా డుతున్న వారికి స్వీట్స్ పంపి అవమానిస్తారా? అని కస్సునలేచాడు కాళోజీ తోకతొక్కిన తాచయ్యాడు పధకం ప్రకారం చేసిన ఈ 'దుశ్చర్య'ను ఖండించదానికి అందరం ఒకటికావాలని నాకు చెప్పాడు - సరేనన్నాను - మిఠాయి డబ్బాలు వాపస్ ఇవ్వడమే కాదు, జైలర్‌కు మానిరసన తెలియ జేయాలని నిర్ణయించుకున్నాం అలాగే చేశాం మొత్తం ఎనమ ందుగురం మేమిచ్చిన షాక్ ట్రీట్ మెంట్‌కు జైలర్ నోరు తెరిచి చూస్తుండిపోయాడు ఆ రోజు నుంచి జైల్లో అధికా రులు మళ్లీ మా జోలికి రాలేదు

(షష్ఠి పూర్తి సంచిక నుండి

# కాళన్న ఆరోగ్య రహస్యం

- డా వి ఎస్ రెడ్డి

తెలంగాణలో తాతల ఆరోగ్యాన్ని చూడండి, మనవడు, మునిమనవళ్ళ ఆరోగ్యం చూదండి ఈ వ్యత్యాస రహస్యాన్ని గమనిస్తాం నా కంటే మా తండ్రి బలవంతుడు నా తండ్రి కంటే మా తాత బలవంతుడు వాళ్ళకంటే వాళ్ళపై వాళ్ళు బలవంతులు నాకంటే నా కొడుకు బలహీనుడు నా కొడుక్కంటే నా మనవడు ఎట్లుంటడో ఈ ఆధునిక సమాజీనికే వదిలేద్దాం

పూర్వం అన్నం లేక, అర్థికంగా లేక వైద్యం లేక, చదువు లేక కరువులో బ్రతికే వాళ్ళు రోటికాడి మిరం తిని శక్తిమంతులైయుండి, అన్ని, ఉన్న (ఆర్థిక, విద్య వైజ్ఞాన గ్లోబ) మనం మన రాబోవు తరం ఎందుకు బలహీనమైంది? ప్రాంతం వానికి ప్రాంతేతరమైన అలవాట్లే కారణమని భావిం చాల్సి వస్తుంది గ్లోబలైజేషన్‌లో భాగంగానే ప్రపంచీ కరణ పేరుతో మానవుల్లో ఏ మార్పు వస్తుందో ఒక ఉదాహరణతో పోల్చుకోవచ్చు

తెలంగాణ కోడికి, రాయలసీమ కోడికి, ఆంధ్ర కోడికి చాలా వ్యత్యాసం ఉంటది ప్రపంచంలో ఉన్న కోళ్ళు, వ్యక్తులు ఒకే రకంగా ఉండరు ప్రాంతాల వారిగా, కులాల వారిగా, మతాల వారిగా, దేశాల వారిగా వేరు వేరుగా ఉంటారు విద్యాపరంగా ఆర్థిక పరంగా ఆరోగ్యపరంగా వ్యత్యాసం కనిపిస్తుంది

ప్రపంచీకరణలో ప్రపంచవ్యాప్తంగా ఒకే రకం కోళ్ళు (తెల్లకోళ్ళు) ఒకే రకమైన రోగాలు ఒకే రకమైన వైద్యం జరుగుతున్నది తెలంగాణ భాష, తెలంగాన యాస, తెలంగాణ ఆరోగ్యం తెలంగాణ వైద్యం, తెలంగాణ జీవన విధానం, తెలంగాణ విద్య తెలంగాణ ఆర్థిక వనరులు ప్రపం చీకరణ పేరుతో ఎంత పతనమవుతున్నాయో మనం ఆలోచించుకోవాలి

గట్క, గంజి అంబలి తాగిన ముసలోడు ఇప్పటికీ ఆరోగ్యవంతుడే అన్ని పోషక విలువలున్నవని చెప్తున్న హార్లిక్స్, బూస్ట్, కాంప్లాన్ సెరిలాక్ తీసుకున్న మనం ఇప్పటకీ అనారో గ్యులం చింతకాయ తొక్కు, పజ్జొన్న గట్క, ఉగ్గు, పచ్చిపు

లును, రోటికాడి మిరం ఎట్లా తెలంగాణను కాపాడగల్గిందో, దాన్లో ఉన్న రహస్యం ఏమిటో మనం ఆలోచించాలి దానికి నిలువెత్తు సాక్ష్యం మన కాళోజీ

తొమ్మిది పదుల జీవితాన్ని చూసిన మన కాళన్న ఒక్క ఊపిరితిత్తితో 60 ఏండ్లు గడిపిండు రెండు ఊపిరి తిత్తులున్న ప్రజలు తెలంగాణ దుమ్ము (డస్ట్ అలర్జీ) అంటు oద్రు తెలంగాణకు ఉన్నది మరి దుమ్మేగదా!

పద్దెనిమిదేండ్ల పోరడు మోకాళ్ళ నొప్పులని సుఖ ప్రయాణం కోరుకుంటుండు మన కాళన్న సచ్చేంత వర కూ్కడా ఒకన్ని పట్టుకోనిచ్చేవాడుగాదు ఎన్నడు గూడ నొప్పి గోలీ ఎస్కోలేదు ఇంటికోసారి వచ్చినప్పుడు లడ్డూ, మిరాయి తిన్న కాళన్నను చూసి ఈ వయసులో కూడా చక్కెర బీమారి లేని వారున్నారా అనిపించింది పొద్దుగూకి అన్నం తినేట ప్పుడు సల్లలఉప్పు ఏస్కుంటుంటే ఇంకా బిపి రాలేదా అనుకున్న

పొద్దుగుంజాముల నొప్పి గోలేమన్న అడుగుతడో అనుకున్న కాని అడగలే పొద్దుగూకినంక నిద్ర గోలన్న అడుగుతదేమో అనుకున్న కని అడగలే అది తెలంగాణ ఆరోగ్యం ఇదంతా ఎక్కడకు పోయింది ఈ ఆరోగ్య విధానం ఎక్కడకు పోయింది ఎందుకు ఆగమైంది? చక్కెర గోలీ, ఉప్పుగోలీ నొప్పిగోలీ, నిద్రగోలీ లేని తెలంగాణ ఎటు పోయింది?

## అక్షయం కాళోజీ జీవితం

*- రాజ్ బహదూర్ గౌర్*

పేదవాడి పెను శాపంగా పేరుబడ్డ క్షయవ్యాధి కాళోజీకి మంచివయసులో వున్నప్పుడు వచ్చింది వ్యాధి నయం కావాలంటే ఖరీదైన మందులు పోషకాహారం, శుభ్రమైన గాలి పూర్తి విశ్రాంతి తప్పనిసరని డాక్టర్లు సూచిం చారు కాళోజీ పేదవాడు జేబులో పైసల్లేవు పైగా పేదోళ్లకు బక్కచిక్కినోళ్లకు దగ్గరి మిత్రుడు అందుకే మందులు కొనలేదు మింగలేదు మంచితిండి దొరలకే తప్ప మామూలు మనుషు లకెక్కడిది రికామిగా విశ్రాంతి తీసుకోవాలన్నా తాత తండ్రులు ఆర్జించిన ఆస్తులుండాలి ఇవేవీలేని కాళోజీకి మంచి మందులు మంచి తిండి రోజంతా విశ్రాంతి ఎట్లా సాధ్యం? ఇక మిగిలింది శుభ్రమైన గాలి కాళోజీ భాషలో అది స్వేచ్ఛా వాయువు వాయు భక్షణకు ఆరు బయలుకు బయల్దేరాడు ఇల్లొదిలిపెట్టాడు గాలి కోసం గాలించడం మొదలు పెట్టాడు శుభ్రమైన మంచి గాలి కోసం (స్వేచ్ఛను ప్రసాదించే వాయువుల కోసం) జీవిత పర్యంతం నిరంతరా యంగా చేసిన ప్రయత్నమే కాళోజీని సజీవంగా వుంచింది ఆ విధంగా 'క్షయ' వ్యాధి చివరికి ఆయన చేతిలో ఓడిపో యింది ఆయన గెలిచాడు స్వేచ్ఛ కోసం చేసిన సంచారం విశ్వప్రయత్నమే కాళోజీని అమురుడుని చేసింది

*(1974 కాళోజీ షష్ఠి పూర్తి సంచిక నుండి)*

## ఆయన తెలంగాణకే కాదు తెలుగు జాతికంతకూ గౌరవనీయుడే!!

*- ఎ. జయప్రభ*

మా మొదటి పరిచయం 1986లో 'నా యుద్ధోన్ముఖంగా' ఆవిష్కరణ సభకి ఆయన అధ్యక్షుడిగా వచ్చినప్పటి నుంచీ!! అనాటి సభకి ఆవిష్కారం కోసం రావలసి వున్న కందాళ సుబ్రహ్మణ్య తిలక్‌గారు రాలేకపోయి నందువల్ల అధ్యక్షునిగా వచ్చిన కాళోజీ పుస్తక ఆవిష్కరణ కూడా చేశారు! నేను యుద్ధోన్ముఖంగా కదలటం ఆయనకి నచ్చింది! ఆ తర్వాత నా 'చూపులు' పద్యం ఆయన ప్రత్యేకంగా నేనెప్పుడు తటస్థపడినా జ్ఞాపకం చేసుకుంటూ ఉండేవారు! ప్రతీవాళ్ళనీ గుర్తు పెట్టుకుని పేరుపేరునా పలకరించడం ఆయన నైజం!!

నిజానికి మొదట్నుంచీ కాళోజీ కవిత్వం కాదు నన్ను ఆకట్టుకున్నది! అంతకన్నా మహోన్నతంగా -

నిక్కచ్చితనం పారదర్శకతా కలిగిన ఆయన వ్యక్తిత్వం నన్నెంతగానో ఆకట్టుకుంది!

మా భావాలలోని స్వభావాలలోని సారూప్యం కారణంగానే నాకు కాళోజీ అంటే చాలా ఇష్టం కలిగిందే! గౌరవంతో కూడిన ఒక ఇష్టం అది!

అవతలి వ్యక్తిలో చాలా విశిష్టత గోచరించనిదే ఒక పట్టాన నా మనసులోకి తీసుకోలేని స్వభావం నాది! కాళోజీలాగా నిర్భయంగా నమ్మినదారిలో కడదాకా నడవగల్గిన వారు ప్రపంచంలో ఎప్పుడూ తక్కువగానే కన్పిస్తారు! ఎవరి మనసులోనైనా కాళోజీని గురించిన జ్ఞాపకం ప్రత్యేకంగా ముద్రపడుతుందని నేననుకుంటాను!! 'ఇదీ నా గొడవ' అంటూ ఆయన చెప్పుకొచ్చిన జీవితం అనన్య సాధ్యం!!

ప్రత్యేకమైన తోవలో నడిచిన మనుష్యుల కథల పట్ల మక్కువ ఎక్కువ నాకు! ఐనాగానీ గాంధీ ఆత్మకథ ఎందుకనో నన్ను అంతగా కదిలించలేదు అహింసనే పరమ ధర్మంగా ఎంచిన ఆయన ఉపవాసాలతో తనని తాను హింసించుకోవడం ఏం సబబు అన్న ప్రశ్న నా చిన్న తనం లోనే నన్ను వేధించింది!

తెలుగు సాహిత్యానికి సంబంధించి నాకు శ్రీశ్రీ కవిత్వం అంటే చాలా ఇష్టం కానీ ఎందుకో శ్రీశ్రీ అనంతం మీద మాత్రం నాకు ఆసక్తి కలగనే లేదు ఆయన కవిత్వానికీ జీవితానికి పొసిగినట్టు నా కన్పించ లేదు!!

వ్యక్తుల నమ్మకాలకీ వారి జీవితాలకి అంత వార కన్పించని పుస్తకాలు తెలుగు సాహిత్యంలో - ఉప్పల లక్ష్మణరావుగారి "బతుకుపుస్తకం" తిరుమల రామచంద్రగారి 'హంపీనించి హరప్పాదాకా", కాళోజీ "ఇదీ నా గొడవ"!!

ఈ మూడు పుస్తకాలు నాకు నచ్చుడం అంటే ఇలా అలా కాదు నన్నెవరైనా తెలుగుదేశాన మార్గదర్శకంగా ఉండేందుకని పిల్లల కోసం మీరే పుస్తకాలని చదివేందుకు సూచిస్తారని అడిగితే తడుముకోకుండా నేను ఈ మూడు పుస్తకాల పేర్లు చెబుతాను

గమ్మత్తేమంటే ఈ ముగ్గురూ ఆంధ్ర ప్రదేశంలో తమ భాషాధిక్యతని బహిరంగా అన్నిచోట్లా ప్రదర్శిస్తూ వచ్చిన - కాళోజీ మాటల్లో చెప్పాలంటే - "ఆ రెండు జిల్లాల" వాళ్ళూ కానే కారు ఉప్పల లక్ష్మణ రావుగారు మా ఉత్తరాంధ్ర ప్రాంతంవారు తిరుమల రామచంద్రగారు రాయలసీమ నించి బయలుదేరిన వారు! కాళోజీది సరే ఓరుగల్లు!!

పలుకుబళ్ళు మాండలికాల యాసతో కూడిన భాషలో ఉన్న బలాన్ని గుర్తించి వాటిని వాడగల్గిన వాళ్ళే ఎప్పుడేనా మంచి రచనలు చేయుగలరు జీవద్భాష దొరికేది ఇళ్ళలోని ఆడవాళ్ళ దగ్గిరా పొలంలోని కూలివాళ్ళ దగ్గిరానూ!! భాషా వ్యవహారానికి సంబంధించి కాళోజీ మతం నాకు సమ్మతం!!

కాళోజీ తన గురించీ సమాజంలోని తనకి తారసపడిన వివిధ విషయాల మీద తనకి కల్గిన భావాల గురించీ నా గొడవ పుస్తకాల్లో కవితలుగా రాసారు "స్వగతం, అహం బ్రహ్మోస్మి కలం కత్తి నా ఇజం లాంటివి ఆయన తన గురించి చెబితే కోకిలా సరస్వతీ భక్తుల్లారా , వ్యావహారికం, ఆంధ్రుడా, మహేంద్రంలో మహాకవులు, ఓ రాజా, కర్షకా, మనిషి' లాంటి ఖండికలలో ఆయన అభిప్రాయాలు గురించి చెప్పారు!! అని బాగుంటాయి!

ఆయన రాసిన వాటిల్లో నాకు నచ్చిన చిన్న పద్యం "జంట సింగిణులు" ఇలా ఉంటుంది! "దానిమ్మ గింజలో దాగిన మెరుపు లేత అరిటాకు పై పూతల నునుపు కొత్త మఖరులు లోని మెత్తందనాలు కన్న తల్లి పాలు కమ్మందనాలు గోదుగ్ధ ధారల గోర్వెచ్చ దనము ద్రాక్ష ఫలములలోన ద్రవియించు తీపి, పువ్వు పొదుగుల్లోన పొంగేటి తేనె ముసిముసి నవ్వుల కుసుమముల సొంపు అందచందాలొల్కు ఆనంద ఝురులు చంటిపాప పెదవి జంట సింగిణులలో అన్ని చేరి ఆటలాడుతున్నాయి "

ఎవరితోనైనా మాట్లాడి వెనక్కి మళ్ళినప్పుడు మన మనసులో ఒక సంతోషం కలగాలి అలా మనసు సంతోష పడే సందర్భాలు చాలా అరుదుగా ఎదురౌతాయి! కాళోజీతో మాట్లాడిన ఏ రోజూ నేను ఉత్సాహాన్ని నింపుకోనిదే వెనక్కి వచ్చింది లేదు! ఎప్పుడైనా నమ్మిన తోవలో ముందుకు పోతున్నప్పుడు కొన్ని సార్లు నా మనసుపట్లు సడలిన క్షణాలలో నాకు ఉత్తేజాన్ని నమ్మకాన్ని కల్గించినది కాళోజీ వ్యక్తిత్వమే!! రాజీపడకుండా బతకగలగడానికి నేను ఎప్పుడూ ఆయనని ప్రేరణగా ఎంచుకుంటాను!

ఒకసారెప్పుడో వరవరరావుతో అన్నాను చాలా రోజులౌతోంది కాళోజీని చూడాలని ఉంది వరంగల్లు వస్తాను అని! ఇంతలోనే కాళోజీనే ఎవరో ఎన్ఆర్ఐలు

అవార్డేదో ఇస్తే తీసుకొవడానికి హైదరాబాద్ వస్తున్నట్టు చెప్పాడు వరవరరావు రెండేళ్ళ కిందట అనుకుంటాను ప్రభాకర్ వాళ్ళింట్లో! ఆఖరుసారిగా నేనాయనతో చాలాసేపు మాట్లాడిన సందర్భం అదే!! నేను ఆయన దగ్గిరకి సాయంత్రం 6 30కి వెళ్ళేను ఆయన కబుర్లు చెబుతున్నారు నా చేయి పట్టుకుని మాట్లాడుతున్నారు రాత్రి పదకొండు కావొస్తోంది సుమారు ఆయన అప్పటికీ మాటలు ఆపేలా లేరు వయసు పై బడిన మనిషి పొద్దుటే సభకి వెళ్ళాలి! ఆ విషయం నేనెన్ని సార్లు గుర్తు చేసినా ఆయన పట్టించుకోవడం లేదు ఆయన కబుర్లు ఆపటమూ లేదు నా చేయిన వదిలి పెట్టటమూ లేదు నేను వెళతానని లేచినప్పుడల్లా అయనకి కోపం వచ్చేసేది! చిన్న పిల్లవాడు అలిగి మాట్లాడినట్టుగా అలిగి మాట్లాడటం దానితో నేను మళ్ళీ కూర్చోవటం ఇలా గడిచింది ఆ నలుగున్నర గంటల సేపూ!! చివరికింక ఆయన మాటల్నీ కోపాన్నీ గమనించనట్టుగా నటించి సెలవు తీసుకుని నేను బయలుదేరి వచ్చేసేను వెనక్కి ఇంటికి వస్తున్నప్పుడు తోవలో ఆయన మాట్లాడిన మాటల్నీ ఆ వయసు లో కూడా ఆయన ఆలోచనల్లో ప్రత్యక్షమయిన స్పష్టతని ఆయనలోని ఆవేశాన్నీ తలుచుకుంటూనే ఉన్నాను అది నాకు ఎప్పుడూ విభ్రమని కలిగిస్తూనే ఉంది!! ఆయన నమ్మకాలపై ఆయనకున్న అచంచల విశ్వాసాన్నీ ఆయన ఆలోచనల్లో తొణికిసలాడిన ఉగ్రతనీ చాలా ఆసక్తిగా చూసా నారోజు!! నిజానికి ఆయన మాటలన్నీ ఇదీ నా గొడవ పుస్తక ంలోని ఆ సంగతులే! అవన్నీ అప్పటికి నేను విన్నవే!! అయినా ఆశ్చర్యమేమంటే తెలిసిన విషయాలే అయినా అన్ని గంటల సేపు విన్నా నాకెక్కడా విసుగూ అలసటా కలగక పోవటం !! ఎనాడూ ఏకధాటిగా అన్నిగంటలు కూర్చుని నేను ఎవరి మాటలూ విన్నది లేదు!! ఆయనంటే నాలో ఉన్న ఇష్టమూ గౌరవమూ అంత గాఢమైనవి!!

ఇంతకీ ఆరోజు కాళోజీ నాకు చెప్పిన కబుర్లలో అయన ఆవేశంలో తెలంగాణ మీది అభిమానమే ఎక్కువగా ద్యోతకమయ్యింది! ఆయన వేసిన ప్రశ్నలన్నీ సబబైనవి ఎవరికైనా విభేదం ఉండనవసరం లేనివీనూ!!

కాళోజీ వ్యక్తిత్వం ఎవరికైనా మార్గదర్శకమైనది! ఆయన తెలంగాణకే కాదు తెలుగు జాతి కంతకూ గౌరవ నీయుడే!!

ఆయన స్మృతికి నా సన్నుతి!!

*(గోల్కొండఖిల్లా నుండి)*

## కోడిపుంజై వెలుగు జాడ పాడిన కవి

*- డా॥ బిరుదురాజు రామరాజు*

ఉత్తమ దేశభక్తులుగా దేశ విముక్తి ఉద్యమములో పాల్గొన్ని నిర్భయముగా పోరు సాగించిన కొలదిమంది సాహిత్యకులలో శ్రీ కాళోజీ నారాయణరావు అగ్రగణ్యులు మంచి జాతీయవాది ప్రాచీన ఆధునిక కవుల ప్రభావం ఏ మాత్రం లేని స్వతంత్రకవి తన మార్గముతనది, అనుకరణం సహించని సహజతావాది హైదరాబాద్ రాజ్యములో ప్రజా ప్రభుత్వము యేర్పడి నిరంకుశ నిజాము పరిపాలన అంత మొందడానికి జరిగిన జాతీయోద్యమములో అగ్రనాయక శ్రేణిలో ఒకడుగా సమరము సాగిస్తూ వెంట వెంట ప్రజా జాగృతికి తోడ్పడు రచనలు చేసినవాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్మాతలలో ఒకరు అతినిశితంగా విమర్శనాత్మకంగా వ్రాస్తాడు ఫలానా రాజకీయ పక్షమువారి చర్యలు మంచివనీ ఫలానావారిని మంచివికావనీ గుడ్డి నమ్మకాలు కలవాడు కాదు ఎక్కడ చెడువున్నా నిర్భయముగా తన కలంతో అక్కడ లంఘించి రహస్యాన్ని ఛేదించి సత్యాన్ని బహిర్గతం చేస్తాడు అతి సరళమైన భాషలో సరసములైన భావాలను ప్రకటిస్తాడు పురాతన ఛందస్సు ఈయనకు గిట్టదు ఈయన వ్రాసినవన్నీ గేయాలే జనానికి అత్యంత సుగమమైన ఉపమానాలతో తన భావాలను అభివ్యక్తీక రించటంలో ఎంతో సమర్థుడు హాస్యపు తేనె పూతతో తియ్యతియ్యగా మానవునిలోని క్షుద్రతపైన కవిత్వపు కొరడాదెబ్బలు కొడుతాడు ఈ సందర్భాన మనకు వేమన జ్ఞాపకం వస్తాడు ఉదాహరణకు ఈయన ఖండకావ్య సంపుటి తెలంగాణంలో బాగా ప్రచారం పొందిన "నా గొడవ" అనే గ్రంథంలోని ఒకటి రెండు గేయఖండాలు ఇక్కడ ఉదాహరి స్తాను మానవుడు పోటీపడి కొట్లాడుకోవటానికి ఒక నిర్ణీత స్థలమనీ, నియతమైన

సమయమనీ ఫలానా తరగతికి చెందిన మనిషనీ అక్కరలేదు పోరాటం కోడిగుడ్డు కోసం కోహినూరు వజ్రం కోసం కూడా జరుగవచ్చు అందులే భేదం ఏమీ లేదంటాడు ఈ గేయం చదువుతుంటే - ప్రత్యేకంగా ఆయన చదువగా వింటుంటే పొట్టచెక్కలయ్యే నవ్వు వస్తుంది ■ నవ్వులతో అతడు మనకు విచిత్రమైన సత్యాన్ని బోధిస్తాడు ఈ గేయము చదవండి

"చాపచింపు సామ్రాజ్యం
కోడిగ్రుడ్డు కోహినూరు
పాటిమన్ను ప్లాటీనం
బస్సుసీటు బ్రహ్మరధం
ఎదైతేం, ఏదైతేం
పోటీపడి కాటులాడ
ఏదైతేం?
అడవి మనిషి, ఆచార్యుడు
పసిబాలుడు, పండుముసలి
బిచ్చగాడు, లచ్చిమగడు
కొత్తకొడుకు, పెత్తందార్
ఎవడైతేం, ఎవడైతేం
పోటీపడి కాటులాడ
ఎవడైతేం?
తండ్రి కొడుకు, తల్లి బిడ్డ
అన్న తమ్ముడక్క చెల్లె
బావ, మరిది, భార్య, భర్త
ఇరుగు, పొరుగు ఎరగనోరు
ఎవరైతేం, ఎవరైతేం
పోటీపడి కాటులాడ
ఎవరైతేం?
విపణివీధి, తపోవనం
చాకిరేవు, శాసనసభ
మూత్రశాల, యాత్రాస్థలి
ఎచటైతేం, ఎచటైతేం
పోటీపడి కాటులాడ
ఎచటైతేం?"

సాధారణ జన గ్రహణ యోగ్యములైన వాడుక మాటలతో భాషాజ్ఞానము లేని వానికి సైతం సూటిగా అందేరీతిని కవిత అల్లగల అసాధారణ ప్రతిభ ఈయనలో వుంది నైఘంటుక శబ్దాలు ఈయనకు అనలే గిట్టవు, సాధారణ పదాలకు సరిపోని వృత్తాలను ఈయన తనవద్దకు రానీయడు గతాన్ని చూచి నిరాశ చెందుట కాని, భవిష్యత్తు అత్యంత సముజ్వలంగా వుండునని దురాశపడుటగాని ఈయన వద్దలేదు - రానున్నదంతా మంచి అని భ్రమపడ వలదని మనలను ప్రబోధిస్తాడు - వివేచనాత్మక దృష్టిని అలవరచుకోవలసినదిగా మనల కోరుతాడు

'ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి
ఎన్నుకొని తలబాదుకొన్న నేమగును"

అన్న గేయము ఈనాటి ప్రజాస్వామికాన్ని ప్రజలు యెంత జాగరూకులై ఉపయోగించుకోవాలెనో బోధిస్తుంది ఇది తెలంగాణములో బాగా ప్రజాదరణ పొందినగేయము - ఒక స్వాతంత్ర్య సమరకాలములో ఈయన రాసిన గేయాలు అమోఘములు ఈ క్రింద గేయము చదవండి, ఎంత చండ శాసనముగా తాను ప్రజావాణిని నిరంకుశులకు వినిపిస్తున్నాడో చూడండి

"ప్రజా సంస్థపై పగసాధించిన
ఫలితము తప్పక బయట పడున్
నిక్కుచు నీల్గే నిరంకుశత్వము
నిల్వ లేక నేలను కూలున్
ప్రజాశక్తిపై పందెము వేసిన
ప్రభుత్వ మేపాటిగ నిల్చున్
నివురు గప్పిన నిప్పును పూదిన
నింద వెలిగి నింగిని ముట్టున్"

ఇట్లాంటివి వందల గేయాలు కాళోజీ వ్రాసినాడు తన జీవితాన్ని దేశ స్వాతంత్ర్యోద్యమానికి అంకితం చేసిన అగ్రశ్రేణికి చెందిన ఈ దేశ భక్తుడు తెలంగాణములోని కవుల్లో ప్రథమ గణ్యుడు ఈయనను మేము ప్రప్రథమ ప్రజాకవి అంటాము, ఈ సద్గుణాలకు తోడు ఈతడు పూర్తిగా నిరాడంబరుడు దయార్ద్రహృదయుడు హృదయానికి బాధ కలిగించే ఏ సంఘటనను విన్నా చూచినా టొటటొటా కన్నీళ్ళు కార్చివేస్తాడు కరుణ రసానికి స్థాయి శోకం కదా! హృదయస్థ భావములన్నీ కన్నుల్లో ప్రతిబింబించే ఆ వ్యక్తిని తెలంగాణ ములోని అన్ని వర్గాలవారు గౌరవిస్తారు అతడొక్కడే మా దగ్గర ఉన్న అజాత శత్రువు 'నా గొడవ' అనే పేరు గల ఈయన ఖండకావ్యం అప్పుడే రెండవ ముద్రణను కూడా అందుకున్నది ఈ కావ్యాన్ని ఆలంపురం సారస్వత సభలో

శ్రీరంగం శ్రీనివాసరావుగారు ఆవిష్కరిస్తూ 'కాళోజీ నిఖిలాంధ్రకవి, ఈయనకు తెలంగాణ అంచులు గోడలుగా నిలువ జాలవు, ఈయన కావ్యం కవిగొడవే అయినప్పటికీ చదివిన వారికి తమ గొడవగానే కనుపడుతుంది ఇది విశాలజగత్తు ప్రజలందరిగొడవ' అన్నారు ఇది ముమ్మాటికి నిజం

ఇంత చిన్న వ్యాసంలో వివరంగా ఈయన కావ్యాల్లోని చమత్కారాలు చూపలేను గాని విమర్శనాత్మక దృష్టితో కవి రచనలను నిశితంగా పరిశీలించటం మట్టుకు చాలా అవసరం పాల్కురికి సోమనాధుడు కవిత్వానికి చక్కని నిర్వచనం ఇచ్చినాడు 'అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయె కాదె కవి వివేకంబు" ఇది నూటికి నూరుపాళ్ళు కాళోజీకి చెల్లును

అయితే యీయన రచనల్లోని లోపాలను క్లుప్తంగా వివరిస్తాను యీయనకు భాషా సౌందర్యంపై దృష్టి ఏ మాత్రం లేకపోవడం వల్ల శబ్దాలు చాలా సందర్భాలల్లో పేలవంగా పడతాయి కొన్ని చోట్ల ఈయన వాడిన అల్ప శబ్దాలు గురుతరభావాలను మోయలేక కూలగిలబడి పోతాయి శైలిలొతియ్యదనం వుండక వట్టి జలపాకంగా కనబడుతుంది పారకునికి కావ్య పఠనానికి ఆసక్తి కలిగించే శయ్యా పాకం వృత్తి మున్నగునవి ఈయనలో పరిపాకము నందకపోవటము ఒక పెద్ద లోపముగానే భావించాలె ఇక సంధులు సమాసాలు మున్నగునవి విరివిగా చెడిపోతవి అక్కడక్కడ ఛందోనియమము కూడా వుండదు ప్రాత ఛందస్సులు ఈయిన వ్రాయడు, వ్రాయలేడు తాను పట్టిన ఛందస్సులోనైనా అప్పుడప్పుడు తానే పెట్టుకొన్న లయవం టిది లయమయిపోతుంది ఏమైనా అత్యుదాత్త ములైన ఆలోచనలను మనకు అనాయాసముగా అందించగల మహా ప్రతిభ ఈయనలో వుండటము వల్ల భాషా విషయకములైన అంశాలు - దాశరథి ఒక చోట అన్నట్టు దీపము క్రింద నీడవలె అణగిపడి వుంటాయి పండిత ప్రకాండులు మహా కవులైనవారు ఈయన రచనలు వింటున్నప్పుడు ఈయనకు పాండిత్యమింటే ఇంకెత బాగండేదో అనుకుంటారు ఇదే ఈతనిలో ఉన్న మంచిచెడ్డ ఈ గుణానికే పామరుల పండి తులు అంతా ముగ్ధులౌలారు తెలంగాణ రచయితల సంఘ ములో ప్రముఖుడైన ఈయన మహారాష్ట్ర, కర్ణాట, హిందీ ఫారసీ, ఉరుదూ, ఇంగ్లీషు మున్నగు బహుభాషలు నెరింగిన వాడు ఈయన తెలంగాణ రచయితల కెల్లరకూ ఆదర్శమూర్తి

*(కృష్ణా పత్రిక 1954)*

# వాల్మీకి వారసుడు కాళోజీ

*- దాశరథి*

మనం జీవితంలో ఏ మేమి చూచామో జీవితంలో నుంచి ఏయే అనుభవాలు పొందామో, మనందరికీ వెంటనే ఆసక్తిని కలిగించే ఏయే విషయాలను గూర్చి ఎమని ఆలోచిం చామో వాటివల్ల ఎట్లా ప్రభావితులమైనామో అధంతా రికార్డు చేస్తే సాహిత్యం అవుతుంది శబ్దాల్లో శతాబ్దాల సహస్రాబ్దాల పొడుగు మానవ జీవితాన్ని ప్రకటించడమే స్థూలంగా సాహిత్యం

జీవితంలో ఇంత దగ్గరి సంబంధం గల సాహిత్యాన్ని జీవితపు మాలిన్యం అంటకుండా దూరంగా ఊహాలోకంలో స్నానమాడించి, పవిత్రంగా ఉంచడానికి ప్రయత్నించే సాహిత్యకారులు కొందరు అన్ని కాలాల్లో వున్నారు వారితో మనకు ప్రమేయం లేదు కాడలు, తీగ, కొమ్మలు వేళ్ల నేల - ఏమీ లేకుండానే వికసించే ఆకాశ కుసుమం వంటి సాహిత్యం మనకు ఉపాదేయం కాదు

ఉదాత్తమైన సాహిత్యం ఆధునికమని ప్రాచీనమని ఏమీ ఉండదు ఇవి కేవలం కాలాన్ని నిర్ణయించుకోదానికి ఉపయోగపడే శబ్దాలు వెనుకటి సాహిత్యాన్ని ప్రాచీనమని ఈనాటి సాహిత్యాన్ని ఆధునికమనీ అనుకోవాలి ప్రతి ఆధునికుడూ నవ్యుడు కానక్కరలేదు పురాతన రీతిలో వ్రాసే ఈనాటి రచయిత కూడా ఆధునికుడే అతడు నవ్యుడు కాకపో వచ్చును

ఒక్కొక్కని ఊహింపులో ఒక్కొరకమైన విశిష్టత వుంటుంది ఆ ఊహింపుకు శబ్దత్వం కల్పించడంలో ఒక్కొ క్కడు ఒక్కొరకమైన పనితనాన్ని చూపిస్తాడు ఆ ఊహింపులో ఆ పని తనంలో వున్న ప్రత్యేకత అతనికీ ఒక ప్రత్యేకతను చేకూర్చి పెడుతుంది

చలనశీలమైన మానవ జీవితంతో సంబంధం ఉన్న రచన గుండెల్ని కదిలిస్తుంది గుండెల్ని కదిలించే రచనకు గుండెల్ని కదిలించే ఏదో సంఘటన ఆధారశిల అవుతుంది వాల్మీకికి వ్యాధుడివలె ఏదో ఒక వస్తువు కోపకారణము అయి క్రౌంచపక్షివలె ఏదో ఒక వస్తువు కరుణ కారణమై రెంటి కలగలుపులో కావ్యం పుడుతుంది సాహిత్యం ఉద్భవిస్తుంది

తెలంగాణలో వ్యాధుడు క్రౌంచపక్షి దుష్టపరిపాలకుని రూపంలోనూ అనాధ ప్రజా రూపంలోనూ, సాహిత్యకునికి సాక్షాత్కరించినవి తరతరాలుగా మూగపడిన గొంతు విప్పి అజ్ఞాతపు వాల్మీకం విదుల్చుకుని అతడు బయటికి వచ్చినాడు

ఆయనే సురవరం ప్రతాపరెడ్డి ఆయనే కాళోజీ నారాయణరావు ప్రతాపరెడ్డి ఎక్కువగా పద్యాలు వ్రాయని గొప్ప కవి కాళోజీ ఎక్కువగా వచనం వ్రాయని గొప్ప విమర్శకుడు వీళ్ళు సృష్టించిన ప్రతి పంక్తీ బంగారం ప్రతివాక్కూ ఒక బాణం

## కాలుడు కాళోజీ

కాళన్న మాటలో కల్తీ లేదు
వేమన్న పలుకులో వెలితీ లేదు
వారిది పదాడంబర పీతాంబరాలు కట్టని కవిత,
వారు ఆరాధించింది నిజమైన జనత
చేదు నిజాలు చెప్పేవాళ్ళను మెచ్చదు లోకం
ఆది నుంచీ ఈ లోకంలో వున్నది ఇదే లోపం
కాళోజీకి వచ్చాయట అరవై యేళ్ళు
కానీ అతని మనసు వయసు కేవలం ఆరేళ్ళు
కాళోజీ గొడవ కల్లోలితమైన ప్రపంచం గొడవ
అతని కవిత చదువుతున్నాను నేను నూరో తడవ
అతడు మనస్సులో సాక్షాత్తూ పసి బాలుడు
చెడును చెండడానికి మాత్రం అతడు కాలుడు
కాళోజీ నూరేళ్ళూ వుండాలి
కమనీయ కవిత అతని కలంలో పండాలి
అతడు సర్వదా పసివాడుగా వుండాలి
అతని కవిత మన హృదయాలలో నిండాలి

*(1974 కాళోజీ షష్ఠి పూర్తి సంచిక )*

# గాంధీ రూపం, మార్క్సుతత్వం

*- ప్రొ॥ జి హరగోపాల్*

తెలుగు సమాజం ఒక సృజనాత్మక సమాజమని (Cieitive Society) మనం నిరంతరంగా జ్ఞాపకముంచుకోవాలి దీనికి కావలసిన ఆధారాలు ఎక్కడ చూసినా అక్కడ అగుపిస్తాయి భావ సంఘర్షణ భిన్న ఉద్యమాలు త్యాగాలు విశిష్టమైన ప్రయో గాలు విలక్షణమైన వ్యక్తులు బహుశా ఈ రాష్ట్రంలో ఉన్నంత మేరకు దేశంలో ఎక్కడలేరనే చెప్పవచ్చు కాళోజీ వ్యక్తిత్వాన్ని ఈ పూర్వ రంగం నుండే అర్థం చేసుకోవాలి ఆయన ఈ సమాజంలోని అన్ని ప్రయోగాల సారాన్ని ప్రతిఫలించ దమేకాక, ఆయన జీవితమే ఒక పెద్ద ప్రయోగం ఆయన ప్రాపంచిక దృక్పథం, జీవన శైలి, మానవ సంబంధాలు ఏ సిద్ధాంతంలో లేదా భావజాలాల్లో అంత సులభంగా ఇమడవు ఒకే సమయంలో ఆయన సామాజిక మార్పుకు జరుగుతున్న అన్ని ప్రయోగాల్లో అంతర్లీనంగా ఉంటూనే వాటికి బయటున్నాడు పి వి నుండీ పీపుల్స్‌వార్ దాక అభిమానాన్ని, ఆదరణను పొందిన వ్యక్తి బహుశా మరెవ్వరూ లేరేమో! పి వి నర్సింహరావును పీపుల్స్‌వార్‌ని అంత నిష్కర్షగా విమర్శించిన వ్యక్తులు కూడఅరుదే ఆయనను ఎవ్వరూ అపార్థంచేసుకోలేదు దానికి ప్రధానకారణం – ఆయన నిజాయితీగా ఆలోచించాడు నిజాయితీగా స్పందించాడు నిజాయితీగా జీవించాడు ఇంకా సమాజంలో నిజాయితికి ఇంత గౌరవముండడానికి కాళోజీ వ్యక్తిత్వం ఒక కారణమైతే రాష్ట్ర వ్యాప్తంగా జరుగుతున్న ఉద్యమాలు మరొక కారణం

కాళోజీని వ్యక్తిగా పరిశీలిస్తే పాశ్చాత్య ఉదారవాదంలోని స్వతంత్రప్రతిపత్తి గలిగిన వ్యక్తి అగుపిస్తాడు ఉదారవాదానికి ముఖ్యంగా వ్యక్తి స్వేచ్ఛకు అత్యంత ప్రాముఖ్యతనిచ్చిన j s mill విశ్లేషించిన వ్యక్తి కాళోజీలో మనకు దర్శనమిస్తాడు మిల్లన్ on liberty రచనలో ఒక వ్యక్తి మొత్తం సమాజాన్ని నియంత్రించడం ఎంత ప్రమాదమో, మొత్తం సమాజం ఒక వ్యక్తిని నియంత్రించడం అంతే

ప్రమాదం అంటాడు అంటే ఈ కొలమానం కేవలం భావ స్వేచ్ఛకేకాని వ్యక్తి ప్రవర్తనకు కాదు అనే పరిధిలోపెట్టాడు వ్యక్తికి అపరిమితభావస్వేచ్ఛ (unrestrained freedom of thought) ఉండాలనే సూత్రీకరణ చేశాడు కాని వ్యక్తికి సమిష్టికి మధ్యన ఏర్పడే వైరుధ్యానికి ఏ మార్గాన్నికాని, పరిష్కారాన్ని కాని మిల్ చూపించలేదు కాళోజీ జీవితం ఈ వైరుధ్యానికి ఎక్కడో ఒక పరిష్కారముందని సూచిస్తుంది వ్యక్తిలోన అపరిమిత భావస్వేచ్ఛను సామాజిక ప్రగతికి మార్పుకు ఉపయోగిస్తే వ్యక్తిస్వేచ్ఛకు సమిష్టి అభివృద్ధికి వైరుధ్యం ఉండదని కాళోజీ జీవిత ప్రయోగంలో మనం చూడవచ్చు

కాళోజీ ఉదారవాదికాదు నిజానికి ఆయన జీవితాన్ని అత్యంతంగా ప్రభావితం చేసింది గాంధీయిజం చాలా కాలంవరకు గాంధీని ఎవరు విమర్శించినా సహించే వాడు కాదు గాంధీ ఏమైనా కావచ్చు, మీరు గాంధీని తిరస్కరించవచ్చు కాని గాంధీ వెంట నడచిన లక్షలాది మంది జనాన్ని ఎందుకు తక్కువ అంచనావేస్తారు అని వాదించే వాడు 'అహింస హింసకంటె గొప్పది కాని హింస పరికితనం కంటే మెరుగు' అన్న గాంధీ సూత్రీకరణతో ఆయనకు సంపూర్ణ అంగీకారముండేది గాంధీ ప్రజల సమీకరణకు ఉపయోగించిన క్రియాత్మక, సృజనాత్మక పద్ధతుల మీద కాళోజీకి చాలా విశ్వాసముండేది స్వాతంత్ర్యానంతరం ఈ పద్ధతులను పూర్తిగా అపహాస్యం చేసి సవాళ్ళు కూడా రాజ్యం దిగజారి పాలన అప్రజాస్వామికంగా మారుతూ వస్తున్న తరుణంలో గాంధీ బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా అనుసరించిన పద్ధతులకు, ఎత్తుగడలకు మళ్ళీ అవసరం అవకాశం ఏర్పడింది వీటికి మించి గాంధీ ఒక అసాధారణమైన communication అని కాళోజీ చెప్పేవాడు ఒక సంక్లిష్టమైన అంశాన్ని అందరికి అర్థమయ్యేటట్లు మాట్లాడే పద్ధతి కాళోజీకి బాగా అలవడింది ఆయన 'నా గొడవకు ఎంచుకున్న రూపం అదే, ఏ పబ్లిక్ మీటింగ్‌లో మాట్లాడిన అతి సామాన్యమైన మనిషికి అర్థమ య్యేలామాట్లాడే అద్భుతమైన శక్తి, మనుషులను కదిలించే గుణం కాళోజీ ప్రసంగాల్లో ఉండేది అంతకంటే మించి గాంధీ నిరాడంబర జీవనశైలిని తన జీవితమంతా చిత్తశుద్ధి తో పాటించాడు మార్కెట్ శక్తులు వివరీతంగా జీవనశైలులను బలపత్తరంగా మారుస్తున్న కాలంలోకూడా వాటిని కాదని సౌఖ్యవంతమైన జీవితం కంటె నిరాడంబరమైన అర్థవంతమైన జీవన విధానాన్ని కాళోజీ ఎన్నుకున్నాడు ఆయనకు పద్మవిభూషన్ ఇచ్చినపుడు ఇది నాకెందుకిచ్చినట్లు అని నన్నడిగితే అది మీ జీవనశైలికి గుర్తింపు' అని నేనంటే ఆనందపడ్డాడు రూపంలో గాంధీని అనుకరించిన కాలోజీ ఆలోచనాసారం మాత్రం మార్క్సిజానికి అతి సమీపంలో ఉంది ఆయన ప్రాపంచిక దృక్పథంలో అన్యాయాన్ని ఎదిరించడమనేది కీలకఅంశం అన్యాయాన్ని ఎదిరించినవాడే తనకు ఆరాధ్యుడని తన దృక్పథానికి ఉండే తాత్వికపునాదిని సూత్రీకరించాడు ఎక్కడ అన్యాయం జరిగినా ఎవరు అన్యాయం చేసినా ఎండగట్టడం ఆయన ప్రవృత్తి భారత దేశంలో మార్క్సిజాన్ని అంత విశాలంగా నిర్వచించి అన్వయి స్తేతప్ప అశేషపేద ప్రజలని అన్ని కులాలలోని పేద వాళ్ళని రోజూ ఎన్నో రకాల అన్యాయాన్నికి గురౌతున్న స్త్రీలను, వెనకబడిన ప్రాంతప్రజలను సాంస్కృతికభాషాపర అధిపత్య రూపాలను ప్రజాస్వామీకరించడం సాధ్యం కాదు

కాళోజీ జీవన విధానం నుండి ఉద్యమాల్లో అవగాహనను మరింత విస్తరించుకోగల అవకాశం ఉంది కాళోజీ మానవీయ విలువల్లో ఇతరులను ఎంత ఘాటుగా విమర్శించేవాడో తనను తాను అలాగే విమర్శించుకునేవాడు ఈ మధ్య వరంగల్లో ఆయనను చూడడానికి వెళితే ఆరోగ్యం బాగాలేదని చెపుతూ – 'చెవులు వినిపించడంలేదని చెపితే' నీవు ఎప్పుడు ఎవడిమాట విన్నావు కనక, 'తల తిరిగినట్ల నిపిస్తుందంటే' నీకు తలతిరగనిదెప్పుడు – అంటున్నారని నవ్వుతూ చెప్పాడు బాలగోపాల్ అరెస్టు అవుతే పౌరహక్కులు సంఘం సభలో 'వాడు ఏమైనా కాళోజీనా, ఏది పడితే అది మాట్లాడడానికి, ఏది పడితే అది వ్రాయడానికి, వాడు లెక్కలు చదువుకున్నాడు కనక లెక్క ప్రకారం మాట్లాడుతాడు, అందుకేవాణ్ణి అరెస్టు చేశారు' అని ప్రశంసించాడు ఎక్కడా మనిషిలో 'అహం' కనిపించేదికాదు ఆయన అహంఅల్లా నేను పౌరుడిని, పౌరుడిగా ఏ ప్రశ్న అడిగే హక్కైనా తనకున్న దన్న 'అహం' స్పష్టంగా కనిపించేది భిన్నమైన సామాజిక శక్తులు తీర్చిదిద్దిన కాళోజీలో ప్రజాస్వామ్యానికి అర్థాన్ని, ఆచరణకు గీటురాయిని, ఉద్యమాలకు స్ఫూర్తిని చూడవచ్చు. అందుకే కాళోజీ అనే ప్రక్రియను లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఆ అనుభవం నుండి నేర్చుకోవలసిన అంశాలు చాలా ఉన్నాయి

# కాళోజి - మన కాళోజి

- చలసాని ప్రసాద్

కుండలాల పండితుడు కాదు
సాహిత్యాన్ని ఔపోసన పట్టినవాడు

కొమ్ములు తిరిగిన కవికాదు
అల్లిక వారసత్వం అందుకున్నవాడు

కమనీయ కథలు రాసినవాడు కాదు
కమ్మని కబుర్లు ఒలకబోసినవాడు

కవ్వించే నవలాకారుడు కాదు
రోమారోలాని పుక్కిటపట్టినవాడు

క్రూర కల్పిత కఠిన విమర్శకుడు కాదు
మంచి చెడ్డల మర్మజ్ఞానం ఎరిగినవాడు

భాషా శాస్త్రంలో నిష్ణాతుడు కాదు
'యాస నా శ్వాస' అన్నవాడు

'బడిపలుకులు అతని భాష కాదు
'పలుకుబడుల' భాష నాదన్నవాడు

మితవాది కాదు, మతవాదికాదు
ముందుచూపు పూరాగా ఉన్నవాడు

హింసావాదికాదు అహింసావాదికాదు
ప్రతిహింస తప్పదు తప్పులేదన్నవాడు

తీవ్రవాదికాదు ఉగ్రవాదికాదు
నక్సలైట్లకి భారతరత్న ఇవ్వాలన్నవాడు

పోలీసుల ఓటమి విప్లవకారుల విజయం తప్పదు
పోలీసు వేతనధారులు విప్లవకారులు వ్రతధారులుఅన్నవాడు

సోషలిస్టుకాదు కమ్యూనిస్టుకాదు
'అసామ్యసంఘంలో ఆర్జనయే దౌర్జన్యం అన్న
వాడు

ఆయన సమైక్యతావాది' కాదు 'ప్రాంతేతరుడు దోపిడి
చేస్తే ప్రాంతందాకా తన్ని తరముతం' అన్నవాడు

ఆయన వేర్పాటువాది కాదు 'ప్రాంతంవాడే
దోపిడి చేస్తే ప్రాణంతోనే పాతరవేస్తం'అన్నవాడు

ఆయన శ్రీశ్రీ వీరాభిమానికాదు, 'సామాన్యుని జీవితాన్ని
వర్ధించిన విస్తరిగా చూచుకోర్కె ఉన్నవాడు శ్రీశ్రీ' అన్నవాడు

ఆయన మన కాళోజి
కాళోజి మన కాళోజి!

# గొడవల గొంతు కాళోజీ

- జి బాపురెడ్డి

నరులను రక్షించుటకై
గరళమును ధరించినావు గళమున, అల శం
కరుని విధమ్మున, త్రికరణ
కరుణాగ్రహ సత్య శీలకవి, కాళోజీ!

అరవదేళ్లకుపైన ఆర్తులు వినిచిన
గొవడల గోడుల గొంతువీవు!

తాడితుల్ అన్యాయపీడితుల్ జరిపెడి
పోరాటముల జయస్ఫూర్తి వీవు

క్షుద్ర కుటిల రక్కసులు లెక్కలూడ్చిన
హక్కుల పాలిటి దిక్కు వీవు

కులమత వర్గ సంకుచిత దుర్నీతుల
డొక్క జీల్చిన జ్ఞానబుక్కు వీవు!

చాకీరేవైన శాసన సభయునైన
కాటులాడుటకేయన్న కలమునీవు

దుష్టదుర్మార్గశక్తుల దునుమగలుగు
కాళికా భద్రహస్త ఖడ్గమ్మునీవు!

నిలుపున కూలిపోయె నినునీచముగా చెరగొన్న భూత రా
జలముకుటాలు మోసముల జూదములాడిన స్వార్థదూర్త,శ
క్తులు హడలెత్తి పోయెను, హితోక్తుల సూక్తుల విప్లవాత్మకో
జ్వల భవదీయభావుక నిసర్గ పటుత్వ ప్రబోధ దాటికిన్!

కాకతీయుల ధర్మసంగ్రామదీక్ష
పోతనామాత్యు స్వాతంత్ర్య చేతనమ్ము
ఆయుధములౌ దరిద్రనారయణుడవు!
రాజ జనరాజపూజ్యు కాళోజి నీవు!

ఈ భాగ్యనగరమంతయు
నీ భావతరంగములకు నిలయమ్మే నీ
వే భాగ్యసీమ నున్నను
మా భాగ్యము నీవె తెలుగు మాతృసుపుత్రా!

## కాళోజీ మళ్ళీ పుట్టాలి...

- డా॥ మల్లెమాల

పేద ప్రజల బాధ నీదిగా భావించి
తీరు మారనట్టి పోరుసల్పి
కదనరంగ మందె తుది శ్వాస విడిచిన
ఘనత నీకె దక్కె కవివరేణ్య !!

కాలగతికి తప్ప కవియన్నవాడెప్డు
బ్రహ్మకైన శిరసు వంచరాదు!

అనేదు సూక్తికీవు అనుదిన చిహ్నమై
మెలిగినావు - నిలిచి గెలిచినావు!!

నీవు దివికెగి నావన్న నిజము తెలిసి
యెల్లవాడల జనవాణి గొల్లుమనియె!
పొగిలియేడ్చెను నిను గన్న పుడమితల్లి
బాల కాళోజి గనువు పుట్టాలి మళ్ళీ!!

## కాళన్నకు కన్నీటి నివాళి

- డా॥ ఉండేల మాలకొండారెడ్డి

1 జననమాది భువికి సర్వస్వమర్పించి
ప్రజల మేలు కొరక పరితపించి,
కాయమును త్యజించి, "కాళోజి" సత్కీర్తి
కాయుడయ్యె మృతి కణేయుడయ్యె

2 నిన్నదాక ఎన్నికన్నీళ్లు కార్చెనో
ఆర్తజనులకోస మతనికళ్లు
అట్టి కళ్లు నేడు అంధుల బ్రదుకులో
వెలుగు నింపు దీపకళికలయ్యె

3 చివరి శ్వాసవరకు జీవితమ్మునెకాదు,
దానమిచ్చినాడు తనువు కూడ
అతని తనువులో రహస్యాలు వైద్యవి
ద్యార్థులరసి, జ్ఞానమందునట్లు

4 అన్యాయపీడితులు సా
మాన్యుల పక్షాన అనికి మార్కొన్న అసా
మాన్యుండగు "కాళోజి"కి
ధన్య చరిత్రునికివే, శతాధిక వినుతుల్

5 వేమన వలె తన కవితలు
సామాన్యుల నాల్కలందు, సత్కవి బుధ హృత్
సీమల నిల్పిన "అభినవ
వేమన" కాళన్న కివియె వేయి నివాళుల్

## బతుకు కవి కాళోజి!

- వెన్నవరం ఈదారెడ్డి

పునాదిగా సాగితోంది
అనంత బతుకు వాహిని
జీవితం నశ్వరమని కొన్నాళ్ళు
ప్రపంచం మాయేయని ఇన్నాళ్ళు
జీవనం సామాజికమని ఎన్నాళ్ళో

ప్రపంచం ఆర్థికమని మూన్నాళ్ళు
సంసారం మానసికమని తాత్వికులు
ప్రపంచం పదార్థమని భౌత్వికులు
ఇలా ప్రపంచాన్ని
మనోలోకం నుంచి కొందరు

భౌతిక కోణం నుంచి మరికొందరు
దర్శించిన దార్శనికులు కొల్లలైతే
ప్రపంచాన్ని బతుకు బారల్లోంచి
దర్శించిన కవి కాళోజి ఒక్కడే!
ప్రపంచంలోనే ఒకానొక్కడు
బతకడానికి వేదం అక్కర్లేదన్నాడు
బతుకు పదంలో క్రావడెందుకన్నాడు
బతుకును వాదం బతికించదన్నాడు
బతుకును మరచిన వాదం బతకదన్నాడు
బతుకులోనే నాదం వినమన్నాడు
బతుకుతో గానాన్ని తడపమన్నాడు
బతుకు భంగిమలను నాట్యంలో చూడమాన్నడు
ప్రతి పాటకు బతుకు పల్లవిని కూర్చమన్నాడు
ప్రతి ఆటకు బతుకు గజ్జెను కట్టమన్నాడు
బతకడానికే స్వేచ్ఛను కోరాడు
బతకడంలో సమతత్వాన్ని చూడమన్నాడు
సౌభ్రాతృత్వంతో బతకడం నేర్చుకొమన్నాడు
బతకడానికే ప్రేమను పిలిచాడు
బతకడానికే ప్రేమను వలచాడు
బతుకును చదవడానికి భాషల్ని నేర్చాడు
బతకడంలోని తీపిని తెల్పడానికి
కవిత్వం చెప్పాడు, వక్తగా నిలిచాడు
బతకడం కొరకే పోరును పిలిచాడు
బతకడం నేర్పడానికే ఉద్యమాల్లో నిలిచాడు
ఉద్యమాలకు బతుకు ఉగ్గుపాలతో
ఊపిరిబోసాడు, ఊపిర్లూదాడు
వాదాలు ఎన్నైనా
వర్గాలు రెండైనా
దేశాలు ఎన్ని ఉన్నా
వేశాలు ఎన్నివేసినా
బతుకు ఒక్కటే పో అన్నాడు
బతుకు నేర్పేది మమత
బతుకు చెప్పేది మానవత
బతుకే మనిషికి ప్రాణం అన్నాడు
పిడిగుద్దులెవరికైనా
బాధ ఒక్కటే అన్నాడు
ప్రవక్తల బోధలెన్ని ఉన్నా

అందులో బతుకు బాధ వుందో చూడమన్నాడు
మానవ అనుభూతులెన్నైనా
అందులో బతుకు వొడిచిన
కన్నీళ్ళున్నాయో అడగమన్నాడు
అనుభవ వంతెనలు ఎన్నివున్నా
బతుకు ప్రవాహం నడుస్తుందో
నడుస్తూ పిలుస్తుందో గమనించమన్నాడు
ప్రజల కొరకు ప్రాణాలైనా యిస్తాం
అధికారం తప్ప అన్న నాయకులను
కన్నీళ్ళ కుళాయిలకు నీళ్ళెక్కడినుండి
వస్తాయో అడగమన్నాడు
సగటు మనిషిని బతుకు ఖానుడి
చుట్టూ వున్న జ్ఞాన కాంతిని కప్పుకొమ్మన్నాడు
బతుకును చూచిన కనులు కనులు
బతుకును వినిన వీనులు వీనులు
బతుకును చూసిన రుచులు రుచులు
బతుకును కోరిన నాసిక నాసిక
బతుకును తడిపిన తనువు తనువు
అన్నది కాళోజి బతుకు భాగవతం
బతుకును విడిచిన కవిత
సారమెరుగని అక్షరాల కూర్పు
బతుకును వీడిన విమర్శ
బట్టలూడిన తనువు
బతుకు హద్దులు తెలియని ప్రభుత
నెచ్చెలిని అలరించని పురుషుడు
బతుకు గంధమును పూసికొనని స్త్రీ
అగరొత్తుల సువాసనలతో బతుకు శవం
అన్నది కాళోజి ప్రజాపురాణం
బతుకంటె భయం లేనిది
బతుకంటె తృప్తి నిచ్చేది
బతుకంటేనే కైవల్యం
అని చెప్పిన ఆధునిక ప్రవక్త కాళోజి
బతుకు తెలిసిన కవి
బతుకును తెలిపిన కవి
బతుకు బతుకుట కొరకై
యని హోరెత్తిన జలపాతం కాళోజి
నా గొడవ చిత్రం పై

బతుకు గోడుకు రంగులద్దిన కవి
ఓరుగంటి కవితా ప్రాంగణంలో
బతుకు నెగళ్ళను ఎగేసిన కవి
బతుకు గుండెతో కవితాప్రపంచాన్ని నడిపిస్తున్న కవి
బతుకు బాధకు కన్నీళ్ళను త్రాగించిన కవి
బతికే బతుకే బతుకన్న
త్రిశరణాలను వినిపించిన అపరబోధిసత్వుడు
'నా గొడవ'లో ప్రపంచపు బాధను
బతుకు గాధను బోధను
ప్రవచించిన బతుకు కవి కాళోజీ!
అందుకే బతికే కవి కాళోజీ!!!

## మహాభినిష్క్రమణం

- నోద్ది రాజు వెంకట రామారావు

ఒక మహావృక్షం నేలకొరిగిన దృశ్యం
ఓ మహోదధి ఇగిరిపోయిన దృశ్యం
ఇప్పుడు
అక్కడ
నిరంతరం వినిపించే
సాగర ఘోష
నిశ్శబ్ద గగనమైపోయింది
ఒక దయార్ద్ర హృదయాన్ని ఆవిష్కరించడానికి
ఇప్పుడు
ఎన్ని కోట్ల దు ఖాన్ని దహనం చేయాలి?
తల్లడిల్లే
తెలంగాణా గుండె గాయానికి
ఎవరు అక్షర వైద్యం చేయాలి?
గడియ గడియకి
'గొడవ' పడే
అశ్రునిధి
ఎవరి హక్కుల కోసం
ఎగిరిపోయింది?
ఒక బడుగు వాడి జీవ గడియారం
ఒక ఓరుగల్లు సాహితీ ముఖద్వారం
ఒక ఉద్యమాల అరుణదీపం
ఇప్పుడు
మహాభినిష్క్రమణం చేసి
మహోజ్జ్వల చారిత్రక అవశేషమైనది

## "కాళోజి"

- దుగ్గిరాల సోమేశ్వరరావు

స్వాభిమానమున్న స్వామీజి! కాళోజీ!
పేద ప్రగతి గోరు పెద్ద మనిషి
అక్రమాల నెదిరి విక్రమార్కుని వోలె
పోరు సల్పినట్టి ధీరుడతడు!

చిన్న పెద్దవారి, భిన్న రీతులవారి
ఉన్న లేనివారి నొక్క రీతి
చేరదీసి హితవు చెప్పెడి కాళోజి
సామ్యవాది! అతని సాటి ఎవరు?

పీడిత వర్గాల గోడును వినిపించు
కవితలు వ్రాసిన కవివరుండు
చిరుచిరు మాటల చురకత్తులను దూసి
ఉద్రేకులను జేయు ఉరుము మెరుపు
సమసమాజ స్పృహ చాటించి పాటించి
గణుతికెక్కిన తెలంగాణ బిడ్డ

ఆప్యాయముగ పిల్చి ఆహ్లాదముగ నవ్వి
అనురాగమును పంచు అమృత మూర్తి
'పద్మవిభూషణ' పట్టాకు విలువను
చేకూర్చి పెట్టిన సిద్ధయోగి

ప్రజల గుండెల నెలవుండి ప్రభుత్వంపైన
దాడి చేసిన 'కాళోజి'! ధరణి వీడి
దివిజ ప్రభువరు గుండియల్ దిగ్గురనగ
అరిగె 'శ్రీనాధు' కైవడి అమరపురికి

# కాళోజి అంతిమయాత్ర - హైదరాబాద్

నవంబర్ 13 14 తేదీలలో నిమ్స్ నుండి ఖైరతాబాద్ - అక్కడి నుండి గన్‌పార్క్ వరకు సాగిన యాత్ర

గన్‌పార్క్ నుండి వరంగల్‌కు
నవంబర్ 14వ తేది
ఉదయం 10 గం॥లకు

# కాళోజి సంస్మరణ సబ

డిసెంబర్ 1న, తెలుగు విశ్వవిద్యాలయ ఆడిటోరియం  నాంపల్లి, హైదరాబాద్‌లో పాల్గొన్న అభిమానులు

# 88వ జన్మదినోత్సవం - 'నా గొడవ'

సమగ్ర కవితా సంకలనం ఆవిష్కరణోత్సవం - సెప్టెంబర్ 16, 2001, ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియం, హైదరాబాద్

# కాళోజి కుటుంబ సభ్యులతో

కాళోజీ నాన్న రంగారావుగారు (1912)

మేనమామ పండిత్ నర్దేవ్ శాస్త్రితో అన్నదమ్ములు 1940

అన్నదమ్ములు - కాళోజీ చెల్లెలు కమలపాగె

పెళ్ళిఫొటో (1940) కాళోజీ రుక్మిణీబాయి

ముదిమిలో అన్నదమ్ములు

1992లో పద్మవిభూషణ అవార్డు స్వీకరిస్తూ రాష్ట్రపతి డా॥ ఆర్ వెంట్రామిన్‌తో

సెప్టెంబర్ 9 2002 – వరంగల్

సెప్టెంబర్ 9 2002 – వరంగల్

లోకసత్త సభ్యులతో

అక్టోబర్ 2002లో కృష్ణదేవరాయ భాషా నిలయం సన్మానం

1989 మా తెలంగాణా పత్రిక ఆవిష్కరణ సందర్భంగా

# కాళోజి స్మృతిలో సమావేశం

## "కాళోజి యాదిలో " సంచిక ఆవిష్కరణ

డిసెంబర్ 22, సుందరయ్య విజ్ఞాన కేంద్రం బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్

